# పిల్లలకే నా హృదయం అంకితం

తల్లిదండ్రులకీ,
ఉపాధ్యాయులకీ
ఉద్దేశించిన పుస్తకం.

ఆంగ్లమూలం : వి.ఎ. సుహొమ్లీన్‌స్కీ
తెలుగు సేత : ఆర్వీయార్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**To Children I Give My Heart by *V.A. Sukhomlinsky***
**From English to Telugu Translation by *R. Venkateswara Rao***

ప్రచురణ నెం. : 2350/28R

ప్రతులు : 1000

వి.పి.హెచ్ మొదటి ముద్రణ : ఆగస్టు, 2004

**వి.పి.హెచ్. ద్వితీయ ముద్రణ : మార్చి, 2005**



**వెల: రూ.100-00**

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: ***Saraswathi Offset Printers,*** Nallakunta, Hyd.

# విషయసూచిక

# ప్రచురణకర్తల మాట

వి.ఎ. సుహొమ్లీన్స్కీ (1918-1970) జీవించింది తక్కువ కాలమే. అయినా తన జీవితంలో ముప్పై అయిదు సంవత్సరాలు ఆయన పిల్లలని తీర్చిదిద్దడానికే అంకితం చేశాడు. మహా నగరాలకి యెంతో దూరంలో వున్న ఉక్రేయిన్ గ్రామం పవ్లీష్. అక్కడ ఆయన ఒక పాఠశాల డైరెక్టర్‌గా యిరవై తొమ్మిదేళ్లు పనిచేశాడు.

విద్యాబోధనలో ఆయన చేసిన కృషికి సోవియట్ యూనియన్‌లో యిచ్చే అత్యున్నత బహుమతులైన "సోషలిస్టు శ్రమవీరుడు," "ఉక్రేనియన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ ఉత్తమ ఉపాధ్యాయుడు" అనేవి ఆయనకు వచ్చాయి. ఆయన సోవియట్ యూనియన్ బోధనాశాస్త్ర అకాడెమీకి కరస్పాండింగ్ సభ్యుడుగా యెన్నికయాడు.

బోధకునిగా వి. ఎ. సుహొమ్లీన్స్కీ కృషిలోని నిగ్గు యేమిటి?

పెంపకాన్నీ, బోధననీ ఒకే విద్యాక్రమంలో మిళితం చెయ్యాలని అభ్యుదయ బోధకులు చాలా కాలంగా ప్రయత్నించారు. ఆ కల సుహొమ్లీన్స్కీ బోధనా కృషిలో నిజమైంది. ప్రతి పిల్లవాడిలోనూ ప్రత్యేక వ్యక్తిని దర్శించడం అనేది ఆయన బోధనా పద్ధతిలోని నిగ్గు. పిల్లల్ని పెంచి విద్యాబుద్ధులు నేర్పాలని ఆశించే ప్రతివాళ్లకీ యిది అవసరమైన గుణం.

పిల్లల్ని తెలివైనవాళ్లు, మందకొడిగా వుండేవాళ్లు అనే విభజన యేమీ చెయ్యక్కర్లేకుండానే మామూలుగా ఆరోగ్యంగా వుండే పిల్లవాడి కెవడికేనాగానీ యీనాటి సెకండరీ విద్య బోధించవచ్చని సుహొమ్లీన్స్కీ సిద్ధాంత రీత్యా, ఆచరణరీత్యా రుజువుచేశాడు. యిది కొత్తగా కనిపెట్టిన సంగతి కాకపోవచ్చును. కాని ప్రభుత్వ బోధనా కార్యక్రమానికి అనుకూలంగా వుంటూ పిల్లవాణ్ణి జ్ఞానమార్గంలో నడిపించేందుకు ఉపాధ్యాయునికి ఉపకరించే యుక్తివంతమైన పద్ధతిని ఆయన చూపించాడు. పిల్లవాడిలో నేర్చుకోవాలనే కోరికని జాగృతం చెయ్యడం, స్వయం బోధనకి అభిరుచిని పెంపొందించడం, క్రమశిక్షణని పెంపొందించడం అనేవి సుహొమ్లీన్స్కీకి ప్రధానమైనవి.

తన తోటి ఉపాధ్యాయులనీ, తల్లిదండ్రులనీ సంప్రదిస్తూ, తన ఆలోచనలని గత కాలపు మహాదేశికుల ఆలోచనలతోనూ, జానపద యుక్తితోనూ సరిచూసుకుంటూ, తన విద్యార్థులను అధ్యయనం చేశాడు.

పిల్లలకి బోధించాలంటే, మీరు వాళ్లంటే యిష్టపడాలి. అప్పుడు మాత్రమే పిల్లల్లో శ్రమ సంతోషాన్నీ, స్నేహపూరిత భావాన్నీ, మానవత్వాన్నీ తీర్చిదిద్దగలం. ఉపాధ్యాయుడు ప్రతి పిల్లవాడి హృదయాన్నీ అన్వేషించాలి. అప్పుడు మాత్రమే పిల్లలు తమ కుటుంబాలనీ, పాఠశాలనీ, పనినీ, జ్ఞానాన్నీ, తమ మాతృదేశాన్నీ ప్రేమించేటట్టు వాళ్లకి నేర్పగలడు. పిల్లవాడి హృదయాన్ని చూరగొనడమనే యీ పద్ధతే సుహొమ్లీన్స్కీ విద్యాబోధనలో చేసిన కృషికి పునాది.

తన విద్యార్థుల సహజ శక్తిసామర్థ్యాలని పెంపొందించడానికీ, వాళ్ల నైతిక గుణాలని మలచడానికి, కమ్యూనిస్టు ఆదర్శాలకోసం అంకితమైన నిజాయితీపరులుగా తీర్చిదిద్దడానికీ, ఒక్క మాటలో, వాళ్లల్లోని మంచిని పెంచడానికీ చేసే కృషే సోవియట్ ఉపాధ్యాయుడి ధ్యేయమని ఆయన భావించాడు.

మంచికోసం, సత్యంకోసం, అందంకోసం, సుసంస్కృత అనుభూతుల ఆలోచనలకోసం విద్యాబోధన వుండాలి అనేది సుహొమ్లీన్స్కీ విధానం. ఒకడు వ్యక్తిగా, పౌరుడిగా రూపొందేటట్టు చెయ్యడమే అది.

తన జీవితపు ఆఖరి యిరవై సంవత్సరాల్లోనూ సుహొమ్లీన్స్కీ తన పరిశీలనలనీ, ఆలోచనలనీ నోట్‌చేసుకుంటూ వుండేవాడు. వాటిని తను రాసిన చాలా గ్రంథాలలో, వ్యాసాలలో ఉపయోగించుకున్నాడు. వాటిల్లో ప్రముఖమైనవి "పిల్లలకే నా హృదయం అంకితం," "పౌరుడి ఆవిర్భావం" "పవ్లీష్‌లోని సెకండరీ పాఠశాల," "సమష్టి యొక్క వివేకవంతమైన శక్తి" అనేవి. యీ మహా బోధకుని పుష్కలమైన అనుభవపు ఫలితం అవి. తన రచనలు "మకరెంకొ ప్రభావ ఫలితాలని" సుహొమ్లీన్స్కీ స్వయంగా అనేవాడు. ప్రసిద్ధ సోవియట్ బోధకుడు ఎ. ఎస్. మకరెంకొ (1888-1939) బోధనానుభవమూ, జీవిత కృషీ చాలా విలువైనవని సుహొమ్లీన్స్కీ భావించాడు.

వ్యక్తిపట్ల విశ్వాసమూ, గాఢమైన గౌరవమూ అనేవి మకారెంకొ విద్యా పద్ధతిలో మూల స్థానంలో వున్న అంశాలు. 1920వ దశకంలో ఆయన పిల్లల పని శిబిరాన్ని నడిపాడు. సోవియట్ రిపబ్లిక్‌కి ఆ రోజులు చాలా గడ్డువి. ఆ రోజుల్లో చాలామంది పిల్లలకి తల్లిదండ్రులు పోయారు, కుటుంబాలు పోయాయి, యిళ్లు పోయాయి. ఆ అనాథబాలలకి దుఃఖోపశమనం చెయ్యడానికి వాళ్లని ఆర్ద్రతతోనూ, శ్రద్ధతోనూ చూడ్డమూ, వాళ్లకి నూతన కుటుంబం యివ్వడమూ చాలా ముఖ్యం. మకారెంకొ అధీనంలో వున్న పిల్లలకి సమష్టి సరిగ్గా అలాంటి కుటుంబమే అయింది. ఆ పిల్లలని తీర్చిదిద్దడానికీ, పాతుకుపోయిన చెడు అలవాట్లని మార్చడానికీ నూతన పద్ధతులు అవసరమయ్యాయి. ఆ పద్ధతులను మకరెంకొ అద్భుతంగా తయారుచేశాడు. సుహొమ్లీన్స్కీ దర్శించినట్టు మకారెంకొ పద్ధతిలోని ప్రధానమైన అంశాలు యేమిటంటే, "నిరంతరంగా, అక్షయంగా వుండే మానవత్వపు పల్లవి," "మానవ ఆకాంక్షల సమ్మోహక సౌందర్యం."

ఉపాధ్యాయుడికీ విద్యార్థికీ వుండే సంబంధం, మంచితనపు వాతావరణం మకరెంకొ సృష్టించినవి. సరిగ్గా వాటినే సుహొమ్లీన్‌స్కీ అధిపతిగా వున్న పవ్లీష్‌లోని స్కూల్ సంపాదించ ప్రయత్నించింది. యీ ఉపాధ్యాయులిద్దరూ ప్రపంచంపట్ల పౌర దర్శనంతోటీ, వ్యక్తి తన దేశానికీ ప్రజలకీ అంకితమైన సేవలో తన సౌందర్యాన్ని దర్శించడంతోటీ విద్యని మిళితం చేశారు. పిల్లలకి వూరికే మంచీ చెడూ గురించిన అవగాహన యివ్వడంకంటే కూడా యెలా జీవించాలో నేర్పడం, సాంఘిక దురన్యాయం, దురన్యాయంపట్ల విద్వేషం నేర్పడం చాలా ముఖ్యమని వాళ్లు భావించారు.

సుహొమ్లీన్‌స్కీ బోధనా వారసత్వం వీటిమీద ఆధారపడుతుంది. మకరెంకొ సూత్రాల కనుకూలంగా ఆయన తన బోధనాత్మక పద్ధతిని యెంచుకున్నాడు. మకరెంకో ప్రకారం విడివిడిగా యే పద్ధతివల్ల అయినా అనుకూలమైన ఫలితాలేనా రావచ్చు, వ్యతిరేక ఫలితాలేనా రావచ్చు. సమరూపంగా వ్యవస్థీకరించిన మొత్తం విధానం అనేది ముఖ్యం.

మకరెంకొ పేరుమీద ప్రాచుర్యం పొందిన సమష్టి బోధనా సిద్ధాంతం సుహొమ్లీన్‌స్కీ బోధనాత్మక ఆచరణలో రుజువైంది. యీ ఆధునిక ప్రపంచంలో పిల్లల్ని సమష్టికి బయట పెంచడమూ, వాళ్లకి బోధించడమూ అసాధ్యం. సమష్టి బోధన మాత్రమే పిల్లలకి ఇతరులతో కలిసిమెలిసి వుండే ఆనందమూ, తమ శక్తిసామర్థ్యాలని వెల్లడించే అవకాశమూ యిస్తుంది.

విద్యాబోధనా శాస్త్రం యీనాడు అభివృద్ధి చెందడంవల్ల పాఠశాలలు పెరగడంవల్ల, అందరు అభ్యుదయకాముక బోధకుల ఆవిష్కరణలనీ, విజయాలనీ విధిగా ఆకళింపు చేసుకునే అవసరమూ, వాళ్ల వారసత్వం స్వీకరించే అవసరమూ పెరిగాయి. విద్యాబోధనాత్మక సంబంధమైనవన్నీకూడా ఉన్నత నైతిక విలువలూ, పౌరధర్మం వుండే నూతనతరాన్ని తీర్చిదిద్దే లక్ష్యం వున్న యేకైక పునాదిమీదా, కృషిమీదా ఆధారపడి వుంటాయి.

సుహొమ్లీన్‌స్కీకి చనిపోయేనాటికి పెద్ద వయసు లేదు. ఆయన యాభై రెండవ యేట మరణించాడు. అది యుద్ధ ఫలితం.

ఫాసిస్టు జర్మనీకి వ్యతిరేకంగా మహా దేశభక్తియుత యుద్ధం (1941-45) మొదలైనప్పుడు సుహొమ్లీన్‌స్కీకి యిరవై మూడేళ్లు. అప్పుడే పొల్తావా టీచర్ శిక్షణా ఇన్‌స్టిట్యూట్‌నుంచి విద్య పూర్తిచేసి వచ్చిన సుహొమ్లీన్‌స్కీ సైన్యంలో చేరాడు. ఆయన భార్య వేరా నాజీ ఆక్రమిత పవ్లీష్‌లో వుండి గెరిల్లాలకు సహాయం చేసేది. అలాంటి సహాయం చేసినందుకు ఆమెని నాజీలు పట్టుకున్నారు. ఫాసిస్టు ఖైదులో బందీని చేశారు. అక్కడ ఆమెకి ఒక కొడుకు పుట్టాడు. గెరిల్లా దళపు నాయకుల పేర్లు చెప్పమని ఆ వీరవనితని ఫాసిస్టులు చిత్రహింసలు పెట్టారు. కాని ఆమె చెప్పలేదు.

కొన్ని రోజుల వయసే వున్న ఆమె పసిబిడ్డని వాళ్లు ఆమె కళ్ల ముందే చంపేశారు. వేరాని కూడా ఉరితీసేశారు...

ఆ సమయంలో సుహొమ్లీన్స్కీ మాస్కో సమీపంలో దురాక్రమణదారులకి వ్యతిరేకంగా పోరాడుతున్నాడు. తీవ్రంగా గాయపడ్డ ఆయన్ని యుద్ధ రంగంనుంచి తీసుకుపోయారు. ఆనాటినుంచీ ప్రాణాంతకమైన చేతి బాంబురవ్వలు ఆయన ఛాతిలో వుండిపోయి, మరణించిన తన వాళ్లపట్ల అనురాగంతో నిండిపోయిన ఆ హృదయాన్ని దుర్భరవేదనతో కలిచివేస్తూ బాధించాయి.

1970 సెప్టెంబరు 2న ఆయన మరణించాడు. కడపటి క్షణందాకా సుహొమ్లీన్స్కీ పిల్లలకే తన జీవితం ధారపోశాడు.

సంవత్సరాలు గడిచిపోయాయి. దేశానికి తగిలిన యుద్ధపు గాయాలు మానాయి. చరిత్ర పుస్తకాల్లోనుంచి మాత్రమే యుద్ధాన్ని గురించి తెలుసుకునే తరంవాళ్లు పుట్టారు. తమకి బోధిస్తూ, పొలాల్లోకీ అడవుల్లోకీ తమని తీసుకెడుతున్న వ్యక్తి హృదయంలో యుద్ధపు గాయాలు యింకా సలుపుతూనే వున్నాయని పవ్లీష్ స్కూల్లోని పిల్లలకి తెలియదు.

వైద్యానికి ఆయన్ని నయం చేసే శక్తిలేకపోయింది. స్కూలు ప్రారంభ సమయంలో నూతన తరం పిల్లలకి స్వాగతం చెబుతూ ఆఖరు సారిగా బడి తలుపులు తెరిచి, విధి నిర్వహణలోనే సుహొమ్లీన్స్కీ మరణించాడు.

సుహొమ్లీన్స్కీ బోధనా వారసత్వం, బోధకునిగా ఆయన అనుభవం సోవియట్ యూనియన్‌లోనే కాక, ప్రపంచమంతటా ఉపాధ్యాయులా, తల్లితండ్రులా దృష్టిని ఆకట్టుకుంటాయి.

# ముందుమాట

ప్రియమైన పాఠకులారా, సహోద్యోగులారా - ఉపాధ్యాయులారా, బోధకులారా, పాఠశాల అధిపతులారా!

యీ పుస్తకం ఒక పాఠశాలలో యెన్నో సంవత్సరాలు నే చేసిన కృషి ఫలితం. ఆలోచన, చింత, వ్యాకులం, ఉద్రేకాల ఫలితం ఇది. ముప్పై మూడు సంవత్సరాల నిరంతరాయ పాఠశాల ఉద్యోగం నాకు మహదానంద దాయకమైంది. నేను నా జీవితాన్ని పిల్లలకే అంకితం చేశాను. అందుకనే, యెంతో ఆలోచించిన మీదట నేనీ పుస్తకానికి "పిల్లలకే నా హృదయం అంకితం" అని పేరు పెట్టాను. అలా చేయడానికి నాకు హక్కు వుంది. అందరు ఉపాధ్యాయులకి - ప్రస్తుతం పాఠశాలల్లో పనిచేస్తూవున్న వాళ్లకీ, మా తరంవాళ్ల తర్వాత పాఠశాలల్లో పనిచెయ్యబోయే వాళ్లకీ, అందరికీ - జీవితంలో చాలా కాలం గురించి, దశాబ్దానికి సమానమైన వ్యవధి గురించి నేను చెప్పాలనుకుంటున్నా. తరచుగా బుల్లి భడవ అని ఉపాధ్యాయులమైన మనం పిలిచే ఒక పసివాడు పాఠశాలలో అడుగు పెట్టిందగ్గర్నుంచీ పెద్దవాడయి పాఠశాల అధిపతినుంచి సెకండరీ విద్య పూర్తిచేసి సర్టిఫికెట్ అందుకునే ఆ పవిత్ర క్షణందాకా, స్వతంత్ర శ్రమైక జీవితం ఆరంభించే దాకా వుండే కాలం అది. బాలబాలికలకి యిది వ్యక్తులుగా రూపుతీసుకునే కాలం, కాని ఒక ఉపాధ్యాయునికి కూడా యిది జీవితంలో బ్రహ్మాండమైన భాగం. మీ జీవితంలో ప్రధానమైనది యేమిటి? అని ఎవరేనా అడిగితే నేను ఒక్క క్షణం కూడా తడుముకోకుండా చెప్పగలను: పిల్లలపట్ల నా ప్రేమ.

ప్రియ పాఠకులారా, బహుశా మీరు నా రచనలోని కొన్ని విషయాలతో ఏకీభవించలేకపోవచ్చు; యిందులో కొంత మీకు వింతగా, ఆశ్చర్యకరంగా కనిపించవచ్చు, అంచేత ముందే నన్నో మాట చెప్పనివ్వండి: యీ పుస్తకాన్ని పిల్లలా, వయసొచ్చే వాళ్లా, యువకులా, యువతులా బోధనలోనూ, పెంపకంలోనూ సార్వజనీన సహకారిగా యెంచకండి. విద్యావిషయిక భాషలో యీ పుస్తకం తరగతి వెలుపలి బోధనా కృషికి సంబంధించింది (లేదా ఆ పదానికుండే పరిమితార్థంలో పిల్లల పెంపక కర్తవ్యానికి సంబంధించింది). పాఠాలు గాని, శాస్త్రీయ ప్రాథమిక సూత్రాల అభ్యాసపు ఉపదేశ వివరణల క్రమమంతా గాని నేను వివరించదలచలేదు. సున్నిత మానవ సంబంధాల భాషలో చెప్తే, యీ పుస్తకం ఉపాధ్యాయుని హృదయానికే అంకితం యివ్వబడింది. బాలబాలికలు చుట్టూతా వున్న ప్రపంచాన్ని

యెలా గ్రహించాలి, వాళ్లకు అభ్యసించడానికి యెలా సహాయపడాలి, వాళ్ల మేధా శ్రమని యెలా సులభతరం చెయ్యాలి, వాళ్ల హృదయంలో ఉన్నత భావాలూ అనుభూతులూ యెలా జాగృతం చేసి పదిలం చెయ్యాలి, మానవ గౌరవభావన, మానవుడు మంచి వాడన్న విశ్వాసం యెలా పాదుకొల్పాలి, సోవియట్ మాతృదేశానికి తమ ప్రేమని యెలా యివ్వాలి, గ్రహించగల శక్తి వున్న వివేకానికి, సున్నిత పసివాళ్ల హృదయానికి ఉన్నత కమ్యూనిస్టు ఆదర్శాలపట్ల తొలి భక్తి బీజాలని యెలా సంతరింపచెయ్యాలి అనేది నేను చెప్ప ప్రయత్నించింది.

యిప్పుడు మీ చేతిలో వున్న పుస్తకం ప్రాథమిక స్థాయిలో వుండే బోధనాకృషికి సంబంధించింది. వేరే మాటల్లో బాల్య ప్రపంచానికి సంబంధించింది. మరి బాల్యం, బాలల ప్రపంచం - ప్రత్యేక ప్రపంచం. పిల్లలకి మంచీ - చెడూ అంటే, న్యాయం - మోసం అంటే, మానవ గౌరవం అంటే వాళ్ల భావాలు వాళ్లకున్నాయి. అందమంటే వాళ్ల కొలబద్ద వాళ్లకుంది, కాలాన్ని కొలవడాని క్కూడా వాళ్ల పద్ధతి వాళ్లదే: బాల్యంలో ఒక రోజు అంటే ఒక సంవత్సరం, ఒక సంవత్సరమంటే యిక శాశ్వతమనే. బాల్యం అనే ఆ దివ్య ప్రాసాదంలోకి ప్రవేశం పొందాలని, ఒక మేరకి, నేనే ఒక పసివాణ్ణయి పోవాలని ప్రయత్నించాను. అప్పుడు మాత్రమే పిల్లలు మిమ్మల్ని ఆ అద్భుత కథా ప్రపంచంలోకి చొరబడ్డ మనిషిగానో, ఆ ప్రపంచాన్ని పహారాకాసేవాడుగానో, అక్కడి గొడవలు పట్టించుకోని వాడిగానో చూడ్డం మానేస్తారు.

యీ పుస్తకంలోని విషయాన్ని గురించీ, ఆ అనుభవ స్వభావాన్ని గురించీ మరొక మాట చెప్పాలనుకుంటున్నాను. మొట్టమొదటగా ప్రాథమిక పాఠశాల అనేది ఒక ఉపాధ్యాయుని సృజనాత్మక కృషి. అందుచేత, నేను ఉపాధ్యాయులా, తల్లిదండ్రులా సమష్టి కృషిని గురించి ఉద్దేశపూర్వకంగా చెప్పడం లేదు. అదంతా చేర్చాలంటే, యీ పుస్తకం గండభేరుండ స్థాయికి పెరిగిపోతుంది.

పిల్లలకి సంబంధించిన పుస్తకంలో, పిల్లల కుటుంబాల సంగతి చెప్పకుండా తప్పించుకోవడం దాదాపు అసాధ్యం. యీ కుటుంబ వాతావరణాన్ని గురించిన పూర్తి నిజమైన వర్ణన యివ్వడంలో నేను విఫలమయ్యేట్టయితే, నా విద్యాకృషికి సంబంధించిన పద్ధతి మొత్తం దిగ్భ్రమ కలిగిస్తుంది. ఎన్. క్రూప్స్కయాలాగా, ఎ. మాకారెంకొలాగా, యింకా అలాంటి విశిష్ట బోధకుల్లాగా, నేను కూడా విద్యకి గల మహత్తర శక్తిని దృఢంగా విశ్వసిస్తున్నాను.

- వి. సుహోమ్లిన్స్కీ

# సంతోషచంద్రశాల

## పాఠశాల డైరెక్టరు*

ఉపాధ్యాయుడుగా పదేళ్లు పనిచేసింతర్వాత నన్ను పవ్లీష్‌లో ఒక స్కూల్‌కి డైరెక్టరుగా నియమించారు. యీ పదేళ్ల కాలంలోనూ నాలో రూపు తీసుకున్న విద్యాత్మక విశ్వాసాలు, యిక్కడ వాటి సంపూర్తి ఆకారాన్ని ధరించాయి. యిక్కడ నా విశ్వాసాలు కార్యరూపం ధరించాలని అనుకున్నాను.

వాటిని ఆచరణలో పెట్టడానికి యెంతగా నేను ప్రయత్నిస్తే అంతగా నాకు నాయకత్వం కూడా ఒక బోధనా కృషే అన్నది స్పష్టమైంది: స్కూలు యెదుర్కొనే పనిలో వ్యక్తిగత ఉదాహరణ ద్వారా సైద్ధాంతిక, నిర్మాణాత్మక సమస్యల్ని పరిష్కరించడమే అది. డైరెక్టర్ తనే మంచి ఉపాధ్యాయుడనీ, పిల్లల విద్యాబోధన స్వయంగా నిర్వహిస్తున్నాడనీ ఉపాధ్యాయులు గమనిస్తే, సమష్టి బోధన నిర్వాహకుడుగా డైరెక్టర్ పాత్ర యెక్కువ పెరుగుతుంది.

మొట్టమొదటగా విద్యాబోధన అన్నది ఉపాధ్యాయుడికీ విద్యార్థికీ మధ్య యెడతెగకుండా వుండే సంబంధంలోనే వుంది. పాఠశాల అధిపతిని మహారష్యన్ బోధకుడు కె. డి. ఉషీన్‌స్కీ (1824–1870)** ప్రధాన ఉపాధ్యాయుడు అన్నారు. కాని యీ ప్రధాన ఉపాధ్యాయుని పాత్ర యెలా ఒక అధిపతి నిర్వహిస్తాడు?

ఉపాధ్యాయులద్వారా పిల్లలకి బోధించడం, అంటే ఉపాధ్యాయులకి నేర్పడం, అంటే వాళ్లకి బోధన అనే శాస్త్రాన్నీ, కళనీ నేర్పడం – యిది చాలా ముఖ్యమైందే, కాని పాఠశాల బహుముఖ నిర్వహణ క్రమంలో యిది ఒక అంశం మాత్రమే. మిగతా ఉపాధ్యాయులకి బోధించడంలోని నేర్పుని చెప్పడం మాత్రమే చేసి, తను పిల్లలతోటి నేరుగా సంబంధం పెట్టుకోకుండా గనక ప్రధాన ఉపాధ్యాయుడు వున్నట్లయితే, అతను బోధకుడు కాడు.

మనకి పిల్లలతోబాటు కలిసిపోయే ఆసక్తులూ, సరదాలూ, కోరికలూ లేకపోయినట్లయితే పిల్లల హృదయాలు మనల్ని దరిచేరనివ్వవని డైరెక్టరుగా చేరిన మొదటి వారాల్లోనే నేను గ్రహించాను. పిల్లలమీద నేరుగా బోధనా ప్రభావం లేకపోయినట్లయితే, డైరెక్టర్‌గా నేను ఉపాధ్యాయుడికీ – బోధకునికీ అవసరమైన

* సోవియట్ యూనియన్‌లో సెకండరీ పాఠశాల అధిపతి.

** కె.డి. ఉషీన్‌స్కీ "సంకలిత రచనలు" "ప్రగతి" ప్రచురణాలయం ఇంగ్లీషులో ప్రచురించింది.

ప్రధాన గుణం పోగొట్టుకుంటాను – పిల్లల హృదయాంతారాళాల్లోకి ప్రవేశించే శక్తిని పోగొట్టుకుంటాను. నేను తరగతి ఉపాధ్యాయులంటే అసూయపడేవాణ్ణి, యెందుకంటే వాళ్లు అస్తమానూ పిల్లలతోటే వుండేవాళ్లు. తరగతి ఉపాధ్యాయునికి పిల్లలతో మనసు మనసు కలిపి మాట్లాడ్డం వుంటుంది, వాళ్లతో కలిసి అడవుల్లోకి, సెలయేళ్ల దగ్గరికి, పొలాల్లో పని చెయ్యడానికి పోవచ్చును. విహార యాత్రలకి పోవడానికి, అక్కడ పాయసం వండుకోవడానికి, చేపలు పట్టుకోవడానికి ఆరుబయట విడిది చెయ్యడానికి, మిణుకుమిణుకుమనే నక్షత్రాల్ని చూడ్డానికి పిల్లలు యెంతో తహతహలాడుతూ వుంటారు. డైరెక్టరు దీనంతటికీ అంచులమీదనే వుంటాడు. అతను పనిని నిర్వహిస్తాడు, సలహా యిస్తాడు, తప్పులు గమనించి సరిదిద్దుతాడు, బాగా వున్న దాన్ని ప్రోత్సహిస్తాడు, బాగా లేనిదాన్ని నిషేధిస్తాడు. యివేమీ లేకుండా నడపలేమనుకోండి, కాని నాకు మాత్రం అది చాలదు.

బోధనా కృషిలో క్రియాత్మక పాత్ర వహించిన ఉత్తమమైన పాఠశాలాధికారులు నాకు తెలుసు. వాళ్లు బోధనా క్రమంలో నిజమైన సిద్ధహస్తులు. వాళ్ల పాఠాలు ఉపాధ్యాయులకే ఆదర్శం. వాళ్లు యువ పయనీర్, కొమ్‌సొమోల్ సంఘాల వ్యవహారాల్లో చురుగ్గా పాల్గొంటారు. ఉపాధ్యాయులూ, తరగతి బోధకులూ, యువ పయనీర్ నాయకులూ వాళ్ల దగ్గరనుంచి నేర్చుకోవాలి. ఒక పిల్లల బృందం తాలూకు జీవితంలో ప్రత్యక్షంగా, దీర్ఘకాలంగా పాల్గోవడంవల్ల డైరెక్టర్ ఒక బోధకుడిగా అత్యున్నత నేర్పుని సంపాదించవచ్చని నాకనిపించింది, యీమధ్య కాలంలో ఆ నమ్మకం బలపడింది కూడా. నేను పిల్లలతోటే వుండాలని కోరుకున్నాను, వాళ్ల సుఖదుఃఖాలు పంచుకోవాలని, వాళ్లకి సన్నిహితంగా వుండాలని కోరుకున్నాను. ఉపాధ్యాయునికి వుండే మహదానందాల్లో యిది ఒకటి. యేదో ఒక పిల్లల సముదాయంలో చేరాలని తడవ తడవకీ నేను ప్రయత్నించాను. వాళ్లతో పని చెయ్యడానికి వెళ్లాను, విడిది యాత్రల్లో వెళ్లాను, విహార యాత్రల్లో వెళ్లాను, జీవితంలో తిరిగిరాని సంతోషాలని వాళ్లకందివ్వడానికి సహకరించాను. అవి లేని సర్వసౌష్ఠవ విద్యని వూహించుకోవడమే అసాధ్యం.

కాని యీ సంబంధాల్లో ఒక రకమైన కృతకత్వం వుందని పిల్లలూ నేనూ కూడా అనుకున్నాం. విద్యావిధానంలోని అసహజత్వం నాకు చిరాకు పుట్టించింది: నేను వాళ్లతో కొంచెంసేపు వున్నాననే సంగతిని పిల్లలు మరిచిపోలేకపోయేవాళ్లు. ఉపాధ్యాయుడు చిరకాల మిత్రుడైనప్పుడే, కలిసిచేసే పనుల్లో చెలికాడు, సహవాసి అయినప్పుడే నిజమైన సాంగత్యం పుడుతుంది. అది యిచ్చే సృజనాత్మక సంతోషంకోసమే కాకుండా, నా సహోద్యోగులకి బోధనలోని శాస్త్రీయమైందాన్నీ కళనీ నేర్పడానికి కూడా అలాంటి సాంగత్యం అవసరమని నాకు అనిపించింది. పిల్లలతోటి నేరుగా యెడతెగకుండా వుండే సంబంధం ఆలోచనలకీ, బోధనావిష్కరణలకీ, సంతోషాలకీ, విచారాలకీ, భ్రమలు తొలగడానికీ ఆధారం. అవి లేకుండా మా కృషిరంగంలో సృజన అసాధ్యం. ప్రధాన ఉపాధ్యాయుడు చిన్న పిల్లల

సముదాయానికి బోధకుడుగా, ఆ పిల్లలకి మిత్రుడుగా సహవాసిగా వుండాలనే అభిప్రాయం నాకు ఏర్పడింది. పబ్లిష్‌కి రాకముందు బోధనకి సంబంధించి నాకు కలిగిన విశ్వాసాలమీద యీ అభిప్రాయం ఆధారపడింది.

నిజమైన పాఠశాల అనేది పిల్లలు జ్ఞానమూ, మెలుకువలూ సంపాదించుకునే స్థలం మాత్రమే కాదని నా అధ్యాపకత్వపు తొలి సంవత్సరాల్లోనే నేను అర్థం చేసుకున్నాను. పఠించడం ముఖ్యమే, కాని ఒక పిల్లవాని ఆధ్యాత్మిక జీవితంలో అదొక్కటే సర్వమూ కాదు. మనమంతా బోధనాత్మక శిక్షణ అని పిలిచేదాన్ని సన్నిహితంగా పరిశీలించేకొద్దీ పిల్లలూ ఉపాధ్యాయుడూ అనేక ఆసక్తులతోటి, సరదాలతోటీ మిళితమైపోయి, పిల్లల సాముదాయిక బహుముఖ ఆధ్యాత్మిక జీవితం వికసించే చోటే నిజమైన పాఠశాల అని నాకు నమ్మకం యేర్పడిపోయింది. పాఠం చెప్పేటప్పుడు మాత్రమే పిల్లలని చూసే వ్యక్తి - బల్లకిటువైపు తనూ, అటువైపు పిల్లలూ వున్నప్పుడు మాత్రమే వాళ్లని చూసే వ్యక్తి - పిల్లల హృదయాలని గ్రహించలేడు. మరి పిల్లల హృదయం గ్రహించని వ్యక్తి, వాళ్ల ఆలోచనలూ, భావాలూ, కోరికలూ పసికట్టలేనివాడు యెవరైనాసరే, ఉపాధ్యాయుడు కాలేడు. ఉపాధ్యాయుడి బల్ల ఒక్కొక్కప్పుడు రాతిగోడ లాంటిది, వెనకనుంచి ఉపదేశకుడు తన "శత్రువు" - విద్యార్థుల - మీద, "దాడులు" జరుపుతాడు. అతి తరచుగా ఆ బల్ల ముట్టడిలో వున్న కోటలా తయారవుతుంది, క్రమేపీ "శత్రువు"కి లొంగిపోయేటట్టు నిర్బంధించబడుతుంది, మరి "కమాండర్" లోపల మూసేసుకుని చేతులు కట్టిపడేసినట్లు భావిస్తాడు.

పాఠ్యవిషయం తెలిసిన ఉపాధ్యాయులకి కూడా, ఒక్కొక్కప్పుడు బోధన ఘోర పోరాటంలా తయారవుతుంది. వూరికే యెందుకంటే ఉపాధ్యాయుల్నీ విద్యార్థుల్నీ బంధించే ఆత్మిక సంబంధాలు అసలు లేకపోవడంవల్ల. ఉపాధ్యాయులకీ పిల్లలకీ మధ్యన కొన్ని స్కూళ్లలో కనిపించే తక్కువ సంబంధాలకి కాని, లేదా దుర్ఘటమైన సంబంధాలకి కాని ప్రధాన కారణం పరస్పర అపనమ్మకమూ, అనుమానమూనూ. ఉపాధ్యాయుడు పిల్లవాని అనుభూతులతో బాంధవ్యం పొందలేడు. అలాంటి ఉపాధ్యాయుడు పిల్లల సంతోషాలు గాని విచారాలు గాని అనుభూతం చేసుకోలేడు, పిల్లల స్థానంలో తను వుండాలనే ప్రయత్నం చెయ్యలేడు.

విఖ్యాత పోలిష్ బోధకుడు యానుష్ కోర్‌చక్ (1878-1942) తను రాసిన ఒక ఉత్తరంలో పిల్లల ఆధ్యాత్మిక ప్రపంచంలోకి యెక్కి వెళ్లాలని, వాళ్ల స్థాయికి దిగి రావడం కాదని మనకి గుర్తు చేస్తాడు. యిది చాలా సూక్ష్మమైన భావం. దీన్ని బోధకులమైన మనం పూర్తిగా అర్థం చేసుకోవాలి. ప్రపంచాన్ని గురించిన పసివాని గ్రహణశక్తుల్ని ఒక నిజమైన ఉపాధ్యాయుడు బాగా అర్థంచేసుకోవాలి. ప్రత్యేకమైన స్పష్టత, అమాయికత్వం అన్నీ కలుపుకుని వున్న పరిసర వాస్తవంపట్ల పసివాడి ప్రతిచర్యలని నిజమైన ఉపాధ్యాయుడు అవగాహన చేసుకోవాలి. అలా చేసేటప్పుడు ఆ

పసివాడికి అద్భుత లక్షణాలు ఆపాదించకూడదు, ఆదర్శవంతం చెయ్యకూడదు. పిల్లల ఆధ్యాత్మిక ప్రపంచ స్థాయికి మనం యెక్కివెళ్లాలనే యానుష్ కోర్‌చక్ విజ్ఞప్తిని ప్రపంచాన్ని గురించి పిల్లవాడి స్వంత గ్రాహ్యతని అతిసున్నితంగా అవగాహన చేసుకోవడంగా, అనుభూతి చెందడంగా అర్థంచేసుకోవాలి. పసివాడి బుద్ధీ, అనుభూతీ వాటిని గ్రహించినట్టుగా అర్థంచేసుకోవాలి.

కొన్ని ఆత్మిక గుణాలున్నాయి. అవి లేకపోతే ఒక వ్యక్తి నిజమైన బోధకుడు కాలేడని నా గట్టి నమ్మకం. వాటిలో అతి ముఖ్యమైంది పిల్లవాని ఆధ్యాత్మిక ప్రపంచంలోకి చొచ్చుకుపోగల సామర్థ్యం. తను కూడా ఒకనాటి పసివాడే అన్నది మరచిపోని వ్యక్తే నిజమైన ఉపాధ్యాయుడవగలడు. చాలామంది ఉపాధ్యాయుల దురదృష్టం యేమిటంటే (అలాంటి వాళ్లని పిల్లలు, ముఖ్యంగా యెదిగే పిల్లలు ముసలి చాదస్తుదంటూ వుంటారు), జ్ఞాన ప్రపంచంలోకి, సృజనలోకి, మానవ సంబంధాల్లోకి ప్రవేశించే కృషిలో వున్న సజీవ మానవప్రాణి విద్యార్థి అన్నది వాళ్లు మరిచిపోతారు.

విద్యాబోధనలో దేనికదే ఒంటికాయ శొంఠిపిక్క బాపతు విడి భాగాలేంలేవు. విద్యార్థులకి ప్రపంచాన్ని గురించి తెలుసుకునే క్రమంలో పాఠాలు ముఖ్యమైన భాగమే. పిల్లలు ప్రపంచాన్ని గురించి యెలా నేర్చుకుంటారో, యెలాంటి విశ్వాసాలు యేర్పరచుకుంటారో దానిమీదనే పిల్లల ఆధ్యాత్మిక జీవిత పూర్తి నిర్మాణం ఆధారపడుతుంది. కాని ప్రపంచాన్ని గురించిన జ్ఞానం అనేది జ్ఞానాన్ని జీర్ణించుకోవడం మాత్రమే కాదు. చాలామంది ఉపాధ్యాయుల దురదృష్టం యేమిటంటే పిల్లల మానసిక ప్రపంచాన్ని వాళ్లు గ్రేడులతోటీ, మార్కులతోటీ కొలిచి అంచనా వెయ్యడం; పిల్లల్ని బాగా చదివేవాళ్లు, మిగతా వాళ్లు అని రెండు తరగతులుగా విభజించెయ్యడం.

మానవ జీవిత బహుముఖత్వంతో ఒక పార్శ్వాన్ని మాత్రమే అర్థం చేసుకుని యిలాంటి దౌర్భాగ్య స్థితిలోకి ఒక ఉపాధ్యాయుడు పడితే, ఉపాధ్యాయుల పనిని "సాధారణ సూచన" లిచ్చి సవరిస్తూ, వాళ్లు చెయ్యబోయే పనికి అనుమతి యివ్వడమో లేక నిరాకరించడమో చేసే డైరెక్టరుకి అది వర్తించదూ? అతని పరిస్థితి యింకా ఇబ్బందికరమైంది. అలాంటి పరిస్థితి కట్టిపడవేసినట్టనిపించింది నాకు. విద్యార్థులదగ్గరకు వెళ్లినప్పుడల్లా, వాళ్లూ, వాళ్ల ఉపాధ్యాయులూ దేన్ని గురించైనా ఉత్సాహకరంగా చర్చిస్తున్నారని లేక దేనినైనా ఆసక్తితో చేస్తున్నారని గమనించినప్పుడల్లా నాకు బాధగా వుండేది. అలాంటప్పుడు నేను ఏదో అడిగితే వాళ్లు గమనించకుండా వున్నారు. పిల్లలు వాళ్ల ఉపాధ్యాయుల అనుభవ సంపదని పంచుకుంటారు; వాళ్ల రహస్యాలు వాళ్లకుంటాయి. అలాంటి డైరెక్టర్లు కావాలా మనకి? వద్దు. 1917 మహత్తర అక్టోబరు విప్లవాత్పూర్వం రష్యాలోని స్కూళ్లలో వుండే నాయకత్వ రూపానికీ, పద్ధతికీ కాలం చెల్లిపోయింది. అప్పట్లో డైరెక్టరు ఉపాధ్యాయులమీద ముఖ్యంగా పర్యవేక్షకుడు మాత్రమే. బోధకుడు అనుకున్న

కార్యక్రమాన్ని సరిగా వివరిస్తున్నాడో లేదో, అనవసరమైనవి చెప్పకుండా, ఒక తప్పు కూడా చెయ్యకుండా వున్నాడో లేదో ఓ కంట కనిపెట్టి వుండటమే అతని పని.

చాలా కష్టమైన బోధనా కర్తవ్యంలో, అభివృద్ధికర బోధనా భావాలు నింపుకున్న శ్రేష్ఠమైన అనుభవం ఉపాధ్యాయుల కళ్ల ముందు పుట్టిపెరిగి, బలవత్తర పడేటట్టు చూడ్డంలోనే సమకాలీన పాఠశాల నాయకత్వపు సారం యిమిడి వుంది. యీ అనుభవాన్ని నిర్మించే వ్యక్తి, మిగతా బోధకులకి ఆదర్శంగా వుండే వ్యక్తి, పాఠశాల డైరెక్టర్‌గా వుండాలి. అలాంటి డైరెక్టర్ – తనే శ్రేష్ఠమైన బోధకుడైన డైరెక్టర్ – లేని పాఠశాలని యీనాడు వూహించుకోలేం. విద్య అంటే ప్రధానంగా వ్యక్తి యెలా వుండాలో తెలుసుకోవడమే. ఒక పిల్లవాడిని గురించిన పరిజ్ఞానం లేకుండా, పిల్లవాని మానసిక అభివృద్ధీ, ఆలోచనలూ, ఆసక్తులూ, సరదాలూ, సామర్థ్యాలూ, సహజప్రవృత్తులూ, అభిలాషలూ గురించిన పరిజ్ఞానం లేకుండా, విద్య అనేదే లేదు. తన సొంత రోగులు లేని ఆస్పత్రి ప్రధాన డాక్టరు నిజమైన డాక్టరు కానట్టే, స్కూలు డైరెక్టరు కూడా తన సొంత విద్యార్థులు లేకుండా మిగిలిన ఉపాధ్యాయులకి నాయకత్వం వహించలేడు. తన సొంత విద్యార్థులంటే పిల్లవాడు స్కూల్‌కి వచ్చిన మొదటి రోజులనుంచి సర్టిఫికెట్ పుచ్చుకొనే పర్యంతం, అతడు పరిణతి చెందేటంతవరకూ ఆ పిల్లవాడితో ఒక్కొక్క అడుగే డైరెక్టరు అనుసరించడం అని అర్థం. ఆ డైరెక్టరు ఆ పిల్లవాని మానసిక, నైతిక, సౌందర్యాత్మక, భావాత్మక, శారీరక అభివృద్ధిపట్ల శ్రద్ధ వహిస్తున్నాడు. ఆ డైరెక్టరు ఆ పిల్లవాడితో ఉమ్మడి ఆసక్తులు కలిగివుండి, తన మానసిక సంపదని పంచుకొంటున్నాడు.

పాఠశాలలో ప్రధాన వ్యక్తి యెవరు? యే బోధనాక్రమ రంగంలో డైరెక్టరు మిగతా ఉపాధ్యాయులకి ఆదర్శంగా వుండాలి? పాఠశాలలోని ప్రధాన వ్యక్తి ప్రాథమిక బాలుర సముదాయం, అంటే తరగతి సమష్టి, నాయకుడు. అతనే, విద్యార్థులకు పాఠాలు చెప్పే ఉపాధ్యాయుడుగా, పిల్లల స్నేహితుడుగా, వాళ్ల బహుముఖ మానసిక జీవితపు దర్శకుడుగా వుంటాడు. విద్యాపుష్పానికి గల విస్తృతార్థంలో పఠనం అనేది ఒక రేకు మాత్రమే. పుష్పానికి అందాన్నిచ్చే అనేక రేకుల్లో ప్రధాన దళం అనేది లేనట్టే విద్యలో కూడా ముఖ్యమైనవీ, అముఖ్యమైనవీ అన్న విభజనల్లేవు. విద్యలో ప్రతిదీ ముఖ్యమైందే – పాఠాలు, అనేకమైన పాఠశాల బయటి ఆసక్తుల అభివృద్ధి, సముదాయంలోని విద్యార్థుల మధ్య సంబంధాలు – అన్నీ.

పాఠాశాల డైరెక్టరుగా ఆరేళ్లు పనిచేసిం తర్వాత నేను తరగతి సముదాయపు ఉపాధ్యాయులకి సంధాన కర్తనయ్యాను. డైరెక్టరుకీ విద్యార్థులకీ మధ్య ప్రత్యక్ష ఆధ్యాత్మిక సంబంధాన్ని సాధించడానికి యిదొక్కటే మార్గం కాదు. కాని నా ప్రత్యేక పరిస్థితిలో యీ పద్ధతి యెంతో ఆశాజనకంగా కనిపించింది. సహజ పరిస్థితుల్లో యేర్పాటైన చాలా దీర్ఘకాల ప్రయోగంగా, విద్యార్థుల సముదాయానికి బోధకునిగా కృషిని నేను భావించుకున్నాను.

ఆ కాలంలో నేను కచ్చితంగా యేం చేశాను అన్నది చర్చించే ముందు, ఆచరణాత్మక కృషిలోని వస్తువూ, లక్ష్యమూ ఒక రకంగా వెల్లడిచేసే ముఖ్యమైన విషయాన్ని యథాలాపంగా చెబుతాను. వ్యక్తిత్వం రూపుతీసుకోవడంలో చిన్నతనమే చెప్పలేనంత ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. మహారష్యన్ రచయితా, బోధకుడూ అయిన లియొ టాల్‌స్టాయ్ (1828-1910) అన్నట్టు ఒక పిల్లవాడు, పుట్టిందగ్గర్నుంచి అయిదేళ్లు వచ్చేదాకా, వుండే కాలంలోనే తన యింగితానికీ, అనుభూతులకీ, యిచ్ఛకీ, నడవడికకీ సంబంధించి, తన మిగిలిన జీవిత కాలమంతటికంటే కూడా యెంతో యెక్కువ నేర్చుకుంటాడు. సోవియట్ బోధకుడు మకారెంకొ దీన్నే వల్లించాడు: ఒక వ్యక్తి తను అయిదు సంవత్సరాల లోపున వ్యక్తిగా అయిందే అయినట్టు.

అసాధారణ నైతిక సౌందర్యంగల వ్యక్తి యానుష్ కోర్‌చక్ "నేను మళ్లీ చిన్నవాణ్ణయితే" అన్న తన పుస్తకంలో రాశాడు: ఒక పిల్లవాడు బ్లాక్‌బోర్డుకేసి చూసి యెక్కువ నేర్చుకుంటాడో, కిటికీలోంచి అవతలకి చూసి యెక్కువ నేర్చుకుంటాడో యెవరూ చెప్పలేరు. ఆ క్షణంలో యేది ఎక్కువ ఉపయోగం, యెక్కువ ముఖ్యం - బ్లాక్‌బోర్డుమీదికి పిండిన తర్కబద్ధ ప్రపంచమా, లేక కిటికీ అద్దాల బయట తరగలెత్తే ప్రపంచమా? ఒక వ్యక్తి మనసుని బంధించెయ్యకూడదు. తద్భిన్నంగా ప్రతి పిల్లవాని సహజాభివృద్ధి ధర్మానికీ, చిత్రాలకీ, విచిత్రాలకీ, కోరికలకీ, కాంక్షలకీ సంబంధించి శ్రద్ధ వహించాలి.

ఆ చిన్న పుస్తకంలోని మాటలు నా జీవితమంతా గుర్తుంచుకున్నాను. యుద్ధ కాలంలో ఆ రచయిత సాహసకృత్యాలు విన్నప్పుడు, ఆయన మాటలు నా జీవితంలో శాసనమే అయిపోయాయి. వార్సాలోని యూదుల నివాసంలో వుండే ఒక అనాథ శరణాలయానికి యానుష్ కోర్‌చక్ డైరెక్టరు. యీ నిర్భాగ్య బాలల్ని హిట్లరు ముష్కరులు ట్రెబ్‌లింకా మృత్యు కొలుముల్లో మృత్యువాత పడేశారు. పిల్లలు లేని జీవితం కావాలో లేకపోతే వాళ్లతోపాటే తనూ పోతాడో యెంచుకొమ్మని కోర్‌చక్‌ని అడిగితే ఆయన నిస్సంకోచంగా మృత్యువునే కోరుకున్నాడు. "మీరు మంచి వైద్యులని మాకు తెలుసు, మీరు మృత్యు కొలిమిలో కాలిపోనవసరం లేదు" అన్నాడా గెస్టపో ఆయనతోటి. "నా అంతరాత్మకి విరుద్ధంగా నేను చెయ్యను" అని ఆయన జవాబిచ్చాడు. ఆ వీరుడు ఆ పిల్లలతోబాటే, వాళ్లని వూరడిస్తూ, ఆసన్న మృత్యుభీతిని తగ్గించ ప్రయత్నిస్తూ మరణించాడు. యానుష్ కోర్‌చక్ జీవితమూ, ఆయన అద్భుత నైతిక శక్తియుత పవిత్ర కృత్యమూ నాకు ప్రేరణ యిస్తాయి. పిల్లలకి నిజమైన ఉపాధ్యాయుడు కావడం అంటే మన హృదయమే వాళ్ల కర్పించాలని ఆయన నుంచి నేను నేర్చుకున్నాను.

మనం యెల్లప్పుడూ మనతో వున్న వాళ్లని ప్రేమించగలం, యేదో ఒక అవాంతరం దాపురించి మన అనుభూతుల గాఢతని వెల్లడి చేసేదాకా ఆ విషయాన్ని గమనించం అని ఉషీన్‌స్కీ రాశాడు. ఉదాహరణకి తన స్వదేశంనుంచి బహుకాలం

దూరంలో యెన్నడూ గడపని వ్యక్తి తను తన దేశాన్ని యెంత ప్రేమిస్తున్నదీ తెలియకుండానే జీవితమంతా గడిపెయ్యగలడు. చాలాకాలం పిల్లల్ని చూడకుండా, వాళ్ల సంతోషాలూ విచారాలూ అనుభూతం కాకుండా వున్నప్పుడల్లా నేనీ మాటలు గుర్తుచేసుకుంటాను. ఒక ఉపాధ్యాయుని ముఖ్యమైన లక్షణాల్లో ఒకటేమిటంటే పిల్లలపట్ల ప్రేమ. ఆ మాటమీద ప్రతియేడూ నాకు మరింత నమ్మకం యేర్పడుతోంది. స్టనిస్లావ్‌స్కీ* మాటల్లో "అనుభూతుల్ని వెలిగక్కించడం అసాధ్య" మైతే, ఉపాధ్యాయునిలో, బోధకునిలో యీ అనుభూతుల్ని తీసుకురావడమే బోధనాశాస్త్ర కళలోని సారం.

ఉపాధ్యాయునికీ పిల్లవానికీ మధ్య నిరంతర ఆత్మిక సంబంధం లేకుండా, ఒకళ్ల ఆలోచనలు, అనుభూతులు, యింకొకళ్ల అనుభవాలతో పరస్పరం చొచ్చుకుపోకుండా, బోధనాశాస్త్రపు కళని వూహించలేం. ఉపాధ్యాయుడు ఒట్టి బోధకుడుగానే గాక ఒక స్నేహితుడుగా, ఒక సహచరుడుగా కలిసిపోయే ఐక్య, స్నేహపూర్వక సముదాయంలో పిల్లలతోటి బహుముఖ భావనాత్మక సంబంధాలు ఉపాధ్యాయుని అనుభూతుల్ని వెలికి తీసుకురావడానికి పెద్ద మూలం. ఉపాధ్యాయుడు తరగతి గదిలో మాత్రమే పిల్లల్ని కలుసుకునేటట్టయితే, అక్కడ మాత్రమే తన ప్రభావం కలగజేసేటట్టయితే భావనాత్మక సాన్నిహిత్యం వూహించలేనిది.

అవసరమైన పాఠ్యవిషయం వ్యక్తి మనసుని చెరుస్తుందనీ, బ్లాక్‌బోర్డు పిల్లల్ని బానిసల్ని చేస్తుందనీ, కిటికీ బయట ప్రపంచం యేదో వాస్తవమైన స్వతంత్రపూరితమైందనీ చెప్పే అభిప్రాయానికి మనం తావు యివ్వకూడదు.

ఒక పిల్లవాని జీవితంలో ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు బ్రహ్మాండమైన పాత్ర నిర్వహిస్తాడని, నేను పవ్లీష్‌కి రాకముందే నాకు గట్టి నమ్మకం కలిగింది. ఉపాధ్యాయుడుగాని, ఉపాధ్యాయురాలుగాని పిల్లవాడి కుటుంబంలో ఒక సభ్యునిగా, ఒక తల్లిగా వుండితీరాలి. ఉపాధ్యాయుడిమీద పాఠశాల చిన్న పిల్లవాడి కుండే నమ్మకం, ఉపాధ్యాయుడికీ పిల్లవాడికీ మధ్య పరస్పర విశ్వాసం, ఉపాధ్యాయుడిలో పిల్లవాడు చూసే మానవ ఆదర్శం - అవి ప్రాథమికమైనవి. అదే సమయంలో అత్యంత సంక్లిష్టమైన, యుక్తివంతమైన విద్యానియమాలూనూ. వాటిని ఉపాధ్యాయుడు గ్రహించినప్పుడే అతను నిజమైన ఆధ్యాత్మిక బోధకుడు కాగలడు. ఉపాధ్యాయునిలో వుండాల్సిన ఉత్తమ విలువైన లక్షణాల్లో ఒకటి - అతని మానవత్వం, పిల్లలపట్ల గాఢమైన ప్రేమ, తల్లిదండ్రుల హృదయపూర్వక లాలనలూ, యుక్తివంతమైన కాఠిన్యమూ, ఖండితత్వమూ కలిసిన ప్రేమ.

ఒక వ్యక్తి జీవితంలో బాల్యం ప్రధానమైంది. అది భవిష్యత్ జీవితానికి వూరికే వ్యక్తిని సిద్ధపరచడమే కాదు, నిజమైన, స్వచ్ఛమైన, అసలైన, పునరావృతం కాని

* కె. ఎస్. స్టనిస్లావ్‌స్కీ (1863-1938) - సోవియట్ రంగస్థల సిద్ధాంతవేత్త, బోధకుడూ, రంగస్థల దర్శకుడూ, నటుడూ.

జీవితం. మరి అప్పుడేం జరిగిందీ, ఆ పిల్లవాణ్ణి ఆ వయసులో యెవరు నడిపించారు, చుట్టూతా వున్న ప్రపంచంనుంచి ఆ హృదయంలోకీ, మనసులోకీ యేం చొచ్చుకుపోయిందీ, అవే ఆ పిల్లవాడు యెలాంటి వ్యక్తి అయేదీ అధిక భాగం నిర్ణయిస్తాయి. వ్యక్తిత్వం రూపుతీసుకోవడం, ఆలోచనా క్రమం, మాటలాడ్డం స్కూల్‌కి ముందూ, స్కూలులో ప్రాథమిక సంవత్సరాల్లోనూ జరుగుతాయి. పుస్తకాలద్వారా, పాఠ్య గ్రంథాలద్వారా, పాఠాలద్వారా పిల్లవాని హృదయంలోకీ, మనసులోకీ ప్రవేశించేదంతా చుట్టూతా వుండే ప్రపంచాన్ని బట్టే సాధ్యం. ఆ ప్రపంచం పుస్తకంతోబాటు పక్కనే వుంటుది. పిల్లవాడు పుట్టిందగ్గర్నుంచి, తనకి తాను పుస్తకం తెరిచి చదవగలిగేదాకా కష్టమైన అడుగులు వేసిన పరివేష్టిత ప్రపంచం అది.

కమ్యూనిస్టు నీతికి పునాదిగా వుండే విలువల్ని నేర్చుకోవడమనే దీర్ఘకర్తవ్యం బాల్యంలోనే మొదలవుతుంది. వాటిని పిల్లవాడు బుద్ధితోటీ, హృదయంతోటీ నేర్చుకొంటున్నాడు. ఈ విలువలు ఏమిటంటే స్వదేశంపట్ల ప్రేమ, స్వదేశ క్షేమంకోసం, గొప్పదనంకోసం, శక్తికోసం తన జీవితాన్ని అర్పించే సంసిద్ధత, తన దేశపు శత్రువులపట్ల రాజీలేని దృఢత్వం.

అన్ని రకాల వయసు పిల్లలా, అలాగే యెదిగినవాళ్లా, శబ్దకోశాన్ని నేను ముప్ఫై మూడేళ్లు పైబడి అధ్యయన చేశాను. ఫలితం అద్భుతంగా వుంది. ఒక సామాన్య సమష్టి వ్యవసాయ క్షేత్ర రైతు కుటుంబం నుంచి వచ్చిన ఏడు సంవత్సరాల పిల్లవాడు (తల్లితండ్రులు సెకండరీ విద్య అభ్యసించారు, యింట్లో మూడు, నాలుగు వందల పుస్తకాలు వుంటాయి) తను స్కూలులో ప్రవేశించే నాటికి తన స్వంత భాషలో 2,000 నుంచి 3,500 పదాల దాకా అర్థంచేసుకుంటాడు, వాటి అనుభూతి పార్శ్వాన్ని కూడా గ్రహిస్తాడు. 1500 పదాల వ్యావహారిక జ్ఞానంతో వుంటాడు. సెకండరీ విద్యాస్థాయి వున్న నలభై అయిదు - యాభై సంవత్సరాల వయసున్న పనివాళ్లూ, సమష్టి వ్యవసాయ క్షేత్ర రైతులూ తమ స్వంత భాషలోని 5,000-5,500 పదాల సున్నిత భేదాల్ని అర్థంచేసుకుంటారు, గ్రహిస్తారు. వాళ్లకి 2,000-2,500లకి మించని వ్యవహారపదకోశం వుంటుంది. ఒక వ్యక్తి జీవితంలో బాల్యవత్సరాలు నిర్వహించే పాత్రకి యీ సత్యమే కొట్టవచ్చినట్టు కనబడే రుజువు.

పాఠశాలాత్పూర్వపు సంవత్సరాలు, ప్రాథమిక విద్యాసంవత్సరాలు, ఒక వ్యక్తి భవిష్యత్తుని అధిక భాగం నిర్ణయిస్తాయనే దృఢమైన విశ్వాసం తర్వాతి సంవత్సరాల్లో ఆ వ్యక్తికి తిరిగి బోధించవచ్చనే అవకాశాన్ని తోసి రాజనవు. తీర్చిదిద్దే సామర్థ్యం సోవియట్ బోధకుడు మకారెంకో అనుభవంలోనే బ్రహ్మాండంగా రుజువైంది. కాని పసితనానికి నిరుపమాన ప్రాముఖ్యాన్ని ఆయన యిచ్చాడు. బోధనలోని సరి అయిన కర్తవ్యం యేమిటంటే మరీ పసితనంలో చేసిన తప్పుల్ని సవరించడం కాదు, మొదటగా తప్పులే చెయ్యకుండా తప్పించడం, ఆ రకంగా పునర్విద్య అవసరాన్ని లేకుండా చెయ్యడం.

బోధన అంటే పిల్లల బుర్రల్లోకి వీలైనంత విషయ పరిజ్ఞానాన్ని కుక్కేసే సాధనమేనని ఉపాధ్యాయుడు భావించేటప్పుడు పిల్లల సహజ జీవితం ఒకొక్కప్పుడు యెంత అపార్థమవగలదో నేను పాఠశాల డైరెక్టర్‌గా పనిచేసేటప్పుడు బాధపడుతూ గుర్తించాను.

ఒక పిల్లవాని సహజ జీవితం, పాఠాలప్పుడే కాదు, డే కేర్ గ్రూపుల్లో* కూడా యెంత కుంటుపడుతుందో గుర్తిస్తే యెంతో బాధ కలుగుతుంది. దురదృష్టవశాత్తూ అలాంటి స్కూళ్లు వున్నాయి. అయిదారు గంటల పాఠ్యబోధనలయాక పిల్లలు స్కూల్లోనే యింకో అయిదారు గంటలు వుండిపోతారు. ఆడుకుంటూ పాడుకుంటూ హాయిగా బయట గాలిపీల్చుకోకుండా పిల్లలు పుస్తకాన్ని అంటిపెట్టుకునే వుంటారు. ఆ పిల్లలు స్కూల్లో గడిపే కాలం యెడతెగని విసుగు పుట్టించే చదువే అయిపోతుంది. యీ పద్ధతి కొనసాగకూడదు! బోధనలో డే కేర్ గ్రూపులు చాలా విలువైన పద్ధతి. నిరంతర ఆధ్యాత్మిక సంబంధం లేకపోతే ఉన్నత భావాల బోధన వూహించుకోలేము. ఆ సంబంధం ఉపాధ్యాయుడికీ పిల్లవాడికీ మధ్య యేర్పడడానికి యీ పద్ధతిలోనే అనుకూలమైన పరిస్థితులు కచ్చితంగా వుంటాయి. కాని దురదృష్టవశాత్తూ యెన్నో మంచి భావాలు తరచుగా తలకిందులైపోతాయి. తరచుగా డే కేర్ గ్రూపు అదే పాఠాన్ని, అదే బల్లదగ్గర గంటగంటకీ యింకొంచెం పొందుతుంది; పిల్లవాడి శక్తి హరించడానికి అది చాలు.

యిది యెందుకు జరుగుతుంది?

యెందుకంటే పిల్లల్ని పచ్చిక బయలుమీదకో, పార్కుకో, లేదా అడివిలో షికారుకో తీసుకెళ్లడం కంటే పాఠాలు కొనసాగించడమే యింకా సులభం కాబట్టి.

బోధనా సాహిత్యంలో డే కేర్ కార్యక్రమాలని గురించి వివరంగా వర్ణించబడింది. యెంతో మంచి డే కేర్ కార్యక్రమాలున్న స్కూళ్ల అనుకూలమైన అనుభవం మిగతా చోట్ల వేళ్లు తన్నుకోకపోవడం విచారకరం. దీనికి ప్రధానమైన కారణం బోధనలో వున్న సాధారణ బలహీనత.

మనం బతుకుతున్న కాలంలో శాస్త్రీయ జ్ఞానం సంపాదించుకోకుండా శ్రమ గాని, మానవ సంబంధాల ప్రాథమిక సంస్కృతి గాని, ఒక పౌరునిగా బాధ్యతలు నెరవేర్చడం గాని సాధ్యం కాదు. సంతోషాన్నీ, సరదానీ మాత్రమే తెచ్చిపెట్టే సులభమైన ఆహ్లాదకరమైన ఆటగా చదువు వుండటం అనేది సాధ్యంకాక పోవచ్చును. యువతరపు పౌరుల జీవితాలు పూలపాన్పులు కావు. తమ తండ్రులు, తాతలు, ముత్తాతలు నెగ్గు కొచ్చిన కష్టాల కంటే కూడా సంక్లిష్టమైన కష్టాలని నెగ్గుకురావడానికి సిద్ధపడే ఉన్నత విద్య కలిగిన, పట్టుదల గలిగిన, పనిపట్ల ఆసక్తి

* డే కేర్ గ్రూపులు – (Day-Care Groups) – తక్కువ తరగతుల్లోని విద్యార్థుల గ్రూపులు. పాఠశాల అయిపోయాక భోజనానికి వుండిపోయి హోమ్ వర్క్ చేసుకుని, పనినుంచి యిళ్లకి పోయేటప్పుడు తల్లితండ్రులు తీసుకెళ్లే దాకా అక్కడే వుండి ఆడుకునే పిల్లల గ్రూపులు.

గలిగిన మనుషుల్ని మనం తీర్చిదిద్దాలి. 1970-90ల నాటి యువకుని జ్ఞానస్థాయి గడిచిన దశాబ్దాల యువకుల జ్ఞానస్థాయి కంటే పోలికే లేనంతటి హెచ్చు దశలో వున్నటువంటింది. ఒకడు ప్రావీణ్యం సంపాదించాల్సిన జ్ఞానరంగం యెంత విస్తారమైందైతే అంత యెక్కువగానూ వేగవంతపు పెరుగుదలా, అభివృద్ధీ, వ్యక్తిత్వ నిర్మాణం వుండే బాల్య దశలోని మానవ శరీర స్వభావాన్నీ పరిగణించాలి. వ్యక్తి యెప్పుడూ కూడా, యెప్పటికీ కూడా ప్రకృతి శిశువే. యీ బాంధవ్యాన్ని కలిగించే యేదేనా కాని ఆ మానసిక సాంస్కృతిక సంపదకి అతన్ని చేరువగా చేసేటట్టు ఉపయోగించాల్సిందే. పసివానిని పరివేష్టించి వుండే ప్రపంచం, మొట్టమొదటగా దృగ్గోచరమయే ఆ పరిమిత ఐశ్వర్యం, తరగని సౌందర్యం వున్న ప్రకృతి ప్రపంచం. యిక్కడే, ప్రకృతిలోనే, పసివాని వివేకానికి శాశ్వత ఆధారం వుంది. కాని దీంతోబాటుగా సమాజంతోటీ, శ్రమతోటీ ప్రజల సంబంధాలు ముడిపడి వున్న పరిసరాల అంశాల పాత్ర కూడా ప్రతి యేడూ పెరుగుతూనే వుంది.

చుట్టూతా వున్న వాస్తవికతని బుద్ధితో గ్రహించే క్రమం ఆలోచన తాలూకు ఉద్రేక ప్రేరకానికి ప్రత్యామ్నాయం కాదు. పాఠశాలాత్పూర్వపు వయస్సు పిల్లవానికీ, ప్రాథమిక పాఠశాల పిల్లవానికీ యీ ప్రేరకం చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. అనుభూతుల్ని ప్రభావితం చేసే స్పష్టమైన బొమ్మలతోటి ఆ పిల్లవాణ్ణి ప్రేరేపించినట్లయితే చుట్టూతా వున్న ప్రపంచం తాలూకు వస్తువులమీదా, ప్రకృతిమీదా ఆధారపడి సాధారణీకరించబడిన సత్యం పిల్లవానికి వ్యక్తిగత విశ్వాసం అవుతుంది. మొదటి శాస్త్రీయ సత్యాలని పిల్లవాడు తన చుట్టూతా వుండే ప్రపంచంలో దర్శించాలి. ఆలోచనకి ఆధారం అందమూ, ప్రకృతి విషయాల తరగని సంక్లిష్టతా అని పిల్లవాడు గ్రహించాలి. అతను క్రమేపీ సామాజిక సంబంధాల్లోకీ, శ్రమ ప్రపంచంలోకీ ప్రవేశించడానికి యివి ముఖ్యమైనవి.

పబ్లిష్ స్కూల్లో నా పని ఆరంభమైన నాటినుంచీ నాకు పసిపిల్లలంటే, ముఖ్యంగా మొదటి తరగతుల్లో వాళ్లంటే ఆసక్తి వుండింది. తమ చదువు మొదటి దినాల్లో ఆవేశంతో వణుకుతూ, ఉపాధ్యాయుని కళ్లల్లోకి నిష్కపటంగా తేరిపార చూస్తూ పిల్లలు స్కూల్లోకి వచ్చేవారు! కొద్ది నెలల తర్వాత, ఆ మాటకొస్తే కొన్ని వారాల్లోనే, వాళ్ల కళ్లల్లోని కాంతిపోవడం యెందుకు జరుగుతుంది? కొంతమంది పిల్లలకి చదువు యెందుకంత హింసకావాలి? మరీ ముఖ్యంగా ఉపాధ్యాయులందరూ యీ పసితనపు అమాయకత్వాన్నీ, ప్రపంచపు సంతోషపూర్వక గ్రహణనీ, ఆవిష్కరణనీ మనస్ఫూర్తిగా కావాలనుకుంటున్నప్పుడూ, చదువుని పిల్లలకి ఒక ప్రేరణగా, ఆసక్తికర కర్తవ్యంగా చెయ్యాలను కుంటున్నప్పుడూ అలా యెందుకు జరుగుతుంది.

మొట్టమొదటగా యిది యెల్లవేళలా జరగదు యెందుకంటే, ఉపాధ్యాయునికి పిల్లవాడు స్కూల్లోకి వచ్చేముందు, అతని మానసిక ప్రపంచం యెక్కువగా తెలియదు. పాఠశాలలో జీవితం చదువుకే పరిమితమైపోయి వుంటుంది - పిల్లలందర్నీ సమం

చెయ్యాలన్నట్టు, వ్యక్తిగత ప్రపంచపు సంపదని వెల్లడించడానికి అవకాశం లేకుండా గంటలతో నియమితం అయిపోయి వుంటుంది. పిల్ల ఆసక్తులనీ, బహు విధాలైన మానసిక జీవితాన్నీ యెలా అభివృద్ధి చెయ్యాలో ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులకి నేను సలహా యిచ్చాననుకోండి, కాని సలహాయే సరిపోదు. ముఖ్యమైందేమిటంటే బోధనాభావం. అది ఉపాధ్యాయుల విద్యార్థుల అంతస్సంబంధాల్లో బాహాటపడే సారం గలది, ఉపాధ్యాయుల కళ్లముందు స్కూలులో నిర్మించిన సమగ్రమైన భవనంలా నిలబడే స్పష్టమైన బోధనాభావం. అందుకనే నేను స్కూలు పిల్లలతోటి పదేళ్ల పర్యంతం నిర్వహించే బోధనా కృషిని మొదలుపెట్టాను.

కింద వివరించబోయే ఒక తరగతి విద్యార్థుల జీవితం మిగతా పాఠశాల విద్యార్థులనుంచి కంచెకట్టి వేర్పాటుచేసిలేదు. చాలా సందర్భాల్లో, మొత్తం స్కూలు బోధనా కృషినీ పద్ధతులనీ నేను స్పృశిస్తాను. ఒక తరగతిని యింకా స్పష్టంగా చూపించడానికే నేనీ పద్ధతి చేపడతాను, యెందుకంటే తరగతిలోని బోధనాత్మక కృషే కచ్చితంగా పాఠశాల విద్య విజయవంతం కావడానికి ప్రధాన షరతు అవుతుంది.

# మొదటి సంవత్సరం - పిల్లల్ని గురించి తెలుసుకోవడం

1951 ఆగస్టులో స్కూలు ఆరంభమవడానికి మూడు వారాల ముందుగానే, ఆరు సంవత్సరాల వయసు బాలబాలికల్ని, అంటే ఒక సంవత్సరం తర్వాత స్కూల్‌లో చదువు ఆరంభించేవాళ్లని మొదటి తరగతి వాళ్లతోబాటు యేకకాలమందే రిజిస్టరు చేసుకోవడం జరిగేది. నేను యీ పిల్లలతోటి పదేళ్లు పనిచేయవలసి వుంటుంది.

తల్లిదండ్రుల్నీ పిల్లల్నీ సమావేశపరచి, అధికారికంగా తరగతులు ప్రారంభం కావడానికి ఒక యేడు ముందే పిల్లల్ని స్కూల్‌కి పంపించమని నేను సూచించగానే భిన్నాభిప్రాయాలు వచ్చాయి. నా ఉద్దేశాల్ని కొందరు తల్లిదండ్రులు ఆమోదించారు. సంవత్సరం పొడుగూతా కిండర్‌గార్టెన్ లేకపోవడం కారణంగా (ఆ రోజుల్లో గ్రామాల్లో కిండర్‌గార్టెన్‌లు వేసవిలో మాత్రమే నడిచేవి) పిల్లల్ని స్కూల్‌కి పంపడం కుటుంబాలకి సదుపాయంగా వుంటుందని భావించారు. ప్రాయంరాకుండానే చదువు మొదలెట్టడం పిల్లల ఆరోగ్యానికి చెరుపు చేస్తుందని మిగతా వాళ్లు భయపడ్డారు. "వాళ్లకి తరగతిలో కూర్చోడానికి బోలెడంత వ్యవధి వుంది. వాళ్లకున్న నిజమైన బాల్యమంతా స్కూలు మొదలవకముందే" అంది ల్యూబా తల్లి. పిల్లలు స్కూలు ఆరంభిస్తే వాళ్ల జీవితక్రమంలో యెంత హఠాత్తైన గండి యేర్పడుతుందో, పిల్లలకి సహజ శక్తిని అభివృద్ధి చేసుకోవడానికి తగినంత అవకాశం యివ్వడం యెంత ముఖ్యమోనని నేను అప్పుడు ఆలోచించాను. పాఠాలు ప్రారంభించడానికి ఒక యేడు

ముందే స్కూల్‌కి రావడమంటే క్లాస్‌రూమ్‌లో కూర్చోవడం కాదని నేను వాళ్లకి చెప్పాను.

పిల్లలు చదువు ఆరంభించే ముందే ప్రతి పిల్లవాణ్ణి గురించి బాగా తెలుసుకోవడానికీ, గ్రహించడంలో, ఆలోచనల్లో, బుద్ధి పనిచెయ్యడంలో అతని వ్యక్తిగత లక్షణాలు అధ్యయనం చెయ్యడానికీ నాకీ సంవత్సరం అవసరం. జ్ఞానాన్ని అందించే ముందు పిల్లవాళ్లకి ఆలోచించడం, గ్రహించడం, పరిశీలించడం నేర్పాలి. ప్రతి పిల్లవాడి ఆరోగ్యస్థితి గురించీ క్షుణ్ణంగా తెలుసుకుని వుండాలి – యిది లేకుండా మామూలుగా బోధించడం అసాధ్యం.

మేధాపరంగా పెంపొందించడం జ్ఞాన సముపార్జన లాంటిదే గాదు. సూర్యరశ్మి లేకుండా ఆకులు పచ్చగా వుండలేనట్లే బోధన లేకుండా యిది అసాధ్యం. అయినా మానసిక శిక్షణని బోధనతోటి అవినాభావంగా చెయ్యడమనేది హరితపత్రాల్ని సూర్యరశ్మితో అవినాభావంగా చెయ్యడం వంటిదే.

ఉపాధ్యాయుడు ఆలోచనా పదార్థంతోటి వ్యవహరిస్తాడు. దాన్ని గ్రహించే శక్తి, గుర్తించే శక్తి చాలా మట్టుకి విద్యార్థి ఆరోగ్యంమీద ఆధారపడి వుంటుంది. యీ రెండింటి సంబంధం చాలా సున్నితమైందీ, గుర్తించడానికి కష్టమైందీ. పిల్లల ఆంతరిక మానసిక ప్రపంచాన్ని, ముఖ్యంగా వాళ్ల ఆలోచనల్ని, అధ్యయనం చెయ్యడం ఉపాధ్యాయుని అతిముఖ్య అభ్యాసాల్లో ఒకటి.

# మా విద్యార్థుల తల్లిదండ్రులు

పిల్లల్ని గురించి బాగా తెలుసుకోవడానికి వాళ్ల కుటుంబాలని యెరిగివుండాలి – తల్లి, తండ్రి, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లూ, తాతలూ, మామ్మలూ అందరినీ. మా స్కూల్ పరిసరాల్లో ముప్పై వొక్క మంది ఆరు సంవత్సరాల వయసు పిల్లలు – పదహారు మంది మగపిల్లలూ, పదిహేను మంది ఆడపిల్లలూ – వుండేవాళ్లు. అందరు తల్లిదండ్రులూ మా "సంతోష చంద్రశాల"కి తమ పిల్లల్ని పంపడానికి ఒప్పుకున్నారు. మా పాఠశాలాత్పూర్వపు గ్రూపుని కొద్ది కాలంలోనే అలా పిలిచేవాళ్లు. యీ ముప్పై వొక్క మందిలోనూ పదకొండు మందికి తండ్రుల్లేరు, యిద్దరికి తల్లీ తండ్రీ యిద్దరూ లేరు. వీత్య, సాష అనే యీ యిద్దరు అబ్బాయిల దుర్దశలూ విచారకరమైనవి. మహా దేశభక్తియుత యుద్ధంలో గెరిల్లా దళంలో వీత్య తండ్రి పోరాడాడు. ఫాసిస్టులు అతన్ని అతని భార్య కళ్లముందే క్రూరంగా హింసించి చంపారు. వీత్య తల్లి ఆ శోకం తట్టుకోలేక పిచ్చిదైపోయింది. యీ దుర్ఘటన తర్వాత ఆర్నెల్లకి యీ పిల్లవాడు పుట్టాడు. కాన్పు అవగానే తల్లి చచ్చిపోయింది, అతి కష్టంమీద పిల్లవాణ్ణి రక్షించారు. సాష తండ్రి యుద్ధరంగంలోనే చనిపోయాడు, ఫాసిస్టు దురాక్రమణదారుల్ని గ్రామంలోనుంచి తరిమేసే పోరాటంలో అతని తల్లి చనిపోయింది.

"సంతోష చంద్రశాల" ప్రారంభించే ముందు ఆఖరి కొద్ది వారాల్లోనూ నేను ప్రతి కుటుంబాన్ని గురించీ తెలుసుకున్నాను. కొన్ని కుటుంబాల్లో తల్లిదండ్రులకీ పిల్లలకీ మధ్యనా, తండ్రికీ తల్లికీ మధ్యనా స్నేహపూర్వక వాతావరణం, అన్యోన్యత లేవన్న సంగతి నన్ను కలతబెట్టింది. అవి లేకపోతే పిల్లవానికి ఆనందమయ జీవితం అసాధ్యమవుతుంది.

యిదిగో నల్లకళ్ల, తమాల వర్ణపు, చప్పిడి ముక్కు కోల్య. అతను జాగ్రత్త అయిన వాలకంతో వున్నాడు. నేను అతన్ని చూసి నవ్వాను, మరీ అతను ముఖం చిట్లించుకున్నాడు. అతని విపరీత కుటుంబ స్థితి గుర్తువచ్చింది. నాజీలతో యుద్ధానికి ముందు కోల్య తండ్రి ఖైదులో వున్నాడు. అతని కుటుంబం దోన్‌బాస్ ప్రాంతంలో వుండేది. ఫాసిస్టు ఆక్రమణప్పుడు తండ్రి కైదు వదిలిపెట్టి వెళ్లిపోయాడు, ఆ కుటుంబం మా గ్రామంలో నివసించడానికి వచ్చింది. అతని తల్లీ, తండ్రీ ప్రజల దుఃఖాన్ని సొమ్ముచేసుకునేవారు: ఫాసిస్టు బంట్రోతులైన పోలీసులు కాజేసిన వస్తువులని దాస్తూ వాళ్లు లాభం పొందారు. ఆ కష్ట కాలంలో అతని తల్లి సమష్టి వ్యవసాయ క్షేత్రపు కోళ్ల గృహాలనుంచి కోళ్లని కాజేసి, తింటానికి కాకుల్ని పట్టమని కోల్యతోటీ అతని అన్నతోటీ చెప్పేది. ఆ పిల్లలు కాకుల్ని పట్టేవాళ్లు, తల్లి వాటిని వేయించి, బజార్లో కోళ్లు అని చెప్పి అమ్మేసేది... ఆ కుర్రవాడు నవ్వుతాడేమోనని చూశాను, కాని అతని కళ్లల్లో కలుపుగోలుతనం లేకపోవడమూ, భయమూ కనిపించాయి. మనుషులపట్ల అసూయ, అసహ్యమూ వున్న విపరీత వాతావరణంలో పెరిగావు నువ్వు. దాన్ని నయం చేసే దయాపూరిత మానవ అనుభూతులు నీ హృదయంలో యెలా తట్టి లేపగలను? అతని తల్లి శూన్య, నిర్లక్ష్య నేత్రాలు చూసి కలత చెందాను.

యీ పుస్తకంలో యిలాంటి వివరాలు యిచ్చే ముందు చాలా ఆలోచించాను. ఒకటికి పదిసార్లు కొట్టేశాను. అప్పుడు మళ్ళీ ఉంచేశాను. సామాన్య లక్షణాలకే నేను పరిమితమై వుండగలను: తల్లీ తండ్రీ పిల్లవాడి నైతిక ధర్మానికి ఆదర్శాలు కారు... కాని అది విషయాన్ని సాపు చేసెయ్యడం అవుతుంది. అలా చేస్తే మేలుగా ఉండదు. మన చుట్టూతా యింకా వున్న చెడుపట్ల, అసహ్యకరమైన వాటిపట్ల మనం గుడ్డిగా వుండకూడదు. వాటిని స్కూల్‌నుంచి యే రాతిగోడా రక్షించలేదు. యీ చెడుతో పోరాడ్డానికి, పాత ప్రపంచంనుంచి పసివాళ్లకి సంక్రమించిన కుళ్లు కడిగెయ్యడానికి, మనం ధైర్యంగా సత్యాన్ని ముఖాముఖీ చూడాలి.

పీచుతలా, చిక్కిన వొళ్ళూ, నీలం కళ్లూ వున్న తోల్య యిదుగో. తల్లి చెయ్యి పట్టుకుని నేలకేసి చూస్తూ, మధ్య మధ్య పైకి చూస్తూ ఆమె పక్కనే నుంచున్నాడు. కార్పేథియన్స్‌లో అతని తండ్రి వీరమరణం పొందాడు. అతని మరణానంతరం పతకాలెన్నిటినో తోల్య తల్లికి పంపించారు. తోల్యకి తండ్రంటే గర్వం, కాని అతని తల్లికి వూళ్లో చెడ్డ పేరు వుంది: దుర్నడత వున్న బతుకు, పిల్లవాణ్ణి వాడి మానాన వాణ్ణి వదిలేసింది. యీ ఆరు సంవత్సరాల వయసు బాలుడి మనస్సు

గాయపడకుండా కాపాడ్డానికి యేం చెయ్యగలం? తల్లికి కళ్లు తెరిపించి, తను పిల్లవాడిపట్ల శ్రద్ధపట్టేటట్టు చేయడానికి యే మార్గం అనుసరించాలి?

నాజీలతో సోవియట్ ప్రజల యుద్ధం (1941-45) నాటి మాయని మచ్చలు, మానని గాయాలూ యింకా వున్నాయి. నా ముందు 1945లో పుట్టిన పిల్లలు వున్నారు, చాలామంది 1944లో పుట్టారు. తాము పుట్టక ముందే తండ్రుల్ని పోగొట్టుకున్న వాళ్లు కొద్దిమంది వున్నారు. ఉదాహరణకి యూర, యుద్ధం ముగిసే కొద్ది రోజుల ముందు అతని తండ్రి హతుడయాడు. తల్లి అతన్ని వెర్రిగా ప్రేమించేది, అతని ప్రతి కోరికనీ తీరుస్తూ వుండే ప్రయత్నం చేసేది. అతని తాత కూడా వాళ్లతోటే వుండేవాడు, కుర్రవాడికోసం యేమైనా చేసేవాడు. ఆ ఆరేళ్ల కుర్రవాడు ఒక చిన్న నియంతలా తయారవవచ్చునని నేను అనుకున్నాను. తల్లి వెర్రిప్రేమ నిర్లక్ష్యమంతటి ప్రమాదమైందీనూ.

పేత్రిక్ తల్లితోటీ, తాతతోటీ వచ్చాడు. ఆ పసివాని తల్లి కష్టభూయిష్ఠ జీవితాన్ని గురించి చాలా విన్నాను. ఆమె మొదటి భర్త యుద్ధానికి ముందే ఆమెని వదిలేశాడు. ఆమె మళ్లీ పెళ్లిచేసుకొంది. కాని ఆ కలయిక సజావుగా లేదు: పేత్రిక్ తండ్రికి సైబీరియాలో యెక్కడో ముందే ఒక సంసారం వుందని బయటపడింది, అంచేత అతను యుద్ధం తర్వాత వెళ్లిపోయాడు. తండ్రి యుద్ధంలో మరణించాడని ఆ కుర్రవాడికి ఆమె చెప్పింది. దాంతోటి ఆ కుర్రవాడు తోటి పిల్లలకి తండ్రికి సంబంధించిన కల్పిత వీరకృత్యాలు చెబుతూ వుండేవాడు, కాని వాళ్లు అతన్ని నమ్మలేదు. అతని తండ్రి అబద్ధాలకోరు అని వాళ్లు అన్నారు. పేత్రిక్ యేడుస్తూ తల్లిదగ్గరికి పరిగెత్తేవాడు. కాని నిర్దయులైన మనుషులు ఆ పసిహృదయంలో పగ, అపనమ్మకం నాటారు. యీ కుర్రవాడు మంచితనంలో విశ్వాసం పెంచుకోడానికి యేం చెయ్యాలి?

కోస్త్యకి అప్పుడే యేడేళ్లు. కాని యింకా స్కూల్ ఆరంభించలేదు. అతని తండ్రీ, మారుటి తల్లీ, తాతా అతన్ని స్కూల్‌కి తీసుకువచ్చారు. ఆ పిల్లవాడు కూడా యుద్ధ విషాదాలవల్ల చలించిపోయాడు. ఫాసిస్టు దురాక్రమణదారులనుంచి ఆ గ్రామం విముక్తమైన కొన్ని వారాలకి, యే క్షణంలోనేనా కాన్పు వచ్చేటట్టున్న కోస్త్య గర్భిణీ తల్లి యెన్నో లోహపు వస్తువులు చూసి తన ఏడేళ్ల పెద్ద కొడుక్కి వాటిని ఆడుకోడానికని యిచ్చింది. వాటిల్లో గని తాలూకు పేల్చేవత్తి ఒకటుంది. ఆ వత్తి పేలింది, ఆమె కొడుకు చనిపోయాడు. తల్లి ఉరితీసుకోబోయింది. కాని కొంతమంది అదునుకి వచ్చి ఆమెని ఆ పాశంనుంచి లాగారు. ఆమె మృత్యువేదనలో కోస్త్య పుట్టాడు. ఆ పిల్లవాడు యేదో అద్భుతంవల్ల బతికి బయటపడ్డాడు. ఒక పొరుగావిడ తన పసిబిడ్డతో బాటుగా అతనికి చనుబాలిచ్చింది. అతని తండ్రి యుద్ధరంగంనుంచి తిరిగివచ్చాడు. అతను పిల్లవాణ్ణి కాపాడి, పోషించి అతనిమీద వెర్రివ్యామోహం పెంచుకున్నాడు. మంచి మనిషైన అతని మారుటి తల్లీ, అతని తాతా కూడా ఆ కుర్రవాణ్ణి అభిమానించారు. కాని కోస్త్యకి అయిదేళ్లప్పుడు యింకో ఉపద్రవం

సంభవించింది: కూరలతోటలో యేదో మెరిసే వస్తువుని చూసి, దాన్ని దేంతోటో కొట్టడం మొదలెట్టాడు. అది పేలింది. ఆ రక్తసిక్తమైన బాలుణ్ణి ఆస్పత్రికి తీసుకెళ్లారు. కోస్త్య అంగవికలుడుగానే వుండిపోయాడు. పాపం అతనికి జీవితాంతం యెడమ చెయ్యీ, కన్నూ వుండవు. ఆ మందుగుండు ముదురునీలం రేణువులు అతని ముఖాన్ని మచ్చల మయం చేసేశాయంతే.

నువ్వు ఆనందపూరిత వ్యక్తిగా తయారవాలంటే నీకెంత ఆత్మీయతా, లాలనా యివ్వాలి? మీ నాయనతోటి, మంచి మారుటి తల్లితోటి, మీ తాతతోటి వాళ్ల ప్రేమ వివేకంగా, కావాల్సినట్టుగా తయారయేటందుకు యెలా మాట్లాడాలి? నువ్వు యెలా చదువుకోగలవు? నీకు తలనొప్పి వస్తూ వుంటుందని మీ కుటుంబంవాళ్లు అంటున్నారు. నీ చదువు సులభతరం చేయడం యెలా? నీ ఆరోగ్యం మెరుగుపరచడం యెలా? నీ చింతాకులిత కవళికని యెలా చెదరగొట్టాలి? మీ నాయన అంటాడు ఒక్కొక్కప్పుడు నువ్వొక్కడూ వెళ్లిపోయి యేడుస్తావట. నీ తోటి పిల్లల ఆటలు నీకు ఆసక్తి కలిగించవట...

విచారగ్రస్తమైన, బూడిరంగు కళ్ల స్లావ తల్లి పక్కన కూర్చున్నాడు. ఒంటరి స్త్రీలు భరించే కష్ట జీవితం ఆమెది. ఆమెకి దగ్గర దగ్గర యాభై యేళ్లుంటాయి. ఆమె వయసులో వున్నప్పుడు ఆనందాన్ని గురించి కలలు కంది. కాని ఆమె అందమైంది కాకపోవడంతోటి యెవరూ పెళ్లాడారు కాదు. ఆమె యవ్వనం గడిచిపోయింది, ఆమెకి వ్యక్తిగత ఆనందం లేకపోయింది. అప్పుడు ఆమెకి మళ్లేనే ఒంటరిగాడు ఒకతను, యుద్ధం తర్వాత మచ్చలతోటి తిరిగివచ్చాడు. ఆమెని అతను ప్రేమించాడు. వాళ్లు పెళ్లిచేసుకున్నారు. కాని వాళ్ల ఆనందం త్వరలోనే ముగిసింది, యెందుకంటే ఆమె భర్త కొద్ది రోజుల్లోనే చనిపోయాడు. ఆమె తన మనసంతా కొడుకుమీదే పెట్టుకుంది. కాని అతన్ని సరిగా పెంచలేదు. స్లావకి మనుషులంటే యిష్టం లేదనీ, రోజుల తరబడి యింటిదగ్గరే కూర్చుంటాడనీ, యేదేనా పనిచెయ్యమని చెబితే అలా తేరిపార చూస్తూ వుంటాడనీ వాళ్లు అంటారు. నేను యిప్పుడు అతని కళ్లల్లోకి చూస్తున్నప్పుడు కూడా, అవి కరిచేటట్టూ, జాగ్రత్తతో వున్నట్టూ వుంటాయి.

నా భవిష్యత్ విద్యార్థుల గురించి నేను బాగా తెలుసుకొనే కొద్దీ వాళ్లు యిళ్లదగ్గర కోల్పోయిన బాల్యాన్ని వాళ్లకి తిరిగి యివ్వడమే నా ప్రధాన కర్తవ్యాల్లో ఒకటని నాకు నమ్మకం యేర్పడింది.

స్కూల్లో మూడేళ్ల పని కాలంలో అలాంటి పిల్లల్ని దజన్ల కొద్దీ యెరుగుదును. పిల్లవానికి ధర్మంపట్లా, మంచిపట్లా విశ్వాసం తిరిగి కల్పించలేకపోతే, ఆ పిల్లవాడు తను వొక వ్యక్తినని యెన్నటికీ అనుకోలేడనీ, అతను ఆత్మగౌరవ భావన యెన్నటికీ పొందలేడనీ జీవితం చూపిస్తోంది. అలాంటి పిల్లవాడు యెదిగేటప్పుడు వైషమ్యపూరితంగా వుంటాడు, అతనికి జీవితంలో యేదీ పవిత్రం కాదు. ఉపాధ్యాయుని మాటలు అతని హృదయానికి అందవు.

అలాంటి పిల్లవాని హృదయానికి స్వాస్థ్యం చేకూర్చడం ఉపాధ్యాయుని కష్టతమమైన పనుల్లో ఒకటి. యీ అతిసున్నితమైన, అతి శ్రమాన్వితమైన పని యేమిటంటే, బోధనలోని ముఖ్యమైన పరీక్ష యేమిటంటే పిల్లలకి వ్యక్తిగా తయారయే కళ నేర్పడం. యీ కళని బోధించడం అంటే పిల్లవాడు మంచీ, చెడూ గురించి తెలుసుకోవడమే కాదు, పసివాని సున్నిత హృదయాన్ని చెడునుంచి రక్షించడం కూడా.

నల్లని, గోధుమవర్ణపు, భిన్న నీలినీడలున్న పిల్లల కళ్లల్లోకి చూస్తూ వుంటే, వాళ్లని ఆత్మీయంగా చేసేందుకు తగ్గ మంచితనం, దయ నా దగ్గర వున్నాయా అనిపించింది. క్రూప్స్కయా మాటలు నాకు గుర్తుకు వచ్చాయి: "ఒక పిల్లవానికి ఒక భావం వ్యక్తినుంచి విడదీయలేనిది. ప్రియమైన ఉపాధ్యాయుని మాటలు పరాయి, పగవాని మాటలకంటే పూర్తి భిన్నంగా గ్రహిస్తాడు."* నేను నోటితోటీ, వ్యక్తిగత ఆదర్శంతోటీ బోధిస్తాను. పిల్లలు నా మాటల్లోనూ, చేతల్లోనూ మంచీ, అందం, సత్యం చూడాలి. ఆత్మీయత, ఆప్యాయత, దయ నా ప్రతి మాట వెనకా వుండాలి.

గాల్యాని ఆమె తండ్రి తీసుకువచ్చాడు. ఆమె, ఆమె చిన్న చెల్లెలు చాలా విచారాన్ని అనుభవించారు: వాళ్ల అమ్మ చనిపోయింది. ఒక సంవత్సరం తర్వాత తండ్రి మళ్లీ పెళ్లిచేసుకున్నాడు. పరాయి ఆవిడ, కాని దయ, నిజాయితీ, సానుభూతి వున్నావిడ వాళ్లింట్లోకి ప్రవేశించింది. ఆమె యీ చిన్ని పిల్లల హృదయాలు చూరగొనాలని ప్రయత్నించింది; వాళ్లు తనపట్ల అభిమానాన్ని పెంచుకుంటారని ఆశిస్తూ ఆమె వాళ్ల అనుభూతులపట్ల శ్రద్ధ వహించేది. వారాలు, నెలలు గడిచాయి, కాని గాల్యా, ఆమె చెల్లెలూ తమ మారుటి తల్లితోటి మాట్లాడను కూడాలేదు. వాళ్లు ఆమెనసలు గుర్తించనట్టు వున్నారు. ఆమె యేడ్చింది, భర్తనీ, బంధువుల్నీ సలహా అడిగింది – తను యేం చెయ్యాలి? ఆమె అసలు వెళ్లిపోదామని కూడా అనుకుంది, కాని ఆమెకి బిడ్డ పుట్టింది. ఆ బిడ్డవల్లనేనా ఆ చిన్న బాలికల హృదయాలు ఆత్మీయంగా తయారవుతాయేమోని ఆమె ఆశించింది, కాని ఆమె కోరిక నెరవేర లేదు. ఆ పిల్లలు, ముఖ్యంగా గాల్యా, తమ చిట్టి తమ్ముడి కేసి చూడను కూడా చూళ్లేదు. ఆమె గర్విష్ఠి హృదయాన్ని యెలా కదిలించాలి? ఆ తల్లికీ తండ్రికీ యేం సలహా యివ్వాలి? అదీ ఆ తండ్రి నావద్దకి వచ్చి మనసులో వున్న గోడంతా వెళ్లబోసుకున్నాక? నేను గాల్యాని గురించి బాగా యెరిగాక మాత్రమే యేం చెయ్యాల్సిందీ సలహా యివ్వగలనని చెప్పాను.

బొద్దుగా, బూడిదరంగు కళ్లతోటి, చిరునవ్వు నవ్వే లరీసా పువ్వు చేత్తో పట్టుకుని తల్లిపక్క కూర్చుంది. ఆమె తల్లి హృదయం శోకంతో భారంగా వుందని నాకు తెలుసు. ఆమె భర్త ఆమెని వదిలేశాడు, ఆ చిన్నపిల్ల తండ్రిని యెరుగదు. కాని

---

* ఎన్. కె. క్రూప్స్కయా "ఉపాధ్యాయుని గురించి." మాస్కో, ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్. అకాడెమీ ఆఫ్ పెడగోజికల్ సైన్సెస్, పేజీలు 143-44 (రష్యన్‌లో).

"నాన్న యింటికి వస్తారు" అని తల్లి ఆమెకి చెప్పింది. దరిమిలా ఆమె ఓ మంచి అతన్ని పెళ్లిచేసుకుని అతనే తన తండ్రి అని ఆ చిన్న పిల్లకి నమ్మకం కలిగించాలని ప్రయత్నించింది. లరీసా అతన్ని అభిమానించింది. కాని తల్లి మాత్రం ఎవరేనా పొరపాటు మాట జారితే తన అబద్ధం యెక్కడ పొక్కిపోతుందో నన్న భయంతో వుండేది. ఆ చిన్నపిల్ల ఆనందంగానే వుండేది. కాని ఆమె హృదయాన్ని మాత్రం కరకు మాటల మోటు గాయం తగలకుండా వెయ్యి కళ్లతో చూస్తూ వుండాల్సి వచ్చేది. ఆమె మంచి తల్లిదండ్రుల సాయంతోటి యిది చెయ్యగలమా? అతను ఆ పిల్ల అసలు తండ్రి కాదు. కాని ప్రతిపిల్ల అసలు తండ్రీ యీ పిల్ల మారుటి తండ్రంత మంచివాడైతే! ఆ మనిషిని గురించి నేను తెలుసుకునే కొద్దీ పిల్లని యెవరు పెంచుతారో అతనే నిజమైన తండ్రి అని నాకు నమ్మకం ఏర్పడింది. యీ కుటుంబాన్ని తరచుగా సందర్శించేవాణ్ణి. చిత్రమైన ఒక విషయం ఆశ్చర్యం కలిగించింది: ఆ చిన్నపిల్ల కళ్లు, ఆమె మారుటి తండ్రి కళ్లలాగ, అదే దయ, మంచితనం, సానుభూతితో వుండేవి. అందంపట్ల ఆ పిల్ల కళ్లు తండ్రి కళ్లల్లాగే ఉత్సాహం, ఆశ్చర్యం వ్యక్తం చేసేవి. ఆమె చేష్టలేమి, ఆశ్చర్యం, చురుకు, కరుకుతనం తెలియజేసే భంగిమయేమి, అంతా లరీసా అతన్నుంచి పుణికి పుచ్చుకుంది.

ఫేద్య.... అతనికీ తండ్రి లేదు. అతనప్పటికే తల్లి ప్రవర్తన అంత సజావైందని కాదన్న సూటీపోటీ మాటలు విన్నాడు. అతని పసి హృదయం కల్లోలమైపోయింది: తన తల్లిని గురించి అలాంటి మాటలు యెలా నిజం, తన తండ్రి యుద్ధంలో నేలకొరిగాడని ఆమె చెప్పింది కదా? ఫేద్య తల్లిని యుద్ధానికి ముందు యెప్పట్నుంచో నేను ఎరుగుదును. యుద్ధకాలంలో ఆమె జీవితం బాధాకరమైన మలుపు తిరిగింది. యిలాంటి హింసించే సమస్యలు అతన్ని వేధించకుండా వుండేందుకు, అతన్ని మానవ సంబంధాల సంక్లిష్ట ప్రపంచంలోకి యెలా నడిపించగలం?

చిన్న పిల్లలకి ప్రపంచం గురించిన జ్ఞానం వ్యక్తి గురించిన జ్ఞానంతో మొదలవుతుందని మనం, బోధకులం, తరచుగా మర్చిపోతూ వుంటాం. తన తండ్రి తల్లితో మాట్లాడే కంఠస్వరాన్నిబట్టి, అతని భంగిమలనిబట్టి కదలికల్నిబట్టి పిల్లవాడికి మంచీ చెడూ విశద మవుతాయి. పనినుంచి తండ్రి చిరచిరలాడుతూ మూతిముడుచుకుని యింటికొచ్చినప్పుడు, అతన్ని సంతుష్టి పరచడంకోసం తల్లి శాయశక్తులా ప్రయత్నిస్తూ వుంటే తోటలోని మారుమూలకెళ్లి పోయి యేడ్చే ఒక పసిబాలికని నేను యెరుగుదును. ఆ పిల్ల హృదయం తండ్రిపట్ల కోపంతో కుతకుతలాడిపోయేది, తల్లిపట్ల సానుభూతితో నిండిపోయేది....

పిల్లవాడు గుర్తెరిగే మొట్టమొదటి ఉపరితల మానవ సంబంధాలు మాత్రమే యివి. కాని తాము ఒకళ్లనొకళ్లు ప్రేమించుకోవటం లేదనీ, పిల్లకోసం కాకపోయినట్లైతే విడాకులుపుచ్చుకుని వుండేవాళ్లమనీ ఒక్క అజాగ్రత్త పలుకు తల్లిదండ్రులనుంచి వచ్చి చెవినపడితే పిల్లవాని హృదయంలో యేం జరుగుతుంది?

నీనా, సాషాలు కవల సోదరులు. వాళ్ల నాయన వాళ్లని స్కూల్‌కి తీసుకువచ్చాడు. చాలామంది సభ్యులున్న యీ కుటుంబానికి (నీనా, సాషాలు కాకుండా యింకా నలుగురున్నారు) దాని గొడవలు దాని కున్నాయి.

వాళ్ల అమ్మ యెన్నో యేళ్లుగా మంచాన పడివుంది. పెద్దక్కలే యింటి పని చేసేవాళ్లు. యిల్లు సంతరించుకోవడం ఆ తండ్రికి చాలా కష్టంగా వుండేది. నీనాకీ, సాషాకీ పని అంటే యేమిటో అప్పటికే తెలుసు. పాపం వాళ్ల యిల్లు సంతోషం యెరగదు. ఆ ఆడ పిల్లలు ఒక కుర్రవాడి చేతిలో ఆకుపచ్చ రబ్బరు బంతిని చూడగానే వాళ్ల కళ్లు సంతోషంతో మెరిశాయి, కాని అంతట్లోకే ఆ సంతోషం కాస్తా గాఢమైన విచారంలో మాయమైపోయింది. దానికి నా హృదయం ఆక్రోశించింది. యీ పిల్లలకి తళతళలాడే సౌమ్యమైన బాల్యపు సంతోషం యెలా యివ్వగలం? నేనా పని చెయ్యగలనా? వాళ్లు ఒక గంటకి మించి స్కూల్‌కి రాలేరనీ, యింటిదగ్గర పనికి సాయం వుండాలనీ వాళ్ల నాయన నా కప్పటికే చెప్పాడు.

పొద్దుగ్గా దట్టంగా వున్న పియర్ చెట్టు నీడలో పచ్చికమీద కూర్చున్నాం మేము. పిల్లలను తీర్చిదిద్దడం అంటే యెలా వుండాలి అని నేననుకుంటున్నదీ ఆ తల్లిదండ్రులకి చెప్పాను. పిల్లల ముందు చెప్పదగ్గవేమిటో అవి చెప్పాను. కాని ప్రతి కుటుంబంలో వున్న యిబ్బందులూ, బాధలూ నేను బయటపెట్టలేదు. ప్రతి మనిషికీ కష్టాలుంటాయి. కాని వాటిని లోకానికి యెత్తి చూపించి, మిగతా వాళ్ల ముందు ఆ వ్యక్తికి సలహా యివ్వడం అతన్ని కించపరచడం అవుతుంది. అతను సిగ్గుపడేదాన్ని నలుగురి ముందూ వెల్లడి చెయ్యడం అవుతుంది. నాకిదంతా తెలుసు, కాని అందరు తల్లిదండ్రులకీ దాన్ని గురించి చెప్పడం తప్పు. తల్లిదండ్రుల హృదయ కుహరాల్లోకి పోవడం అవసరం అయితే, అది యేకాంత సంభాషణలో, ప్రతీ మాటా ఒకటికి పది సార్లు తూచి, జరగాలి. నేను చెప్పే తల్లిదండ్రుల (నా విద్యార్థుల తల్లిదండ్రుల్లో అత్యధికులు మంచివాళ్లు) గాయపడిన హృదయాలు, దోషాలు, శోకాలు, చింతలు వ్యక్తిగతమైనవి. అందుకని వాటిని గురించిన ఉమ్మడి సంభాషణ అసాధ్యం. మనుషుల్లోని మంచీ చెడూల మిశ్రమం నా కళ్ల ముందు విశదం అయినప్పుడు యే తల్లిదండ్రులూ ఉద్దేశ్యపూర్వకంగా పిల్లలకి చెడునడత చూపించరని నేను గుర్తించాను.

యింతకీ నేను ఒక పిల్లల సముదాయం గురించే మాట్లాడినప్పుడు నేను యెక్కువ శోకాన్నీ, కష్టాన్నీ చూపించానేమో అని కొందరు అనుకోవచ్చు. యివన్నీ కూడా యుద్ధపు గాయాలన్న విషయం మనం మరిచిపోకూడదు. యుద్ధం తర్వాతి మొదటి సంవత్సరాలు చాలా కాలంక్రితమే గడిచిపోయాయి. ఆ రోజుల్లో తీవ్రంగా గాయపడిన హృదయాలు మానుపట్టాయి; 1944–1945 విజయవందన కాంతిలో ఆరంభ పాఠాలు చదువుకున్న వాళ్లు యెదిగి పెద్దవాళ్లయి తామే తల్లులూ, తండ్రులూ అయ్యారు. యుద్ధం తర్వాత మొదటి సంవత్సరాల్లో స్కూలు చదువు ప్రారంభించిన వాళ్ల పిల్లలు యెప్పుడో స్కూల్లో ప్రవేశించారు, వాళ్లల్లో కొంతమంది

యౌవనప్రాయంవాళ్లు కూడా అయారు. యీనాటి కొత్త కాపరాలు ఆనందంతో ప్రకాశించాలి అనిపిస్తుంది, కాని జీవితం అలా వుండదు కదా. యిప్పటికీ్కూడా శోకం, దుఃఖం, విషాదం వున్నాయి... ఆ ముందటి సంవత్సరాలలో యిది సహజమే. ఆనాటి తల్లిదండ్రుల్లో అత్యధికులు శాంతిగా, అన్యోన్య సంసార జీవితం గడిపినవాళ్లు. వాళ్లన్నట్టు, తమ పిల్లల్ని బాగా పెంచారు.

ఉదాహరణకి దృఢమైన యేదేళ్ల వాన్య తండ్రిని తీసుకోండి. అతను శ్రమించి పనిచేసేవాడూ, అగ్రానమిస్టూనూ. నేలని గాఢంగా అభిమానించి, పరుల మేలుకోసం పాటుపడేవాడు. ప్రతి సంవత్సరం దజన్ల కొద్దీ యాపిల్ మొక్కల్నీ, చిన్న ద్రాక్ష తీగల్నీ తన తోట భాగంలో పెంచి, వాటిని యిచ్చేవాడు. పట్టు పెంపక పరిశ్రమలో అతని భార్య ఒక విభాగపు ముఖ్యురాలిగా వుండేది. ఆమెకి తన వృత్తిలో నైపుణ్యం వుంది. దయగా, బాధ్యతగా, ఆత్మీయంగా వుండే జాగ్రత్త అయిన తల్లి. 1933-34 గడ్డు రోజుల్లో ఆమె నలుగురు అనాథులని చేరదీసి వాళ్లను మాడి చచ్చిపోకుండా కాపాడింది. తన సొంత పిల్లల్లాగానే వాళ్లని పెంచింది, వాళ్లామెను "అమ్మా" అని పిలిచేవాళ్లు.

నల్లటి పెద్ద జడలున్న చిన్న పిల్ల ల్యూస్యాకి నిజాయితీపరుడూ, సత్యసంధుడూ అయిన తండ్రి వుండేవాడు. మణిపూసల్లాంటి వాళ్లు వున్నారు. వాళ్లల్లో అత్యధికులు మహత్తర కార్యాలేం చెయ్యరు. వాళ్ల ఆత్మ సౌందర్యమంతా తోటివాళ్లతో వాళ్లకుండే సంబంధాల్లోనే వుంది. ల్యూస్యా తండ్రి ఆమెకి నువ్వు బాధ్యతగా సానుభూతిగా వుండాలి అని యెన్నడూ చెప్పివుండడు. అతను తన వ్యక్తిగత ప్రవర్తనతోటీ, భార్యతోటి తన సంబంధాలద్వారానూ తన పిల్లలకి సానుభూతి, మానవత్వం నేర్పాడు. ల్యూస్యా తల్లి హృద్రోగి. ఆమె సమష్టి క్షేత్రంలో బీటుదుంపల తోటలో పనిచేసేది. తండ్రి తనే మొత్తం యింటి బాధ్యత మోసేవాడు.

కాత్యా తల్లీ తండ్రీ తమ పళ్లతోటని పిల్లలకి ఒక క్లబ్బులా తయారుచేశారు. వాళ్ల నలుగురు పిల్లలూ యిరుగుపొరుగు వాళ్ల పిల్లలూ వసంతరుతువు ఆరంభమైన నాటినుంచీ, ఆకురాలు కాలం బాగా గడిచేదాకా ఆ తోటలో గంతులేసి ఆడుకుంటూ వుండేవాళ్లు. ఆ పిల్లలకి ఒక చిన్న ఆట స్థలం కూడా తయారుచేశాడు కాత్యా తండ్రి. ఆ తోటలోని రుచికరమైన పళ్లన్నీ ఆ పిల్లల్ని యేరుకోనిచ్చేవాళ్లు.

ముదురు నీలం సాలోచన నేత్రాలున్న సాన్యా తల్లిదండ్రులు దయ, ఆత్మీయతగలవాళ్లు. ప్రతి వేసవిలోనూ ఆమె తండ్రి మేనకోడళ్లు ముగ్గురు పట్టణంనుంచి వాళ్లతో గడపడానికి వచ్చేవాళ్లు. సాన్యా వాళ్ల రాకకోసం తహతహలాడిపోయేది. ఆమె తండ్రి వాళ్లు యీతలు కొట్టుకోడానికని కోనేటి అంచున ఒక చిన్న జాగా తయారుచేశాడు. ఇప్పుడు ఒక మోటారు బోటు తయారుచేస్తున్నాడు. అంచేత పిల్లలకి యింకా సంతోషం కలిగిస్తాడు.

లీదియాది మంచి కుటుంబం. ఆమె తండ్రి రైల్వే పెట్టెలు తయారుచేసే ఫ్యాక్టరీలో పనిచేస్తాడు. అతను వాయిద్యకారుడూ, పాటగాడూనూ. అతను పిల్లలకి

వయొలిన్ వాయించడం, పాడడం నేర్పుతూ వుంటాడు. అప్పటికప్పుడు ఆరుబయలు కచేరీలు యేర్పాటు చేస్తాడు. దగ్గరదగ్గర యిరవైమంది పిల్లలు ఆ సంగీతం వినడానికీ, జానపద గీతాలు నేర్చుకోడానికీ పోగవుతారు.

పావెల్‌ది సౌహార్దమైన కుటుంబం. అతని తల్లి నాలుగేళ్లు పైగా మంచాన పడివుంది. ఆమె బాధ్యతలు తండ్రి స్వీకరించాడు. అతను ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. యింటి పనీ చేస్తాడు.

చామనచాయ, నల్లకళ్ల చిన్న పిల్లవాడు సెర్యోజ కుటుంబంలో నలుగురుంటారు. వాళ్లంతా స్నేహంగా వుంటారు. ప్రతి సెలవు రోజునా ఆ కుటుంబం అడివిలోకి పోతుంది. అక్కడ పచ్చిక బయలులో వాళ్లు నాలుగు చిన్న లైమ్‌చెట్లు నాటారు. యింటిదగ్గర పిల్లలు తల్లికీ, తండ్రికీ, తాతకీ, మామ్మకీ తలా ఒక ఆపిల్ చెట్టూ పాతారు. ఆ కుటుంబంలోని పిల్లలు వాళ్ల అమ్మనీ, నాన్ననీ, తాతనీ, మామ్మనీ అంతగా ప్రేమించారంటే నేను ఆశ్చర్యపోలేదు. బహుశా వాళ్ల అమ్మా నాన్నా పిల్లలపట్ల చూపించిన ప్రేమ వాళ్లకి వందరెట్లు అధికంగా, స్వచ్ఛంగా బదులు వచ్చివుంటుంది.

ల్యూబా తల్లీ, తండ్రీ, మామ్మా, పెద్దక్కా, తమ్ముడూ ఆమెని స్కూల్‌కి తీసుకొచ్చారు. ల్యూబాకి అయిదుగురు సోదరులూ, యిద్దరు అవ్వలూ, ఒక తాతా వున్నారు. పరస్పర విశ్వాసమూ, గౌరవమూ గల కుటుంబంలో పెద్దవాళ్లపట్ల తిరుగులేనీ విధేయతాభావం నాటుకుపోతుంది. ఆ కుటుంబంలోని పెద్దలు పిల్లల్ని యెలా గౌరవించేదీ, వాళ్ల మనోభావాల్ని యెంత పదిలంగా చూసేదీ నేను యెంతో విన్నాను.

చాలా చిన్న పిల్లవాడైన దంకో యింట్లో మంచి జానపద సంప్రదాయాలున్నాయి. ఆరు, ఎనిమిది, తొమ్మిది యేళ్ల వయసున్న ఆ ముగ్గురు పిల్లలూ, తల్లిదండ్రులు పనిలోకి వెళ్లినప్పుడు యిల్లు చూసుకుంటారు. మధ్యాహ్నం, సాయంత్రం వంట వండుతారు, ఆవుపాలు పితుకుతారు. కాయగూరల తోట సంరక్షిస్తారు. సాయంత్రంవేళల్లో తల్లీ తండ్రీ పనినుంచి యింటికి తిరిగిరాగానే వాళ్ల స్నానానికి యేర్పాట్లు అయిపోయి వుంటాయి, శుభ్రమైన బట్టలు సిద్ధంగా వుంటాయి, భోజనాల బల్లమీద వేడివేడి రాత్రి భోజనం, తాజా పువ్వులూ వుంటాయి. పనంటే గౌరవం ఆ కుటుంబంలో యెక్కువగా వుంది. పనంటే ఒక రకమైన ఆరాధన కూడా ఆ యింట్లో వుందని తడుముకోకుండా యెవరేనా అనొచ్చు.

వాల్యా తండ్రి క్రెమెన్‌చూగ్‌లో ఒక ఇంజనీరింగ్ పరిశ్రమలో పని చేస్తాడు, ఆమె తల్లి సమష్టి క్షేత్రంలో పనిచేస్తుంది. ఆ సౌహార్దపూరిత కుటుంబంలో ప్రతి ఒక్కరూ చదువుకున్నవాళ్లే – ఆ తల్లితండ్రులూ, మొత్తం ముగ్గురు పిల్లలూనూ. ఆ కుటుంబంలో చదువుకోవాలని ప్రబలంగా వుండే భావన ఉపాధ్యాయునికి ఆసక్తికరంగా వుండి, మమ్మల్ని సంతోషపెడుతుంది. ఆమె మామ్మ అని ప్రతివాళ్లూ

అనుకునే ముసలావిడ ఆ కుటుంబానికి యేరకంగానూ బంధువు కాదని వాల్యా "సంతోష చంద్రశాల"లో చేరినప్పుడు మాకు తెలిసింది. ఆ ముసలావిడకి యెక్కడా యెవరూ నా అనే వాళ్లు లేరు. ఆమె యిద్దరు కొడుకులూ యుద్ధంలో నేలకొరిగారు. వాల్యా కుటుంబం ఆమెని చేరదీసింది. ఆ పిల్లలకి ఆమె వాళ్లలో ఒకత్తైపోయింది. ఆమె రక్తబంధువు కాదని వాల్యాకి తెలియను కూడా తెలియదు.

బూడిదరంగు కళ్ల చిన్ని ల్యూదా తల్లిదండ్రులు సమష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తారు. పొలం పనిని గౌరవించడం వాళ్లు పిల్లలకి నేర్పారు. ఒక రకమైన ప్రతిష్ఠా భావన ఆ కుటుంబంలో ప్రబలంగా వుంది. "పరులకి మనం చేసే ప్రతి పనీ బాగుండాలి" అని తండ్రి పిల్లలకి చెప్పేవాడు. వేసవికాలంలో పెద్ద పిల్లలు తండ్రితోబాటుగా పొలంలో పనిచేస్తారు. నెలలో కొన్ని సార్లు ల్యూదా, ఆమె తల్లీ వాళ్లని చూడ్డానికి వెడతారు. యీ చిన్న ప్రయాణాలు ఆ పిల్లకి సరదాగా వుంటాయి.

తాన్యా తల్లిదండ్రులు సమష్టి వ్యవసాయ క్షేత్రంలోని పశుపోషక క్షేత్రంలో పనిచేస్తారు. ఆమే, ఆమె సోదరీ వేసవిలో అక్కడకి యెక్కువగా వెళ్లి, పనంటే యిష్టపడ్డం నేర్చుకుంటారు. వాళ్ల నాయన క్షేత్రంలోని ఓ మూల కంచె కట్టి ఒక గొర్రెపిల్లని గాని, దూడని గాని వుంచడం మా ఉపాధ్యాయులు చాలాసార్లు చూశారు. తాన్యా, ఆమె అక్కా ఆ చిన్ని జంతువులని సంరక్షిస్తారు. అది వాళ్ల యిష్టమైన క్రీడ. వాళ్ల అమ్మా, నాన్నా కూడా అలాంటి క్రీడగలవాళ్లు కాబట్టే వాళ్లూ అలా

షూర మృదువైన, ఉత్సుకతగల, నల్లని కళ్లున్న కుర్రవాడు. అతని తండ్రి రైలు మార్గంమీద పనిచేస్తాడు. వారానికి ఒకసారి యింటికి వస్తాడు. అతని రాక షూరకీ, అతని సోదరుడికీ పెద్ద పండగలా వుంటుంది. ఆ పిల్లలు తండ్రి రాకకోసం తహతహలాడిపోతారు. యెందుకంటే అతనెప్పుడూ కొత్తకొత్త బహుమతులు తెస్తాడు: నేర్పుగా చెక్కిన జంతువులవో, మనుషులవో, వూహాత్మకమైనవో కొయ్య బొమ్మలు. పిల్లకి తలావొకటీ తెస్తాడు. ఆ పిల్లలు తండ్రి చెప్పే కథలంటే కూడా యిష్టపడతారు. మంచి మనుషులంటే అతనికి మహా అభిలాష వుండేది. ఆ మంచివాళ్లని గురించిన అతని కథలు పిల్లలకి బాహ్య ప్రపంచ గవాక్షాలు తెరుస్తాయి.

వొలోద్య తండ్రి వంతెనలు కడతాడు. అతని తల్లి సమష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తుంది. తమ మొదటి బిడ్డని ఆ పడుచు తల్లిదండ్రులు ప్రియంగా ప్రేమించారు, కాని వాళ్ల ప్రేమకి వివేకం లేదు. అప్పటికే వాళ్లు వాడికి యెన్నో చిన్నా చితుకూ వస్తువులు యిచ్చేశారు. వాడి తిక్కలన్నీ యెప్పుడూ యెంత త్వరగా వీలైతే అంత త్వరగా తీరుస్తారు. వొలోద్య తల్లి పక్కన రెండు రబ్బరు బంతులు పుచ్చుకుని కూర్చున్నాడు. వాడు తల్లితో యేదో చెబుదామనుకున్నాడు, కాని ఆవిడ గమనించలేదు. వెంటనే వాడు మూతి ముడుచుకున్నాడు. వాడి కళ్లలో నీళ్లు తిరుగుతున్నాయి.

బూడిద వర్ణపు శరీర చాయ, నల్లటి కళ్లూ, తొడిమెల్లా నాజూగ్గా మృదువుగా వుండే ఉంగరాల జుట్టూ వున్న వార్యా చిన్న పిల్ల. వాళ్లమ్మ వెన్న తయారుచేసే ఫ్యాక్టరీని శుభ్రం చేసే పనిలో వుండేది. ఆమె తండ్రి యుద్ధంలో గాయపడ్డాడు. కుటుంబం అతన్ని సంరక్షించేది. అతని ఆరోగ్యం దారుణంగా కుంగిపోయింది. తల్లి చాలా భారం మోస్తోందనిపించి ఆ ముగ్గురు పిల్లలూ ఆమె జీవితం సుఖవంతం చెయ్యాలని ప్రయత్నిస్తారు. వాళ్ల అమ్మ జీతం సామాన్యంగా వుండేది. కుటుంబ ఆదాయం పెంచడానికని ఆమె సాయంత్రాలప్పుడు చొక్కాలకీ, తువ్వాళ్లకీ బుటాలు కుడుతూ వుంటుంది. వార్యా అక్క తల్లికి సాయంచెయ్యడంకోసం బుటా అల్లిక అప్పుడే మొదలెట్టింది, వార్యా కూడా నేర్చుకుంటోంది.

తల్లిదండ్రుల నైతిక జీవితాలకి దర్పణం పిల్లలు. ప్రతి కుటుంబంలోని మంచి చెడుల్ని గురించీ నేను ఆలోచించాను. మంచి తల్లిదండ్రుల అత్యంత విలువైన లక్షణం యేమిటంటే, దయా, పరులకి సాయంచేద్దామన్న తలపు. వాళ్ల పిల్లలు సరిగ్గా అవి నేర్చుకుంటారు. తల్లీ తండ్రీ తాము పరులకింత సాయంచేసి, వాళ్ల కష్టసుఖాలు పట్టించుకునేవాళ్లైతే, ఆ కుటుంబాల పిల్లలు మంచివాళ్లుగా, సానుభూతిగలవాళ్లుగా, ఆర్ద్ర హృదయులుగా పెరుగుతారు. మహా దుర్మార్గమైంది యేమిటంటే కొందరు తల్లిదండ్రుల స్వాతిశయమూ, ఒంటెత్తు పోకడానూ. ఒక్కొక్కప్పుడది తమ పిల్లలపట్ల గుడ్డి సహజాత ప్రేమగా రూపు తీసుకుంటుంది, వొలోద్య తల్లిదండ్రుల్లాగా. తల్లీ తండ్రీ తమ ప్రేమంతా పిల్లలమీదే ఒలకబోసేసి, చుట్టుపక్కల యింకా మనుషులున్నారన్న సంగతి మర్చిపోతే, యీ రోగ వాపులాంటి ప్రేమ యేదో వొక రోజున దుఃఖానికి దారితీస్తుంది.

"సంతోష చంద్రశాల" ఎలా వుండాలో తల్లిదండ్రులకి చెప్పేటప్పుడే దీన్ని గురించి అనుకున్నాను. ఆ సంభాషణ కొంచెం కష్టమైంది. కుటుంబాల్లో వున్న మంచీ చెడూ అంతా నేను గమనంలోకి తీసుకోవాల్సి వుంది. "సంతోష చంద్రశాలలో" నేను కోరుకున్న నిజాయితీల సత్యసంధత, పరస్పర విశ్వాసం ఉండాలని చెప్పేటప్పుడు కోల్యా కుటుంబం గురించి నాకు ఆందోళన కలిగింది. ఆ కుటుంబ జీవితాన్ని పీడించిన ఘోరమైన సమస్యలు నాకు తెలుసు. కాని నేను వాటి గురించి మిగతా తల్లిదండ్రులు తెలుసుకునేటట్టు చెయ్యకూడదు. అలా చేస్తే ఆ తల్లి స్కూల్‌కి వ్యతిరేకం అవుతుంది. ఆమె యిక మళ్లీ రాదు. వేరే యేదో కావాలి. కాని యెంతో కాలంగా దాన్ని గురించి ఆలోచించాను. సరైన సమాధానం మాత్రం దొరకలేదు.

పిల్లల పెరుగుదల గురించిన భవిష్యత్ జాడని నేను ఆ తల్లిదండ్రులకి స్థూలంగా వివరించాను. యివాళ వాళ్ళు ఆరేళ్ళ పిల్లల్ని స్కూల్‌కి తీసుకొచ్చారు, కాని పన్నెండేళ్ల కాలంలో యీ పిల్లలు పెద్దవాళ్లవుతారు, భవిష్యత్తులో వాళ్లూ తల్లులూ, తండ్రులూ అవుతారు. యీ పిల్లలు సగర్వమైన దేశభక్తులుగా, తమ స్వదేశాన్నీ, శ్రామిక జనాన్నీ ప్రేమించేవాళ్లుగా, నిజాయితీగా, సత్యసంధులుగా, శ్రమించే

వాళ్ళుగా, దయ, ఆత్మీయుత, సానుభూతికలవాళ్ళుగా, అక్రమాన్నీ, అన్యాయాన్నీ సహించలేనివాళ్ళుగా, కష్టాలని అధిగమించడంలో పట్టుదలగలవాళ్ళుగా, వినయవంతులుగా, నైతికంగా సుందరులుగా, ఆరోగ్యవంతమైన వాళ్ళుగా, శారీరకంగా శిక్షణ పొందినవాళ్ళుగా తయారయేటట్టు చెయ్యడానికి స్కూలు తన శక్తినంతా కూడగట్టి పనిచేస్తుంది. పిల్లలు సరసమైన వాళ్ళుగా, ఉదార హృదయులుగా, స్వర్ణహస్తులుగా, ఉన్నత భావ సముపేతులుగా వుండే మనుషులుగా తయారవాలి. పిల్లలే కుటుంబ దర్పణం. ఒక నీటి బిందువులో సూర్యుడు ప్రతిఫలించినట్లే, తల్లితండ్రుల నైతిక స్వచ్ఛత పిల్లల్లో ప్రతిఫలిస్తుంది. ప్రతి పిల్లవానికీ ఆనందాన్ని కలగజేసే కర్తవ్యం – స్కూలుదీ, తల్లిదండ్రులదీనీ. ఆనందం బహుముఖమైనది. పిల్లవాడు తన సామర్థ్యాలని వెల్లడించుకోవడం, శ్రమని ప్రేమించడం, చుట్టూతా వున్న ప్రపంచపు సౌందర్యాన్ని ఆస్వాదించగల సృజనాత్మక శ్రమ చెయ్యడం, పరులకోసం అందం సృష్టించడం, పరుల్ని ప్రేమించడం, ప్రీతిపాత్రుడు గావడం, నిష్కళంక మానవ మూర్తులుగా తయారవడం – వీటన్నిటి ఆనందం పిల్లలకి యివ్వాలి. ఉపాధ్యాయులా, తల్లిదండ్రులా ఉమ్మడి యత్నాలే పిల్లలకి మహదానందాన్ని యివ్వగలవు. పిల్లలూ, తల్లిదండ్రులూ యిళ్లకి వెళ్లిపోయారు. "రేపు, ఆగస్టు 31న, మా 'సంతోష చంద్రశాల' ఆవిర్భవిస్తోంది"* అని నేను అనుకున్నాను.

ఆ రోజు నాకేం సమకూరుస్తుంది? పిల్లలు తమ తల్లుల చేతులు పట్టుకుని వుండటం చూశాను, కాని మర్నాడు వాళ్లు ఒఖ్ఖళ్లే వస్తారు. ప్రతి వ్యక్తికీ తన సంతోషాలు వున్నాయి. ప్రతి ఒక్కడికీ ప్రకాశమాన ఉదయం, అనంత జీవితం ముందు వున్నాయి. స్కూలు యీ చిన్న పిల్లల సంతోషాలు పోగొట్టకూడదనే యీ సందర్భంగా నా బాధ. తద్భిన్నంగా వాళ్లని, స్కూల్ ప్రపంచంగుండా నూతన సంతోషాలు వాళ్ల ముందు యెప్పటికీ వెల్లడి అయేలాగా, నేర్చుకోవడం అనేది విసుగు పుట్టించే చదువులాగా తయారవకుండా నడిపించాలి. మరోపక్క స్కూలు పైకి ఆసక్తికరంగా కనిపించి లోపల డొల్లగా వుండే తెంపులేని ఆట కాకూడదు. రోజురోజుకీ వాళ్ల హేతుబద్ధత, అనుభూతులు, సంకల్పం, సంపద్వంతం కావాలి.

## ఆరుబయలు పాఠశాల

పిల్లలకోసం తహతహలాడుతూ నిరీక్షించాను. ఉదయం యెనిమిది గంటలకి యిరవై తొమ్మండుగురు వచ్చారు. సాషా రాలేదు – బహుశా ఆమె తల్లికి బాగుండలేదేమో. వొలోద్య యెగ్గొట్టాడు, బహుశా అతను నిద్రపోతూనే వుండివుంటాడు, తల్లి అతన్ని లేపలేదు.

సోవియట్ యూనియన్‌లో విద్యాసంవత్సరం సెప్టెంబరు 1న మొదలవుతుంది.

పిల్లలంతా పండగ బట్టల్లో వున్నారు. కొత్త బూట్లు తొడుక్కున్నారు. అది నాకు నచ్చలేదు, యెందుకంటే యేనాటినుంచో పల్లెటూరి పిల్లలు చెప్పుల్లేకుండానే తిరిగేవాళ్లు, అది అద్భుతమైన శారీరక శిక్షణా, జలుబుకూ, జ్వరానికి మంచి కాపూనూ. యెందుకు తల్లిదండ్రులు పిల్లల కాళ్లని ధూళినుంచీ, ప్రభాత హిమబిందువులనుంచీ, యెండకి వేడెక్కిన ఒఠ్ఠి నేలనుంచీ రక్షిస్తారు? వాళ్లవి మంచి ఉద్దేశాలే, కాని ఫలితాలు చెడ్డగా వున్నాయి: ప్రతి యేడూ యెక్కువమంది పిల్లలు ఇన్‌ఫ్లూయెంజాకీ, టాన్సిల్స్ ఉబ్బడానికీ, కోరింతదగ్గుకీ గురవుతున్నారు. పిల్లలు వేడి అన్నా, చలి అన్నా భయపడకుండా పెరగాలి.

"రండి, స్కూల్‌కి వెడదాం" అని నేను వాళ్లతో చెప్పి, తోటదారి పట్టాను. ఆ పిల్లలు నాకేసి ఆశ్చర్యపోయి చూశారు.

"అవును పిల్లలూ, మనం స్కూల్‌కే వెడుతున్నాం. మన స్కూలు ఆరుబయట పచ్చికమీద, పియర్ చెట్ల కొమ్మలకింద, ద్రాక్ష తోటలో, పచ్చికమైదానాల్లో వుంది. బూట్లు తీసెయ్యండి, యిదివరలో మీరున్నట్టే చెప్పుల్లేకుండా వెడదాం." పిల్లలు సంతోషంతో కిలకిల్లాడిపోయారు. వేడి వాతావరణంలో బూట్లు వేసుకోవడం వాళ్లకి అలవాటు లేదు, అది చాలా అసౌకర్యంగా వుంది. "రేపు బూట్లు లేకుండా రండి. మన స్కూల్‌లో అదే మంచిది."

ద్రాక్ష తీగల పొదరింటి సందులోకి వెళ్లాం. ఒక ప్రశాంతమైన మూలలో, చెట్ల మరుగున దట్టమైన ద్రాక్ష తీగలు అల్లుకుని వున్నాయి. యినప చట్రం చుట్టూ అల్లుకుని అవి ఒక పచ్చని కుటీరంలా తయారయాయి. ఆ కుటీరంలోని నేల మెత్తటి గడ్డితో పరిచినట్టుంది. ప్రశాంతంగా వుందక్కడ. ఆకుపచ్చటి నీడలో ప్రపంచమంతా కూడా పచ్చగా వున్నట్టనిపించింది. మేం గడ్డిమీద కూర్చున్నాం.

"యిక్కడే మన స్కూలు ప్రారంభమయ్యేది. యిక్కణ్ణుంచి మనం నీలాకాశంకేసి, తోటకేసి, వూరికేసి, సూర్యునికేసి చూద్దాం."

ప్రకృతి సౌందర్యంతో సమ్మోహితులైపోయి, పిల్లలు నిశ్శబ్దంగా అయిపోయారు. ఆకుల మధ్యలో పసుపువర్ణపు ద్రాక్షపళ్లు వేలాడుతున్నాయి. పిల్లలు వాటిని రుచి చూద్దామనుకున్నారు. అలాగే పిల్లలూ తిందాం, కాని ముందు వాటి అందాన్ని ఆస్వాదిద్దాం. పిల్లలు చుట్టూ చూశారు. తోటంతా కూడా ఆకుపచ్చ పొగమంచులో వున్నట్టుంది, నీటి అడుగున వుండే రాజ్యంలాగా నేల పైభాగం పొలాలూ, పచ్చిక బీళ్లూ, రోడ్లూ మెరిసే ఆకుపచ్చని పొగమంచులో వణుకుతున్నట్టుంది. నిగనిగలాడే చెట్ల మీద యెండ కాంతి పడుతోంది.

"సూర్యుడు నిప్పుకణాలు చల్లుతున్నాడు" నెమ్మదిగా అంది కాత్యా.

పిల్లలు ఆ ముగ్ధమోహన దృశ్యాన్ని తదేకంగా చూస్తున్నారు. అంచేత సూర్యుణ్ణి గురించి వాళ్లకి ఒక కథ చెప్పడం మొదలెట్టాను.

"అవును, పిల్లలూ, కాత్యా చాలా బాగా చెప్పింది: సూర్యుడు నిప్పుకణాలు చల్లుతున్నాడు. ఆయన ఆకాశంలో యెక్కడో యెత్తులో వుంటాడు. ఆయనకి యిద్దరు మహాకాయులైన కమ్మరవాళ్లు వున్నారు, ఒక దాయ వుంది. వేకువకి ముందే వాళ్లు తమ అగ్నిమయమైన గడ్డాలతోటి సూర్యునిదగ్గరకి వెడతారు. ఆయన వాళ్లకి రెండు వెండి దారపు పోగులు యిస్తాడు. ఆ కమ్మరవాళ్లు యినుప సుత్తులు తీసుకుని, బంగారు దాయ మీద ఆ వెండి పోగులు పెట్టి, సుత్తులతో కొడతారు. వాళ్లు సూర్యుని కోసం వెండి దండ సాగగొట్టి తయారుచేస్తారు. అప్పుడు వెండి నిప్పుకణాలు సుత్తుల కిందనుంచి యెగిరి ముక్కలై ప్రపంచ మంతటా పడతాయి. నిప్పురవ్వలు భూమిమీద పడతాయి, యిదుగో యిక్కడ మీరు వాటిని చూడవచ్చు. సాయంత్రంవేళకి, అలిసిపోయిన కమ్మరవాళ్లు సూర్యుని దగ్గరికి వెళ్లి ఆయనకి ఆ దండ యిచ్చేస్తారు. సూర్యుడు ఆ దండని తన బంగారు జడల్లో పెట్టుకుని, తన మాయావనంలోకి విశ్రాంతికి వెళ్లిపోతాడు."

నేను యీ కథ చెపుతూ వుండగానే బొమ్మలు గీసాను. ఆ తెల్ల కాగితంమీద విపరీతమైన బొమ్మలు తయారయాయి - యిద్దరు మహాకాయులైన కమ్మరవాళ్లు బంగారు దాయమీదకి వంగడం, యినుప సుత్తుల కిందనుంచి వెండి నిప్పురవ్వలు యెగరడం.

అద్భుత కథా ప్రపంచంతోటి సమ్మోహితులైపోయి పిల్లలు ఆ కథ విన్నారు. ఆ మంత్రమహిమ మెదిల్తే పోతుందేమోనని భయపడి నిశ్శబ్దంగా వుండిపోయారు. అప్పుడు ప్రశ్నలు అడగడం మొదలెట్టారు. ఆ కమ్మరవాళ్లు రాత్రిళ్లు యేం చేస్తారు? వాళ్లు సూర్యునికి ప్రతి రోజూ ఒక కొత్త దండ యెందుకు తయారుచేస్తారు? ఆ వెండి కణాలు యెక్కడికి మాయమైపోతాయి? అవి నిజంగా రోజూ నేలమీద పడతాయా?

"వాటన్నిటిని గురించీ యింకో రోజున చెబుతాను. మనకింకా బోలెడు వ్యవధి వుంది. యిప్పుడు ద్రాక్షపళ్లు రుచి చూడండి." బుట్ట నిండా ద్రాక్షపళ్లు కోసేదాకా ఆతృతగా వున్నారు పిల్లలు. ప్రతి ఒక్కరికీ రెండేసి గుత్తు లిచ్చాను, ఒకటి తినడానికి యింకోటి యింటికి పట్టుకెళ్లడానికి. పిల్లలు ఆశ్చర్యకరంగా గమ్మునైపోయారు. వాళ్లా ద్రాక్షపళ్లని కాగితంలో పొట్లం కట్టారు. కలతగానే వుండింది. అయినా వాళ్లు నిజంగా వాటిని యింటికి తీసుకెడతారా, దారిలో తినకుండా వుంటారా అని నాకు అనుమానం తోల్య, కోల్య ద్రాక్షపళ్లని తమ తల్లులకిస్తారా? నేను నీనాకి కొన్ని గుత్తులిచ్చాను - ఒకటి జబ్బుగా వున్న వాళ్లమ్మకీ, తన అక్క చెల్లెళ్లకీ, మామ్మకీ. వార్యా తన తండ్రికోసం మూడు గుత్తులు పట్టుకెళ్లింది. అప్పుడు నాకు తోచింది, ఆ పిల్లలు కాస్త పెద్దవాళ్లయితే, తలా ఒక ద్రాక్ష తీగ తామే పాత్తారని... వార్యా యింటిదగ్గర డజన్ల కొద్దీ మొక్కలు యీ ఆకురాలు కాలంలో నాటాలి, అవి మీదటికి పళ్లు కాస్తే వాళ్ల నాన్నకి మంచి మందు అవుతాయి...

ఆ అద్భుత కథా ప్రపంచపు పచ్చని నీడనుంచి యివతలికి వచ్చాం. నేను పిల్లలకి చెప్పాను "రేపు సాయంత్రం ఆరు గంటలకి రండి. మర్చిపోకండేం" అని.

పిల్లలకి వెళ్లడం యిష్టం లేదని గమనించాను, కాని తెల్లటి ద్రాక్షపళ్ల పొట్లాలు గుండెల కదుముకుని చెదిరిపోయారు. యెవరు ద్రాక్షపళ్లని తిన్నగా యింటికి తీసుకెడతారో! కాని నేను వాళ్లని అడగలేను కదా. వాళ్లంతట వాళ్లే నాకు చెబితే, బాగుంటుంది.

ఆ రకంగా ఆరుబయలు స్కూలు మొదటి రోజు గడిచింది... ఆ రాత్రి సూర్యుని వెండి నిప్పుకణాల గురించి కలవచ్చింది. ఉదయమే లేచాను. తర్వాత యేం చెయ్యాలా అని ఆలోచించాను. పిల్లలకి ఆవేళ యేం చెప్పాలా, యెక్కడికి తీసుకెళ్ళాలా అనేదేమీ వివరం నేను అనుకోలేదు. నన్ను ఉత్తేజితుణ్ణి చేసిన ఒక భావంనుంచి మా స్కూల్ జీవితం అభివృద్ధి చెందింది: ప్రతి పిల్లవాడూ తన తత్వాన్ని బట్టి చుట్టూతా వున్న ప్రపంచంలోకి నిశితమైన శోధకుడుగా వెడతాడు. సజీవ వర్ణాలతో, స్వచ్ఛమైన కంపించే ధ్వనులతో వున్న అద్భుత ప్రపంచాన్ని వాళ్ల ముందు అద్భుత కథల్లో, ఆటల్లో, వ్యక్తిగత సృజనలో, సౌందర్యంలో వాళ్ల హృదయాల్ని పరులకి మేలు చేయడానికి ఉత్తేజపరుస్తూ విచ్చుకోనివ్వండి. అద్భుతమైన కథలద్వారా, అద్భుత కల్పనద్వారా, ఆటలద్వారా, పునస్సృష్టి చెయ్యలేని సృజనద్వారా పిల్లల హృదయాలకి కచ్చితమైన దారి తెలుసుకోవచ్చు. నేను యీ పిల్లల్ని చుట్టూతా వున్న ప్రపంచంలోకి నడిపిస్తాను. నిత్యమూ అది వాళ్లకి నూతనమైంది వెల్లడి చేస్తుంది, మా ప్రతి అడుగూ ఆలోచనా భాషా మూలాలకి మా యాత్రలో, ప్రకృతి అద్భుత సౌందర్యంలో భాగం అయేటట్టు. నా విద్యార్థుల్లోని ప్రతి ఒక్కరూ ఆలోచనాత్మకంగా, పరిశోధించేవాళ్లుగా, జ్ఞాన సముపార్జనలో వేసే ప్రతి అడుగూ హృదయాన్ని ఔన్నత్యపూరితం చేసి, సంకల్పాన్ని పదును చేసేదిగా వుండేటట్లు చూస్తాను.

పిల్లలు మర్నాడు సాయంత్రం స్కూల్‌కి వచ్చారు. ప్రశాంత సెప్టెంబరు మాసపు పగలు చల్లబడింది. మేం వూరు వదిలిపెట్టి ఒక దిబ్బమీద కూర్చున్నాం. సూర్య కిరణాల్లో ధగధగలాడిపోయే పచ్చికబయలు, నిబ్బరమైన పోప్లార్ చెట్లూ, దిఙ్మండలంమీద దూరంలో దిబ్బలూ వున్న దృశ్యం మా ముందు వుంది. ఆలోచనకీ మాటలకీ మూలమైన చోటుకి వచ్చాం. అద్భుత కథలు, కల్పన - యీ మూలాన్ని తెరిచే తాళం యిదీ, అప్పుడు మాటలు వెల్లువగా వస్తాయి. కాత్య ముందు రోజు యెలా చెప్పిందీ నాకు గుర్తొచ్చింది: "సూర్యుడు నిప్పుకణాలు చల్లుతున్నాడు." రాబోయేదాన్ని వూహించి నేను చెబుతున్నాను, పన్నెండేళ్ల తర్వాత ఆమె స్కూల్ పూర్తిచేసేటప్పుడు ఆమె తన స్వదేశాన్ని గురించి పరీక్షలో వ్యాసం రాసింది. ప్రకృతిపట్ల తన ప్రేమని చెబుతూ యిదే మాట తిరిగి అంది. పిల్లల మనసులమీద అద్భుత కథల మూర్తులు అంత గాఢంగా ముద్ర వేస్తాయి. చుట్టూతా వున్న

ప్రపంచాన్ని అద్భుత కల్పనలతోటి నింపేసేటప్పుడు, యీ అద్భుతాల్ని సృష్టించేటప్పుడు, పిల్లలు సౌందర్యాన్నే కాదు, సత్యాన్ని కూడా ఆవిష్కృతం చేసుకుంటారని నాకు యెంతో దాఖలా కలిగింది. పిల్లల వూహ అద్భుత కథల్లేకుండా, ఆటల్లేకుండా వుండదు. అద్భుత కథ ల్లేకుండా కూడా పరివేష్టిత ప్రపంచం అందమైన చిత్రమే, కాని కాన్వాసు గుడ్డమీద గీసిన బొమ్మ. అద్భుత కథలు దానికి వూపిరి పోస్తాయి.

ఆలంకారికంగా చెబితే, అద్భుత కథ పిల్లల ఆలోచనలనీ, భాషనీ ఉత్తేజితం చేస్తుంది. పిల్లలు అద్భుత కథల్ని వింటానికి యిష్టపడ్డమే కాదు, వాటిని కల్పించడానికి కూడా యిష్టపడతారు. ద్రాక్ష తీగల నీడ మాటునుంచి పిల్లలకి ప్రపంచాన్ని చూపిస్తూ, నేను వాళ్లకో కథ చెబుదామనుకుంటున్నాను గానీ, కచ్చితంగా యిదీ అని నాకు తోచలేదు. యీ వూహ తట్టడానికి చోదకం కాత్యా మాటలనుంచి వచ్చింది: "సూర్యుడు నిప్పుకణాలు చల్లుతున్నాడు..." పిల్లలు యెలాంటి సత్యసమన్వితమైన, నిర్దిష్టమైన, కళాత్మక, భావప్రకాశక చిత్రాలు సృష్టిస్తారు - అవి యెంత స్వచ్ఛంగా వుంటాయి, వాళ్ల భాష యెంత శోభాయమానంగా వుంటుంది!

పిల్లలు పుస్తకం తెరిచి, మొదటి మాటని అక్షరం అక్షరం చదివేముందే అన్నింటిలోకీ అత్యంత అద్భుతమైన పుస్తకం - ప్రకృతి అనే పుస్తకం - చదివేటట్లు చెయ్యాలని ప్రయత్నించాను.

ఉపాధ్యాయులమైన మేము, ప్రకృతిలో వున్న అత్యంత సున్నితమైన, సుకుమారమైన, అద్భుతమైన దాంతోటి - పిల్లల మనసుతోటి - వ్యవహరిస్తున్నామనే ఆలోచన, ఆ ప్రకృతి మధ్యలో, నాకు యెంతో స్పష్టంగా తట్టింది. పిల్లల మనసుల్ని గురించి అనుకునేటప్పుడు, మంచు ముత్యాలు తొణికిసలాడే మృదువైన గులాబీ పువ్వుని గురించి యెవరేనా వూహించుకోవాలి. ఆ మంచు బిందువులు చెదిరిపోకుండా ఆ పువ్వును యేరాలంటే యెంత జాగ్రత్త, సౌకుమార్యం కావాలి! మనం ప్రతి నిముషం అంతే జాగ్రత్తగా వుండాలి: యెందుకంటే మనం ప్రకృతిలో వున్న అతి సున్నితమైన, సుకుమారమైన దాన్ని స్పృశిస్తున్నాం - యెదిగే పిల్లవాని ఆలోచనాత్మక వస్తువు అనేదాన్ని.

పిల్లలంతా వస్తురూపంలోనే ఆలోచిస్తారు. అంటే, ఒక నీటి బిందువు ప్రయాణం గురించి ఉపాధ్యాయుడు చెప్పేది వినగానే, పొద్దుటి పొగమంచు వెండి తరంగాలూ, నల్లని మేఘాలూ, ఉరుముల గర్జనా, తొలకరిచినుకులూ వాళ్లు తమకితామే వూహించుకుంటారు. యీ చిత్రంలోని బొమ్మలు యెంత స్పష్టంగా వుంటే, ప్రకృతి ధర్మాలకి పిల్లలు యివ్వగల అర్థం అంత లోతుగా వుంటుంది. వాళ్ల మెదడులోని సున్నిత, సుకుమార నరాల పోగులు యింకా బలమైనవి కావు; వాటిని అభివృద్ధి చెయ్యాలి, దృఢపరచాలి.

పిల్లలు ఆలోచిస్తారు. అంటే మెదడు పైభాగంలోని ప్రత్యేక నరాలు ఆ చుట్టూతా వున్న ప్రపంచపు బొమ్మల్ని (చిత్రాలు, వస్తువులు, ఘటనలు, మాటలు) గ్రహిస్తాయి. ఆ సంకేతాలు సున్నిత నరాల కణాల గుండా కదులుతాయి. నరాల పోగులు యీ సమాచారాన్ని క్రమబద్ధం చేస్తాయి-పద్ధతిగా, పోగుగా, తులనాత్మకంగా తరగతులుగా యేర్పాటుచేస్తాయి. కొత్త సమాచారం మళ్లీ మళ్లీ వస్తూనే వుంటుంది, అది అలా క్రమబద్ధం అవుతూనే వుంటుంది. మొత్తం నూతన చిత్రాలతోటీ, సమాచారాన్ని క్రమబద్ధం చేసుకోవడంతోటీ అందుకోవాలంటే నరాల పోగుల పటుత్వం చిత్రాలని గ్రహించడం నుంచి అవి క్రమబద్ధం కావడానికి అతి తక్కువ వ్యవధిలో మారుతుంది.

నరాల పోగుల పటుత్వం అద్భుతమైన వేగంగా మారడాన్నే మనం ఆలోచన అంటాం - పిల్లవాడు ఆలోచిస్తున్నాడు. పిల్లవాడి మెదడు కణాలు యెంత సున్నితమైనవంటే, గ్రహించే వస్తువులపట్ల యెంత సుకుమార ప్రతిచర్య కలిగివుంటాయంటే, గ్రహించే వస్తువూ, వివరించుకునే వస్తువూ చూసి, విని, స్పర్శించగల బొమ్మ అయితేనే అవి మామూలుగా పనిచేస్తాయి. విషయంలోని ముఖ్యమైంది ఆలోచనలు చురుక్కుమనడం నిజమైన, స్పష్టమైన ఉదాహరణ వున్నప్పుడుగాని, లేదా మహా స్పష్టమైన మాటల చిత్రం, పిల్లలు "చూసి, విని, స్పృశించగల" చర్చనీయ విషయం ముందున్నప్పుడే సాధ్యమవుతుంది. అందుకనే పిల్లలు అద్భుత కథలంటే అంత చెవి కోసుకుంటారు.

పిల్లల మెదడు స్వభావాన్నిబట్టి, ఆలోచనా మూలంనుంచి స్పష్టమైన, అతిముఖ్యమైన చిత్రాలతోటి వాళ్లకి బోధించాలి. అప్పుడే వాళ్ల ఆలోచనలు స్పష్టమైన చిత్రంనుంచి ఆ చిత్రంలో వున్న విషయాన్ని క్రమబద్ధం చేసుకునేటట్లు మారతాయి. ప్రకృతినుంచి పిల్లల్ని వేర్పాటు చేసినట్లయితే, చదువు ఆరంభించిన మొదటినుంచీ పిల్లలు మాటలతో గ్రహించేటట్లయితే, మాటలని మాత్రమే గ్రహించేటట్లయితే వాళ్ల మెదడు కణాలు వేగంగా అలిసిపోతాయి. వాళ్లు ఉపాధ్యాయులు చెప్పిన పనిని చెయ్యలేరు. వాళ్ల మెదడు కణాల్ని అభివృద్ధి చెయ్యాలి, దృఢపరచాలి, వాళ్ల శక్తిని పోగుచెయ్యాలి. అందుకనే ప్రాథమిక తరగతుల్లోని పిల్లలు శ్రద్ధగా వింటున్నట్టు మీ కళ్లల్లోకి చూస్తూ నిశ్శబ్దంగా కూర్చోవడం, చెప్పేది యేమిటో ఒక్క ముక్క వాళ్లకి అర్థం కాకుండా వుండడమూ ఉపాధ్యాయులు తరచుగా గమనిస్తారు. యెందుకంటే ఉపాధ్యాయుడు అలా అలా మాట్లాడుతూనే వుంటాడు కాబట్టి. పిల్లలు వినే సూత్రాలూ, సమస్యలూ, ఉదాహరణలూ - అన్నీ కూడా భావనాత్మకంగా, సామాన్యంగా వుండి సజీవ చిత్రాలు లోపిస్తాయి. దాంతోటి పిల్లల మెదడు అలిసిపోతుంది. అక్కణ్ణే కష్టాలు ఆరంభమవుతాయి. పిల్లల ఆలోచనా శక్తిని అభివృద్ధి చెయ్యాలి - పిల్లల శారీరక పెరుగుదల సహజ నియమాలు దీన్ని కోరతాయి. అందుకనే ప్రకృతి తత్వంలోకి చేసే ప్రతి ప్రయాణమూ ఆలోచనకి ఒక పాఠం, మనసు పరిణతి చెందడంలో పాఠం.

మేమా దిబ్బమీద కూర్చున్నాం. మా చుట్టూతా కూడా గొల్లభామల బృంద గీతం. పచ్చిక బీళ్ల గడ్డి సువాసనతోటి గాలంతా నిండిపోయింది. మేం నిశ్శబ్దంగా కూర్చున్నాం. మీరు పిల్లలకి యెక్కువ చెప్పాల్సిన అవసరం లేదు. వాళ్లని ఉపన్యాసాలతో మాటలతో బాధించాల్సిన అవసరం లేదు. అలా అని మరీ సరదాగా వుండమని కాదు, కాని శాబ్దిక తృప్తి చాలా ప్రమాదమైన తృప్తుల్లో ఒకటి. పిల్లలు ఉపాధ్యాయుల మాటలు వినవలసిన అవసరం వుండటమే కాదు, కాని మౌనంగా కూడా వుండాలి. ఆ క్షణాల్లో పిల్లవాడు ఆలోచిస్తాడు, తను కన్నది అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తూ. క్లాసులో యెంత సంభాషణ సాగేదీ, దానిమీద ఉపాధ్యాయుడు పరిమితి విధించడం ముఖ్యం. పిల్లలు వూరికే అలా వింటూ వుండేటట్టుగా వాళ్లని మార్చెయ్యగూడదు. వర్ణ్యమైంది గాని శాబ్దికమైంది గాని అయిన ఒక చిత్రాన్ని అర్థం చేసుకోడానికి వ్యవధీ, నరాల సత్తువా అవసరం. పిల్లవాడు ఆలోచించేటట్టు చేయడం ఉపాధ్యాయుని అత్యంత సూక్ష్మగుణాల్లో ఒకటి. ప్రకృతి మధ్యలో, ఆలోచించుకుని, చుట్టూతా చూసి, అనుభూతం చేసుకునే అవకాశం పిల్లవానికి యివ్వాలి....

గొల్లభామల బృంద గీతం విన్నాం. పిల్లలు యీ అద్భుత సంగీతంతో పరవశులయారని నాకు సంతోషం. పొలాల సువాసనతోటీ, అద్భుతమైన ధ్వనులతోటీ నిండిపోయిన యీ ప్రశాంత సాయంకాలం వాళ్ల స్మృతుల్లో శాశ్వతంగా మలుచుకోనివ్వండి. ఒక రోజున గొల్లభామలమీద వాళ్లు కథలు అల్లుతారు.

కాని యిప్పుడు పిల్లల ఆలోచనాత్మక దృక్కులు సూర్యాస్తమయం మీద లగ్నం అయివున్నాయి. సూర్యుడు దిఙ్మండలం కిందికి దిగజారాడు. ఆకాశం సూర్యాస్తమయ వర్ణాలతోటీ, ఛాయలతోటీ నిండిపోయింది.

"అదుగో! సూర్యుడు విశ్రాంతి తీసుకోడానికి వెళ్లిపోయాడు" అంది లరీసా, ఆమె ముఖం ముడుచుకుపోయింది.

"కమ్మరవాళ్లు సూర్యునికి ఆయన వెండి దండ తెచ్చారు... ఆయన నిన్నటి దండని యెక్కడ పెట్టాడు?" అడిగింది లీదా.

కథ కొనసాగిస్తానని నిరీక్షిస్తూ పిల్లలు నాకేసి చూశారు. కాని యే అలంకారం ఎంచుకోవాలా అన్నది నేను నిశ్చయించుకోలేదు. ఫేద్య నాకు సాయంవచ్చాడు.

"ఆ దండ ఆకాశమంతా పరుచుకుంది" అన్నాడతను నిమ్మళంగా.

అందరూ ఉగ్గబట్టుకుని వున్న నిశ్శబ్దం – ఫేద్య తరవాత యేం చెబుతాడో విందామని మేమంతా నిరీక్షిస్తున్నాం. నిజానికది ముందు రోజు కథ కొనసాగింపే, అప్పటికే దాన్నతను కల్పించేశాడు. అతను నిశ్శబ్దంగా వుండిపోయాడు, బహుశా సిగ్గువల్ల. నేనతనికి చెయ్యి అందిచ్చాను:

"అవును, ఆ దండ ఆకాశమంతా పరుచుకుంది. ఒక్క రోజు తర్వాత సూర్యుడి వేడి జడల్లో అది వేడెక్కి పోయి, మైనంలా మెత్తగా అయిపోతుంది. సూర్యుడు తన మండే చేతులతో దాన్ని తాకి, ఆ బంగారు ధారని సాయంకాలపు ఆకాశంమీద పోస్తాడు. సూర్యుడు విశ్రాంతికోసం వెళ్లిపోతూ వుంటే ఆయన్నుంచి వచ్చే ఆఖరి కిరణాలు ఆ ధార వెలుగే. యిదిగో, మీరు వాటిని చూడవచ్చు – అది గులాబీ రంగుల్తో ఆడుకుంటుంది, నిగనిగలాడుతుంది, మరి మాడిపోతుంది. సూర్యుడు యింకా యింకా దూరంగా వెళ్లిపోతాడు. త్వరలోనే ఆయన ఆకాశంలోని తన అద్భుతవనంలోకి వెళ్లిపోతాడు. యిక నక్షత్రాలు మెరుస్తాయి...."

"నక్షత్రాలంటే యేమిటి? అవి యెందుకు మెరుస్తాయి? యెక్కణ్ణుంచి వస్తాయి? పగలు వాటినెందుకు చూడలేం?" అని అడిగారు పిల్లలు. కాని పిల్లల్ని అలంకారాల సమూహంతోటి ముంచెయ్యకూడదు. ఒక రోజుకది చాలు. పిల్లల దృష్టిని వేరే దానిపైకి మళ్లించాను.

"ఆ పచ్చిక మైదానంకేసి చూడండి. లోయలో, పచ్చికబీడుమీద, పల్లాల్లో యెలా చీకటి కమ్ముతుందో చూడండి. ఆ దిబ్బలకేసి చూడండి, అవి యెలా సాయంకాలపు మసకలోకి జారిపోతున్నాయో. ఆ దిబ్బలు బూడిద రంగుగా మారిపోతున్నాయి. వాటిపై భాగాలు చూడండి – మీకేం కనిపిస్తోంది?"

"అడివి... పొదలు... ఆవులమంద... గొర్రెలతో వున్న గొర్రెల కాపరి. రాత్రి పొలంలో గడపడానికి సిద్ధపడుతూ మనుషులు మంట వేసుకుంటున్నారు, కాని మీకది కనిపించదు. మీకు వూరికే ఆ పొగ కనిపిస్తుంది..." మసక కమ్మే కొండల్ని చూసే పిల్లల వూహలే యివి. యిళ్లకి పోయే టైమైందని పిల్లలతో అన్నాను. కాని వాళ్లు కదలరే. యింకా కాసేపు కూర్చోవచ్చా అని అడిగారు. సాయంత్రాలప్పుడు, ప్రపంచమంతా మాయ కమ్మేటప్పుడు, పిల్లల వూహలు వెర్రిగా సాగుతాయి. ఆ సాయం సంధ్య, రాత్రి చీకటి సుదూర లోయలనుంచి, అడవులనుంచీ నదిలాగా ప్రవహిస్తాయని చెప్పానంతే. విపరీతమైన వాటి చిత్రాలు – రూపం వున్న చీకటి, మసక – పిల్లల వూహల్లో లేచాయి. యీ జీవుల్ని గురించి సాన్యా ఒక కథ చెప్పింది: యెంతో యెంతో దూరంలో వున్న అడివి వెనకాల దూరంలో వున్న గుహలో వుంటాయి యివి. పగటివేళల్లో అవి చీకటి అగాధాల్లోకి పాకిపోతాయి. అవి నిద్రపోయి నిట్టూరుస్తాయి కలలు కనేటప్పుడు (అవి యెందుకు నిట్టూరుస్తాయో చెప్పేవాళ్లకే తెలియాలి....). సూర్యుడు తన అద్భుత వనంలోకి వెళ్లీ వెళ్లగానే అవి దాంకున్నచోటి నుంచి యివతలికి వస్తాయి. వాటి పెద్ద పంజాలు మెత్తటి బొచ్చుతో కప్పివుంటాయి, అంచేత వాటి అడుగుల చప్పుడు యెవరూ వినలేరు. చీకటీ, మసక యెవరికీ అపకారం చెయ్యని దయాపూరిత, శాంత, ప్రేమాస్పద ప్రాణులు.

చీకటీ, మసక తమని యెలా జోకొట్టి నిద్రపుచ్చుతాయో చెప్పడానికి పిల్లలు సిద్ధమయ్యారు కాని, ఆ రోజు కది చాలు. మేం యింటికి పోతూవుంటే పిల్లలు

మర్నాడు సాయంత్రం తాము రావచ్చా అని అడిగారు. వార్యా చెప్పినట్టు "కథలు అల్లుకోడానికి బాగా వుంటుందప్పుడు."

పిల్లలు అంత ఆతృతగా కథలెందుకు వింటారు? వాళ్ళు సందె చీకటి అంటే, వూహలు యెగిరిపోవడానికి అనుకూలంగా వాతావరణం వుండే ఆ సమయం అంటే, యెందుకంత యిష్టపడతారు? కథలెందుకు పిల్లల వాగ్ధాటిని పెంచి, వాళ్ల ఆలోచనా క్రమాన్ని అభివృద్ధి చేస్తాయి? యెందుకంటే కథల చిత్రాలు స్పష్టంగా అనుభూతిలో నిండివుంటాయి. ఒక కథలోని మాటలు పిల్లల భావనలో నిలిచిపోతాయి. వింతైన వూహ చిత్రించిన మాటల్ని విన్నా, ఉచ్చరించినా పిల్లవాని హృదయం స్పందిస్తుంది. కథలు వినకుండానే కాదు, కథల్ని కల్పించకుండా కూడా స్కూల్‌ని గాని, చదువును గాని నేను వూహించలేదు.

"సంతోష చంద్రశాల" మొదటి రెండు నెలల్లోను పిల్లలు కల్పించిన అద్భుత కథల్లో యివి కొన్ని. పిల్లల ఆలోచనల, అనుభూతుల, కోరికల, దృక్కుల ప్రపంచం వాటిలో వుంది.

**చిన్న కుందేలు (షూర)** - అమ్మ నాకో చిన్ని బొచ్చు కుందేలు బొమ్మని యిచ్చింది, సంవత్సరాదికి ముందు. క్రిస్టమస్ చెట్టు కొమ్మల్లో ఒకదానిమీద దాన్ని వుంచాను. ప్రతివాళ్లూ నిద్రపోయారు. ఒక బుల్లి, బుల్లి దీపం చెట్టుమీద మెరుస్తోంది. నేను చూశాను, ఆ కుందేలు కొమ్మమీదనుంచి గెంతి చెట్టు చుట్టూతా పరిగెత్తింది. అది అలా తిరిగీ, తిరిగీ మళ్లీ చెట్టు కొమ్మమీదకి గెంతింది.

**పొద్దుతిరుగుడు పువ్వు (కాత్యా)** - సూర్యుడు పైకెక్కాడు. చిన్న పక్షులు లేచాయి, ఒక భరద్వాజ పిట్ట ఆకాశంలోకి ఎగిరింది. ఆఖరికి పొద్దుతిరుగుడు పువ్వు కూడా లేచింది. లేచి అది తన రేకుల్నుంచి మంచు బిందువుల్ని విదిలించుకుంది. అది సూర్యుని కేసి తిరిగి అంది: "ఏమండోయ్, సూర్యుడుగారూ. నేను చాలాసేపట్నుంచి మీకోసం చూస్తున్నాను. చూడండి మీ వెచ్చదనం లేకపోవడంవల్ల నా బంగారు రేకులు యెలా వాడిపోయాయో. కాని అవి యిప్పుడు మళ్లీ పుంజుకుని, ఆనందంగా వున్నాయి. నేను మీకు మల్లే గుండ్రంగా, బంగారు రంగుతో వున్నాను, సూర్యుడుగారూ."

**వాళ్లు యెలా పొలం దున్నేరు (యూర)** - కోత యంత్రాలు గోధుమని కోసేసిం తర్వాత ముళ్లపంది తన కంతలోనుంచి యివతలికి వచ్చి గోధుమ లేదనీ వాటి కాండాలు గుసగుసలాడడంలేదనీ చూసింది. ఆ కోసేసిన దుబ్బుమీద అది గుండు రాయిలా దొర్లింది. ఒక బ్రహ్మాండమైన దెయ్యం దాని ముందుకి పాకింది - ఒక లోహపు బొద్దింక. అది చప్పుడు చేసింది, గాండ్రుమంది. దానికి వెనకాల కొర్రులున్నాయి. వెనకాల దున్నిన నల్లని మట్టి మాత్రం మిగిలివుంది. ఆ ముళ్లపంది తన కంతలో కూర్చుని ఆశ్చర్యంగా చుట్టూ చూసింది. అది అనుకొంది: "యీ గండభేరుండ బొద్దింకని వాళ్లెక్కడ సంపాదించారు?" కాని అది నిజానికి ఒక ట్రాక్టరు.

**లెనిన్‌వి రెండు బొమ్మలు (వాన్య)** - మా అక్క అక్టోబరిస్టుల సంఘంలో* చేరింది. ఆమెకి ఒక చిన్న యెర్ర నక్షత్రం వుంది. ఆ చిన్ని నక్షత్రంమీద లెనిన్ బుల్లి బొమ్మ. యిప్పుడు మాకు ఆయన బొమ్మలు రెండున్నాయి. ఒకటి గోడమీద, యింకోటి ఓల్యా నక్షత్రంమీద. లెనిన్ శ్రామికుల ఆనందంకోసం పోరాడాడు. లెనిన్ చాలా మంచి విద్యార్థి అని నాన్న చెప్పాడు. నేను కూడా బాగా చదువుతాను. నేను యువ లెనినిస్టు నవుతాను.

**ఓక్ చెట్టు కాయ (జీనా)** - గాలి జోరుగా వీస్తోంది. రాగితో చేసినట్టు వున్న పసుపు పచ్చని, మెరిసే కాయ ఒకటి ఓక్ చెట్టుమీదనుంచి పడింది. అది కింద పడి అనుకుంది: "పైన కొమ్మల్లో యెంత బాగుంది, కాని నేనిప్పుడు నేలమీద పడ్డాను. యిక్కడనుంచి నేను నదినిగాని, అడివిని గాని చూళ్లేను." అది యేడుపు మొహం పెట్టుకుంది. అది అడిగింది: "ఓక్ చెట్టూ, నన్ను నీ కొమ్మల్లోకి తీసుకోవూ." కాని ఓక్ చెట్టు జవాబిచ్చింది: "పిచ్చికాయా, చూడు, నేను కూడా నేలలోనుంచే పెరిగాను. నీ వేళ్లు బలంగా అన్చుకుని పెరుగు. అప్పుడు నువ్వు కూడా ఒక బ్రహ్మాండమైన ఓక్ చెట్టు వవుతావు."

పిల్లలకి ప్రకృతిలో జరిగే దాంతోటి ఆసక్తి కలిగించడమే కాదు. భూమ్మీద శాంతి కావాలనుకుంటారు. యుద్ధంకోసం తంత్రాలు పన్నే శక్తులున్నాయని వాళ్లకి తెలుసు. ఆ దుష్ట శక్తుల్ని ఒక మహాకాళ రక్కసి విపరీత చిత్రంలో చిత్రించారు.

**మేం లోహ మహాకాళ రక్కసిని యెలా ఓడించాం (సెర్యోజ)** - దూరంగా, దూరంగా సముద్రాని కవతల బాడవలో అది వుండేది. అది మన మనుషుల్ని అసహ్యించుకునేది. ఆటం బాంబులు తయారుచేసేది. వాటిని కుప్పలు తెప్పలుగా తయారుచేసి తన రెక్కల కింద వుంచుకుని యెగిరిపోయేది. వాటిని సూర్యుడిమీద విసురుదామనుకునేది. అది సూర్యుణ్ణి ఆర్పేద్దామనుకునేది, అప్పుడు మేం చీకట్లో చచ్చిపోతాం కదా. నేను యీ లోహ మహాకాళంతో పోరాడ్డానికి మంగలపిట్టల్ని పంపించాను. ఆ మంగలపిట్టలు తలా ఒకటీ తమ ముక్కుల్లో సూర్యుని అగ్ని కణాలు పట్టుకుని మహాకాళంతో తలపడ్డాయి. అవి అగ్నిని దాని రెక్కలమీద విసిరేశాయి. ఆ మహాకాళం బాడవలో పడిపోయి తన బాంబులతో సహా కాలిపోయింది. మరి సూర్యుడింకా ఆడుతూనే వున్నాడు. మంగలపిట్టలు సంతోషంతో కిలకిలమంటున్నాయి.

యీ కథ పిల్లవాని అద్వితీయ ప్రపంచ దృక్పథాన్ని వెల్లడిస్తుంది. జంతువులూ పక్షులూ పాల్గొనకుండా మంచికీ చెడుకీ పోరాటాన్ని పిల్లలు వూహించలేరు. పిల్లలకు ఇష్టమైన కుందేళ్లూ మంగలపిట్టలూ పిల్లల వూహలోని కట్టుకథ కాదు, అవి మంచితనానికి మూర్తీభావం.

---

* అక్టోబరిస్టులు - 7-9 ఏళ్ల స్కూలు పిల్లలు. వాళ్లు అక్టోబరిస్టుల బృందాలు ఏర్పరచుకొని, అఖిల యూనియన్ పయనీర్ సంఘానికి సిద్ధం అవుతారు.

ప్రతి రోజు పిల్లల చుట్టూతా వున్న ప్రపంచం ఏదో కొత్తదానిని తెచ్చేది. ప్రతి ఆవిష్కరణా ఒక కథ కింద మారిపోయేది, దానిని సృష్టించేది ఆ పిల్లలే. అద్భుత కథల చిత్రాలు పిల్లలు తమ స్వదేశపు సౌందర్యాన్ని అనుభూతం చేసుకోడానికి సహకరించేవి. యీ కథలా, మాయలా, సృజనలా పుణ్యమా అని వాళ్ల యిళ్ల అందం వాళ్లకి తెలిపే యివి స్వదేశం పట్ల ప్రేమకి ఆలంబన. స్వదేశ ఔన్నత్యాన్నీ గొప్పదనాన్నీ అర్థంచేసుకోవడం క్రమేపీ వస్తుంది. దాని మూలం అందంలో వుంది. చిన్న పిల్లలకు బోధించే పడుచు ఉపాధ్యాయులకి నా సలహా యేమిటంటే: మీరు యీ మహత్తర, శక్తివంతమైన సోవియట్ దేశాన్ని గురించి మొదటి మాటలు చెప్పేటప్పుడు యోచించి, మహా జాగ్రత్తగా పిల్లల్ని ఆ క్షణానికి సిద్ధం చెయ్యండి. యీ మాటలు ఉత్తేజకరంగా ఉన్నత భావాలతో ఘనమైనవిగా వుండాలి. (ఉత్ప్రేక్షలు అని యెవళ్లేనా అంటే అననివ్వండి – మీ మనస్సు స్వచ్ఛంగా, ఉన్నత భావాలతో నిండివుంటే మీరేం భయపడకండి.) పిల్లల హృదయాలు ఉద్రేకంతో కొట్టుకోవాలంటే ఆ భావాలు ఆకర్షణీయంగా, జాగ్రత్తగా నాటేటట్టుగా, పిల్లల జ్ఞానరంగం నుంచి అందమైన విత్తనాలతో చల్లేటట్టుగా వుండటం తప్పనిసరి.

పిల్లవాణ్ణి ఆ అందం అనుభూతం చేసుకుని, దాంతోటి పరవశించి పోయేటట్టుండనివ్వండి.. స్వదేశ చిత్రం చెక్కిన చిత్రాన్ని ఆ పిల్లవాని హృదయంలోనూ, జ్ఞాపకంలోనూ శాశ్వతంగా నిలిచిపోనివ్వండి. మానవత్వానికీ, దయార్ద్ర అనుభూతికీ, ఆత్మీయ సంబంధాలకీ రక్తమాంసాలు అందమే. తోల్య, స్లావ, కోల్య, వీత్య, సాషల కరుడుగట్టిన హృదయాలు యెలా కరుగుతున్నాయో గమనించినప్పుడు నాకు సంతోషం వేసింది. సౌందర్యం ముందు ఒక చిరునవ్వు, ఒక ప్రేరణ, ఆశ్చర్యం పిల్లల హృదయాల్ని నేను నడిపించి తీరాల్సిన బాటగా నాముందు దర్శనమిచ్చాయి.

"సంతోష చంద్రశాల"కు కఠిన నియమాలు లేవు. పిల్లలు యెంతసేపు బయట గడపాల్సిందీ నిర్ణయించుకోలేదు. పిల్లలు బడి అంటే అలిసి, విసుగెత్తి పోయి కూర్చుని ఉపాధ్యాయుడు "యిళ్లకు పోయే వ్యవధి అయింది" అని యెప్పుడంటాడా ఎదురు చూడడం వుండటం యీ స్కూలుకి వుండకూడదు, అదే అతిముఖ్యమైన విషయం. పిల్లలు మేం చేసే దాంట్లో గాఢంగా ఆసక్తి కనబరచినప్పుడే నేను స్కూల్ ఆరోజుకు ఆపుచేసే ప్రయత్నం చేశాను. మర్నాటి కోసం వాళ్లు ఆతృతగా నిరీక్షించాలి. రాబోయే రోజు యింకా కొత్త ఆనందాన్ని తెచ్చే ఆశ కనబరచాలి. రాత్రిని సూర్యుడు వెదజల్లే వెండి నిప్పు కణాల్ని తేనివ్వండి. ఆరుబయలు స్కూలు ఒక రోజున గంట, గంటన్నర వుండొచ్చు, మర్నాడు నాలుగు గంటలుండొచ్చు. అదంతా కూడా పిల్లలకి నేను యెంత సంతోషం కలిగించాను అన్నదానిమీద వుంటుంది. ప్రతి పిల్లవాడూ సంతోషాన్ని అనుభవించడమే కాదు, సమష్టి జీవితంలోకి తన వంతు సృజనాత్మక రేణువు ఒక్కటేనా పెట్టి సంతోషాన్ని సృష్టించడం కూడా చాలా ముఖ్యం.

ఆ యేడు ఆకురాలు కాలం బాగా గడిచేదాకా వాతావరణం వెచ్చగా వుంది. పొడిగా వుంది. అక్టోబరు మధ్యదాకా చెట్ల ఆకులు పసుప్పచ్చగా మారలేదు. వేసవి తిరిగివస్తోందా అన్నట్టు కొన్నిసార్లు ఉరిమింది, ఉదయం వేళల్లో పచ్చగడ్డిమీద మంచు బిందువులున్నాయి. యిది నా పనికి అనుకూల పరిస్థితిని కల్పించింది. మేం మా దిబ్బలమీదకి యెక్కువసార్లు వెళ్లాం. మేఘాలలోకి "ప్రయాణించాం." యీ ఘడియలు పిల్లలమీద మరిచిపోలేని ముద్ర వేశాయి. తెల్లటి, దూది మేఘాలు వాళ్లకి ఆశ్చర్యకరమైన ఆవిష్కరణల ప్రపంచం అయ్యాయి. వాటి యిష్టం వచ్చినట్టు త్వరితంగా మార్పు చెందే స్థూలరేఖల్లో పిల్లలు జంతువుల్నీ, అద్భుత కథల మహాకాయుల్నీ చూసేవాళ్లు. వేగంగా యెగిరిపోయే రెక్కలున్న పిల్లల వూహలు మేఘాలవతలి ప్రపంచాన్ని, వినీల సముద్రాన్ని, అడవిని, సుదూర అజ్ఞాత ఖండాల్ని అందుకునేవి. యీ యెగరడంలో పిల్లల వ్యక్తిగత ప్రపంచం విశాలంగా విచ్చుకునేది. అదుగో, ఓ తిక్కమేఘం ఆకాశంలో అడ్డంగా యెగురుతోంది.

"అందులో మీకేం కనిపిస్తోంది, పిల్లలూ?"

"గడ్డిటోపీ పెట్టుకున్న ముసలి గొర్రెల కాపరి చేతికర్రమీద ఆనుకుని వున్నాడు" అంది వార్యా. "చూడండి, అతనికి వెనకాల గొర్రెలమంద వుంది. కొమ్ములు తిరిగిన పెద్ద పొట్టేలు ముందు వుంది, గొర్రె పిల్లలు వెనకాల వున్నాయి... అతని దగ్గరో సంచీ వుంది, యేదో అందులోనుంచి తొంగిచూస్తోంది."

"అబ్బె, అది ముసలాడుకాదు" బదులు చెప్పాడు పావ్లో. "మనం శీతాకాలంలో కట్టుకునే లాంటి మంచుమనిషి. అదుగో, అతని చేతిలో ఒక చీపురు వుంది. అతని నెత్తిమీద వున్నది గడ్డిటోపీ కాదు, ఒక బాల్చీ."

"వూహూఁ, అది మంచుమనిషి కూడా కాదు. అది ఒక గడ్డి మేటు. దాని పక్కన యిద్దరు గొర్రెల కాపర్లు తవ్వుడు పారలతో వున్నారు. చూడండి – వాళ్లు గడ్డిని కింద వున్న బండిలోకి తోస్తున్నారు. అది పొట్టేలు కాదు, బండి. అది కాడి, చిన్న కొమ్ములు కాదు" అన్నాడు యూర.

"అది చాలా పెద్ద కుందేలు. నేను అలాంటి దాన్ని కలలో చూశాను. నాకు బండేమీ కనిపించడంలేదు, అది కుందేలు తోక."

ప్రతి ఒక్కళ్లూ వూహించాలని నేను అనుకున్నాను. కాని కోల్యా, స్లావ, తోల్యా, మీష యెందుకనో నోరు యెత్తలేదు. కోల్యా మొహంలో యేదో తిరస్కారపూరిత అలక్ష్యం కనిపించేటప్పటికి నా మనసు గాయపడింది. పిల్లల ఆటల్ని తమ గౌరవానికి లొక్కుగా చూసే పెద్ద వాళ్ల చూపు లాంటి చూపు అది. కాని అదే సమయంలో ఆ కుర్రవాని కళ్లల్లో అందంపట్ల ఆనందం మెరవడమూ నాకు కనిపించింది... దాన్ని గురించి నేను యెక్కువ ఆలోచించలేదు కాని నాకు ఠక్కున అనిపించింది యేమిటంటే, ప్రతి పిల్లవాడూ సంతోషంతో మునకలై పోయేదాకా, వాడి కళ్లల్లో నిజమైన ఆనందం మెరియకపోతే, ఆటల్లో ఆసక్తి పెంచుకోకపోతే, ఆ పిల్లవానిమీద బోధనాత్మక ప్రభావం వుంది అని చెప్పే హక్కు నాకు లేదు. పిల్లలు

పిల్లల్లాగే వుండాలి. యేదేనా వొక కథ వింటూ వుంటే అందులోని మంచీ చెడూల పోరాటం ఆ పిల్లవాడు అనుభవించలేకపోతే, సంతోషకరమైన అభినందనకి బదులు అతని కళ్లల్లో ఉదాసీనత గోచరిస్తే, దాని అర్థం ఆ పిల్లవాని హృదయం ముక్కలైపోయిందనీ, ఆ నష్టాన్ని పూడ్చడానికి యెంతో కృషి అవసరమనీ.

ఒక చిత్రమైన స్థూలరేఖతో ఒక మేఘం దిఙ్మండలంమీద కనిపించింది. అది చుట్టూతా పెద్ద గోడలతోటీ, చౌకీ శిఖరాల్తోటీ వున్న అద్భుతమైన రాజ ప్రాసాదంలా వుంది. ఆ ప్రాసాదపు ఖాళీ వంపుల్లోకి వూహలు దూరాయి. యూర అప్పుడే ప్రపంచపు అవతలి వేపున వున్న మాయా రాజ్యం గురించీ, రాక్షసి దుష్టత్వం గురించీ, ఒక సాహసవీరుడు అందమైన అమ్మాయిని రక్షించడం గురించీ ఒక కథ చెపుతున్నాడు. వీత్య యింకో భిన్నమైన అద్భుత కథ వూహించాడు. యెక్కణ్నో దూరంగా, మన దేశపు యెల్లల కవతల కొండలపైన ఒక భయంకరమైన జీవి వుంది. అది యుద్ధం కోసం కుతంత్రాలు పన్నుతోంది. ఆ వూహల రెక్కలు ఆ చిన్న పిల్లవాణ్ణి మాయ తివాసీమీద మోసుకుపోయాయి. ఒక్క క్షణంలో ఆ తివాసీ అతన్ని దుష్ట శక్తులు కాపరం చేసే గుహమీద యెత్తుగా తీసుకెళ్లింది. అంచేత అతను దుర్మార్గాన్ని నాశనం చేసి, భూమ్మీద శాంతిని దృఢపరిచాడు.

అప్పుడు నేను సుదూర ఉష్ణదేశాల గురించీ, తరగని వేసవి గురించీ, చిత్రమైన నక్షత్రమండలాల గురించీ, నీల సముద్రాన్ని గురించీ, తాళవృక్షాల గురించీ చెప్పాను. యిక్కడ నేనేదో సుదూర ప్రపంచపు కిటికీ భేదించినట్టుగా అద్భుతం వాస్తవంతో అల్లుకుపోయింది. నేల గురించీ, ప్రజల గురించీ, సముద్రాల గురించీ, మహాజదధుల గురించీ, జంతు, వృక్ష రాజ్యాల సంపద గురించీ, ప్రాకృతిక అద్భుతాల గురించీ చెప్పాను.

కొంతమంది ప్రజలు యింకొంత మందిని దోపిడీచేసే ప్రపంచం గురించి చెప్పాను. శ్రామికుల బాధలకి సంబంధించిన, ముఖ్యంగా పిల్లల బాధలకి సంబంధించిన, స్పష్టమైన చిత్రం, యీ ప్రపంచంలో మంచికీ చెడుకీ ఘోరమైన పోరాటం సాగుతోందనీ, మన ప్రజలు ఆనందం కోసమూ, గౌరవం కోసమూ, వ్యక్తిస్వాతంత్ర్యం కోసమూ పోరాడుతున్నారు అనే ఆలోచన పిల్లల్లో మేల్కొంది. చిన్నప్పటినుంచీ సాంఘిక దుర్మార్గం అంటే పిల్లలు ద్వేషించేటట్టు వుండాలి. అప్పుడు వాళ్లు ఒకణ్ణి యింకొకడు దోచుకోవడమంటే అసహ్యించుకుంటారు, మన దేశం ప్రపంచంలో దోపిడీలేని మొదటి దేశంగా చెప్పలేనంత ప్రియమైంది అవుతుంది. బోధనలోని ప్రధాన కర్తవ్యాల్లో ఒకటేమిటంటే పిల్లవాళ్లకి చెడు అనేది నిర్దిష్టమైందనీ, అనిర్దిష్టమైంది కాదనీ, చిత్తశుద్ధిగలవాళ్లకి ద్వేషపూరితమైందనీ తెలియజెయ్యడం. సంపదని కొద్ది మంది పెట్టుబడిదారులూ, భూస్వాములూ స్వాహాచేసి, శ్రామికుల కనీసావసరాలు కూడా తీరీ, తీరకా వున్న దేశాల గురించి చెప్పాను. “సామ్రాజ్యవాదం” అనే పదం గురించి పిల్లలు గాఢంగా అవగాహన చేసుకోవడం అనేది జరగాలని నేను త్వరపడలేదు. తగిన సమయంలో వాళ్లే దాన్ని అవగాహన

చేసుకుంటారు. ఈ వయస్సులో వాళ్ల అనుభూతి ఆవరణలో ఒక పదానికి వున్న నిర్దేశిత అర్థం తెలుస్తుంది.

పిల్లవాని పూర్తి మానసిక పరిణతికి, అతని సుప్త అయిన ఆంతరిక జీవితానికి ఒక అవసరమైన నిబంధన యేమిటంటే, అతనితో సుఖదుఃఖాలు పంచుకునే ఉపాధ్యాయుడు చెప్పే కథలే. వాటి బోధనా ప్రాముఖ్యం యేమిటంటే అద్భుతాల జాడలు పుట్టిన పరిస్థితిలో పిల్లలు వాటిని వినడమే. ప్రశాంత సాయంత్రంవేళ మొదటి నక్షత్రాలు మిణుకు మనేటప్పుడు, చలిమంట చుట్టూతా వున్న అడవిలో, వెచ్చని యింట్లో, కణకణమండే వంటచెరకు బొగ్గుల దగ్గర, ఆకురాలు కాలపు జల్లు బయటపడుతూ వుంటే లేదా చల్లని గాలి విచారగ్రస్తమైన పాటపాడుతూ వుండే స్థితి అది. కథలు స్పష్టంగా వర్ణనాత్మకంగా వుండాలి. మరీ పెద్దవిగా వుండకూడదు. వాస్తవాల గుట్ట పోగుచేసేసి పిల్లలమీద యెన్నో ముద్రలు పడేటట్టు చెయ్యకూడదు. వాళ్లకి కథలపట్ల వుండే సున్నితత్వం చచ్చిపోతుంది. యిక వాళ్లకి దేనిపట్లేనా ఉత్సుకత కలిగించడం అసాధ్యం.

పిల్లల వూహలమీదా, కల్పనాశక్తిమీదా, అనుభూతులమీదా ప్రభావం కలిగించమని నేను ఉపాధ్యాయునికి సలహా యిస్తాను. అనంతమైన ప్రపంచపు కిటికీ క్రమంగా తెరవండి; అంతా ఒక్క సారే భళ్లున తెరవకండి. యీ కిటికీని పెద్ద తలుపులా చెయ్యకండి. యేమంటే అలా చేస్తే మన సదుద్దేశాలు యేమైనప్పటికీ, పిల్లవాని శ్రద్ధ దానిగుండా బంతిలాగా మన పక్కనుంచే దొర్లుకుపోతుంది. యెన్నో విషయాలతోటి ఒక్కసారే వాళ్లని ముట్టడిస్తే పిల్లలు బెదిరిపోతారు. అప్పుడు యివే విషయాలు సారంలో అపరిచిత విషయంగా, బోలుధ్వనులుగా వుంటాయి తప్ప యింకేం కావు.

చుట్టూతా వున్న ప్రపంచాన్ని పిల్లలకి యెలా తెరవాలా అన్నది ఆరుబయలు పాఠశాల నాకు నేర్పింది. యీ భావాన్ని అందరు ఉపాధ్యయులకీ విశదం చేశాను. పిల్లవాణ్ణి జ్ఞానంతో ముంచెత్తవద్దనీ, తమకి తెలిసిందంతా వాళ్లకి చెప్ప ప్రయత్నించవద్దనీ సలహా యిచ్చాను. యెందుకంటే పిల్లల చురుకూ, జిజ్ఞాసా జ్ఞానమనే హిమశిలకింద పూడుకుపోతాయి. చుట్టూతా వున్న ప్రపంచంనుంచి ఒకటి, రెండు విషయాలే ముందు పెట్టేటట్టు వుండండి. అప్పుడు జీవితపు ఒక పార్శ్వం వాళ్ల ముందు ఇంద్రధనస్సు రంగుల్లాగా మెరుస్తుంది. యెప్పుడూ కూడా యేదో ఒకటి చెప్పకుండా వదిలెయ్యండి. పిల్లవాడు మళ్లీ మళ్లీ తను దర్శించిందాంతోటి తిరిగి వస్తాడు.

మానవ ఆలోచన సాధించినవి అపరిమితమైనవి. ఉదాహరణకి మనం ఒక మేటెడు పుస్తకాలు రాశాం. పిల్లలకి ఒక పుస్తకం తాలూకు అందం, తెలివి, లోతు చూపించండి. కాని ప్రతి పిల్లవాడూ యెప్పటికీ అది చదివే వ్యామోహం పొందేటట్టుగా, స్వతంత్రంగా పుస్తక సముద్రాన్ని యీద సిద్ధపడేటట్టుగా మాత్రం చూపించండి. "సజీవ ప్రపంచపు మూలాల్లోకి 'ప్రయాణాలు' " గురించిన నా

ఆలోచనలు పంచుకున్నాను. చుట్టూతా వున్న ప్రపంచంలో తాము తమ కళ్లతో చూసిన సంఘటనలు, జరిగిన పనులూ గురించి పిల్లలు చెప్పిన స్పష్టమైన, చిన్నవైన, రసవంతమైన కథల్ని నేను "ప్రయాణాలు" అన్నాను. ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులు నా ఒరవడి అనుసరించారు. అలాంటి ప్రయాణాలే చేశారు. క్లాస్ రూమ్ తలుపులు తీసేసాం. పిల్లలు పచ్చికమీదకి, తాజా గాలిలోకి వెళ్లడం మొదలెట్టారు. చదవడంలోనూ, లెక్కల్లోనూ పాఠాలు రానురాను తరుచుగా ఆరుబయటే, ముఖ్యంగా ఒకటి, రెండు తరగతుల వాళ్లకి, జరుగుతూ వుండేవి. యీ ఆరుబయలు పాఠాలు పాఠాల్ని కాదనడమూ కాదు, పుస్తకాలనీ, సైన్సునీ తోసెయ్యడమూ కాదు. కాని పూర్తిగా భిన్నమైనదాన్ని అవి చేశాయి. అవి పాఠాల్ని పరిపుష్టం చేశాయి, పుస్తకాల్నీ సైన్సునీ సజీవం చేశాయి.

పాఠాల తర్వాత, అందరు ప్రాథమిక ఉపాధ్యాయులూ స్టాఫ్ రూమ్‌లో చేరి పిల్లలు యెలా చుట్టూతా వున్న ప్రపంచపు జ్ఞానం సంపాదించుకుంటారు, ప్రకృతి, సమాజాల ప్రాథమిక సూత్రాలు సాధిస్తారు, యీ పనంతా విసుగు పుట్టించే నిరర్థక యత్నం కాకుండా యెలా చెయ్యవచ్చును అని ఒకళ్ల అభిప్రాయాలు ఒకళ్లు చెప్పుకునేవారు. యీ సమష్టి సృజన సందర్భంలో ఒక కొత్త ఆలోచన స్ఫురించింది: పిల్లలకి వ్యావసాయిక శ్రమనీ, సాంకేతిక వృత్తులనీ పరిచయం చెయ్యడం, వాళ్లని క్రమేపీ ఆరితేరిన పనివాళ్లకి పరిచయం చెయ్యడం. సజీవ ప్రపంచపు మూలాలకి విద్యార్థుల "ప్రయాణాల" గురించి కలలు కనేటప్పుడు, ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులు, నా సలహామేరకి, ప్రకృతి తాలూకూ విషయాలు, వాటికి సంబంధించిన వ్యావసాయిక పనులూ నాలుగు రుతువుల్లోనూ ప్రతిదాంట్లోనూ ఆలోచనా, భాషా అభివృద్ధిలో ఉపయోగపెట్ట దగినవి ఏవో నిర్ణయించారు.

## మా "స్వప్నాల దిక్కు"

వూరవతల, స్కూల్‌కి దగ్గర పొదలూ, చెట్లూ దట్టంగా పెరిగిన కనుమ వుంది. పిల్లలకిది రహస్యాలతో, కొత్తదానితో నిండిన దట్టమైన అడివిగా కనిపించింది. ఒక రోజున కనుమ యేటవాలులో ఒక గుహద్వారం చూశాను. గుహ లోపల విశాలంగా వుంది. గోడలు దృఢంగా, పొడిగా ఉన్నాయి. అది నిజంగా ఒక ఆవిష్కరణే! మా "స్వప్నాల దిక్కు" యిక్కడ పెట్టుకోవాలి. పిల్లల్ని అక్కడికి మొదటిసారి తీసికెళ్లినప్పుడు వాళ్ల ఆనందం యింతింతని చెప్పలేం. వాళ్ల కేరింతాలకి, పాటలకి, చప్పట్లకి, కేకలకి దాగుడుమూతలకి అడ్డు లేదు! ఆ వేళే మేం నేలమీద యెండుగడ్డి పరిచాం.

ఆ రహస్య స్థావరం చూసి వూరికే సంబర పడిపోయాం. అన్నీ సౌకర్యంగా చేసుకున్నాం. మాకు ప్రతిదీ చక్కగా, హాయిగా అమిరింది. గోడల మీద బొమ్మలు తగిలించాం, సింహద్వారం వెడల్పు చేశాం, ఒక చిన్న బల్ల తయారుచేశాం. ఆ

గుహని వెచ్చబరచడానికి పిల్లలు ఒక చిన్న పొయ్యి సంతోషంగా తయారుచేశారు.

పొయ్యికోసం కొంత జాగా పల్లంచేశాం. పొగగొట్టంకోసం జాగా చేశాం. తవ్విన మట్టిని అవతలకి మోసుకుపోయి, బంకమట్టీ యిటుకలూ తెచ్చాం. అదేం సులభమైన పని కాదు. కాని మాకో ఆశ వుంది – గుహకి పొయ్యిని తయారుచేయడం. ఆ పొయ్యిని రెండు వారాల్లో కట్టేశాం. ప్రతి ఒక్కళ్లూ ఆ పనిలో నిమగ్నులైపోయారు. కోల్యా, స్లావ, తోల్యా కూడా బయట వుండలేకపోయారు. మా సమష్టి చేసే ప్రతిదానికీ ఉదాసీనంగా వుండిపోయే యీ పిల్లలు నాకు ఆందోళన కలిగించారు. కాని యిప్పుడు వాళ్ల కళ్లు రానురాను మెరుస్తున్నాయి, ఆ ఉత్తేజపు కాంతి చాలా కాలం మాయలేదు. ఆసక్తికరంగా వుండే యీ ఘటన పిరికిగా, సిగ్గుగా, సంకోచంగా వుండే సాష, ల్యూదా, వాల్యా లాంటి పిల్లల్ని కూడా ఉత్తేజపరిచింది. సమష్టి అనుభూతీ, ఉమ్మడి సంతోషం, ఉత్సాహం పిల్లల్ని ఏకం చేసే ఆంతరంగిక శక్తులు అనీ, అందరూ చేసేది పట్టించుకోకుండా వుండే వాళ్లల్లో కూడా ఆసక్తిని మేల్కొల్పేవి అని నాకు మరింత దృఢ నమ్మకం ఏర్పడింది.

ఆఖరికి పొయ్యిలో నిప్పు ముట్టించాం. యెండిన కొమ్మలు హుషారుగా మండాయి. చీకటి కమ్మింది. అయినా మా రహస్య స్థావరం కాంతివంతంగా, సుఖంగా వుంది. కనుమ సానువులో దట్టంగా వున్న చెట్లకేసీ, పొదలకేసీ చూశాం. అక్కణ్నుంచి, నిగూఢమైన దుబ్బులనుంచి అద్భుత కథల చిత్రాలు మాకు వచ్చాయి. "మా గురించి ఒక కథ చెప్పండి, బాబూ" అని అడుగుతున్నట్టున్నాయి. సాయం సంధ్య నాటి కనిపించీ కనిపించని మసకలో చెట్లూ పొదలూ కమ్ముకుపోయాయి. మొదట్లో నీలంగా, తర్వాత దానిమ్మ పువ్వురంగులాగా. మసకలో చెట్లు వింతవింత స్థూలరేఖలు తీసుకుంటున్నాయి.

అలాంటి వేళల్లో పిల్లలు ఆతృతగా విపరీత వూహలు చేస్తారు, కథలు అల్లుతారు.

"ఆ కనుమ సానువులో కిక్కిరిసిపోయిన చెట్లు యెలా కనిపిస్తున్నాయి?" అన్నాన్నేను, పిల్లలనుద్దేశించే అన్నట్టూ కాకుండా, నాకు నేనే యేదో ఆలోచిస్తున్నట్టుగా. నాకు అవి కొండ శిఖరపు టంచులనుంచి వేగంగా దూకి మరకతాల్లోనూ, పచ్చల్లోనూ చెక్కిన విగ్రహాలలాగా వుండే ఘనీభవించిన ఆకుపచ్చ జలపాతాల్లో కనిపించాయి. నాకు కనిపించిందే యే పిల్లవాడికేనా కనిపించిందా అని అనుకున్నాను. పిల్లలు యెలా ఆలోచిస్తారో గమనించడానికి సాయంవేళ తగిన సమయం.

ఒక పిల్లవాడి వూహలు అదుపులేకుండా, వేగంగా, కొత్త కల్పనలని సృష్టిస్తూ ప్రవహించడం గమనించాను. యింకొకళ్లు విశాలమైన, లోతైన, కొన్ని స్థలాల్లో మెల్లిగా అయినా నిగూఢంగా వున్న మహానదిలాగా ఆలోచిస్తున్నారు. ఆ నదికి ప్రవాహం వుందా లేదా అన్నది స్పష్టంగా లేదు. కాని అది శక్తివంతంగా, అణచలేనట్టుగా వుంది. మిగతా పిల్లల వేగమైన, తేలికైన ఆలోచనా ప్రవాహాన్ని

అడ్డగిస్తే అది వెంటనే మళ్లించిన వైపు ప్రవహిస్తోంది. చెట్ల చిటారు కొమ్మల్లో షూరకి ఒక ఆవుల మంద కనిపించింది. "కాని అవి యెక్కడ మేస్తాయి? అక్కడ గడ్డి లేదుగా" అని సెర్యోజ అడగ్గానే షూర వూహ మార్చేసుకున్నాడు. అవి ఆవులు కావు: అవి నేలమీద రాత్రికి విశ్రాంతి తీసుకుందామని దిగి వచ్చిన మేఘాలు. యూర వూహలు అంతే వేగంగా విహరిస్తూ మారిపోయాయి. కాని మీష, నీనాలు తదేకదృష్టితో నిశ్శబ్దంగా చూస్తూనే వున్నారు. వాళ్లకేం కనిపించింది? పిల్లల వూహల్లో పుట్టిన డజన్ల కొద్దీ చిత్రాలు అప్పుడే మమ్మల్ని దాటి పోయాయి, కాని మీష, నీనాలు నిశ్శబ్దంగా వుండిపోయారు. స్లావ కూడా. వాళ్లకేవూహా రాలేదా? యింటికి పోయే వ్యవధి అయింది. అందర్లోకీ నెమ్మదైన కుర్రాడు మీష చెప్పాడు: "తన కొమ్ములతోటి కొండ మొహాన్ని మొత్తే కోపిష్టి యెద్దు అది. కొండతో నెగ్గలేదు కదా అది, అందుకని ఆగింది. అదుగో, యెలా యాతన పడుతోందో, కొండ అంచుని తోసుకుంటోందో..."

హఠాత్తుగా మమ్మల్ని చుట్టేసిన చిత్రాలన్నీ యెగిరిపోయాయి. ఆ చెట్ల గుంపు నిజంగా వింతగా నిశ్చల ఆగ్రహ వృషభంలా ద్యోతకమైంది. పిల్లలు కీచుమనడం మొదలెట్టారు: అదుగో యెద్దు కనుమ దిగువన కాళ్లు ఆన్చింది. చూడండి మెడ వంచింది – దాని నరాలు బహుశా వణుకుతున్నాయి, దాని కొమ్ములు నేలలో పొడుచుకున్నాయి.

మీష యేం వూహించాడు! మా తలలపై స్పష్టమైన సజీవ చిత్రాలు విహరిస్తుండగా అతని వూహ అనే నది తన దారిన ప్రవహించింది. అతను తన మిత్రులు చెప్పింది శ్రద్ధగా విన్నాడు, కాని ఒక్క చిత్రం కూడా అతనికి సమ్మోహకంగా కనిపించలేదు. అతని వూహ అన్నిటికంటే స్పష్టంగా, సమంజసంగా వుంది. అతని వూహ తను బహుశా వాస్తవంగా చూసిందీ, తన దృష్టిని ఆకర్షించి తనమీద ముద్ర వేసిందీనీ. అలాంటి ముభావపు మేదకులైన పిల్లలు చదివేటప్పుడు యమబాధ పడిపోతారు. ఉపాధ్యాయుడు పిల్లవాణ్ని యింకా వేగంగా ప్రశ్నలకి జవాబివ్వమంటాడు; పిల్లవాడు యెలా ఆలోచిస్తున్నాడు అన్నది అతను పట్టించుకోడు; అతనికి జవాబు కావాల్లి, మరి తను మార్కు వెయ్యాలికదా. యీ నెమ్మదైన, అయినా బ్రహ్మాండమైన నదిని వేగవంతం చెయ్యడం అసాధ్యమని ఉపాధ్యాయునికి తట్టదు. ఆ నదిని దాని స్వభావానికి తగ్గట్టు ప్రవహించ నివ్వండి; దాని నీళ్లు గమ్యం తప్పకుండా చేరతాయి, కాని తొందర పెట్టకండి. దయచేసి ఆందోళన పడకండి; చెడ్డ మార్కులు అనే తుమ్మ బరికెలతో యీ మహానదిని కొట్టకండి – యేమీ లాభం లేదు.

...పుట్టిన దగ్గర్నుంచి జ్ఞానంవచ్చేదాకా యెదగడానికి మానవ శరీర పరిణామంలో పట్టే కాలం జంతు ప్రపంచంలోని అన్ని తరహా వాటికంటే అత్యధికమని ప్రతి ఉపాధ్యాయుడూ గుర్తుంచుకోవాలి. మానవ శరీరం యిరవై యేళ్లో, యింకొంచెం యెక్కువ కాలమో యెదుగుతుంది, అభివృద్ధి చెందుతుంది, బలం పుంజుకొంటుంది. మానవ శరీర అభివృద్ధికి యెందుకు అంత

కాలమవసరమో అనేది ప్రకృతి విచిత్రాల్లో ఒకటి. యింత కాలం నాడీమండలం - మెదడు పేటిక - అభివృద్ధికీ, బలపడటానికీ, బోధనకీ అవసరమవుతుందేమో. సుదీర్ఘ "నాడీమండల శైశవం, మెదడు బాల్యం" అనుభవిస్తారు కనుక మానవుడు మానవుడుగా అవుతాడు.

పిల్లవాడు కొన్ని కోట్ల జీవకణాలతో పుడతాడు. అవి చుట్టూ వున్న ప్రపంచంపట్ల తక్షణ ప్రతిచర్యతో వుంటాయి. కొన్ని సందర్భాల్లో మానసిక క్రియలకి సంబంధించి వుంటాయి. యీ కణాలే చైతన్యానికి పాదార్థిక పునాది. పుట్టుక దగ్గర్నుంచి జ్ఞానం వచ్చేదాకా, అక్కణ్ణుంచి వార్థక్యందాకా ఒక్క కొత్త మెదడు కణం కూడా అభివృద్ధి చెందదు. శైశవంలో ఆ బూడిదరంగు పదార్థం చురుగ్గా పనిచేసేటట్టు అనుదినం శిక్షణ యివ్వాలి. యీ అభ్యాసాల ఆధారంగా సజీవగ్రహణ శక్తి, పరిశీలన, ధ్యానం వస్తాయి.

చుట్టూతా వున్న ప్రపంచంలోని కార్యకారణ సంబంధాల అంతస్తత్వంలోకి లోతుగా చొచ్చుకుపోవడం నేర్చుకునే ముందుగా, మనిషి బాల్యంలో యీ మానసిక అభ్యాసాల దశ గడపాలి. యీ అభ్యాసాలు అంటే వస్తువులను, ప్రకృతి విషయాలను, సంఘటనలనూ చూడడం, పరిశీలించడం. పిల్లవాడు మొదట సజీవచిత్రం చూస్తాడు. అప్పుడు వూహించుకుంటాడు, ఆ చిత్రాన్ని తన మనస్సులో సృష్టిస్తాడు. వస్తువును చూడ్డం, వూహాలో దాని చిత్రాన్ని సృష్టించుకోవడం - యీ రెండు దశల మానసిక క్రియలోనూ వైరుధ్యాల్లేవు. పిల్లవాళ్లు వూహించిన కథల్లోని కల్పిత చిత్రాలు వాళ్లకి వాస్తవమంత తేటగా వుండేవే. కల్పిత చిత్రాలు సృష్టించడం ఆలోచన అనే కల్లోలపు పైరు అభివృద్ధి చెందగలగడానికి సారవంతమైన భూమి.

బాల్యంలో, చుట్టూతా వున్న ప్రపంచంనుంచి సజీవ, స్పష్ట, వర్ణనాత్మక దృష్టాంతాలు ఆలోచనా క్రమంలో యెంత వీలైతే అంతగా ముడివడి వుండాలి. మొదట్లో కార్యకారణ సంబంధంతోటి పిల్లవాణ్ణి గాభరాపెట్టకండి. వూరికే వాణ్ణి ఒక వస్తువుని చూడనివ్వండి, అందులో కొత్తదాన్ని దర్శించనివ్వండి. సాయంకాలపు మసక కమ్మిన చెట్లలో చిన్న మీష ఆగ్రహించిన వృషభాన్ని చూస్తాడు. యిది వూరికే విపరీతపుటూహాల క్రీడ గాదు, ఆలోచనలోని కళాత్మక, కావ్యాత్మక అంశం కూడా. మరొక పిల్లవాడు అదే చెట్లలో యింకోటేదో చూస్తాడు - అతను వాటిలో వ్యక్తిగత గ్రహణ, వూహా, ఆలోచనా లక్షణాలను వ్యక్తం చేస్తాడు. ప్రతి పిల్లవాడూ గ్రహించడమే కాదు, చిత్రిస్తాడు, సృష్టిస్తాడు కూడా. పిల్లవాని ప్రపంచ దర్శనం అద్వితీయ కళా సృష్టి. యేకకాల మందు గ్రహించి, సృష్టించబడిన చిత్రం ఉద్రేకోత్సాహాల శ్రావ్యతతో మిళితమై వుంటుంది. చుట్టూతా వున్న ప్రపంచంలోని చిత్రాలు చూసి, వాటికి తమ సొంత వూహలు జత చేసినప్పుడు పిల్లలు పరమానంద భరితులైపోతారు. గ్రహించినదాన్ని రసప్లావితం చెయ్యడం పిల్లల సృజనాత్మకతకి ప్రేరణ. ఉత్సాహం లేకుండా పిల్లల మెదడు కణాల మామూలు అభివృద్ధి అసాధ్యమని నా గట్టి నమ్మకం. పిల్లల మెదడులో జరిగే జీవకణ నిర్మాణ

క్రమం ఉద్రేకోత్సాహాలతో ముడిపడివుంటుంది: ఆదుర్దా, ఉత్సాహం, ఆసక్తి లాంటివి వున్న సమయంలో మెదడు పై భాగపు జీవకణ పోషణ పెరుగుతుంది. యీ సమయాల్లో కణాలు యెక్కువ శక్తిని వ్యయం చేస్తాయి. కాని మరోపక్క అవి శరీరంనుంచి యెంతో శక్తిని తీసుకుంటాయి కూడా. అనేక సంవత్సరాలుగా ప్రాథమిక తరగతులలోని విద్యార్థుల మేధా శ్రమని గమనించిన మీదట, ఉత్తేజితులై వున్నప్పుడు పిల్లల ఆలోచనలు స్పష్టంగా వుంటాయనీ, యెక్కువ గాఢంగా జ్ఞాపక శక్తి వుంటుందనీ నేను భావించాను.

యీ పరిశీలనలు పిల్లల బోధనా క్రమాన్ని మరింత తేటతెల్లం చేస్తాయి. ప్రాథమిక తరగతులలోని పిల్లల ఆలోచనలు అనుభూతినుంచీ, అనుభవంనుంచీ విడదియ్యలేనట్టుగా వుంటాయి. బోధనా క్రమాన్ని, ముఖ్యంగా చుట్టూతా వున్న ప్రపంచాన్ని గురించి గ్రహించడం అనే దాన్ని, ఉత్తేజితం చెయ్యడం అనేదాన్ని పిల్లల ఆలోచనా క్రమపు అభివృద్ధి ధర్మం అపేక్షిస్తుది.

...అనుకోకుండా వెచ్చని ఆకురాలు కాలపు రోజులు వచ్చాయి. మేం ఒక చోట కూర్చోలేదు. పొలాల్లోనూ అడవుల్లోనూ తిరుగుతూ, కాసేపు "స్వప్నాల దిక్కులో" ఆగుతూ వచ్చాం. వూరికి రెండు కిలోమీటర్ల దూరంలో ఒక చిన్న దిబ్బ వుంది. అక్కడినుంచి వూరి పచ్చని తోటలా, సుదూరపు పొలాలా, ముదురునీలపు దిబ్బలా, అడవులా చక్కని దృశ్యం పిల్లలకి కనబడింది.

ప్రతిరోజూ పిల్లలు ఏదో కొత్తదాన్ని కనిపెట్టేవాళ్లు. పచ్చని తోవ వాళ్ల కళ్లముందే కెంపువన్నె తిరిగింది; ఆకులన్నీ యెంతో వైవిధ్య వర్ణశోభితమయ్యాయి. యీ ఆవిష్కరణలు పిల్లలకి చాలా సంతోషాన్నిచ్చాయి.

సజీవ పదం, సృజనాత్మక ఆలోచన తాలూకు వనరులు యెంత దండిగా, తరగనివిగా వుంటాయంటే మనం గంటకో ఆవిష్కరణ చెయ్యగలిగినా, యీ ఆవిష్కరణలు కొన్ని యేళ్లకి సరిపడా వుంటాయి. మా ముందు నిగనిగలాడే యెర్రటి అడవి గులాబి పువ్వు బెర్రీల్లో, పరుచుకొని వెండిబూజులు వున్నాయి. అవి ఒక బెర్రీనుంచి ఇంకో బెర్రీకి ఉదయపు హిమ బిందువులలో వణుకుతూ వున్నాయి. ఆ బిందువులు పుష్యరాగపు రంగులో వున్నాయి. ఆ పొదల దగ్గర మంత్రముగ్ధులమై నిలుచుండిపోయాం. ఒక అద్భుతమైనదాన్ని చూశాం. ఆ బిందువులు యేదో ప్రాణంతో వున్నట్టుగా బూజుల అంచులనుంచి మధ్యలోకి జారి వాటిని భారంగా వేలాడేటట్టు చేశాయి అవి ఒకదానితో ఒకటి కలిసి పోయాయి. కాని పెద్దవై కిందపడ లేదు. మేం యీ దృష్టిలో వుండిపోయాం: మంచు బిందువులు త్వరగా యిగిరి పోయినట్టుంది. మా కళ్ల ముందే అవి పరిమాణం తగ్గి, తర్వాత మొత్తానికే మాయమైపోయాయి.

"యీ చిన్న బిందువుల్ని తాగేస్తున్నాడు సూర్యుడు" మెల్లగా అంది లరీసా. ఆమె వూహలో పుట్టిన చిత్రం పిల్లల దృష్టిని ఆకర్షించింది. యింకో కొత్త కథ పుట్టింది. యిక్కడ, యీ అడవి గులాబి పువ్వు పొదల దగ్గర, సజీవ పద మూలం

దగ్గర, అద్భుతమైన సెలయేరు పిల్లల ముందు వెల్లడి అయింది. బహుశా అది యాధాలాపంగా కావచ్చు, కాని కాస్త ముందు వెనకల్లో అలా అయి తీరాలి: మంచు బిందువు చెట్ల పిందెలు అని మాటలు అంత్య ప్రాసలతో ఒక్కలాగే వుండటం లరీసా గమనించింది. యీ ఆశ్చర్యకరమైన కాకతాళీయతకి పిల్లల్లో వెలుతురు ప్రసరించినట్లైంది. వాళ్లు బహుశా తమ అన్నలూ అక్కలూ పుస్తకాల్లో నుంచి చదివిన పద్యాలు వినే వుంటారు కాని యిక్కడ యీ పద్యం సజీవ పదంనుంచి, వాళ్లని పరివేష్టించి వున్న ప్రపంచంనుంచి పుట్టింది:

*"మంచు బిందువు రాత్రి జారింది,*
*సాలెగూడు దాన్ని అందుకొంది"*

అంది లరీసా. ఆమె కళ్లు సంతోషంతో మెరిశాయి. ప్రతి ఒక్కళ్లూ నిశ్శబ్దంగా వున్నారు. కాని ఆ మాటల శక్తికి అద్భుత అనుభూతి కలిగి ప్రతివాళ్ళ వూహలూ రాకెట్లల్లా పైకి దూసుకుపోవడం గమనించగలిగాను.

"అప్పుడు అందమైన పిందె చలించింది" అని యూర కొనసాగించాడు.

ఉనికి తాలూకు మూలాల దగ్గరికి వెడితే జరిగేది యిదే. వూరికే వస్తువుల పేర్లు కావు, పువ్వుల సుగంధం, యీ భూమి సువాసన, మీ స్వంతపచ్చిక బీళ్ల అడవుల సంగీతం, వ్యక్తిగతమైన అనుభూతులు, అనుభవాలు.

విద్యా నియమానుసారంగా పిల్లలు ఆ పద్యం యింకా చెప్పాలని నేను సూచించి వుండాలి. కాని ఆ రూళ్లన్నీ నా బుర్రలోనుంచి యెగిరిపోయాయి. నేనూ పిల్లల కల్పనా ధారలో చొచ్చుకుపోయి అనుకోకుండా అనేశాను:

*"మంచు బిందువుని సూర్యుడు హరించేస్తే,*
*సాలెగూడు శుభ్రమై పోయింది.*
*ఎర్రటి పింది నవ్వింది."*

మేం అరుస్తూ యీ పదం పాడుతూ పొదచుట్టూ పరిగెత్తాం. యీ ప్రేరణ వెల్లువని గురించి దీనికి ఆధారమైన చుట్టూతా వున్న ప్రపంచం గురించి వెంటనే నాతోటి ఉపాధ్యాయులకి చెబుదామనుకున్నాను. ఆలోచింప చేసే మొదటి పాఠాలు క్లాసురూమ్‌లో కాదనీ, బ్లాక్‌బోర్డు యెదరగా చెప్పడం కాదనీ ప్రకృతిలో జరపాలని వాళ్లకి సలహా యివ్వాలనుకున్నాను. పొలాల్లోకి పొండి, వనాల్లోకి పొండి. ఆలోచన జన్మస్థానం నుంచి సేవించండి, యీ సజీవ జలం మీ విద్యార్థుల్ని వివేకవంతులైన పరిశోధకులుగా, శోధకులుగా, జిజ్ఞాసాత్ములుగా, కవులుగా తయారుచేస్తుంది. కవితాత్మక, సౌందర్య రసాత్మక వెల్లువలు లేకపోయినట్లయితే పిల్లవాళ్ల మేధా శక్తుల్ని పూర్తిగా అభివృద్ధి చెయ్యడం అసాధ్యమని నాకు గట్టి నమ్మకం యేర్పడిపోయింది. పిల్లల ఆలోచనా స్వభావమే కవితాత్మ సృజన నపేక్షిస్తుంది. సౌందర్యమూ, సజీవ ఆలోచనా సూర్యుడూ, పువ్వులూలాగా వస్తుత్వా అల్లుకు పోయివుంటాయి. కవితా

సృజన సౌందర్య దర్శనంతో మొదలవుతుంది. ప్రకృతి సౌందర్యం గ్రహణని పదును పెడుతుంది, సృజనాత్మక ఆలోచనని మేల్కొల్పుతుంది, ప్రపంచంపట్ల వైయక్తిక అనుభవాన్ని జోడిస్తుంది. బాల్య దశలోనే ఒకడు సొంత భాషలోని అన్ని పదాలు యెందుకు సాధిస్తాడు? యెందుకంటే యీ దశలోనే పరివేష్టిత ప్రపంచ సౌందర్య ప్రథమావిష్కరణలు జరుగుతాయి కనక. యెందుకంటే ప్రతి మాటలోని భావమూ గోచరమవడమే కాక, సౌందర్యపు సున్నితమైన శ్రావ్యత కూడా చూడ్డం జరుగుతుంది కనుక.

## ప్రకృతి - మంచి ఆరోగ్యానికి మూలం

చదువులలో మంచి అభివృద్ధి సాధించని వాళ్లలో యెనభై అయిదు శాతం మంది అలా అవడానికి కారణం అనారోగ్యం, యేదో ఒక విధమైన నలత లేదా జబ్బు అని అనుభవం చెబుతోంది. అవి సామాన్యంగా యెవరూ గమనించకుండా పోతూవుంటాయి, కాని తల్లిదండ్రులా, డాక్టర్లా, ఉపాధ్యాయులా ఐక్యకృషివల్ల నయం కాగలవే. చదువులో మందంగా వుండటమనేది పిల్లవాడు కూడా తనకిగా గమనించలేని సామాన్యమైన నలతవల్లనేననీ, మెదడుకు సంబంధించిన దోషాలు కాదని యెన్నో సంవత్సరాల అనుభవం తెలియజేస్తోంది. కొంతమంది పిల్లల్లో మందగించిన ఆకలి కనిపిస్తుంది. కొంచెం ఎక్కువ తిందామనే స్వల్ప ప్రయత్నాలు కూడా వికటిస్తాయి. శరీరంమీద చమరకాయులు కనిపిస్తాయి. యెంతో జాగ్రత్తగా చేసిన వైద్య పరిశీలనవల్ల కూడా యేమీ తెలియదు: పిల్లవాడు ఆరోగ్యంగానే వున్నాడు. చాలా సందర్భాల్లో, మనం యేదో దీర్ఘకాలం నాలుగ్గోడల మధ్యా కూర్చున్న దానివల్ల వచ్చిన జీర్ణక్రియా దోషంతోటి తన్నుకులాడుతున్నామని తేలుతోంది. అలాంటి సందర్భాల్లో పిల్లవాడు యేకాగ్రత, మేధాశ్రమ చేసే శక్తీ కోల్పోతాడు. అలాంటి నలతలున్న వాళ్ళ సంఖ్య శరీరం వేగంగా యెదిగేటప్పుడూ, యౌవన కాలంలోనూ పెరుగుతుంది.

అలాంటి సందర్భాల్లో సమూలమైన చికిత్స యేమిటంటే, పనిలోనూ, ఆటల్లోనూ వుండే క్రమం మార్చడమే: యెక్కువ కాలం ఆరుబయలులో గడపడం, పెందరాళే నిద్రపోయి పెందరాళే లేవడం, మంచి ఆహారం.

కొంతమంది పిల్లలు ఆరోగ్యంగానే కనిపిస్తూ వుంటారు. కాని వాళ్ళ పని దగ్గరగా పరీక్షిస్తే అది పైకి తేలని రుగ్మతని దేన్నో రుజువు చేస్తుంది. అదే చిత్రమైంది: ఉపాధ్యాయుడు ప్రతిక్షణాన్నీ తీవ్రమైన మేధా శ్రమతో నింపాలని ప్రయత్నించినప్పుడు పైకి తేలని రుగ్మతలూ నలతలూ ముఖ్యంగా వెల్లడవుతాయి. యీ "త్వరపడడం" పూర్తిగా ఆరోగ్యవంతులైన పిల్లవాళ్ళకి కూడా హానికరమేనని నా ఖాయమైన అభిప్రాయం. విపరీతమైన మానసిక శ్రమ పిల్లల కళ్లని మొద్దు బారుస్తుంది, వాళ్ళ చూపులని మసక కమ్మేస్తుంది. వాళ్ళని మందమతుల్నిగా

చేస్తుంది. ఆ స్థితిలో పిల్లవాడు దేనికీ పనికి రాదు; అతనికి కావలసిందల్లా తాజాగాలి.

"సంతోష చంద్రశాల" మొదటి వారంలో నేను పిల్లల ఆరోగ్యాన్ని అతి శ్రద్ధగా పరిశీలించాను. పిల్లలంతా కూడా పల్లెటూళ్లో, ప్రకృతి ఒడిలో పెరిగిన వాళ్లైనా, వాళ్లల్లో కొంతమంది పాలిపోయి, బలహీనమైన ఛాతీలతో ఉన్నారు. వొలోద్య, కాత్యా, సాన్యలు సామ్యం చెప్పినట్టు ఒట్టి యెముకల పోగులు తప్ప యింకేం కారు. వాళ్ళు సన్నగా నీరసంగా వున్నారు. చాలామంది పిల్లలు యిళ్లదగ్గర బాగానే తినేవాళ్ళు; కొంతమంది బలహీనతకి ముఖ్య కారణం యేమిటంటే, వాళ్ళు ఉష్ణ గృహాల్లోని మొక్కల్లా వుండటం – వాళ్ళ తల్లులు వాళ్ళని పిసరుగాలి దెబ్బనుంచి కూడా రక్షించే వాళ్ళు. పిల్లలు "సంతోష చంద్రశాల" మొదటి కొద్ది రోజుల్లోనే అలసిపోయారు; వాళ్ళకి ఒక కిలోమీటరు నడవడం కూడా కష్టంగా వుండేది. వాళ్ళ మందగించిన ఆకళ్ళని గురించి వాళ్ళ తల్లులు ఫిర్యాదు చేసేవాళ్ళు.

తాము పిల్లల్ని శీతాన్నుంచి యెంతగా రక్షించదలచుకుంటే అంతగా పిల్లలు నీరసపడిపోతారని తల్లిదండ్రుల్ని ఒప్పించాను. నా సలహా మేరకి వాళ్ళంతా వేడిగా వుండే రోజుల్లో చెప్పుల్లేకుండా పిల్లల్ని స్కూల్‌కి పంపించడానికి ఒప్పుకున్నారు – అది పిల్లలకి మహదానందమైంది. ఒక రోజున పొలంలో వుండగా వేసవి జడి మొత్తింది. పిల్లలు ఆ నీళ్ళ గుంటల్లోనుంచే యిళ్ళదాకా నడిచిపోయారు; తల్లిదండ్రుల భయాలెన్ని వున్నా, వాళ్ళల్లో ఒక్కళ్లూ జిర్రున చీదలేదు. పిల్లలకి వూపిరి సలపకుండా బట్టలు తాపడం చేసేయ్యొద్దనీ, "ఒకవేళ యేదన్నా జరుగుతుందేమో" నని వేసే అదనపు స్వెట్టర్లనీ, చొక్కాలనీ వదిలెయ్యమనీ అతి కష్టంమీద తల్లిదండ్రులని ఒప్పించాను. నాకో నియమం వుంది; పిల్లలు ఆకురాలు కాలంలోనూ, వసంత ఋతువులోనూ, వేసవిలోనూ అంతసేపూ ఆరుబయటే వుండాలి. "సంతోష చంద్రశాల" మొదటి మూడు నాలుగు వారాలూ పిల్లలు రోజుకి రెండు, మూడు కిలోమీటర్లు నడిచేవాళ్ళు. రెండో నెల వచ్చేసరికి నాలుగు, అయిదు; మూడో నెలకి ఆరు కిలోమీటర్లు నడిచేవాళ్ళు. యీ నడకంతా కూడా పొలాల్లోనూ, పచ్చిక బీళ్ళల్లోనూ, తోపుల్లోనూ, అడవుల్లోనూనూ. రోజులో యెంత నడిచిందీ దృష్టిలో వుండేది కాదు, యెందుకంటే యిన్ని కిలోమీటర్లు నడవాలి అన్న గమ్యం లేదు కాబట్టి. ఆ కదలిక, నడక మరో లక్ష్యానికి సాధనం మాత్రమే. పిల్లలు అక్కడికీ యిక్కడికీ తిరగాలనుకుంటారు, యెందుకంటే వాళ్లేదో ప్రపంచాన్ని ఆవిష్కరించుకుంటున్నా మనుకుంటారు. పిల్లలు యిళ్ళకి అలిసిపోయే వెళ్లేవాళ్ళు, కాని ఆనందంగా, ఉత్సాహంగా ఉండేవాళ్లు. అలసట లేకుండా మంచి ఆరోగ్యం అసాధ్యం. పిల్లవాడి శక్తి శ్రమించిన తర్వాత విశ్రాంతి తీసుకుంటున్నప్పుడే, ఆరోగ్యవంతమైన జీవరసాయన ప్రక్రియ జరుగుతుంది.

శుభ్రమైన గాలిలో కొన్ని కిలోమీటర్లు నడిచిం తర్వాత పిల్లలు యిళ్ళకీ, "ఆకలితో అవురావురు" మంటూ చేరేవాళ్ళని వాళ్ళ తల్లిదండ్రులు అన్నారు.

అడివిలోకి వెళ్లేటప్పుడు పిల్లల్ని రొట్టె, ఉల్లిపాయలూ, ఉప్పూ నిప్పూ, కొన్ని ఉడకపెట్టిని బంగాళాదుంపలు కూడా తెచ్చుకొమ్మనేవాణ్ణి. "పిల్లలు అలాంటివి తింటారా యెందుకంటే యిళ్ళదగ్గర యింకా బాగా వుండేవే తినరే" అని తల్లిదండ్రులు అనుమానించారు. కాని అడవిలో అదే రొట్టె, ఉల్లిపాయలు, అక్కడ ఉడకపెట్టిన బంగాళాదుంపలు అన్నిటినీ మించిన యెంతో రుచికరమైన తిండిలా వుండేవి. పిల్లల ఆకలి యెంత యెక్కువైందంటే వాళ్లు యిళ్ళదగ్గర పెట్టిన భోజనం సంతోషంగా తినేసేవాళ్ళు. ఒక నెల అయే నాటికి, బాగా పాలిపోయిన పిల్లల బుగ్గలు కూడా గులాబీ రంగు తేలాయి, పిల్లలు యెంత బాగా తినేది తల్లులు అందుకోలేకపోయేవాళ్లు. కెక్కరించి తినడం పోయింది; మీరేది కంచంలో పెట్టండి, పిల్లలు తినేసేవాళ్ళు.

శరీర వ్యాయామానికి కదులుతూ వుండటం ముఖ్యమైంది. పిల్లలు ఆటలన్నా, పరిగెట్టడమన్నా యిష్టపడతారు. వాళ్ళకి ఒక ఆట స్థలం తయారుచేశాం. బహిరంగ స్థలంలో ఆటలకీ, వినోదానికీ అవసరమైన ప్రతీదీ అక్కడ వుంది, కాని యింకా వుండాలని నేను అనుకున్నాను. ఒక పెద్ద సంబరం - రంగుల రాట్నం - చెయ్యాలని నా ఉద్దేశం; వాళ్ల చురుకైన ఆటలన్నీ అద్భుత కథలతో, విపరీత వూహలతో ముడిపడివుండాలని అనుకున్నాను. నాకు నేనే ఆ రంగుల రాట్నపు కొయ్య చక్రంమీద ఒక చిన్ని గూనిగుర్రం, ఒక యేనుగు, ఒక బూడిదరంగు తోడేలు, ఒక జిత్తులమారి నక్క బొమ్మలు నుంచున్నట్టు వూహించుకున్నాను. పిల్లలు గూని గుర్రంమీదా, బూడిదరంగు తోడేలుమీదా కూర్చున్నామనే కాదు స్వారీ చేయడమనే ఉత్సాహం కూడా పొందుతారు. యిదంతా కూడా కలేకాని ఆర్నెల్లకో యేడాదికో అది చెయ్యగలమని నేను గట్టిగా నమ్మాను. రంగుల రాట్నానికి అవసరమైన సామగ్రీ సరంజామా సేకరించాను. పిల్లల్ని శీతకట్టుకి యెలా తయారుచెయ్యాలా, వాళ్లు యెక్కువ వ్యవధి ఆరుబయట గడపగలిగి, యెక్కువ తాజాగాలి పొందేటట్టుగా వుంటారా అని ఆలోచించాను.

చిన్న బడిపిల్లల శారీరక అభివృద్ధిని యెన్నో యేళ్లుగా పరిశీలించడం వల్ల ఆరోగ్యకరమైన పౌష్టిక ఆహారం ముఖ్యమని నాకు నమ్మకం కలిగింది. శరీరపు పెరుగుదలకీ, రోగ నిరోధానికీ, మాములు జీర్ణక్రియకీ అవసరమైనన్ని పదార్థాలు తగినంతగా చాలామంది పిల్లలకి అందటంలేదు. ఎనిమిది కుటుంబాలకి మాత్రమే తేనె వుంది. మరి ఆలంకారికంగా చెప్పాలంటే తేనె కంచంలో పెట్టిన సూర్య ఖండం. దీన్ని గురించి నేను తల్లిదండ్రులతో మాట్లాడాను, ఎదిగే పిల్లలకి తేనె అంత అవసరమని నా నమ్మకం. సెప్టెంబరు ఆఖరు నాటికి పదముగ్గురు తల్లిదండ్రులు తేనె గూళ్లు కొన్నారు. వసంతకాలం నాటికి యిరవై మూడు కుటుంబాలకి తేనెటీగలు కూడా అమిరిపోయాయి.

ఆకురాలు కాలంలో అడవి గులాబి బెర్రీలనుంచీ, స్లోయె బెర్రీలనుంచీ యింకా అలాంటి సమృద్ధిగా విటమినులున్న పళ్లనుంచి దండిగా జామ్ చెయ్యమని

నేను తల్లులకి చెప్పాను. శీతాకాలమంతా తాజా పళ్లు లభ్యం కావడంకోసం తగినన్ని పళ్లచెట్లు నాటమనీ, పల్లెటూళ్లో యిది యేర్పాటు చెయ్యడం చాలా సులభమనీ, అంతా చేస్తే కొంచెం శ్రమ మాత్రమే అవసరమనీ నేను తల్లిదండ్రులతో మాట్లాడాల్సి వచ్చింది.

గోధుమ, రై, బార్లీ, బక్‌వీట్, పచ్చిక బీళ్లగడ్డి వున్న ఫైటాన్ సైడ్స్‌తో నిండిన శుభ్రమైన గాలి ఆరోగ్యానికి చాలా మంచిది. పిల్లల్ని తరుచుగా నేను, ధాన్యపు సువాసన నిండిన తాజాగాలి పీల్చేటందుకు పచ్చిక బీళ్లమీదకి తీసుకెళ్లేవాణ్ణి.

పిల్లలకి దృష్టి దోషం యెందుకు వుందా అని కొన్నేళ్లుగా నేను పరిశీలించాను. యెందుకు అంతమంది మూడో తరగతి వాళ్లు అద్దాలు పెట్టుకుంటారు? చాలామంది పిల్లల్ని పరిశీలించిన మీదట అది చదవడం వల్ల కళ్లకి వచ్చిన అలసట కాదనీ, విటమిన్లు లోపించిన ఆహారమూ, తగినంత శరీర వ్యాయామం లోపించడమూ కారణమని నాకు నిర్ధారణ అయింది. యీ లోపాలు చాలామంది పిల్లల్ని జబ్బులకి గురి అయేటట్టు చేస్తాయి. కొన్ని బాల్య అస్వస్థతలవల్ల కూడా దృష్టి దెబ్బ తింటుంది. ఆరోగ్యకరమైన ఆహారం, మంచి నిద్ర, శరీర వ్యాయామం పిల్లల్ని అస్వస్థతలనుంచి కాపాడతాయి. వాళ్లకి చుట్టూతా వున్న ప్రపంచంపట్ల ఆనందాన్ని, ఆహ్లాదాన్నీ కలిగిస్తాయి.

నా కొన్నియేళ్ల పరిశీలనలో ఒక విషయం నాకు ఆందోళన కలిగించింది, అదేమిటంటే వసంత రుతువులో, అంటే మార్చిలో ఆరంభమయ్యే రుతువులో పిల్లలందరి ఆరోగ్యం నీరసిస్తుంది. పిల్లలు నిస్త్రాణ పడి పోతారు. శీతానికి వాళ్ల శరీరం తట్టుకునే శక్తి కోల్పోతుంది. పనిచేసే సామర్థ్యం తగ్గుతుంది. దృష్టి దోషం యేర్పడ్డం వసంతరుతు మాసాల్లోనే ముఖ్యంగా కనిపిస్తుంది.

అవయవ నిర్మాణంలో జరిగే జీవరసాయన చర్యలవల్లనే అలా జరుగుతుందని డాక్టర్లూ, మనస్తత్వశాస్త్రవేత్తలూ అంటారు. కారణమే మంటే శీతాకాలం కడవట్లో శరీరంలో విటమిన్ల నిల్వ సూర్యరశ్మి తీవ్రంగా తగ్గడంవల్లా, దీర్ఘకాల మేధా శ్రమవల్లా తగ్గిపోతుంది, అది నాడీ మండలాన్ని అలసిపోయేటట్టు చేస్తుంది.

యీ కారణాల పర్యవసానం యెలా తగ్గించాలా అని నేను ఆలోచించాను. విటమిన్లు సమృద్ధిగా వున్న పళ్లూ, కాయగూరలూ, పిల్లలకి యివ్వడానికి తల్లిదండ్రులు యెక్కువ శ్రద్ధ చూపించ నారంభించారు. ముఖ్యంగా వసంత రుతుమాసాల్లో అలా చేశారు. శీతాకాలంలోనూ, వసంతరుతువులోనూ సూర్యుడు ప్రకాశించే ప్రతి రోజునా మేం బయట నడిచేవాళ్లం. పిల్లల మానసిక శ్రమని వసంతరుతు మాసాల్లో తగ్గించాలని నా బాధ. ఆలోచనా క్రమం తరగతి గదిలోకంటే కూడా బయట వీలైనంతగా జరగాలి, శరీర వ్యాయామంతో ముడిపడి వుండాలి. క్రమేణా యిది వసంతరుతు మాసాలకి ఒక నియమం అయిపోయింది.

యుద్ధం తర్వాత మొదటి సంవత్సరాల్లో చాలామంది పిల్లలు నరాల బలహీనతకి గురయ్యారు. మా విద్యార్థులు కొంతమంది, ముఖ్యంగా తోల్యా, కోల్యా, స్లావ, ఫేద్య

లాంటి వాళ్లు మనోవ్యాకులతకి గురయ్యారు, ఒకరకంగా మన్ను తిన్న పాముల్లా వుండిపోయారు. వాళ్లు పిరికితనం, సంకోచం, యిబ్బందికరమైన బెరుకూ నరాల బలహీనతకి పరిణమించకుండా వుండాలని నేను చూశాను. సమష్టి జీవితం పిల్లలకి ఆనందం యిచ్చేటట్టు యెలా చెయ్యాలీ అన్న దానిమీద నేను తరుచుగా సలహాలడిగేవాణ్ణి. పిల్లలు తమ కుటుంబాల్లో చూసిన దుర్దశలూ, శోకాలూ, విరోధాలూ సరిచెయ్యడం చాలా ముఖ్యమని మేం, ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులం నిర్ణయానికొచ్చాం. ప్రతి పిల్లవాని మనసులోనూ యేంమథన వుందో, యే సమస్యలతో అతను సతమత మవుతున్నాడోనని ఉపాధ్యాయులు కనిపెట్ట ప్రయత్నించారు, యేమంటే వాళ్లు పరాగ్గా ఆ పిల్లవాని సున్నిత హృదయానికి మరింత బాధ కలిగించకూడదు. ఒక పిల్లవాని ఆంతరంగిక జీవితంలో ప్రత్యేక శ్రద్ధ అవసరమైన ప్రతి దాన్నీ మేము మా సమావేశాల్లో చర్చించేవాళ్లం. ఆ సమావేశాలని "మనస్తత్వ శాస్త్ర సెమినార్లు" అనేవాళ్లం. స్కూలు సమష్టి పిల్లవాని విచారాలు తొలగించాలి.

అప్పటికే శోకానుభవంతో యెక్కువ నలిగిపోయిన పిల్లలు ప్రత్యేక శ్రద్ధనపేక్షించారు. ఒక్కొక్కప్పుడు కోల్య, సాష, తోల్య, పేత్రిక్, స్లావల నరాలు భరించలేనంత యిలుకు బట్టాయి. వాళ్లల్లో యెవరి హృదయాలనైనా మేం స్పృశించాలంటే జాగ్రత్తగా వుండాల్సివచ్చింది, అవి యే క్షణంలోనైనా "బద్దలౌ"వ వచ్చు. కొన్ని కొన్ని రోజులు వాళ్లని పాఠాలలో ప్రశ్నలకి జవాబు చెప్పమని అడగలేరు. మిగతా వాళ్లకి సమర్థవంతంగా బోధించగలవీ, ప్రభావితం చెయ్యగలవీ అయిన పద్ధతులు వీళ్లపట్ల పూర్తిగా నిరుపయోగం అవుతాయి. "వైద్య విద్యాబోధన" భావం ఒక శాస్త్రీయ రచనలో నాకు తట్టింది. మానసిక అనారోగ్యం తమ నడతమీద ముద్రవేసిన పిల్లలకి బోధించడంలోని సారాన్ని అది కొంచెమించులో కచ్చితంగా తెలియజేసింది. "వైద్య విద్యాభోధన"లోని ప్రధానమైన సూత్రాలు యివి: 1) పిల్లవాని దుర్బలమైన, గాయపడగల మనసుని తేలికగా వుంచడం; 2) సాధ్యమైనట్టల్లా, పిల్లవాణ్ణి బాధాకరమైన ఆలోచనలనుంచీ అనుభవాలనుంచీ స్కూల్ జీవితం మళ్లించడమూ, అతనిలో ఉత్సాహపూరిత అనుభూతులు మేల్కొల్పడం; 3) యెట్టి పరిస్థితుల్లోనూ మీరు తనని జబ్బువానిగా భావిస్తున్నట్టు పిల్లవానికి తెలియనివ్వకపోవడం.

మా స్కూల్లో వొలోద్య అని ఒక పిల్లవాడు వుండేవాడు. అతను మూర్ఛ సంబంధమైన నరాల బలహీనతకి గురయ్యేవాడు. అతని తల్లిదండ్రులతన్ని అసాధరణమైన పిల్లవాడని అనుకొన్నారన్న సంగతి నాకు ఆందోళన కలిగించింది. వాళ్లకి విధిగా సంభవించే నిరుత్సాహంతోటి, ఆ పిల్లవాడు తల్లిదండ్రులన్నా మొత్తంమీద పెద్దవాళ్లన్నా అసహ్యించుకుంటాడేమోనని నా భయం. నా అభిప్రాయంలో, అలాంటి పిల్లల్ని నయంచెయ్యడానికి ముఖ్యమైన సాధనం - వాళ్లు వినయంగా, మిగిలిన వాళ్లని గౌరవించేట్టుగా వుండేటట్టు బోధింటడమే. తనకి

సన్నిహితంగా వుండే ప్రతివాడూ మనిషేనన్న భావం వాలోద్యకి కలగాలని నేను ప్రయత్నించాను.

వైద్య విద్యాబోధనలో మందమైన, కుంగిపోయిన ఆలోచనా శక్తివున్న పిల్లలు ఒక ప్రత్యేక స్థానం ఆక్రమిస్తారు. నిరుత్సాహం, మెదడుపైభాగపు కణాల జడత్వం హృదయ కోశపు జబ్బులు గాని, పేగుల జబ్బులు గాని నయం చేసేటంత శ్రద్ధగా, ఓపిగ్గా వైద్యం చేయాలి. కాని వాటికి వైద్యం చెయ్యడానికి వేల రెట్ల అధిక జాగ్రత్తా, బోధనా సామర్థ్యం, ప్రతి పిల్లవాని ప్రత్యేక లక్షణాల లోతైన జ్ఞానం అవసరం.

## ప్రతి పిల్లవాడు చిత్రకారుడు

"సంతోష చంద్రశాల"లో చదువు మొదలైన ఒక వారం తర్వాత నేను పిల్లలకి చెప్పాను: "రేపు బొమ్మలు గీసే కాగితాలూ, పెన్సిలూ తెచ్చుకోండి. మనం బొమ్మలు గీద్దాం." ఆ మర్నాడు స్కూల్ దగ్గర పచ్చిక మీద సుఖంగా కూర్చున్నాం. నేను పిల్లలతో అన్నాను: "మీ చుట్టూతా చూడండి. మీకు యెంతో అందంగా కనిపించేదీ, మీకు బాగా యిష్టమైందీ గీసెయ్యండి."

మాకు ముందు స్కూలు తోటా. ప్రయోగాత్మక క్షేత్రమూ వున్నాయి. ఆకురాలు కాలపు సూర్యకాంతి వాటిమీద ప్రసరిస్తోంది. పిల్లలు కిచకిచలాడేరు. ఒకళ్లకి యెర్రటి, పసుపుపచ్చటి గుమ్మడికాయలు యిష్టమయ్యాయి, యింకొకళ్లకి నేల బారుగా వంగిన పొద్దుతిరుగుడు పువ్వుల శీర్షాలూ, మూడో వాడికి పావురాళ్ల గూడు, నాలుగో అతనికి ద్రాక్షపళ్లగుత్తులు. షూరకి ఆకాశంలో తేలిపోయే దూది పింజల్లాంటి మేఘాలు యిష్టమయ్యాయి. అద్దంలాంటి ఉపరితలం వున్న కొలనులోని బాతులంటే సెర్యోజకి యిష్టం. దంకో చేపల బొమ్మ గీద్దామనుకున్నాడు- తనూ, తన మామా ఒక రోజున చేపలు పట్టడానికి వెళ్లిన సంగతి ఉత్సాహంగా మాతో చెప్పాడతను. వాళ్లు చేపల్నేమీ పట్టలేదు గాని అవి యెలా "ఆడుకునేదీ" చూశారు.

"మరి నేను సూర్యుడి బొమ్మ గీస్తాను" అంది తీనా.

పిల్లలు శ్రద్ధగా గీశారు. బొమ్మలు గియ్యడం యెలా నేర్పాలీ అన్న దానిమీద నేను చాలా చదివాను, కాని అప్పుడు నా ముందు సజీవ బాలలు వున్నారు. పిల్లల బొమ్మలు, బొమ్మలు గీసే క్రమం పిల్లవాని ఆంతరిక జీవిత భాగమని నేను చూశాను. పిల్లలు వూరికే సౌందర్య సృష్టికర్తల్లాగా దర్శించి, చుట్టూతా వున్న ప్రపంచాన్ని కాగితంమీద దించెయ్యరు; వాళ్లీ ఆనందాన్ని ఆస్వాదిస్తారు. వాన్య ఒక తేనె గూటిని, ప్రక్కనే ఒక చెట్టుతో బాటుగా గియ్యడంలో నిమగ్నుడై పోయాడు. చెట్టుమీద పెద్ద పెద్ద పువ్వులున్నాయి. ఒక పువ్వుమీద దాదాపు తేనె గూడంత పెద్దగానూ వున్న ఒక తేనెటీగ వుంది. ఆ చిన్న పిల్లవాడి చెక్కిళ్లు ఆ ప్రయత్నంతోటి యెర్రబారాయి, అతని కళ్లు ఉత్సాహపు మంటతో వెలిగాయి. అది ఉపాధ్యాయునికి మహదానందం యిస్తుంది.

పిల్లల సృజనాత్మక కృషి వాళ్ల ఆంతరిక జీవితంలోని లోతైన, అద్వితీయమైన రంగం, స్వయం వ్యక్తీకరణ, స్వయం నిర్ధారణ. వాటిలోనే ప్రతి పిల్లవాని వ్యష్టి లక్షణాలు వెల్లడౌతాయి. యీ వ్యక్తిత్వాన్ని విశ్వవ్యాప్తమైన కొలబద్దతో వర్గీకరించలేం.

తనకిష్టమైందేమిటో కోల్యా చెప్పలేదు. కాని అతను గీసిన దాంతోటి నాకు ఉత్సుకత పెరిగింది. ఆ పిల్లవాని కాగితంమీద కొమ్మలతోటీ, గుండ్రని పళ్లతోటీ నిండిన చెట్టు కనిపించింది. అది ఆపిల్ చెట్టు అన్న మాట. ఆ చెట్టుని పరివేష్టించి, చెట్టుపైన యెక్కణ్ణో యెత్తులో వున్న చందమామ వెన్నెల్లో వెలిగే చిన్ని నక్షత్ర సమూహం. ఆసక్తి కలిగించే ఆ చిత్రంనుంచి ఆ పిల్లవాని ఆంతరంగికమైన ఆలోచనలని, అనుభూతులని నేను యెంత అర్థం చేసుకోవాలకున్నానో. యెందుకంటే మేం ప్రపంచాన్ని పరిశీలించే క్షణాల్లో ఆ కుర్రవాని కళ్లల్లో అలాంటి ఉత్సాహపూరితమైన మెరుపు చూశాను.

"ఆపిల్ చెట్టుపైన ఆ చిన్ని నక్షత్రాలేమిటి?" అని నేను కోల్యనడిగాను.

"అవి నక్షత్రాలు కావు. అవి చంద్రుడునుంచి తోటమీద పడే వెండిరవ్వలు. చంద్రుడిలో కూడా మహాకాయులైన కమ్మరివాళ్లు వున్నారు. లేరా?" అన్నాడా పిల్లవాడు.

"ఆఁ, ఆఁ, వున్నారు" అన్నాన్నేను, ఆ సాయంత్రపు ప్రశాంతఘడియల్లో పిల్లవాడికి ఉద్రేకం కలిగించిన ఆలోచనలకి ఆశ్చర్యపోతూ. దాని అర్థం అతను రాత్రి ఆకాశంకేసి చూసి, చంద్రుడి కాంతిని మెచ్చుకున్నాడు, ఆపిల్ చెట్టుపైన పాలిన కంపిత పరివేషాన్ని గమనించాడు.

"కాని యీ మహాకాయులైన కమ్మరం వాళ్లు రాత్రి యెలాంటి దారం పోగులు తయారు చేస్తారు?" సాలోచనగా అడిగాడా పిల్లవాడు. అతను తన ఆలోచనలలోనూ, పాలిన వెన్నెలలోనూ, నక్షత్రాల వృత్త నాట్యంలోనూ మునిగిపోయి, తన ఉపాధ్యాయుణ్ణి తను సంబోధించటం లేదేమోననిపించింది. అతని సృజనాత్మక ప్రేరణని పాడుచేస్తున్నానేమో నన్నుభయం కలిగింది. కొత్తది కనిపెట్టిన ఆనందంతో నా హృదయం పొంగింది: సృజనాత్మకత పిల్లల మనసులోని అత్యంత అంతరంగికమైన దిశలని తెరుస్తుంది. యీ దిశలలో, దయాన్వితానుభూతులు నిద్రిస్తూ వుంటాయి. తన చుట్టూతా వున్న ప్రపంచంలో సౌందర్యానుభూతి పొందేందుకు పిల్లవానికి సాయంచేసేటప్పుడు ఉపాధ్యాయుడు యీ దిశలని స్పృశిస్తున్నాడన్న మాట.

లరీసా ఉదాహరణ తీసుకుని నేను మహాకాయులైన కమ్మరివాళ్ల బొమ్మని గీయడం మొదలెట్టాను. నేను గీసింది ఫరవాలేదన్నట్టుగానే వుందనిపించింది. ఆ కమ్మరివాళ్లు నిజంగా వున్నట్టే కనిపించారు; ఆ బొమ్మ సరిగ్గా సమష్టి క్షేత్రపు కమ్మరశాలలోని దానిలాగే వుంది. నేనో పెద్దవాణ్ణనే సంగతే మర్చిపోయి, యేమిటో సంబర పడిపోయాను: నా కమ్మరివాళ్లు లరీసా గీసిన వాళ్లకంటే బాగున్నారు. పిల్లలు లరీసా బొమ్మ దగ్గర నిజమైన ఆసక్తితో గుమిగూడారు గాని, నా బొమ్మని అసలు

పట్టించుకోనే లేదు. "యేం గీసిందీ పిల్ల?" అనుకున్నాను నేను. పిల్లల పైనుంచి వంగి చూశాను: ఆ పిల్ల గీసిందాంట్లో ప్రత్యేకమైన దేమి లేదు. మరి వాళ్లంతా దాన్ని అంతలా మెచ్చుకుని నా బొమ్మని యెందుకు నిరాదరం చేస్తున్నారు? ఆ పిల్ల బొమ్మని యెంత సన్నిహితంగా చూస్తే అంతగా నాకు పిల్లలకి వాళ్ల ప్రపంచ దర్శనం వాళ్లదేనని అనిపిచింది. వాళ్లకి తమ స్వంత వ్యక్తీకరణ భాష వుంది. మీరెంత ప్రయత్నించినా, మీరు వాళ్లు భాషని అనుకరిచలేరు. నా బొమ్మలోని మహాకాయులైన కమ్మరివాళ్లు సాదా టోపీల్లోనూ, అప్రన్లలోనూ, పెద్ద గడ్డాలతోటీ, బూట్లతోటీ వున్నారు. కాని ఆమె బొమ్మలో వాళ్లు తమ దూదిపింజల్లాంటి జుట్టు చుట్టూతా రవ్వల పరివేషంతో వున్నారు. ఆ బ్రహ్మాండమైన కమ్మరి వాళ్ల గడ్డాలు వూరికే గడ్డాలు కావు, నిప్పు చుట్టలు. వాళ్ల బ్రహ్మాండమైన సుత్తులు దగ్గరదగ్గర వాళ్ల తలలకి రెండింతలు పరిమాణంలో వున్నాయి.... ఒక పిల్లవాడికి అది సత్యాన్ని భంగంచేసినట్లు కాదు, కాని దానంతటదే సత్యం – అద్భుత కథల్లోని శక్తివంతులైన వ్యక్తి సమూహానికీ, అగ్ని అంశకీ గల నమ్మలేనంత బలానికీ, నైపుణ్యానికీ సంబంధించిన సత్యం. పిల్లల విచిత్రమైన వూహల అద్భుత భాషని పెద్దవాళ్ల భాషతో సరిపెట్టాలనే ప్రయత్నం మనం చెయ్యగూడదు. పిల్లలు ఒకళ్లతో ఒకళ్లు వాళ్ల భాషలో మాట్లాడుకోవాలి. ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులకి నేను సలహా యిచ్చాను: పిల్లలకి ప్రమాణమూ, దృగ్గోచరమూ, సమతూకమూ నేర్పండి – అదంతా శుభ్రంగా బాగానే వుంటుంది, కాని అదే సమయంలో, పిల్లల వూహకి అవకాశం వుంచండి; అద్భుత కథల ద్వారా ప్రపంచాన్ని చిత్రించే పిల్లవాళ్ల సామర్థ్యాన్ని పాడు చెయ్యవద్దు.

ప్రతి పిల్లవాడూ తనేం గీసింది అందరికీ చెప్పాలనుకున్నాడు. స్పష్టమైన బొమ్మలూ పోలికలూ మెరిసే రాళ్లలాగా యీ కథల్లో మిణుక్కుమన్నాయి. చిత్రలేఖనం పిల్లల భాషాభివృద్ధికి దోహదం చేసింది.

పొలాల్లోకీ, పచ్చిక బీళ్లల్లోకీ మా షికారు లన్నిటిలోనూ మేం మాతోటి కాగితాలూ పెన్సిళ్లూ తీసికెళ్లేవాళ్లం. పెద్ద పిల్లలు చిన్న పిల్లలకి జేబులో పెట్టుకునే అట్టలు తయారుచేసి యిచ్చారు. స్కూలు ఆరంభమైన కొన్నినెలల తర్వాత నేను ఒక పెద్ద ఆల్బమ్ తయారుచేశాను. అందులో తమ అభిమాన పాత్రమైన పరివేష్టిత ప్రపంచపు దిక్కునుంచి ప్రతి పిల్లవాడూ గీసిన బొమ్మలున్నాయి. అందులో నేను చిన్న కథలు కూడా రాశాను. మా సమష్టి జీవితంలోనూ, ఆధ్యాత్మిక అభివృద్ధిలోనూ యీ ఆల్బమ్ ఒక పూర్తి అధ్యాయం.

## సజీవమైనదానిపట్లా, అందమైనవాటిపట్ల శ్రద్ధ

సజీవమైనదానిపట్లా, తమ చుట్టూతా వున్న ప్రపంచంలోని సౌందర్యంపట్లా పిల్లల ఉదాసీనత నన్ను కలతపెట్టింది. పైకి వర్ణించ లేని శైశవ క్రూర చర్యలు నన్ను యిబ్బందిపెట్టాయి. మేము పచ్చిక మైదానంమీద నడుస్తున్నాం. సీతాకోకచిలకలూ,

కందిరీగలూ యెగురుతున్నాయి. యూర ఒక పెంకు పురుగును పట్టుకున్నాడు. తన జేబులోనుంచి అద్దం ముక్కను తీసి లోపల "యెలా వుంటుందో చూద్దం కోసమని" ఆ పురుగుని సగానికి కోశాడు. స్కూల్ క్షేత్రంలో ఒక మూల కొన్ని మంగల పక్షులు చాలా యేళ్లుగా వున్నాయి. మేం ఒకసారి అక్కడికి వెళ్లాం. నేనింకా మంగల పక్షి గూళ్ల గురించి రెండు మాటలు చెప్పలేదు, షూర ఓ గూటిమీదికి రాయి విసిరేడు. పెరట్లో పెరిగిన అందమైన కన్నాలిలీ పువ్వులని పిల్లలు సంరక్షించారు. కాని ల్యూస్యా ఆ పువ్వుల పొదులోకి వెళ్లి అన్నిటినీ తెంపేసింది. యిదంతా కూడా "సంతోష చంద్రశాల" తొలి దినాల్లో జరిగింది. పిల్లల సౌందర్య మోహత్వం, సౌందర్యానికి వాటిల్లబోయే దానిపట్ల నిర్లక్ష్యంతో కలిసి వుందని నాకు అనిపించింది. అందాన్ని అభినందించడం అనేది మంచితనపు మొదటి మొలకలు తప్ప వేరే యేం కాదు, దాన్ని మనం జాగ్రత్తగా అభివృద్ధి చేయాలి అని నేను మా విద్యార్థులని కలుసుకోవడానికి చాలా ముందే నాకు నమ్మకం కలిగింది. మరీ ముఖ్యంగా కోల్య, తోల్యాలు చేసిన పని నన్ను కలత పెట్టింది. కోల్యకి పిచ్చిక గూళ్లు ధ్వంసం చేసే పిచ్చి. గూట్లోనుంచి పడిపోయి రెక్కలు రాని పిల్లల్ని తీసుకుని వెన్న ఫ్యాక్టరీ మురికి గొట్టంలో వాటిని అతను వదేసేవాడట. ఆ పసిపిచికలు చాలా సేపు కీచుమనేవిట. కోల్య గొట్టందగ్గర వింటానికి చెవి పెట్టేవాడట. క్రూరత్వం కష్టభూయిష్ఠమైన కుటుంబంనుంచి వచ్చిన కోల్యలోనే కాదు, మామూలు వాతావరణంలో బతికే పిల్లల్లో కూడా వుంది. అన్నిటికంటే కలవరపెట్టేది యేమిటంటే, దుష్టత్వపు యీ "స్వల్ప" సంఘటనలూ, సజీవమైన దానిపట్ల, అందంపట్ల ఉదాసీనత, వీటి అంత్య ఫలితం కరకు హృదయం, అవి గర్హ్యణీయమైనవి అని పిల్లలు అర్థం చేసుకోపోవడమే.

ప్రకాశవంతమైన దయాగుణం పిల్లల్లో యెలా కలిగించాలి? సజీవమైన దానిపట్లా, అందమైన దానిపట్లా దయా, యోచన గల శ్రద్ధా పిల్లల హృదయాల్లో కాపాడ్డం యెలా? ఒకసారి మా షికారులో రెక్కలు తెగిన భరద్వాజపిట్ట కనిపించింది. ఆ పిట్ట ఓ చోటినుంచి యింకో చోటికి మిడిసి మిడిసి గెంతుతోంది, కాని యెగరపోలేకపోతోంది. పిల్లలు ఆ పిట్టని పట్టుకున్నారు. వాళ్ల చేతుల్లో ఆ ప్రాణమున్న ముద్ద దడదడ కొట్టుకోవడం మొదలెట్టింది. చిన్ని పూసల్లాంటి దాని కళ్లు భయంతో వినీలాకాశంకేసి చూస్తున్నాయి. కోల్య దాన్ని నొక్కాడు. అది దయనీయంగా కీచుమంది. పిల్లలు నవ్వారు. "తనతోటి పక్షులు పొలంలో వదిలేసిన ఆ పిట్ట అంటే వాళ్లల్లో ఒక్కళ్లకీ జాలి లేకుండా యెలా పోయింది?" అని నేను అనుకుని పిల్లలకేసి చూశాను. లీదా, తాన్యా, దంకో, సెర్యోజ, నీనాల కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి.

"ఎందుకు నువ్వు పాపం ఆ పిట్టని హింసిస్తావు?" జాలి గొలిపే గొంతుకతో లీదా కోల్యతో అంది.

"మధ్యలో నీకేం?" అడిగాడా పిల్లాడు. "యిదిగో దీన్ని తీసుకుని కాపాడు" అంటూ అతను ఆ పిట్టని లీదామీదికి విసిరాడు.

"అదంటే నాకు జాలి. దాన్ని నేను కాపాడతాను" అందా పిల్ల, ఆ పిట్టని నిమురుతూ.

మేం అడివి శివారులో మంచుని వున్నాం. ఆకురాలు కాలంలో వలసపోయే పక్షుల గుంపులు చాలా దూరం యెగిరిపోతాయని నేను ఆ పిల్లలకి చెప్పాను. కొన్ని యేకాకి పక్షులు పొలాల్లో యేమీ లేకుండా వదిలిపెట్టబడిపోతాయి – అదిగో రెక్కలు విరిగిపోయినవీ, యెరమింగే పక్షుల పట్టు నుంచి తప్పించుకున్నవీ లాంటివి. హిమతుఫానులూ, గడ్డ కట్టించే చలిగాడ్పులూ యింకా వాటి ప్రాణానికి ముందే వుంటాయి. యీ పిట్టకి యింకా యేం మూడబోతోందో? పాపం యీ నిర్భాగ్యురాలు చలికి ముద్దకట్టి చచ్చిపోతుంది. కాని వసంత రుతువులోనూ, వేసవిలోనూ సమ్మోహక సంగీతంతో పచ్చిక మైదానాలని ముంచెత్తుతూ యెంత బాగా పాడుతుంది. భరద్వాజ పిట్ట సూర్యుని బిడ్డ. అద్భుత కథల్లో "యీ పిట్ట సూర్యుని అగ్నినుంచి పుట్టింది" అనివుంది. చలితోటి మీ వేళ్లు బిగుసుకుపోతే, గడ్డకట్టించే గాలి మీకు వూపిరిసలపనివ్వకపోతే యెంత నొప్పిగా వుంటుందో మీకు తెలుసు కదా. యింటిదగ్గర వెచ్చని పొయ్యిదగ్గరకి పరిగెత్తుకు పోతారేం... కాని పాపం "యీ నిర్భాగ్య పక్షి యెక్కడికి పోతుంది? దానికెవరు శరణం? అది గడ్డకట్టిన ముద్ద అయిపోతుంది."

"కాని మేం యీ పిట్టని చచ్చిపోనివ్వం. మేం దీన్ని వెచ్చని మూల పెడతాం. చిన్ని గూడు కడతాం. వసంత రుతువుదాకా వుండేటట్టు చేస్తాం" అంది వార్యా.

ఆ పిట్టకి యెలా చిన్న గూడు కట్టాలా అని పిల్లలు వాదులేసుకోవడం మొదలెట్టారు. వాళ్లల్లో ప్రతి ఒక్కళ్లకీ ఆ పిట్టని శీతాకాలనికి యింటికి తీసుకుపోదామనే వుంది. కోల్యా, తోల్యా, మరి యింకొంత మంది మాత్రం వూరికే వుండిపోయారు.

"యెందుకు ఆ పిట్టని యిళ్లకి తీసుకెళ్ళడం పిల్లలూ? దానికోవెచ్చని గూడు స్కూలుదగ్గర తయారుచెయ్యగలం. దానికి మేత పెట్టి, అది బాగయేటట్టు చేద్దాం, అప్పుడు వసంత రుతువు వచ్చే నాటికి వదిలేద్దాం."

మేం దాన్ని స్కూల్‌కి తీసికెళ్లి, చిన్న పిల్లల గదిలో వున్న పంజరంలో పెట్టాం. ప్రతి రోజూ పిల్లల్లో యెవళ్ళో ఒకళ్లు ఆ పిట్టని సాకడానికి వచ్చేవాళ్లు. వాళ్లు దానికి మేత తెచ్చేవాళ్లు.

కొన్ని రోజుల తర్వాత కాత్యా ఒక వడ్రంగి పిట్టని తెచ్చింది. ఆ పిట్ట వాళ్ల నాయనకి అడివిలో దొరికింది. అది బహుశా యే అడివి జంతువుకో చిక్కి వుంటుంది. అదృష్టవశాత్తూ బతికి బట్టకట్టింది. ఆ వడ్రంగి పిట్ట రెక్కలు నిర్జీవంగా వేలాడుతున్నాయి. దాని వీపుమీద పేరుకున్న నెత్తుటి ముద్దలున్నాయి మేం దాన్ని

చందోలి పిట్టతో బాటుగా వుంచాం.... వడ్రంగి పిట్టకి మేత యేం పెట్టాలో యెవరికీ తెలీదు - బహుశా పురుగులా? వాటినెక్కడ వెతకాలి, చెట్టు పట్టా కిందా?

"నాకు తెలుసు" కోల్యా గొప్పలు పోయేడు. "అది వూరికే పురుగుల్నీ యీగల్నీ తిందు. దానికి విల్లో కాయలూ, గడ్డిగింజలూ యిష్టం. నేను చూశాను..." అతనింకా యేదో చెప్పబోయాడు గాని యిబ్బంది పడిపోయాడు. బహుశా అతను వడ్రంగి పిట్టల్ని వేటాడి వుంటాడు.

"సరే, వడ్రంగి పిట్టకి మేత యేమిటో నీకు తెలుసు కాబట్టి, నువ్వు దానికి ఆహారం తెచ్చిపెట్టవచ్చు. చూడు యెంత జాలిగా కనిపిస్తోందో అది."

అంచేత కోల్యా వడ్రంగి పిట్టకి రోజూ ఆహారం తెచ్చేవాడు. అతనింకా సజీవమైన దానిపట్ల జాలి పడలేదు. తన తోటివాళ్లు మెచ్చుకున్నారు గనక అలా చేశాడు. చూడండి, మా పిల్లవాడు కోల్యా యెలాంటి వాడో - పిట్టలకి యేం మేతో అతనికి తెలుసు. కాని అతనిలో దయాగుణం జాగృతం కావడం ఆత్మగౌరవంతో మొదలవ్వనివ్వండి; అది యెంత మాత్రమూ చెడు కాదు. మంచి పనులు ఒక అలవాటు అవనియ్యండి; అవి మంచి ఆలోచనలని జాగృతం చేస్తాయి.

మీరెలాంటి వాళ్లు కావాలనుకుంటున్నారు అన్న ప్రశ్నకి పిల్లలదగ్గర వందలాది జవాబులున్నాయని నాకు గుర్తే - బలంగా, సాహసంగా, ధైర్యవంతంగా, తెలివిగా, యుక్తిగా, నిర్భీతిగా. కాని ఒక్కళ్లు కూడా యెప్పుడూ "దయగా" అని అనలేదు. దయ యెందుకని సాహసం, ధైర్యం లాంటి సద్గుణాలతోటి సమంగా లేదు? యెందుకని పిల్లలు ఒకో అప్పుడు తమ దయతోటి యిబ్బంది పడిపోతారు? కాని దయ లేకుండా, ఒక వ్యక్తి యింకొకళ్లపట్ల చూపించే నిజమైన ఆర్ద్రత లేకుండా, ఆధ్యాత్మిక సౌందర్యం అసంభవం. మగపిల్లలకి ఆడపిల్లలకున్నంత దయ యెందుకుండదని కూడా నేను ఆలోచించాను. బహుశా అది అలా కనిపిస్తోందా? అబ్బే, అది నిజంగానే అంతే. ఆడపిల్లలు యెక్కువ దయగా, సానుభూతిగా, సున్నితంగా వుంటారు. యెందుకంటే చిన్నతనంనుంచీ వాళ్లల్లో ఒక విధమైన అజ్ఞాత మాతృసహజ గుణం వుండటం వల్లనేమో. సజీవమైన వాటిపట్ల సంబంధభావం, ఆడపిల్లల హృదయాల్లో తాము కొత్త ప్రాణికి సృష్టికర్తలు కావడానికి యెంతో ముందే బలపడివుంటుంది. ఆ మూలం, దయపట్ల, ఆధారం, సృజనలో, జీవితపూ, సౌందర్యపూ నిర్ధారణలో వుంటుంది. దయ విడదీయ లేకుండా సౌందర్యంతో ముడిపడివుంటుంది.

ఫేద్య గిజిగాడు పక్షిని స్కూల్‌కి తీసుకువచ్చిన ఉదయం పిల్లలకి పర్వదినమైంది. యెందుకనో ఆ పిట్ట కూడా యెగరలేకపోతోంది. ఆ కుర్రవాడు దాన్ని పశువుల క్షేత్రందగ్గర పొదలో చూశాడు. గిజిగాని అందమైన నానా వర్ణ శోభితమైన యీకలనుంచి పిల్లలు దృష్టి తిప్పుకోలేకపోయారు. మేం "పక్షుల ఆస్పత్రి" (మా గది యీ మూలని పిల్లలు అలా పిలిచేవాళ్లు) దగ్గర ఆ ఉదయం సమావేశమయ్యాం. మళ్లీ యిళ్లకి పోయే ముందు అక్కడికి వెళ్లాం. కోస్త్య ఒక

దుర్బలమైన, నీరసమైన, చిన్ని పిచికని తెచ్చాడు. దాన్ని అతను రోడ్డు వార పట్టుకున్నాడు. ఆ పిచిక గింజలు గాని, రొట్టె ముక్కలు గాని తినదు. పిచిక జబ్బుకి కోస్త్య బాధపడిపోయాడు. మా పిచ్చిక చచ్చిపోయినప్పుడు మేం అంతా దుఃఖించాం. కోస్త్య యేడ్చాడు. ఆడపిల్లలు యేడ్చారు. కోల్య మబ్బుగా, మాట్లాడకుండా వుండిపోయాడు.

"దయగల పిల్లవాడు" ఆకాశంనుంచి వూడిపడ్డు. పిల్లవానికి దయ బోధించాలి. ఒకసారి, కనుమల్లో షికారు వెళ్లేటప్పుడు పిల్లలు కాలు తెగిపోయిన చిన్ని కుందేలుని చూశారు. వాళ్లు దాన్ని తమ గదికి తీసికెళ్లి ఒక కొత్త బోనులో పెట్టారు. ఆ రకంగా యింకో ఆస్పత్రి పశువులకి తయారైంది. ఒక వారం తర్వాత లరీసా శుష్కించిపోయిన ఒక పిల్లి కూనని తీసుకువచ్చింది. అది చలికి వణికిపోతోంది. వాళ్లు దాన్ని కుందేలు బోనులోనే వుంచారు. పిల్లలకి చేతినిండా పనే: వాళ్లు కుందేలు కోసం కారట్లూ, పిల్లికూన కోసం పాలూ తెచ్చారు. ఓ రోజు ఉదయం ఆ కుందేలూ, పిల్లికూనా లుంగచుట్టేసుకుని పడుకుని వుండడం చూసినప్పుడు పిల్లలకి కలిగిన సంబరం యింతింత కాదు. వాళ్లు ఆ జంతువులని యెక్కడ నిద్ర నుంచి లేవగొట్టేస్తామోనని భయపడి మెల్లిగా గుసగుసలతోటే మాట్లాడుకున్నారు....

శీతాకాలంలో కొన్ని పికిలి పిట్టలు "పక్షి ఆస్పత్రి"లో ప్రత్యక్షమయ్యాయి. పిల్లలు వాటిని పక్షులకి మేత వేసే చోట పట్టుకున్నారు. అవి శీతాకాలమంతా వున్నాయి.... నాకు ఆనందం కలిగించింది యింకోటి వుంది: కొంతమంది పిల్లలు తమ యిళ్లదగ్గర తమ స్వంత "పక్షి ఆస్పత్రులు", జంతువుల జాగాలూ యేర్పాటు చేసుకున్నారు. యిక మా గదికి చిన్ని చేపలున్న ఆక్వేరియమ్ వచ్చిం తర్వాత పిల్లలు యిళ్లదగ్గర తల్లిదండ్రుల్ని వాటిని ఏర్పాటు చెయ్యమని బతిమలాడారు. దాన్ని యెలా చెయ్యాలా చూద్దామని చాలామంది తల్లిదండ్రులు స్కూల్‌కి వచ్చారు. యీ ఆక్వేరియమ్‌లలోకి మొక్కలూ, చేపలూ దొరకడం కష్టంగా వుండేది. చేపలకి ఆహారం తేవడం యింకా కష్టంగా వుండేది. పిల్లల పట్టుదల పుణ్యమా అని యీ కష్టాలన్నీ గట్టెక్కాం. వాళ్లు నన్ను గాని, తల్లిదండ్రులని గాని ఆ పని జరిగే దాకా మనశ్శాంతిగా వుండనివ్వలేదు. స్లావ, తీనాల తల్లులు తమని పిల్లలు నలిపేస్తున్నారని పితూరీ చేస్తూ స్కూల్‌కి వచ్చారు. కొంత మంది పిల్లలకి బంగారు చేపలున్నాయట, వాళ్లకి లేవట. మేం మిగతా పిల్లల్ని సాయం అడగాల్సివచ్చింది. ఆ రోజుల్లో స్కూలు వర్క్‌షాప్‌లుండేవి కాదు. కాని ఆక్వేరియమ్‌ల కోసమని చెప్పి పిల్లలకి వర్క్‌షాప్ విధిగా ప్రారంభించాల్సి వచ్చింది.

ఆక్వేరియమ్ గుడ్డి వెలుతుర్లో కూచుని, బంగారు చేపల్ని మెచ్చుకుంటూ గడిపిన ఆ సాయంత్రాలు నేనెన్నడూ మర్చిపోలేను. నేను పిల్లలకి సముద్రపు లోతు ప్రపంచం గురించీ, సముద్రపు జీవుల గురించీ చెప్పాను. స్కూల్ యెప్పుడో

పూర్తిచేసి, పెద్దవాళ్లైన మా విద్యార్థులు ఆ సాయంత్రాలని జీవితమంతా గుర్తుంచుకున్నారు. కోల్య యీ మధ్యనే నాతో చెప్పాడు:

"ఆ గుడ్డి దీపం తరుచుగా నా కలల్లో కనిపిస్తుంది. దాని వెలుతురే జ్ఞానానికి తొలి బీజం. నేను సముద్రపు నిగూఢ అగాధాలనీ, అద్భుతమైన చేపలనీ గురించి యింకా తెలుసుకోవాలను కుంటున్నాను...."

ఒక యిరవై నాలుగేళ్ల వయసువాడు ఆ చేపల్ని అంత ఆదరంగా గుర్తుపెట్టుకున్నాడంటే, అదేం చిన్న సంగతి కాదు, అది దయకి ఒక మార్గం అన్నమాట. అసలు యేం పట్టించుకోకుండా వుండేవాళ్ల హృదయాల్లో కూడా చుట్టూతా వున్న ప్రపంచపు అందం, దయాగుణం, సున్నితత్వం, సానుభూతి మేలుకొలపడం కోసమని నేను ఆతృతగా యెదురుచూశాను.

సజీవమైన వాటిపట్లా, అందమైన వాటిపట్లా పట్టింపు పిల్లలకి క్రమేపీ వచ్చింది. 1951వ సంవత్సరపు ఆకురాలు కాలం ఉత్తర భాగంలో మేం అడవిలోకి వెళ్లాం. అప్పటికే చెట్లనుంచి ఆకులు రాలిపోయాయి. ఆ అడివిలో మేం ఒక చిన్న వేప చెట్టుని తవ్వితీశాం. మేం దాన్ని స్కూల్ ఆవరణలోకి తీసుకొచ్చి అక్కడ పాతాం. ఆ చిన్ని చెట్టు మా నేస్తం అయింది. మేం దాన్ని గురించి కలలుకన్నాం, కథలల్లాం, యేదో మన బాధనీ, ఆందోళననీ అర్థం చేసుకుని, అనుభవించగల సజీవ జీవిని గురించి మనం అనుకున్నట్టు. వెచ్చని జల్లులు పడ్డప్పుడు మా పిల్లలు సంబరపడిపోయారు, యెందుకంటే మా నేస్తానికి తడి అవసరం. నేల మంచుతో కప్పడిపోయినప్పుడూ, పొలాలమీదనుంచి యెముకలు కొరికే చలిగాలి వీచినప్పుడూ మా నేస్తానికి చలిపెడుతుందని మేం ఆందోళన పడ్డాం. ఆ పిల్లలు మంచు పోగుజేసి, దాన్ని ఆ చిన్ని వేప చెట్టు కాండం చుట్టూతా పట్టించేరు. ఆడపిల్లలు కొన్ని తుంగకాడలు తెచ్చి ఆ చెట్టు కాండాన్ని కప్పేరు. వసంతరుతువు వచ్చే సమయంలో మేం తరచూ మా నేస్తాన్ని చూడ్డానికి వెళ్లేవాళ్లం. ఎప్పుడు మొగ్గ తొడుగుతుందా అని తహతహలాడుతూ నిరీక్షించేవాళ్లం. మొదటి ఆకుపచ్చ పత్రాలు పిల్లల్ని పరమానందభరితుల్ని చేశాయి: ఆ చెట్టు సజీవంగా వుంది. వేసవిలో మేమా చెట్టుకి నీళ్లు పోశాం.

బాధ, దయల ఉమ్మడి అనుభూతికీ, ఉమ్మడి మంచి మనసుకీ యెంతో శక్తి వుంది. అది యెంతో ఉదాసీనంగా వుండే వాళ్లని కూడా తనతో తీసుకుపోగల పెను ప్రవాహం లాంటిది. కోల్య, తోల్య, స్లావ, పేత్రిక్‌లు ఉత్సాహంగా తమ నేస్తం వేప చెట్టుని చూడ్డానికి వెళ్లడం, ఆక్వేరియమ్‌లోని చేపలకి ఆహారం పెట్టేటప్పుడు వాళ్ల కళ్లు మెరియడం చూసి నాకు మహదానందమైంది.

శీతాకాలపు మంచులో వేప చెట్టుకి చలి కొడుతుందేమోనన్న ఆలోచనకే గుండెలు గజగజలాడిన వాళ్లు పెద్దవాళ్లయారు. మా నేస్తం యెన్నో కొమ్మలతో పెద్ద చెట్టైంది. యిప్పటి క్కూడా ఆడపిల్లలూ, మగపిల్లలూ, యువకులూ, యువ

తండ్రులూ, తల్లులూ దాన్ని చూడ్డానికి వస్తారు. చిన్ననాటి బంగారు ఆకురాలు కాలాన్ని గుర్తుకు తెచ్చుకున్నప్పుడు ఆర్ద్రమైన అనుభూతుల డోలికలో వూగిపోతారు.

మానవత్వం, మంచితనం, బాధ, ఉపకారబుద్ధీ పనిలోనుంచీ, చుట్టూతా వుండే ప్రపంచం గురించిన పట్టింపులోనుంచీ, ఉత్సాహంలో నుంచీ ఆవిర్భవిస్తే దయాపూరిత అనుభూతుల వేళ్లు బాల్యంలో వున్నాయని అనుభవం తెలియజేస్తోంది. దయాపూరిత అనుభూతులు భావపరిపోషణ మానవత్వానికి కేంద్ర స్థానం. దయాపూరిత అనుభూతులు చిన్నతనంలో నాటకపోతే యిక అవి యెన్నటికీ రావు. యెందుకంటే నిజమైన మానవత్వం యేకకాలమందు మొదటి అత్యంత, ప్రాముఖ్యమైన సత్యాల్ని గ్రహించడంతోటీ అదే కాలంలో తమ స్వంత భాషలోని పదాలకుండే అతి సున్నిత భేదాల అనుభవమూ, అనుభూతీతోటీ బాటుగా మనసులో నిర్ధారితమవుతుంది. ఒక వ్యక్తి బాల్యంలో అనుభూతుల పాఠశాలకి హాజరవ్వాలి - దయాపూరిత అనుభూతులు రూపుదాల్చే స్కూలు అది.

# పని ప్రపంచంలో మా యాత్రలు

పనిని పిల్లలకి ఒక ఆంతర్యమైన అవసరంగా యెలా చెయ్యాలా అన్నది మా స్కూలు ఉపాధ్యాయులను వేధించింది. స్కూలు మొదటి రోజులనుంచీ ప్రాథమిక స్కూలు ఉపాధ్యాయులు పిల్లలచేత స్కూలు తోటలో పని చేయించారు. మేం ఓ చిన్న గ్రీన్ హౌస్ కట్టాం. దానిలో శీతకాలంలో పనిచేశారు. పిల్లల శ్రమని ఉన్నత సైద్ధాంతిక ప్రేరణలతో యెలా ఉత్తేజపరచాలా అని ఆలోచిస్తూ, ఉపాధ్యాయులు వాళ్లచేత విజయోత్సవ దినం* నాడు తలా ఒక ఓక్ చెట్టూ పాతించాలని నిర్ణయించుకున్నారు. అది మా సంతోషానికి సజీవ శాసనంగా వుండిపోతుంది. ప్రతి సంవత్సరమూ మా విజయోత్సవ దిన సందర్భంగా ఓక్ చెట్లని వనంలో పాతుతూనే వున్నాం.

పిల్లలని ప్రకృతి పరివేష్టించి వుండడమే కాదు, శ్రామిక, సృజనాత్మక, నిర్మాణాత్మక ప్రపంచమూ పరివేష్టించి వుండడం చాలా ముఖ్యమని మేం భావించాం. ఒక మనిషి సౌందర్యం చాలా స్పష్టంగా శ్రమలోనే వెల్లడౌతుంది.

ఆరకంగా మా "సంతోష చంద్రశాల" పని ప్రపంచంలోకి "యాత్రలు" చెయ్యడం మొదలెట్టింది. పిల్లలు సమష్టి వ్యవసాయ క్షేత్రపు ధాన్యపు కొట్టుల్లోకి చేసిన తమ మొదటి "యాత్రల్ని" యెన్నటికీ మర్చిపోలేరు. పిల్లలు గోధుమ రాశులు చూశారు - వాన్య తండ్రి సమష్టి వ్యవసాయ క్షేత్రంలో తమ పనులు బాగా చేసిన వాళ్లని గురించి మాకు చెప్పాడు.

* ఫాసిస్టు జర్మనీమీద సోవియట్ ప్రజలు విజయోత్సవ దినాన్ని మే 9న ప్రతి యేడూ జరుపుకుంటారు.

ప్రపంచాన్ని గురించి కలిగే జ్ఞానం మేధాపరమైందే కాదు, అనుభూతి పరమైంది కూడా. పనివాడుగా ఒక వ్యక్తి సౌందర్యాన్ని చూసి పిల్లలు మెచ్చుకుంటున్నారు. యీ "యాత్ర"ల్లో తమ తల్లిదండ్రులని కలిస్తే ఆ ఆనందం యెంతో గాఢంగా వుంటుంది. పాల కేంద్రందగ్గర తాన్యా తల్లి పదిహేను వందల మందికి సరిపడా పాలు తీస్తుందని పిల్లలు తెలుసుకున్నారు. ఆకురాలుకాలంలో ఒక రోజున మేము ఇంజనీరింగ్ ఫ్యాక్టరీకి వెళ్లాం. అక్కడ వాల్యా తండ్రిని కలిశాం. ఆయన పిల్లల్ని ఫౌండ్రీదగ్గరకి తీసికెళ్లాడు. వాళ్లు వినీ, లేక వాళ్లంతట వాళ్లే కల్పించీ చెప్పిన కథలన్నింటికంటే ఆసక్తికరమైంది ఒకటుంది. అదే మానవుడు ఒక గట్టి పదార్థాన్ని మండే అరుణ నదిలా మారుస్తున్నాడు, తరువాత ఆ నది మానవ శ్రమవల్లా, సంకల్పంవల్లా లోహపు కడ్డీల్లా మారుతుంది. యీ కొత్త విషయాన్ని పిల్లలు మహదానందంతో జీర్ణించుకోవడం నేను చూశాను: మండే లోహ నదిని శూరులు సృష్టించడం గురించి వాళ్లు కథలు అల్లారు, లోహ శ్రామికుల బొమ్మలు గీశారు. ఫౌండ్రీకి మొదటిసారి పోయిచూడ్డం వాళ్లమీద మరుపురాని ముద్రవేసింది. వాళ్లు అన్నిటినీ నూతనంగా దర్శించారు. లోహం లేకపోయినట్లయితే మానవుడు ఒక్క రోజు కూడా బతకలేడు, పని చెయ్యలేడని అర్థం చేసుకున్నారు. పనివాళ్లు, లోహశ్రామికులు, యంత్రనిర్మాతలు, వీళ్లే నిజమైన జీవిత సృష్టికర్తలు. మా పిల్లల్లో వీళ్లపట్ల గాఢమైన గౌరవం నాటుకుపోయింది.

అనేక రకాల నిపుణ శ్రామికుల, యంత్రాల ఫిట్టర్ల, టర్నర్ల వర్కుషాపులకి, ట్రాక్టరు స్టేషన్‌కి మేం చేసిన "యాత్రలు" కూడా ఆసక్తికరంగా వున్నాయి. లోహపు ముక్కల్లోనుంచి కోత యంత్రాల, ట్రాక్టర్ల భాగాలు యెలా పుడుతున్నాయో పిల్లలు చూశారు. యింజన్లు పనిచెయ్యడానికి అవసరమైన ఆ మరని లరీసా తండ్రి నేర్పరి హస్తాలు చెయ్యడాన్ని పిల్లలు ఉగ్గబట్టుకు గమనించారు.

మానవుల మధ్య సంబంధాలు, సాంఘిక జీవితం మానవ శ్రేయస్సు కోసం చేసే శ్రమలోనే అన్నిటికంటే ఎక్కువగా వెల్లడవుతాయి. ఒక వ్యక్తి మానవత్వం ఆమె గాని, అతను గాని పరులకోసం యేం చేస్తున్నారు అన్న దానిలో వ్యక్తమవుతుంది. మన సోషలిస్టు వాస్తవికత తాలూకు యీ పార్శ్వాన్ని తెరిచే వాతావరణంలో పిల్లల్ని కమ్మెం [illegible] నా ప్రయత్నం. ప్రకృతి సౌందర్యానికి సంబంధించిన దాంట్లో పిల్లలు ఆనందం పొందడమే కాదు, మన దేశంలో నిర్మాణమవుతున్న నూతన వ్యక్తి అంతస్సారంలో, స్వదేశానికీ, సమాజానికీ, మిగిలిన ప్రజలకీ అతని సేవలో కూడా ఆనందం పొందేటట్లు చెయ్య ప్రయత్నించాను. శ్రామిక జనంపట్ల పిల్లల ప్రేమ మానవ నీతికి మూలం అవుతుంది.

# మేం ప్రకృతి సంగీతాన్ని వింటాం

సంగీతం అంటే నైతిక, మేధాభివృద్ధికి ముఖ్యమైన సాధనం. అది హృదయౌన్నత్యానికీ, ఆత్మ పరిశుద్ధతకీ మూలం. సంగీతం ప్రకృతి చుట్టూతా వున్న ప్రపంచంలోనే కాదు, మనలో కూడా వున్నటువంటి ఘనమైన, దివ్యమైన సౌందర్యపూరితమైన భావాల్ని జాగృతం చేస్తుంది. స్వయం విద్యాబోధనకి సంగీతం శక్తివంతమైన సాధనం.

బాల్యంనుంచి పెద్దవాళ్లయ్యేదాకా విద్యార్థుల ఆధ్యాత్మిక అభివృద్ధిని గురించి యెన్నో సంవత్సరాల పరిశీలనవల్ల నాకు అనియతమైన, క్రమపద్ధతిలేని సినిమా, రేడియో, టెలివిజన్ల ప్రభావం సరైన సౌందర్య అవబోధన యివ్వదని నమ్మకం కలిగింది. ఆ మాటకొస్తే దుష్ప్రభావం కూడా వుంటుంది. అనియతమైన సంగీత స్వరాల విస్తారం ప్రధానంగా హానికరమైంది. ప్రకృతి నేపథ్యంలో పిల్లలకి సంగీత ఆస్వాదన నేర్పాలి. ప్రశాంతమైన పొలాల్లోనూ, పచ్చిక మైదానాల్లోనూ, ఓకు చెట్ల తోపుల మర్మర ధ్వనిలోనూ, వినీలాకాశంలోని భరద్వాజ పిట్ట గానంలోనూ, పాలు పోసుకున్న గోధుమ పనల గుసగుసల్లోనూ, తేనెటీగల ఝుంకారంలోనూ, కందిరీగల హోరులోనూ వున్న సంగీత సౌందర్యాన్ని పిల్లలు అర్థం చేసుకుని, అనుభూతం చేసుకునేటట్లు అది చేస్తుంది. యిదంతా ప్రకృతి సంగీతం. శ్రావ్యతని సృష్టించడానికి వ్యక్తి ప్రేరణపొందే మూలం.

"సంతోష చంద్రశాల"లో సంగీత కృతులూ, ప్రకృతి సంగీతం. వినడానికి మేం చాలా శ్రద్ధ చూపించాం - మా ముందున్న మొదటి కర్తవ్యం శ్రావ్యతకి రసాత్మక ప్రతిచర్యని స్పందింప చెయ్యడం, అప్పుడు సంగీత సౌందర్యానికి ఆధారం పరివేష్టిత ప్రపంచంలో వుందని పిల్లలకి క్రమేపీ విశ్వాసం కలిగించడం. ఆ శ్రావ్యత ఒక మనిషిని నిలబెట్టేస్తుంది, ప్రకృతి సంగీతం వినేటట్టు చేస్తుంది, ప్రపంచ సౌందర్యాన్ని ఆస్వాదించేటట్టు చేస్తుంది, ఆ సౌందర్యాన్ని అనుభూతం చేసుకుని, దాన్ని వృద్ధి పొందించేటట్లు చేస్తుంది. ఒక మనిషి తన మాతృ భాషనీ, సంగీతాస్వాదన మూలాధారాల్నీ గ్రహించడం, అర్థంచేసుకోవడం, అనుభూతం చేసుకునే సామర్థ్యం, శ్రావ్యత సౌందర్యాన్ని అనుభవించడం బాల్యంలో మాత్రమే సాధిస్తాడు. బాల్యంలో లోపించిన దాన్ని తర్వాత భర్తీ చెయ్యడం కష్టం, ఆ మాట కొస్తే అసాధ్యం కూడానూ. మాతృ భాషనీ, ప్రకృతి సౌందర్యాన్నీ, శ్రావ్యతనీ పిల్లవాడి హృదయం సమస్థాయిలో అనుభూతం చేసుకుంటుంది. బాల్యంలోనే పిల్లవాని హృదయానికి సంగీత సౌందర్యం తాకితే, స్వరంలో పిల్లవాడు మానవోద్రేకాల సూక్ష్మతల్ని అనుభూతం చేసుకుంటే, వేరే పద్ధతులద్వారా పొందలేని సాంస్కృతిక స్థాయిని అతడు చేరుకుంటాడు.

ప్రశాంతంగా వున్న వాతావరణంలో, ప్రతి శబ్దాన్నీ స్పష్టంగా వినగలిగే ఆకురాలు కాలపు తొలి రోజుల్లో పిల్లలూ, నేనూ ఓ రోజు మధ్యాహ్నం పచ్చిక

మైదానంమీద కూర్చున్నాం. రష్యన్ శాస్త్రీయ సంగీత కృతిలోని "కందిరీగ ఎగరడం" అనే గీతం విందామన్నాను నేను. ఆ సంగీతం పిల్లల్లో రసాత్మక అనుభూతి రేపింది. "ఆ కందిరీగ దగ్గరగా వస్తున్నట్టుంది. మళ్లీ దూరం పోతున్నట్టుంది. చిన్ని పిట్టలు కిలకిలమనడం వినచ్చు" అని వాళ్లు అన్నారు. మేం ఆ గీతం మళ్లీ విన్నాం. అప్పుడు మేం మకరందం వున్న పువ్వులతో నిండిపోయిన పచ్చికమీదకి వెళ్లాం. పిల్లలు తేనెటీగల ఝుంకారం, కందిరీగల జోరు విన్నారు. ఒక పెద్ద కందిరీగ ఓ పువ్వుమీద యెగరడం లోపలికి జారిపడ్డం చూశారు. పిల్లలకి సరదా అయింది. అది అచ్చం రికార్డుమీద సంగీతంలాగే వుంది. కాని యీ సంగీతపు కూర్పు అద్వితీయ సౌందర్యంతో వుంది. దాన్ని మేళన కర్త ప్రకృతిలో విని మనకి అందించాడు. పిల్లలు ఆ సంగీతం మళ్లీ వినాలనుకున్నారు.

ఓ రోజు తర్వాత, మేం పొద్దుటిపూటే బోలెడు పువ్వులున్న మైదానానికి వెళ్లాం. తేనెటీగల శబ్దాన్ని పిల్లలు శ్రద్ధగా విన్నారు. దుబ్బుగా వున్న కందిరీగల జోరుపడదామని చూశారు. అంతకు ముందు మామూలుగా కనిపించిందాంట్లో వాళ్లు సౌందర్యాన్ని దర్శించారు. అదీ సంగీతానికి వున్న శక్తి.

పిల్లలు అర్థంచేసుకునే స్పష్టమైన చిత్రాలని కళ్లకి కట్టించే సంగీతపు కృతులను ఎంపిక చేశాను. వాళ్లు తమ చుట్టూతా విన్నవే అందులో వుంటాయి: పక్షుల కిలకిలారవం, ఆకుల సవసవ, గర్జించే పిడుగు శబ్దం, సెలయేటి గలగల, గాలిహోరు... యివే. అదే సమయంలో పిల్లలకి కుప్పతెప్పలైన సంగీత అనుభూతులు కలగకుండా నేను జాగ్రత్త పడ్డాను. అమితమైన సంగీత భావ చిత్రణ పిల్లలకి మంచిది కాదన్న మాటని రెట్టిస్తున్నాను. అలాంటిది గందరగోళంగా వుండచ్చు, పూర్తిగా రసాత్మక స్పందన జడమైపోవచ్చు. నెలకి రెండు స్వరాలకంటే యెక్కువ నేను వాడలేదు, కాని యీ స్వరాలకి సంబంధించి చాలా బోధనాత్మక కృషి జరిపాను. దాని లక్ష్యం యేమిటంటే పిల్లల్లో ఆ సంగీతం మళ్లీ మళ్లీ వినాలని కోరిక జాగృతం కావాలి, వాళ్లు ఆ సంగీతాన్ని విన్నప్పుడల్లా సంగీత కృతిలో నూతన ఆనందాన్ని ఆవిష్కరించుకోగలుగుతారు.

మేం ఓక్ చెట్ల తోపులోకి వెళ్లాం. ఆకురాలు కాలం బాగా గడిచాక పొడిగా వెచ్చగా, యెండగా వున్న రోజు అది. నానా వర్ణ శోభితమైన అలంకారంగా వున్న చెట్ల బారు సూర్యకిరణాల్లో వెలుగుతోంది. ఆకురాలు కాలపు పిట్టల కూతధ్వనులు ట్రాక్టరు శబ్దంతో పాటుగా వినిపిస్తున్నాయి. వినీలాకాశంలో కొంగల గుంపు యెగిరిపోతోంది. మేం చైకోవ్‌స్కీ "అక్టోబరు పాట" విన్నాం. పిల్లలు తమ చుట్టూ వున్న ప్రకృతిలో తాము యింకా గమనించకుండా వున్న పౌనఃపున్యము లేని సౌందర్యాన్ని అనుభూతం చేసుకోడానికిది తోడ్పడింది – ఓక్ చెట్లమీద పసుప్పచ్చగా తిరిగిన ఆకుల నిదానమైన గలగల, స్వచ్ఛమైన గాలి తాలూకు సువాసన, రోడ్డువార వాడిన సుగంధ పుష్పాలు.

పిల్లలు ఉత్సాహంగానే వున్నారు గాని ఆ స్వరం కొంచెం విచార ఛాయలని వాళ్లమీద పరిచింది. మసక రోజులు, చలిగాలి తుఫాన్‌లూ, పొద్దు తక్కువ పగళ్లూ చేరువలోకి వచ్చేశాయని పిల్లలు భావించారు. యీ సంగీతంచేత ప్రభావితులై వాళ్లు వేసవి అందాన్ని గురించీ, ఆకురాలు కాలపు తొలి బంగారు దినాల గురించీ మాట్లాడుకున్నారు. ప్రతి పిల్లవాడూ యేదో స్పష్టమైన దాన్నీ, వర్ణనీయమైన దాన్నీ గుర్తుకు తెచ్చుకున్నాడు. వేసవి, ఆకురాలు కాలపుచిత్రాలు తమ పూర్తి సౌందర్యంతో పిల్లల వూహల్లో ప్రత్యక్షమయ్యాయి. లరీసా అంది: "మా నాయనా నేనూ కనుమ దగ్గరికి వెళ్లాం. దాని యేటవాలులో ఆకుపచ్చని గోడ వుంది – అడివి, అడివి, అంతా అడివి, యెండలో వెలిగిపోతూ వుంది. యెక్కణ్నుంచో ఓ అడివి గువ్వ 'కూ' అంది. అడివిలో యెంత బాగుందో, యెంత బాగుందో, అలా అలా నడవాలని అనుకుంటారంతే, సూర్యుడు అలా అస్తమానూ ప్రకాశించాలనుకుంటారంతే. చుట్టుపక్కల అడవి గువ్వలున్నప్పుడు వాటి పాట విందానికి చెట్ల ఆకులన్నీ శక్తి అంతా కూడదీసుకుని విందానికి కదలకుండా వున్నట్టనిపిస్తుంది."

షూర గుర్తుచేసుకున్నాడు: "అమ్మ నన్ను పొలంలోకి తీసికెళ్లింది. ఆమె కోత యంత్రం దగ్గర పనిచేస్తోంది. నేను యంత్రం డ్రైవరు మా మావయ్యతో యంత్రంమీద వెళ్లాను. నేను నిద్రపోదామనుకున్నాను. అమ్మ నన్ను కొత్త గడ్డిమేటుమీద దించింది. నేను నీలాకాశంకేసి చూశాను. గడ్డిమేటు నేలమీద యెక్కడో యెత్తుగా యీదుతోంది. ఆకాశంలో వణికే పక్షి కనిపించింది. అప్పుడది నానుంచి యెగిరిపోయింది. గొల్లభామలు నాతో యెగిరాయి, వాటి బృందమంతా పాడుతోంది, ఆ పిట్టని కలుసుకోడానికి యెగురుతూ. ఆరకంగా నేను నిద్రపోయాను. నేను నిద్రలేచాను, ఆ పిట్ట యింకా ఆకాశంలో వణుకుతూనే వుంది, గొల్లభామలు యింకా గట్టిగా రాగం తీస్తున్నాయి."

మేం మళ్లీ ఆ సంగీతం విన్నాం. పిల్లలు తమ మనసులకి హత్తుకున్న వేసవినీ, ఆకురాలుకాలపు రోజుల మరిచిపోలేని సౌందర్య జ్ఞాపకాలనీ ఆ సంగీతంలో దర్శించారేమోననిపించింది నాకు. పిల్లలు కొత్త జ్ఞాపకాలు నెమరువేస్తున్నారు.

"నేనూ, మా నాయనా గడ్డి బండిమీద వెడుతున్నాం. ఆకాశంలో నక్షత్రాలు మిణుకుమంటున్నాయి. పొలాల్లో కోలంకి పిట్టలు పాడుతున్నాయి. మరి నక్షత్రాలు యెంత దగ్గరగా వచ్చాయంటే నేను చేత్తోటి ఆ నక్షత్రాల్ని చిన్న దీపం పట్టుకున్నట్టు పట్టుకున్నాను."

యిది జీనా జ్ఞాపకం. నేనా పిల్ల చెబుతూ వుంటే ఆశ్చర్య పోయివిన్నాను. ఆ పిల్ల అస్తమానూ అంత గమ్మున వుండేది. ఆ పిల్లచేత చచ్చినా ఒక్క మాట అనిపించలేకపోయే వాళ్లం. కాని సంగీతం ఆమెని మాట్లాడించింది.

సంగీతం ఆలోచనామృతం. సంగీత ఆస్వాదనాబోధన లేకుండా పిల్లవాడి పరిపూర్ణ మానసిక అభివృద్ధి అసాధ్యం. సంగీతానికి ఆధారం వూరికే చుట్టూతా

వున్న ప్రపంచంలోనే లేదు, భాష ఆలోచనల ఆంతరంగిక ప్రపంచంలో వుంది. సంగీత చిత్రం వస్తువులలోని ప్రత్యేక లక్షణాలను వెల్లడి చేస్తుంది. సంగీతపు కాంతిలో తనకి వెల్లడైన వస్తువులమీదా, ప్రకృతిమీదా పిల్లవాని దృష్టి లగ్నమై వుంటుంది. అతని ఆలోచనలు స్పష్టమైన చిత్రాన్ని గీస్తాయి; ఆ చిత్రం మాటల వ్యక్తీకరణని అపేక్షిస్తుంది. ప్రపంచంనుంచి గ్రహించిన నూతన భావాలకీ, ఆలోచనలకీ, వస్తువుకీ పిల్లవాడు మాటలు సృష్టిస్తాడు.

సంగీతం, కల్పన, భావన, అద్భుత కథలు, సృజనాత్మకత - యిదీ పిల్లవాడు తన ఆంతరంగిక శక్తిని పెంపొందించుకునే మార్గం. సంగీతం పిల్లవానిలో స్పష్టమైన భావాలని మేల్కొల్పుతుంది. హేతువుకి సంబంధించిన సృజనాత్మక శక్తుల్ని పెంపొందించడానికి యిదే ఉత్తమమైన సాధన.

శీతాకాలంలో రోడ్లన్నీ మంచుతో కప్పడిపోయినప్పుడు మేము మా క్లాసురూమ్‌లో చైకోవ్‌స్కీ, గ్రీగ్, షూబెర్ట్, షూమన్‌ల సంగీతం వింటూ కూర్చున్నాం. సాయం సంధ్యలో అద్భుత కథా స్వరాలు వింటూ పిల్లలు ముఖ్యంగా మహదానందం పొందారు. నేను వాళ్లకి ఉక్రేనియన్ దుష్ట మంత్రగత్తె బాబా యగా గురించిన జానపద గాథ చెప్పాను. అప్పుడు మేం చైకోవ్‌స్కీ "బాబా యగా" సంగీతం విన్నాం. ఆ సంగీత ప్రభావంలో పుట్టిన అద్భుత చిత్రాల భావాల అతిశయం మాటల్లో చెప్పడం కష్టం. పిల్లలు తమ కలల్లో యెక్కడో అడవి అవతల, వినీల సముద్రాని కవతల, మారుమూల గుహల్లోకీ, కనుమల్లోకీ, దూరపు పర్వతాల్లోకీ ప్రయాణం చేశారు. పిల్లలు కల్పించిన అసలు నమ్మశక్యంకాని కథలు వింటూ నిశ్చేష్టుడినై వుండి పోయాన్నేను. కొన్ని కథల్ని నా జీవితమంతా మర్చిపోలేదు. యూర వూహలో ఆ దుష్టమంత్రగత్తె బాబా యగా మానవ సంతోషాన్ని హరించి, పాటలని హరించి మానవద్వేషిగా తయారవుతుంది. "ఆమె పెద్ద కుండ తీసుకుంది. తన రోలుమీద కూర్చుని ప్రపంచమంతా యెగిరింది. (బాబా యగా సాంప్రదాయికమైన చీపురు కట్టమీద గాక రోలుమీద స్వారీ చేసేది). ఓ పాట వినేది. జనాన్ని ఆనందపరిచే ఆ పాట యెక్కణ్ణుంచి వస్తోందో అక్కడికి వెళ్లేది. రోలు పక్కన కుండని కొట్టేది. ఆ జనం నిశ్శబ్దమై పోయేవాళ్లు, యెలా పాడాలో మర్చిపోయేవాళ్లు, యెందుకంటే బాబా యగా ఆ పాటని తన కుండలో దాచేసింది. యీ రకంగా బాబా యగా అన్ని పాటల్నీ దాచేసింది. మొత్తం ప్రపంచంలో చిన్న గొర్రెల కాపరి కుర్రాడొక్కడే పాడుతూ బయటపడ్డాడు. అతను తన బూర వాయిస్తూ పాటలు పాడాడు. ఆ దుష్ట మంత్రగత్తె యెంతగా తన కుండని రోలుమీద మోదుకున్నా యేం చెయ్యలేకపోయింది. ఆ పిల్లవాని బూర మంత్రముగ్ధం అయిపోయింది. అంచేత దుష్ట, దుర్మార్గ బాబా యగా శోకిస్తూ తన కుండలో పాటలన్నిటితోటీ కూర్చుంది. మొత్తం ప్రపంచమంతా గమ్ముగా వుంది. యెవరూ పాడడంలేదు, యెక్కడా సంతోషం లేదు. యీ గొర్రెలకాపరి కుర్రాడొక్కడే వాయిద్యం వాయిస్తూ వున్నాడు. అతను నిద్రపోవడానికి ఒరిగాడు. బాబా యగా అతని బూరాని కాజేసింది. ఆ కుర్రవాడు

నిద్రలేచి, బాబా యగా దగ్గరికి పోవడానికి తన సాహసవంతులైన మిత్రుల్ని కూడగట్టాడు..." అప్పుడు యూర కథ ఆ గొర్రెల కాపరి కుర్రాడు యెలా పాటల్ని విడిపించిందీ, యెలా సంతోషం ప్రజలకి తిరిగి వచ్చిందీ కథ కల్పించి చెప్పాడు. సంగీత ప్రభావంలో పిల్లలు అద్భుత కథా చిత్రాల ప్రాణుల్ని తయారుచెయ్యడం, మంచీ చెడుల అవతారాలు రూపుదాల్చడం ఆశ్చర్యం కలిగిస్తుంది. పిల్లలు ధర్మంకోసం జరిగే పోరాటంలో తామూ ఒకళ్లై పోతారు.

పిల్లల ఆలోచనల్లో స్తబ్ధత్వం గమనించినప్పుడల్లా వాళ్లని నేను ఓక్ తోపులోకో తోటలోకో తీసికెళ్లేవాణ్ణి. మంచీ చెడూ గురించిన స్పష్టమైన భావాలు మేల్కొలిపే సంగీతం వినే వాళ్లం. సంగీతం ఆలోచనా ధారని పారిస్తున్నట్లుండేది.

మా స్కూల్లో శీతాకాలపు రోజుల్లో యింకా యింకా యెక్కువ స్వాప్నికులు బయటపడ్డారు. చిన్న దంకో యెంత బెరుగ్గా వుండే వాడంటే అతన్నుంచి ఒక్క మాట రాబట్టలేరు మీరు. కాని అతనూ తన సొంత కథ ఒకటి బాబా యగా గురించి చెప్పాడు. నిజమే అది కూడా యూర కథలాగే బోలెడు విషయంతో వుంది. దంకో కథలో, బాబా యగా తన రోలుమీద ప్రపంచమంతా యెగిరి పువ్వులన్నిటినీ యేరేసింది. ఆమె తన నరకకూపంలాంటి వంటింట్లోకి వెళ్లి పొయ్యిమీద కుండ పెట్టింది. ఆ పువ్వులన్నిటినీ ఉడకబెట్టి చంపేసింది. "కాని నేను" – పిల్లవాడు తనే కథలో సిసలైన నాయకుడైపోయేవాడు – "పువ్వుల్లోని గింజలన్నిటినీ యేరి నేలలో పాతాను. పువ్వులు మళ్లీ వికసించాయి. బాబా యగా దీన్ని గురించి కనిపెట్టగానే తన రోలు ముక్కలు చేసేసింది, యిక యిప్పుడు అదెవరినీ దెబ్బకొట్టలేదు."

యీ కథల తర్వాత నేను ఉపాధ్యాయులతోటి బోధనలో వుండే కష్టాల గురించీ, లోట్ల గురించీ మాట్లాడేను. మేమంతా ఒకే నిర్ణయానికి వచ్చాం: పిల్లలు స్కూల్లో వున్నప్పుడు వాళ్లు మొదటగా పిల్లలు అనే విషయాన్ని మన బోధనశాస్త్రం మరిచిపోతుంది. ఒకో అప్పుడు పిల్లవాని బుర్రలోకి సత్యాల్ని, సాధారణీకరణలనీ, నిర్ణయాలనీ కుక్కేసేటప్పుడు ఉపాధ్యాయుడు పిల్లవానిని ఆలోచన ఆధారాల దగ్గరికీ, సజీవ ప్రపంచం దగ్గరికీ తీసుకురాడు. స్వప్నాల, ఊహల, సృజనల రెక్కలు కట్టేస్తాడు. పిల్లవాడు తరుచుగా సజీవ, చలనాత్మక, వాస్తవమైన వాటిని జ్ఞాపక యంత్రంగా మార్చుకుంటాడు. అలా వుండకూడదు. పిల్లవాణ్ణి చుట్టూతా వున్న ప్రపంచంనుంచి వేర్పాటు చెయ్యగూడదు. ఆధ్యాత్మిక జీవితానందం విద్యార్థికి పోగొట్టకూడదు. పిల్లల ఆధ్యాత్మిక జీవితం ఆటల, అద్భుత కథల, సంగీత, ఊహాత్మక, సృజనాత్మక ప్రపంచంలో వాళ్లు బతికినప్పుడే అసలైంది అవుతుంది. యిది లేకుండా పిల్లవాడు యెండిన పువ్వు తప్ప యేం కాదు.

విద్యాభ్యాసం అనేది ఆట సరదా యేమీ కాదన్న సంగతిని చెప్పక్కర్లేదు కదా. విద్యాభ్యాసం అనేది మొదటగా శ్రమ. కాని ఆ శ్రమని క్రమబద్ధం చేసేటప్పుడు పిల్లవాని మానసిక, నైతిక, రసాత్మక, సౌందర్యాత్మక అభివృద్ధిలోని ప్రతి దశలోనూ పిల్లవాని అంతరిక ప్రపంచాన్ని దృష్టిలో వుంచుకోవాలి. పెద్దవాళ్ల మేధా శ్రమకంటే

పిల్లల మేధా శ్రమ భిన్నంగా వుంటుంది. పెద్దవాళ్లల్లా కాకుండా పిల్లవాళ్లకి జ్ఞానాన్ని ఆకళింపుచేసుకోవడం అనే అంతిమ లక్ష్యం వాళ్ల మేధా శ్రమకి ప్రధాన ప్రేరకం కాదు. నేర్చుకోవాలన్న కోరికకి ఆధారం పిల్లల మానసిక శ్రమ స్వభావంలోనే వుంటుంది – అది ఆలోచనలు ఉద్రేకభరితం కావడంలో, మేధకి సంబంధించిన అనుభవాలలో వుంటుంది. యీ ఆధారం యిగిరిపోతే పిల్లవాణ్ణి పుస్తకం పట్టించే మార్గమే వుండదు.

"సంతోష చంద్రశాల" మొదటి శీతాకాలాన్ని నేను యెన్నటికీ మరిచిపోలేను. సంగీతం, వూహా, సృజనగల వాతావరణం లేక పోయినట్లైతే వెచ్చని, సౌఖ్యప్రదమైన క్లాస్‌రూమ్ చిరాకెత్తించేసేది. మా చుట్టూ వున్న ప్రపంచాన్ని సంగీతం అద్భుతమైన ఆకర్షణతో నింపేసింది. శీతాకాలపు మసక వెన్నెలలో తళతళమెరిసే వెండితివాసీలలో, కళ్లు పొడుచుకున్నా కనిపించని హిమ తుఫానుల సుడిగాలుల్లో, గడ్డకట్టిన చెరువు తీసిన బీటలో – ప్రతి వాటిలో మా వూహల్లో అద్భుత కథల జీవులు ఆవిర్భావమయ్యేవి.

"సంతోష చంద్రశాల" మొదటి వసంతం వచ్చింది. చిన్న సెలయేళ్లు గలగలమనడం ఆరంభించాయి; పువ్వులు వికసించ నారంభించాయి. తెల్లటి యాపిల్, ఛెరీ పువ్వుల వెల్లువలో తేనెటీగల ఝుంకారం విన్నాం. వసంత వనగీతం, వినీలాకాశపుగీతం, పచ్చిక మైదానాలా పచ్చిక బీళ్లా గీతం విన్నాం.

సాయంత్ర ప్రశాంతిలో మేం పచ్చిక మైదానంలోకి వెళ్లాం. లేత ఆకుల పుస్సీవిల్లో చెట్టు మా ముందు వుంది. అనంత ఆకాశం చెరువులో ప్రతిబింబిస్తోంది. నిర్మల వినీలాకాశంలో హంసల గుంపు యెగురుతోంది. ఆ సాయంత్రపు మధురగానాన్ని చెవులు రిక్కించి విన్నాం. ఎవరో మృదువుగా పియానో మీటలు నొక్కుతున్నట్టుగా వున్న శబ్దం ఒకటి చెరువునుంచి వినిపించింది. గట్టూ, ఆకాశం, చెరువు ఆ ధ్వనితోటి ప్రతిధ్వనిస్తున్నట్టుగా వున్నాయి. "యేమిటబ్బా అది?" వాన్య మెల్లగా అడిగాడు. "అది వసంత మైదానాల గానం" అని పిల్లలకి చెప్పాను నేను. "అదుగో చూడండి చెరువుమీద ఆకాశపు ప్రతిబింబం. చెరువు అడుగున లోతుగా స్ఫటికంతో చేసిన గంట వుంది. అక్కడ ఆ అద్భుతమైన తావులో వుంటుంది అందమైన కన్య, వసంతం. ఆమె బంగారు సుత్తితోటి స్ఫటికపు గంటని మోగిస్తుంది. ఆ ధ్వని మైదానాలమీద వ్యాపిస్తుంది."

ఆ శబ్దం మళ్లీ వినవచ్చింది. కోల్య నవ్వాడు: "అది కప్ప అరుపు." పిల్లలు నవ్వడం మొదలెట్టి వాళ్లని ఆకట్టుకున్న ఆ మంత్రకట్టు మాయమై పోతుందేమోనని నేను భయపడ్డాను. కాని యెవళ్లూ నవ్వలేదు. "కప్ప అయితే అయివుండచ్చు, కాకపోనూ వచ్చు. కప్పే అయితే అవనీయండి. మైదానం యింకా గానం చేస్తూనే వుంది" అన్నాడు సాష.

అతని మాటలకి జవాబుగా అన్నట్టుగా పక్కన వున్న చెరువు పైగా యెక్కణ్ణుంచో ఆ శబ్దం ప్రతిధ్వనించింది. కొన్ని క్షణాల తర్వాత సుదూర పచ్చిక

మైదానంనుంచి ప్రతిధ్వని వచ్చింది. ఆ వసంతపు పచ్చిక బీళ్ల ఆశ్చర్యకరమైన సంగీతానికి ముగ్ధులమై వింటూ వుండిపోయాం. ఆశావహమైన ప్రపంచ దృక్పథానికి సంగీతం సజీవ జల. సౌందర్యాన్ని అర్థం చేసుకోవడానికీ, ఆనందం అనుభవించడానికీ అది సహకరించింది. నాకు మాత్రం సౌందర్యపు శ్రావ్యత అంటే మరిచిపోలేని బాల్యదిన జ్ఞాపకాలు.

సూర్య కాంతి వున్న మొదటి ఏప్రిల్ రోజున, మేం భరద్వాజపిట్ట గీతం వినడానికి పచ్చిక బీళ్లమీదకి వెళ్లాం. అక్కడ వినీలాకాశంలో చిన్ని బూడిదరంగు ప్రాణి గజగజ వణుకుతూ వుంది. వెండి గంట వాయించిన మృదువైన స్వరం మా చెవులని సోకింది. అకస్మాత్తుగా గంట ఆగిపోయింది. ఆ బూడిదరంగు ప్రాణి నేలమీద పడింది. శీతాకాలపు లేత గోధుమ కాండాలమీద, ఆ చిన్ని పక్షి, యేదో అదృశ్యమైన దారాన్ని లాగుతున్నట్టుగా, తన రెక్కలు చాచి మెల్లిగా పైకి లేచింది. అప్పుడు మేం గంట మోత కాదు, ఒక వెండి తీగ కంపనస్వరం విన్నాం.... యీ అద్భుతమైన సంగీతం పిల్లల హృదయాల్ని స్పృశించాలని, వాళ్ల నేత్రాలని పరివేష్టిత ప్రపంచపు సౌందర్యానికి తెరిపించాలనీ నేను భావించాను. అప్పుడు నేను భరద్వాజ పిట్ట గురించి ఒక కథ చెప్పాను.

"భరద్వాజ పిట్ట సూర్యుని బిడ్డ. శీతాకాలంలో సూర్యుడు మన నుంచి యెంతో దూరం, యెంతో దూరం వెళ్లిపోతాడు. భూమి మంచుతోటి కప్పడిపోతుంది. మెల్లిగా మెల్లిగా సూర్యుడు మన దగ్గరికి వస్తాడు. మంచుని కరిగించడం ఆయనకి కష్టంగా వుంటుంది. ఆయన వేడి రవ్వల్ని మంచు కుప్పలమీద విసురుతాడు. ఆ వేడి రవ్వలు పడ్డ చోట మంచు కరిగిపోయి గడ్డనుంచి జీవం వస్తుంది. యేం, ఒక అద్భుతమైన పక్షి జన్మిస్తుంది – అది భరద్వాజపిట్ట. అది నీలాకాశంలోకి లేస్తుంది, సూర్యుణ్ణి కలుసుకోడానికి యెగిరిపోతుంది. అది యెగురుతుంది, పాడుతుంది, సూర్యుడు వెండి రవ్వలు చిమ్ముతాడు. బాగా ప్రకాశించే రవ్వకోసం భరద్వాజపిట్ట నేలకేసి చూస్తూ, వినీలాకాశంలో యెగురుతుంది. అలాంటి రవ్వని చూడగానే అది నేలమీదకి వాలి ఒక రాయిలాగా దాన్ని పట్టుకుని తక్షణం దాన్ని సున్నితమైన వెండి పోగులాగ మార్చేస్తుంది. భరద్వాజ పిట్ట దాని ఒక అంచుని నేలమీద వదిలేసి గోధుమ కాడకి తగిలించి రెండో అంచుని యెత్తుగా, యెత్తుగా సూర్యుని దగ్గరికి, నీలాకాశందగ్గరికి లాగుతుంది. చూడండి ఆ పిట్టకి లేవడం యెంత కష్టమో, దాని బూడిద రంగు రెక్కలు యెలా కొట్టుకుంటున్నాయో. వెండి పోగుని తాడు మీటినట్లుగా అది మీటుతుంది. భరద్వాజం యెంత యెత్తుకుపోతే ఆ పోగు అంత ఉచ్ఛ్వస్వరం చేస్తుంది. భరద్వాజం ఆ పోగుని అంత దూరమూ సూర్యుడిదగ్గరికి సాగదీస్తుంది. మళ్లీ నేలమీదకి యింకో రవ్వ కోసం చూస్తూ వస్తుంది."

ప్రకృతి నియమాల జ్ఞానం అద్భుత కథలని ఆటంక పరచదూ? కాదు, అందుకు భిన్నంగా, వాటిని అర్థంచేసుకోవడాన్ని సులభం చేస్తుంది. కాస్త మట్టిపెళ్ల సజీవ ప్రాణి కాలేదని వాళ్లు అర్థం చేసుకుంటారు, మహాకాయులైన కమ్మరి వాళ్లూ,

బాబా యగా, మృత్యువులేని మహాకాశాలూ లేవని అర్థంచేసుకున్నట్టే. పిల్లలకీ విషయాలన్నీ లేనట్లయితే, మంచికీ చెడుకీ మధ్య పోరాటం వాళ్లు అనుభవించకపోయినట్లయితే, సత్యమూ, గౌరవమూ, సౌందర్యమూ అద్భుత కథల్లో ప్రతిఫలించాయని అనుకోకపోతే అప్పుడు వాళ్ల ప్రపంచం అసౌకర్యంగా కిక్కిరిసిపోయి వుంటుంది.

భరద్వాజ పిట్టని గురించిన కథ ప్రకృతి సంగీతం అర్థం చేసుకోడానికి పిల్లలకి తోడ్పడింది. వాళ్లని మధుర స్వరాలు వినేటట్టు చేసింది. మేం స్కూల్‌కి తిరిగివచ్చి చైకోవ్‌స్కీ "భరద్వాజ పాట" విన్నాం. పిల్లలు వెండి గంట ధ్వనిని మెచ్చుకున్నారు. అది సూర్యుణ్ణీ పచ్చని పొలాన్నీ సంధించిన సున్నితమైన వెండి పోగు స్వర భేదాల్నీ సంగీతపు ధ్వనుల్నీ పట్టుకుని వున్నది. ఈ పాటని మేం చక్కని ఉదయాల్లోనూ, మసక వాన రోజుల్లోనూ కూడా యెక్కువ సార్లు విన్నాం. కాని పిల్లలు మాత్రం అస్తమానూ ఆ అద్భుతమైన యెండతో ప్రకాశితమైన ప్రపంచాన్నీ, వినీలాకాశాన్నీ, భరద్వాజపిట్టనీ, విస్తారమైన పొలాల్నీ గుర్తుచేసుకున్నారు. పిల్లలు పక్షిని గురించిన తమ భావాలు స్వచ్ఛమైన అద్భుత కథా చిత్రాల్లో రూపుతీసుకోవాలని కోరుకున్నారు. వాళ్లు భరద్వాజపిట్ట అద్భుత కథా చిత్రాలు, వెండి రవ్వలు, నేలనుంచి నింగిదాకా సాగిన తాడు బొమ్మలు గీశారు.

పిల్లలకిష్టమైన సంగీత కృతుల పుస్తకం ఒక దాన్ని మేం క్రమేపీ తయారుచేశాం. తడవతడవకీ మేం మా గదికి వెళ్లి సంగీతం విన్నాం. నేనా పుస్తకాన్ని "మా సంగీతపు నగలపెట్టె" అన్నాను, పిల్లలకది నచ్చింది. వాళ్లు సగర్వంగా అన్నారు "మాకో సంగీతపు నగలపెట్టె వుంది" అని. యేటి యేటికీ సంగీత భాండారంలోని అత్యంత విలువైన దాన్ని తీసుకుని, మేం ఆ వ్యక్తీ, ప్రకృతీ సృష్టించిన సౌందర్యాన్ని ఆస్వాదించే ఒక సంగీతపు గదిని నిర్మించాలని నాకు తట్టింది. మేం పాడతాం, పియానో, ఫిడేలు వాయించడం నేర్చుకుంటాం. కాని అదంతా ముందు, ప్రస్తుతానికి మేం బూర వాయించడం నేర్చుకుంటాం.

మబ్బుగా వున్న ఒక రోజున మేం తోపులోకి వెళ్లాం. ఒక ఎల్డర్ చెట్టు కొమ్మనుంచి బూరా తయారుచేసాం. మేం దానికి నగిషీ చెక్కి కన్నాలు పొడిచాం. నేను హుషారైన చిన్న గొర్రెల కాపరిని గురించిన ఉక్రేనియన్ జానపద గీతపు రాగాన్ని వాయించాను. పిల్లల సంబరం యింత అని చెప్పలేం. ప్రతి పిల్లవాడూ వాయిద్దామని ప్రయత్నించినవాడే. వాళ్లందరూ కూడా తమ సొంత బూరాలు వుండాలని కోరారు. వాళ్లంతా బూరాలు తయారుచేసుకున్నారు. లీదా, లరీసా, యూర, తీనా, సెర్యోజ, కోస్త్యలకి సున్నిత సంగీత స్పర్శ వుంది, శ్రావ్యతా భావుకత వుంది. కొద్ది రోజుల్లో పిల్లలు జానపద గీతాల, నృత్యాల రాగాలు ఆలాపించసాగారు. తీనా ఒక ఉక్రేనియన్ జానపద గీత రాగం ఆలాపించిన ప్రశాంత సాయంత్రాన్ని నేనెన్నడూ మర్చిపోలేను. ఆ చిన్న పిల్ల కళ్లు మెరిశాయి, ఆమె చెక్కిళ్లు కెంపెక్కాయి. తీనా చాలా సేపు యింటి దగ్గర తోటలో బూరమీద రాగాలు "కల్పిస్తూ"

ఒకోఅప్పుడు ఆకాశం కేసీ, చెట్లకేసీ స్వాప్నికంగా చూస్తూ కూర్చుంటుందని వాళ్ల అమ్మ నాకు చెప్పింది.

ఒక రోజున నేను స్కూల్‌కి పెందరాళే వచ్చాను. చుట్టూ అంతా ప్రశాంతంగా వుంది. హఠాత్తుగా తోటలో వెనక యెక్కణ్నుంచో బూరా ధ్వనులు వినవచ్చాయి. ఆ సంగీతం యేమిటో చూద్దామని వెళ్లాను. యెవరో రాగాన్ని ఆలాపిస్తున్నారు. అది ఆశువుగా కూర్చిందని తెలుస్తూనే వుంది. ఆ రాగం అంతా ప్రకాశమానంగా, నిర్మలినంగా వున్న విషాద రేఖ పరుచుకున్నట్టు వుంది. ఆ వాయిద్యకారుణ్ణి ఆటంకపరచకుండా వుండాలని జాగ్రత్తగా నేను గులాబీ పొదల వెనక్కి వెళ్లాను. అక్కడ గడ్డిమీద తీనా కూర్చుని వుంది. ఆ బూరా ఆమెతో లీనమైపోయినట్టుగా వుంది. మెత్తటి, లాలించే చూపులతో ఆ పిల్ల ఒక గులాబీ కేసి చూస్తోంది. అప్పుడు నేనా రాగాన్ని అర్థంచేసుకో నారంభించాను: ఆ పాప అందమైన పువ్వుని గురించీ, వసంత నీలాకాశం గురించీ వాయిస్తోంది. విషాదంగా కనిపించింది నిజంగా వ్యాకులం: తీనా భవిష్యత్తుని గురించిన తన వూహలు సంగీతంలో వ్యక్తం చేస్తోంది.

కోస్త్యకి కూడా బూరా అంటే యిష్టం పెరిగింది. ఒక్క చేత్తో వాయించడం అతనికి కష్టమే. కాని అతను కొన్ని జానపద గీతాల రాగాలు వాయించడం వేగంగా నేర్చుకున్నాడు. అప్పుడు కొన్ని కల్పించడం నేర్చుకున్నాడు - వూహించడం, తన ఆలోచనలనీ, అనుభూతుల్నీ, అనుభవాలనీ సంగీతంలోకి మార్చడం నేర్చుకున్నాడు. ఒక రోజున ఉరుముల మెరుపులతో వానగా వున్నప్పుడు మేం మా "స్వప్నాల దిశ"లో కూర్చున్నాం. ఉరుములు ఆగిపోయాయి. ఆకాశంలో ఇంద్రధనస్సు కనిపించింది. ఆ దృశ్యపు సౌందర్యాన్ని మెచ్చుకుంటూ ప్రతివాళ్లూ నిశ్శబ్దం అయిపోయారు. మేం ఒక మెల్లని రాగాన్ని విన్నాం: కోస్త్య వాయిస్తున్నాడు. విచారగ్రస్త గర్జనతో నిండిన సుళ్లు తిరిగే సెలయేటి ధ్వనిని ఆ సంగీతం పొదువుకుంది. గర్జాన్విత మేఘాలు దగ్గరయ్యాయి. దూరంలో ఉరుములు వినిపిస్తున్నాయి. చిన్ని పిల్లవాడు మేం వింటున్నామని మరిచిపోయాడు. తన కల్పనలోకి ప్రతీదీ గుమ్మరించేశాడు. అకస్మాత్తుగా తన మిత్రుల చింతాకులిత వదనాల స్పృహ తగిలింది, సిగ్గుపడి పోయాడు.... వాళ్లంతా సంగీతకారు లవలేకపోవచ్చుగాని, ప్రతి ఒక్కళ్లూ సంగీతాన్ని ఆస్వాదించేటట్టు చెయ్యగలమని నా దృఢ విశ్వాసం.

సంగీతం మనసుని విద్యావంతం చేస్తుంది, అనుభూతుల్ని మానవీయంచేస్తుంది. మాటల్లో లాగానే సంగీతంలో అసలైన మానవీయత వ్యక్తమవుతుంది. పిల్లవాని సంగీత భావుకత అభివృద్ధి చెయ్యడంలో మనం అతని ఆలోచనలనీ, కాంక్షలనీ ఉన్నతం చేస్తున్నాం. సంగీతం ప్రతి హృదయంలోనూ జీవనదాయక జలని ఆవిష్కరించాలి. ఒకని మాతృభాషలోని సజీవ చలనపూరిత పదాల్లాగే సంగీతం పిల్లవాడికి చుట్టూతా వున్న ప్రపంచాన్ని తెరుస్తుంది.

ఆటలూ అద్భుత కథలూ లేకుండా బాల్యం లేనట్లే సంగీతం లేకుండా కూడా బాల్యం లేదు.

ఉపాధ్యాయునికీ పిల్లవానికీ మధ్యన ఆధ్యాత్మిక బంధం ఉద్భవించే అత్యున్నత నేపథ్యం సంగీతమని అనుభవం సూచిస్తోంది. సంగీతం ప్రజల హృదయాల్ని తెరుస్తుంది. ఒక శ్రావ్యమైందాన్ని వింటూ, దాని అందాన్ని అభినందించి, అనుభవిస్తూ ఉపాధ్యాయుడూ పిల్లవాడూ సన్నిహిత మవుతారు.

# శీతాకాలపు సంతోషాలూ, విచారాలూ

శీతాకాలం.... యీ అందమైన కాలంలో పిల్లలకు యెన్నో భేషైన విద్యావకాశాలూ, శారీరక అభివృద్ధి అవకాశాలూ వున్నాయి. వేసవి కాలంలోనే పిల్లల ఆరోగ్యాన్ని దృఢపరచవచ్చని భావించేవాళ్లు పొరపాటుబడ్డారు. తగుమాత్రపు చల్లదనంతోనూ, మృదువైన, పుష్కలమైన హిమపాతంలోనూ పిల్లల ఆరోగ్యాన్ని దృఢపరచకపోతే, వేసవి కాలమూ ఉపకారి కాదు. చలిని భరించదానికీ, నిర్మలినమైన చల్లని గాలిని పీల్చదానికీ పిల్లలు అలవాటు పడేటట్టు చేశాను.

ఉదయం పూట మేం స్కూల్ గ్రీన్‌హౌస్‌కి సూర్యోదయానికి స్వాగతం చెప్పడానికి వెళ్లేవాళ్లం. గ్రీన్‌హౌస్ వసారాలోని కరడుగట్టిన అద్దాలని సూర్యకాంతి చిత్రమైన అరుణ వర్ణ రేఖలతో అలంకరించేది. ప్రతి అద్దంమీదా మా వూహాలు ఆశ్చర్యకరమైన ప్రపంచాన్ని చిత్రించేవి: మేం మాయాజంతువుల్ని, రహస్యమైన కొండకనుమలని, మేఘాలని, పుష్పాలని చూశాం. యీ మంచుతో కప్పబడిన అద్దాలమీద పిల్లలు బోలెడు కథలు కల్పించారు. యిక్కడనే వాళ్లు చదవడం నేర్చుకున్నారు. దాన్ని గురించి తర్వాత చెప్తాను.

సూర్యదర్శనం అయ్యాక పిల్లలు గ్రీన్‌హౌస్ వసారా తలుపు తెరిచి పుష్ప ప్రపంచంలోకి అడుగెట్టేవాళ్లు. శీతాకాలంలో ఓ గ్రీన్‌హౌస్‌లో చామంతులు వికసిస్తున్నాయి. ప్రతి పిల్లవాడికీ యిష్టమైన పువ్వు ఇక్కడ వుంది. అది తన మిత్రుడు. పిల్లలు పువ్వుల మొక్కలకి నీళ్లు పోశారు. అవి ఆనందక్షణాలు: నీటికణాల్లో యింద్రధనస్సులు తొణికిసలాడేవి.... పిల్లలు అవంటే ముచ్చటపడి వేసవి కాలం గురించి కలలు గనేవాళ్లు. యిక్కడే సూర్య కాంతి వంతెన – బంగారు యింద్రధనుస్సు – కథ పుట్టింది.

ప్రతి హిమ తుఫాన్ తర్వాతా, నేల అంతా తెల్లగా మంచుతో కప్పడి పోయినప్పుడు, స్కూల్ తోటలోని మంచుకుప్పల్ని చూడ్డానికి వెళ్లేవాళ్లం. మంచుకుప్పల ప్రపంచం చిత్రంగా వుంది. అది మేఘ ప్రపంచం లాగే నిగూఢంగా, అనూహ్యంగా వుంది. చిత్రమైన మంచుకుప్పల్లో యెత్తైన, అధిరోహించలేని పర్వత శిఖరాలని, గడ్డకట్టిన సముద్రపు అలలలో అద్భుత కథల హర్మ్యాలని, తెల్లని హంసని, బూడిదరంగు తోడేలుని, జిత్తులమారి నక్కని చూసేవాళ్లు. ఒక రోజున

మాకోసమే ప్రకృతి అద్భుత కథల్లోని నౌకని నిర్మించినట్లైంది. తెరచాపలూ, కాప్టెన్ తిన్నె, లంగరూ వున్నాయి, యెక్కణ్ణో దూరంగా చూసే సముద్రపు దొంగలు వున్నారు. యెండా, గాలీ దాన్ని ధ్వంసం చేసేలోపునే కొద్ది రోజులు మేం వరసగా దాన్ని చూడ్డానికి వెళ్లాం. సాయంత్రం సముద్రపు దొంగల గురించీ, మంచి మనుషుల గురించీ, దుర్బలుల్నీ అన్యాయంగా బాధపడేవాళ్లని రక్షించేవాళ్ల గురించీ, మంచి చెడుల పోరాటం గురించీ, అన్యాయంమీద సత్య విజయం గురించీ నేను చెప్పే కథలు వినడానికి పిల్లలు వచ్చేవాళ్లు.

విపరీతమైన చలిగా వున్నప్పుడు మేం షికారుకెళ్లేవాళ్లం కాదు. ఓ మాదిరి వాతావరణంలోనే పిల్లలు బయటికి వెళ్లేవాళ్లు. యిక మంచు కరిగిందీ అంటే అప్పుడు ఆటవిడుపే. యువ పయొనీర్లు మంచు దుర్గం కట్టడంలో మాకు సాయం చేసేవాళ్లు. మంచు పలకలతోటి ఒక గుహలాంటిది కట్టేవాళ్లు. యిక్కడ పనికీ, ఆటలకీ కథలూ, వినోదాలూ తోడైయ్యేవి. మేమేదో ధృవాల్ని శోధించే వాళ్లల్లాగా నటించేవాళ్లం. నేను పిల్లలకి ఆ మహా హిమయుగ నిశ్శబ్దాల గురించిన కథలు చెప్పాను. అభూతకల్పన వాస్తవ సాహసోపేత మానవ చర్యలతో అల్లుకుపోయి వుండేది. మన దుర్గం యెండకి కరిగిపోయేటప్పుడు పిల్లలు దాన్ని వదిలి వెళ్లిపోయేవాళ్లు. ఇది వాళ్లకి విచారంగా వుండేది.

మేం ఆ శీతకట్టులో రెండుసార్లు అడివిలోకి వెళ్లాం, ఒకసారి కారులోనూ, ఒకసారి గుర్రపు స్లేజిబండిలోనూ. ఓ మాదిరి చలి మా బుగ్గలు కొరికింది. కాని యెవళ్లూ చలి అన్న మాట అన్లేదు. మేం అక్కడ గడిపిన రోజుల్ని పిల్లలు యెన్నటికీ మర్చిపోలేదు. మేం శీతాకాలపు అరణ్య గీతం విన్నాం. పక్షుల జీవితాన్ని చూశాం. అడవి కనుమలో గడ్డకట్టని జలని చూశాం. మేం మంటదగ్గర చలికాగి, బంగాళదుంపలను ఉడకబెట్టాం, కాషా తిన్నాం. మంచు కమ్మిన కొమ్మల రంగుని మా కళ్లముందే మార్చేసిన సూర్యాస్తమయ సౌందర్యాన్ని మెచ్చుకున్నాం. అవి పాలిన అరుణవర్ణంగా, తర్వాత నారింజరంగుగా, తర్వాత కాషాయరంగుగా, తర్వాత ఊదానీలంగా మారాయి. సూర్యుణ్ణి గురించిన అద్భుత కథకి, పిల్లలు ఆ బ్రహ్మాండమైన, అసాధారణ అందంతో మునిగిపోవడంతో, కొత్త బొమ్మలతో పరిపుష్టత వచ్చింది. పిల్లల శీతాకాలపు అరణ్యానుభవాల్ని వర్ణించిన పద్యాలు యిక్కడే తయారయాయి. కాత్యా మంచుతో కప్పుకుని వున్న పైన్ చెట్ల అందాన్ని అభినందిస్తూ అంది:

"పైన్ చెట్టు పడుకుంది."

జీనా యింకా స్పష్టమైన బొమ్మ గీసింది: "పైన్ వేసవి వచ్చేవరకు పడుకుంటుంది."

"పైన్ చెట్టు పడుకుంది వసంతం దాకా" అన్నాడు సెర్యోజ. ప్రతీ వాళ్లూ యీ మాటల శ్రావ్యత అనుభూతం చేసుకున్నారు. పిల్లలు తమ మిత్రుల ఆలోచనని పొడిగించారు.

"అది పడుకుని, పడుకుని, కలలు కంటుంది" ఒకళ్లెవరో అన్నారు.

"పైన్ చెట్టు పడుకుంది వసంతం దాకా,
అది పడుకుని, పడుకుని, కలలు కంటుంది"

అని పాడారు ఆ చిన్న అమ్మాయిలూ, అబ్బాయిలూ. వాళ్లంతట వాళ్లే ఆ పాట కట్టినందుకు ఒకరకమైన గర్వాన్ని అనుభవించారు. మా పిల్లలకి శీతాకాలపు సాయంత్రాలు ఆధ్యాత్మిక సంపదని పంచాయి. పిల్లలకి చదవడమూ, ఆలోచించడమూ నేర్పడం, వాళ్ల మానసిక శక్తి సామర్థ్యాలని పెంచడం చెయ్యాలంటే వాళ్లకి ఆలోచన, భాషల మూలాలతో నేరుగా సంబంధం కల్పించాలి.

మంచు మనిషిని తయారుచెయ్యడమన్నా లేకపోతే మంచుమీద స్లేజి చెయ్యడమన్నా యే పిల్లవాడికి యిష్టం వుండదు? ఒక మాదిరి చలిగా, ప్రశాంతంగా వుండే వాతావరణంలో, ముఖ్యంగా సూర్యుడు బాగా ప్రకాశించేటప్పుడు, మేము రోజంతా బయటే గడిపాం. వూరి చివర మేము ఒక మంచుకొండని నిర్మించాం. మాకు కర్రవిగాని, లోహపువిగాని స్లేజీ లంటే యిష్టముండేది కాదు. అవి తగినంత వేగంగా జారేవి కావు. అంచేత మేం ఒక యిరవై మంచు స్లేజీలని తయారు చేశాం. మేం గడ్డి తీసుకుని దాన్ని పేడతో కలిపి, అప్పుడు దానిమీద చన్నీళ్లు పోసి దాన్ని ఒక చిన్న గూడులాగా తయారుచేశాం. నీళ్లు గడ్డకట్టిపోయి మంచి స్లేజీలు అయాయి. యీ స్లేజీలు సురక్షితంగా వున్నాయి.

మరీ ముఖ్యంగా ప్రశాంత, నిర్మలాకాశపు, శీత సాయంత్రాలల్లో శీతాకాలపు ప్రకృతి అద్వితీయ సౌందర్యం వెల్లడయ్యేది. మేం తోటలో యెర్రని సూర్యాస్తమయం చూస్తూ, తొలి నక్షత్రాల రాక కోసం నిరీక్షిస్తూ వుండేవాళ్లం. ఆ సాయంత్రపు వెలుగులో మంచు పాటల వర్ణంగా, తర్వాత కాంతివంతమైన వూదారంగుగా వుండేది. అలాంటి క్షణాల్లో పిల్లల ఉద్రేకాలు మాటల్లో సంగీతంలో వెల్లడయ్యేవి. అద్వితీయమైన అందంతో మోగే ఆ జానపద గీతాల రాగాలు వాళ్లకు గుర్తుకు వచ్చేవి. ముగ్ధులమయిపోయి మేం స్కూల్‌కి వెళ్ళి పొయ్యి వెలిగించి, పాటలు పాడుకునేవాళ్లం.

ప్రశాంత శీత ప్రత్యూషాల్లో సూర్యోదయాల్ని పిల్లలు మెచ్చుకునేవాళ్లు. ఆ అందాన్ని గురించి ధ్యానిస్తూ నిశ్శబ్దంగా నుంచునేవాళ్లు. వాళ్లు తమ మెప్పుని గురించి చెప్పడానికి మాటలకోసం వెదికేవాళ్లు. అప్పుడు నేను సాయం చేసేవాణ్ణి. కొత్తగా కనిపించిన ప్రతీదీ ఆ సంతోషాన్ని మేల్కొల్పడమే కాదు, కొత్త ఆలోచనా శక్తికి నూతనాధారం కూడా అయేది.

# భరద్వాజపిట్ట మొదటి పండుగరోజు

శీతాకాలమంతా మా పక్షి, జంతు "హాస్పిటల్" పంజరాల దగ్గర కూర్చుని మేం వెచ్చని వసంతదినాల కోసం, మా నేస్తాలు వినీలాకాశంలోకి యెగురుతూ, తోపుల్లోకి గెంతుతూ పోయే రోజుల కోసం కలలుకంటూ వుండేవాళ్లం. కడకి చిరనిరీక్షణ ఫలించింది, పండుగ రోజు వచ్చింది. ఆకాశంలో ఒక భరద్వాజపిట్ట కనబడిన మరుసటిదినం మేం మా పిట్టల్నీ జంతువుల్నీ పంజరాల్లో, దిబ్బపైకి తీసికెళ్లాం.

ఆ పచ్చిక బీడు పిట్టల పాటలతో మారుమ్రోగింది. పిల్లలు పంజరాలు తెరిచారు. భరద్వాజపిట్ట, వడ్రంగిపిట్ట, గిజిగాడుపిట్ట స్వేచ్ఛగా యెగిరిపోయాయి. కుందేలు స్వేచ్ఛగా గెంతింది. మా భరద్వాజపిట్ట కూస్తూ పై కెగిరి మళ్లీ కిందికి దిగింది. ఆ అందంతోటి ముగ్ధులమైపోయి నుంచున్నాం. ఆ ప్రాణుల్ని సజీవంగా వుంచగలిగాంగదా అని ఆనందం పడ్డాం.

యీ క్షణాల్లో నేను భవిష్యత్తుని గురించి ఆలోచించాను: ప్రతి యేడూ మేం భరద్వాజపిట్ట పండుగ రోజు జరుపుకోడానికి దిబ్బమీదకి వస్తాం.

ఆ భరద్వాజపిట్ట పండుగ రోజు వసంతరుతువుకీ వేసవికీ హద్దు అయింది. పిట్టలని కాపాడ్డం పెద్ద గౌరవంగా పిల్లలు భావించారు. ప్రతిపిల్లవాడి యింట్లోనూ "జీవితానికీ, ఆనందానికీ దిశ" యేర్పడింది. యెండ విస్తరించిన పచ్చిక బీళ్లమీద మారుమ్రోగే అనుకరించలేని మధుర స్వరాలున్న భరద్వాజపిట్ట చిత్రం పిల్లల ఆంతరంగిక ప్రపంచంలో ఒక భాగమైపోయింది. పిల్లలు యింకో అందుకు కూడా యీ ఆట విడుపుకోసం ఆతృతగా నిరీక్షించేవాళ్లు. యేమంటే, యీ రోజు ఉత్సాహంతోటీ, కళాత్మక సృజనతోటీ ముడిపడి వుంది: వాళ్ల తల్లులు పిండితోటి పిల్లలకి చిన్న భరద్వాజపిట్టలూ, మంగలపిట్టలూ, పెడిసెపిట్టలూ, గోరింకలూ, వసపిట్టలూ, నైటింగేలు పక్షులూ, పికిలిపిట్టలూ తయారుచెయ్యడానికి సాయపడేవాళ్లు. పిల్లలు వాటిని స్కూల్‌కి తీసుకొచ్చేవాళ్లు. ప్రకృతిపట్ల వాళ్ల ప్రేమని వాటిమీద చూపించేవాళ్లు. ప్రతి పిల్లవాడూ తన పద్ధతిలో సౌందర్య భావాన్ని

ఆకురాలు కాలంలో పిల్లలు విచారంగా వలస పక్షులకి వీడ్కోలు చెప్పారు. విషాదం మనుష్య హృదయాల్ని ఉన్నతం చేస్తుంది. అది లేకుండా మంచితనం వుండదు.

# మేము చదువనూ, రాయనూ యెలా నేర్చుకున్నాం?

పిల్లలు చదువనూ, రాయనూ యెలా నేర్చుకున్నారో వివరిస్తాను. నేను చెప్పేది చదవడమూ, రాయడమూ బోధించడంలో కొత్త పద్ధతి అని అనుకోకండి. మా సృజనాత్మకతని గురించిన శాస్త్రీయ ఆధారాన్ని నేను ఆలోచించలేదు. కాని కచ్చితంగా పిల్లల సృజనాత్మకతే బోధనాకృషిలోనూ, అధ్యయనంలోనూ సహకరిస్తుంది. అదంతా, ఒక మేరకి చదవడంలోనూ రాయడంలోనూ యిదివరకే ప్రయత్నించిన పద్ధతుల బదులువస్తుంది. యీ సృజనాత్మకత పొలాల్లోనూ, పచ్చిక బీళ్లల్లోనూ, ఓక్ చెట్లతోపుల్లోనూ, వేసవి సూర్యోదయాలలోనూ, శీతాకాలపు సాయం సంధ్యల్లోనూ ఆవిర్భవించింది.

పిల్లలకి స్కూలు జీవితపు మొదటి రోజుల్లో చదవడమూ రాయడమూ యెంత కష్టంగా, అలసటగా, నిరుత్సాహంగా వుంటాయోననే ఆలోచిస్తూ వున్నాను. పిల్లలు వేరువేరు అక్షరాల మధ్య తేడా గుర్తించడానికి తంటాలుపడుతూ ఉండేవాళ్లు, ఆ అక్షరాలు వాళ్ల కళ్ల ముందు గెంతి, అర్థంచేసుకోవడం కష్టమవడం చూశాను. అదే సమయంలో, ఆ క్రమంపట్ల ఏదేనా ఆసక్తి కలిగిస్తే, దాన్ని ఆటలకి సంధిస్తే, పిల్లలు సులభంగా అక్షరాల్ని గుర్తుపట్టి, మాటల్లో పొదుగుతున్నారని నేను గుర్తించాను. ముఖ్యమైంది మరొక విషయం యేమిటంటే, "యిదిగో జాగ్రత్త మర్చిపోకండేం, మర్చిపోయారో చిక్కుల్లో పడతారు" అని ఒత్తిడి చేయకూడదు.

పిల్లవాడి అధ్యయనపు ముళ్ల దారిలో స్కూలు చదువు మొదలైన నాటినుంచీ మార్కులు అనే దేవత ప్రత్యక్షమవుతుంది. ఒక పిల్లవాడికి యీ దేవత ఆదర్శవంతంగా అనుగ్రహించేదిగా వుంటుంది. యింకొకడికి యిది క్రూరంగా, నిర్దయగా, కఠినంగా వుంటుంది. అదలా యెందుకని వుంటుంది? యీ దేవత కొందరిని యెందుకని సంరక్షించేదిగా, కొందరిపట్ల యెందుకు నిరంకుశంగా వుంటుందో పిల్లలకి అర్థంకాదు. మార్కులు తన పనిమీద, తన కృషిమీద ఆధారపడతాయని యేడేళ్ల పిల్లవాడు అర్థం చేసుకోలేడు; ఆ వయసులో అదంతా అతనికి దుర్గ్రాహ్యంగా వుంటుంది. ఆ దేవతని తృప్తిపరచడానికో, మరీ దారుణంగా అయితే కన్ను గప్పడానికో ప్రయత్నిస్తాడు. క్రమేపీ చదవడం అనేది వ్యక్తిగత ఆనందంకోసం కాకుండా, మార్కుల కోసం అనే దానికి అలవాటుపడిపోతాడు. మార్కులని స్కూలు నుంచి బహిష్కరించాలనేం నేను అనను. మార్కులను దాటవేసేది లేదు. తాము చదువుకి వినియోగపరిచే శక్తిమీద తమ మేధా శ్రమ గుణం ఆధారపడుతుందని వాళ్లు అర్థం చేసుకోగలిగినప్పుడు మాత్రమే పిల్లలకి మార్కులు యివ్వాలి.

నా అభిప్రాయంలో ప్రాథమిక తరగతుల్లో మార్కుల కవసరమైన ముఖ్యమైన దేమిటంటే అవి ఆశావహమైనవిగా ఉండాలి. కష్టపడి పనిచేసేవాళ్లకి మార్కులు బహుమానం కావాలిగాని సోమరిపోతులకీ, అశ్రద్ధగా వుండేవాళ్లకీ దండన

కాకూడదు. తక్కువ మార్కుని సోమరి గుర్రంమీద వాడే కొరడాగానూ, యెక్కువ మార్కుని తియ్యటి బిస్కట్ లాగానూ ఉపాధ్యాయుడు ప్రయోగిస్తే త్వరలోనే పిల్లలు కొరడానీ, తియ్యని బిస్కట్‌నీ రెంటినీ అసహ్యించుకోవడం మొదలెడతారు. తక్కువ మార్కు అనేది చాలా పదునైన, సున్నితమైన సాధనం. దాన్ని తెలివైన ఉపాధ్యాయుడు దాచివుంచుతాడు. ఎప్పుడూ వాడడు. పిల్లవాడు తన శక్తిమీద యెప్పటికీ విశ్వాసం కోల్పోకుండానూ, తను యేమీ పొందలేదని అనుకోకుండానూ జాగ్రత్తపడ్డంలోనే బోధనా యుక్తి వుంది. ప్రతి కృషీ పిల్లవాడికి ముందు అడుగు కావాలి, ఆ అడుగు రవంత అయినా సరే. యేడేళ్ల పిల్లవాడు అప్పుడే స్కూల్లో చేరాడు. అప్పటికే 'అ'కి 'ఆ'కీ తేడా నేర్చుకున్నాడు. అకస్మాత్తుగా ఫెయిల్ మార్క్ వచ్చింది. అతనికి విచారం గాని, ఆందోళన కాని అనిపించనే అనిపించవు. వూరికే నిర్ఘాంతపోతాడు. "పిల్లల అమాయకత్వాన్ని మన్నించండి" అని రాశాడు యానుష్ కోర్‌చక్. యీ పోలిష్ విద్యా బోధకుని మాటలు నా యావజ్జీవితమూ నేను గుర్తుంచుకున్నాను. ఉపాధ్యయుడు ఒక వ్యక్తిని అర్థం చేసుకోవడంలోని సూక్ష్మాంశాలనన్నిటినీ ఆపోశనబట్టినప్పుడూ, పిల్లల అమాయకత్వాన్ని మన్నించే శక్తిని సాధించినప్పుడూ మాత్రమే ఫెయిల్‌మార్కు నిశితమైన, అతి చక్కని సాధనమవుతుంది. కాని ప్రాథమిక తరగతుల్లో యెన్నడూ వాడకూడనిది యిది.

"సంతోష చంద్రశాల" ఆరంభానికి ముందు కొన్ని సంవత్సరాల క్రితం ఒక సంఘటన జరిగింది. నేను కొంతమంది ఆరు సంవత్సరాల వయసున్న, పాఠశాలలో చేరని పిల్లలతో అడవి శివార్లలోకి వెళ్లాను. వాళ్ళకి నేను సీతాకోకచిలకలని గురించీ, పెంకుపురుగుల్ని గురించీ చెప్పనారంభించాను. ఒక దళసరి పెంకుపురుగు గడ్డిలో పాకుతోంది. అది యెన్నోసార్లు యెగరడానికి ప్రయత్నించింది గాని నేలమీదనుంచి లేవలేకపోయింది. పిల్లలు ఆ పురుగుని వివరంగా పరిశీలించారు. నా దగ్గర బొమ్మలు గీసే అట్ట వుంది. దాన్ని బొమ్మ గీశాను. ఓ పిల్లవాడు పెంకుపురుగు అని నన్ను రాయమన్నాడు. అంచేత నేను "పెంకుపురుగు" అని పెద్ద అక్షరాల్తో రాశాను. జిజ్ఞాసగల పిల్లలు ఆ మాటని అని, వాళ్లకి బొమ్మలా కనిపించిన ఆ అక్షరాలని పరీక్షించడం మొదలెట్టారు. ఒకళ్ళు ఆ అక్షరాలని యిసుకలో గీశారు, యింకొకళ్ళు గడ్డిపోచలతోటి వాటిని తయారుచేశారు. ప్రతి అక్షరమూ పిల్లలకి యేదో గుర్తుకు తెస్తూనే వుంది. కొన్ని నెలల తర్వాత యీ పిల్లలు స్కూలు చదువు మొదలెట్టాక వాళ్ల పాఠాలక్లాసుకి వెళ్లాను. వాళ్లకి చదవడం కష్టమవుతోందని ఉపాధ్యాయురాలు ఫిర్యాదు చేసింది. యాదృచ్ఛికంగా వాళ్లు ఆ పాఠంలో "జ్ఁ" అన్న అక్షరం చదువుతున్నారు. ఆ పిల్లల ముఖాలు చిరునవ్వులతో విరిసి, విద్యార్థులందరూ హుషారుగా వల్లించడం మొదలెట్టారు. పిల్లలు పెంకుపురుగు "జఁజ్ఁ" అన్న మాటని ఉచ్చరించి "జ్ఁ" ఝుంకారం చేశారు. వాళ్లంతా చేతులెత్తారు. వాళ్ళంతా "జఁజ్ఁ" అన్న మాటను

రాయగలుగుతున్నందుకు ఆ ఉపాధ్యాయురాలికి ఆశ్చర్యం వేసింది. ఆ పాఠం సరదాగా, హుషారుగా వుండింది... బోధనాశాస్త్రం నాకు తెలిసింది. జీవితం నేర్పిన పాఠం అది.

యిప్పుడు "సంతోష చంద్రశాల"లో నా కది గుర్తుకొచ్చింది. పిల్లలు అందం, ఆటలు, అద్భుత కథలు, సంగీతం, చిత్రలేఖనం, అభూతకల్పన, సృజనల ప్రపంచంలో బతకాలి. పిల్లవాడికి మనం చదవడం రాయడం నేర్పేటప్పుడు కూడా ఆ ప్రపంచం పరివేష్టించే వుండాలి. విజ్ఞానానికీ, నేర్చుకోడానికీ పిల్లవాని మొత్తం దృక్పథం అతను యీ నిచ్చెన మీద యెక్కే మొదటి కొద్ది మెట్లమీదే ఆధారపడి వుంటుంది. యీ మెట్లు చాలామంది పిల్లలకి ఆటంకంగా తయారవడమనేది అనుకోడానికే దారుణంగా వుంటుంది. స్కూలు విధానం చూస్తే, సరిగ్గా రాయనూ చదవనూ నేర్చుకొనే యీ సమయంలోనే చాలామంది పిల్లలకి తమ శక్తి మీద నమ్మకం పోతుంది. యీ మెట్లని పిల్లలకి నీరసం కలిగించకుండా వుండేటట్లు చేద్దాం. జ్ఞానానికి ప్రతిమెట్టూ ఒక పక్షి సగర్వ విహారంలాగా వుండేటట్టుగా చేద్దాం.

మాటల మూలాధారాలకి పిల్లల్ని "యాత్రలు" చేయించడం మొదలెట్టాను: పిల్లల నేత్రాలని ప్రపంచపు సౌందర్య దర్శనానికి తెరిపించాను, అదే సమయంలో వాళ్ల హృదయాలకి మాటల మాధుర్యం తెలియచేసే ప్రయత్నం చేశాను. నేను అలా చెయ్యడానికి కారణం వుంది. మాటలు వూరికే మనుషులా, స్థలాలా, వస్తువులా, ప్రకృతి విషయాలా పేర్లే కాకుండా తమతో అనుభూతిని కూడా పొదువుకుంటాయి – వాటి సొంత సువాసనా, సున్నిత ఛాయలూ వాటికుంటాయి. ఒక అద్భుత స్వరాన్ని విన్నట్టుగా పిల్లలు మాటని వినడం చాలా ముఖ్యం. ఆ మాటకుండే అందం, ఆ మాట నిర్దేశించే యీ ప్రపంచపు అందం మానవ వాక్కు ధ్వనుల సంగీతం యిమిడ్చిన ఆ చిత్రాల్లో – వర్ణమాలలోని అక్షరాల్లో ఆసక్తి కలిగించడానికి అది ముఖ్యం. పిల్లవాడు మాటల సువాసన అనుభూతి చెందేదాకా, వాటి సున్నిత ఛాయలు గమనించేదాకా అతను చదువనూ రాయనూ అధ్యయనం చెయ్యడానికి సిద్ధంకాడు. ఉపాధ్యాయుడు యిది మరీ పెందరాళే మొదలుపెడితే పిల్లల్ని కష్టమైన కర్తవ్యం పాలపడేసినట్టే. (కడకి పిల్లవాడు యీ కష్టాన్ని అధిగమిస్తాడు కాని యెంతో మూల్యంతో!)

చదువనూ, రాయనూ నేర్చుకునే క్రమం స్పష్టంగా, పిల్లలకి జీవితపు రుచి ప్రేరేపించేటట్టుగా, సజీవ మూర్తులనీ, ధ్వనులనీ, శ్రావ్యతలనీ నింపడంగా వుంటే సులభతరం అవుతుంది. పిల్లవాడు గుర్తుపెట్టుకోదగ్గది ఆసక్తికరంగా వుండాలి. చదవడమూ రాయడమూ నేర్పడం డ్రాయింగుతో ముడివడి ఉండాలి.

మాటల మూలాధారాలకి జరిపిన మా "యాత్రల్లో" మేం కాగితం, పెన్సిలు కూడా పట్టుకునే బయల్దేరేవాళ్లం. యిది మా మొదటి యాత్రల్లో ఒకటి. పిల్లలకి "ఆరుబయలు" అన్న పదం తాలూకు సూక్ష్మఛాయలూ, అందమూ

చూపించాలనుకున్నాను. చెరువుమీదకి వంగిన విల్లోచెట్టుకింద మేం కూర్చున్నాం. దూరంగా పచ్చికమైదానం యెండలో వెలుగుతూ వుంది. నేను పిల్లలకి చెప్పాను: "మన ముందున్న అందం చూడండి. సీతాకోకచిలకలూ, తేనెటీగలూ గడ్డిమీద యెగురుతున్నాయి. యెంతో దూరంగా ఒక ఆవుల మంద కనపడుతోంది. ఆవులు ఆట వస్తువుల్లా వున్నాయి. ఆ మైదానం మెరిసే పచ్చటి నదిలా వుంది. చెట్లు ముదురాకుపచ్చ గట్టులాగా వున్నాయి. ఆవులు నదిలో స్నానం చేస్తున్నాయి. చూడండి యెన్ని అందమైన పువ్వులు తొలి ఆకురాలు కాలంలో చెల్లాచెదురైపోయాయో. ఆరుబయలు సంగీతం వినండి. మీకు తేనెటీగల సున్నితమైన ఝుంకారం వినిపిస్తోందా, గొల్లభామల పాట వినిపిస్తోందా?"

నా బొమ్మలు గీసే అట్టమీద ఆరుబయలు బొమ్మ గీశాను - తెల్లటి చిన్ని దూదిపింజల్లా పరుచుకున్న ఆవులూ, బాతులూ, కనిపించీ కనిపించనట్టుగా వుండే పొగా, దిఙ్మండలంమీద వున్న తెల్లటి మేఘాలూ వున్నాయి. ఆ ప్రశాంత ప్రత్యూష సౌందర్యానికి పిల్లలు ముగ్ధులైపోయారు. వాళ్ళు కూడా బొమ్మలు గీశారు. నేను నా బొమ్మకింద "ఆరుబయలు" అని రాశాను. చాలామంది పిల్లలకి ఆ అక్షరాలు బొమ్మలో భాగంగానే వున్నాయి. ప్రతి బొమ్మా వాళ్లకి యేదో గుర్తుచేస్తుంది. కాని యేమిటది? గడ్డి పోచలు. నేను గడ్డి పోచల్ని "ఆ" అనే అక్షరాకృతిలో పేర్చాను. రెండు గడ్డి పోచల్ని తీసుకుని "రు" అని తయారుచేశాను. పిల్లలు కూడా వాళ్ల బొమ్మలకింద "ఆరుబయలు" అని రాశారు. అప్పుడా మాటని చదివాం. ప్రకృతి సౌందర్యంపట్ల వున్న భావుకత పిల్లల్ని యీ మాటలోని ధ్వనులని అనుభూతం చేసుకొనేటట్టు చేసింది. ప్రతి అక్షరాన్ని రాయడం అంతా వాళ్లకి జ్ఞప్తికి వచ్చేది. వాళ్లు ప్రతి బొమ్మలోనూ సజీవ ధ్వనులని నింపేవారు, అంచేత ఆ అక్షరాలని గుర్తుపెట్టుకోవడం సులభమయ్యేది. గీసిన ఒకమాట మొత్తంగా గ్రహించగలం; ఆ మాటని చదవచ్చు. కాని ఆ చదవడం ఆ మాటలోని ధ్వనుల విపుల పదచ్ఛేదమూ, సంయోగమూ వల్ల కాదు. దృగ్గోచరమైన కంటికి కనిపించే బొమ్మకి సరితూగే సంగీత స్వరాల ఉద్దేశపూర్వక పునరుత్పత్తి మాత్రమే. అది పిల్లలకి చిత్రలేఖనం తప్ప మరేమీ కాదు. దృగ్గోచర, శ్రవణ చర్యల ఐక్యంలో, ఆ మాటలోని దృశ్యాత్మక, సంగీత స్వరాల పుష్కలమైన అనుభూతిపరమైన రంగుతో మిళితమైన దాంట్లో, పిల్లలు ఆ అక్షరాల్నీ ఆ చిన్న మాటల్నీ యేకకాలమందే గుర్తుపెట్టుకుంటారు. చదవడం బోధించడంలో యిదేం కొత్త పద్ధతి ఆవిష్కరణ కాదు. విజ్ఞానశాస్త్రం నిరూపించిన దాని ఆచరణాత్మక అనుభవం ఇది: మీరు గుర్తుంచుకోవాల్సిన అవసరం లేనివి మీరు గుర్తుంచుకోవడం సులభం. చూసిన బొమ్మల అనుభూతిపరమైంది ధారణాశక్తిలో చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తుంది.

ఒకమాటకున్న దృశాత్మక చిత్రం, ధ్వనీ అనుభూతిపరమైందీ ఐక్యం కావడం అనేది ధ్వనుల స్వతంత్ర, ప్రత్యేక పదచ్ఛేదాన్ని యేరకంగానూ విస్మరించదు. ఆ మాట విడి విడి ధ్వనుల మేళనమని అర్థం చేసుకుంటూ, ప్రతి ధ్వనికీ సంబంధించి

ఒక అక్షరం వుందని అర్థం చేసుకుంటూ "ఆరుబయలు" అనే మాటని పిల్లలు శ్రద్ధగా విని ప్రతి శబ్దాన్నీ వేర్పరిచారు.

కొన్ని రోజుల తర్వాత మేము ఒక కొత్త "యాత్రకి" వెళ్లాం. పొద్దున్న పెందరాళే సూర్యుణ్ణి అభినందిద్దామని స్కూలు తోటలోకి వచ్చాం. గడ్డీ, చెట్ల ఆకులూ, ద్రాక్షగుత్తులూ, పసుప్పచ్చ బేరీపళ్లూ అన్నీ కూడా మంచు బిందువులతో కప్పడిపోయాయి. ప్రతి బిందువులోనూ సూర్యకిరణాల మిణుగురు మెరుస్తూ వుంది. ఒకచోట ఆ మిణుగురులు అదృశ్యమవుతున్నాయి, మళ్లీ మరొక చోట వస్తున్నాయి. సూర్యుడు ఒక బిందువు తాగేసి దాని స్థానంలో యింకోటి పెట్టినట్లుగా వుంది. సూర్యకిరణాలు పడ్డప్పుడే మంచు బిందువులమీద మిణుగురులు ప్రత్యక్షమయ్యాయి. కాని మంచు యెక్కడికి మాయమైంది? కొన్నిబిందువులు యిగిరిపోయాయి, కొన్ని గడ్డి పోచలమీదుగా జారి మట్టిలో కలిసిపోయాయి. మంచు లేకపోయినట్లయితే గడ్డీ పువ్వులూ వాడిపోతాయి. అప్పుడు మేము నానా విధ పత్ర పుష్పాలమీదా మెరిసే మంచు బిందువుల కేసి చూశాం. నేను ఒక గడ్డి పోచని, కూరాకుని, సూర్యుణ్ణి, మెరిసే మిణుగురులున్న మంచు బిందువునీ గీశాను. పిల్లలు కూడా బొమ్మలు గీశారు. ఆ బొమ్మకింద మేము "చినుకు" అని రాశాం. యీ అక్షరాలు పిల్లలకి సూర్యుణ్ణీ, మంచు బిందువుల్నీ గుర్తు చేశాయి. మేము అక్షరాల బొమ్మ చదివాం. ప్రతి పిల్లవాడూ చుట్టూతా వున్న ప్రపంచాన్ని గురించిన తన భావాలు అక్షరాల్లో పెడుతూ తన సొంత పద్ధతిలో రాశాడు. సెర్యోజ తన మిత్రులకి చెప్పాడు: "యిది గడ్డి పోచమీద వూగులాడే వాన చినుకు." ఆ రకంగా అతను "వా" అనే అక్షరాన్ని భావించుకున్నాడు. "త్వరలోనే అది నేలకి జారిపోతుంది. యీ చినుకు నిరీక్షిస్తోంది, కాని సూర్యుని కోసం నిరీక్షించదు." ఆరకంగా ఆ చిన్న పిల్లవాడు "ను" అనే అక్షరాన్ని అనుకున్నాడు. "యెండ యిప్పటికే యీ చిన్న చినుకులో వుంది." సెర్యోజ మళ్లీ తన పెన్సిలుతో "కు" అనే అక్షరాన్ని దిద్దాడు.

కొన్ని రోజులుగా మేం ఆ మంచు బిందువులని మళ్లీ మళ్లీ మెచ్చుకున్నాం, గీయడం రాయడం కొనసాగించాం. ప్రతి కొత్త బొమ్మ కూడా వూరికే తరవాతి అభ్యాసం మాత్రమే కాదు, సృజనాత్మకం అయింది. "చినుకు"ను గురించిన మా సృజనాత్మకత రెండు మూడు వారాలు సాగింది. ప్రతి పిల్లవాడు తను కొన్నిసార్లు యిష్టపడ్డ కొమ్మల్నీ గడ్డి పోచల్నీ గీశాడు. అప్పుడు ఆ మాట ఉచ్చారణ ధ్వనిని వినేవాడు, విడివిడి శబ్దాలనీ వాటికి సంబంధించిన అక్షరాల్నీ వేరు చేశారు. చుట్టూతా వున్న ప్రపంచంలోని వస్తువులకీ అక్షరాలకీ వున్న పోలిక పిల్లలకి ముఖ్యంగా కల్పన, అద్భుత కథ, సృజనాత్మకత.

నేను డ్రాయింగు పుస్తకం అట్టమీద "మన స్వభాష" అని పేరు రాశాను. "దీన్ని యెంతో కాలం మనం కాపాడుకుంటాం, మీరు పెద్ద వాళ్లయి, బడి పూర్తిచేసిందాకా. మీ అందరికీ కూడా బొమ్మలతోటీ, మాటలతోటీ వున్న మీ అట్టలు వుంటాయి. కాని యిది మన ఉమ్మడి బొమ్మల అట్ట" అని నేను వాళ్లకి చెప్పాను.

రోజులు, వారాలు గడిచాయి. సజీవపద ఆధారాల్లోకి మా సరికొత్త "యాత్రలు" సాగించాం. పిల్లలు యీ మాటలని నేర్చుకున్నప్పుడు చాలా ఆసక్తి కనబర్చారు: "గ్రామం", "ఓక్ చెట్టు", "అడివి", "మంచు", "పర్వతము", "కంకి" "ఆకాశం", "గడ్డి" "తోపు", "యాపిల్ చెట్టు" "మేఘము", "ఆకులు రాలుట." వసంతరుతువులో మేం మా "యాత్రల"ని యీ పదాలకి అంకితం చేశాం: "పువ్వులు", "లైలక్", "కసింద", "ద్రాక్షలు", "చెరువు", "నది", "సరస్సు", "పొగమంచు", "వాన", "ఉరుము తుఫాను", "సూర్యోదయం", "పావురాళ్లు", "చెర్రీపళ్లు".

ఆ మాట స్పష్టమైన భావాలనీ, అనుభూతులనీ, జ్ఞాపకాలనీ తనలో మేల్కొలిపిన పిల్లవాడల్లా డ్రాయింగు పుస్తకం "మన స్వభాష"లో ఒక బొమ్మ గీసేవాడు. మన స్వభాష సౌందర్యాన్ని గురించి ఒక్కళ్లు కూడా ఉదాసీనంగా వుండేవాళ్ళు కాదు. మా పని ప్రారంభించిన యెనిమిది మాసాలకల్లా, అంటే 1952 వసంతం నాటికి పిల్లలు వర్ణమాలలోని అన్ని అక్షరాలూ తెలుసుకున్నారు, చదువగలిగారు, రాయగలిగారు.

యాంత్రికంగా యీ పద్ధతిని అనుసరించకూడదని నేనిక్కడ హెచ్చరించాలి. యీ పద్ధతిలో చదువనూ రాయనూ నేర్చుకోవడం సృజనాత్మక కృషి. మరి సృజనాత్మకమైనదేదీ ఒక మూసకి సరిపడదు. కొత్తదైనదాన్నే సృజనాత్మకంగా అనుసరించవచ్చు.

అన్ని అక్షరాలనీ కంఠస్థం చెయ్యాలనీ, చదవడం నేర్చుకోవాలనీ పిల్లలకి చెప్పకుండా వుండటం చాలా ముఖ్యం. ఆట ఆడుకునే క్రమంలోనే పిల్లవాడు జ్ఞానపు మొదటి మెట్లు యెక్కుతాడు. అతని మేధా జీవితం అందాన్నీ, అద్భుత కథల్నీ, సంగీతాన్నీ, కల్పననీ, సృజననీ, వూహల్లోని ఆటల్నీ మనస్సుకి లగ్నంచేస్తుంది. తమని అనుభూతులతో ప్రేరేపించే దాన్నీ, సౌందర్యంతో ముగ్ధులైపోయేటట్టు చేసే దాన్నీ పిల్లలు గాఢంగా గుర్తుంచుకుంటారు. చాలామంది పిల్లలకి తమ అనుభవాలని మాటలతో వ్యక్తీకరించాలనే కాదు, రాయాలని కూడా గాఢమైన కోరిక వుండటం నన్ను చకితుణ్ణి చేసింది.

ఒక రోజున వాన పడుతూ వుంటే ఒక అడవి గుడిసెలో తలదాచుకున్నాం. ఉరుములు గర్జించాయి, మెరుపులు తళుక్కుమన్నాయి. చిన్న వడగళ్లు పడడం ప్రారంభించింది. వాన తగ్గాక కూడా అవి కొంచెంసేపు గడ్డిమీద వుండిపోయాయి. మేఘాల మాటునుంచి సూర్యుడు తొంగి చూశాడు. ఆ వడగళ్లు ఆకుపచ్చగా కనిపించాయి. పిల్లలు సంబరంగా అవి యెంత బాగున్నాయోనని కేరింతాలు కొట్టారు. ఆ మర్నాడు పిల్లలు తాము చూసింది గీయాలనుకున్నారు. యూర, సెర్యోజ, షూర, గాల్యా తమ బొమ్మలకి పేర్లు కూడా రాశారు. వాళ్ళప్పటికే బాగా చదవగలిగేవాళ్లు. వాళ్లు మొదటిసారి తమకిగా రాసింది నేను చూశాను. యిదీ వాళ్లు రాసింది: "తుఫాను మేఘం గడ్డిమీద వడగళ్లని చెదరగొట్టింది," "ఆకుపచ్చని

గడ్డిమీద తెల్లటి వడగళ్లు," "తెల్లటి వడగళ్లని సూర్యుడు కరిగించాడు," "ఉరుముల తుఫాను తెల్లని వడగళ్లని కురిపిస్తోంది."

పిల్లలు ఆలోచనకీ, భాషకీ తమ చుట్టూతా వున్న ప్రపంచానికీ యెంత చేరువగా వుంటే అంత పుష్కలంగా, అంత భావ ప్రకాశకంగా వాళ్ల భాష వుంటుందని మరోసారి నా విశ్వాసం దృఢపడింది. త్వరలోనే పిల్లలంతా సొంతంగా చిన్న రచనలు చేస్తారని నాకు నమ్మకం కలిగింది. 1952 వేసవిలో నా నమ్మకం రుజువైంది. స్కూల్ తోటలో ఒక మూల గసగసాల విత్తులు చల్లబడ్డాయి. వందలాది భిన్న వర్ణశోభితంగా ఆ గసగసాలు తయారైనప్పుడు నేను పిల్లల్ని అక్కడికి తీసుకెళ్లాను. ఆ సౌందర్యం ఆ పిల్లల్లో సంతోషతరంగాల్ని లేపింది. చాలాసేపు ఆ పువ్వుల అందాన్ని ఆస్వాదించి, తేనెటీగల ఝుంకారం విన్నాం. ఆ మర్నాడు మా డ్రాయింగు పుస్తకాలతోటీ, రంగు పెన్సిళ్లతోటీ ఆ మూలకి చేరాం. పిల్లలు గీశారు. నేను వాళ్లకి గసగసాల మొక్క గురించీ, ఇంద్రధనుస్సు దానికి యేడు రంగుల అందాన్ని యివ్వడం గురించీ కథ చెప్పాను. చాలామంది పిల్లలు మాటల్లో తమ పొగడ్తని తెలియచెయ్యాలనుకుని స్పష్టమైన, భావ ప్రకాశమైన మాటలు రాశారు: "గసగసాల తివాసీ పరుచుకుంటోంది" (తాన్యా), "గసగసాల తివాసీ నేలని కప్పింది" (నీనా), "గసగసాలు వికసిస్తున్నాయి, సూర్యుడు ఆనందంగా వున్నాడు." (జీనా), "గసగసాల తివాసీమీద తేనెటీగలు ఝుంకారం చేస్తున్నాయి" (గాల్యా), "సూర్యుడు నేలమీద పువ్వుల్ని చల్లాడు: నీలం, యెరుపు, గులాబీ, లేతనీలం" (లరీసా), "లేతనీలపు రేకులమీద ఝుంకారం చేసే కందిరీగ" (సెర్యోజ), "నాజూకైన కంకులమీద వూగులాడే పువ్వులు" (షూర), "సూర్యుడు గసగసాల్లో ఆడుకుంటున్నాడు" (కోల్యా), "నీలిరేకులు ఆకాశంనుంచి పడి నేలమీద తివాసీగా విరిసాయి" (కాత్యా). పిల్లలు యీ బొమ్మల్నీ రాతల్నీ తమ డ్రాయింగు పుస్తకాల్లోంచి తీసి "మన స్వభాష"లో పెట్టారు.

పొద్దు తిరుగుడు పువ్వుల దగ్గరికీ, వికసించే బక్‌వీట్ పొలాల్లోకీ మేం చేసిన "యాత్రల్లో"నే పిల్లల వూహలు ఎగజిమ్మే జలలాగా, స్పష్టమైన చిత్రాలతోటి ఉబికాయి. చుట్టూతా వున్న ప్రపంచం పిల్లల్ని యెంతగా ప్రేరేపిస్తే అంత గాఢంగా పిల్లలు అక్షరాల్ని గుర్తుంచుకున్నారు, అన్నిటి కంటే ముందుగా యిదే గమ్యం కాకపోయినా. దృశ్య ప్రపంచపు భావచిత్రణ, సౌందర్య అనుభూతి మాటలలో వ్యక్తం చెయ్యాలన్న ప్రయత్నం పిల్లల ఆలోచనకు వూపిరి అని నాకు దృఢపడింది. పిల్లలు సృజనాత్మకంగా, స్పష్టంగా, ఉద్రేకాలతో నిండిన చిత్రాల్లో ఆలోచిస్తారు. తెలివిగా ప్రకాశమానంగా పిల్లవాడు తయారుకావాలంటే, అతనికి ప్రపంచపు కళాత్మక దర్శనానందం తొలి బాల్యంలోనే యివ్వాలి.

సౌందర్యమయ మైందాన్ని పిల్లవాడు దర్శించి, అనుభూతం చేసుకున్నప్పుడు పిల్లల చైతన్యంలో యెన్నో తరగని అద్భుత కల్పనలు, సృజనాత్మకత విచ్చుకుంటాయి. సజీవ పద ఆధారాలకి మేం చేసిన "యాత్రల్లో" ఒక దాన్ని నేను యెన్నటికీ

మర్చిపోలేను. ఒక వేసవి రోజున మేం సమష్టి వ్యవసాయ క్షేత్రంలోని తేనెగూళ్లు వుండే చోటికి వెళ్లాం. ఆ గూళ్ల పోషకుడు మాకు తాజా తేనె, చల్లని వూట నీరూ యిచ్చాడు. పూస్తున్న బక్‌వీట్ పొలాన్ని సమ్మోదంగా చూస్తూ పిల్లలు యాపిల్ చెట్లకింద కూర్చున్నారు. తేనెటీగలు పచ్చిక బీళ్లనుంచి తమ గూళ్లకి తిరిగి వచ్చి, చల్లని వూట నీరు వున్న సెలయేటిమీద గిరికీలు తిరుగుతూ ఝుంకారం చేశాయి. "అవి తమతో తాము పువ్వుల్ని గురించీ, తోపుల గురించీ, బక్‌వీట్ గురించీ, పొద్దుతిరుగుడు పువ్వుల గురించీ, మెరిసే గసగసాల మొక్కల గురించీ, మేత గడ్డి గురించీ మాట్లాడుకుంటున్నాయి" అన్నారు పిల్లలు.

అయిదేళ్ల తర్వాత మా బుజ్జిగాళ్లు నాలుగవ తరగతిలోకి వచ్చేశారు. వాళ్లు "తేనెటీగలు దేన్ని గురించి ఝుంకారం చేస్తాయి" అన్న దానిమీద కథ రాయాలని నేను సూచించాను. సజీవ ఆలోచనాధారలో ఆ జూన్ రోజు నాటి మరచిపోలేని అనుభూతులు స్పష్టమైన చిత్రాల రూపం తీసుకున్నాయి. తొలి బాల్యంలో యెవళ్లేమి అభిమానించినా దాన్ని జీవితాంతం మరిచిపోలేరు. బాల్య సంవత్సరాల్లోనే యెప్పుడూ పిల్లల చైతన్యంలో స్వభాషకీ, వాళ్ల చుట్టూతా వున్న ప్రపంచానికీ గల అందాన్ని ముద్ర వెయ్యనివ్వండి. నిటారుగా, కష్టతరంగా వున్న జ్ఞాన నిశ్రేణిమీద మొదటి అడుగులు అందంతో మనసుకి నాటేటట్టు చెయ్యండి!

పిల్లలు యెంత బాగా చదవడం నేర్చుకుంటే, అంత ఘనంగా వాళ్ల ఆంతరంగిక జీవితాల్లో పుస్తకాలు పాత్ర వహించడం మొదలుపెట్టాయి. మేము బొమ్మల పుస్తకాల చిన్న లైబ్రరీ ఏర్పాటుచేశాం. 1952 వసంతం నాటికి చాలామంది పిల్లలు ధారాళంగా చదవగలిగారు. వార్యా, కోల్య, గాల్యా, లరీసా, సెర్యోజ, లీదాలు అందరికంటే బాగా చదివేవాళ్లు. మేం గడ్డిమీద కూర్చునేవాళ్లం. ఒక పిల్లవాడు బొమ్మల పుస్తకం తెరిచి చదవ నారంభించేవాడు... యిదేదో వూరికే మాటల్ని చదివేసి, వాటితో వాక్యం తయారుచెయ్యడం లాంటిది కాదు. అది సృజనాత్మక కృషి. అద్భుత కథని చదివేటప్పుడు పిల్లవాడు బొమ్మలో గీసిన ప్రపంచంలో వున్నట్టు భావించేవాడు. తాము చదివిన దాన్ని పిల్లలు గాఢంగా అనుభవించేవారు: వాళ్లు చెడుని అసహ్యించుకునే వాళ్లు, మంచితనం విజయం సాధిస్తే సంబరపడేవాళ్లు.

మరి యిది యింకా ఆసక్తికరంగా వుండేది: పిల్లలు ఓ కథని డజన్లసార్లు చదివినా కానీ ప్రతిసారీ మహా ఆసక్తిగానే వినేవాళ్లు. ఉపాధ్యాయుల ఆదుర్దా నాకు గుర్తుకు వచ్చింది: పిల్లలు యెందుకు అంత బండి లాగుడుగా, ఉత్సాహ రహితంగా చదువుతారు? యెందుకని పిల్లల చదువులో రసోత్సేకం యెప్పుడోగాని కనిపించదు? యెందుకంటే చాలా సందర్భాల్లో చదవడం అనేది పిల్లల ఆంతరంగిక జీవితంతోటీ, ఆలోచనలతోటీ, అనుభూతులతోటీ సంబంధం లేకుండా వుంటుంది కాబట్టి. పిల్లవాడికి ఒకదానిమీద ఆసక్తి వుంటే యింకోదానిమీదా వస్తుంది. ఆ మాటలు వాళ్ల హృదయాలని స్పందింపచేసినప్పుడే చదవడం అనేది పిల్లల జీవితాల్ని సంపద్వంతం చేస్తుంది.

మేం కొత్త బొమ్మల పుస్తకాలు తయారుచెయ్య నారంభించాం, యూర, సెర్యోజ, కాత్యా, లీదా, ల్యూబా, లరీసా బొమ్మలు గీశారు. ఒక్క పిల్లవాడు కూడా ఆ బొమ్మలు గీయడంలో సాయం చెయ్యకుండా వుండలేదు. ముఖ్యంగా చిత్రలేఖనంలోని ఆసక్తి పుణ్యమా అని చదవడంలోనూ, రాయడంలోనూ వున్న కష్టాలని అధిగమించడం జరిగింది.

1952 వేసవిలో పిల్లలు రష్యన్, ఉక్రేనియన్ రచయితలు రాసిన బాలల అచ్చు పుస్తకాలు చదవ నారంభించారు. ఒకసారి నేను ఉషీన్‌స్కీ "స్వభాష"లో నుంచి "పిల్లలూ, బడికెళ్లాలి మరి" అన్న పద్యం చదివి వినిపించాను. పిల్లలు అక్షరాలా దాన్ని కంఠతాపట్టేశారు. దీనితో నేను పొంగిపోయాను. ఆవేశంగా గజిబిజి పద్యాలు కూర్చాను.

మిగతా ఉపాధ్యాయులతోటి ప్రతి విజయాన్నీ ప్రతి కష్టాన్నీ నేను పంచుకున్నాను. స్కూల్లో చేరనివాళ్లని మొదటి తరగతికి సిద్ధం చెయ్యడం మా బడిలోని అందరు ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులకీ ఉమ్మడి బాధ్యత అయింది. ఏటి ఏటికీ ఉపాధ్యాయుల సృజనాత్మక అనుభవం బాగా పెరుగుతోంది. బోధనా పద్ధతులు, ముఖ్యంగా తరగతి బయటా, బడి బయటా వుండే పనికి సంబంధించినవి, యింకా అభివృద్ధి చెందుతాయి. విజయవంతమైన అధ్యయనానికి అవసరమైన ప్రాథమిక మెలుకువలు అలవరచుకున్న పిల్లలకి, వాళ్ల యేకీకృత మేధాభివృద్ధికి ఉపాధ్యాయుల అనుభవం సానుకూలపడింది. చదవడం యీ మెలుకువల్లో మొదటిది.

కొన్ని సంవత్సరాల పాటు పాఠశాలాత్పూర్వపు పిల్లల ఉపాధ్యాయులు ఒకటవ తరగతిలో పిల్లలు చేరకముందే వాళ్లచేత చదివించారు. యిది ప్రాథమిక తరగతుల్లోనే కాకుండా పై తరగతుల్లో కూడా గణనీయమైన స్థాయిలో బోధనా కృషి మొత్తాన్ని సులభతరం చేసింది. ధారాళమైన భావవ్యక్తీకరణమైన, అవగాహనతో కూడిన వాచకపు పాత్రకి, సంబంధించీ, అలా చదివే క్రమంలో సృజనాత్మక మానసిక శ్రమకి పిల్లవాని మేధాభివృద్ధికి సంబంధించీ మాకు అనేక సంవత్సరాల ఉమ్మడి అనుభవం వుండింది. అది మేము ఒక అతి ముఖ్యమైన నిర్ణయానికి వచ్చేటట్టు చేసింది. ఆ నిర్ణయం యిదీ: పిల్లవాడు యెంత పెందరాళే చదవడం ప్రారంభిస్తాడో అంత సహజంగా చదవడం అతని మొత్తం ఆంతరంగిక జీవితంతో ముడిపడి పోతుంది, అంత సంక్లిష్టంగా చదవడంలో వుండే ఆలోచనా క్రమం వుంటుంది, అంత యెక్కువగా చదువు మేధాభివృద్ధిని యిస్తుంది. యేడు సంవత్సరాలలోపుగానే చదవడం ఆరంభించిన పిల్లవాడు ఒక విలువైన నేర్పుని సాధించాడు: మాటలకీ, వాక్య భాగాలకీ సంబంధించి అతని దృశ్య, మానసిక గ్రహణ శక్తులు వొత్తి ధ్వనుల ఉచ్చారణని దాటిపోతాయి. చదివేటప్పుడు పిల్లవాడు ఆ మాటకి బంధితుడై వుండడు. పుస్తకంనుంచి తన దృష్టిని మళ్లించి, ఆ

ధ్వనుల అర్థం యేమిటైందీ ఆలోచించగలడు. ఆ పద్ధతిలో పిల్లవాడు యేకకాలమందే చదువుతాడు, ఆలోచిస్తాడు, వూహిస్తాడు.

అలాంటి ధారాళమైన చదువు అర్థవంతంగా చదవడంలోని అతి ముఖ్యమైన అంశాల్లో ఒకటని మా ఉమ్మడి అనుభవం నమ్మకం కలగజేసింది.

## బాబూ, నువ్వు మిగతా వాళ్లతోటి కలిసే జీవిస్తూ వుంటావు

స్కూల్ ఆవరణలోని తోటలో, ఒక మారుమూల యువ పయనీర్లు చేమంతి పూల మొక్కలు నాటారు. ఆకురాలు కాలం వచ్చేటప్పటికి తెల్లని, నీలపు, అరుణ వర్ణపు పువ్వులు వికసించనారంభించాయి. ఒక నిర్మలమైన, వెచ్చగా వున్న రోజున నేను మా పిల్లల్ని అక్కడికి తీసుకుని వెళ్లాను. పుష్కలంగా వున్న పువ్వుల్ని చూసి వాళ్లు మురిసిపోయారు. పిల్లల సౌందర్యాభిలాష తరుచుగా అహంకారంగా వుంటున్నదని కటువైన అనుభవం తెలియజేసింది. తను చేసిన పనిలో తప్పు ఏమీ లేనట్టుగానే పిల్లవాడు పువ్వులు కోస్తాడు. ఆ రోజున అలాగే జరిగింది. పిల్లవాళ్ల చేతుల్లో నేను మొదట ఒకటి, తర్వాత రెండూ, ఆ తర్వాత మూడూ పువ్వులు చూశాను. యిక సగం పువ్వులు మాత్రమే మిగిలినప్పుడు, కాత్యా అరిచింది:

"చేమంతి పువ్వులు కొయ్యడం బాగుందా?"

ఆమె మాటలకి ఆశ్చర్యమూ కలగలేదు, కోపమూ కలగలేదు. ఆ పిల్ల వూరికే అడుగుతోంది. నేను బదులు చెప్పలేదు. యీ రోజు పిల్లలకి ఒక గుణపాఠం కానివ్వండి. వాళ్లు యింకొన్ని పువ్వులు కోశారు; ఆ దిక్కున వున్న అందం మాయమైపోయింది. పచ్చిక మైదానం బోసిగా కనిపించింది. పిల్లల హృదయాల్లో యెగిసిన సౌందర్యాభిలాష తరంగం పోయింది. ఆ పువ్వులతో యేం చెయ్యాలో వాళ్లకి తోచలేదు.

"ఏమర్రా, చూడండి, యిప్పుడీ దిక్కు అందంగా వుందా? మీరు పువ్వులు కోసిన కాండాలు అందంగా వున్నాయా?" అని అడిగాను నేను.

పిల్లలు మాట్లాడలేదు. అప్పుడు కొంతమంది జవాబిచ్చేరు.

"వుహూఁ, అవి అందంగా లేవు..."

"మరిప్పుడు అందమైన పువ్వుల్ని యెక్కడ చూస్తాం?"

"యువ పయనీర్లు యీ పువ్వుల మొక్కల్ని నాటారు. వాళ్లిక్కడికి అందమైన పువ్వుల్ని చూద్దామని వస్తారు. మరి వాళ్లకేం కనిపిస్తుంది? మీరు మిగతా వాళ్లతోటి కలిసే జీవిస్తున్నారని మరిచిపోకండి. ప్రతి ఒక్కరూ అందమైన వాటిని అనుభవిద్దామని అనుకుంటారు. మనకిక్కడ బళ్లో చాలా పువ్వులు వున్నాయి. కాని ప్రతి ఒక్క విద్యార్థీ వూరికే ఒక్క పువ్వుకోస్తే యేమవుతుంది? ఒక్కటి కూడా

మిగలదు. మరి జనం చూడ్డానికి అందమైన దేమీ వుండదు. మనం అందాన్ని కాపాడాలి, నాశనం చెయ్యగూడదు. ఆకురాలు కాలం వచ్చినప్పుడు పగళ్లు చల్లగా అవుతాయి. మనం చేమంతి పువ్వులని మళ్లీ మన గ్రీన్‌హౌస్‌లో పెడతాం. అక్కడ వాటి అందం మెచ్చుకుంటాం. ఒక్క పువ్వు కొయ్యాలంటే మీరు పదింటిని నాటాలి" అని నేను ఆ పిల్లలకి చెప్పాను.

కొన్ని రోజుల తర్వాత యింకా యెక్కువ చేమంతులున్న చోటకి వెళ్లాం. పిల్లలు వాటిని కొయ్యలేదు; వాటి అందాన్ని మెచ్చుకున్నారు.

అందాన్ని సృష్టించడానికీ, పరులని సంతోషపెట్టడానికీ యిచ్చే పిలుపుకి పిల్లల హృదయం స్పందిస్తుంది. పిలుపులతోబాటుగానే ఆచరణ వుండాలన్నది ముఖ్యం. తన పొరుగున యితరులున్నారనీ, తన చర్యలు వాళ్లకి సంతోషాన్నిస్తాయనీ పిల్లవాడు అనుకుంటే పసితనంనుంచీ తన కోరికలు పరుల ఆసక్తులతో అన్యోన్యంగా ఉండేటట్టు చెయ్యడం నేర్చుకుంటాడు. యిది దయా, మానవత్వమూ నేర్పడానికి చాలా ముఖ్యం. తమ వ్యక్తిగత కాంక్షల పరిమితి తెలియని వాళ్లు యెన్నటికీ మంచి పౌరులు కాలేరు. తమ చిన్నతనంలో తమ కాంక్షల్ని నియతం చేసుకోవడం నేర్చుకోనివాళ్లే, అందరి బాగుకీ సంబంధించి శ్రద్ధ వహించనివాళ్లే అహంభావులుగాను స్వప్రయోజనాపరులుగానూ, పరుల కష్టనష్టాలపట్ల ఉదాసీనంగా వుండే వాళ్లగానూ తయారవుతారు. ఒకళ్లు తమ కాంక్షల్ని నియతం చేసుకోవడం అతిసులభమైన అలవాటు. అదే సమయంలో చాలా సంక్లిష్టమైనదీనీ. అది మానవత్వానికీ భావుకతకీ, ఆప్యాయతకీ, స్వయం క్రమశిక్షణకీ ఆధారం. యివి లేకపోతే వ్యక్తికి అంతరాత్మ లేనట్టే, వ్యక్తి అసలైన మానవుడు కానట్టే.

పిల్లవాడు నిజమైన వ్యక్తిగా తయారయేటట్టు బోధించడంలో పసితనపు ప్రాముఖ్యాన్ని మళ్లీ నొక్కిచెప్తున్నారు. నైతిక విశ్వాసాలూ, దృక్పథాలూ, అలవాట్లూ అన్నీ కూడా అనుభూతులతో సన్నిహితంగా వుంటాయి. ఆలంకారికంగా చెప్పాలంటే అనుభూతులు ఉన్నత నైతిక విలువలున్న చర్యలకి సారవంతమైన నేల. భావుకతలేని పరిసరాల్లో, చుట్టూతా వున్న ప్రపంచం గురించిన నిశిత గ్రహణలేని వాతావరణంలో పెరిగితే మనుషులు స్పందించే ఆత్మా, హృదయం లేకుండా తయారవుతారు. భావుకత, మనసుకి నాటుకునే భావాలూ బాల్యంలోనే యేర్పడతాయి. బాల్యంలో అవి బోధించబడకపోతే యెన్నటికీ ఆ వెలితి పూడదు.

పిల్లవాణ్ణి సంక్లిష్ట మానవ సంబంధాల ప్రపంచంలో ప్రవేశపెట్టడం అనేది బోధకుని అతి ముఖ్యమైన కర్తవ్యాల్లో ఒకటి. పిల్లలు సంతోషం లేకుండా జీవించలేరు. బాల్యం ఆనందదాయకమైన కాలం కావడం కోసమని మన సమాజం తను చెయ్యగలిగినంతా చేస్తోంది. కాని సంతోషం చింతారహితంగా వుండాలనేం లేదు, పెద్దవాళ్లు జాగ్రత్తగా పోషించిన చెట్టునుంచి సంతోష ఫలాలు కోసుకునేటప్పుడు పిల్లవాడు పరులకి మిగిలిందేమిటీ అని ఆలోచించనట్టయితే మానవ లక్షణాల్లో ముఖ్యమైన అంతరాత్మ అనేదాన్ని అతను పోగొట్టుకుంటున్నాడు.

తాను సోషలిస్టు సమాజపు భావి పౌరుణ్ణని గుర్తించే ముందే పిల్లవాడు మంచికి మంచి బదులు యివ్వడం, తన స్వహస్తాలతో పరుల ఆనంద సంతోషాలు సృష్టించడం నేర్చుకోవాలి.

"సంతోష చంద్రశాల" పుట్టడానికి ముందు నాకు ఒక ఆందోళన వుండేది. చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లలపట్ల వున్న సహజ ప్రేమవల్ల గుడ్డివాళ్లై పిల్లల్లోని మంచి మాత్రమే చూసి, వ్యతిరేక లక్షణాలని విస్మరించేవాళ్లు. ఒక నాలుగేళ్ల పిల్లాడు చాటుకి వెళ్లేబదులు సిగ్గులేకుండా, తన పనేదో తల్లి ముందూ పొరుగావిడ ముందూ కానిచ్చేవాడు. ఆ తల్లికి కోపం లేదు. సరికదా గొప్పలుపోయేది: "చూడండి మా అబ్బాయి యెంత తెలివైనవాడో - వాడికి యేదన్నా భయంలేదు" అనేది. ఆ కుర్రాడు ఆమె కేసి చిరచిరలాడుతూ చూసి తర్వాత యికిలించేవాడు. వాడప్పటికే చీదరగా తయారయాడు. అదుపు లేకుండా వదిలేస్తే, మిగతావాళ్లు తనని యెలా చూస్తున్నారో తెలియచెప్పలేకపోతే వాడు పరమ నీచుడుగా తయారవుతాడు.

నేను వాలోద్య తల్లితో యెక్కువసార్లే మాట్లాడాల్సివచ్చింది. ఆమె యేదేనా చెబుదామనుకోవడం పాపం ఆమె సుపుత్రుడు ఆమె చెంగులాగేవాడు, ఆమె చెయ్యి గుంజేవాడు. వాడికెప్పుడూ ఆమెతో చెప్పాల్సిన అతి తొందర విషయమేదో వుంటూనే వుండేది. మొండిగా మధ్యలో దూరబడ్డం, అంతా తన కేసి శ్రద్ధ చూపించాలనుకోవడం పిల్లవాళ్లకుండే స్వార్థపు పద్ధతులు. దానికి మూలం యేదంటే పిల్లవాడు చేసే ప్రతిదీ క్షమించడం, పిల్లవాణ్ణి ముద్దు చెయ్యడం, దండించకపోవడం. కొంత మంది తల్లిదండ్రులు (దురదృష్టవశాత్తూ కొంత మంది ఉపాధ్యాయులు కూడా) పిల్లలతో మాట్లాడేటప్పుడు వాళ్లలాగే గొంతుక స్వరం వుండాలనుకుంటారు. పిల్లవాడు గునుస్తూ ఆ గొంతుక పెడతాడు. పెద్దవాళ్ల నుంచి పిల్ల తరహా ముద్ద మాటలు వస్తే పిల్లవాడు చెడిపోతాడు. నేనెప్పుడూ కూడా గొంతుకలోని స్వరాల్లో తారట్లాడే ప్రమాదాలపట్ల జాగ్రత్తగా వుండే వాణ్ణి. ఒక్క క్షణం కూడా ప్రతి చిన్న పిల్లవాడిలోనూ భావిపౌరుడు వున్నాడన్నది మరిచేవాణ్ణి కాదు. పరులకోసం చేసే పనికి సంబంధించి అలాంటిది నాకు మరీ ముఖ్యంగా వుండేది. తామేదో పెద్దవాళ్లకి ఉపకారం చేస్తున్నామనీ, అంచేత పొగడ్తగాని, యేదో బహుమతీగాని తమకి రావాలనీ పిల్లలకి వుండే భావం పరమ దరిద్రమైంది.

...ఆకురాలు కాలంలో మేము చేమంతి పువ్వు మొక్కల్ని తవ్వి తీసి గ్రీన్‌హౌస్‌లో పాతాం. పల్లెటూరి పిల్లలకి యీ పని కష్టమేమీ కాదు. ప్రతి రోజూ పిల్లలు తిరిగి నాటిన మొక్కలకి నీళ్లు పోసేవారు. పువ్వులెప్పుడు పూస్తాయా అని యెదురు చూస్తూ వుండేవాళ్లు. ఆ గ్రీన్‌హౌస్ అద్భుతమైన దిస అయింది. "సరే, యిప్పుడు అతిథుల్ని పిలుద్దాం" అన్నాను పిల్లలతో. "యెవర్ని పిలుద్దాం?" అని అడిగాను. వాళ్లల్లో చాలా మందికి తమ్ముళ్లూ, చెల్లెళ్లూ వున్నారు. వాళ్లు ఆ చిన్న పిల్లల్ని గ్రీన్‌హౌస్‌కి తీసుకువచ్చారు. ఆ చిన్న పిల్లలు చేమంతుల్ని అందుకోబోయారుగాని మా పిల్లలు వాళ్లని కొయ్యనివ్వలేదు.

"మనం సరిపడా పువ్వుల్ని పెంచితే మార్చి యెనిమిదిన, అంతర్జాతీయ మహిళా దినం కదా, ఆ రోజున మన అమ్మలందరికీ తలా ఒక పువ్వూ యివ్వచ్చు" అన్నాను పిల్లలతో. యీ లక్ష్యం పిల్లల్ని ఉత్తేజపరచింది. మార్చి మొదటి వారానికల్లా మాకు సరిపడా పువ్వులు పూశాయి. మేం తల్లుల్ని ఆ సెలవు రోజున పిలిచాం. మా గ్రీన్‌హౌస్ చూపించాం, వాళ్లందరికీ అందమైన పువ్వులిచ్చాం. గాల్యా సవతి తల్లి ఆమెతో వచ్చింది, ఆ పిల్ల ఆమె కొక చేమంతి పువ్వు యిచ్చింది. గాల్యాతోటి ఆమె సవతి తల్లిని గురించి చాలాసార్లు మాట్లాడాను. ఆమె సవతి తల్లి మంచి మనిషని నమ్మకం కలగ జేశాను. నా మాటలు వృధాపోలేదు. కోల్యా, తోల్యల తల్లులూ, సాష మామ్మ, కోస్త్య సవతి తల్లీ కూడా మా ఆహ్వానం అంగీకరించి వచ్చినందుకు నాకు

చిన్న పిల్లవాడికి వివరించి చెప్పలేనిది చాలా వుంటుంది. ఔన్నత్యాన్ని గురించి చెప్పే మంచి మాటలు అంతరంగాన్ని తరచుగా తాకకపోవచ్చు కాని పిల్లవాడు కూడా మానవత్వపు సౌందర్యాన్ని హృదయంలో అనుభూతం చేసుకోవచ్చు. "సంతోష చంద్రశాల" ఆరంభంనాటినుంచీ కూడా ప్రతి పిల్లవాడూ పరుల సంతోషాన్నీ, దుఃఖాన్నీ, బాధనీ, కష్టాల్నీ అనుభవంలోకి తెచ్చుకునేటట్టు వుండాలని నేను ప్రయత్నించాను. ఆకురాలు కాలంలోనూ, వసంతరుతువులోనూ మేం సమష్టి వ్యవసాయ క్షేత్రపు తేనెటీగల సంరక్షకుడు అంద్రేయ్ తాత దగ్గరకి తరుచూ వెళ్లేవాళ్లం. ఆ ముసలాయనకి కుటుంబం లేదు. ఒంటరిగా వుండటం అతనికి చాలా బాధగా వుండేది. మేం వెళ్లినప్పుడల్లా అంద్రేయ్ తాత సంబర పడేవాడని పిల్లలు గ్రహించారు. అతన్ని చూడ్డానికి వెళ్లే ముందే పిల్లలకి నేను చెప్పేవాణ్ణి: తాతకోసం యాపిలు పళ్లూ, ద్రాక్షలూ, రేగుపళ్లూ, పువ్వులూ పోగుచెయ్యమనీ, అవి తాతకి సంతోషంగా వుంటాయనీ. పరుల అనుభూతుల పట్లా, అనుభవాలపట్లా, వైఖరులపట్లా పిల్లల హృదయాలు సున్నితంగా తయారయాయి. పిల్లలు తమంత తామే ఆ ముసలాయనకి యేరకంగా సంతోషం కలిగించగలమా అని చూసేవారు. ఒక రోజున అడివిలో మేం కాష వంటకం చేశాం. ఆ మంట మండుతూ వుంటే యెన్ని సంతోషకర అనుభవాలు వాళ్లకి.... సరిగా ఆ సంతోష క్షణంలోనే వార్యా సాలోచనగా అంది:

"పాపం అంద్రేయ్ తాత ఒంటరిగా వున్నాడిప్పుడు."

పిల్లలు సాలోచనగా అయ్యారు. యిది కొంత మంది పెద్దలకి నీరసమైన కరుణగా కనిపించవచ్చు. యెవళ్లేనా అనుకోవచ్చు: యేడేళ్ల పిల్లవాళ్లు అలాంటి ఆత్మిక ప్రేరణలకి గురవుతారా? అని. ఆఁ, నా ప్రియమైన సహోపాధ్యాయులూ, సరిగ్గా ఆ వయసులోనే పిల్లవాని ఆధ్యాత్మిక భావుకత సునిశితం అయితే, తను మిగతా వాళ్లతో కలిసి బతుకుతున్నానన్న మహత్తర సత్యం ఆ పిల్లవాని హృదయానికి తాకితే, తన సంతోషాలని యితరులతో పంచుకోవాలని పిల్లవాడు వాంఛిస్తాడు. తన మిత్రుడు

ఒంటరిగా వుండగా తను సరదాగా వున్నాడన్న ఆలోచన పిల్లవాణ్ణీ విచారగ్రస్తం చేస్తుంది.

పిల్లలు అంద్రేయ్ తాతతో తమ సంతోషం పంచుకోవాలనుకున్నారు. "తాతకి కొంచెం మన వంటకం తీసుకెడదాం..." అన్నాడు కోస్త్య. దానికి ఉత్సాహంగా పిల్లలు ఒప్పుకున్నారు. పిల్లలు అతనికి యెంత కాషా తెచ్చారంటే నకనకలాడే యెలుగ్గొడ్డు కూడా అంతా తినలేదు. మేం యింకోసారి తేనెపట్ల క్షేత్రంవద్ద తిన్నాం, యీసారి తాతతో కలిసి.

సంతోషానికీ, దుఃఖానికీ చెందిన భావుకతని బాల్యంలో మాత్రమే నేర్పవచ్చు. ఆ వయసులోనే హృదయం ముఖ్యంగా మానవ కష్టాలపట్ల, దురదృష్టంపట్లా, వ్యాకులంపట్లా, ఒంటరితనంపట్లా సున్నితంగా వుంటుంది. పరుల స్థానంలో తనని వూహించుకుని పిల్లవాడు మారతాడు. ఒక రోజు సాయంత్రం అడవినుంచి మేం తిరిగి వచ్చేస్తున్నాం. దిక్కు బావురుమంటూ వున్న యేకాంత కుటీరం పక్కనుంచే వెడుతున్నాం. మహత్తర దేశభక్తియుత యుద్ధంలో అంగవికలుడైన ఒకతను అక్కడే వుంటున్నాడని పిల్లలకి నేను చెప్పాను. అతను జబ్బుగా వుండి, యాపిల్ చెట్లూ, ద్రాక్ష మొక్కలూ పాతలేకపోయాడు. పిల్లల కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. ప్రతి పిల్లవాడూ ఆ రోగిష్టి మనిషి ఒంటరితనంపట్ల సానుభూతి చెందాడు. అతనికి బహుమానంగా మేం రెండు యాపిల్‌చెట్లూ, రెండు ద్రాక్ష తీగలూ పాతాం. బదులుగా మేం అతి విలువైన సంతోషాన్ని పొందాం - మరొకళ్లకి ఆనందం కలిగించగలిగామన్న సంతోషం.

పరుల బాధలపట్లా, దుఃఖంపట్లా సానుభూతి పెంచడం అనేది సోవియట్ విద్యావిధానపు ముఖ్యమైన కర్తవ్యం. ఒక వ్యక్తి మరొక వ్యక్తికి మిత్రుడూ, సోదరుడూ కాగలడు - అవతలి వ్యక్తి దుఃఖం తనదైనట్టుగా భావించుకున్నప్పుడే. **అవతలి వాని హృదయాన్ని పిల్లవాడు గ్రహించాలి.** నేను విధించుకున్న ముఖ్యమైన బోధనా కృషి సారాంశం ఇది.

తన తోటివాడూ, మిత్రుడూ, తండ్రీ, తల్లీ లేదా గ్రామస్థుడూ అనుభూతం చేసుకునేది పిల్లవాడికి పట్టనట్లయితే, అవతలివాని కళ్లల్లో వాడి హృదయం యేమైందీ అన్నది పిల్లవాడు చూడలేనట్లయితే, ఆ పిల్లవాడు నిజమైన మానవుడుగా యెన్నడూ తయారవలేడు. తాము నిత్యం చూసే వాళ్లల్లోనే కాకుండా తాము యాదృచ్ఛికంగా కలుసుకున్న వాళ్లల్లో కూడా, అనుభూతులూ, చింతలూ, సంతోషాలూ, దుఃఖాలూ చూడగలిగేటందుకని నేను పిల్లల భావుకతని సున్నితం చేయ ప్రయత్నించాను.

మేం అడివినుంచి తిరిగి వస్తున్నాం. రోడ్డువార గడ్డిమీద కూర్చున్న ఒక ముసలతన్ని చూశాం. అతను దేన్ని గురించో కృంగిపోతూ ఉన్నాడు. "అతని కేదో అయింది. బహుశా అతను రోడ్డువార జబ్బుతో పడి పోయాడేమో, లేదా యేదేనా పోగొట్టుకున్నాడేమో" అని నేను పిల్లలకి చెప్పాను. మేము ఆ ముసలాయనదగ్గరకెళ్ళి అడిగాం: "మేం మీకేం సాయం చెయ్యగలం, తాతా?" అని. ఆ ముసలాయన

ఒక్కసారి వూపిరి పీల్చాడు. "యెంత మంచిమాట అన్నారు బాబులూ, మీరు నాకేం సాయం చెయ్యాలనుకున్నా చెయ్యలేరు. మా ఆవిడ ఆస్పత్రిలో మరణ శయ్యమీద వుంది. నేనామెదగ్గరకి వెడుతున్నాను. యిక్కడ బస్సు కోసం వున్నాను. మీరు నాకేం సాయం చెయ్యలేరు. కాని ఉపశాంతి కలిగించారు. ప్రపంచంలో యింకా మంచివాళ్లున్నారని నాకిప్పుడు తెలిసింది." పిల్లలు మాట్లాడలేదు. అయితే వాళ్ళ బాధ్యతలేని కీచుకీచు మనడం ఆగింది. ఆ ముసలాయన విచారకరమైన మాటలతో యెవళ్ల దారిన వాళ్లు యిళ్లకి పోయారు. వాళ్లింకొంచెంసేపు ఆడుకుందామనుకున్నారు, గాని ఆ ధ్యాసే మరిచిపోయి యిళ్లకి పోయారు.

బోధనలోని అతి కష్టమైన కర్తవ్యం అనుభూతిని నేర్పడం. చలించే హృదయం, భావుకత, నిజాయితీ, జాలీ వీటిని నేర్పే స్నేహం, సహచరభావం, సోదరత్వం. పరుల ఆనందం కోసం, సంతోషం కోసం, మనశ్శాంతి కోసం తనేదేనా చేస్తే పిల్లవాడు యితరుల అతిసున్నిత అనుభవాలని అనుభూతం చేసుకుంటాడు. తన తల్లికీ, తండ్రికీ, మామ్మకీ, తాతకీ సంబంధించి పిల్లవానికున్న ప్రేమ, మంచి సృష్టించడంచేత ప్రేరణ పొందకపోతే అహంకారంగా పరిణమిస్తుంది. పిల్లవాడు తల్లిని ప్రేమిస్తాడు. ఆమె అతని సంతోషానికి ఆధారం, మరి అతనికి ఆ ఆనందం కావాలి. కాని పిల్లవాళ్ల మనసుల్లో నిజమైన మానవ ప్రేమ నాటాలి – పరులపట్ల ఆందోళన, ఆవేశం, బాధ, బాధ్యత. పరుల శ్రేయస్సుని గురించి పట్టించుకున్న వాడి హృదయంలోనే నిజమైన ప్రేమ జనిస్తుంది. పిల్లవాళ్లకి తమని గురించి శ్రద్ధ తీసుకునే మిత్రుడుండడం ముఖ్యం. మా పిల్లలకి అంద్రేయ్ తాత అలాంటి స్నేహితుడయ్యాడు. పిల్లవాడు యితరుల్ని గురించి యెంత పట్టించుకుంటే, అంతగా తన సహచరులపట్లా, కుటుంబంపట్లా సున్నిత హృదయుడవుతాడు. అంద్రేయ్ తాత కష్టభూయిష్ఠమైన జీవితాన్ని గురించి నేను పిల్లలకి చెప్పాను. యుద్ధంలో అతని యిద్దరు కొడుకులూ చచ్చిపోయారు. అతని భార్య చనిపోయింది. ప్రపంచంలో తను యేకాకినయినట్టు అతను బాధపడుతున్నాడు.

"పిల్లలూ, మనమంతా తరుచుగా తాత దగ్గరికి వెడదాం. ప్రతిసారీ అతనికి ఒక రకమైన సంతోషాన్ని కలిగిస్తాం."

మేం తాతని చూడ్డానికి వెళ్లేటప్పుడు ప్రతివాడూ తాతని యెలా ఆనందపరచాలా అనే ఆలోచించేవాడు. తాము ప్రతి ఒక్కళ్లూ గీసిన బొమ్మలున్న డ్రాయింగ్ పుస్తకాన్ని పిల్లలు తాత కిచ్చారు. రంగు రంగుల గులకరాళ్లని నది ఒడ్డున యేరి వాటిని తాత కిచ్చారు. తాత ఒక చిన్న చెక్కపెట్టి తయారుచేసి, యీ రాళ్లు అందులో పెట్టి మాకిచ్చాడు. పిల్లలు అతని కోసం గడ్డిటోపీ తయారుచేశారు. తాత చెక్కతోటి మాకోసమని కొన్ని బొమ్మలు చెక్కాడు – ఓ చిన్న కుందేలు, నక్క గొర్రె....

వాళ్లు తమ మిత్రుని గురించి యెంత ఆధ్యాత్మిక చింత చూపిస్తే అంతగా తమ పక్కనే కష్టం, విచారం, ఆందోళన గమనించారు. నీనా, సాషాలు ఒకోప్పుడు

కళ్లల్లో విచారమూ, చింతా కనిపించేటట్టు వ్యాకులంగా బడికి రావడం గమనించారు. వాళ్లు ఆ పిల్లలని అడిగారు: మీ అమ్మకెలా వుంది? అని. వాళ్లమ్మకి బాగా లేదు, అందుకని పిల్లలు విచారంగా వున్నారు. తమ మిత్రుల విచారాన్ని తగ్గించడానికి తామేదేనా చేస్తే వాళ్ల హృదయాల్లో దయాపూరిత అనుభూతులు బలపడేవి. నీనా, సాషాల దగ్గరికి తోటలో కలుపు తియ్యడానికీ. బంగాళాదుంపలు యేరడానికీ సాయంచెయ్యడం కోసం కొన్నిసార్లు మేం వెళ్లాం. మేం అడివిలోకి వెళ్లిన ప్రతిసారీ పిల్లలు నీనా, సాషాలు రాగలరో లేదో అని అనుకునేవాళ్లు. యెందుకంటే వాళ్లు ఒకోఅప్పుడు తండ్రికి సాయం చెయ్యడం కోసం యింటిదగ్గర వుండి పోయేవాళ్లు. అంచేత మా ఉమ్మడి ఆనందపు ముందు రోజున మేం నీనా, సాషాల యింటికి వెళ్లి, మేం చెయ్యగలిగిన సాయంచేసేవాళ్లం.

సమాజంలో బతకడం అంటే యితరుల క్షేమంకోసం, శాంతికోసం స్వసుఖాలు కొన్ని వదులుకోవడం అని అర్థం. మేమంతా అలాంటి సంఘటనలు చవి చూసినవాళ్లమే: దుఃఖం, బాధ, కన్నీళ్లు పిల్లవాని యెదురుగానే వున్నాయి, అయినా కాని పిల్లవాడు తన సంతోషం తను అనుభవిస్తున్నాడు. పిల్లవాని దృష్టిని మబ్బుగా, నీరసంగా వున్న దేన్నుంచైనా మళ్లించి, అతని సంతోష ఛషకంలోని పిసరు కూడా ఒలక్కుండా తల్లి ప్రయత్నించడం కూడా మీరు చూసి ఉండాలి. అది ముసుగు లేని అహంకారాన్ని నేర్పడమే. మానవ మనుగడలోని మబ్బు పార్శ్వంనుంచి పిల్లవాణ్ణి తప్పించకండి. జీవితంలో పూరికే సంతోషమే కాకుండా దుఃఖం కూడా వుందని పిల్లవాణ్ణి తెలుసుకోనియ్యండి. పరుల దుఃఖం అతని హృదయంలోకి చొరనివ్వండి.

బాల్యంలో సంతోషం గ్రహించిన ఆధారాలమీదనే ఒక వ్యక్తి నైతిక ప్రతిరూపం ఆధారపడి వుంటుంది. ఆ సంతోషాలు అహేతుకంగా స్వలాభంగా వున్నట్లయితే, పిల్లవాడు దుఃఖం, ఉపద్రవం, బాధ యేమిటైందీ అనుభవించనట్లయితే అతను అహంభావిగా, పరులపట్ల బధిరుడుగా పెరుగుతాడు. ప్రతి పిల్లవాడు అత్యున్నత సంతోషం నేర్చుకోడం చాలా ముఖ్యం - యితరుల కోసం శ్రద్ధ తీసుకునే ఉత్తేజకరమైన సంతోషం.

## మా సమష్టి - ఒక సౌహార్ద కుటుంబం

"సంతోష చంద్రశాల" ఆరంభ దినాలనుంచీ కూడా నేను మా సమష్టిలోకి ఒక కుటుంబ సదృశమైన ఆప్యాయత, నిజాయితీ, సానుభూతి, పరస్పర విశ్వాసమూ, సహకారమూ తీసుకురావాలని ప్రయత్నించాను. సెప్టెంబరు నెలలో ముగ్గురు పిల్లల పుట్టిన రోజులున్నాయి: పీత్య, వాల్యా, కోల్య. మేం వాటిని సమష్టిగా జరిపాం. స్కూల్ వంటశాల పనివాళ్లు ఒక కేకుని వండించారు. పుట్టిన రోజు పిల్లలకి బొమ్మలూ, పుస్తకాలూ యిచ్చాం. కోల్య కుటుంబంలో తల్లిదండ్రులకి గాని, పిల్లలకి గాని పుట్టిన రోజులు జరపడం లేదని తెలిసి ఆశ్చర్యమైంది నాకు. ఆ

చిన్నవాడి జీవితంలో మా పార్టీయే తొలి పండుగరోజు. తనకు మిత్రులు చూపించిన ప్రేమాదరణలతో అతను ముగ్ధుడయ్యాడు.

బాల్యంలో ప్రతి వాడూ ఆప్యాయత, సానుభూతులను అపేక్షిస్తాడు. నిర్దయాత్మక వాతావరణంలో గనక పిల్లవాడు పెరిగితే అందానికీ, దయకీ అతను ఉదాసీనుడైపోతాడు. బడి కుటుంబపు స్థానం వహించలేదు, ముఖ్యంగా తల్లి స్థానం. కాని పిల్లవానికి సంరక్షణ, ఆప్యాయత, బాధ్యత యింటిదగ్గర కరువైనట్లయితే, మనం, ఉపాధ్యాయులం, అతనిపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలి.

మా చిన్న సమష్టికి త్వరలోనే సొంత పాదార్థిక విలువలూ, రహస్యాలూ, చింతలూ, దుఃఖాలు యేర్పడ్డాయి. మేం అలమర అరలో ఆటబొమ్మలూ, పెన్సిళ్లూ, నోటు పుస్తకాలూ వుంచేవాళ్లం. "స్వప్నాల దిక్కు"లో ఒక "తిను బండారాల కొట్టుగది" వుండేది. అక్కడ మేము బంగాళాదుంపలు, పిండి, నూనెలు, ఉల్లిపాయలు దాచుకునేవాళ్లం. అవి వర్షం కురిసే ఆకురాలు కాలపు సాయంత్రాలకి అవసరమయేవి. మా కుటుంబ సభ్యులు చిన్న పిల్లలు. కాని కొంతమంది వాళ్లలో అందరికంటే చిన్న వాళ్లు – దంకో, తీనా, వాల్యా. దారిలోనూ, అడవిలోనూ యీ చిన్న పిల్లలకి సాయపడ్డం ప్రతివాళ్లూ తమ బాధ్యతగా భావించే వాళ్లు.

యెందుకనో తెలియకుండా కొంతమంది పిల్లలు యిళ్లదగ్గర వుండిపోతే ఆ సాయంత్రం వాళ్ల మిత్రులు వాళ్లకేమేనా వొంట్లో బాగా లేదేమోనని వాళ్ల యిళ్లకి వెళ్లేవాళ్లు. యిది వొక మంచి సంప్రదాయం అయింది. ముఖ్యమైన ఆంతరంగిక అవసరాలకి పునాది అభిమానం. అది లేకుండా ప్రజల మధ్య కమ్యూనిస్టు సంబంధాలని, పరుల అవసరాల్ని గుర్తించడాన్ని వూహించడం అసాధ్యం. సంతోషపు ఆధారాలు, అనుభూతుల పూర్ణత్వం, తమ మిత్రులతోటి సంబంధాల్లో వుమ్మడిగా అందరు పిల్లలకీ వుండే అనుభవాలు ఆంతరంగికమైన విలువల పరస్పర మార్పిడిలా వుండేలా నేను ప్రయత్నించాను. ప్రతి పిల్లవాడూ తన సొంతమైనదేదో పరులకి ఆనందం కలిగించడం కోసం సమష్టికి తీసుకురావాలి.

పిల్లల సమష్టిని తీర్చిదిద్దడంలో నేను చాలా కష్టాలని యెదుర్కొన్నాను. వాటిని అధిగమించడానికి అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులతోటి సంభాషించాను, వాళ్ల సలహా అర్థించాను. వాళ్లకు పిల్లవాని మనసు తెలుసు. సాయంత్రాలప్పుడు పిల్లల శబ్దాలు మణిగాక మేము పాఠశాల భవనంలోనో, దాని ఆవరణలోనో సమావేశమయ్యేవాళ్లం. పిల్లల సమష్టికి సంబంధించిన బహుముఖ జీవితాన్ని గురించి మాలో ప్రతి ఒక్కళ్లకీ ఒక అభిప్రాయం వుంది, దాన్ని ఒకళ్లతో ఒకళ్లం పంచుకునే వాళ్లం. ఒక వ్యక్తి జ్ఞానం కుటుంబంలో ఆరంభమౌతుందని మాకందరికీ తెలుసు. ఆ జ్ఞానం పిల్లవాడు తల్లి జోలపాడుతూ వుంటే ఆమె కేసి చూసి చిరునవ్వు నవ్వే క్షణంలో మొదలౌతుంది. మంచితనం, ఆప్యాయత ప్రపంచంలో అత్యుత్తమమైనవి, అంటే ఒకరిపట్ల ఒకరి ప్రేమ, వ్యక్తిగత అనుభవం ద్వారా జాగృతం కావడం యెంతో ముఖ్యం. పిల్లవాని తల్లీ, తండ్రీ పిల్లవానికి అత్యంత ప్రియమైన వాళ్లు కావడం యెంతో ముఖ్యం. కాని

కుటుంబంలో నిజమైన మానవీయత చాలినంత లేనట్లయితే లేదా పూర్తిగా కొరవడినట్లయితే, యే మేరకి సమష్టి దాన్ని అందివ్వగలదు? పిల్లవాని భావుకత్వపు, హత్తుకుపోయే హృదయానికి మానవ హృదయపు అందాన్నీ, దయనీ యెలా తెరవగలం?

యీ సాయంకాలపు సంభాషణల్లో క్రమేపీ మేము, నా అభిప్రాయంలో, బోధనాత్మకంగా ముఖ్యమైన భావం అందుకున్నాం. అది మా బోధనాత్మక సమష్టి విశ్వాసం అయింది: ప్రతి వ్యక్తినీ ఉన్నతంచేసి, వ్యక్తిగత యోగ్యతాభావం, ఆత్మగౌరవం బలపడేటట్టు చేసినప్పుడు మాత్రమే పిల్లల సమష్టికి వాళ్లని తీర్చిదిద్దే బలం వుంటుంది. యెందుకంటే నిజమైన మాతృ, పితృప్రేమ ఆత్మగౌరవానికీ, ప్రజలపట్ల మంచిగా వుండే భావానికీ నడిపిస్తుంది. పిల్లవాణ్ణి తనపట్లా, తన చర్యలపట్లా సగౌరవంగా వుండేటట్టూ తన గౌరవాన్నీ, మర్యాదనీ కాపాడుకొనేటట్టూ యెలా చెయ్యడమా అన్న భావం, యీ అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులలో నేను గమనించిన అతి ముఖ్యమైన సృజనాత్మక ధాతువు.

మా బడిలోని శ్రేష్ఠులైన ఉపాధ్యాయులనుంచి యీ వజ్రపు తునకల్లాంటి బోధనాత్మ యుక్తిని జాగ్రత్తగా సేకరించి నేను, సమష్టిలో పిల్లల మధ్య హృదయపూర్వకమైన, నిజాయితీతో కూడిన సంబంధాల్లో మంచితనంతోటి తాము వుండాలన్న కోరిక చొరబడాలని ప్రయత్నించాను. నిజాయితీ, ఆప్యాయత సమష్టి సంబంధాల్లో వుండటమనేది నా తదేక ధ్యాస అయిపోయింది. యేదో ఉమ్మడి లక్ష్యాలూ, కృషులూ ఏకంచేసిన ఒకే తరహా ఆలోచన గలవాళ్ల సహకార సంఘంగా మాత్రమే గాక, పిల్లల సమష్టి ఒకళ్లపట్ల ఒకళ్లకి పరస్పర భావుకత వున్నవాళ్లుగా, యితరుల హృదయాన్నీ, మనసునీ, సంతోషాన్నీ, దుఃఖాల్నీ తెలుసుకోగల ఆత్మ సామర్థ్యం గలవాళ్లుగా వుండేటువంటి బహుముఖ జీవితంగా భావించాను నేను. యెందుకంటే సమష్టి సంబంధాల్లోని యీ ఆప్యాయత, నిజాయితీల్లోనే మంచి వ్యక్తి కావాలన్న ఉన్నత కాంక్ష, పరులకి ప్రదర్శించుకోవడం కోసం కాదు, పొగడ్తలు సంపాదించాలని కాదు, వ్యక్తి సొంత గౌరవం అనుభూతం అయే సహజావసరంలో యిమిడి వుంటుంది.

తరవాతి సంవత్సరాల్లో నా బోధనాత్మక కృషి ముఖ్యంగా, పిల్లవానిలో, యుక్తవయస్కునిలో, యువకునిలో, యువతిలో మానవత్వం ఉద్దీపన చెయ్యాలన్న తపనతో వున్నదే. సమష్టి అంతరంగిక సంబంధాలు దానిమీదనే ఆధారపడి వుంటాయి. వ్యక్తిని ఉన్నతం చేసే కృషిలో నేను యెప్పుడూ పిల్లల సమష్టిని, సమాజపు ఒక భాగంగా వుంచేటట్టు ప్రయత్నించాను. ఈ కృషికే నేను పిల్లల సృజనాత్మక కృషి, వాళ్ల అభిరుచుల, సామర్థ్యాల నేర్పుల అభివృద్ధి లోబడి వుండేటట్టు చేశాను.

# మేం ఆరోగ్య వనంలో జీవిస్తున్నాం

మా పిల్లలు బడి ప్రారంభించడానికి యింక వొక నెల వుంది. అద్భుతమైన వేసవికాలపు ఆగస్టు నెల సమీపిస్తోంది. వేడి జూలై రోజుల్లో పిల్లలు బడికి ఉదయం గాని, బాగా పొద్దుపోయాక మధ్యాహ్నం గాని వచ్చేవాళ్లు. కొంతమంది మధ్యాహ్నం భోజనాలకి వెళ్లలేనంత దూరంలో వుండే వాళ్లు. అంచేత ఒకోఅప్పుడు ఆరు, యేడుగురు పిల్లలు బడి భోజనాల గదిలో మధ్యాహ్నం భోజనాలు తినేవాళ్లు. స్కూలు ప్రారంభం కావడానికి ముందు, యిళ్ళదగ్గర కంటె చెరువు గట్టున వున్న తోటలో యెక్కణ్ణో పిల్లల్ని ఒక నెల వుండనివ్వచ్చని నాకు తట్టింది. చెరువుకు పక్కనే వున్న స్థలం సరిపోతుందని అనుకున్నాను; చెట్ల గుబురులో కుటీరాలు కట్టుకోడానికి మాకు యువ పయొనీర్లు సాయంచేశారు. వేసవి కాలమంతా సమష్టి వ్యవసాయ క్షేత్రపు పుచ్చకాయల తోటల కాపలా వాళ్లు అలాంటి కుటీరాల్లోనే వుంటారు. మేం కుటీరాల్లో గడ్డి పరిచాం. డ్రాయింగు కోసం చిన్న బల్లలు తయారుచేశాం. పెద్ద సమష్టి వ్యవసాయ క్షేత్రపు తోట మా కుటీరాల జాగా పక్కనే వుంది. తోటమాలీలు తోటని మా ప్రధాన విశ్రాంతి స్థానంగా వాడుకోనిచ్చారు. కుటీరాలకి పక్కనే వంట గది యేర్పాటు చేశాం. సమష్టి వ్యవసాయ క్షేత్రం మాకు ఆహారం యిచ్చింది, మాకో వంట మనిషిని కుదిర్చింది. సాన్య తండ్రి చెరువు దగ్గర స్నానాల రేవులో ఒక షెడ్ కట్టాడు. దాని పక్కనే వున్న మోటార్ బోట్‌ని చూసేటప్పటికి పిల్లల కళ్లు ఉత్సాహంతో వెలిగాయి.

ఆరకంగా, ఆరోగ్యవనంలో మా జీవితం ఆరంభమైంది. మా నివాస స్థలానికీ, విశ్రాంతి స్థలానికీ పిల్లల తల్లిదండ్రులు ఆ పేరు పెట్టారు. మొత్తం ఒక నెల అంతా మేం ఆరుబయటే వున్నాం. సూర్యోదయానికి ముందే మేం లేచేవాళ్లం. చెరువులో స్నానంచేసి, ఉదయపు వ్యాయామంచేసి, నాస్తా తిని, అడివిలోకి, తోటలోకి, లేకపోతే పొలంలోకి షికారు వెళ్లేవాళ్లం. యీ నెలలో మేం భాషామూలాలకి అతిముఖ్యమైన "యాత్రలు" చేశాం. పచ్చిక మైదానాల్లోని దిబ్బలమీదనుంచి సూర్యోదయాన్ని చూసే వాళ్లం. వందలాది మంగలి పక్షుల శ్రేణులు మరింత ఉష్ణప్రాంతాలకి యెగిరిపోవడానికి యెలా సన్నద్ధమయ్యేవో చూసేవాళ్లం. నదిని కమ్మిన పొగమంచుని యెండా, ప్రభాత వాయువులూ యెలా చెదరగొట్టేవో చూసే వాళ్లం. పొలంలో, మైదానంమీద, లేదా అడివిలో పిల్లలు యింకోసారి నాస్తా తినేవాళ్ళు: వాళ్లు యాపిల్‌పళ్లూ, భేరీపళ్లూ, ఉడకబెట్టిన బంగాళాదుంపలూ, దోసకాయలూ, పుచ్చకాయలూ, కర్బూజాకాయలూ, జొన్నకంకులూ, లేదా టొమాటోలూ తినేవాళ్లు. ఆగస్టే పళ్లూ కాయగూరలూ బోలెడు దొరికే నెల. యీ నెలలోనే ప్రతి పిల్లవాడూ రెండు కిలోగ్రాములకి తక్కువ లేకుండా యాపిల్‌పళ్లూ భేరీపళ్లూ తినేవాళ్లు. ప్రతిరోజూ అంద్రేయ్ తాత మాకు తేనె తెచ్చేవాడు. ప్రతిరోజూ ఉదయమూ, సాయంత్రమూ పిల్లలు తాజాపాలు తాగేవాళ్లు.

తాజా కాయగూరలతోటి వంట మనిషి మాకు రుచికరమైన వంటలు తయారుచేసేవాడు.

యెండకి కమిలిన పిల్లలు నిక్కర్లతోటీ, టి-షర్టులతోటీ కాళ్లకి చెప్పుల్లేకుండా పరిగెత్తేవాళ్లు. వాళ్లు ప్రతిరోజూ మోటారు బోటులో యాత్రలకి వెళ్లేవాళ్లు.

పుష్టికరమైన ఆహారం, యెండ, తాజాగాలి, నీరు, ఒక మోస్తరు పనీ, వినోదమూ మంచి ఆరోగ్యానికి నిరుపమానమైన ఆధారాలు.

# మొదటి సంవత్సరపు చదువు ఆరంభించే ముందు ఆలోచనలు

మా "సంతోష చంద్రశాల" జీవితం ముగుస్తోంది. మా విద్యార్థులు త్వరలోనే బళ్లో చేరతారు, ఆ ఆలోచన నాకు ఆనందమూ, ఆందోళనా కూడా కలిగించింది: ఆనందం యెందుకంటే నేను జీవిత పథంలో, కృషి పథంలో, జ్ఞాన పథంలో యీ పిల్లలతో కలిసి కొన్ని యేళ్లు గమిస్తాను. యింకా యెందుకంటే ఆ సంవత్సరంలో మా బుజ్జి పిల్లలు దృఢంగా యెదిగారు, చిన్న బెర్రీ చెట్లలా గోధుమరంగు తిరిగారు.

మా "సంతోష చంద్రశాల" ముగుస్తుందనగా, వోలోద్య, కాత్యా, సాన్య, తోల్య, వార్యా, కోస్త్య ఒక యేడాదికీ యిప్పటికీ యెలా వున్నారా అని మనసులోనే పోల్చుకున్నాను. అప్పుడు వాళ్లు పాలిపోయి కళ్లకింద నల్ల మచ్చలతో జబ్బుగా వుండేవాళ్లు. యిప్పుడు వాళ్లు యెర్రబడ్డారు. యెండకి నల్లబడ్డారు. బ్లాక్‌బోర్డు, సుద్దముక్కలూ వీటిని ఉపయోగించకుండానే పిల్లలు జ్ఞానపు మొదటి మెట్టు యెక్కారు. వాళ్లు చదువనూ, రాయనూ నేర్చుకున్నారు. ఆ మెట్టు తరగతిలో బ్లాక్‌బోర్డుతో చదువులు మొదలయ్యే వాళ్లకంటె వీళ్లకి చెప్పలేనంత సులభం యిప్పుడు.

నాకు ఉపదేశాత్మక శాస్త్రం అంటే మంచి గౌరవం, వెర్రిమొర్రి పథకాలంటే మంట. జ్ఞాన సాధన ఒక్కొక్క అడుగుతోటే మొదలవడం, విద్యాభ్యాసం - పిల్లవాని అత్యంత గంభీరమైన, శ్రమ భూయిష్ఠమైన కర్తవ్యం - సంతోషపూరితమైన శ్రమగా, పిల్లవాని ఆధ్యాత్మిక భౌతిక శక్తులని దృఢపరిచేదిగా వుండడం జీవితమే ఆపేక్షిస్తుంది. శ్రమ గమ్యాన్నీ కష్టాల సారాన్నీ అర్థం చేసుకోలేని పిల్లలకి యిది మరీ ముఖ్యం.

చదువనేది కష్టపడి పని చెయ్యడమనీ, దాన్ని ఆటగా మార్చలేమనీ యిప్పటికి వెయ్యిసార్లేనా అనడం వినివుంటాం. కాని పనికీ, ఆటకీ మధ్య చైనా గోడలాంటి దాన్ని పెట్టకూడదు. పిల్లవాని జీవితంలో, ముఖ్యంగా పాఠశాలలో చేరక ముందునాటి పిల్లల జీవితంలో, ఆటల కుండే స్థానం చూస్తే పిల్లవాడికి ఆటే చాలా ముఖ్యమైన విషయం అని మీకు తెలుస్తుంది. పిల్లవాని వ్యక్తిత్వంలోని సృజనాత్మక సామర్థ్యాల్లాగా ప్రపంచం ఆటల్లోనే పిల్లవాడికి వెల్లడవుతుంది. ఆట లేకుండా సంపూర్ణ మానసిక

అభివృద్ధి లేదు, వుండబోదు. ఆట అనేది చుట్టూ వున్న ప్రపంచపు జీవనదాయక అవగాహనలా, అభిప్రాయాలా కాంతి: పిల్లవాని ఆంతరంగిక ప్రపంచంలోకి ప్రసరించే సూర్యకిరణాలతో వెలిగే పెద్ద కిటికీ. శోధన, జిజ్ఞాసల మంట మండించే రవ్వ ఆట అనేది. పిల్లవాడు ఆడుకుంటూ రాయడం నేర్చుకుంటే, మేధాభివృద్ధి ఒక దశలో పనితో ఆటని జత చేస్తే, పిల్లలతోటి ఉపాధ్యాయుడు "ఆ ఆట చాలు, చాలా సేపు ఆడుకున్నాం. మరి పనిచేసుకుందాం రండీ!" అని అనడం తగ్గిస్తే కొంప మునిగేదేమిటి?

ఆటని అనేక విధాలుగా అర్థంచేసుకోవచ్చు. యెవడేనా పందెపు పరుగులు తీస్తున్నప్పుడే చూసి మాత్రమే పిల్లలు ఆడుకోరు. సామర్థ్యపు, వూహల ప్రముఖ ప్రయత్నంలో ఆటని కలపవచ్చు. మానసిక శక్తి తాలూకు ఆటలు లేకుండా, సృజనాత్మక వూహ లేకుండా, నిజమైన అధ్యయనం అసాధ్యం, ముఖ్యంగా పాఠశాలాత్పూర్వపు సంవత్సరాల్లో. ఆట అనేది, ఆ మాటకున్న విస్తృతార్థంలో, యెక్కడ అందముంటే అక్కడ మొదలవుతుంది. కాని సౌందర్యాత్మక విషయం లేకుండా శ్రమ అనేది పిల్లవాడికి అనూహ్యం కాబట్టి, తొలి సంవత్సరాల్లో పని సన్నిహితంగా ఆటలతో ముడిపడి వుంటుంది. స్కూలు మడిలో కోతకాల ఆరంభ దినం పండగ రోజు – పిల్లలు దాబుగా దుస్తులు వేసుకున్నారు. కోసిన మొదటి గోధుమ కంకులు టేబిల్‌క్లాత్ పరచిన బల్లమీద కలశంలో వుంచుతారు. యీ ఆటకి గంభీర అంతరార్థం వుంది. కాని ఆటలు కృత్రిమంగా గనక శ్రమతో "జత" పరచబడితే వాటి బోధనాత్మక విలువపోతుంది. యెందుకంటే పరివేష్టిత ప్రపంచపు తాలూకూ, వ్యక్తి తాలూకూ రసౌత్సక్యం ఆటలోని అందంలో వ్యక్తం కాదు.

చదువనూ రాయనూ మొదలుపెట్టడానికి తగిన సమయం ఏదీ అన్న ప్రశ్న యింకా జవాబు లేకుండా మిగిలే వుంది. కుర్రావాడు బడిలో చేరాకా, లేదా అతను స్కూలు ఆరంభించడానికి యింకో సంవత్సరం ముందా. విద్యార్థి జీవితంలో బడి గట్టిగండి యేర్పరచకూడదని మా స్కూలు ఉపాధ్యాయుల అనుభవం మాకు నమ్మకం కలిగించింది. పిల్లవాడు విద్యార్థిగా అయినా తను ముందటిరోజున యేం చేశాడో దాన్నే కొనసాగించనివ్వండి. నవ్యతని క్రమేపీ అతని జీవితంలోకి ప్రవేశించనియ్యండి కాని అనుభూతుల గండశిలమీద పడినట్టు నిశ్చేష్టితుణ్ణి కానియ్యకండి.

చదువనూ రాయనూ అనేవి చిత్రలేఖనంతోటీ ఆటలతోటీ సన్నిహితంగా ముడిపడి వున్నాయి. అవి పాఠశాలాత్పూర్వపు పెరుగుదలనీ స్కూల్‌లోని అధ్యయనాలనీ కలిపే వంతెనల్లో ఒకటి అవుతాయి.

మంచు బిందువుల్లో సూర్యకిరణాల అందం, వంద సంవత్సరాల నాటి సమున్నత రాజస తీవిగల ఓక్ చెట్టు, చెరువుమీద వంగిన విల్లో చెట్టు సొగసు, వినీలాకాశంలో కొంగల బారు, వేడిగా వున్న జూలై రోజు గడిచాక నిద్రకి ఒరిగిన మైదానం అన్నీ కూడా అక్షరాల డ్రాయింగుల్లోనే మా విద్యార్థుల ముందు విస్తరించుకున్నాయి. పిల్లలు అక్షరాలని యింకా బాగా గీయలేకపోవచ్చు, ప్రతి

డ్రాయింగులోనూ జీవన నాడిని వాళ్లు స్పృశించినప్పుడు అది ముఖ్యం కాదు. పిల్లలు మాటకి వుండే ఛాయలని, మాటల సంగీతాన్ని అర్థంచేసుకోనారంభించడం నాకు సంతోషం కలిగించింది! వాళ్ల చైతన్యంలో స్పష్టమైన, భావవ్యక్తీకర, కవిత్వపుటూహల స్థిరమైన పునాది వుంది. పిల్లల ఆధ్యాత్మిక జీవితాల్లోచిత్రలేఖనం ఒక భాగమైపోయింది. వాళ్లు తమ ఆలోచనలని, అనుభూతులని, అనుభవాలని డ్రాయింగులో వ్యక్తం చెయ్య ప్రయత్నించారు. సంగీతం వినడం అనేది మా పిల్లల జీవితంలో ఆంతరిక అవసరం అయింది.

పిల్లలు నైతికాభివృద్ధిలో కూడా మొదటి అడుగు వేసినందుకు నాకు ఆనందం కలిగింది: వాళ్లు మానవత్వపు చర్యల సౌందర్య ప్రపంచంలోకి అడుగెట్టారు. పరుల కష్టసుఖాలపట్ల చలించడం అనేది వాళ్ల హృదయాల్లో మేల్కొంది. యితరులకోసం ఆనందం సృష్టించడం వాళ్లకి అప్పటికే తెలిసింది. బోధన అనే క్రమం అనేక సంవత్సరాలలో జరుగుతుంది: పిల్లవాడు స్కూల్ బిల్డింగ్‌లోకి అడుగు పెట్టిందగ్గర్నుంచి, పూర్తిగా అభివృద్ధి చెందిన వ్యక్తిత్వంతో పెద్దవాడుగా ప్రపంచంలో ప్రవేశించేదాకా. నాకున్న ప్రధాన సమస్య యేమిటంటే పిల్లవాణ్ణి అనుభూతి చెందేటట్టు చెయ్యడమెలా అని: మన విద్యార్థులు, తమతోబాటు జీవిస్తున్న వాళ్లు కుడా అదే దుఃఖాలు, బాధలు, కష్టాలు తమలాగానే కలిగి వున్నారని అనుభూతి చెందాలి. మా విద్యార్థుల మంచి పనులు వ్యక్తి అనుభూతులు పునాదిగలవిగా వుండాలని నేను ప్రయత్నించాను. పిల్లలు సానుభూతి చూపించడం నేర్చుకున్నారనీ, తమతోటివాళ్ల, తమకంటే పెద్దవాళ్ల, తల్లిదండ్రుల, సామాన్యంగా పెద్దవాళ్ల అనుభూతులతోటీ, ప్రేరణలతోటీ నిండి వుండటం నేర్చుకున్నారని నాకు సంతోషమైంది.

ఆ మంచి భావాలతోబాటుగా నేను ఆందోళన కూడా చెందాను. నిత్య మేధాశ్రమ పిల్లల విధి. చుట్టూతా వున్న ప్రపంచంపట్ల వాళ్ల సజీవ ఆసక్తిని నిలబెట్టి వుంచగలనా? ప్రతి పిల్లవాడూ ప్రపంచాన్ని తన పద్ధతిలో చూస్తాడు, వస్తువుల్నీ, ప్రకృతి విషయాల్నీ తన పద్ధతిలోనే దర్శిస్తాడు, తన పద్ధతిలోనే ఆలోచిస్తాడు. వేగవంతమైన, ఉరవడి గల సెలయేళ్లనీ, వడి కనిపించనే కనిపించని ప్రశాంత గంభీరనదులనీ రెండింటినీ జ్ఞాన ప్రపంచంలోకి తీసుకురాగలనా?

ప్రతి పిల్లవాని ఆంతరంగిక జీవితం గురించే నాకు యెక్కువ పట్టింపు వున్నది. నాముందు సున్నితమైన, మృదువైన, హత్తుకునే హృదయాలు వున్నాయి. పిల్లలతోటి నా సంబంధం పెరిగే కొద్దీ, నేను నా మాటలకి, అభిప్రాయాలకి, నా సలహా, విమర్శల ధోరణికి పిల్లల హృదయాల్లో మనస్సుల్లో ఆదానం యెంత నిశితంగా పెరిగిందీ గమనించాను. నాముందు ముప్పై ఒక్క మంది పిల్లలు వున్నారు - ముప్పై ఒక్క భిన్న ప్రపంచాలు.

వాళ్లు అప్పటికే, పాఠశాలత్పూర్వమే యెంత భిన్నంగా వున్నారు - కోల్యా, కోస్త్య, వార్యా, తీనా, దంకో, లరీసా, వలోద్య, స్లావ... ప్రతిరోజూ, వారమూ గడిచే

కొద్దీ వాళ్ల వ్యక్తిత్వ ప్రత్యేకత యింకా లోతుగా, యింకా గమనించదగ్గట్టుగా పెరుగుతుంది. ప్రతి పిల్లవాడికీ తన హృదయపు అంతరాంతరాళాల్లో యెక్కడ్నో ఒక తీగ వుంటుంది. ఆ తీగ తన పద్ధతిలో మోగుతుంది, నా మాటలకి హృదయం ప్రతిధ్వనిస్తుంది. నేనే ప్రతి తీగనీ శ్రుతి చెయ్యాల్సివుంది. దేన్ని గురించేనా భయకంపిత అయినా, శోకించినా ప్రతి పిల్లవాని హృదయంలోనూ యే కష్టభూయిష్ఠమైన అనుభవాలు జనిస్తాయో నేనప్పటికే చూశాను. మరి ఉపాధ్యాయునికి దాన్ని గురించి తెలియదు. ప్రతి రోజూ పిల్లవాని హృదయంలో యేం వుందో, అది యేం అనుభవిస్తోందో నేను తెలుసుకోగలనా? నేను అన్నప్పుడల్లా పిల్లలతో సరసంగా వుండగలనా?

కాని యింకో అతి ముఖ్యమైన సందేహం. నేను కృషి చేసిన అన్ని సంవత్సరాల్లోనూ నాకు అది మనశ్శాంతి యివ్వలేదు. పిల్లవాణ్ణి సాంఘిక జీవితపు పెద్ద ప్రపంచంలోకి యెలా నడిపించాలి? తన గ్రామంలో తను బాల్యంలో గడిపిన నదిగట్ల సౌందర్యాన్ని దర్శించడమే కాకుండా బ్రహ్మాండమైన, అవధిలేని స్వదేశ ప్రపంచపు సౌందర్యాన్ని దర్శించేటట్లు చెయ్యడమెలా? పిల్లవాడు సోవియట్ ప్రజలు సాధించిన కార్యాల్ని – సోషలిస్టు వ్యవస్థ, స్వాతంత్ర్యం, గౌరవం, మన దేశ ప్రజల మధ్య సౌహార్దం – పరిరక్షించగలడా? పౌర విద్యని సర్వపార్శ్వ అభివృద్ధిగా యెలా సంధించగలను? పసిపిల్లల విద్యాబోధన చాలా సంక్లిష్టమైన సమస్య. వాళ్ల లేతవయసుకి తగ్గట్టుగా నేను దీన్ని పరిష్కరించడంలో నెగ్గుతానా?

# చిన్నతనం

## ప్రాథమిక పాఠశాల అంటే యేమిటి?

1952 ఆగస్టు ఆఖరి రోజున ప్రశాంతంగా, యెండ బాగా కాస్తూ వున్న ఉదయంపూట స్కూల్ భవనపు ముంగిట వున్న పచ్చిక మైదానం మీద విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, తల్లిదండ్రులూ సమావేశమయ్యారు. స్కూలు ప్రారంభానికి ముందు వున్న యీ పర్వదినం బడికీ, పుస్తకాలకీ సంబంధించి జరుపుకునే సాంప్రదాయికమైన పండగ రోజు. యీ ఉదయపు ఉత్సవం ప్రత్యేకంగా ఉత్సాహకరంగా వుంది.

సుదూర, అజ్ఞాత దేశాలకి ప్రయాణమవుతున్న శోధించేవాడు తోటి మిత్రుల, సహచరుల కళ్లల్లోకి చూస్తూవున్నట్లు నేను కూడా మా బుజ్జి పిల్లల కళ్లలోకి చూశాను. పదహారు మంది అబ్బాయిలూ, పదిహేను మంది అమ్మాయిలూ అక్కడ నుంచున్నారు. వాళ్ల తల్లిదండ్రులూ, తాతలూ, మామ్మలూ వాళ్లతో వచ్చారు. కోల్యా, తోల్యల తల్లులు వచ్చారు, గాల్యా సవతి తల్లి ఆ చిన్న పిల్ల భుజంమీద చెయ్యి వేసి నుంచుని వుంది. కాని గాల్యా యేడాది క్రితంలాగా ముడుచుకుని లేదు. ప్రతివాళ్లూ మమ్మల్ని అభినందించి మాకు విజయం కలగాలని ఆశీర్వదించారు. పదవ తరగతి పిల్లలు వచ్చి యీ చిన్న పిల్లలు ప్రతి ఒక్కరికీ వాళ్ల నూతన జీవితానికి గుర్తుగా ఓ పుస్తకం యిచ్చారు. దానిమీద ఇలా రాసివుంది: “శుభం, నేస్తం. యీ పుస్తకాన్ని జాగ్రత్తగా కాపాడాలి. నువ్వు స్కూలు ప్రారంభించిన నాటి గుర్తుగా యెప్పటికీ దీన్ని వుండనియ్యి. దీన్ని మీ యింట్లో పుస్తకాల అరలో పెట్టుకో.” (సంవత్సరాలు గడిచాయి, మా విద్యార్థులు పెద్ద వాళ్లయ్యారు, కాని అంతా యీ పుస్తకాల్ని పవిత్రమైన వాటిగా, బంగారు చిన్ననాటి రోజుల్ని గుర్తుచేసే అమూల్యమైన వాటిగా పదిలపరచుకున్నారు.)

మేమంతా స్కూలు తోటలోకి వెళ్లాం, పిల్లలూ వాళ్ల తల్లిదండ్రులూ ఉపాధ్యాయులూ, పదవ తరగతి పిల్లలూ. పిల్లలు జాగ్రత్తగా ఒక యాపిల్ చెట్టుని తవ్వి పెద్ద మట్టి ముద్దతోబాటుగా దాన్ని యింకో చోటికి తెచ్చి అక్కడ తవ్విన గుంతలో పాతేరు. కొత్త విద్యార్థులు ఆ గుంతని పూడ్చడానికి తలాకాస్త పిడికెడూ మట్టి పోశారు. పిల్లలు ఆ చెట్టుకి నీళ్లుపోసి యిళ్లకు వెళ్లారు. ఆ మర్నాడు వాళ్లు బడికి వస్తారు. వాళ్ల మొదటి పాఠం ప్రారంభమవుతుంది. వాళ్లు నాలుగేళ్లు ప్రాథమిక పాఠశాల విద్యార్థులుగా వుంటారు. నాలుగేళ్లు నేను వాళ్లకి బోధించి సంరక్షిస్తాను.

మొదటి రోజున ప్రాథమిక పాఠశాల అంటే యేమిటీ అన్న దాన్ని గురించి నేను యోచించాను. ప్రాథమిక పాఠశాలకి సంబంధించిన బ్రహ్మాండమైన నిర్ణయాత్మకమైన పాత్ర గురించి యెంతో చెప్పబడింది. "జ్ఞానానికి సంబంధించిన స్థిరమైన పునాది ప్రాథమిక పాఠశాలలోనే పడుతుంది," "ప్రాథమిక తరగతులు భవిష్యత్తుకి పునాదులు" లాంటి మాటలున్నాయి. మధ్య తరగతుల్లోనూ, పై తరగతుల్లోనూ బోధనలో దోషాలుగాని, లోపాలుగాని యేర్పడినప్పుడూ, పిల్లవాని జ్ఞానంలో పై మినుకూ, అస్థిరత్వమూ ద్యోతకమైనప్పుడూ యీ పదబంధాలు తరచుగా వల్లించబడుతూ వుంటాయి. పై చదువుకి అవసరమైన ప్రత్యేక జ్ఞానమూ, మెలుకువలూ పిల్లలకి యివ్వలేదని ప్రాథమిక పాఠశాలనే తరుచుగా నిందిస్తూ వుంటారు.

మొట్టమొదటగా ప్రాథమిక పాఠశాలలో యెలా చదవాలి అన్నది పిల్లలకి బోధిచాలని అనుభవం తెలియచేస్తోంది. యాన్ అమోస్ కమేన్‌స్కీ (1592-1670), కె.డి. ఉషీన్‌స్కీ, ఫె. ఎ. డిస్టెర్‌వేగ్ (1790-1866) సరిగ్గా దాన్ని గురించి రాశారు. యిది ఆచరణలో ఉపాధ్యాయుని అనుభవాన్ని రుజువుచేస్తుంది. ప్రాథమిక పాఠశాల ముఖ్యమైన కర్తవ్యాల్లో ఒకటేమిటంటే స్థిరమైన జ్ఞానమూ, మెలుకువలూ పిల్లలకి యివ్వడం. చదివే సామర్థ్యం, జ్ఞాన సాధనకి సంబంధించిన కొన్ని మెలుకువలని యిముడ్చుకుని వుంటుంది: చదివే, రాసే నేర్పునీ, చుట్టూ వున్న ప్రపంచ పరిశీలనా సామర్థ్యాన్నీ, ఆలోచించే సామర్థ్యాన్ని, ఆలోచనలని మాటలలో వ్యక్తంచేసే సామర్థ్యాన్నీ యిముడ్చుకుంటుంది. యీ మెలుకువలూ, సామర్థ్యాలూ జ్ఞాన సాధన ఉపకరణాలు. అవి లేకుండా జ్ఞానం ఆపోశన పట్టడం అసాధ్యం.

ప్రాథమిక తరగతుల్లోని పిల్లలికి బోధించడానికి తయారవుతూ నేను పిల్లలు యేవి క్షుణ్ణంగా తెలుసుకోవాలో, వాళ్లేం చెయ్యగలరో నిశ్చయింప ప్రయత్నించాను.

కాని ప్రాథమిక తరగతులకు సంబంధించిన యీ కర్తవ్యాలు వీటితో పరిమితులై పోకూడదు. ప్రాథమిక పాఠశాలలో పిల్లలతో వ్యవహరిస్తున్నామన్న సంగతి ఒక్క క్షణం కూడా మనం మరిచిపోకూడదు.

యేడునుంచి పదకొండుదాకా వయసు పిల్లలున్న నాలుగు ప్రాథమిక తరగతుల్లో వ్యక్తిత్వం రూపు తీసుకోవడం జరుగుతుంది. యీ క్రమం ప్రాథమిక తరగతులు పూర్తి చెయ్యడంతోనే సమాప్త మవదనుకోండి, కాని కచ్చితంగా యీ సంవత్సరాలే మానవ అభివృద్ధి తాలూకు గాఢమైన దశ. యీ కాలంలో పిల్లవాడు భవిష్యత్తులో విజయవంతంగా అధ్యయనం చెయ్యడానికి జ్ఞానాన్నీ సామర్థ్యాలనీ పోగుజేసుకోవడమే కాదు, ఒక వైవిధ్య భరితమైన ఆసక్తులు గల ఆంతరంగిక జీవితం కూడా పిల్లవాడికి వుండాలి. ప్రాథమిక పాఠశాల సంవత్సరాలు మొత్తం నైతిక, బుద్ధిపరమైన, ఉద్రేకపరమైన, శారీరకమైన, సౌందర్యాత్మకమైన అభివృద్ధి కాలం. పిల్లవాడు నిత్యమూ సంపద్వంతంగా జీవిస్తూ, వూరికే రేపటి జ్ఞాన

సాధనకోసం సాము చేస్తున్నట్టుగాకుండా వున్నప్పుడే అది వట్టి మాటలుగా గాక నిజమైనది అవుతుంది.

మా దేశవు పాఠశాలల్లో వేలాది శ్రేష్ఠమైన ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులున్నారు. వాళ్లల్లో ప్రతి ఒక్కరూ పిల్లవాడికి పూరికే జ్ఞానజ్యోతులే కాదు, బోధకులు, నిజమైన గురువులు. సోవియట్ యూనియన్‌లో ప్రాథమిక పాఠశాల సార్వత్రిక సెకండరీ విద్యకి స్థిరమైన పునాది. చాలా ప్రాథమిక పాఠశాలల్లో, ముఖ్యంగా యెనిమిదేళ్లు, పదేళ్లు పాఠశాలల్లోని ప్రాథమిక తరగతుల్లో పెద్ద లోపాలున్న సంగతి గురించి మనం చెప్పకపోలేం. కొన్ని స్కూళ్లలోని ప్రాథమిక తరగతుల పిల్లల్ని చూస్తే జాలేస్తుంది: పిల్లవాడు పెద్దగోతాం మోస్తూ వుంటాడు, ఉపాధ్యాయుడు తనకి చేతనైనంత మట్టుకి అందులో కుక్కుతూ వుంటాడు. ఆ కుర్రాడు నిర్దేశిత గమ్యానికి, అంటే మధ్య తరగతుల్లోనూ, పై తరగతుల్లోనూ చదవడం అనేదానికి చేరుకోవడం ఆ గోతాం మొయ్యడంలోనే వుందని భావించి ఉపాధ్యాయుడు తరచుగా అందులోనే జీవిత పరమార్థాన్నీ, కుర్రవాడి కార్యకలాపాల్నీ చూస్తాడు.

ప్రాథమిక పాఠశాల విద్యార్థికి స్థిరమైన జ్ఞానరంగాన్ని యివ్వాలి. ఆ విషయంలో యే స్పష్టత లోపించినా, అయోమయం వున్నా ప్రాథమిక పాఠశాలని మాత్రమే కాదు, తర్వాత వచ్చే చదువులోని లింకుల్ని కూడా బలహీన పరుస్తుంది. కచ్చితమైన జ్ఞానరంగం, మెలుకువలు, పిల్లవానికి యివ్వవలసిన ఆచరణాత్మక నిపుణతలు నిర్ణయించుకోకుండా స్కూలు అనేదేలేదు. చాలా బళ్లలోని ప్రాథమిక అధ్యయనపు తీవ్రమైన లోపాల్లో ఒకటేమిటంటే ఉపాధ్యాయుడు పిల్లవాడు యే సూత్రాలూ, నిర్వచనాలూ క్షుణ్ణంగా తెలుసుకోవాలీ, ఒకటో తరగతిలో యేం గుర్తు పెట్టుకోవాలి, రెండో తరగతిలో యేం గుర్తు పెట్టుకోవాలి, మూడో తరగతిలో యేమిటి, యే మాటలు వర్ణ క్రమం సరిగా గుర్తుంచుకోవాలీ అన్న వాటిని ఉపాధ్యాయుడు పట్టించుకోకపోవడమే. పిల్లవాని మేధాభారం తగ్గించడానికని కొంతమంది ఉపాధ్యాయులు పిల్లవాడు కొన్నింటిలో, ఆసక్తి పెంచుకుని, వాటి గురించి తెలుసుకోవడమే కాకుండా, వాటిని కంఠస్థం చేసి యెప్పటికీ అలా జ్ఞాపకం వుంచుకోవాలన్న విషయాన్ని మర్చిపోవడమే. ప్రస్తుత కాలంలో ప్రాథమిక పాఠశాల విద్యార్థి సామాన్య అభివృద్ధిని గురించి చాలా చెప్పబడుతోంది. సామాన్యాభివృద్ధి అధ్యయనంలోనూ పెంపకంలోనూ ముఖ్యమైన అంశమే కావచ్చు. కాని స్థిరమైన దీర్ఘకాల ధారణా, సామాన్యాభివృద్ధీ విధిగా అవసరమయే ఆ పునాది జ్ఞానం అంతే ముఖ్యం. యెందుకంటే సామాన్యాభివృద్ధి అంటే నిరంతర జ్ఞాన సాధన. అందుకని ఒకడికి చదివే నేర్పు విధిగా వుండాలి.

ప్రాథమిక పాఠశాలకి వుండే అన్ని ముఖ్యమైన కర్తవ్యాల మాటా ఎలా వున్నా ఉపాధ్యాయుడు నాడీ మండలం రూపుతీసుకునే చురుకైన దశలో వున్న వ్యక్తితో వ్యవహరిస్తున్నాడన్న మాట మనం మరిచిపోకూడదు. పిల్లవాని మెదడు జ్ఞానం

ఆకళింపు చేసుకోడానికీ, ధారణకీ, విషయ పరిజ్ఞానం గుప్తపరచుకోడానికీ ఉపాధ్యాయునికోసం తయారై వున్న సజీవమైన యేర్పాటని అనుకోకూడదు. యేడు, పదకొండు యేళ్ల మధ్య వయసులో పిల్లవాని మెదడు త్వరితంగా అభివృద్ధి చెందే క్రమంలో వుంటుంది. మనిషి నాడీమండల అభివృద్ధిని గురించి జాగ్రత్త వహించాలని ఉపాధ్యాయుడు మరిచిపోతే అధ్యయనం అనేది పిల్లవాడిని బంద బారుస్తుంది.

అధ్యయనం అనేది యెడతెగని జ్ఞాన సముపార్జన కానక్కరలేదు. మొద్దు బారిపోయి నిశ్చేష్టులయే నిరంతర ధారణా శిక్షణ కానక్కరలేదు, పిల్లవాని మానసిక అభివృద్ధికీ, ఆరోగ్యానికీ హానికరమైన, యెవడికీ అవసరంలేని కంఠస్థం కానక్కర్లేదు. పిల్లవాని అభివృద్ధికి దోహదంచేసి, మనస్సుని పరిపుష్టం చేసి పిల్లవాని ఆంతరిక జీవితంలో భాగంగా అయేటట్టు అధ్యయనాన్ని తయారుచేద్దామని నేను ప్రయత్నించాను. మా విద్యార్థులకి అధ్యయనం అనేది కంఠస్థం చెయ్యడం కాదు, సంపూర్ణ వికాసంకల మేధా జీవితం. అది వాళ్లని ఆటల అద్భుత కథల సౌందర్య, సంగీత, కల్పనాత్మక, సృజన్మాతక ప్రపంచంలోకి నడిపించేదిగా వుంటుంది. మా పిల్లలు ఈ ప్రపంచంలో ప్రయాణీకులుగా, ఆవిష్కర్తలుగా, సృష్టికర్తలుగా వుంటారు. పరిశీలించడం, ఆలోచించడం, శ్రమ సంతోషాన్ని అనుభవించడం, ఒకడు తను సృష్టించే దానిపట్ల గర్వంగా వుండటం, మనుషులకు సౌందర్యం, ఆనందం కలిగించడం – అందుకు సంతోషం పొందడం, ప్రకృతి సౌందర్యాన్ని, సంగీతాన్ని, కళను మెచ్చుకోవడం, యీ సౌందర్యంతో తన ఆంతరంగిక జీవితాన్ని పరిపుష్టం చేసుకోవడం, యితరుల కష్టసుఖాలని గురించి బాధపడి అవి తనవిగానే భావించడం – యివీ నా బోధనాత్మక ఆదర్శాలు. వీటితోబాటుగా పిల్లలు విధిగా యేమి తెలుసుకోవాలి? అనే కచ్చితమైన, సూటిగా నిర్వచించిన లక్ష్యం కూడా నేను మనసులో వుంచుకోవాల్సి వచ్చింది: యే మాటలు వాళ్లు రాయడం, ఎప్పటికీ మర్చిపోకుండా వుండటం నేర్చుకోవాలి? యే లెక్కల సూత్రాలు వాళ్లు ధారణ చెయ్యాలి? "సంతోష చంద్రశాల" జరుగుతూ వుండగానే నేను మొదటినుంచి నాలుగవ తరగతిదాకా విధిగా తెలుసుకోవాల్సిన మాటల పట్టీ ఒకటి తయారుచేశాను.

మానసిక శ్రమ తాలూకు పద్ధతులూ, రూపాలూ, విధానాలూ చేజిక్కించుకొనే క్రమాన్ని ముఖ్యమైన కర్తవ్యం అని భావించాను. ప్రాథమిక తరగతులపట్ల చాలామంది స్కూలు డైరెక్టర్లకీ, ఇన్‌స్పెక్టర్లకీ వుండే అనుగ్రహపూర్వకమైన లాంటి దృక్పథం నన్ను చిరాకు పెట్టింది. ఇన్‌స్పెక్టరు వస్తాడు, రాగానే మధ్యతరగతులూ, పై తరగతులూ అంటేనే ఆసక్తి చూపిస్తాడు, అక్కడికి కింది తరగతుల్లో పిల్లలకి ఆటలు తప్ప, నిజమైన బోధన యేమీ లేనట్టు. కాని పిల్లాడు అయిదవ తరగతిలోకి రాగానే ఆటపట్ల మక్కువగా వుండటం అనేది, పాఠ్య విషయానికి సంబంధించి తగినంత జ్ఞానంతో లేకపోవడం భీతి చెందడంకింద మారుతుంది.

చిన్న పిల్లలతో పని చెయ్యడం మొదలు పెట్టినప్పుడు నేను ముగ్ధుణ్ణి కాలేదు. రెండో తరగతి పూర్తి చేసే నాటికి వాళ్లు ధారాళంగా, భావయుక్తంగా అర్థంచేసుకుంటూ చదవగలగాలి, చిన్న వాక్యాలు మొత్తం, పెద్ద వాక్యాలలో భాగాలూ పదబంధాలు తమ తమ కళ్లతో గ్రహించాలి. చదవడం అనేది ఆలోచన, మానసిక అభివృద్ధి ఆధారాలలో ఒకటి. అలా చదవడం, చదువుతూ వుంటే ఆలోచించడం పిల్లవాడికి బోధించాలని లక్ష్యం యేర్పరచుకున్నాను. పిల్లవాని జ్ఞాన సముపార్జనలో, ఆధ్యాత్మిక జీవితపు సంపద్వంతమైన ఆధారాలతోబాటుగా, చదవడం అనేది ఒక కచ్చితమైన సాధనం.

యీ అధ్యాయంలో 1952 ఆకురాలు కాలంనుంచి 1956 వసంతం దాకా నాలుగేళ్ల కాలంలో, ప్రాథమిక పాఠశాలలో రెండు ముఖ్య కర్తవ్యాలని నేను యెలా నిర్వహించానో చెబుతాను. ఆ రెండు కర్తవ్యాలేమిటంటే, మొదటగా, పిల్లలకి గంభీరమైన, స్థిరమైన విషయ పరిజ్ఞానం యివ్వడం, రెండోదిగా, పిల్లల బుర్రల్లోకి విషయం కూరడం తప్పించి పిల్లల ఆధ్యాత్మిక జీవిత సంపదనీ, వాళ్ల ఆరోగ్యాన్నీ గురించి జాగ్రత్త పడడం.

## ఆరోగ్యాభివృద్ధి రస్తు

బోధకుని ముఖ్య కర్తవ్యం పిల్లవాని ఆరోగ్యం గురించి జాగ్రత్త వహించడమనీ మళ్లీ మళ్లీ చెప్పడానికి నేను సంకోచించను. పిల్లల ఆధ్యాత్మిక జీవితాలు, ప్రపంచ దృక్పథాలు, స్థిరమైన జ్ఞానం, తమమీద తమకే విశ్వాసం కలగడం వాళ్ల ఉల్లాసంమీదే ఆధారపడి వుంటాయి. వాళ్లు చదువులో వున్న మొదటి నాలుగేళ్లలోనూ వాళ్లని గురించిన నా ఆందోళన ముక్కాలు మువ్వీసం వాళ్ల ఆరోగ్యానికి సంబంధించినదే అయి వుంటుంది.

పిల్లవాని కుటుంబంతో నిరంతర సంబంధం లేకుండా పిల్లవాని ఆరోగ్యం గురించి శ్రద్ధపట్టడం అసాధ్యం. నేను కుటుంబాలతో మాట్లాడిన విషయాల్లో, ముఖ్యంగా బడి మొదటి రెండు సంవత్సరాల్లోనూ, అత్యధిక భాగం పిల్లల ఆరోగ్యానికి సంబంధించినవే. నేను తల్లిదండ్రులకి చెప్పాను – పిల్లలకి యింటివద్ద చేసుకురావాల్సిన హోం వర్కు వుండదని. పాఠాలప్పుడే సూత్రాలూ, నిర్వచనాలూ కంఠతా పడతారు. యింటిదగ్గర పిల్లలు ముఖ్యంగా లోతైన విషయ అవగాహనని పెంచే అభ్యాసాలు చేస్తారు. అంతే కాకుండా, ఇంటిదగ్గర పిల్లలు చదువుతారు, బొమ్మలు గీస్తారు, ప్రకృతిని పరిశీలిస్తారు. పరివేష్టిత ప్రపంచంలోని విషయాలను గురించి చిన్న వ్యాసాలు రాస్తారు, తమకి నచ్చిన పద్యాలు కంఠస్థం చేస్తారు. యింటి దగ్గర చేసే పని అలసటగా వుండకూడదు, కాని దాన్ని పూర్తిగా తప్పించడం అసాధ్యం. అధ్యయనంలోని పద్ధతులు నిర్దోషంగా వున్నాయి కాబట్టి తరగతి బయట అభ్యాసాలు అవసరం లేదు అని న్యాయంగా వాదించలేం. యీ తర్కం

అధ్యయనంలోని నిజమైన లక్ష్యాలనీ, ధర్మాలనీ ప్రతిబింబించదు. యెందుకంటే పిల్లవాని మేధాశ్రమ నంతటినీ యేదో మూడు నాలుగు గంటల తరబడి లగ్నం చెయ్యలేం.

తమ పిల్లలు యెక్కువ సేపు బయట గడుపుతారనీ, పెందరాళే పడుకుంటారనీ, పెందరాళే లేస్తారనీ తల్లిదండ్రులు వాగ్దానం చేసారు. మొత్తం వేసవి కాలమంతానూ, వెచ్చగా వుండే ఆకురాలు కాలంలోనూ, వసంతరుతు మాసాల్లోనూ, పిల్లలు దొడ్లో పడుకోవాలి – యీ విషయంలో తల్లిదండ్రులతో ఏర్పాటు చేశాను. వాన పడకుండా వుండడం కోసమని ధాన్యం కొట్లకింద గడ్డి మిద్దెల్లో ప్రత్యేకమైన "పడక మందిరాలని" తల్లిదండ్రులు పిల్లలకి కట్టారు. పిల్లలకిది చాలా నచ్చింది. బళ్లోకెళ్లే పిల్లలున్న ప్రతి కుటుంబమూ దొడ్లో ఒక వేసవి విడిది కట్టుకోవాలి. అక్కడ పిల్లలు చదువుకుంటారు, బొమ్మలు గీసుకుంటారు, ఆడుకుంటారు. కొన్ని యేళ్లకి ముందే తల్లిదండ్రులలో యీ విషయమై ఒప్పందానికి వచ్చాను. బళ్లో వుండే పెద్ద పిల్లలు యీ ప్రయత్నంలో సాయంచేశారు.

"సంతోష చంద్రశాల"లోనే పిల్లలు ఉదయం వ్యాయామానికి అలవాటు పడ్డారు. యీ అలవాటు కొనసాగేటట్లు నేను చూడాల్సి వచ్చింది. పసితనంలోనే వ్యాయామం చేసే అలవాటు దృఢపరచాలని నా గట్టి నమ్మకం. తల్లిదండ్రులు పిల్లలకి ప్రతి రోజూ అదే సమయంలో లేవడం అలవాటు చేశారు. తాజా గాలిలో వ్యాయామం చేశాక పిల్లలు ఒళ్లు తోముకునేవాళ్లు. వేసవిలో చెరువులో స్నానంచెయ్యడం అలవాటయింది. దీనికితోడు చాలామంది తల్లిదండ్రులు దొడ్లోనే, తోటలోనే, షవర్లు యేర్పాటు చేశారు. సంవత్సరంలో అయిదు నెలలు (మే నుంచి సెప్టెంబరుదాకా) పిల్లలక్కడ స్నానం చేసేవాళ్లు. యిది యెంత గట్టి అలవాటు అయిందంటే వాళ్లు వాళ్ల యిళ్లలోనే శీతాకాలంలో కూడా రోజూ నడుము పైభాగం చన్నీళ్ళతో తోముకునేవాళ్లు.

తల్లిదండ్రుల సాయంతోటి ఆరు బహిరంగ షవర్లు యేర్పాటయాయి, ముఖ్యంగా అవసరమైన వాళ్ల వాడకానికి – తీనా, తోల్య, కోస్త్య, లరీసా, నీనా, సాష, స్లావలకి. యేదోరకమైన శారీరక వైకల్యం వున్నవాళ్లు, ఉదాహరణకి, కొంచెం వంగడమో, శరీరంలోనో ముఖంలోనో అవకరమో వున్న వాళ్లు, జిమ్నాస్టిక్కులు చేసేటట్టూ, షవరు బాత్ తీసుకునేటట్టూ ప్రత్యేక శ్రద్ధ వహించాను. మనిషి ఆరోగ్యంగా వుండడమే కాదు ఆకర్షవంతంగా కూడా వుండాలి. అందం ఆరోగ్యంతోటీ, అంగనిర్మాణ అభివృద్ధి సారూప్యతతోటీ కలిసే వుంటుంది.

శరీర భాగాల పొందికా, అనురూపత యెముకల ధాతువు ముఖ్యంగా రొమ్ముదగ్గర, మామూలుగా పరిణతి చెందడం, బాల్యంలో తీసుకునే ఆహారంమీద ఆధారపడి వుంటుంది. ఆహారంలో గనక ఖనిజ పదార్థ లోపం, ప్రధానమైన పదార్థ లోపం వున్నట్లయితే అస్థినిర్మాణ అసమ అభివృద్ధి జరుగుతుంది, యిక అది జీవితాంతం అలానే వుండిపోతుంది. దాన్ని నివారించడానికని నేను పిల్లల

ఆహారంలో అన్ని అవసరమైన విటమినులూ వుండేటట్టూ, సరిఅయిన విటమినుల, ఖనిజ పదార్థాల కలయిక వుండేటట్టూ జాగ్రత్త వహించాను.

యీ అంశానికి సంబంధించి జరిగిన యెన్నో యేళ్ల పరిశీలనా, ప్రత్యేక పరిశోధనా భయం కలిగించే విషయాలని తెలియజేశాయి: పిల్లల్లో యిరవై అయిదు శాతం బడికి వచ్చేముందు నాస్తా తినరు – ఉదయం పూట వాళ్లకి తినబుద్ధి పుట్టదు; ముప్పై శాతం మంది ఉదయం అవసరం అయిందాంటో సగం తింటారు; యిరవై మూడు శాతం మామూలు నాస్తాలో సగం మాత్రమే తింటారు; యిరవై రెండు శాతం మాత్రమే సరిఅయిన నాస్తా తింటారు. క్లాసురూమ్‌లో కొన్నిగంటల తర్వాత నాస్తా తినని పిల్లవాడి కడుపు గుర్రుమంటుంది, తల తిప్పు మొదలవుతుంది. కొన్ని గంటలు యేమీ తినకుండా స్కూల్‌నుంచి యింటికి వెళ్లిన పిల్లాడికి మామూలు ఆరోగ్యవంతమైన ఆకలి లుప్తం అవుతుంది.

ఆకలి మందగించడం అనేది మంచి ఆరోగ్యానికి మహాపీడ, రుగ్మతలకీ నీరసానికీ మూలం. దీనికి ప్రధాన కారణం యేమిటంటే యెక్కువ గంటలు తలుపులు బిడాయించిన క్లాసురూములో కూర్చోవడం, విసుగొచ్చే మానసిక శ్రమ, తాజా గాలిలో రకరకాల కార్యకలాపాలు లేకపోవడం, సామాన్యంగా తాజా గాలి కొరత అంటారు. పిల్లవాడు రోజంతా స్తంభించిన గాలిలోనే వుంటాడు. అనేక సంవత్సరాల పరిశీలనవల్ల నేను యింకో అనుకూలమైన నిర్ణయానికి వచ్చాను. తాజా గాలి రాని భవనంలో యెక్కువ సమయం కూర్చోవడం పిల్లల ఎండొక్రీన్ గ్రంధులను దెబ్బ తీస్తుంది. ఈ గ్రంధుల జీర్ణ క్రియలో ముఖ్య పాత్ర వహిస్తాయి. జబ్బులు దీర్ఘకాలికంగా కుదర్చలేనివిగా తయారవుతాయి. తీవ్ర జీర్ణ కోశ వ్యాధులు యెలాంటి వంటే తల్లిదండ్రులు ఆకలి పుట్టించడానికి సామాన్యంగా రకరకాల చిట్కాలు చేస్తారు, ముఖ్యంగా తీపి పదార్థలు యిస్తూవుంటారు. "తాజా గాలి కొరత"ని తప్పించాలంటే తగినంత తాజా గాలి వచ్చే ప్రాంతం వుంచాలి. యిది ఆరోగ్యాన్ని కాపాడడానికి యెంతో ముఖ్యమైన నిబంధనల్లో ఒకటి.

రుచికరమైన, పుష్టికరమైన ఆహారం పిల్లలకి తయారుచెయ్యమనీ, శీతాకాలానికి విటమిన్లు పుష్కలంగా వున్న పళ్లు దాచమనీ నేను తల్లిదండ్రులకి సలహా యిచ్చాను. అప్పట్లో మాకు కొన్ని తేనెపట్లు వుండేవి, శీతాకాలంలో మేము పిల్లలకి స్కూలు భోజనశాలలో తేనె యివ్వగలం.

పిల్లలు యెక్కువ సేపు ఆరుబయట వుండటం, యెక్కువ తిరగడం, శరీర వ్యాయామం చెయ్యడం, క్లాసు అయిపోయిన వెంటనే చదవడానికి కూర్చోకపోవడం పుణ్యమా అని వాళ్లకి బ్రహ్మాండంగా ఆకలి కరకర లాడిపోయేది. పిల్లలంతా కూడా పొద్దున్నే సరిపడా నాస్తా తినేవాళ్లు. స్కూల్‌కి వచ్చిం తర్వాత (పాఠాలు మొదలైన రెండున్నర గంటల తర్వాత) వాళ్లు స్కూలు భోజనశాలలో మధ్యాహ్న భోజనం చేసేవాళ్లు. పాఠాలయింతర్వాత వాళ్లు యిళ్లదగ్గర భోజనం చే.ాళ్లు (స్కూల్లో భోజనం అయిన మూడూ, మూడున్నర గంటల తర్వాత).

మధ్యాహ్నం పూట అంతా పిల్లలు యింటిదగ్గర కాని, బడిదగ్గర గాని, బయట గడిపేవాళ్లు. ఒక్క వాన కురిసినప్పుడూ మంచు కురిసినప్పుడూ వాళ్లు లోపల గడిపేవాళ్లు.

పిల్లవాని పొందికైన అభివృద్ధిలో ప్రతిదీ అంతర్గతంగా ముడిపడి వుంది. మంచి ఆరోగ్యం పిల్లవాడికి యే తరహా హోంవర్కు వుంది, దాన్ని యెప్పుడు యెలా చేస్తాడు అన్న దానిమీద ఆధారపడి వుంటుంది. యింటిదగ్గర స్వతంత్ర మేధాశ్రమ తాలూకు రసోత్సక్యం బ్రహ్మాండమైన పాత్ర వహిస్తుంది. పిల్లవాడికి చదువుమీద ఆసక్తి లేనట్లయితే, అప్పుడు చదువు ఆంతరంగిక శక్తిని కుంగదియ్యడమే కాదు, ఆంతరంగిక అవయవాల పరస్పరాధీనతకుండే సంక్లిష్ట నిర్మాణాన్ని చెడుగా పరిణమింపచేస్తుంది. చదువంటే పిల్లవాడికి అసహ్యం పుట్టినప్పుడు తీవ్రంగా అతని జీర్ణ క్రియ దెబ్బ తినడమూ, గాస్ట్రో ఇంటెస్టినల్ వ్యాధి రావడమూ జరిగిన సందర్భాలు నాకు చాలా తెలుసు.

మా ఆకురాలు కాలపు, వసంత కాలపు, శీతా కాలపు సెలవల్ని యెప్పుడూ కూడా ఆరుబయటే గడిపేవాళ్లం, ప్రకృతిలో గడిపేవాళ్లం–చిన్న యాత్రలోనో, అడివిలోనో, ఆడుకుంటూనో.... మా మొదటి శీతాకాలపు సెలవు రోజున పిల్లలంతా తమ స్కీలు తొడుక్కుని అడివిలో స్కీయింగ్ చేసేవాళ్లు. మా “సంతోష చంద్రశాల” శీతాకాలంలోలాగానే మేం మంచు కోటా, మంచు చక్రం తయారుచేశాం. పిల్లలు యువ పయనీర్లు అయాక వాళ్ల దళాలకి అడివిలో చాలా ఆసక్తికరమైన సమావేశాలు వుండేవి.

శీతాకాలంలో మా ఆరుబయలు కృషి మంచి ఆరోగ్యానికి ముఖ్యమైన ఆధారం. ఒక మాదిరి వాతావరణంలో (-10°C) యెనిమిదేళ్ల వాళ్లు వారానికి ఒకసారి రెండు గంటలు పనిచేసేవాళ్లు, తొమ్మిదీ, పదేళ్లవాళ్లు మూడు గంటలు, పదకొండేళ్లవాళ్లు నాలుగు గంటలు పనిచేసేవాళ్లు. వాళ్లు చెట్టు కాండాల చుట్టూతా పేము కట్టేసేవాళ్లు, చిన్న చక్రాల బళ్లలో ఆ మొక్కల్ని చలినుంచి రక్షించడానికి మంచు తెచ్చేవాళ్లు, యింకా అలాంటివి చేసేవాళ్లు. తాజా గాలిలో వాళ్ల పని శరీరాలని దృఢపరచడానికీ, జలుబులు రాకుండా కాపాడ్డానికీ అద్భుతమైన సాధనం అయింది.

పిల్లలు పచ్చిక మైదానాల్లో, పొలాల్లో, అడవుల్లో తిరుగుతూ వేసవి సెలవలు గడిపేవాళ్లు. ప్రకృతితోటి రెండు నెలల ప్రత్యక్ష సంబంధం వాళ్ల ఆరోగ్యం దృఢమవడానికీ, మేధాభివృద్ధికి చాలా మేలు చేసింది. మొదటి తరగతి పూర్తిచేసిం తర్వాత పిల్లలు ఆగస్టు నెలని సమష్టి వ్యవసాయ క్షేత్రపు తోటలోనూ, తేనెగూళ్ల కేంద్రంలోనూ గడిపారు. రెండో తరగతి తర్వాత సమష్టి వ్యవసాయ క్షేత్రపు పుచ్చకాయల తోటలో గడిపారు.

ఆగస్టు నెలలో ప్రకృతి ధారాళంగా పళ్లనీ ఫలాలనీ యిస్తుంది. సౌందర్య వికాసం తారస్థాయిలో వుంటుంది. యీ సమయం పండగ శ్రమతో వుంటుంది. ఆ

సమయంలో గాలి ముఖ్యంగా స్వచ్ఛంగా, నిర్మలినంగా వుంటుంది. శరీరానికి బలమిచ్చేదిగా వుంటుంది. కోసిన గోధుమ తోటీ, పండిన పుచ్చకాయల, ద్రాక్షపళ్ల, యాపిల్ పళ్లా సువాసనతో నిండినట్టుగా వుంటుంది. వేసవికీ, ఆకురాలు కాలానికీ మధ్యన గ్రామసీమలోని గాలి ముఖ్యంగా ఫైటాన్‌సైడ్లతో నిండి వుంటుంది. మీరు పిల్లల్ని శ్వాసకోశ సంబంధమైన రోగాలూ, జలుబులూ, కీళ్లవాతాలూ తగలకుండా గట్టిగా వుండేటట్టు ఆయత్తం చెయ్యదలచుకుంటే, ఆ నెల అంతా వాళ్లని ఆరుబయట వుండనివ్వండి.

ఒకసారి పిల్లలు ఓ రోజు సమష్టి వ్యవసాయ క్షేత్రపు పుచ్చకాయల తోటలో గడిపారు. వాళ్లకి పుచ్చకాయలూ, కర్బూజాకాయలూ ధారాళంగా ముట్టాయి. విశాలమైన అందమైన పచ్చికబీటిని వదలి రావడం ఇష్టం లేదు. ఆ రోజు సాయంత్రమే సమష్టి వ్యవసాయ క్షేత్రపు అధ్యక్షుడు నాలుగు కొత్త కుటీరాలని పుచ్చకాయల తోటలో కట్టమని ఆదేశాలిచ్చాడు. ఒక రోజులో కట్టడం పూర్తి అయింది. మన సెలవలు పుచ్చకాయల తోటలో గడుపుతున్నామని పిల్లలతో నేను చెప్పినప్పుడు వాళ్లు నమ్మలేదు: "వాళ్లు నిజంగా మనల్ని అక్కడ వుండనిస్తారా?" అని అడిగారు. వాళ్ల కోసం కట్టిన కుటీరాలని చూసినప్పుడే వాళ్లు నన్ను నమ్మారు. రాత్రి అక్కడ గడుపుతున్నామని విని పిల్లలు పిచ్చిగంతులేశారు. మేము కుటీరాలలో నేలంతా సువాసనతో వున్న గడ్డి కప్పాం. దుప్పట్లూ, పక్కబట్టలూ తెచ్చాం, వాష్‌స్టాండ్ ఒకటి చేశాం, పిల్లలకి ఆహారం కోసమని తల్లిదండ్రులు వంట గది కట్టారు. మొగపిల్లలు రెండు కుటీరాల్లో వున్నారు, ఆడపిల్లలు మిగతా రెండింటిలోనూ వున్నారు. వినీలాకాశంనుంచి వచ్చిన సమ్మోహక గీతంలాగా, దేదీప్యమానమైన సూర్యకాంతిలాగా, మేం పుచ్చకాయల తోటలో గడిపిన నెల రోజుల్నీ పిల్లలు యెన్నటికీ మరచిపోలేదు.

మేం ప్రభాతవేళలో లేచేవాళ్లం, ప్రకృతి పునస్సృష్టించలేని అందాన్ని ఆస్వాదించేవాళ్లం. రాత్రి కలల తర్వాత లేచి తుషారంమీద తిరిగేవాళ్లం, సెలయేటి నీటిలో కడుక్కునేవాళ్లం. ఆ నీటిని చెక్క పీపాల్లోతెచ్చి వాష్‌స్టాండ్‌లో పోసేవారు. పిల్లలకి ప్రతిదీ సంతోషమే: ఉదయం వ్యాయామాలు, చన్నీళ్ల స్నానం, టొమాటోలతోటి ఉడకబెట్టిన బంగాళాదుంపల్ని, పుచ్చకాయని తినడం అన్నీ. నాస్తా తర్వాత మేం పనిచేసేవాళ్లం: సమష్టి క్షేత్ర రైతులకి పుచ్చకాయలూ, కర్బూజాకాయలూ యేరడంలో సాయంచేసేవాళ్లం.

నగరంనుంచి పిల్లలూ, వాళ్ల తల్లిదండ్రులూ మమ్మల్ని చూడ్డానికి వచ్చేవాళ్లు. మేం గర్వంగా వాళ్లకి పుచ్చకాయల తోట చూపించి, పుచ్చకాయలనీ, కర్బూజాకాయలనీ వాళ్లకి యిచ్చేవాళ్లం. పుచ్చకాయ పండిందీ లేనిదీ చూసి చెప్పెయ్యడం పిల్లలు నేర్చుకున్నారు. పుచ్చకాయల తోట పక్కనే పువ్వులు పూచే మూలికలు పాతేం. సమష్టి వ్యవసాయ క్షేత్రపు తేనెపట్లని ఆగస్టు నెలలో అక్కడికి తీసుకువచ్చారు. అంచేత మేం అంద్రేయ్ తాతని రోజూ చూసేవాళ్లం. మా వంట

మనిషి పాషా అత్త మాకోసం వండిన భోజనమూ, పుచ్చకాయలూ తాతకి తీసుకెళ్లి యిచ్చేవాళ్లం. అంద్రేయ్ తాత మా తరగతికి తేనెటీగలున్న ఒకగూటిని యిచ్చేడు. "దీన్ని మీ బడి మడిలోకి తీసుకెళ్లండి" అన్నాడతను. పిల్లలు తేనెటీగలని ఆసక్తిగా పరిశీలించారు.

ప్రతి రోజూ పిల్లలు చెరువులో స్నానం చేసేవాళ్లు. అప్పుడు అడివిలోకి వెళ్లేవాళ్లు. లేదా అంద్రేయ్ తాతకీ, పాష అత్తకీ యివ్వడానికని అడివి పువ్వులు పోగుచేసేవాళ్లు. మధ్యాహ్నం యెండలో కుటీరాల్లోకి పోయి కునుకు తీసేవాళ్లం. కొన్ని "చిన్ని కిటికీల"ని తాజాగాలికోసం తెరిచీ, యీగలూ దోమలూ తట్టుకోలేని పువ్వుల మూలికల్ని కిటికీల్లో పెట్టి తెరగట్టేసేవాళ్లం. బయటేమో వేడిగా వుండేది, కాని లోపలేమో చల్లగా వుండేది. "సంతోష చంద్రశాల" మొదటి రోజులనుంచీ నేను పిల్లల్ని పొడిగాలికి అలవాటు పడేటట్టు చేశాను. పారిశుధ్య సూత్రాల గురించి నేర్పడం యెంత ముఖ్యమో గాలి రాని ఉక్క గది అంటే అసహ్యం నేర్పడం అంతే ముఖ్యం.

వేడి తగ్గగానే పిల్లలు పనిలోకి వెళ్లేవాళ్లు. రైతులు పుచ్చకాయల కోసం, కర్బూజాకాయల కోసం మధ్యాహ్నం వచ్చేవాళ్లు. పొద్దువాలాక, పొలాలూ, కొండలూ, పచ్చికబీళ్లూ దాసాని పువ్వులాంటి పొగమంచులో కప్పడిపోయాక, ఒకటి తర్వాత ఒకటి నక్షత్రాలు మినుకుమన్నాక, పిల్లలు ఒక గుడిసె దగ్గర పోగయేవాళ్లు. వాళ్లు ముఖ్యంగా కథలూ, అసాధారణ సాహసకృత్యాల్ని గురించీ, ప్రయాణాల గురించీ, వీర కృత్యాల గురించీ సాయంత్రం వేళలో వినాలని సరదా పడేవాళ్లు. నేను వాళ్లకి అద్భుత కథా జీవుల్ని గురించీ, మనవాళ్లు కల్పించిన వాటి గురించీ, జలకన్యల గురించీ, మంత్రగత్తెల గురించీ చెప్పేవాణ్ణి. ఆకురాలుకాలపు వనకన్య గురించీ, అది జన విశ్వాసం ప్రకారం ప్రశాంత ఆగస్టు మాసపు రాత్రిళ్లకి సారభూతవరం యెలా తెస్తుందీ దాన్ని గురించీ చెప్పాను.

రాత్రి ప్రశాంతతలో మరోసారి ముగ్ధ మోహన రాగం విన్నాం: పొలాలమీద, కొత్తగా గోధుమ కోసిన చోట, ఒక మాధుర్య స్వరం, రెల్లు గొట్టాల ధ్వని లాంటిది మోగింది. బహుశా ఒక అపరిచిత రాత్రిపక్షి గానం చేస్తోంది, కాని పిల్లల వూహాలు: ఒక దయాన్వితమైన అద్భుత ప్రాణిని అందులోనుంచి సృష్టించాయి - ఒక చిన్న పిల్లవాడు గోధుమ దండతోటి ప్రజలకి ఆనందం కలిగించడం కోసమని బూరామీద వాయిస్తూన్నాడు. పిల్లలు యీ ప్రాణిని సూర్యతనయ అని పిలిచారు. వాళ్ల దృష్టిలో సూర్యతనయ సూర్యుడికీ, సారవంతమైన భూమికీ పుట్టిన బిడ్డ. గోధుమ కంకులు యెక్కడ పనకి వచ్చినా అక్కడ మీకు సూర్యతనయ దర్శనం అవుతుంది. గోధుమ కోత అయిపోగానే, అతను కమ్మని తావులీనే గడ్డివాము దగ్గరికి పోయి సాయంత్రం పూట సంతోషకరమైన, విషాదకరమైన పాటలు పాడతాడు. శీతాకాలం సమీపించేటప్పుడు అతను సారవంతమైన జీవనదాయక రసాలు నిద్రించే వెచ్చటి నేలలోకి వెళ్లిపోవాలి. కాని మళ్లీ గోధుమ

పెరగగానే సూర్యతనయ మళ్లీ తన మధురమైన పాటలు పాడుతూ పొలాల్లో దర్శనమిస్తాడు.

పిల్లలు తరుచుగా ప్రకృతిని సాకార మూర్తిగా చేస్తున్నారనీ, ఒక మేరకి అద్భుత కల్పన వాళ్లని వాస్తవికతకు దూరం చేస్తున్నదనీ అనిపించవచ్చును. అది తప్పని అఖండం అర్పి చెప్పవచ్చును. వాస్తవానికి, జీవితాన్ని గురించీ, సత్తువ గురించీ, మానవుని గురించీ వుండే అద్భుత కథలే ప్రేరణకి అద్భుతమైన ఆధారాలు. తనలో జీవితాన్ని, సౌందర్యాన్ని, సత్తువని, పుష్కలత్వాన్ని అవతరింపచేసుకున్న మూర్తిమంత అద్భుత కథా ప్రాణి సూర్యతనయ గురించి పిల్లలు కూర్చిన పాటలో వున్నది. యిదీ వాళ్ల సాదా పాట:

"నిద్రలేపాడు సూర్యుడు భూమిని
పక్వాని కొస్తోంది గోధుమ
యెవరా బూరా వాయిస్తున్నది?
సూర్యతనయ, సూర్యతనయ.
మాయాంబరాలు దాల్చి
గోధుమ కసవుల తలపై
ధాన్యపు ముల్లుల బొమలతో
ఉల్లాసపు కనురెప్పలతో..."

పిల్లలు అద్భుత కథల చిత్రాల అనుభూతిలో వున్నప్పుడు ఒక చిత్రమైంది జరుగుతుంది: వాళ్లు యెక్కడో వినో, చదివో వున్న మాట చైతన్య అంతరాళంలోంచి దేదీప్యమానమైన రంగుల్తో మెరుస్తూ, పొలాల, పచ్చిక బీళ్ళ సువాసనతో నిండి జాగృతం అవుతుంది. పిల్లవాడు కవితాత్మక చిత్రాల్ని సృష్టిస్తాడు.

ఆరోగ్యం కోసమని ఉద్దేశించిన పేజీల్లో నేను అద్భుత కథల గురించీ, అద్భుత చిత్రాల గురించీ, పిల్లల సృజనాత్మకతని గురించీ యెందుకు మాట్లాడుతున్నానా అని మీరు నన్ను అడగవచ్చు. యిది పిల్లలకి సంతోషం కాబట్టి, సంతోషం లేకుండా ఆధ్యాత్మిక సారూప్యత, శారీరక ఆరోగ్యమూ అసంభవం కాబట్టి ఒక పిల్లవాడు, అందమైన పొలాలతోటీ, మిణుకుమనే నక్షత్రాలతోటీ, గొల్లభామ అంతంలేని పాటతోటీ, అడివి పువ్వుల సువాసనతోటీ సమ్మోహితుడై ఒక పాట కూరిస్తే దాని అర్థం, అతను శారీరక మానసిక సారూప్యతల శిఖరంలో వున్నాడన్నమాట. మానవుని ఆరోగ్యం కోసం, పిల్లవాని ఆరోగ్యం సంగతి సరేసరి చెప్పనక్కర్లేదనుకోండి, జాగ్రత్త వహించడమంటే పారిశుద్ధ్య సూత్రాలూ నియమాలూ, యేదో ఫలానా ఫలానా ఆహార విహార నియమాలూ పాటించడమే కాదు. మొట్టమొదటగా భౌతిక ఆధ్యాత్మిక శక్తుల సారూప్య పరిపూర్ణతపట్ల శ్రద్ధ చూపించడం. అలాంటి సారూప్యతకి మకుటం సృజనలోని సంతోషం.

పిల్లలు మూడవ తరగతి పూర్తిచేశాక ఆ వేసవి కూడా పుచ్చకాయల తోటలో గడిపాం. కాని యింకో చోట, ద్రాక్ష తోటకి ఆనుకుని వున్న చోట. ద్రాక్ష గుత్తుల్ని బుట్టల్లో పెడుతూ పెద్దవాళ్లకి సాయంచేస్తూ పిల్లలు తోటలో పని చేశారు. ఉదయమూ సాయంత్రమూ చెరువులో యీతలు కొట్టడానికి వెళ్లేవారు. వాళ్లొక ఆసక్తికరమైన ఆట ఆడేవాళ్లు: మూడు పడవలు తిమింగిలాలు వేటాడే నౌకలుగా వాళ్ల వూహల్లో భాసించాయి. ఆ చిన్న చెరువు ఒక మహాసముద్రం అయిపోయింది. మేం తిమింగిలాల కోసం గాలించేవాళ్లం.... మేం యిక్కడ బూరాలు చేశాం; మా సంగీత బృందం సాయంత్రాలప్పుడు సమావేశమయ్యేది. మేం జానపద గీతాలు వాయించేవాళ్లం; వేసవి సాయంత్రాల గురించి, గాలివానల గురించి, అరుణవర్ణపు ఆకాశం గురించి, పక్షుల గురించి పాటలు కూర్చాం. సంవత్సరాలు గడిచే కొద్దీ మా ఆధ్యాత్మిక జీవితాల్లోకి సంగీతం లోతుగా ప్రవేశించింది. పిల్లలు సెలవులకి యెక్కడికి వెళ్లినా సరే, ప్రముఖ సంగీతకారుల కృతుల జానపద గీతాల టేపులు వినేవాళ్లు.

నాలుగో తరగతి పూర్తి చెయ్యగానే పిల్లలు 1956 వేసవిలో ఓక్ తోపు పక్కన వున్న పచ్చిక మైదానంమీద, సరస్సు ఒడ్డున సెలవలకి విడిది చేశారు. చెట్లకొమ్మలతో వాళ్లు కుటీరాలు తయారుచేసి వాటిని గడ్డితో కప్పారు. వాళ్ల తల్లిదండ్రులు ఒక స్నానాల రేవు, వంట గదీ కట్టడంలో మాకు సాయం చేశారు. వంట మనిషికి సాయం చేసేటంతటీ, వూళ్లోకి వెళ్లి రొట్టే, బంగాళాదుంపలూ, చేపలూ, పాలూ, కాయగూరలూ తెచ్చేటంతటీ పెద్దవాళ్లయ్యారు పిల్లలు. యిరవై ఆవు దూడలనీ, రెండు గుర్రాలనీ మేం సంరక్షించాం. పిల్లలు పగలు ఆవు దూళ్లని పచ్చిక బీటిమీదకి తోలుకెళ్లేవాళ్లు. రాత్రి వాటిని సరస్సుని ఆనుకుని వున్న దొడ్డిలో కట్టేసేవాళ్లు. స్వారీ చెయ్యడం ప్రతివాళ్లూ నేర్చుకున్నారు. పప్పులూ ఉప్పులూ తేవడానికి వూళ్లోకి గుర్రంమీద వెళ్లేవాళ్లు. ప్రతివాళ్లూ కాస్తదూరం దౌడుతీయిద్దామని సరదా పడతారు కాబట్టి కచ్చితమైన వంతులు పాటించాం. వోలోద్య, సాన్య, తీనా చాలా మంచి స్వారీచేసే వాళ్లయినందుకు నాకు చాలా సంతోషం కలిగింది. గుర్రంమీద స్వారీచెయ్యడం వాళ్ల ఆరోగ్యాన్ని మెరుగుపరిచింది.

ఆ సంవత్సరం పిల్లలు లోతైన సరస్సులో యీదారు, యీదడం బాగా నేర్చుకున్నారు.

గడ్డి మేటు వేసే కాలం ముఖ్యంగా సంతోషంగా వుండింది. గడ్డిని యెండబెట్టడంలోనూ మేటు వెయ్యడంలోనూ మేం పెద్దవాళ్లకి సాయపడేవాళ్లం. సాయంత్రాలప్పుడు యెత్తైన మేటు యెక్కేవాళ్లం. పిల్లలు యీ సమయాల్లో చాలా మురిసి పోయేవాళ్లు. వాళ్లు నక్షత్రాల గురించీ దూర ప్రపంచాల గురించీ వినాలనుకొనేవారు. నక్షత్రాల కప్పుమీద వుండగా పిల్లలు విశ్వంతోటి ముఖాముఖీగా వుండి నన్ను ప్రశ్నలు అడిగేవాళ్లు: "యిదంతా, భూమీ, సూర్యుడూ, నక్షత్రాలూ యెక్కడినుంచి వచ్చాయి?" ప్రకృతి సౌందర్యంపట్ల, మహౌన్నత్యంపట్లా ఆశ్చర్యమూ

వింతాతోటి అనుభూతీ హేతుబద్ధత ముప్పిరి గొన్నప్పుడు పిల్లల చైతన్యంలో యిలాంటి ప్రశ్నలు ఉద్భవిస్తాయని నాకు నమ్మకం కలిగింది.

గ్రహ కూటమిని గురించిన ఒక కథ తర్వాత పిల్లలు అడిగిన ప్రశ్నని నేను యెన్నటికీ మర్చిపోలేను: "సరే, దానంతటికీ అవతల యేమి వుంటుంది?" దృగ్గోచర ప్రపంచాల అవతల అదే విశ్వం, అసంఖ్యాక ప్రపంచాలు వున్నాయని నేను చెప్పినప్పుడు పిల్లలకి ఆశ్చర్యమైంది: "కాని ప్రపంచం యెక్కడ అంతమవుతుంది?" వాళ్లకి అసలు అవగాహనకి రానిది విశ్వపు అనంతత్వం. యీ విషయానికి చకితులై విశ్వాన్ని వూహించుకుందామనుకున్నారు కాని అలా సాధ్యపడక నిశ్శబ్దంగా వుండిపోయారు పిల్లలు. ఆ రాత్రి చాలాసేపు వాళ్లు నిద్రపోలేదు. యెక్కువమంది సూర్యుణ్ణి గురించీ, గ్రహాల గురించీ కలలు కన్నారు. పిల్లలు ఆ మర్నాడు మళ్లీ మళ్లీ తమని కలవరపెట్టిన ఆ ప్రశ్ననే అడుగుతూ వున్నారు: విశ్వం అంటే యేమిటి? బళ్లో చదువుకున్నన్నాళ్లూ యీ ప్రశ్న వాళ్లకి కొత్తగానే వుండిపోయింది.

"సంతోష చంద్రశాల"లో పిల్లలకి బోధించ నారంభించిన మొదటి వారాలనుంచీ నేను క్రీడలమీద యెక్కువ శ్రద్ధ చూపించేవాణ్ణి. పెద్ద పిల్లలు ఒక ఆట స్థలం తయారుచెయ్యడానికీ, ఒక వుయ్యాలా కట్టడానికీ మాకు సాయం చేశారు. మాకు సరిపడా బంతులుండేవి. పిల్లలు రెండో తరగతిలోకి వచ్చేటప్పటికి టేబిల్ టెన్నిస్ ఆడ్డం మొదలెట్టారు. పిల్లలు చక్రాలు విసరడం అన్నా, బంతులు యెగరెయ్యడం అన్నా, తాళ్లూ గుంజలూ యెక్కడం అన్నా అంతే యిష్టం చూపించేవాళ్లు.

పిల్లలు వేసవి కాలమంతా చెప్పుల్లేకుండానే నడిచేవాళ్లు. వానంటే భయపడేవాళ్లు కాదు. శారీరక శిక్షణకి యిది ముఖ్యమైన సాధనంగా నేను భావించాను. ఒకటి, రెండు తరగతుల్లో ముగ్గురు పిల్లలకి మాత్రమే జలుబు చేసింది, మూడు, నాలుగు తరగతుల్లో ఒక్కళ్లు కూడా జబ్బు పడలేదు.

అనేక పడిశాలకి తట్టుకోవడం అనే దాన్ని నేను ప్రత్యేకం ముఖ్యమైందిగా పరిగణించాను. దీన్ని గురించి కొన్ని యేళ్లుగా నాకు చింత వుండింది: వాతావరణం త్వరత్వరగా మారేటప్పుడు దాదాపు సగం మంది పిల్లలు తుమ్ముతూ వుండేవాళ్లు. పిల్లవానికి జ్వరం లేకపోయినా, అలాంటి నలత చేస్తే పనిచెయ్యలేడు. మరి పడిశాలకి సమూలమైన చికిత్సా లేదు. పడిసాలు అంటువ్యాధులు కావనీ, వాతావరణంలో వచ్చిన త్వరితమైన మార్పులకి చలించిపోయే సున్నిత యింద్రియ తత్వమేనని వైద్యశాస్త్రం చెప్తోంది. పాదాలు మరీ ముఖ్యంగా సున్నితంగా వుంటాయని చాలా కాలపు అనుభవం తెలియజేస్తోంది. కొంచెం చలికి పాదాలు సున్నితమైతే, అప్పుడా మనిషి అంటురోగానికి కాని పడిసానికి కాని గురవుతాడు. మా విద్యా బోధనలో అభివృద్ధి చెందిన శరీరం దృఢతరమయ్యే విధానం కాళ్లని చలికి తట్టుకొనేటట్టు చెయ్యడంతో మొదలైంది. యిది చెయ్యగలగడానికి ముందు పిల్లవాని సాధారణ ఆరోగ్య పరిస్థితిని దృష్టిలో వుంచుకోవాలి. కాళ్లని చలికి తట్టుకొనేటట్టు

చెయ్యడానికి యేదో ఒక కాలపరిమితి మేరకు చేసే ప్రత్యేకమైన వ్యాయామాలంటూ లేవు. సాధారణ సంథాని స్థిరంగా పాటించడం, పిల్లలని "ఉష్ణగృహ వాతావరణానికి" అలవాటు పడనివ్వకుండా వుండటం, శరీరపు నిరోధకతని భగ్నం చేసే అనవసర ఆందోళనలు వ్యక్తం చెయ్యకుండా వుండటం అవసరం. వేసవికాలంలో పిల్లవాడు చెప్పుల్లేకుండా తిరగలేకపోతే, తడి తువ్వాళ్ళతో తుడవటం, స్నానం యేం లాభం వుండవు.

...పిల్లలు ప్రాథమిక పాఠశాల పూర్తి చేశారు. అది సెలవుల ఆఖరి రోజు. వాళ్లు సరస్సులో యీతాలాడిం తర్వాత పచ్చిక మైదానంమీద చేరారు – దృఢంగా, ఎండకి కావి రంగు తిరిగి, అందంగా వున్నారు. వాళ్లకి పదకొండేళ్లే కాని పన్నెండేళ్ల వాళ్లల్లాగా పదమూడేళ్ల వాళ్లల్లాగా వున్నారు. ఆఖరికి చిన్న దంకో కూడా, చాలా కాలం వామనుడు అని అందరూ పిలిచేవాడు కూడా, అయిదో తరగతి వాళ్లంత పొడుగూ అయాడు.

సంవత్సరంలో కొన్ని సార్లు డాక్టరు వాళ్లని పరీక్షించాడు. ఒకటవ తరగతిలో దృష్టిదోషం వున్న వాళ్లు నలుగురు వున్నారు, రెండవ తరగతిలో యిద్దరు; మూడులో ఒక్కళ్లుకూడా లేరు. దృష్టిదోషం అనేది కంటి దోషం కాదనీ శారీరక, ఆధ్యాత్మిక అభివృద్ధిలోని వైషమ్యమేనని రుజువులు వున్నాయి. మొదటి రెండు సంవత్సరాల్లోనూ ముగ్గురు పిల్లలకి హృదయనాళ బలహీనత వుందని తేలింది; యిద్దరికి ప్లూరసీ అవశేష ఫలితాలున్నాయని తేలింది; యిద్దరికి బ్రాంకైటిస్ వుందని తేలింది; ఒక కుర్రాడికి గుప్త క్షయ వుందని తేలింది. ,వాళ్లు ప్రాథమిక పాఠశాల పూర్తి చేసే నాటికి ఒక్క పిల్లాడికి మాత్రమే హృదయనాళ బలహీనతా లక్షణాలు ద్యోతక మయ్యాయి, అవేనా పాఠశాల మొదటి రెండు సంవత్సరాలంత తీవ్రంగానూ లేవు.

## అధ్యయనం – ఆధ్యాత్మిక జీవితంలో ఒక భాగం

పిల్లలు బడి ప్రారంభించక ముందే వాళ్లని చుట్టి వుండే ప్రకృతి, ఆట, అందం, సంగీతం, కల్పన, సృజన గల అద్భుత ప్రపంచాన్ని తరగతిగది లోపల మూసేసి వుంచకూడదనేది ముఖ్యం. పాఠశాల జీవితంలోని మొదటి మాసపూ, సంవత్సరపూ అధ్యయనాన్ని ఒకే రకమైన కార్యరంగంగా మార్చివెయ్యకూడదు. పిల్లవాడికి అంతకు ముందున్న సంతోషాలే ఉపాధ్యాయుడు ధారాళంగా అందిస్తే పిల్లవాడు స్కూల్‌ని ప్రేమిస్తాడు. పిల్లలకి విసుగు పుట్టకుండా వుండటం కోసమని చెప్పి వాళ్ల సంతోషానికి అనుగుణంగా చదువుని తిప్పెయ్యడమూ, ఉద్దేశపూర్వకంగా చదువుని తేలికబరచడమూ ఉపాధ్యాయుడు చెయ్యకూడదు. కొంచెం, కొంచెంగా పిల్లవాణ్ణి అతిముఖ్యమైన జీవిత పార్శ్వానికి సిద్ధంచెయ్యాలి – మానసిక కృషి లేనిదే అసాధ్యమయ్యే గంభీరమైన, పట్టుసడలని, ఓపికైన శ్రమకి సిద్ధం చెయ్యాలి.

పిల్లల్లో కష్టించి పనిచేసే అలవాట్లనీ, సృజనాత్మక బౌద్ధిక శ్రమనీ క్రమేపీ నాటడం ముఖ్యమైన బోధనాత్మక కర్తవ్యంగా నేను భావించాను. చుట్టూతా వున్న ప్రపంచంనుంచి ఆ క్షణంలో పిల్లవాడు విడిపోగలిగి, తన మానసిక శ్రమని తను గాని తన ఉపాధ్యాయుడు గాని నిర్దేశించుకున్న లక్ష్యానికి మళ్లించగలిగి వుండాలి. నేను పిల్లలకి అలాంటి యేకాగ్రత అలవాటు చెయ్యాలన్న ప్రయత్నం చేశాను. అప్పుడు మాత్రమే బౌద్ధిక శ్రమ యిష్టమైన కార్యకలాపం అవుతుంది.

విద్యార్థులకి క్రమేపీ శారీరకమైన కష్టాలనే కాక, మానసికమైన కష్టాలని కూడా అధిగమించడం ప్రాథమిక పాఠశాల నేర్పాలి. మానసికమైన ప్రయత్నంతోటీ, వస్తువుల్లోనూ, వాస్తవాల్లోనూ, ప్రకృతి ఘటనలలోనూ అనేకమైన సంక్లిష్టతలతోటీ, సున్నిత విషయాలతోటీ, వివరణలతోటీ, వైరుధ్యాలతోటీ నిండిపోయి వున్న బౌద్ధిక శ్రమ అంతస్సారాన్ని పిల్లలు అర్థంచేసుకోవాలి. అధ్యయనం సులభతరం చెయ్యాలని చెప్పి యెట్టి పరిస్థితుల్లోనూ పిల్లవాడికీ శ్రమని తప్పించకూడదు. జ్ఞాన సముపార్జనతో బాటుగా స్వతంత్ర బౌద్ధిక క్రమశిక్షణ పెంచబడుతుంది. మేధాబోధన ఆధ్యాత్మిక జీవిత రంగాల్లో ఒకటి. అందులో బోధకుని ప్రభావం స్వయం శిక్షణతోటి శరీరంలా కలిసి వుంటుంది. సంకల్ప శిక్షణ అనేది తన ముందున్న లక్ష్యాల మానసిక నిర్వహణతోనూ, మేధాశక్తిని యేకాగ్రత చేసుకోవడంతోనూ, విషయాన్ని అర్థంచేసుకోవాలన్న ప్రయత్నంతోనూ, సంయమనంతోనూ అరంభమవుతుంది. కష్టం అనే మాటకి అర్థం యేమైందీ పిల్లలు మేధాశ్రమతోటే తెలుసుకోవాలని నేను అనుకున్నాను.

పిల్లవాడు స్కూల్లో చేసేది ప్రతీదీ సులభమే అయిపోతే, అతని మానసిక క్రియ కొంత కాలానికి సోమరిదైపోతుంది. అతను జీవితం అంటే చులకన భావం యేర్పరుచుకుని పుచ్చిపోతాడు. యిది కొంచెం వింతగా కనిపించవచ్చు గాని, సోమరి ఆలోచన తరుచుగా ప్రతిభావంతులైన పిల్లల్లోనే సంభవిస్తుంది, అధ్యయనంలో కష్టం అధిగమించడం అనేది లేనట్లయితే. సోమరి ఆలోచన తరుచుగా ప్రథమ శ్రేణి వాళ్లలోనే పెరుగుతుంది. యెలాగంటే మిగతా పిల్లలకి మానసిక శ్రమతో కూడిందాన్ని, తెలివైన కుర్రాడు సునాయాసంగా నేర్చేసుకుంటాడు. మరింక చక్కర్లు కొడుతూ వుంటాడు. పిల్లవాణ్ణి పనిలేకుండా వూరికే కూర్చోబెట్టి వుంచకూడదనేది యేకైక విద్యా కర్తవ్యం.

మా మొదటి తరగతి ఒక ప్రత్యేక చిన్న భవనంలో వుండేది. మేం చదువుకునే విశాలమైన, వెలుతురు బాగా వచ్చే గదికి తూర్పునా, దక్షిణానా కిటికీలుండేవి. అంచేత గదిలోకి ధారాళంగా సూర్యరశ్మి వచ్చేది. కిటికీ అవతల బాదంకాయ చెట్లు వుండేవి. వాటి అవతల యాపిల్, పియర్, యాప్రికాట్ చెట్లూ, యింకా దూరంలో ఓక్ తోపూ వుండేవి. మా భవనమే కాకుండా మిగతా పాఠశాల భవనాల చుట్టూతా కూడా పచ్చిక వుండేది. ఆ చెట్ల ఆకులు గాలిని ప్రాణవాయువుతో నింపేవి. స్కూలు ఆవరణలో యెప్పుడూ ప్రశాంతంగానే వుండేది.

మా బడిగది నానుకుని పొడుగాటి పసారా వుండేది. దాని ద్వారం యింకో భవనంలోకి దారిగా వుండేది. యిక్కడ మేం అద్భుత కథల గది ఏర్పాటు చేయాలని కలలు కనేవాళ్లం.

మా భవనం ముందు ఒక సిమెంటు చదరం వుండేది. అక్కడ నిలవ చెయ్యబడిన వాననీళ్లతో చెప్పులు కడుక్కోడానికి జాగా వుండేది. ఆ చదరంనుంచి, అటుయిటూ శఫ్తాల చెట్లూ, వేప చెట్లూ, బాదం చెట్లూ వున్న బాటలు వుండేవి. ఒకదారి స్కూల్ పెరట్లో మధ్యన వున్న ద్రాక్ష తీగల పొదరిళ్లలోకి వెళ్లేది. యింకోటి మా సమీప పొరుగువాళ్లు, అయిదవ తరగతి వాళ్లుండే గదికి పోయేది. మరో బాట పచ్చిక మైదానాల్లోకీ, తోపుల్లోకీ వెళ్లేది. నాలుగోది బాగా పెరిగిన దుబ్బుల లోయలోకి పోయేది.

మొదటి తరగతీ, రెండో తరగతీ వేరే భవనంలో చదవడం నాకు సబబుగా తోస్తుంది. వాళ్లకి, ముఖ్యంగా మొదటి తరగతిలో, వాళ్ల ప్రత్యేకమైన అధ్యయన, శ్రమ, వినోద కార్యక్రమం వుంది. పెద్ద తరగతులకి వుండే ప్రత్యేక లక్షణమైన అల్లరీ, కేకలూ చిన్న పిల్లలకి కూడనివి. పూర్తి మేధాభివృద్ధికి అవసరమైన ప్రశాంతతా వరాన్ని సాధ్యమైనంత కాలం చిన్న బడి పిల్లల్ని అనుభవించనివ్వండి. బడి మొదటి కొద్ది రోజుల్లోనూ పిల్లవాణ్ణి దిమ్మ పట్టేటట్టు చేస్తుందని యెన్నో యేళ్ల నా పరిశీలన నాకు తెలియజేసింది. నిరంతర గందరగోళం, అరుపులూ, పరిగెత్తడాలూ వల్ల పిల్లలు అలసి పోయినంతగా బౌద్ధిక శ్రమ వల్ల అలసిపోరు. అయిదు సంవత్సరాలుగా మొదటి తరగతి వాళ్లని దీర్ఘ విరామ సమయంలో నేను పరిశీలించాను. అరగంటపైగా పిల్లలు కేకలూ, అరుపులూ, తోసుకోవడాలుతోటి బడి మొత్తంగా గందరగోళంగా వున్నారు. విరామం అయిపోయింది. పిల్లలు క్లాసులకి తిరిగివచ్చారు. అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులకి కూడా మొదటి పది నిమిషాలూ పిల్లల్ని సద్దుబాటు చెయ్యడంలోనే వృధాగా పోయాయి. మొదటి తరగతి పిల్లలు తమ చిన్న గ్రూపులోనే విరామం తీసుకున్నప్పుడు పూర్తి భిన్నంగా వుంది. ఆవేశంగా వున్న పిల్లలని సద్దుబాటు చెయ్యడానికి రెండు నిముషాలకంటే ఎక్కువ పట్టదు.

అదుపులేని అరుపులూ పరుగులూ బడికి శ్రేష్ఠం కాదు. పిల్లవాళ్ల సంతోషం యెంత లోతైన నది అంటే దాని ఉద్రేకాలూ, కాంక్షలూ అదుపులో పెట్టే గట్టు వుండాలి.

ప్రస్తుతంలో మా ఒకటి, రెండు తరగతుల పిల్లలు హాయిగా, యేకాంతంగా, చుట్టూతా పచ్చిక వుండే భవనంలో చదువుకుంటున్నారు. పిల్లలకోసం సృష్టించబడిన వాతావరణం పని విరామం ఒకదాంతో ఒకటి బదలాయించుకోడానికి పహకరిస్తుంది.

మొదటి వారాల్లో నేను పిల్లల్ని క్రమేపీ కొత్త జీవితంలోకి నడిపించాను. చదువుకోవడం అనేది ప్రధానంగా "సంతోష చంద్రశాల"తో విభేదించలేదు, నేను దాన్ని అలా వుంచి ప్రయత్నించాను. సెప్టెంబరు నెలలో మేము నలభై నిముషాలకి

మించి గదిలో లేం, అక్టోబరులో రెండు గంటలకి మించీనీ. ఆ వ్యవధి రాసే దానికీ, లెక్కలకీ కేటాయింపు అయిపోయింది. మిగిలిన రెండు గంటలూ మేం బయటే గడిపేవాళ్లం. పిల్లలు, మేం తరగతిలో పనిచేసే వాటిని పిలిచినట్టు నిజమైన పాఠాల కోసం ఆతృతగా నిరీక్షించేవాళ్లు. యీ కోరిక అంటే నాకు సంతోషం వేసి అనుకున్నాను, "మీ సహవిద్యార్థులు ఉక్కగా వుండే తరగతి గదంటే విసుగెత్తిపోయి యెప్పుడు విరామానికి గంటకొడతారా అని చూసే సంగతి మీకు తెలిసే వుంటే...."

పూర్తి వృత్తిపరమైన, నైతిక, భౌతిక మానసిక బోధన కోసమని పిల్లల్ని తరగతిగది అధ్యయనానికి సిద్ధం చెయ్యడంలో క్రమక్రమంగా వుండటమనేది ఒక ముఖ్య నిబంధన. అంతిమ లక్ష్యం యేమిటంటే, మానవునికి అనేక రకాల పరిస్థితుల్లో పని చేసేటట్టు నేర్పించడం. తరగతిగది పాఠాలు యేదో యిష్టమున్నా లేకపోయినా భరించాల్సి వచ్చే తప్పని సరి చెడేం కాదు. అది బౌద్ధిక శ్రమకి యెంతో అనుకూలమైన పరిస్థితి. కాని పిల్లవాణ్ణి దానికి క్రమంగా సిద్ధం చెయ్యాలి యిందులోనే చిన్న బడిపిల్లలకి అవసరమైన ప్రత్యేకతలున్నాయి. తిన్నగా క్లాసు రూమ్‌లోనే నాలుగ్గంటలూ వాళ్లచేత పని చేయించేస్తే, అధ్యయనానికి అనుకూలంగా వుండే వాళ్ల ఆరోగ్యం వికటిస్తుంది.

తరగతిలో మేం బాలశిక్షలు చదివాం, వృత్తాలు గీశాం, గీతలు గీశాం, అక్షరాలు రాశాం, లెక్కల్ని చేశాం. యిదంతా కూడా బహుముఖ ఆధ్యాత్మిక జీవితానికి వాళ్లని విసుగుతోటి అలసట పెట్టకుండానే పిల్లల్ని క్రమేపి తీసికెళ్లింది. బాలశిక్షనుంచి ఒకే విషయాన్ని పదేపదే చదవనవసరం లేకపోయింది. యేమంటే పిల్లలకి వర్ణమాల తెలుసు కాబట్టి. చదివే నేర్పు కోసమని నేను అనేక క్రియాత్మక మార్గాలు అనుసరించాను. పిల్లలు ప్రకృతిని గురించి చిన్న వ్యాసాలు తయారుచేశారు. అది వాళ్ల చదివే సామర్థ్యాన్ని, ఒకటే పాఠాన్ని అదే పనిగా చదివే దానికంటే యెక్కువగా, అభివృద్ధి చెయ్యడానికి సహకరించింది.

ప్రతి పిల్లవాడూ అవసరమైనంత చదివే నేర్పుని సాధించేటట్టు జాగ్రత్త పడ్డాను. అభ్యాసాలూ లేక నిర్ణీతమైన పని ప్రమాణాలూ లేనట్లయితే చదవడం బోధించడంలో మనకేమీ ఫలితాలు దక్కవు. వూరికే అక్షరాలు తెలుసుకోవడం చాలదు: పిల్లలు లఘు, దీర్ఘాక్షరాల్ని చదవడమూ, మాటల్ని చదవడమూ నేర్చుకోవాలి. చదవడం అనేది ప్రపంచానికి తెరిచిన కిటికీ, దాన్ని ధారాళంగా, వేగంగా చెయ్యాలి. అప్పుడు మాత్రమే యీ సాధనం క్రియకి అయత్తమవుతుంది. పిల్లల్ని అనేక కార్యకలాపాల్లో యిమడ్చడానికి నేను ప్రయత్నించాను – భావాత్మకంగా చదవడం, రాయడం, బొమ్మలు గీయడం అనేవి. చదవడాన్ని ఒకరకంగా దానంతటదే జరిగే క్రమంగా మారేదిగా ముందుకు తీసికెళ్లడానికని అలా చేశాను. అలా అయితే రెండోతరగతికి వచ్చే నాటికి వాళ్లు యెక్కువ ధ్వనులున్న మాటల్ని ఒకే మొత్తంగా గ్రహించగలరనీ అలా చేశాను. ప్రకృతిని గురించిన చిన్న కథలు రాయడం చేయించినా, పిల్లల్లో యీ పనంటే సజీవ ఆసక్తి, కలిగించేటట్టు చేసినా,

లక్ష్యాన్ని చేరుకోవడానికి అవసరమైన "బోధనాత్మక పద్ధతి" గానే యిది ముఖ్యమైంది. ఆ లక్ష్యం పిల్లలకి బాగా చదవడం నేర్పడం.

పాఠాలు జరిగేటప్పుడు పని తాలూకు అనేక రూపాలు అలాంటి ఒక పద్ధతిగా పరిగణించవచ్చును. తరగతిగదిలో గడిపే మొదటి గంటలు పూరికే రాతకోతల్లోనే వుండనక్కర్లేదని అనుభవం తెలియజేస్తోంది. అదే రకం పని విద్యార్థుల్ని త్వరగా అలిసిపోయేటట్టు చేస్తుంది. పిల్లలు అలిసిపోతున్నారనగానే నేను యింకో రకం పని చేపట్టేవాణ్ణి. చిత్రలేఖనం అనేది పని మార్పుకోసం శక్తివంతమైన సాధనం. పిల్లలు అలిసిపోతున్నట్టు గమనించగానే, నేను అనేవాణ్ణి: "పిల్లలూ, మీ డ్రాయింగు పుస్తకాలు తీసుకోండి, యిప్పుడు మన చదివే కథని గురించిన బొమ్మ గీద్దాం." అలసట తాలూకు చిహ్నాలు పిల్లల్లో మటుమాయం అయిపోయి సంతోషపు కాంతులు మెరిసేవి. విసుగొచ్చే పనిని సృజనాత్మకతగా మార్చడం జరిగేది.... లెక్కల పాఠాలప్పుడు కూడా అలాగే చేసేవాణ్ణి. నేను వాళ్లకి యిచ్చిన లెక్క బోధపరుచుకోడానికి కష్టంగా కనిపిస్తే సృజనాత్మకతని బయటపడెయ్యడానికి చిత్రలేఖన వుండనే వుండేది. పిల్లలు ఆ సమస్యని మళ్లీ చదివి, గీసేవాళ్లు. అప్పటిదాకా దురవగాహాస్పదంగా వున్నవి తేటతెల్లమైపోయేవి... అదే పనిగా వినడం కూడా పిల్లలకి విసుగు తెప్పిస్తుంది. పిల్లల కళ్లు జడంగా తయారవుతున్నాయీ అని కనిపెట్టగానే, నేను కథ తెంచేసి, దాన్ని ముగించేసే వాణ్ణి. అప్పుడు మేం బొమ్మలు గీయ్యడం మొదలెట్టేవాళ్లం.

స్కూల్ సంవత్సరం ప్రారంభమైన మూడు వారాల తర్వాత ప్రకృతిని గురించి కూర్చిన బొమ్మలన్నిటినీ ఒక పుస్తకంలో చేర్చారు. పై తరగతుల పిల్లవాళ్లు ప్రతి పిల్లవాడికీ దళసరి అట్ట నోటుపుస్తకం ఒకటి తయారుచేసి యిచ్చారు. అందులో యిరవై కాగితాలు వుండేవి. అట్టకి పెన్సిలు ఒకటి కట్టేసేవాళ్లు. వారానికి ఒకసారి మేం ఆలోచనా భాషల ఆధారాలకి వెళ్లి ఒక బొమ్మ గీసేవాళ్లం – చుట్టూతా వున్న ప్రపంచాన్ని గురించి ఒక కథ. మా మొదటి "యాత్ర" ఆలస్యంగా పక్వానికొచ్చే యాపిల్ పళ్ల తోటలోకి. అక్కడ యాపిల్ పళ్లు పెరుగుతున్నాయి. పిల్లలు తమ వ్యక్తిగత స్పర్శల, భావాల ప్రపంచం ప్రతిబింబించే కథలల్లారు.

"వంగి నేలకి నమస్కరిస్తున్న యాపిల్ పళ్లు," "యాపిల్ పళ్లు సూర్యాతప స్నానం చేస్తున్నాయి," "ఆకుపచ్చని పత్రాల్లో యెర్రటియాపిల్ పళ్లు, యాపిల్‌ని సూర్యుడు లాలిస్తున్నాడు, కొమ్మ కదలిస్తోంది." "వసంత రుతువులో తెల్లని పువ్వులు, ఆకురాలుకాలంలో బంగారు యాపిల్ పళ్లు," "యాపిల్ పళ్లని చూడ్డానికి వెళ్లాం మేము" అంటూ పిల్లలు తమ ప్రకృతిని గురించిన పుస్తకాలలో రాశారు. పిల్లలు తాము రాసిన చిన్న వ్యాసాలని క్లాసులో చదివేవాళ్లు. అది వాళ్లకి చాలా సంతోషం యిచ్చేది. తోటలో చదవడం అనేది దానికదే లక్ష్యం కాదు. చిన్న వ్యాసాలు కూర్చడం అనేది పిల్లల్ని భవిష్యత్‌లో ఓపికైన, గంభీరమైన బౌద్ధిక శ్రమకి సిద్ధంచేసే అద్భుతమైన సాధనం. మొదటి తరగతిలోనూ, ముఖ్యంగా రెండవ తరగతిలోనూ,

ప్రతి అబ్బాయికీ, అమ్మాయికీ సొంత రాతపని వుండేటట్టూ వాళ్లు దాన్ని నిర్వర్తించేటట్టూ చూశాను. మానసిక శ్రమలో క్రమశిక్షణ నేర్పడానికి యిది చాలా ముఖ్యం.

చదువు మొదటి సంవత్సరంలో బొమ్మల పుస్తకాలన్నీ చిత్రలేఖన అభ్యాసాలతోటే నిండిపోయాయి. స్నోబాల్ బెర్రీ యెర్రటి గుత్తుల గురించీ, కోత కాలం గురించీ, నిద్రించే సరస్సు గురించీ (సరస్సు నిద్రపోతోందని వాళ్లు అన్నారు, బహుశా యెందుకంటే మేం అక్కడికి వెళ్లిన ప్రతిసారీ నీళ్లు అద్దంలాగా శుభ్రంగా, ప్రశాంతంగా వుండేవి), యెలా స్కూలు తోటలో పిల్లలు పనిచేసారో దాన్ని గురించీ, ప్రభాత సమయంలో అరుణాకాశాన్ని గురించీ, ఆకురాలుకాలపు మొదటి మంచు గురించీ, ఆకురాలు కాలపు వానగా, మబ్బుగా వుండే రోజుల గురించీ, మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవ వార్షికోత్సవ సందర్భంగా వేడుకల గురించీ, మొదటి హిమపాతాన్ని గురించీ, జనవరి నెలలోని మంచు తుఫానుల గురించీ, ఫిబ్రవరిలో మంచు కరగడం గురించీ, మంచుమీద మార్చి నెలనాటి నీలి నీడల గురించీ, మొదట విరిసే పువ్వుల గురించీ, ఉష్ణప్రాంతాలనుంచి చాలా ముందుగానే వచ్చి మార్చి మంచు తుఫానుల దెబ్బకి గురి అయిన మైనాపిట్టల గురించీ, వలస పక్షుల వసంతరుతు సంతోషపు మందల గురించీ (వసంతరుతు సంతోషపు మందలు అనేది పిల్లవాళ్ల మాటే), అడివి పూలకి వీడ్కోలుచెప్పి, ఆకురాలు కాలపు రోజుల్లో విహరించే తేనెటీగల గురించీ పిల్లలు రాశారు.

ప్రకృతిని గురించిన బొమ్మల పుస్తకాలు మాకు అద్వితీయమైన కావ్యాది అయింది. అందులో చుట్టూ వున్న ప్రకృతి వర్ణాల సున్నిత స్వనాల ప్రతిబింబాలు, భూమ్యాకాశాల సంగీతం, మాటల మధురిమ కానవస్తాయి. అవి పిల్లలకి యెంత సంతోషదాయకమైనవంటే అది లేకపోతే వాళ్ల ఆంతరంగిక జీవితాల్లో చదువుకి స్థానమే వుండేది కాదు.

పిల్లలు తరగతి గదిలో గడిపిన కాలాన్ని మనం పాఠాలకింద విభజిస్తే స్కూల్లో గడిపిన మొదటి రెండు నెలల్లోనూ రోజుకో పాఠం అయింది మాకు; మూడు నాలుగు నెలల్లో – రెండు; అయిదు ఆరునెలల్లో – రెండున్నర; యేడవ యెనిమిదవ నెలల్లో – మూడు. మొదటి రెండు నెలల్లోనూ పాఠాలు అరగంట వుండేవి, ఆతర్వాత నలభై అయిదు నిముషాలు. యే పిల్లాడేనా విశ్రాంతికి ముందే క్లాసు అవతలికి పోదలచుకుంటే ఉపాధ్యాయుడి అనుమతి తీసుకుని వెళ్లేవాడు. ఉపాధ్యాయునికి అంతరాయం కలిగించడం అసంభవం అయితే, పిల్లవాడు వూరికే లేచి నిలబడేవాడు. పిల్లవాడు అవతలికి వెళ్లాలేమోనని ఉపాధ్యాయుడు చూపుల్తోనే అనుమతి యిచ్చేవాడు. యెక్కువమంది పిల్లలు యే యిబ్బందీ లేకుండా అలవాటు పడిన యీ పద్ధతికి, కొంతమంది పిల్లలు అలవాటు పడడం కష్టమైంది. తోల్యా కాత్యా కోస్త్య షూరలు త్వరగా అలిసిపోయేవాళ్లు. పాఠాలప్పుడు కదలకుండా కూర్చునే ప్రయత్నం వాళ్లని మహా యిరుకు పెట్టింది, యేమంటే తమ స్వేచ్ఛా

కదలికకి వొక ప్రత్యేక పద్ధతి బంధం అయినట్లనిపించింది. వాళ్లనుకునే ప్రతిదానికీ నేను సందు యివ్వను కదా. పిల్లలంతా డస్కుల దగ్గర సీరియస్‌గా పనిచేస్తూ కూర్చోడానికి అలవాటు పడాల్సిందే. కాని నేను పిల్లల కోరికలూ, అలవాట్లూ మరీ కఠోరంగా పాడు చెయ్యలేను కదా. పాఠాల మధ్యలో కొన్ని వారాలు వాళ్ల కిష్టం వస్తే బయటికి వెళ్లడానికి అనుమతి యిచ్చాను, క్రమేపీ వాళ్లని డస్కుల దగ్గర కూర్చుని పనిచేసేదానికి అలవాటుపరుస్తూ. స్కూలు ఆరంభమైనాక మూడు నాలుగునెలల తర్వాత పిల్లలంతా కూడా స్కూల్ కార్యక్రమం పూర్తి చెయ్యగలిగారు.

యెండగా వుండే ఆకురాలు కాలపు రోజుల్లో, మేం "ఆకుపచ్చ తరగతిగదిలో" ఒకదాంటో, పొడుగాటి యాపిల్ చెట్ల మధ్య పచ్చగడ్డి మీద కూర్చుని చదివేవాళ్లం. కొన్ని ఏళ్ల ముందే పెద్ద విద్యార్థులు యీ భవిష్యత్ "ఆకుపచ్చ తరగతి" కోసమని చట్రం కట్టి, దానిమీద తీగలూ, యినప వూచలూ బిగించి నిర్మించడంలో నాకు సాయపడ్డారు. చుట్టూతా మొక్కల్ని మేం పాతం. రెండేళ్లల్లో "ఆకుపచ్చ తరగతిగది" తయారైంది. ఆ మొక్కలు కప్పుగా కూడా తయారయ్యాయి. కొన్ని చిన్న కిటికీనుంచి సరిపోయేటంత వెలుతురు వచ్చేది. వేడిగా వుండే రోజుల్లో అక్కడ చల్లగా వుండేది. ఆకురాలు కాలంలో వెచ్చగా హాయిగా వుండేది. "ఆకుపచ్చ తరగతిగది"లో యెప్పుడూ ప్రశాంతంగానే వుండేది. ఆ "కిటికీలని" ద్రాక్ష హాప్ తీగలతోటి ముయ్యగలం. అప్పుడు సగం చీకటైపోయి, సూర్యకిరణాలు ద్రాక్ష తీగలగుండా లోపలికి వస్తూ చిత్రమైన వెలుతురూ నీడల క్రీడగా వుండేది. పిల్లలు దాన్ని "అద్భుత కథల కోసం కిటికీ మూయడం" అనేవాళ్లు. అక్కడ చదువుకోడానికీ, రాసుకోడానికీ, లెక్కలకీ చిన్ని బల్లలూ, ముక్కాలి పీటలూ వుండేవి.

రెండో "ఆకుపచ్చ తరగతిగది" ఒక పచ్చిక మైదానం. అది మూడు వేపులా చలికి తట్టుకొనే తరహా ద్రాక్ష తీగలతో మూసుకుని వుండేది. మరీ వేడిగా వున్నప్పుడు – మా ప్రాంతంలో వసంత రుతువులోనూ, ఆకురాలు కాలంలోనూ వేడిగా వుండటం కొత్తేంకాదు – అక్కడ చల్లగా వుండేది.

కనుమ దగ్గర్లోనే ఒక మారుమూల తోపులో చెట్ల మధ్యన మాకు యింకో "ఆకుపచ్చ తరగతిగది" వుండేది. స్కూల్ భవనం దగ్గరికి దేనికోసమూ వెళ్లే పని లేనప్పుడు ఒక్కొక్కప్పుడు మా ఆఖరి పాఠం కోసం అక్కడికి వెళ్లేవాళ్లం. సంవత్సరంలో నేను నలభై శాతం పాఠాలు స్కూల్ భవనంలో కంటే యీ "ఆకుపచ్చ తరగతిగదుల్లో"నే చెప్పాను, ఆ మిగిలిన అరవై శాతంలోనూ కొంచెం చెప్పుకోదగ్గ భాగం "ఆకుపచ్చ లేబరేటరీ" లేదా స్కూల్ గ్రీన్‌హౌస్‌లో జరిగాయి. "ఆకుపచ్చ లేబరేటరీ" చెట్లతోటీ, ద్రాక్ష తీగలతోటీ చుట్టూ అల్లుకుని వున్న ప్రత్యేక భవనం. మొక్కలతోటీ పువ్వులతోటీ నిండిన అధ్యయనపు గది అది.

మా పాఠాలలో గణనీయమైన భాగం ప్రకృతిలో, తాజా గాలిలో, వినీలాకాశంకింద జరగడం మా పిల్లలకి ముఖ్యం. సంవత్సరం పొడుగునా వాళ్లు ఉల్లాసంగా ఉండేవాళ్లు. యెప్పుడూ యిళ్లకి తలనొప్పితో వెళ్లేవాళ్లు కాదు.

పాఠాలైపోయిం తర్వాత పిల్లలు యిళ్లదగ్గర ఆడుకొనేవాళ్లు. పిల్లలు స్కూలులో యెక్కువ పని చేసేసి, అలిసిపోయి యిళ్లకి పోయి, చదువు తర్వాత విశ్రాంతి తీసుకోదానికి యెన్ని చర్యలో తీసుకోబడ్డాయి. పాఠాల తరువాత పిల్లలు అక్కడి లాంటి తీవ్రమైన మానసిక శ్రమ చెయ్యకూడదని చాలా యేళ్ల అనుభవం నాకు నమ్మకం కలిగించింది. అలాగే పసివానిని పనిలో ముంచెత్తెయ్యడం కూడా సరైంది కాదు. స్కూల్లో మూడు నాలుగు గంటల బౌద్ధిక శ్రమ తర్వాత, మళ్లీ యింటిదగ్గర తీవ్రంగా పని చేసేట్టు గనక చేస్తే అది పిల్లవాడికి ఆదాయానికి మించిన బరువౌతుంది.

హోం వర్కు తప్పదు. పిల్లవాడు మానసిక శక్తుల్ని కేంద్రీకరించడమూ, శ్రద్ధపట్టడమూ నేర్చుకోవాలి. కాని యిది మొట్టమొదలుగా స్కూలు పాఠాల్లోనే జరగాలి, క్రమక్రమంగా స్వతంత్ర బౌద్ధిక శ్రమ అలవాట్లకి శిక్షణ యిస్తూ. శ్రద్ధగా పని చెయ్యడమూ, యేకాగ్రత నేర్చుకోవడమూ పిల్లలకి సులభం కాదు. అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుడు యే యితర ప్రత్యేక ఉపాయాల సహాయమూ లేకుండా వూరికే పాఠంలో వుండే విషయంతోటే పిల్లవాడి శ్రద్ధని తన కథలతోటీ వివరణలతోటీ "ఆకట్టేస్తాడు." పసితనంలో బౌద్ధిక శ్రమని క్రమబద్ధం చెయ్యడం అంటే పిల్లవాడు శ్రద్ధగా ఉపాధ్యాయుడు చెప్పేది వినేటట్టు చెయ్యడంలో వుంటుంది. యేం చెప్పారో దాన్ని గురించి ఆలోచించడమూ, జ్ఞాపకం వుంచుకోవడములో వుంటుంది. అలా చెయ్యడంలో శ్రమకి గురవుతున్నామని మొదట్లో గమనించకపోవడంలో వుంటుంది.

యిందులో గనక బోధకుడు నెగ్గితే తన ఆసక్తిని పెంచిన ప్రతిదాన్నీ, మరీ ఆశ్చర్యం కలిగించే ప్రతిదాన్నీ పిల్లవాడు గుర్తుంచుకుంటాడు. మా పిల్లలకి వర్ణమాలని చదవనూ, రాయనూ, నేర్చుకోవడం అంత సులభం యెందుకైంది? యెందుకంటే వాళ్లు అలా చెయ్యాల్సి వుందే అన్న లక్ష్యం వాళ్ల ముందు వుంచకపోవడంవల్ల. యెందుకంటే ప్రతి అక్షరమూ ఒక బొమ్మకి రూపం, ఒక ఆశ్చర్యకర అనుభూతిని ప్రేరేపించింది. నేను పాఠశాలాత్పూర్వపు పసిపిల్లలకి ప్రతిరోజూ "కొంచెం జ్ఞానచూర్ణం" యిచ్చి ప్రతి అక్షరమూ చూపించి వాళ్లు గుర్తుంచుకోవాలని నిర్బంధించి వున్నట్లయితే నేను యేమీ సాధించలేకపోయి వుండేవాణ్ణి. అలా అని పిల్లవాడికి చెప్పకుండా మన గమ్యం యేమిటో దాచమని అర్థం కాదు. పిల్లలు వూరికే గమ్యాన్ని గురించి ఆలోచించకుండా వుండేటట్టుగా వాళ్లకి బోధించాలి. అప్పుడది వాళ్ల మానసిక ప్రయత్నాన్ని సులభతరం చేస్తుంది. యిది పైకి కనిపించేటంత తేలిక కాదు. పిల్లవాని ఒక ప్రత్యేకమైన మానసికాభివృద్ధి దశని గురించి, శాస్త్రవేత్తలు నాడీమండల శైశవ దశ అని పిలిచేదాన్ని గురించి మనం మాట్లాడుతున్నాం. యీ వయసులో బడికి వచ్చే వయసు పిల్లలు, ముఖ్యంగా చదువులో మొదటి తరగతి వాళ్లు, వూరికే దృష్టి కేంద్రీకరించలేరు. ఉపాధ్యాయుడు

పిల్లవాని శ్రద్ధని ఆకర్షించాలి, మనస్తత్వ శాస్త్రంలో అనిచ్ఛాపూర్వక శ్రద్ధ అని పిలిచేదాన్ని జాగృతం చెయ్యాలి.

పసివాని దృష్టి చపలంగా వుంటుంది. అది గూటి దగ్గరికి తీసుకొద్దామని ప్రయత్నించేకొద్దీ యిట్టే భయపడి దూరం పారిపోయే పక్షిలాంటిది. పక్షిని అందుకుంటే దాన్ని చేతిలోనో, పంజరంలోనో పెట్టగలం. అది పంజరంలో చిక్కినట్టైతే దాన్నుంచి పాటలేం రావు. చిన్న పిల్లవాని దృష్టీ అంతే: దాన్ని బందీగా వున్న పిట్టలాగా పడితే అది చాలా నీరసమైన సహకారి మాత్రమే అవుతుంది.

తాము పిల్లలకి పాఠాలప్పుడు "యెడతెగని మానసిక కృషి పరిస్థితి" కల్పించడం ఒక విజయంగా భావించే ఉపాధ్యాయులున్నారు. అదే తరుచుగా పిల్లలకి వాళ్ల శ్రద్ధని కళ్లెంపట్టి బిగించే బహిర అంశంగా కూడా వుంటుంది. జాగ్రత్తగా వినమనే యెడతెగని హెచ్చరికలు, ఓ తరహా పనినుంచి యింకో తరహా పనికి త్వరితమైన మార్పులు, పాఠానికి సంబంధించిన వివరణ అయిపోగానే వెంటనే యెంత అర్థమైందో సరిజూసుకోవడం (యింకా కచ్చితంగా చెప్పాలంటే పిల్లవాడు శ్రద్ధగా చెప్పేది వినకపోతే పరీక్ష తప్పించేస్తామన్న బెదిరింపులు) పాఠాలు వివరించడం అయిపోయిన వెంటనే యేదో ప్రాక్టికల్ అభ్యాసం విధిగా యివ్వడం.

పైకి చూడ్డానికి యీ పద్ధతులన్నీ క్రియాత్మకమైన బౌద్ధిక శ్రమ అన్న భావం కలిగిస్తాయి: కెలెడోస్కోప్‌లో మాదిరీ పని మారుతూవుంటే పిల్లలు ఉపాధ్యాయుని ప్రతిమాటా మనసు లగ్నంచేసి వింటారు, క్లాసురూమ్‌లో అప్రయత్నపూర్వకమైన ప్రశాంతత యేర్పడుతుంది, కాని దీనికోసం యేశ్రమ అవసరం? దాని ఫలితాలు యేమిటి? శ్రద్ధగా వుండాలనీ, యేదీ వదులుకోకూడదనీ యెడతెగని ప్రయత్నం, కాని ఆ వయసులో పిల్లవాడు యింకా శ్రద్ధ పట్టలేడు - అలిసిపోతాడు, నలిగిపోతాడు. అతని నాడీమండలం నీరసించిపోతుంది. పాఠాలప్పుడు ఒక్క నిముషం కూడా వృధా చేసుకోకుండా వుండటం, మేధాశ్రమ లేకుండా ఒక్క క్షణం కూడా వుండకపోవడం - విద్యాబోధన లాంటి సున్నితమైన దాంట్లో యింతకంటె మూర్ఖత్వం యింకేమైనా వుంటుందా? అలాగే ఉపాధ్యాయుని పనిలోని యేకలక్ష్యం, పిల్లవాళ్లనుంచి వీలైనంత పిండెయ్యడం అనేది కూడా అంతే మూర్ఖం. ఆలాంటి "కార్యసాధక" పాఠాల తర్వాత పిల్లలు యింటికి అలిసిపోయి వెడతారు. వాళ్లు చిరాగ్గా చిర్రుబుర్రులాడుతూ వుంటారు. వాళ్లకి విశ్రాంతీ, ఆట అవసరం, కాని వాళ్లకి యింకా చెయ్యాల్సిన హోంవర్కు వుండిపోతుంది. సంచీలో, నోటుపుస్తకాలని చూస్తే వాళ్లకి అసహ్యం కలుగుతుంది.

యెంతో దుష్ప్రవర్తన, పిల్లలు ఉపాధ్యాయులపట్లా తమలో తామూ పెడసరంగా వుండటం, కేకలేస్తే పొగరుమోత్తనంగా సమాధానం చెప్పడం, తత్ఫలితంగా యెన్నో స్పర్థలు రావడం, ఇదంతా పిల్లవాని నాడీమండలం మీద యెంతో బరువు పడిపోయివున్న కారణంగా జరుగుతుంది, మరి ఉపాధ్యాయుడు కూడా యంత్రమేం కాదు - యీ ప్రయత్నాలద్వారా పాఠం అంతసేపూ పిల్లవాని

దృష్టిని "యెక్కువ కార్యసాధకమైన స్థాయిలో" వుంచడానికి, కెలెడోస్కోప్‌లో మాదిరీ విషయాన్ని మార్చేయడానికీ. యిదంతా జరగడం యాదృచ్ఛిక మేం కాదు. పిల్లలు తరుచుగా పాఠాలయాక యిళ్లకి మబ్బుగా, చిరాగ్గా, దేన్నీ పట్టించుకోకుండా లేదా తద్వ్యతిరేకంగా, తీవ్రమైన కోపంతో పోవడం అనేది కూడా యాదృచ్ఛిక మేం కాదు.

పిల్లల దృష్టి యేకాగ్రతని, మానసిక కార్యకలాపాలని అంత మూల్యం తగలేసి పొందే ప్రయత్నం చెయ్యకూడదు. విద్యార్థుల, ముఖ్యంగా పసివాళ్ల, మానసిక శక్తి, నరాల సత్తువ అంతులేకుండా నీరు తోడుకునే అడుగులేని బావి కాదు. యీ నూతిలోనుంచి మీ కవసరమైందాన్ని తెలివిగా, కాస్త వెనకముందులు చూసి తీసుకోవాలి, అన్నిటినీ మించి పిల్లవాని నరాల సత్తువ ఆధారాలని యెడతెరిపిలేకుండా మీరు భర్తీ చేస్తూ వుండాలి. యీ ఆధారాలు యేమిటీ అంటే వస్తువులనీ, ప్రకృతి ఘటనలనూ పరిశీలించడం; ప్రకృతి ఒడిలో జీవించడం, ఆసక్తి కలిగించే లాంటిది చదవడం, క్లాసులో పాఠాలడుగుతారేమోనన్న భయంకంటే తనే యేదో తెలుసుకోవాలనే కోరిక వుండడం, సజీవ ఆలోచనలకీ భాషకీ ఆధారాలైన వాటికి "యాత్రలు" జరపడం.

స్కూల్ సమష్టిలో యేదో మిథ్యాత్మకమైంది వుంది. దాన్ని ఆధ్యాత్మిక సమతూనిక అనచ్చు. యీ భావంలో యీకింది వాటిని నేను చేరుస్తున్నాను: జీవిత పూర్ణత్వాన్ని గురించి పిల్లల అనుభూతి, ఆలోచనాస్పష్టత, స్వశక్తి పై విశ్వాసం, కష్టాలని అధిగమించగల అవకాశాలమీద విశ్వాసం. ఆధ్యాత్మిక సమతూనికలోని విలక్షణమైనవి యేమంటే, ప్రయోజనపుష్ట శ్రమలోని ప్రశాంతత, సమమైన, సౌహార్దమైన ఆంతర సంబంధాలు వుండడం, చిరాకులూ, పరాకులూ మృగ్యంకావడం. ఆధ్యాత్మిక సమతూనిక లేకుండా పనిచెయ్యడం అసాధ్యం; యీ సమతూనిక బెడిసిందంటే సమష్టి జీవితం నరక ప్రాయమవుతుంది. పిల్లవాళ్లు ఒకళ్లనొకళ్లు తిట్టుకొని చిరాకుపడుతూ వుంటారు. నరాల దుర్బలత్వం యింక స్కూల్లో పెత్తనం చలాయిస్తుంది. యే పద్ధతి ద్వారా ఆధ్యాత్మిక సమతూనికని కల్పించవచ్చు, అంతకంటే యింకా ముఖ్యంగా, కాపాడవచ్చు? యిక్కడున్నది చాలా సున్నితమైన బోధనాంశం అని ఉత్తమ ఉపాధ్యాయుల అనుభవం నాకు నమ్మకం కలిగించింది. అది ఆధ్యాత్మిక శక్తిలో కుదుపూ, తొందరా, ఆందోళనా లేకుండా వుండే నిరంతర ఆలోచనా కార్య తత్పరత.

ఆధ్యాత్మిక సమతూనికకి సహృదయ, పరస్పర సహకార వాతావరణం, విద్యార్థులు తాము చేయగల పనిలో మానసిక సామర్థ్యాల పొందిక వున్న వాతావరణం వుండాలి. యెంతోమంది ప్రాథమిక ఉపాధ్యాయుల సమతూనిక గల ప్రముఖుల బోధనాత్మక కళని నేను జాగ్రత్తగా అధ్యయనం చేశాను. నా అభిప్రాయంలో అత్యంత తెలివిపరులైన వాళ్ల "రహస్యాలని," అదే సమయంలో, చాలా సహజమైందాన్నీ, తేటతెల్లం చెయ్య ప్రయత్నించాను. వాళ్ల విద్యార్థులందరూ తమ శక్తివంచన లేకుండా అధ్యయనం చేశారు. ఉత్తమమైన విద్యార్థిగా

వుండగలవాడెవ్వడూ మా బళ్లో సగటు విద్యార్థిగా వుండలేదు. అలాంటి తరగతుల్లోని సగటు విద్యార్థులు తామేదో శాపగ్రస్తులమని భావించుకోరు, వాళ్ల మిత్రులు కూడా వాళ్లని యేదో అనుగ్రహపూర్వకంగా చూడరు.

యెక్కువ మార్కులు కాంక్షించే వ్యామోహం గురించి నాకు ఆందోళన వుండేది - యీ వ్యామోహం యింటిదగ్గర పుడుతుంది, ఉపాధ్యాయులు దాన్ని పట్టుకుంటారు. యిది విద్యార్థుల పసి మనసుల మీద వాళ్లని విరిచేసే అధికభారం మోపుతుంది. పిల్లవాడికి మొదటి మార్కులు తెచ్చుకునే శక్తి సామర్థ్యాలు వుండవు. కాని తల్లిదండ్రులు అవి సంపాదించాలని కాంక్షిస్తారు, కనీసం దాని తర్వాతి మార్కులైనా. దురదృష్టవంతుడెవడైనా సగటు మార్కులు పొందితే, అతను న్యూనతగా బాధపడతాడు. యిది అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులైతే జరగదు. ఉత్తమ విద్యార్థులు యేదో వరం పొందినట్టూ అనుకోరు, సగటు విద్యార్థులు అల్పత్వ భావనలవల్ల కుంగిపోనూ కుంగిపోరు. యీ అసలైన బోధకులనుంచి నేను తెలివైన, యేకాగ్రతగల మానసిక శ్రమ నిజమైన నైపుణ్యం నేర్చుకున్నాను. నేను వాళ్లల్లో సూక్ష్మమైన బోధనాకళ లక్షణాన్ని గమనించాను: పిల్లల మనస్సుల్లోనూ, హృదయాల్లోనూ విజ్ఞాన సంతోషపు మేధానుభూతిని జాగృతం చేసే సామర్థ్యం. యీ ఉపాధ్యాయుల విద్యార్థుల్లో ఒక్కళ్లల్లో కూడా సత్యావిష్కరణ, పరిశోధన కలిగించే సంతోషపు అధ్యాత్మికమైన వెల్లువని ఉద్దీపించకుండా యే విజయమూ, అతి కనీసమైందైనా కూడా, లేదు. యీ అనుభవజ్ఞులైన ఉపాధ్యాయుల తెలివి అనే ముత్యాలనుంచి క్రోడీకరించుకుని, నేను పిల్లల్ని మార్కులకోసం కాకుండా, ప్రేరణ కలిగించే మేధానుభూతుల అనుభవ కామనతోటి పని చేయించడానికి ప్రయత్నించాను. మా విద్యార్థుల సమష్టిలో యెన్నో యెక్కువ మార్కులకోసం యావగాని, సగటు మార్కుల పట్ల కలవరపడ్డంగాని లేకపోయినందుకు నాకు చాలా సంతోషమైంది.

ప్రతివారమూ మేము పరిశీలన కోసమైన "యాత్రలకి" కొన్ని పాఠాలు కేటాయించాం. అవి పరిశీలనకి సంబంధించిన ప్రత్యక్ష భాషతో, ప్రకృతితోటి ప్రత్యక్ష సంబంధంతో కూడి వుండేవి. అలాంటిది లేకుండా పిల్లవాని మానసిక సామర్థ్యాల తటాకమూ, నరాలసత్తువా త్వరలోనే యిగిరిపోతాయి. ఆకురాలు కాలంలోని వెచ్చగావుండే వాతావరణంలోనూ, వసంత రుతువులోనూ, వేసవిలోనూ సూర్యోదయానికి యెంతో ముందుగానే మేం యాత్రలు మొదలెట్టే వాళ్లం. పల్లెటూళ్ల పిల్లలు చాలా పెందలాళే లేస్తారు. ప్రకృతిని గురించిన కథలూ, చుట్టూ వున్న ప్రపంచంలోని వస్తువుల, విషయాల గురించిన కథలూ పిల్లలలో కుతూహలాన్ని రేకెత్తించాయి. నేను యెన్నో ప్రశ్నలకి జవాబు చెప్పాల్సి వచ్చేది. కొన్నిటిని చెబుతాను: సూర్యుడు పొద్దున్నే యెర్రగానూ, మిట్ట మధ్యాహ్నం తెల్లగానూ యెందుకు వుంటాడు? మేఘాలు యెక్కణ్ణుంచి వస్తాయి? డాండెలియన్ పువ్వులు ఉదయం వికసించి మధ్యాహ్నానికి యెందుకు ముడుచుకుపోతాయి? ఉరుములూ మెరుములూ

ఎలా, ఎందుకు వస్తాయి? పడమటి గాలి వాననీ, తూర్పు గాలి అనావృష్టినీ యెందుకు తెస్తాయి? పొద్దుతిరుగుడు పువ్వు తల సూర్యునికేసే యెందుకు తిప్పుతుంది? – అదేమన్నా మనిషిలా చూడగలదా? యినుము యెందుకు తుప్పు పడుతుంది? పావురాళ్లు చెట్లమీద యెందుకు యెప్పుడూ వాలవు? ఆకులున్నప్పుడు చెట్లని వేసవిలో మరోచోట యెందుకు నాటలేం? జారిపడే నక్షత్రాలు యెక్కడ పడతాయి? యెవరో కాగితంనుంచి కత్తిరించినట్టుగా మంచు తునకలు యెందుకంత అందంగా వుంటాయి? పక్షులు అంతదూరం పోవాల్సినా తమతమ దారి యెలా కనుక్కుంటాయి? చందమామ చుట్టూతా తెల్లని గుడి యెక్కణ్ణుంచి వస్తుంది? సూర్యుడు ఉదయించేటప్పుడూ అస్తమించేటప్పుడూ ఆకాశం యెందుకు యెర్రగా వుంటుంది? తేనె కోసం యెగిరి వెళ్లేటప్పుడు తేనెటీగలు యెందుకు "నాట్యం చేస్తాయి"? చెట్లు పూసేటప్పుడు వాళ్లు యెందుకు గడ్డిని తగలబెడతారు? అడివిలో ప్రతిధ్వనులు వినిపించడం యెలా జరుగుతుంది? యింద్రధనస్సు యేమిటి? శీతాకాలంలో ఉరుములూ, మెరుపులూ యెందుకు లేవు? ఉప్పునీరు మరీ చలిగా వున్నప్పుడే యెందుకు గడ్డకడుతుంది? చెవుల పిల్లి యెందుకు కంతలు తవ్వుతుంది? కుందేలు ఎందుకు తవ్వదు? పాల కూజాకి వేసవిలో తడిగుడ్డని చుడితే చాలా వేడిగా వున్న రోజున కూడా పాలు యెందుకు వెచ్చబడవు? స్వాలో పక్షులు వాన కురిసే ముందు భూమికి దగ్గరగా యెందుకు యెగురుతాయి? భరద్వాజ పిట్టలు పొలాల్లో యెందుకు గూళ్లు కట్టుకుంటాయి, పెడిసె పిట్టలూ గిజిగాళ్లూ చెట్లలో యెందుకు కట్టుకుంటాయి? బాతులు యీదడం కోళ్లు యీదలేకపోవడం యెలా జరుగుతుంది? విమానం యివాళ పొగ జాడ యెందుకు వదిలింది, నిన్న యెందుకు వదల్లేదు? నక్షత్రాలు ఆకాశంనుంచి యెందుకు జారిపడతాయి, యెక్కడ పడతాయి? యెందుకని గాలి సుడిగుండంలా ధూళిస్తంభాలు నిర్మిస్తుంది? యెందుకని విల్లోచెట్లు "యేడుస్తాయి"? పువ్వులు వసంతరుతువు తొలిరోజుల్లోనే యెందుకు వికసిస్తాయి? శీతాకాలపు గోధుమని ఆకురాలు కాలంలోనూ. వసంతరుతువు పంటల్ని వసంతరుతువులోనూ ఎందుకు వేస్తారు? మిణుగురు పురుగులు యెందుకు మెరుస్తాయి? ఆవు ఒక్క దూడనే యెందుకు యీనుతుంది, పంది మందగా యీనుతుంది? సూర్యుడు యెందుకని వేసవిలోయెత్తుగానూ, శీతాకాలంలో దిగువగానూ వుంటాడు? మంచుకట్టిన కిటికీ అద్దాలమీద అందమైన రేఖలు యెందుకున్నాయి? ఆకురాలు కాలంలో ఆకులు యెందుకు పండబారతాయి?

నేను ప్రతి ప్రశ్నకీ జవాబు చెప్ప ప్రయత్నించాను. అలా చెయ్యడంలో పిల్లలకి ప్రకృతికి సంబంధించిన విషయాల సారాన్ని వెల్లడించడమే కాకుండా వాళ్ల జిజ్ఞాసనీ, ఆతృతనీ యింకా రెచ్చగొట్టాలని ప్రయత్నించాను. పిల్లల ప్రశ్నలకి జవాబులూ, చుట్టూతా వున్న ప్రపంచం గురించిన సంభాషణలూ మొదటి ఆలోచనా పాఠాలు. ప్రశ్నల్లో కొన్నిటికి యెలా సమాధానం చెప్పుకుపోవాలో నాకు తెలీదు. పైకి ప్రశ్న యెంత తేలిగ్గా కనిపిస్తే జవాబు చెప్పడం అంత కష్టమైంది. నేను ప్రాథమిక

పాఠశాలోపాధ్యాయుల్ని ముఖ్యంగా పిల్లల "తాత్త్వికా" సందేహాలకి యెలా జవాబు చెప్పాలా అనే సలహాకోసం సంప్రదించాను. పిల్లల ఆలోచనా మయసభని గురించి చర్చిస్తూ మేం సాయంత్రానికి సాయంత్రాలే గడిపాం. ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయుల అనుభవం - వాళ్లంతా పిల్లల ఆలోచనని గురించి కృషిచేసిన సిద్ధహస్తులు - నాకు నమ్మకం కలిగించింది యేమిటంటే తేలిగ్గా స్పష్టంగా కనిపించిన దాంట్లో పెద్ద కష్టాలే తచ్చాడుతున్నాయని. "శీతాకాలపు గోధుమని ఆకురాలు కాలంలోనూ వసంతరుతువు పంటల్ని వసంతరుతువులోనూ యెందుకు వేస్తారు?" అన్న ప్రశ్నకి జవాబు చెప్పడం ఓరకంగా పడిపోయే నక్షత్రాల గురించీ ఉల్కల గురించీ అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పడం కంటే కష్టం. ప్రకృతి ప్రపంచంలోకి "యాత్రలు" వస్తువులకీ, విషయాలకీ మధ్యన వుండే కార్యకారణ సంబంధాలు గమనించడమూ, ఆధారభూతమైన వాటిని చూడ నేర్చుకోవడమూ ముఖ్య బోధనా కర్తవ్యంగా వుండేటట్లుగా వుండాలని చూశాను.

ఆఖరి పాఠాలప్పుడు గనక ప్రకృతిలోకి "యాత్రలు" సంభవిస్తే, అదయిపోయాక మేం ఆడుకునేవాళ్లం. పిల్లలు సమూహపు ఆటల్ని వాళ్లం తట వాళ్లే తయారుచేసేవాళ్లు. ప్రకృతి అంతా అద్భుత కథలతోటి అల్లుకుపోయి వుండేది. పిల్లలు ముగ్ధులై మురిసిపోయిన ఒక ఆట యిది. దాని పేరు "మాయాద్వీపం కోసం వేట." మేం అంతా రెండు గ్రూపులుగా విడిపోయాం. ఒక గ్రూపు అడివిలో దూరంగా ఓ మూల వుంటారన్న మాట. మేం ఆటస్థలాన్ని మాకు మాత్రమే తెలిసిన గుర్తులతోచుట్టేశాం- అది ద్వీపం ఒడ్డు; రాళ్లూ క్రూర జంతువులూ వుంటాయన్న మాట. మాయా ద్వీపంమీద వున్న పిల్లలు, ఓడ ప్రమాదంలో చిక్కుకున్న ప్రయాణీకులు. మారువేషం వేసుకున్న గుర్తుల వాళ్లని ఆ సన్నని ఖండంలో వదిలేశారు. అది ద్వీపంమీదకి దారి. (ముందే ఉభయ పక్షాలూ గుర్తుల గురించి యేకాభిప్రాయానికి వచ్చాయి.) ఓడ ప్రమాదంలో చిక్కుకున్న ప్రయాణీకుల్ని మేం రక్షించాల్సి వుంది. పిల్లలు కొన్ని కిలోమీటర్ల "ఒడ్డుని" ద్వీపంలోకి ప్రవేశించే స్థలం కోసం చూస్తూ కొంచెం కొంచెంగా అడివిని పరీక్షించారు. యిక్కడ తీక్షణమైన కళ్లూ, సాహసమూ అవసరమవడమే కాదు యెన్నో ప్రకృతి విషయాల పరిశోధనా, తర్కబద్ధంగా ఆలోచించే సామర్థ్యమూ కూడా కావాలి. యీ ఆటవల్ల నిజాయితీ సత్యసంధతా కూడా అలవడతాయి. పిల్లలు ద్వీపానికి వున్న రహస్య మార్గం కనిపెట్టి, ప్రయాణీకులకి సాయపడ్డారు. జబ్బుగా వున్నవాళ్లని హాస్పిటల్‌కి పంపారు. యీ ఆటలో పైలట్లూ, దాక్టర్లూ కూడా ప్రత్యక్షమయ్యారు. పడవ ప్రమాదంలో చిక్కిన ప్రయణీకులూ, వాళ్ల సహాయకులూ కాష వంటకం తయారుచేసుకోవడంతో యీ ఆట ముగిసింది. మేం నెగడు పక్కనే కూర్చుని, ఓ అద్భుత కథ చెప్పుకునేవాళ్లం. చాలామంది పిల్లలు నేను చెప్పినట్టే ఆ కథని, వాళ్ల విపరీతమైన బొమ్మల వూహల్ని కాగితంమీదకి దించేస్తూ, గీసేవాళ్లు.

ప్రకృతిలోకి "యాత్రల్లో" పక్షుల జీవితాలకీ జంతువుల జీవితాలకీ సంబంధించిన పరిశీలనకోసం యెక్కువ వ్యవధి కేటాయించేవాళ్లం. పూర్తిగా నూతన, ఆశ్చర్యజనకమైన ప్రపంచం మాముందు విస్తరించుకుంది. ప్రశాంత ఆకురాలు కాలపు సాయంత్రాల్లో ఒక ముళ్లపంది పిల్లలు తల్లితో గూటి నుంచి యివతలికి రావడం, అది తన పిల్లల్ని కాపాడుకోవడం చూసేవాళ్లం. వసంతరుతువులో చిన్ని కుందేళ్లని పరిశీలించేవాళ్లం. ఒక కుందేలు తనకి కొత్తగా పుట్టిన పిల్లని దాని మానాన దాన్ని వదిలెయ్యడమూ, దానిని యింకో కుందేలు సాకుతుందా లేదా అని నిరీక్షించడమూ యెలా వుండేదీ పిల్లలు చూశారు. జూలైలో పిల్లలు పెద్ద కప్పలను పరిశీలించేవాళ్లు. ఒక రోజున యెక్కణ్ణో మారుమూల మేం ఒక నక్క బొరియని చూశాం. ఆ నక్క తన పిల్లల్ని యెలా షికారు తీసికెళ్లేదీ, పరిగెత్తడం నేర్పేదీ, వాటితో ఆడుకునేదీ పిల్లలు చూశారు. అడవిలో ఒక దూరపు మూల మేం బివర్లని చూశాం.

మా యాత్రలూ పరిశీలనలూ మా ఆలోచనని వృద్ధి పొందించి మా భాషనీ, వ్యక్తీకరణనీ అభివృద్ధి చేశాయి. యీ విహారాల్లోనూ, షికారుల్లోనూ పిల్లల మనస్సుల్లో యెక్కువ ప్రశ్నలు ఉదయించేవి. వాళ్ల ఆతృతా, జిజ్ఞాసా మేం క్లాసురూమ్‌లో ప్రకృతి విషయాల్ని గురించీ, పనిని గురించీ, దూరదూర దేశాల గురించీ మాట్లాడుకునేటప్పుడు స్పష్టమయేవి. ప్రకృతిలోకి "యాత్రల" తర్వాత పిల్లల అనుభూతి స్థితిని పరిశీలించినమీదట ప్రాచీనుల విజ్ఞతమీద నాకు నమ్మకం కుదిరింది: జ్ఞానతృష్ణ ఆశ్చర్యంలోనే ఆరంభమవుతుంది.

యీ ప్రకృతి రహస్యాలపట్ల ఆశ్చర్యం, ఆవిష్కరణపట్ల సంతోషం అనేవాటిని పిల్లల ప్రేరణని మేల్కొల్పడానికీ, వాళ్లని క్రియాశీలురుగా చెయ్యడానికీ సహకరించేటట్టు నేను ప్రయత్నించాను. సులభమైన సమస్యలను గ్రహించడానికి యెంతో వ్యవధి అవసరమయే పిల్లలు మా క్లాసులో వుండేవాళ్లు (వాల్యా, పేత్రిక్, నీనా). ప్రతి వాళ్లకీ వాళ్ల కారణాలున్నా యనుకోండి, కాని ఫలితం మాత్రం ఒకటే అయింది: యీ పిల్లల్లో మెదడు కణాలు ఓ రకంగా అణగిపోయి వుండేవి. నేను క్లాసులో చెప్పేదానిమీద యీ పిల్లలకి దృష్టి వుండేది కాదు.

యీ పిల్లల ఆలోచన కొరవదలగా వుండేది. దానికి కారణం – వాళ్ల మెదళ్లలోని కణాల జడత్వం, నిస్త్రాణ. పిల్లలు అనేక విషయాల మధ్య వుండే సంబంధాలని గ్రహించలేకపోవడమూ, జ్ఞాపకం వుంచుకోలేకపోవడమూ అనే వాటిల్లోనే ఆ లోపం వుంది. ఉదాహరణకి, నేను వాళ్లకి "యాపిల్‌పళ్లు, బుట్టలు, పిల్లలు" గురించి సమస్య యిచ్చాను. పిల్లాడు యాపిల్‌పళ్ల గురించీ, బుట్టల గురించీ ఆలోచిస్తూ పిల్లల్ని గురించి మర్చిపోయేవాడు. పిల్లల గురించి గుర్తు పెట్టుకుంటే యాపిల్‌పళ్లనీ, బుట్టల్నీ మర్చిపోయేవాడు. అందుచేత చుట్టూ వున్న వస్తువులకీ ప్రకృతికీ వున్న కార్యకారణ సంబంధం గురించిన పర్యాలోచనా, చిన్ని ఆవిష్కరణలూ, సత్య దర్శనంతో కలిగే ఆశ్చర్యానుభూతీ – అవన్నీ వాల్యా, పేత్రిక్, నీనాలకి చాలా సంతోషం యిచ్చాయి. ఆ పిల్లలు గొప్ప మానసిక సంతృప్తిని

పొందారు. వాళ్ల కళ్లల్లో సంతోషపూరిత ప్రేరేపణ వెలిగింది. అలక్ష్యం మాయమైపోయింది. చదివేదానిమీద ఆసక్తి కలిగింది. పిల్లవాడిలో స్పష్టమైన రసోత్సుక్యం కనిపింపచేసే ప్రశ్నని గనక నేను మేల్కొల్పితే, పిల్లవాడి బుర్రలో చురుకైన అనేక క్రమాలు జరిగిపోతూ వుంటాయి: యేదో నిద్రమత్తులో జోగుతూ వుండే శక్తులన్నిటినీ కార్యాచరణకి పిలిచినట్టు. మానసికాభివృద్ధి విషయంలో గజిబిజిగా వుండే పిల్లలు యింకా యింకా జాగృతం అవుతూనే వున్నారని నాకు సంతోషపూర్వక విశ్వాసం యేర్పడింది. వాళ్లు కథల్ని ఆతృతగా వినేవాళ్లు, సమస్యని యింకా బాగా అర్థంచేసుకునేవాళ్లు. నేను అనుభవజ్ఞులైన ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులతో నా పరిశీలనని పంచుకునేవాణ్ణి. మేం యీ పనిని "హే తు వు ర సో త్సు క్య జా గృ తం" అని పిలిచేవాళ్లం.

తను బోధించే విషయంమీద ఉపాధ్యాయుడు పిల్లల్లో ఆసక్తి కలిగించగలిగినప్పుడు వాల్యా, పేత్రిక్, నీనాల లాంటి పిల్లల్లో యేం జరుగుతోందో అని అర్థం చేసుకో ప్రయత్నించాను. నేను జీవశాస్త్రవేత్తలు, మనస్తత్వశాస్త్రవేత్తలు, బోధకులు, నరాల వ్యాధి వైద్యులా రచనలు చదివాను. ప్రఖ్యాత పండితుడు సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856-1939) రచనల్లో మెదడు పొర కణాలకీ, ఉపపొర కేంద్రాలకీ మధ్య జరిగే పరస్పర ప్రక్రియను గురించిన ఆసక్తికరమైన భావం ఒకటి తటస్థపడింది. ఉపపొర కేంద్రాలకి ఆలోచనలో నిర్ణాయక పాత్ర వుందని ఫ్రాయిడ్ అంటాడు. చాలా పరిశోధనలు రుజువుచేసినట్టుగా, మానవ మనసుకి గల ఉద్రేక క్రమాల్ని ఉపపొర కేంద్రాలు శాసిస్తాయి. ఆ పండితుడు అనుభూతిని హేతువునూ గుర్రంతోటీ రౌతుతోటీ పోలుస్తాడు. ఆయన అభిప్రాయంలో గుర్రం దారిని నిర్ణయిస్తుంది (అంటే అనుభూతి - ఉపపొర కేంద్రాలు). ఆ గుర్రం తను పోదలచుకున్న చోటికి రౌతుని తీసుకెడుతుంది. కాని ఆ పనిని యెంత తెలివిగా చేస్తుందంటే రౌతు గుర్రాన్ని తనే నడిపిస్తున్నట్టు అనుకుంటూ వుంటాడు. ఆ రకంగా ఫ్రాయిడ్ ప్రకారం ముఖ్యమైంది మెదడు పైపొర కాదు, కింది పొర.

ఫ్రాయిడ్ చేసిన అంత ఖచ్చితమైన సూత్రీకరణల్ని తోసిపుచ్చుతూనే మహా రష్యన్ మనస్తత్వశాస్త్రవేత్త పావ్‌లొవ్ (1849-1936) కూడా ఉపపొర చాలా ప్రాముఖ్యమైందని భావించాడు. మెదడు పైభాగపు కార్యకలాపాలకి ప్రధాన ప్రేరణ ఉపపొరనుంచి వస్తుందనీ, యీ ఉద్రేకాన్ని గనక మనం వదిలిపెట్టినట్లయితే, పైపొరకి గల శక్తి తాలూకు ప్రధాన ఆధారం విడిచిపెడుతున్నామనీ ఆయన రాశారు. కాని మానవ ఆలోచనకీ ప్రవర్తనకీ ప్రధాన నియంత్రక పాత్ర పావ్‌లొవ్ ప్రకారం మెదడు పొరదే (రౌతు గుర్రాన్ని ఆపగలడు, తిప్పగలడు).

పిల్లల బౌద్ధిక శ్రమని పరిశీలించినమీదట నాకు నమ్మకం యేర్పడిందేమిటంటే, ఉపపొరనుంచి పై పొరకి వచ్చే ఉద్రేక ప్రేరణలు (సంతోషపు ఆవేశం, ఆశ్చర్యం, చకితులై పోవడం) నిద్రించే మెదడు కణాల్ని జాగృతం చేస్తున్నట్టూ, క్రియాత్మకం చేస్తున్నట్టున్నాయి. చిన్న పిల్లల మేధాబోధన వాళ్లల్లో

తెలుసుకోవడం అనే అవసరాన్ని అభివృద్ధిచేసే మార్గంలో, అంటే జిజ్ఞాసనీ, ఆతృతనీ రేకెత్తించే మార్గంలో రావాలి అని అనుభవం తెలియజేస్తోంది.

ప్రాథమిక తరగతుల్లో ప్రకృతిలోకి "యాత్రలు" ఒక సంప్రదాయం అయిపోయాయి. పిల్లలు అడివిలోకీ, పొలాల్లోకీ, చెరువు దగ్గరికీ పోవడానికి ఆతృతగా నిరీక్షించేవాళ్లు. ఆటల్ని గురించి ముందే వూహించేసుకునేవాళ్లు. పిల్లల అభిమాన పాత్రమైన ఆటలు కష్టాల్ని అధిగమించడంతో వుండేవి. ఆడేవాళ్లు నిజమైన వీరులు గాని జానపద సంబంధమైన వీరులు గాని అయ్యేవాళ్లు. వాళ్లు రెండో తరగతిలో వుండగా పిల్లలకి నేను రాబిన్‌సన్ క్రూసోని గురించి చెప్పాను. ఆరకంగా కొన్ని నెలలు సాగిన ఆసక్తికరమైన ఆట ఒకటి మొదలైంది. స్పార్టకస్ కథ తర్వాత పిల్లలు ఒక కొండమీద తిరుగుబాటు చేసే బానిసల వూహాత్మక శిబిరం నిర్మించుకున్నారు. మా ప్రాంతంలో యెన్నడో నివసించిన సిథియన్ పశుపోషకులూ, వేటగాళ్లూ, మత్స్యకారులూ గురించిన కథ ప్రవాహంతోటి పిల్లలు యెంత కొట్టుకుపోయారంటే, వాళ్లు యీ ప్రాచీన శ్రామికుల్లా జీవించి కృషిచేసే ఆట ఒకటి తయారుచేశారు.

అధ్యయనం అనేది శారీరక మానసిక శక్తుల బహుముఖ క్రీడలతో ముడిపడి వుండాలి. ఆ ఆటలు పిల్లల్లో స్పష్టమైన ఆవేశపూరితమైన అనుభూతులు మేల్కొల్పుతాయి. చుట్టూతా వున్న ప్రపంచం తాము చదవాలని కాంక్షించే పుస్తకంలా పిల్లలకి కనిపిస్తుంది. ఆటలకీ, ప్రకృతిలోకి "యాత్రల"కీ తోడుగా శారీరక మేధాత్మక శక్తి అభివృద్ధికి శారీరక శ్రమ విస్తృత అవకాశాలు ఇస్తుంది. నిజమైన ఆనందదాయకమైన బాల్యాన్ని గురించి చురుకైన పని తాలూకు సంతోషాత్మక, ఆవేశపూరిత అనుభూతులు లేకుండా వూహించడం అసాధ్యం. చిన్న పిల్లవానికి శారీరక శ్రమ వూరికే నైపుణ్యం అలవాట్లూ సాధించడానికే కాదనీ, వూరికే నైతిక బోధన కాదనీ, అపరిమితమైన, ఆశ్చర్యకరంగా సమృద్ధి ఐన ఆలోచనా ప్రపంచమనీ అనుభవం తెలియజేస్తోంది. యీ ప్రపంచం నైతిక, మేధాత్మక, సౌందర్యానుభూతుల్ని జాగృతం చేస్తుంది. అవి లేకుండా ప్రపంచాన్ని గురించి తెలుసుకోవడం అసాధ్యం, అంటే అధ్యయనం కూడా అసాధ్యం. శారీరక శ్రమ, అధ్యయనం - ఒకదాని తర్వాత ఒకటి నాకు పిల్లవాని కలల, సృజనాత్మక ప్రపంచంలోకి ఆవేశపూరిత ప్రయాణంగా దర్శనమిచ్చాయి. శారీరక శ్రమా క్రమంలోనే కచ్చితంగా, మనసుకి వున్న ముఖ్యమైన లక్షణాలు మా విద్యార్థుల్లో రూపు తీసుకున్నాయి: జిజ్ఞాస, ఆతృత, ఆలోచనలకిగల సౌలభ్యం, అనుకున్నది చెప్పడంలో స్పష్టత.

పిల్లవాని జీవితంలో శారీరక శ్రమ ఉత్తేజితం చేసేది యేదేనా మేధా శ్రమ పాఠాలల్లో వాంఛనీయమైన, ఆసక్తికరమైన విషయంగా, అభివృద్ధికరంగా, సంపద్వంతంగా తయారవుతుంది. రెండవ తరగతి నాటికే మేం మా అభిమానపాత్రమైన పనిని వారానికోసారి చేసేవాళ్లం. పిల్లలు తమ వూహలతోటీ, ఆసక్తులతోటీ తాము సంపాదించగల వాటితో నిండిపోయి వుండేవారు. మూడవ,

నాల్గవ తరగతుల్లో మేం మా అభిమానపాత్రమైన పనిని వారానికి రెండుసార్లు చేసేవాళ్లం.

అభిమానపాత్రమైన పని... అలా అంటే పిల్లవాడికి యెందులోనో ఆసక్తి పుట్టేదాకా ఉపాధ్యాయుడు చేతులు ముడుచుకుని కూర్చోవడమని కాదు. వృత్తివిద్యలో, మామూలుగా విద్యా కృషి అంతలోనూ వున్నట్టుగా, దేన్నీ కూడా దాని మానాన దాన్ని వదలకూడదు. పిల్లలకి వాళ్లు చెయ్యవలసిన పనుల్లో ఆసక్తికరమైంది వుండాలి. మా విద్యార్థుల చుట్టూతా వయసు వస్తూవున్న పిల్లలూ, యువకులూ, యువతులూ పనిచేస్తూనే వున్నారు. అందరు విద్యార్థులూ డజన్ల కొద్దీ ఆసక్తికరమైన వాటిలో మునిగిపోయారు. వాళ్లు చెట్లు పెంచేవాళ్లు, గింజలు నాటేవాళ్లు, యంత్రాల నమూనాలు తయారుచేసేవాళ్లు, మట్టి మిశ్రమాలు చేసేవాళ్లు, పశువుల సంరక్షణ చేసేవాళ్లు, కొత్త గ్రీన్‌హౌస్ లేక వర్క్‌షాపు కట్టేవాళ్లు లేదా నీటి సరఫరా యంత్రాన్ని కూర్చేవాళ్లు.

పరిశోధనా భావం, జిజ్ఞాసా భావం, ఆతృతా భావం పిల్లల్లో పని పట్ల ఆసక్తిని మేల్కొలుపుతుంది. నా సూత్రం యెప్పుడూ కూడా యేమిటంటే: పని దానికదే లక్ష్యం కాదు, బోధనలో యెన్నో లక్ష్యాలని సాధించడానికి సాధనం మాత్రమే అని - సాంఘిక, సిద్ధాంతాత్మక, నైతిక, మేధాపరమైన, సృజనాత్మక, సౌందర్య పూరితమైన, అనుభూతిపరమైన లక్ష్యాలని సాధించడానికి.

ఆలోచన, అనుభూతి, సృజనాత్మకత, సౌందర్యమూ ఆటలూ అనే కాంతివంతమైన దీపంతోటి వెలిగితే కనక చదువనేది పిల్లలకి తదేకధ్యానంతో గూడిన విషయమవుతుంది. చదువుని గురించిన నా శ్రద్ధ పిల్లలకి యేం పెడతారు, వాళ్లు యెలా నిద్రపోతారు, వాళ్ల ఆరోగ్యం యెలా వుంది; ఏం ఆడుకుంటారు, రోజూ యెన్నిగంటలు బయట గడుపుతారు, యే పుస్తకాలు చదువుతారు, యే అద్భుత కథలు వాళ్లు వింటారు; యేం బొమ్మలు గీస్తారు, చిత్ర లేఖనంద్వారా తమ ఆలోచనలూ అనుభూతులూ యెలా వ్యక్తం చేస్తారు, ప్రకృతి సంగీతం, సంగీత కృతులు, జానపద సంప్రదాయిక ఉభయమూ, యెలాంటి అనుభూతుల్ని వాళ్లల్లో మేల్కొల్పుతాయి, వాళ్ల అభిమాన పని యేమిటి, యేమేరకి యితరుల కష్టసుఖాలని అర్థంచేసుకుంటారు, యితరులకోసం వాళ్లు ఏం సృష్టించారు, యీ సందర్భంగా యే రకమైన అనుభూతులు వాళ్లు అనుభవించారు - అనే వాటి పట్టింపుతో మొదలైంది.

జ్ఞానం మిగతా కార్యకలాపాలతోటి విడిపోకుండా వున్నట్లయితేనే పిల్లవాడి ఆంతరిక జీవితంలో అధ్యయనం అనేది ఒక భాగం అవుతుంది. పిల్లవాడు తనంతట తనే యెక్కాలు కంఠతా పట్టడానికీ, చతురస్రపు వైశాల్యం కట్టడానికీ ఆసక్తి కలిగించుకునేటట్టు చెయ్యడం కష్టం. శ్రమతో కూడిన సృజనాత్మక లక్ష్యాల సాధనకి ఉపకరణం అయినప్పుడే పిల్లవాడికి జ్ఞానం వాంఛనీయం అవుతుంది. పిల్లలకి చిన్నతనంనుంచీ శారీరక శ్రమ ప్రేరకంగా వుండేటట్టు చెయ్యాలని నేను ప్రయత్నించాను, అప్పుడు తెలివికీ, బుద్ధికుశలతకీ అవకాశం అది వెల్లడిచేస్తుంది.

పాఠశాల ముఖ్యమైన కర్తవ్యాల్లో ఒకటేమిటంటే పిల్లలకి వాళ్ల జ్ఞానాన్ని ఎలా ఉపయోగించాలో నేర్పడం. జ్ఞానాన్ని తలమోపు భారంగా చెయ్యడం ప్రమాదం. యిది మొదటి తరగతుల్లో బౌద్ధిక శ్రమ, తన స్వభావాన్ని బట్టి, దేనికంటేనూ కూడా యింకా యింకా యెక్కువ నిపుణతలూ, అలవాట్లూ సమకూర్చుకునే సందర్భంలోనే జరుగుతుంది. యీ నిపుణతలూ, అలవాట్లూ నేర్చుకోవడం మాత్రమే జరిగి, ఆచరణలో పెట్టడం అనేది లేనట్లయితే అధ్యయనం పిల్లవాడి ఆంతరంగిక జీవితంనుంచి తొలగిపోతుంది, తన ఆసక్తులనుంచి వేర్పాటు చేసినట్టుగా. యీ విపరీతాన్ని అధిగమించ ప్రయత్నించేటప్పుడు ప్రతి పిల్లవాడూ తన నిపుణతలనీ అలవాట్లనీ సృజనాత్మకంగా ఉపయోగించేటట్టు ఉపాధ్యాయుడు జాగ్రత్తపడాలి.

## "ప్రకృతి పుస్తకం"లో మూడు వందల పుటలు

ప్రఖ్యాత జర్మన్ గణితశాస్త్రజ్ఞుడు ఎఫ్. క్లేయిన్ (1849-1925) సెకండరీ స్కూల్ విద్యార్థిని ఫిరంగితో పోల్చాడు. పదేళ్లుగా జ్ఞానంతో నింపిన తరువాత దాన్ని పేలిస్తే లోపల యింకేమీ మిగలదు. తనకి అర్థం కానిదాన్ని కంఠస్థం చెయ్యమని బలవంతంచేసి ఆ కంఠస్థం చేసేది తనమీద యే ప్రభావమూ చూపించకుండా చిత్రాలని గాని, మరే సంబంధమైందైనా గాని గుర్తుకు తేకుండా వుండే పిల్లవాడి మానసిక శ్రమని పరిశీలించినప్పుడు నాకీ విచారకరమైన జోక్ గుర్తుకు వచ్చింది. ఆలోచన, స్పష్టమైన గ్రహణా, కంఠస్థం చేసిన ప్రకృతి విషయ అంతస్సార పరిశీలనా వీటి స్థానంలో జ్ఞాపకం అనే దాన్ని వుంచడం పిల్లవాణ్ణి నిశ్చేష్టితం చేసే పెద్ద దోషం. చివరకది పిల్లవాడికి వున్న చదివే యిచ్ఛని చంపేస్తుంది.

పాఠశాలాత్పూర్వపు పిల్లవాడికి వున్న చురుకైన, పట్టుగల జ్ఞాపక శక్తిని చూసి మనలో ఆశ్చర్యపడని వాడెవ్వడుంటాడు? అయిదేళ్ల వాడు తన తల్లితోటీ తండ్రితోటీ అడివికో పొలానికో వెళ్లివచ్చాడు. స్పష్టమైన చిత్రాలతో బొమ్మలతో, ప్రకృతి విషయాలతో అతని మనసు నిండిపోతుంది. ఒక నెలో, సంవత్సరమో గడుస్తుంది. తల్లీ తండ్రీ మళ్లీ షికారుకి పోదామని నిర్ణయించుకుంటారు. పిల్లవాడు ప్రశాంతమైన యెండ వున్న ఉదయం కోసమూ తను ఒకప్పుడు, యెప్పుడో వూహకందని పూర్వం, తన తల్లిదండ్రులతో అడివిలోకి వెళ్లిన రోజు కోసం యెదురుచూస్తూ వుంటాడు. పిల్లవాడి జ్ఞాపకాల్లో మెరిసే స్పష్టమైన, సజీవ వివరాలతో తల్లీదండ్రీ ఆశ్చర్యపోతారు: పిల్లవాడు రెండు విభిన్నమైన రంగులున్న దళాల పువ్వుని గుర్తుంచుకుంటాడు. పిల్లవాడు పువ్వుగా మారిపోయిన అన్ననీ చెల్లెల్నీ గురించిన అద్భుతమైన కథ వల్లిస్తూ వుంటే తండ్రి ఆశ్చర్యపోతూ వింటాడు. అతను ఆ కథని భార్యకి అడివిశివారులో ఒక యేడాది క్రితం చెప్పాడు. తన తండ్రి యేం చెపుతున్నాడో పిల్లవాడు విననట్లే

వుంది. పిల్లవాడు సీతాకోకచిలుకని వెంటాడుతున్నాడు - యెలా అతను చుట్టూతా వున్న ప్రపంచంనుంచి అలాంటి చిన్న వివరాన్ని గుర్తుంచుకున్నాడు?

సంగతి యేమిటంటే, జ్ఞాపకాలలో లోతుగా పదిలపరుచుకోగల స్పష్టమైన, పులకింపచేసే వర్ణ క్రీడల్నీ, చిత్రాల ధ్వనులనీ, వివరాల్నీ ఆశ్చర్యకరమైన నిశిత ధారణతో వుంచుకోగల శక్తి పిల్లలకి వుంటుంది. చుట్టూతా వున్న ప్రపంచంలో తను చిత్రాలు గ్రహించే క్రమంలో తన చైతన్యంలో ఉద్భవించే అనూహ్యమైన ప్రశ్నలతో పెద్దవాళ్లని పిల్లవాడు ఆశ్చర్యపరుస్తాడు. ఆశ్చర్యకరమైన పువ్వుని గుర్తుచేసుకుంటూ పిల్లవాడు తండ్రిని అడుగుతాడు: "అవును, ఆ అన్నా చెల్లెలూ ఒకళ్లనొకళ్లు చూసుకోగలరా? చెట్లకీ ప్రాణం వుందని మీరు చెప్పారు. అంటే అవి చూడగలవు, వినగలవు, కదా? అవి ఒకదాంతో ఒకటి మాట్లాడుకుంటాయా? అవి మాట్లాడుకునేటప్పుడు మనం వినగలమా?" తండ్రిని ఆశ్చర్య చకితుణ్ణి చేసే భావపు ప్రవాహం, కాని ఆ పిల్లవాడు యేడాది క్రితమే ఆ విషయం యెందుకడగలేదు? అంత కాలం ఆ జ్ఞాపకాన్నే కాదు ఆ సంఘటనల రసోత్సుక్యాన్ని కూడా యెలా భద్రపరచుకోగలిగాడు? పువ్వులా, వినీలాకాశపూ, సుదూర విమానపు మోతా తాలూకు నానా విధమైన ముసుగునీ తొలగించుకుంటూ చిన్న పిల్లవాడు తనకిగా స్పష్టంగా వూహించగలడని తండ్రికి నమ్మకం యేర్పడుతుంది.

యిదంతా ఆలోచించుకుంటూ నన్ను నేనే యీ ప్రశ్న వేసుకున్నాను: సజీవమైన స్పష్టమైన వూహా, నిశితమైన ధారణ చుట్టూతా వుండే ప్రపంచంలోని వాటిపట్ల సున్నితమైన అనుభూతి ప్రతిచర్యలు గల పిల్లవాడు, రెండు మూడేళ్ల బడి చదువు తర్వాత వ్యాకరణ సూత్రాలు గుర్తుంచుకోలేక పోవడమేమిటి? "అత్త" అన్న దాని వర్ణక్రమం రాయలేకపోవడమేమి? తొమ్మిదార్లు యెంతో గుర్తుంచుకోకపోవడమేమి? ఆ జర్మన్ పండితుడి నిర్ణయాని కంటే ఎక్కువ ఆశావహమైందానికి వచ్చాను: పాఠశాల కాలంలో జ్ఞానాన్ని ఆకళింపు చేసుకునే క్రమం తరచుగా పిల్లవాని ఆంతరంగిక జీవితంతో సంబంధం లేకుండా వుంటుంది. పిల్లవాడి జ్ఞాపకశక్తి నిశితంగా వుండబట్టే, బింకంగా వుండబట్టే, పిల్లవాడి ధారణలోకి స్పష్టమైన చిత్రాల, బొమ్మల, గ్రహణల, వూహల స్వచ్ఛమైన సెలయేరు ప్రవహిస్తుంది. కనుక వాళ్ల సూక్ష్మమైన, అనూహ్యమైన "తాత్విక" సందేహాలతోటి పిల్లల ఆలోచన మనల్ని నిర్భాంత పోయేటట్టు చేస్తుంది. అది ఆ జీవనదాయక సెలయేటితో తడపబడుతుంది కాబట్టి అలా చేస్తుంది. పిల్లవాడి చైతన్యంనుంచి చుట్టూతా వుండే ప్రపంచాన్ని బడి తలుపు మూసెయ్య కూడదు. బాల్య సంవత్సరాల కాలమంతా కూడా పిల్లలకి చుట్టూతా వుండే ప్రపంచమూ, ప్రకృతీ స్పష్టమైన చిత్రాలూ, బొమ్మలూ, భావాలూ యివ్వాలనీ, పిల్లలు ఆలోచనా సూత్రాల్ని సర్వసమమైన కట్టడంలాగా, ఆ భవనపు శిల్ప విన్యాసం యింకా బాగా నిర్మించిన భవనానికి, అంటే ప్రకృతికి, ప్రేరకం అయినట్టుగా గుర్తించాలనీ నేను ప్రయత్నించాను. పిల్లవాణ్ణి వూరికే ఒక జ్ఞాన భాండారంలా మార్చకుండా

వుండాలంటే, సత్యాలకీ, నియమాలకీ, సూత్రాలకీ ఖజానాలా కాకుండా వుండాలంటే పిల్లవాడికి ఆలోచించడం నేర్పాలి. అసలు పిల్లల మనసూ ధారణల స్వభావం చుట్టూతా వున్న ప్రపంచం తన నియమాలతోటి వాళ్లకి ఒక్క నిముషం కూడా మూసుకుపోకుండా వుండాలని అపేక్షిస్తుంది. పిల్లల ధారణా నైశిత్యం, వాళ్ల ఆలోచనా స్పష్టత్వం, వాళ్లు బడిలో చేరగానే నీరసించిపోవు సరికదా పిల్లలు ఆలోచించి, గుర్తుంచుకుని, హేతుబద్ధంగా వుండటం నేర్చుకునే వాతావరణం చుట్టూతా వున్నట్టయితే అవి బలపడతాయి.

మేధా బోధనలో ప్రకృతిపాత్రని మరీ యెక్కువ చెయ్యకూడదు. పిల్లవాడు ప్రకృతిలో చుట్టుముట్టబడి వున్నట్లైతే అదే మేధాభివృద్ధికి బ్రహ్మాండమైన ప్రేరణ అని భావించే ఉపాధ్యాయుడు ఘోరంగా తప్పు చేసినట్టే. హేతుబద్ధతమీదా, అనుభూతులమీదా, యిచ్ఛమీదా ప్రత్యక్షంగా వర్తించే మంత్ర శక్తులేం ప్రకృతిలో లేవు. బోధనకి ప్రకృతి శక్తివంతమైన ఆధారమే. దృగ్గోచరమైన పద్ధతిని అధిక అంచనా వేయడమనేది పిల్లవాళ్ల ఆలోచనలోని విడి ప్రత్యేకతల్ని సాధారణీకరించడం సంజ్ఞాన చర్యల్ని యింద్రియగ్రాహ్య రంగానికి కుదించడం. పిల్లవాళ్ల ఆలోచనా క్రమంలో ప్రత్యేకతల్ని ఆరాధించకూడదు. ముఖ్యంగా పిల్లలు చిత్రాల్లోనూ, రంగుల్లోనూ, ధ్వనుల్లోనూ ఆలోచిస్తారు. యీ లక్షణం వస్తుగత సత్యం. దీని ప్రాముఖ్యాన్ని దృఢంగా ఉషీన్స్కీ రుజువు చేశాడు. పిల్లవాడు చిత్రాల్లోనూ, రంగుల్లోనూ, ధ్వనుల్లోనూ ఆలోచిస్తాడు కాబట్టి, అతనికి భావాత్మక ఆలోచనా క్రమాన్ని నేర్పక్కర్లేదనేది అర్థం కాదు. దృశ్య సహకారుల ఉపయోగంలోని ప్రాముఖ్యాన్నీ, మేధా బోధనలో ప్రకృతికి గల పాత్రనీ నొక్కి చెబుతూనే అనుభవజ్ఞుడైన బోధకుడు భావాత్మక ఆలోచనాభివృద్ధికీ, యీ పద్ధతుల్లోని లక్ష్యసమన్విత బోధనకీ, వాటిలో సాధనాలు చూస్తాడు.

మా విద్యార్థులకి ఆలోచనా ఆధారం కాగల ప్రతిదాన్నీ రోజు తర్వాత రోజుగా నాలుగేళ్లు నేను మథించాను. పిల్లలు తమ ఆలోచనలకి ఆధార మయ్యేటటువంటి విషయాల్ని చుట్టూతా వుండే ప్రపంచంలో గమనిస్తారు. ఆ విధంగా "ప్రకృతి పుస్తకంలో"ని మూడు వందల పుటలు సమకూరాయి. అందులో మూడు వందల పరిశీలనలు, పిల్లల హృదయాలమీద హత్తుకుపోయే మూడు వందల బొమ్మలు వున్నాయి. వారానికి రెండుసార్లు మేం యెలా ఆలోచించడం నేర్చుకోవాలో దాని కోసమని ప్రకృతిలోకి షికారు వెళ్లేవాళ్లం. పూరికే పరిశీలించడం కోసం కాదు, ఆలోచించడం నేర్చుకోవడం కోసం. నిజానికి అవి ఆలోచించడంలో పాఠాలు. కాని పాఠం యెంతో నిమగ్నం చేసేటట్టుగా, యెంతో ఆసక్తికరంగా వుండటమనేది పిల్లవాడి ఆంతరంగిక ప్రపంచాన్ని యింకా సంపద్వంతం చేస్తుంది.

పిల్లల మనసులమీద వాస్తవికత స్పష్టమైన చిత్రాలు హత్తుకునేటట్టూ, సజీవమైన రూపుకట్టే భావాల పునాదులు చేరుకునే ఆలోచనా క్రమపు స్థాయి అందుకునేటట్టూ నేను గమ్యం యేర్పాటు చేసుకున్నాను. అంచేత పిల్లలు చుట్టూతా

వుండే ప్రపంచాన్ని పరిశీలించేటప్పుడు, విషయాల కార్యకారణ సంబంధం నిశ్చయించుకొనేటట్లూ, వస్తువుల గుణాలూ, చిహ్నాలూ పోల్చేటట్లూ ప్రయత్నించాను. నా పరిశీలనలు పిల్లవాడి మేధాభివృద్ధిలో ఒక ముఖ్యమైన సూత్రాన్ని ధృఢపరిచాయి: పాఠశాలల్లో సంక్షేపింపబడిన సత్యాలు యెంత సాధారణీకరించబడినవైతే అంతగా మేధాశ్రమ అవసరమవుతుంది, అంత తరచుగా విద్యార్థి జ్ఞానాధారాలనుంచి, అంటే ప్రకృతినుంచి సమాధానం పొందాల్సివుంటుంది. అంత స్పష్టంగా పరివేష్టిత ప్రపంచపు చిత్రాలూ బొమ్మలూ అతని చైతన్యంమీద ముద్రవేస్తాయి. అలా అని స్పష్టమైన చిత్రాలు పిల్లవాడి చైతన్యంమీద ఫోటోగ్రాఫు ఫిల్ములాగా ప్రతిబింబించవు. భావాలు యెంత స్పష్టమైనవైనా సరే అవి వాటంతటవే అంతమూ కాదు, అధ్యయనంలో లక్ష్యమూ కాదు. సైద్ధాంతిక ఆలోచన వున్న చోట, సజీవ ధ్యావం దానికదే అంతిమ లక్ష్యం కాక, ఒక సాధనం మాత్రమే అయినప్పుడు మేధా బోధన మొదలవుతుంది: చుట్టూతా వున్న ప్రపంచపు స్పష్టమైన చిత్రం ఆధారం, అనేక రూపాలుగా, వర్ణాలుగా, ధ్వనులుగా, ఒక వెయ్యి సందేహాలుగా వున్న ఆధారం. యీ సందేహాల వస్తువుని వెల్లడి చేసేటప్పుడు, ఉపాధ్యాయుడు "ప్రకృతి పుస్తకపు" పుటల్ని తిరగేస్తాడు.

"ప్రకృతి పుస్తకం"లోని మొదటి పుటని "సజీవమూ, నిర్జీవమూ" అంటాం. ఆకురాలు కాలపు తొలి రోజుల్లో ఒకనాడు వెచ్చగా యెండగా వుండే రోజున మేము నదివొడ్డుకు వెళ్ళి, గడ్డిమీద సుఖాసీనులయ్యాం. మా ముందు పువ్వులతో వున్న పచ్చికమైదానం విస్తరించుకుని వుంది. తేటగా వున్న నది లోతుల్లో చేపలు యీదుతున్నాయి, సీతాకోకచిలుకలు మిడిసిమిడిసి యెగురుతున్నాయి. పైన వినీలాకాశంలో స్వాలోపక్షులు యెగురుతున్నాయి. మేం యెత్తైన గట్టు దగ్గరకి వెళ్ళాం. అక్కడ కొన్నేళ్ళుగా నది గట్టుని కోసేసింది. పిల్లలు విభిన్నమైన రంగుల మట్టీ యిసకల పొరల్ని - పసుపు, యెరుపు, నారింజరంగు, తెలుపు పొరల్ని - పరీక్షించారు. తెల్లటి మట్టిపొర, దానికింద బంగారు వన్నె యిసక వున్నాయి. యింకా దిగువ పొరగా ఘనస్ఫటికాలు వున్నాయి. పిల్లలు నల్లని పై మట్టిపొరలని లోతైన పొరలతో పోల్చారు.

"మట్టి పై పొరల్లో మీకేం కనిపిస్తోంది?" అని నేను అడిగాను.

"గడ్డివేళ్ళు. లోతైన పొరల్లో వేళ్ళు లేవు" అని పిల్లలు జవాబిచ్చారు.

"సానువు అంచులోనూ, బంగారు వన్నె యిసక ఖండంలోనూ పెరిగే పచ్చని గడ్డి పోచల్ని చూడండి. గడ్డికీ యిసక్కీ వుండే తేడాలేమిటి?"

"గడ్డి వేసవిలో పెరుగుతుంది, ఆకురాలు కాలంలో వాడిపోతుంది, మళ్ళీ వసంత ఋతువులో చిగురు తొడుగుతుంది.... యింకా, గడ్డికి చిన్ని విత్తనాలుంటాయి, అవి నేలమీద చెదిరి, అందులోనుంచి మళ్ళీ గడ్డి మొలుస్తుంది..." అని జవాబు చెప్పారు పిల్లలు.

"మరి యిసక మాటేమిటి?" నేను అందరు పిల్లలూ, ముఖ్యంగా మేదకులైన పేత్రిక్, వాల్యా, నీనాలు చుట్టూతా వున్న ప్రపంచంలోని వాటిని పోల్చాలని అనుకున్నాను. క్లాసులో యింకా పిల్లలున్నారు - మీష, సాష లాంటి వాళ్లు. వాళ్ల ఆలోచనాధార నెమ్మది అయినా సంపూర్ణమైన నదిలాగా వుండేది. ల్యూదా అనే యింకో చిన్నమ్మాయి వుంది. ఆ పిల్ల ఆలోచన యేదు అంతరాల్లో పెట్టి తాళం వేసిన పెట్టె లాగా నాకింకా దురవగాహంగానే వుంది. మొదట్లో నేను అనుకునేవాణ్ణి ఆ పిల్లకి వూరికే నెమ్మదైన మానసికాభివృద్ధి వుంది, అంచేత మిగతా పిల్లలకి సులభంగా వచ్చేది ఆ పిల్లకి కష్టమవుతుంది అని. కాని ఆ చిన్ని పిల్ల కళ్లు కళగా వుండేవి. ప్రతీదీ ఆ పిల్లకి ఆకర్షవంతంగా కనిపించేది. యేదో ఒక రకమైన అంతరంగిక శక్తితో పట్టుకుని ఆ పిల్ల ఆలోచన అనుభూతం చేసుకొనేది; తనకి బాగా తెలిసిందాన్ని చెప్పడానికి ఉద్దేశ్యపూర్వకంగా తొందరపడటం లేదన్నట్టుగా వుండేది.

"పిల్లలూ, ఇదిగో బంగారు యిసకనీ ఆకుపచ్చ గడ్డినీ చూడండి. యింకా సరిగా చెప్పాలంటే ఆకుపచ్చ యిసకా, ఆకుపచ్చ గడ్డీ. అవి యెలా ఒక్కలా వున్నాయి? యెలా తేడాగా వున్నాయి?"

పచ్చని మైదానంకేసీ, బోసిగా వున్న యెత్తైన గట్టు కేసీ చూసి పిల్లలు ఆలోచించారు. ల్యూదా కళ్లు ఆలోచనా మగ్నంగా వున్నాయి, పేత్రిక్ కనుబొమలు ముడుచుకున్నాయి. వాల్యా ఒక చేతిలోనుంచి యింకో చేతిలోకి యిసక పోసుకుంటూ వుంది.

"యిసకకి పువ్వుల్లేవు, గడ్డికి వున్నాయి" అంది ల్యూదా.

"ఆవులు గడ్డి మేస్తాయి, కాని యిసకని మెయ్యగలవా!" వివరించాడు పేత్రిక్.

"వాన కురిస్తే గడ్డి మొలుస్తుంది. కాని వానలో యిసక యెలా మొలుస్తుంది?" అన్నాడు ఆలోచిస్తున్న మీష.

"యిసక నేలలో లోతుగా వుంటుంది, గడ్డి పై పైనే వుంటుంది" అన్నాడు యూర.

కాని సెర్యోజ అభ్యంతర పెట్టాడు: "అయితే నది ఒడ్డున యిసక లేదేమిటి? గడ్డి యెండకి పెరుగుతుంది, యిసక యెండలో వూరికే వేడెక్కుతుంది."

అప్పుడు యెవళ్లో యేరిన గులకరాయినీ యాపిల్‌చెట్టు ఆకునీ, యెర్రని గాజుముక్కనీ, డెయిసీ పువ్వునీ, చెరువులో యీదే చేపల్నీ, బాతుయీకనీ, వంతెనమీద పోతపోసిన యినప కటకటాల్నీ, చెట్లలో అల్లుకుపోయిన హాప్‌తీగల్నీ పోల్చాం. పిల్లల ఆలోచనలు జలలా చిమ్ముతున్నాయి. చిన్న కుర్రాళ్లూ, అమ్మాయిలూ తమ చుట్టూతా వున్న ప్రపంచంలోని వస్తువులకీ యింద్రియగ్రాహ్యామైనవాటికీ మధ్యన కనిపించే పరస్పరాధీనతని గుర్తించారు, తక్షణం పైకి కనిపించని సంబంధాల్ని ఆవిష్కరించారు. క్రమక్రమంగా పిల్లల మనసుల్లో సజీవ,

నిర్జీవమైనవాటి మొదటి భావాలు రూపుతీసుకున్నాయి. కొన్ని సజీవమైనవి, కొన్ని నిర్జీవమైనవి - పిల్లలు చాలా ఉదాహరణలు చూశారు. కాని నేను "సజీవమైన దాన్ని నిర్జీవమైన దాన్నుంచి విడదీసేది యేది?" అని అడిగినప్పుడు, వాళ్లు జవాబు చెప్పలేకపోయారు. తేలిందేమిటంటే, యీ ప్రశ్న అడగ్గానే పిల్లలు తమ కళ్లతో చూసిందానికేసి మళ్లీ తిరిగారు. వాళ్లు సరిగ్గానే గమనించిన చిహ్నాలతో బాటుగా పిల్లలు తప్పులు కూడా చేశారు. మేం అక్కడ చేసిన సజీవ పరిశీలనాక్రమంలో వాటిని సవరించుకున్నాం. "సజీవమైనవి కదుల్తాయి, నిర్జీవమైనవి కదలవు" అని కోస్త్య చెప్పినప్పుడు అందరూ అతనితో యేకీభవించారు. కాని అప్పుడు నిశ్శబ్దం ప్రవేశించింది. పిల్లలు తమంతటతామే చుట్టూతా చూసుకున్నారు. యింక ఆ చర్చ యిలా సాగింది.

"నదిలో కొట్టుకుపోతూ వుండే కఱ్ఱ కదుల్తుంది. కాని అది ప్రాణం వున్నది కాదుగా."

"ఒక ట్రాక్టరు కూడా కదుల్తుంది. అదీ ప్రాణమున్నది కాదుకదా."

"సాలెగూడు గాలిలో యెగురుతుంది. దానికీ ప్రాణం లేదు మరి."

"పాత యింటి కప్పుమీద నాచు కదల్దు. కాని అది జీవం వున్నదే - ఏం, నాచు నిజంగా జీవం వున్నదే?"

"మరి యిసక కూడా కదుల్తుంది. మనం యిసక గొయ్యి దగ్గర వున్నాం, యిసక నదిలో యెలా పరిగెట్టిందీ చూశాం."

వుహుఁ, ఆ భేదం చలనంలో లేదు. ప్రపంచంలో సజీవ, నిర్జీవాల్ని యేది వేరుచేస్తుంది? పిల్లలు తిరిగి తిరిగి తమ చుట్టూతా వున్న ప్రపంచంలోని వస్తువుల్ని పోల్చారు. షూర సంతోషంగా అరిచాడు:

"సజీవమైంది పెరుగుతుంది, నిర్జీవమైంది పెరగదు."

పిల్లలు యీ మాటల్ని మననం చేసుకున్నారు. యింకోసారి వాళ్ల దృష్టి తమ చుట్టూతా వున్న ప్రపంచంకేసి మళ్లింది. వాళ్లు పైకే తార్కాణాలు చెప్పారు: గడ్డి సజీవం - గడ్డి పెరుగుతుంది; చెట్లు సజీవం - చెట్లు పెరుగుతాయి; అడవి గులాబిపువ్వు పొద సజీవం - అది పెరుగుతుంది. రాయి నిర్జీవం - పెరగదు; యిసక నిర్జీవం యెందుకంటే అది పెరగదు కనక. అదీ సంగతి - సజీవమైన ప్రతిదీ పెరుగుతుంది. నిర్జీవమైనదేదీ పెరగదు... మీష దేన్ని గురించో ఆలోచిస్తూ, దూరంగా చూస్తున్నాడు. తన మిత్రులు చెప్పేది వాడు విన్నాడా? పిల్లలు తమ చుట్టూతా వున్న సజీవ, నిర్జీవ వస్తువుల పేర్లు చెప్పగానే, ఆ చిన్న పిల్లవాడు అన్నాడు:

"సజీవమైంది యెండ లేకుండా వుండలేదు." అలా అని అడివికేసీ, పచ్చిక మైదానంకేసీ, పొలంకేసీ చూపించాడు.

మెల్లిగా ఆలోచించే వాళ్లకి గ్రహణశీలత, శ్రద్ధ, పరిశీలనా నైశిత్యం వుంటాయని నేను తరచుగా గమనించాను. మీష మాటలు పిల్లల ఆలోచనవి రేకెత్తించాయి. "నేను ఆ సంగతి ముందే యెందుకు ఆలోచించలేదు?" నిశ్శబ్దంగా అమ్మాయిలూ, అబ్బాయిలూ యీ ప్రశ్న తమకే వేసుకున్నారు. దృఢమైన ధారణ మరోసారి చుట్టూతా వున్న ప్రపంచంలోని వస్తువుల్ని అనుభూతం చేసుకున్నట్టు వుంది, యింకోసారి పిల్లలు పైకి అనుకున్నారు: "గడ్డి, పువ్వులు, చెట్లు, గోధుమ యెండ లేకుండా బతకలేవు. మనుషులు కూడా యెండ లేకుండా బతకలేరు. యేం, మనుషులు యెండ లేకుండా బతగ్గలరా? ఉహుం, యెక్కణ్ణో భూమి లోపల లోతుగా మనుషులు బతకడం వూహించను కూడా లేం. చెట్ల కొమ్మల నీడలో గడ్డి యెండిపోతుందని మనకి తెలుసు. మా నాన్న చెప్పాడు: "వాన కురిసిం తర్వాత యెండ గనక భూమిని వెచ్చబరచడం లేకపోతే శీతాకాలపు పంటలు పచ్చగా అవవు, యెండ లేకుండా యేం బాగోదు...." కాని రాళ్లు యెండ లేకుండా కూడా అలానే వుంటాయి. అబ్బే, వుండవు; నేలమాళిగలో అవి బూజుపట్టి పోతాయి. బూజు సజీవమా కాదా? యెండ వూరికే ఉపయోగకరమైన వాటినే తేదు: చాలాకాలం వాన కురవకపోతే యెండ పంటల్ని మాడ్చేస్తుంది: దానర్థం సజీవ వస్తువులకి యెండే అవసరం కాదు, నీళ్లు కూడా కావాలి."

అవీ పిల్లల ఆలోచనా పాయలు, యీ పాయలన్నీ కలిసి ఒక యేకైక సెలయేరుగా కలిసిపోతాయి. పిల్లలకి స్పష్టమైపోతుంది: సజీవమైనవాటిలో వాళ్లకి స్పష్టంగాని విషయాలు సంభవిస్తున్నాయి. అవి సూర్యునిలో, నీటిలో, చుట్టూతా వున్న ప్రకృతిలోని ప్రతి దానిమీదా ఆధారపడి వున్నాయి... "ప్రకృతి పుస్తకపు" మొదటి పుటలోని మొదటి పంక్తిని పిల్లలు చదువుతున్నారు. మొత్తం ప్రపంచమంతా రెండింటితో కూడివుందని వాళ్లు అర్థం చేసుకున్నారు – సజీవమూ, నిర్జీవమూ. వీటిని గురించిన వాళ్ల మొదటి అభిప్రాయాలు చాలా ప్రశ్నల్ని లేవనెత్తాయి. యిళ్లకి పోయేటప్పుడు, తమకి పరిచయమైందని అనుకున్న ప్రతిదాన్నీ, వాళ్లు పరీక్షించారు. వాళ్లు అంతకుముందు యేదీ చూడలేదని గుర్తించారు. వాళ్లు చూసే కొద్దీ సందేహాలే: కాయలోనుంచి వచ్చే చిన్ని మొలకలు మహా ఓకు వృక్షాలలా యెలా మారతాయి? ఆకులూ, కొమ్మలూ, దళసరి కాండమూ యెక్కడినుంచి వస్తాయి? ఆకులు చెట్లనుంచి ఆకురాలు కాలంలో యెందుకు రాలతాయి? శీతాకాలంలో చెట్లు పెరుగుతాయా పెరగవా? ఒక్కసారే యీ ప్రశ్నలన్నిటికీ జవాబుచెప్పడం అసాధ్యం, అలాంటి పని చేసే ప్రయత్నం కూడా మనం చెయ్యకూడదు. పిల్లలకి యీ ప్రశ్నలంటూ వుండడం మేలు. పిల్లలు ఆలోచిస్తూ జవాబులకోసం జ్ఞాన, ఆలోచనల మూలాలకి చుట్టూతా వున్న ప్రపంచంకేసి పోవడం నేర్చుకున్నారు. తన ఆలోచనలని చెప్పేటప్పుడు పిల్లవాడు కచ్చితమైన, సరైన మాట పట్టగలిగాడు. ముఖ్య అంశమైన స్పష్టమైన ఆలోచన చుట్టూతా వున్న ప్రపంచంతోటి ప్రత్యక్ష వ్యవహార క్రమంలో ఆలోచనా క్రమంలో సంపాదించబడుతుంది.

పిల్లవాడు చిత్రాల్లో, రంగుల్లో, ధ్వనుల్లో ఆలోచిస్తాడు. అలా అని పిల్లవాడు నిర్దిష్ట రూపమైన ఆలోచనా పరిధిలోనే వుండిపోవాలని కాదు. చిత్రాల్లో ఆలోచించడం అనేది భావాలు అర్థంచేసుకునే క్రమం చేరుకోడానికి అవసరమైన అడుగు. క్రమేపీ నేను పిల్లలు యీ కింది భావాలలో వ్యవహరించేటట్టు చెయ్య ప్రయత్నించాను: విషయం, కారణం, ఫలితం, సంఘటన, నియమత, ఆధారత్వం, భేదం, సారూప్యం, ఉమ్మడితత్వం, సంబంధి, విరోధి, సాధ్యం, అసాధ్యం లాంటివి. యీ భావాలు అపరిమేయ ఆలోచనా క్రమంలో పెద్ద పాత్ర వహిస్తాయని యెన్నో సంవత్సరాల అనుభవం నాకు నమ్మకం కలగజేసింది. సజీవ వాస్తవాలకీ ప్రకృతిలోకి శోధన లేకుండా, కళ్లతో చూసిందానికి పైగా ఆలోచించకుండా, క్రమేపీ నిర్దిష్ట రూపమైన వస్తువులనుంచీ, సంఘటనలనుంచీ, విషయాలనుంచీ సాధారణీకృత అపరిమేయ నిర్ధారణలకి బదిలీలేకుండా యీ భావాల్ని కరతలామలకం చేసుకోవడం అసాధ్యం. పిల్లల మనస్సుల్లో ఉద్భవించే సందేహాలు యీ బదలాయింపుని ముందుకు తీసుకెడతాయి. ప్రకృతిలో కనిపించే నిర్దిష్ట రూపాల్ని పరిశీలించడం, కార్యకారణ సంబంధం అన్వేషించడం నేను మా పిల్లలకి నేర్పాను. ఆలోచనకీ, నిర్దిష్ట రూపచిత్రాలకీ వున్న సంబంధం పుణ్యమా అని పిల్లలు క్రమేపీ అపరిమేయ భావాలతో వ్యవహరించే అలవాటు పొందారు. యిది చాలా సంవత్సరాలు పట్టే దీర్ఘమైందనుకోండి.

"ప్రకృతి పుస్తకం" చదవడం పిల్లలకి ఆసక్తికరంగా వుంది. ఆ ఆసక్తి దానికదే లక్ష్యం కాదు. అధ్యయనంలో పిల్లవాడి ప్రత్యక్ష వ్యక్తిగత ఆసక్తికి అమిత వృద్ధి వుండదనీ, పిల్లల కార్యాచరణ విద్యావిషయక క్రమపు లక్ష్యం కాదనీ సోవియట్ బోధనాశాస్త్రం అంటుంది. "పిల్లవాడికి ఆసక్తి వున్నదాన్ని చెయ్యమని నేర్పడమే కాదు, ఆసక్తిలేని దాన్ని కూడా చెయ్యమని బోధించాలి. దాన్ని చెయ్యడం తమ విధిని నెరవేర్చుకునే సంతోషం కోసమే. మీరు పిల్లవాడిని జీవితం కోసం సిద్ధపరుస్తున్నారు. మరి జీవితంలో అన్ని విధులూ వినోదంగా వుండవు" అని ఉషీన్‌స్కీ రాశాడు. విద్యార్థుల వ్యక్తిగత అవసరాల తృప్తి దృష్ట్యా అధ్యయనంలోని విషయాలనీ, రూపాలనీ, పద్ధతులనీ భావించే బూర్జువా పండితుల దృక్పథం సోవియట్ బోధనాశాస్త్రానికి పరాయిది.

సోవియట్ విద్యలో పిల్లవాడి వ్యక్తిగత ఆసక్తులు పాఠశాలలోని బోధనాత్మక లక్ష్యాలని అందుకునే సాధనంగా చూడబడతాయి – ఒక శాస్త్రీయ జ్ఞాన రంగం పొందడం, గతితార్కిక భౌతికవాద విశ్వాసాలు రూపుదిద్దుకోవడం. "ప్రకృతి పుస్తకం" చదవడంలో మేమేదో కాలక్షేపం చెయ్యడం లేదు, ఆసక్తికరమైన ఆటలో నిమగ్నులమూ కాలేదు, కాని మమ్మల్ని శాస్త్రీయ జ్ఞాన ప్రపంచానికి నడిపించే దారిలో వెడుతున్నాం. ప్రకృతి నియమాల సారం వెల్లడించే చుట్టూతా వున్న ప్రపంచపు విషయాల్ని గురించి పిల్లలు ఆలోచిస్తున్నారు. నేను "ప్రకృతి పుస్తకం"లోని విషయాన్ని ప్రతి పిల్లవాడి వ్యక్తిగత ఆసక్తుల తృప్తి కోసం కాకుండా,

ప్రపంచపు గతితార్కిక, శాస్త్రీయ అవబోధ కోసం నిర్ణయించాను. యిందులో, సోవియట్ బోధనాశాస్త్రంలో పిల్లవాడి కార్యాచరణ గమ్యం వర్ణించే సిద్ధాంతం ఆచరణాత్మక వాదుల ప్రఖ్యాత సూత్రం "ఆచరణ ద్వారా నేర్చుకోండి" అనేదాంతో విభేదిస్తుంది.

సోవియట్ బోధనాశాస్త్రంలో కార్యాచరణ అనేది ఒక క్రమబద్ధమైన శాస్త్రీయ విద్యకి ప్రత్యామ్నాయం కాదు, కాని బోధనాత్మక, సామాన్యమైన పెంపక లక్ష్యాల సాధనకి ఒక మార్గం మాత్రమే. పిల్లవాడి వ్యక్తిగత ఆసక్తి లేకుండా జ్ఞానసాధన పెంపొందించే కార్యాచరణ అనూహ్యమైనదనుకోండి. సోవియట్ బోధనాశాస్త్రంలో ఆసక్తి అనేది తర్కబద్ధ, శోధనాత్మక క్రమంలో పిల్లవాడి సృజనాత్మక ఆంతరంగిక శక్తిలో చురుకైన భాగంగా భావించబడుతుంది. ఒక విద్యార్థి కరతలామలకం చేసుకున్న సత్యాలు యేమేరకి అతని వ్యక్తిగత విశ్వాసాలవుతాయో ఆమేరకి యేది చదవగలడో, తెలుసుకోగలడో అందులో ఆసక్తి గాఢమవుతుంది. సోవియట్ బోధనాశాస్త్రంలో ఆసక్తి సిద్ధాంతంతోటీ, శాస్త్రీయ భౌతికవాద విద్యతోటీ విడదీయలేనట్టుగా కలిసిపోయింది.

మేము "ప్రకృతి పుస్తకం"లోని పుట తర్వాత పుట చదివాం, అధ్యయనం చేశాం, ఆలోచించ నేర్చుకున్నాం. పిల్లలు పరిచయం చేసుకున్న రెండవ పుట "నిర్జీవమైంది జీవంతో బంధించబడి వుంది" అని పిలిచాం. మేం గ్రీన్‌హౌస్ కెళ్లి పెద్ద పిల్లలు అదే బంగారు యిసుకలో, భూగర్భంనుంచీ పగిలిన యిటిక ముక్కలపైనుంచీ తీసుకువచ్చిన యిసుకలో, దోసకాయలు, టొమాటోలు, బార్లీ, ఓట్లు యెలా పెంచుతున్నారో చూశాం. లోహపు, కర్ర పాత్రల్లో యిసక, పగిలిన యిటుక ముక్కలు యెలా నింపుతున్నారో, వాటిలోకి రసాయనిక మిశ్రమాలు యెలా పోస్తున్నారో పిల్లలు చూశారు. యీ మిశ్రమంనుంచి దోసకాయలా, టొమాటోలా వేళ్లు పెరగడానికీ, ఫక్వం గావడానికీ యేది అవసరమో అది గ్రహించారు. ప్రాణంలేని గులకరాళ్లూ, నీళ్లల్లో కరిగిన తెల్లటి పొడీ కూడా జీవానికి అంతే అవసరం అనిపిస్తుంది. బార్లీమొక్కల ఆకుపచ్చ కాండాలు యిసుక, గులకరాళ్లూ లేకుండా కూడా చదునైన పాత్రల్లో పెరుగుతున్నాయి: వాటి వేళ్లు తెల్లటి పొడి ద్రావకంనుంచి ఆహార తీసుకున్నాయి. పువ్వులకేసీ, పక్వంచెందే పళ్లకేసీ శ్రద్ధగా చూసి పిల్లలు గమనించింది యేమంటే, సజీవమైన వాటికి నిర్జీవమైంది నీళ్లూ, యెండా వున్నప్పుడు మాత్రమే ఆధారం అవుతుంది. వెలుతురూ, ఉష్ణమూ, నీరూ లేకుండా జీవం అసాధ్యం. ఆరోజు మేఘావృతంగా వుంది, గ్రీన్‌హౌస్‌లో విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. బయట చల్లగా వుంది, కాని గ్రీన్‌హౌస్‌లో సెంట్రల్ హీటింగ్ పైపులు గాలిని వెచ్చబరుస్తున్నాయి.

నేను పిల్లలకి చెప్పాను: "మీకు చుట్టూతా కనిపించే వాటిని జాగ్రత్తగా చూడండి. సజీవమైంది నిర్జీవమైంది లేకుండా మనగలదో లేదో ఆలోచించండి. మీముందు అనేక రసాయనిక యెరువులు వున్న చిన్న పాత్రలతోటి పెద్ద పాత్ర

కనిపిస్తోంది. మీ సీనియర్లు అయిన మీ మిత్రులు తెలుపు, పసుపు, బూడిదరంగూ పొళ్లు తీసుకుని యెలా నీళ్లల్లో కరగబెడుతున్నారో చూడండి. వాళ్లు ముతక యిసుక, ఆకులు కుళ్లిన మట్టీ కలిపి సారవంతమైన మట్టి తయారు చేస్తున్నారు. ఆ మిశ్రమంలో యెంత రసంవూరే టొమాటోలు పండుతాయో చూడండి. ఆ మొక్క తన కవసరమైన పదార్థాలని తన ఆకుల కోసమూ, కాండాల కోసమూ, పళ్ల కోసమూ యెక్కడినుంచి తీసుకుంటుంది? నిర్జీవమైన వాటినుంచి. నిర్జీవమైంది సజీవమైన దానికి ఆధారం అవుతుంది." యీ సత్యాలు పిల్లల మనసుల్లో ప్రకృతి రహస్యాలపట్ల ఆశ్చర్యానుభూతిని మేల్కొల్పాయి.

మళ్లీ అరిస్టాటిల్ (384-322 క్రీ.పూ.) దని చెప్పే ప్రాచీన సూక్తి గుర్తుకు వస్తోంది: ఆలోచనాక్రమం ఆశ్చర్యంతో మొదలవుతుందని. ప్రకృతి రహస్యాల ఆవిష్కరణ పట్ల నిజమైన ఆశ్చర్యం ఆలోచనా క్రమాన్ని నడిపించే శక్తివంతమైన ప్రేరణ. పిల్లలు విభిన్నమైన మొక్కలు - టొమాటోలు, దోసకాయలు, బార్లీ - రసాయనిక మూలకాల మిశ్రమంలో నుంచి యెలా పెరుగుతుతున్నాయో చూశాక, నన్ను ప్రశ్నలతో ముంచెత్తేశారు: "ఆ తేటగా వున్న ద్రావకం మందమైన కాండాలకిందా, తమ చుట్టూ తేనెటీగలు మిడిసి తిరిగే కాంతివంతమైన పువ్వులకిందా, రసం నిండుగా వుండే పళ్లకిందా యెలా మారుతుంది?" "సజీవమైంది యెక్కణ్ణుంచి వస్తుంది? సూర్యుడు మొక్కల కోసం ఆకుపచ్చని మొక్కలు తెస్తాడా లేక ఉష్ణమూ, కాంతీ మాత్రమే యిస్తాడా?" "అదే ద్రావకంనుంచి పచ్చటి దోసకాయలూ, యెర్రటి టొమాటోలూ యెలా పెరుగుతాయి?" "దోసకాయలు ఆకుపచ్చగా యెందుకు వుంటాయి, టొమాటోలు యెర్రగా వుంటాయి, అది కూడా అవి రెండూ పక్కపక్కనే పెరిగేటప్పుడు?" "యీ విభిన్నమైన రంగులున్న పొళ్లలో యేముంది?" "ఆకులు కుళ్లిన ఎరువు మట్టితో కలిస్తే దాన్నుంచి చెట్లు ఆకుపచ్చగా యెలా మారతాయి?"

సజీవ, నిర్జీవమైన వాటి మధ్య సంబంధాలని గురించిన దృశ్య భూతభావాలు పిల్లవాని యితోధిక మేధాభివృద్ధికి చాలా ముఖ్యం! "సజీవమైంది యెక్కణ్ణుంచి వస్తుంది?" అలాగే "సూర్యుడు నిర్జీవమైందాన్నుంచి సజీవమైందాన్ని యెలా చేస్తాడు?"లాంటి ప్రశ్నలని గురించి ఆలోచించి పిల్లవాడు మహత్తర జీవితగ్రంథాన్ని తనంతట తనే చదవడానికీ, అత్యంత క్లిష్టమైన క్రమాలలోని రహస్యాలని గురించి నేర్చుకోవడానికీ సిద్ధమవుతాడు.

"ప్రకృతి పుస్తకం" చదవడం అనేదాన్ని మానసికమైన చురుకుదనం తేవడానికి సాధనంగా నేను చూశాను. భావాలు, బొమ్మలు, చిత్రాలు చురుకైన ఆలోచనకి ప్రారంభం మాత్రమే. "ప్రకృతి పుస్తక" పఠనం వూరికే ప్రకృతి చిత్రాలా, బొమ్మలా గ్రహణ మాత్రమే కాకుండా, చురుకైన ఆలోచనకీ, ప్రపంచాన్ని సిద్ధాంతపరంగా దర్శించడానికీ, పద్ధతిగల శాస్త్రీయ జ్ఞానానికీ నాందిగా వుండేటట్టు చదవడాన్ని తయారుచెయ్య ప్రయత్నించాను.

"చాలా ఉత్తమమైన విషయం విద్యార్థుల చైతన్యంలోకి వాళ్ల వ్యక్తిత్వంలో భాగమయేటట్టుగా కలిసినప్పుడే చేరుతుంది" అని ప్రఖ్యాత సోవియట్ మనస్తత్వ శాస్త్రవేత్త జి. కొస్ట్యూక్ రాశాడు. కార్యాచరణ కార్యాచరణ కోసమే కాదు, వ్యక్తిగత ప్రయోజనాల తృప్తి కోసం కాదు, కాని శాస్త్రీయ జ్ఞాన విషయాన్ని వెల్లడి చేసే కార్యాచరణ - అదీ యేకతలోని సారం, సోవియట్ బోధనాశాస్త్రంలోని క్రియాత్మకమైన శాస్త్రీయ లక్షణం.

"ప్రకృతిలో ప్రతీదీ మారుతుంది" - "ప్రకృతి పుస్తకం"లోని తరవాతి పుట పేరు. మేము యీ పుటని కొన్నిసార్లు తిరగేశాం. ఆకురాలు కాలంలో ప్రకాశమానంగా వున్న వొక రోజున మధ్యాహ్నం భోజనాల వేళప్పుడు మేం పళ్లతోటలోకి వెళ్లాం. పళ్ల భారంతోటి యాపిల్, పియర్ చెట్ల కొమ్మలు వంగాయి. "చూడండి, శీతాకాలంలో మన పళ్లతోట యెలా కనిపించిందో - అంతా బోసిగా, కొమ్మలన్నీ కూడా తెల్లటి మంచుతోటి కప్పడిపోయి, కాండాల చుట్టూతా మంచుతోటి.... కాని యిప్పుడు కొమ్మలన్నీ దట్టమైన హరితంతో కమ్ముకుని వున్నాయి, భూమాత రసాల్తో యాపిల్‌పళ్లూ, పియర్‌పళ్లూ తమని నింపుకుంటున్నాయి."

రెండు నెలల తర్వాత మేం మళ్లీ పళ్లతోటకి వెళ్లాం. అది యెలా కనిపించింది? పసుప్పచ్చని ఆకులు నేలని మెత్తటి తివాసీలా కప్పేశాయి, కొమ్మలు సగం బోసిగా వున్నాయి. ముసలిదైన, దొల్లగా వున్న యాపిల్ చెట్టు ఒకటీ, ఒక చిన్న అడివి యాపిల్ చెట్టు ఒకటీ పక్కపక్కనే పెరుగుతున్నాయి. ఆ యాపిల్ చెట్టు మా తాతలు నాటింది. దానిమీద సగం కొమ్మలు చచ్చిపోయాయి. యేదో కొద్దిగా మాత్రమే ఆకుపచ్చగా వున్నాయి, వాటిమీదే రసం వున్న గుండ్రటి పళ్లు వున్నాయి. యింకో రెండేళ్లలో ఆ ముసలి యాపిల్ చెట్టుని కొట్టెయ్యాల్సి వస్తుంది. కాని ఆ మొలక సున్నితమైన కాడమీద మృదువైన చిగురు ఆకుపచ్చగా వస్తోంది. విద్యార్థులు యీ మొలకని ముసలి యాపిల్ చెట్టుతోటి అంటుకట్టారు. సంవత్సరాలు గడుస్తాయి, ఆ మొలక చెట్టవుతుంది, వికసిస్తుంది, బంగారు పళ్లు దానిమీద పక్వానికి వస్తాయి.

"మీ చుట్టూతా జాగ్రత్తగా చూడండి. పిల్లలూ, ఒక్క చెట్టేనా అస్తమానూ ఒక్కలాగే వుండేది కనిపిస్తోందా?"

పిల్లల జీవితానుభవం గొప్పది కాదు, కాని పసితనంనుంచీ వాళ్లు శ్రమ ప్రపంచంలో, ప్రకృతిలో బతికారు. వాళ్లకి తెలుసు మొక్కలు పెరుగుతాయి, వికసిస్తాయి, పళ్లు కాస్తాయి... లేత మొలక నేలలోంచి యెలా పైకి వస్తుందీ, మందమైన కాండం వున్న మొక్కలా యెలా పెరుగుతుందీ, చెట్లపైన చిగుళ్లు యెలా వస్తాయీ, యెలా ఆకులు వస్తాయీ వాళ్లకి తెలుసు... సజీవమైన వాటి ప్రపంచంలో వేగవంతంగా, గెంతులు వేస్తూ వచ్చే మార్పులకి వాళ్లు ఆశ్చర్యపోయారు. అంతకు ముందురోజున మేం పీచ్‌పళ్ల తోటలోకి వెళ్లాం, నల్లని చిగుళ్లూ, బోసిపోయిన కొమ్మలూ చూశాం. యివాళ మేం ఉదయం పెందరాళే వెళ్లాం. ఒక సరికొత్త చిత్రం

మాముందు ప్రత్యక్షమైంది: కొమ్మలమీద విరుస్తున్న చిన్న, గులాబీ రంగు పువ్వులు వున్నాయి.... ఆ మొగ్గలు అంత త్వరగా యెందుకు వికసించాయి - రాత్రికి రాత్రే చెట్లు విరగబడి పూసాయి? అవి రాత్రి నిద్రపోయాయా లేదా? అసలు చెట్లు మామూలుగా నిద్రపోతాయా పోవా? కొమ్మలు కొట్టేస్తే చెట్టుకి బాధగా వుంటుందా, వుండదా? చెట్లు యెందుకు ముసలివై చచ్చిపోతాయి? వీటికి జవాబులు వెదకడం కోసమని నేను చాలాసేపు ఆలోచించాల్సి వచ్చింది. కాని ఆ జవాబులు కొత్త ప్రశ్నల వర్షాన్ని తెచ్చాయి.

మేము "ప్రకృతి పుస్తకపు" యీ పుటను చెరువు అంచు దగ్గర, కనుమలో, పొదల గుబుర్లో, పొలంలో చదివాం. నీళ్లు తక్కువగా వున్న చోట తోకకప్పలు యీదుతున్నాయి. పిల్లలకి తెలుసు అవి కప్పలు అవుతాయని. కాని అదెలా జరిగింది? అక్వేరియమ్‌లో వుండే అతి చిన్న చేప కూడా చేపలాగా కనిపిస్తుంది, కాని తోకకప్ప కప్పలాగా అసలు కనిపించదేం? వ్యవసాయ సమష్టి క్షేత్రం వాళ్లు పట్టుపురుగులని మేపడం చూశాం. గసగసాల గింజల్లా వున్న చిన్న గుడ్లనుంచి అబగా తినేసే చిన్ని పురుగులు ప్రత్యక్షమయ్యాయి. అవి మల్‌బరీ ఆకులు మాత్రమే యెందుకు తింటాయి? పట్టుపురుగు పెరుగుతుంది, కొన్నిసార్లు పాత చర్మం వదిలి పెడుతుంది - యెందుకు? అది పట్టుకాయ తన చుట్టూతా అల్లుకుని తన చిన్ని బంగారు యింట్లో దాక్కుంటుంది - ఆ లోపల యేం జరుగుతుంది? మేం కొన్ని పట్టుకాయల్ని తీసుకుని వాటిని కిటికీలో పెట్టాం. కొంతకాలం తర్వాత యెంతపెద్ద అందమైన సీతాకోకచిలకలు ప్రత్యక్షమయ్యాయి! ఆ సీతాకోకచిలకలు గుడ్లు పెట్టాయి, మళ్లీ అదే క్రమం మామూలే. ఆ పురుగులు సన్నని పట్టుదారాన్ని యెలా చేస్తాయి? పట్టుకాయలు అల్లుకోవడం ఆరంభించే ముందు బోలెడు మల్బరీ ఆకులు యెందుకు తిన్నాయి?

ప్రకృతిని గురించిన చురుకైన గుర్తింపుతో యెంత యెక్కువ క్రియాశీలత్వం కలిసివుంటే, అంత లోతుగా ఆలోచించి చుట్టూతా వున్న ప్రపంచంలో దృశ్యమానమవుతుంది. నెలలు గడిచేకొద్దీ పిల్లలు తాము అంతకు ముందు శ్రద్ధ పట్టని తమ చుట్టూతా వున్న దాన్ని గురించి యింకా యింకా యెక్కువ గమనించారు. ఆరకంగా వాళ్లు తమకి పరిచయమైన దాంట్లో అసలు పోలికే లేని జీవ రూపాలు చూశారు. చీకటిగా చెమ్మగా వున్న నేలమాళిగలో గుండ్రని బంగాళాదుంపలమీద తెల్లటి ఆకుచిగుళ్లు చూశారు. అవి వేళ్లా లేక రాబోయే కాండాలా? చెట్ల కాండాలకి చీకటిగా వుండే ఉత్తరంవేపు ఆకుపచ్చ నాచు పెరుగుతుంది. అది యెందనుంచి యెందుకు దాంకుంది? నాచుకి విత్తనాలు యెందుకు వుండవు? అది యెలా వ్యాపిస్తుంది? అన్ని మొక్కలూ వికసిస్తాయి నాచు తప్ప. నాచు యేరకం మొక్క?

"ప్రకృతి పుస్తకం"లోని కొన్ని పంక్తులు మారేవి సజీవమైనవి మాత్రమే కాదని పిల్లలకి నమ్మకం కలిగించాయి. మేం నది ఒడ్డుకు వెళ్లాం. పిల్లలు బూడిదరంగురాళ్లు పరీక్షించి, వాటిలో పగుళ్లు చూశారు. పిల్లల చేతుల్లోకి చిన్నచిన్న

ముక్కలు వూడి వచ్చాయి. అంటే రాళ్లు కూడా రాళ్లల్లాగే యెప్పటికీ వుండలేవన్నమాట. కొన్ని నెలల క్రితం వాళ్లేమన్నదీ పిల్లలు గుర్తు చేసుకున్నారు: "రాళ్లు యెండలో వున్నా నేలమాళిగలో వున్నా ఒకలాగే వుంటాయి. రాళ్లు పగలు వేడెక్కుతాయి, రాత్రిళ్లు చల్లబడతాయి. బీటలు యేర్పడతాయి, నీళ్లు వాటిల్లోకి పోతాయి. మొత్తానికి రాళ్లు కూడా శాశ్వతం కావని తేలింది."

"ప్రకృతిలో ప్రతిదీ మారుతుంది" అనేదానికి అంకితమైన పాఠాల్ని పరిశీలించి ఒక విషయం గమనించాను. అదేమిటంటే పిల్లవాడు కనిపెట్టే కొద్దీ తను అంతకుముందు గమనించని నిత్యజీవిత నియమాలు ఆవిష్కరించుకుంటాడు, తను తెలుసుకోవాలనుకునే కొద్దీ పరివేష్టిత ప్రపంచంలోని విషయాలపట్ల అతని స్పర్శ యింద్రియాలు యింకా అదనంగా తయారవుతాయి, అంత సన్నిహితంగా అతని స్పర్శేంద్రియాలు ఆలోచనా క్రమంతో ముడిపడతాయి.

సమాచార ప్రవాహం మానసిక అభివృద్ధికి ముఖ్యమైన షరతుల్లో ఒకటి. ఆ ప్రవాహం యేదో ఒక కారణంగా నీరసించిపోయినా, లేకపోతే విస్తృతం కాలేకపోయినా యేమవుతుంది? పిల్లవాడు తనకిగా చూసేది యింకా సమాచార ప్రవాహం కాదు. పెద్దలు తమ ప్రాపంచిక జ్ఞానాన్ని పిల్లలకి దత్తం చెయ్యడంలో, వాళ్ల భావాల శక్తి క్రమేపీ పిల్లవాడిని ప్రభావితం చెయ్యగల సమాచార ప్రవాహంలాగా వుండటంలో ఒక వ్యక్తి బోధన యిమిడి వుంటుంది.

ప్రతి పిల్లవాడి గృహవాతావరణాన్నీ, పరిసరాన్నీ పిల్లవాడు పుట్టిందగ్గర్నుంచి బడిలో ప్రవేశించేదాకా, నేను జాగ్రత్తగా అధ్యయనం చెయ్యనారంభించాను. ఆసక్తిదాయకమైన సంగతులు తెలియవచ్చాయి. బడిలోకి ప్రవేశించేముందు తన యిచ్ఛకి తననే పిల్లవాణ్ణి వదిలేస్తే, యేది లేకుండా మామూలు మనుషుల పరిసరం అనూహ్యమో ఆ సమాచార ప్రవాహాన్ని పెద్దవాళ్లు సృష్టించలేనట్లయితే పిల్లవాడి మెదడు ఒక జడ స్థితిలో వుండిపోతుంది: జిజ్ఞాసా, ఆతృతా యిగిరిపోయి, ఉదాసీనత్వం పెరుగుతుంది. జ్ఞానం కోసం పెరిగే ప్రయత్నం, చాలావరకు పిల్లవాడి మేధాభివృద్ధిని నిర్ణయించే ఆలోచనయొక్క ముఖ్యమైన శక్తి అవుతుంది.

పేత్రిక్‌ని బాల్యంలో అతని యిచ్ఛకి వదిలేశారు. ఉదయం అతని తల్లీ, తాతా పనిలోకి పోయేవాళ్లు. ఆ చిన్న పిల్లాడు ఒంటరిగా యింటి దగ్గరుండిపోయేవాడు. గాదెషెడ్డు కిందనో, కంచెకట్టిన దొడ్లోని పచ్చిక బయలుమీదనో వుండిపోయేవాడు. తడవ తడవకీ పొరుగు ఆమె కుర్రాడు సరిగా వున్నాడో లేదో అని చూసేది. ఆరకంగా పేత్రిక్ రెండేళ్లనుంచి అయిదేళ్లు వచ్చేదాకా "పెంచబడ్డాడు." అది "కూరాకు" పెంపకం. పిల్లవాడికి సుష్టుగా తిండీ వుండేది, ఒంటినిండా బట్టా వుండేది, బూట్లూ వుండేవి. కాని యేది అతిముఖ్యమో అది లేకుండా పోయింది – మానవ పరిసరం. అయిదో యేటనుంచీ పేత్రిక్ మిగతా పిల్లల్తోటి, ప్రధానంగా తన యీడు పిల్లల్తోటి, వీధుల్లో ఆడుకుంటూ వుండేవాడు. బళ్లోకి వచ్చేటప్పటికి మాతృభాషలోని కనీసపు పదాలకి కూడా అర్థం తెలియదతనికి. చుట్టూతా వుండే

వస్తువులమీదనుంచి జారిపోయే అతని ఉదాసీన చూపు తీరు చిన్న ముసలాడి వాలకంలా వుండేది. ఆలోచనకి గల సజీవ పదార్థం - మెదడుపేటిక కణాలు- జడమైపోయాయన్న మాట. యెందుకంటే నాడీమండలం రూపు తీసుకునే అతి ముఖ్యమైన కాలంలో, మెదడు బాల్య కాలంలో, ఆ పిల్లవాడికి చుట్టూతా వుండే ప్రపంచంనుంచి సమాచారం వేగంగా ప్రవహించడం లేకపోయింది. అంచేత "ప్రకృతి పుస్తక" పఠనం చిన్న పిల్లవాడి విద్యలో పెద్దపాత్ర వహించాల్సి వచ్చింది.

మేం "ప్రకృతి పుస్తకం"లోని తరవాతి పుట తిప్పాం, "జీవిత విత్తనాలు." ఆకురాలు కాలంలో పిల్లలు పియర్, యాపిల్, పీచ్, ప్లమ్ విత్తనాలని స్కూలు పళ్లతోటలో పాతడానికి పోగుచేశారు. వాళ్లకి మొక్కలు గింజలనుంచి పుడతాయనేది అనుభవంవల్ల అప్పటికే తెలుసు. వసంతరుతువులోనూ, వేసవిలోనూ పచ్చిక మైదానంమీదా, అడవుల్లోనూ, తోపుల్లోనూ జీవం తొణికిసలాడేటప్పుడు, మొక్కలమీద విత్తనాలు పక్వానికొచ్చేవి, ఆ జాతి పునరుత్పత్తి చేసుకునేది. మేం ఒక విహారయాత్రకి వెళ్తున్నాం. వసంతరుతు మారుతం పొప్లార్ చెట్లమీదనుంచీ, డాన్డేలియాన్ పువ్వులమీదనుంచీ చిన్నతెల్లని దూది పింజల్ని యెగరగొడుతోంది. ఆ తేలిక దూదిలో పిల్లలు చిన్న విత్తనాలను చూశారు. ప్రకృతి యీ విత్తనాలతోటి యెంత యాతన పడిందోనని ఆశ్చర్యపోయారు: అవి పొడినేలని అంటిపెట్టుకుపోయి వుంటాయి. కాని తడి తగలగానే ఆ దూది నేలకి లంగరువేసుకుని గుచ్చుకుపోయేది, ఆ చిన్న విత్తనాలు మొలకెత్తేవి. పిల్లలు "ప్రకృతి పుస్తకాన్ని" పంక్తిపంక్తీ ఆసక్తిగా చదువుతున్నారు. కొన్ని మొక్కలనుంచి విత్తనాలు యెలా "పేలేవో," జీవితపు విత్తనాలు అన్ని వేపులకీ యెలా చెల్లాచెదురయేవో, గాలిలో వూగే గసగసాల తలలలోని "చిన్ని కిటికీల" నుంచి మిగతావాటి కంటే ముందే పక్వమైన విత్తనాలు యెలా యెగిరిపోయేవో వాళ్లు చూశారు. మనుషుల బట్టల్నీ, జంతువుల బొచ్చునీ పట్టుకునే విత్తనాల కొక్కేలూ గోళ్లూ, భూతద్దం తోటి చూసి పరీక్షిస్తున్నాం. రకరకాల ధాన్యాల విత్తనాల్ని పోగుచేస్తున్నాం. చిన్న విత్తనంనుంచి పెద్దచెట్టు యెలా పెరిగేదీ పిల్లలు ఆలోచిస్తున్నారు. విత్తనాలు సజీవమా నిర్జీవమా? పిల్లలు శీతాకాలంలో ఆ పుటలోని కొన్ని ఆసక్తికరమైన పంక్తులు చదువుతున్నారు; కొన్ని చెట్లు మంచుమీద విత్తనాలు రాలుస్తాయి, అవి మొలకెత్తే ముందు కొన్ని వారాలుగా మంచులో పడి వుండాల్సిందే.

పిల్లలు యెంత తీవ్రంగా జ్ఞాన సముపార్జన కోసం ప్రయత్నిస్తే అంతగా తమ కృషిలో ఆసక్తి చూపిస్తారు, పరిశోధనా లక్షణం వెల్లడి అవుతుంది. ఆచరణ ఆలోచనాశీలికి సహకరిస్తే శ్రమలో తనని ప్రేరేపించిన ప్రశ్నకి పిల్లవాడు సమాధానం పొంద ప్రయత్నిస్తే, ఒక చిక్కు సమస్యని పరిష్కరించదలిస్తే, ప్రస్తుత సమయానికి వున్న సమస్య యేమిటీ అనేదాన్ని సత్యాన్ని నిర్ధారించ ప్రయత్నిస్తే, పరివేష్టిత ప్రపంచంనుంచి సమాచారపు ప్రవాహం మరీ ముఖ్యంగా బలమైన ప్రేరణ అవుతుంది. ఒత్తిడివల్ల కాకుండా, అచ్చమైన కోరిక ద్వారా శ్రామికుడు అయిన

పిల్లవాడు సిసలైన ఆలోచనాపరుడుగా అవుతాడు. పని చెయ్యాలి అన్న పిల్లవాడి కోరిక ఆధారం మొట్టమొదటగా "తెలుసుకోవాలి" అన్న కోరికలో ప్రత్యక్ష మవుతుంది. యీ కోరికని అభివృద్ధి చేస్తే, పిల్లవాడిలో శ్రమపట్ల ఆసక్తి బలపడుతుంది. బోధనా ఆచరణలో పని పట్ల ప్రేమ అని పిలిచేది ఆతృతతోటీ, కుతూహలంతోటీ, ఒక రకమైన మానవ గౌరవంతోటీ పిల్లవాడిలో గోచరమవుతుంది.

"ప్రకృతి పుస్తకం"లోని "సూర్యుడు - జీవన ఆధారం" అన్న విషయానికి సంబంధించిన పుటలు పిల్లల చైతన్యంమీద, ఉద్రేకమిళిత జ్ఞాపకాలమీద గాఢమైన ముద్రవేస్తాయి. కుతకుతలాడి పోయే ఓ వేసవి రోజున మేము పొలంలోకీ, తోటలోకీ, ద్రాక్షతోటలోకీ వెళ్లేవాళ్లం. గోధుమ పొలాలు, పొద్దు తిరుగుడు పువ్వులు, ద్రాక్షగుత్తులు, బంగారు పియర్ పళ్లు, పక్వానికి వచ్చే టొమాటోలు మా ముందు విస్తరించుకుని వున్నాయి. సారవంతమైన భూమాత వరాలైన వీటన్నిటిలోనూ పిల్లలు సూర్యుని వెలుతురూ వేడీ దర్శించారు. సూర్యుని పుణ్యమా అని మనిషికి అవసరమైనవన్నీ భూమాత యిచ్చింది. పిల్లలు యెన్నో పరిశీలనలూ, పోలికలూ చేశారు. కార్యకారణ సంబంధం నిర్ణయించారు. వీటి పర్యవసానం పిల్లలకి ఆశ్చర్య కారణమైంది. అది వాళ్ల వూహలు యెగరడానికి నూతన ప్రేరణ అయింది. పిల్లలు తమ చుట్టూతా వుండే ప్రపంచాన్ని పరీక్షించారు, ప్రతిదాని పుట్టుక గురించీ ఆలోచించారు. సూర్యుడే జీవికకి వున్న ఒక్క ఆధారమూ అని తేలినాక యింకా ఆ ఆశ్చర్యానుభూతి లోతైంది.

రొట్టె, బంగాళదుంపలు, పొద్దు తిరుగుడు పువ్వులు - సూర్యుడు లేకుండా ఒక్కటి కూడా వుండలేదు. మాంసం, పాలు, వెన్న కూడా వుండలేవు, యెందుకంటే పశువులు యెండా, వేడీ పుణ్యమా అని నేలలో పెరిగిన మొక్కల్ని తింటాయి. "సూర్యుడు యేమిటి? మనకి పంపించే వెచ్చదనం సూర్యుడికి యెక్కడనుంచి వస్తుంది? శీతాకాలంలో సూర్యుడు భూమిని అంత తక్కువగా వెచ్చబరుస్తాడేం? సూర్యుడు మాడిపోతే యేమవుతుంది?" అని ఆశ్చర్యపడి పిల్లలు అడిగారు.

"ప్రకృతి పుస్తకం" చదివేటప్పుడు ఉద్భవించిన యీ ప్రశ్నలు ఉన్నత విజ్ఞానం వేపు యెగిరే ఆలోచనలకి నాంది. దాంతోటి కొన్ని యేళ్ల కాలంలో పిల్లలు సంక్లిష్ట జీవిత రహస్యాల్ని వెల్లడి చేసుకోగలుగుతారు. నేను పిల్లల్ని కుతూహలపూరిత శోధకులుగా, ప్రపంచ ఆవిష్కర్తలుగా వుండేటట్టు చెయ్య ప్రయత్నించాను. అలా అయితే సత్యమనేది యేదో తయారుగా వుండి ఉపాధ్యాయులు విస్తట్లో వడ్డించిన పరిష్కారంగా కాకుండా, తమ చుట్టూతా వున్న ప్రపంచపు స్పష్టమైన చిత్రంగా, ఆతృతతో కొట్టుకొనే గుండెలు అనుభవంలోకి తెచ్చుకునేటట్టుగా వుంటుంది. ఒక ఆవిష్కరణ పిల్లవాడికి ప్రేరణ కలిగిస్తే సత్యం అనేది వ్యక్తిగత విశ్వాసం అవుతుంది. దాన్ని పిల్లవాడు జీవితమంతా నిలుపుకుంటాడు. మేధానుభూతులు, జ్ఞానపు సంతోషాన్ని అనుభవించడం, ప్రకృతి మహత్త్వంపట్ల, ప్రకృతి ధర్మాల క్రమత్వంపట్ల ఆశ్చర్యం - యిదీ ఘనమైన ధారణకి మూలం.

కొంతమంది పిల్లల ధారణని అభివృద్ధి చెయ్యడానికీ, దృఢపరచడానికీ మేధానుభూతులు ప్రధానమైన సాధన అని నేను గమనించాను. వాల్యాకి ధారణ తక్కువ; ప్రతిదీ యీ చెవిలోంచి దూరి ఆ చెవిలోంచి అవతలికి పారిపోతూన్నట్టుండేది. చుట్టూతా వున్న ప్రపంచంలోని దృశ్యాలపట్ల ఆశ్చర్యంతో ఆ పిల్ల గుండె కొట్టుకునేటట్టు నేను చెయ్యాలి. "ప్రకృతి పుస్తకం"లోని "ప్రతి సజీవమైందీ తన పరిసరాలకి అనుగుణంగా మారుతుంది" అన్న పుట చదవడానికి మేం పొలాల్లో, అడవుల్లో, నది ఒడ్డున, తోటలో, యేపియరీకీ కొన్నిరోజులు తిరిగాం. ఉష్ణ వాతావరణంలో కొన్ని పువ్వులు ముడుచుకుపోతూవుండటాన్నీ, సాయంత్రపు చల్లదనంలో విచ్చుకోవడాన్నీ నేను పిల్లల దృష్టికి తెచ్చాను. తెల్లని అడవి పువ్వుయొక్క మృదువైన కాండం రాలిపోయిన ఆకుల దళసరి పొరల్లోంచి బాణంలా యెలా పైకి చొచ్చుకు వస్తోందో, తేనెటీగలు యెలా తమ తేనెపట్లని కట్టుకుని, పట్టులో తేనె నింపుతాయో, తడి కోసమని మూడు మీటర్ల లోతుకి ద్రాక్ష మొక్కలు తమ వేళ్లని యెలా పాదుకుంటాయో, విల్లో కొమ్మలు రొంపిలోకి యెలా పడి వేళ్లు తన్నుకుని అందులోనుంచి యింకో చెట్టు మొలుస్తుందో నేను పిల్లలకి చూపించాను... యీ ఆవిష్కరణలు ఆ చిన్ని పిల్ల హృదయాన్ని సంతోషాతిశయంతో నింపేశాయి. ఆ పిల్ల కళ్లల్లోని ఉదాసీన భావం సజీవ వైయక్తిక ఆసక్తికి దారి చేసింది. ముభావంగా వుండే వాల్యా మాట్లాడ్డం మొదలెట్టి చాలా ప్రశ్నలు వేసేది: "మరి యింటికి వెనక్కి పోవడం తేనెటీగకి యెలా తెలుసు? తన తేనె గూళ్లని అది యెలా కనిపెడుతుంది? నేలమీద మంచు ఇంకా వుంది కాబట్టి తెల్లని అడవి పువ్వు వికసిస్తూ చల్లగా లేదూ?" సందేహాలు వున్న చోట ఆలోచనలు వుంటాయి, ఆలోచనలు వున్న చోట చుట్టూతా వున్న ప్రపంచపు బొమ్మల్నీ, ప్రకృతి ధర్మాల్నీ ధారణ పదిలపరుస్తుంది.

మేం ఒకదాని తర్వాత ఒకటిగా చదివిన "ప్రకృతి పుస్తకం"లోని పుటలు యివీ: "వృక్ష, జంతు ప్రపంచం.", "నీటిబొట్టు ప్రయాణం", "మనిషి ప్రకృతి శక్తుల్ని వాడుతున్నాడు", "వసంతరుతువులో ప్రకృతి మేల్కొంటోంది.", "వేసవిలో అతిదీర్ఘ పగలు", "అడివిలోనూ, పొలంలోనూ, పచ్చిక మైదానంలోనూ వసంత పుష్పాలు", "వేసవి పుష్పాలు", "క్రిసాన్తెమ్స్, వయొలెట్స్", "చేమంతులు- ఆకురాలు కాలపు బిడ్డలు", "చెరువులో జీవితం", "ఆకురాలు కాలపు ఆఖరి రోజులు", "ప్రకృతి శీతాకాలం కోసం నిరీక్షిస్తోంది", "శీతాకాలపు తొలి ఉదయం", "శీతాకాలపు అడవిలోని పక్షుల జీవితాలు", "గోధుమ కంకులు", "తేనెటీగ కుటుంబంలో జీవితం", "స్వాలో పక్షులు గూళ్లు కట్టుకుంటున్నాయి", "చేరువౌతున్న తుఫాను", "ఆకురాలు కాలంలో వాన వాతావరణం", "శీతకట్టు మధ్యంలో పుష్ప ప్రపంచం", "అడివి తేమని భద్రం చేసుకుంటోంది", "కొంగలు వచ్చేశాయ్", "శీతకట్టులో దక్షిణాదికి యెగిరి పోవడానికి పక్షులు తయారవుతున్నాయి", "వేసవిజడి తర్వాత యెండ", "నదిమీద యింద్రధనస్సు", "శీతాకాలపూ, వసంతకాలపూ పంటలు",

"పొద్దుతిరుగుడు పువ్వులు వికసించ నారంభించాయి", "ఆకాశంలో నక్షత్రాలు", "మట్టిలో జీవం", "హరిత పత్రం, యెండకి గాదె", "పుట్టగొడుగులూ, నాచూ", "కాయనుంచి ఓక్‌చెట్టు యెలా పెరుగుతుంది" యింకా అలాంటివి చాలా.

అసమర్థుడైన ఉపాధ్యాయుడు సత్యాల్ని అందిస్తాడని, సమర్థుడైనవాడు వాటిని యెలా కనిపెట్టాలో చూపిస్తాడని రాశాడు ఎఫ్. ఏ. డిస్టర్ వెగ్. మన కాలంలో చుట్టూతా వున్న ప్రపంచంలోని విషయాలపట్ల శోధనాత్మక దృష్టి ప్రత్యేక ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. పిల్లవాళ్ల ఆలోచనా పద్ధతి పరిశోధనమీదా, శోధనమీదా ఆధారపడి వుండటం చాలా ముఖ్యం. యెందుకంటే శాస్త్రీయ సత్యాలని గ్రహించడం అనేది, సత్యాలని రాశి కూర్చుకోవడమూ, వివరణ యివ్వడం, తులనాత్మకత, విభేదం చూడ్డంకంటే ముందు జరుగుతుంది. ప్రకృతి విషయాలు, బొమ్మల పరిశీలనలో పిల్లవాడు ఆలోచనా క్రమాలనీ, రూపాలనీ సాధిస్తాడు, అర్థంచేసుకునే తన శక్తిని పెంపొందించుకుంటాడు. యిదంతా కూడా ఒక చురుకైన పరిశీలన గమనించే కార్యకారణ సంబంధం తాలూకూ అసలైన కూలంకష ఆలోచనతో నిండుతుంది. "ప్రకృతి పుస్తకం" చదివేటప్పుడు పిల్లవాళ్ల ఆలోచనా క్రమంలో ఒక విలక్షణం వుంది. అదేమిటంటే, పిల్లలు సాధారణ భావనలతో వ్యవహరించేటప్పుడు, యీ భావనలు ఆధారపడి వున్న భావాలనీ, చిత్రాలనీ, బొమ్మలనీ యోచనాయుతంగా యత్నించారు.

బాల్యంలో "ప్రకృతి పుస్తకాన్ని" చదివిన మా విద్యార్థులు యుక్తవయస్సు వచ్చేవాళ్లుగానూ, తర్వాత సాధారణ యువకులుగానూ, యువతులుగానూ తయారయాక, బౌద్ధికాభివృద్ధిలో చుట్టూతా వున్న ప్రపంచపు క్రియాశీల జ్ఞేయం వాళ్ల మేధాశ్రమలోనూ, బహుముఖ బౌద్ధికాసక్తుల్లోనూ ఎలా ప్రభావం కలగచేసిందో దానిమీద ప్రత్యేకంగా ఆసక్తి వుండింది. మా విద్యార్థుల బౌద్ధిక జీవితాలు మహత్తర జిజ్ఞాసతో విశిష్టమైనవైనాయని నాకు తెలిసింది. వాళ్ల ప్రతి వ్యవహారమూ, వాళ్ల చుట్టూతా వున్న ప్రతీదీ వాళ్ల అనుభూతులకీ, ఆలోచనలకీ పని పెట్టాయి. యుక్తవయస్సు వచ్చే సంవత్సరాల్లోనూ, తొలి యౌవనప్రాయపు సంవత్సరాల్లోనూ మా విద్యార్థుల మానసిక జీవితంలోని లక్షణాల్లో ఒకటి యేమిటంటే ప్రకృతిలోని వాటిలోనూ వస్తువులలోనూ వున్న పరస్పర సంబంధాన్ని చూడగలిగే వాళ్ల సామర్థ్యం. వాళ్లు అర్థంచేసుకోలేని దాన్ని, అస్పష్టంగా వున్న దాన్ని కనిపెట్ట ప్రయత్నించారు. వాళ్లకి పుస్తకాలు జ్ఞానపు ఆధారాలయ్యాయి, వాళ్ల ఆధ్యాత్మిక జీవితాలకి అవసరం అయ్యాయి.

# వస్తువుల ప్రపంచంనుంచి సమాజానికి
# ప్రతిదీ యెక్కడనుంచి వస్తుంది?

వ్యక్తి బోధనకి ప్రకృతి సారభూతమైన ఆధారం. కాని మనసు, అనుభూతులు, దృక్పథాలు, విశ్వాసాలు అనేవి రూపుతీసుకోవడం ప్రకృతిని అర్థం చేసుకోవడంలో మాత్రమే మొదలవుతుంది. మనిషి సమాజంలో బతుకుతాడు. నిగ్గుగా తేలేదేమంటే మనిషి జీవితం యితరులతో తాము యే మాదిరి సంబంధాలతో వున్నదీ దాన్ని బట్టే వుంటుంది. వాళ్లు ప్రాథమిక పాఠశాలలో వున్న నాలుగేళ్ల మొత్తం కాలంలోనూ ఒక ముఖ్యమైన సత్యాన్ని గురించి పిల్లలు అర్థం చేసుకునేటట్టు చెయ్యాలని నేను ప్రయత్నించాను: ఒక వ్యక్తి తన పాదార్థిక ఆధ్యాత్మిక అవసరాలని తృప్తిపరిచే వందలాది, ఆ మాటకొస్తే వేలాది యితరుల పుణ్యమా అని జీవిస్తున్నాడు. వందలాది వేలాది యితరుల కోసం పాదార్థిక, ఆధ్యాత్మిక విలువలని సృష్టించకుండా సమాజంలో బతకడం అసాధ్యం. పనిలోనూ, సమాజంలో పరస్పర సంబంధాల క్రమంలోనూ ఒక వ్యక్తికి గల నైతిక పార్శ్వం, అతనికి లేక ఆమెకి వుండే ఆధ్యాత్మిక విలువలతో బాటుగా, జీవిత దృక్పథంతో బాటుగా, ప్రపంచ దృష్టితో బాటుగా రూపుతీసుకుంటుంది. ఉపాధ్యాయుని బోధనాత్మక కృషిలో ఒక ముఖ్యమైన అంశం యేమిటంటే పాదార్థిక ఆధ్యాత్మిక శ్రేయస్సు సృష్టించడం ద్వారా పౌరుని సామాజిక పార్శ్వంగా, మన సమాజంలో వ్యక్తిగత ఆంతరిక సంబంధాలు ఉద్భవించడమని పిల్లలు అర్థం చేసుకునేటట్టు చెయ్యడం.

చిన్న పిల్లవాడు వస్తువులని అర్థంచేసుకోవడం ద్వారా, అన్ని వస్తువులూ యెక్కణ్ణుంచి వస్తున్నాయో తెలుసుకోవడం ద్వారా సామాజిక సంబంధాలని అర్థంచేసుకుంటాడని అనుభవంవల్ల తెలిసింది.

మేము బడి భోజనశాలలో మధ్యాహ్నం భోజనం తిని కంచాలూ గిన్నెలూ కడిగాం. ఆగండి పిల్లలూ, అప్పుడే వెళ్లిపోకండి, మనం బల్ల దగ్గర యింకో అరగంట కూర్చుందాం. మనం యివాళ ఉపయోగించే వస్తువులన్నీ యెక్కణ్ణుంచి వస్తున్నాయో దాన్ని గురించి ముచ్చటించుకుందాం. మనకి యిచ్చిన యీ వస్తువులన్నీ యెక్కణ్ణుంచి వచ్చాయి? పిల్లలు తాము తిన్న ప్రతీదీ లెక్కపెట్టారు: రొట్టె, మాంసం, బంగాళదుంపలు, పాలు, వెన్న గుడ్లు... కొత్త యిటికలతో యీ మధ్యనే కట్టిన పొయ్యిమీద వంట తయారైంది. పొయ్యిలో బొగ్గులమంట, ఆ బొగ్గు గనుల్లోనుంచి వచ్చింది. మేం కూర్చున్న కుర్చీలూ, బల్లలూ యినుముతోటీ, ప్లాస్టిక్‌తోటీ తయారయ్యాయి....

"అంతా అంతేనా?" అని నేను అడిగాను.

"ఆc" పిల్లలు జవాబిచ్చారు.

"జాగ్రత్తగా చూడండి, మీరు గమనించంది యింకోటి వుంది..."

మూల వున్న రిఫ్రిజిరేటర్ విద్యుచ్ఛక్తి లేకుండా పని చెయ్యదు. గోడలమీద విద్యుద్దీపాలు వున్నాయి. పిల్లలు వీటిని గమనిస్తారా గమనించరా అని ఆశ్చర్యపోతున్నాను.

వాళ్లు గమనించారు. విద్యుచ్ఛక్తే లేకపోతే యింటి దగ్గర బతకడం గాని, బళ్లో చదువుకోవడం గాని కష్టమని వాళ్లు గ్రహించారు.

యివేవీ లేకుండా మనం బతకలేం, యివి యెక్కణ్ణుంచి వచ్చాయి?

సామాజిక ఉత్పత్తిలోకీ, పని సంబంధాల సంక్లిష్ట ప్రపంచంలోకీ మా "యాత్రలు" యీ ప్రశ్నతో ఆరంభమయ్యాయి. మా ప్రతి అడుగూ నూతన ఆవిష్కరణలకి తీసికెళ్లింది. మా బల్లమీదకి రొట్టె రావడానికి దాదాపు తమ తల్లిదండ్రులందరి శ్రమా అవసరమనే సత్యాన్ని గుర్తిస్తూనే, పిల్లలు శ్రామిక జనంపట్ల గౌరవం కలగజేసుకున్నారు. కాని అదే చాలదు. ట్రాక్టర్లు, నాగళ్లు, కోత యంత్రాలు తయారుజేసేవాళ్ల శ్రమ కూడా అవసరమే, యెందుకంటే యంత్రాలు లేకుండా, ధాన్యం కోతా, నూర్పిళ్లూ జరగవు. గని పనివాళ్ల శ్రమ ముఖ్యమైంది, యెందుకంటే యంత్రాలు తయారుచెయ్యడానికి బొగ్గు లేకుండా లోహాన్ని కరిగించడం కుదరదు.

మిగతా వాటితోటి మాకు పరిచయం కలిగేకొద్దీ యింకా ఆశ్చర్యకరమైనవి బయటపడుతున్నాయి. భూగర్భంలోంచి బొగ్గు మా బడి వంటగదికి చేరాలంటే, మా మాతృదేశంలో దగ్గరలోనూ, దూరంలోనూ వున్న పట్టణాల్లో, పల్లెటూళ్లలో విభిన్న వృత్తుల్లో వున్న వందలాది జనం పని చెయ్యాల్సి వుంది. వందలాది జనం మా బల్లలు తయారుచెయ్యడానికని లోహం కరిగించే పనిచెయ్యాల్సి వుంది, యిసకనుంచీ మట్టినుంచీ యిటికలు తయారు చెయ్యడానికీ పనిచెయ్యాల్సి వుంది.

అదేరకంగా మేము సామాజిక ఉత్పత్తిలోకీ పనిదగ్గర ఆంతరిక సంబంధాలలోకీ మా మొదటి అడుగువేశాం. మన బట్టలు యెక్కణ్ణుంచి వస్తాయో, కాగితం యెలా తయారవుతుందో, మాకోసం పుస్తకాలూ, ఫిల్ములూ యెవరు చేస్తారో, యెవరు సంగీతం కూరుస్తారో కనిపెట్టాం. వారం తర్వాత వారం, నెల తర్వాత నెలా, సామాజిక సంబంధాల సంక్లిష్టతని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాం. వస్తువుల ప్రపంచంగుండా మనిషిని తెలుసుకొన్నాం మేము. వస్తువులు, పాదార్థిక, ఆధ్యాత్మిక విలువలు ఆ మనిషిని దర్శించడానికీ, అర్థం చేసుకోడానికీ, అనుభూతం చేసుకోవడానికి మాకు దోహదమయ్యాయి. స్తెపాన్ మక్సీమొవిచ్ అనే రొట్టెలు కాల్చే వ్యక్తిని, అతను పనిచేసే స్థలంలో మేం కలుసుకున్నాం. అతను పిల్లల దృష్టిలో వూరికే తన సాదా, రొట్టె కాల్చేపని నిర్వర్తించేవాడే కాదు. వందలాది వేలాది ప్రజలు జీవించడానికి కృషిచేసే జీవిత సృష్టికర్త. ప్రతి వారమూ మేం పనివాళ్లని, వందలాది వేలాది ప్రజలకి పాదార్థిక ఆధ్యాత్మిక వస్తువుల్ని తయారుచేసేవాళ్లని – కోతయంత్రపు, ట్రాక్టరు డ్రైవర్లని, లోహపు పనివాళ్లని, టర్నర్లని – కలుసుకున్నాం.

పిల్లలు మూడవ తరగతి పూర్తిచేసాక, ఒక వసంత కాలపు రోజున మేం దగ్గర వున్న జలవిద్యుత్ కేంద్రానికి వెళ్లాం. విద్యుచ్ఛక్తి ఉత్పత్తికావడం చూశాం. విద్యుత్ నిపుణుల్ని కలిశాం.

పిల్లలు కలుసుకున్న పనివాళ్లకి తమ పనిపట్ల వుండే వైఖరి పిల్లల నైతిక దృక్పథం రూపుతీసుకోవడంలో ఒక ముఖ్యమైన అంశం అయింది. మిగతా వాళ్లకోసం మనుషులు సృష్టించే వస్తువులు రొట్టె, మాంసం, పాలు, పంచదార లాంటివాటి పాదార్థిక వరాల్లో విశేషమైందేదీ లేనట్టు పైకి యెంతో సామాన్యంగా కనిపిస్తాయి. కాని వాటిని తయారు చేసే మనుషులు తమ శ్రమపట్ల గర్వంగావుండి, అది సమాజానికి సేవ అని భావించినప్పుడు ఆ శ్రమకి పిల్లలమీద గట్టి ప్రభావం వుంటుంది. మనిషిని పని ఉన్నతుణ్ణి చేసి, పూర్తి ఆనందాన్ని యిస్తుందనే సత్యం పిల్లలకి అపరిమేయ భావం కాదు, జీవితసారం. తమకున్న బలమూ సృజనాత్మక సామర్థ్యమూ సమాజ శ్రేయస్సు కోసం ఉపయోగపడే నిజాయితీ పూర్వక పనిలో వుందనే అత్యంత ప్రముఖమైన జీవిత గమనాన్ని గురించి బాల్యంనుంచీ వ్యక్తికి రూఢి అయింటన్నమాట.

# జీవిత గణిత పుస్తకం నుంచి వెయ్యి సమస్యలు

వ్యక్తికి సృజనాత్మకంగా ఆలోచించడమూ, శోధించే జిజ్ఞాసగల వ్యక్తిగా తయారవడమూ నేర్పడమే పాఠశాల ఒక ముఖ్య కర్తవ్యం. బాల్య సంవత్సరాలని ఆలోచనా పాఠశాలగానూ, ఉపాధ్యాయుణ్ణి విద్యార్థుల శారీరక, ఆంతరంగిక ప్రపంచాలు ఆకృతి దాల్చేదానికి సహాయపడేవాడుగానూ వూహించుకున్నాను. పిల్లవాడి మెదడు అభివృద్ధిచెంది, బలపడడానికి, ప్రపంచాన్ని ప్రతిబింబించే యీ అద్దం యెప్పటికీ సున్నితంగా, వస్తువుల్ని ప్రతిబింబించేటట్టుగా వుండేట్టు చూడడం బోధకుని ముఖ్య విధుల్లో ఒకటి. శారీరక వ్యాయామం వల్లా, కష్టాల్ని అధిగమించడం వల్లా కండరాలు అభివృద్ధిచెంది, బలపడినట్టుగానే, మెదడు రూపుతీసుకుని అభివృద్ధి కావడానికి ప్రయత్నమూ, శ్రమా అవసరం అవుతాయి.

కణాలశక్తి ప్రేరణ పొందే సంక్లిష్ట ఆంతరంగిక క్రమం వల్ల పిల్లవాడి మెదడు అభివృద్ధిచెంది, దృఢంగా పెరుగుతుంది. ప్రకృతి సంఘటనల మధ్య వున్న బహుముఖ సంబంధాలవల్ల –, కారణమూ, కార్యమూ, తాత్కాలికమూ, వ్యావహారికమూ – ఒక నిర్దేశిత క్షణంలో ప్రేరణపొందడం అనేది జరుగుతుంది. పిల్లవాడు దేన్ని గురించేనా క్షుణ్ణంగా ఆలోచించేటప్పుడు, శోధించేటప్పుడు, తనకి అర్థం కాని దేని సారాన్నేనా పొంద నుద్యుక్తమైనప్పుడు, మెదడు పేటికలోని కణాలు యీ అతి సూక్ష్మమైన కండరాల్ని ఆచరణలోకి గెంట ప్రయత్నాలు చేస్తాయి. ఆ

కండరాల శక్తి హేతువు అవుతుంది. పిల్లవాళ్లు ప్రకృతి విషయాలకీ, చుట్టూతా వున్న ప్రపంచానికీ మధ్య వుండే సంబంధాలని అర్థం చేసుకోవడానికీ, ఆ సూక్ష్మాతిసూక్ష్మ కండరాల ప్రయత్నాలలో ప్రతిసారీ నూతన శక్తిని క్రియాత్మకం చెయ్యడానికీ దోహదపడ్డమే నా కర్తవ్యం అని భావించాను. యీ సంక్లిష్టమైన క్రమం మెదడు తాలూకు ముఖ్య లక్షణాలైన జిజ్ఞాస, చురుకైన బుద్ధీ, పరిశీలనా సామర్థ్యం రూపుతీసుకోవడం, బలపడడం, అభివృద్ధి చెందడం అనే క్రమం అవుతుంది.

మానవ మెదడు పని విరామాల్లో జరిగేది. చుట్టూతా వున్న ప్రపంచంనుంచి సమాచారపు ప్రవాహం తాలూకు ప్రేరణ మొదట్లో పేటికలోని ఒక కణసమూహంలో ఉదయిస్తుంది, తర్వాత యింకోదాంట్లో, ఆలోచన ఒక వస్తువునుంచి యింకో వస్తువుకి తక్షణం మారుతుంది. ఆలోచనా క్రమంలో ఆ మారడం అనేది ముఖ్యమైన అంశం. ఆలోచనా శ్రేణిని త్వరితంగా మార్చుకోగల సామర్థ్యం ఒక కణసమూహం నుంచి మరో కణసమూహానికి ఆలోచనలని బదలాయించుకోవడంతో సమంగా వుంటుంది. తగినంత మానసిక సామర్థ్యానికి యిది ప్రధానమైన నిబంధన. పిల్లవాడు ఆలోచిస్తున్నాడు - అంటే ఒక కాల వ్యవధిలో (ఉదాహరణకి, ఒక సెకనులో) అతని ఆలోచన ఒక వస్తువునుంచి యింకో వస్తువుకి యెన్నోసార్లు మారగలదన్నమాట. యీ క్రమం ఎంత వేగంగా వుంటుందంటే ఆలోచించేవాడు దీన్ని గమనించడు. అతను గాని, ఆమె గాని ఏకకాలంలో నీటి తొట్టెల గురించీ, ఒక నిర్దేశిత కాలంలో నిర్దేశిత పరిమాణంలో హెచ్చుతగ్గులుగా నీరు పారే ఒకటవ, రెండవ తూముల గురించీ ఆలోచిస్తున్నట్టు కనిపిస్తుంది. వేరే మాటల్లో చెప్పాలంటే, విద్యార్థి అనేకమైన వస్తువుల్నీ, విషయాల్నీ యేకకాలమందే అర్థంచేసుకుంటాడు, పరిశీలిస్తాడు, పోలుస్తాడు. ప్రతి పిల్లవాడిలోనూ యీ ముఖ్యమైన మానసిక సామర్థ్యాన్ని అభివృద్ధిచెయ్యడం మన కర్తవ్యం.

మెదడుకి గల ఆంతరిక శక్తిని జాగృతం చెయ్యడానికీ, "మేధాకండరాల్లో" శక్తియుత క్రీడని ప్రేరేపించడానికీ సరైన అభ్యాసాలు బుద్ధి నైశిత్యాన్నీ, వేగాన్నీ పెంచే సమస్యల్లో వున్నాయి. యీ సమస్యలు చుట్టూతా వున్న ప్రపంచపు వస్తువుల్లో, విషయాల్లోనే కనిపిస్తాయి. పిల్లలు వస్తువుల సారాన్ని కనిపెట్టడానికీ, సత్యాన్ని కనిపెట్టడానికీ ప్రయత్నం చెయ్యగలరని వాళ్ల దృష్టిని ప్రకృతిలోని విషయాలలో దీనిమీదకో దానిమీదకో తిప్పి, తమకి అర్థంకాని రహస్యాలని అర్థంచేసుకునే ప్రయత్నం చేస్తారని నేను నమ్మించాను. యీ సమస్యల పరిష్కారానికి క్రియాత్మకతా, మానవ శ్రమా ఆధారం. మేధాశక్తికి పనిబెట్టడమూ, విషయాల్లోని వాటి మధ్య సంబంధాలని నిర్ణయించడమూ పిల్లవాణ్ణి ఒక ప్రత్యేకమైన లక్ష్యాన్ని అందుకునేందుకు ప్రేరేపిస్తాయి. మన చుట్టూతా వున్న ప్రపంచంలో అలాంటివి లక్ష సమస్య లున్నాయి. వాటిని ప్రజలు కల్పించారు, జానపద సాహిత్యంలోని సృజనాత్మకతలో ఆసక్తికరమైన కథల్లాగా పొడుపు కథల్లాగా అవి నిలిచే వుంటాయి.

నేను పిల్లలకి పరిష్కారం కోసమని విశ్రాంతి సమయంలో యిచ్చిన మొదటి సమస్యల్లో ఒకటి యిదీ:

"ఒక తోడేల్నీ, మేకనీ, గడ్డిమోపునీ మీరు నది యివతల పక్క నుంచి అవతలి పక్కకి దాటించాలి. మొత్తం అన్నింటినీ ఒకేసారి తీసికెళ్లలేరు లేదా తోడేలుని మేకతోటీ, మేకని గడ్డిమోపుతోటీ వదలెయ్య కూడదు. మీకిష్టమైనన్ని సార్లు నదిని దాటవచ్చు. కాని తోడేల్ని గడ్డి మోపుతోటీ, లేదా యీ మూడింటినీ, ఒక్కొక్క దాన్నే తీసికెళ్లాలి. తోడేల్ని, మేకని, గడ్డిమోపుని నది అవతలి ఒడ్డుకి అన్నీ వరసక్రమంగా వుండేటట్టు యెలా తీసికెడతారు?"

జానపద బోధనాశాస్త్రంలో యిలాంటి పొడుపు కథలు బోలెడు ఉన్నాయి. చిన్న పిల్లలకి అవి చాలా ఆసక్తికరంగా వుంటాయి. ఆ చిన్న అబ్బాయిలూ, అమ్మాయిలూ తోడేలు మేకని తినెయ్యకుండా, మేక గడ్డిమోపుని తినెయ్యకుండా ఆ ముగ్గురు "ప్రయాణీకుల్నీ" యెలా నదిని దాటించడమా అనే చిక్కు విప్పడానికి ప్రయత్నం మొదలెట్టారు. మేము చెరువు గట్టున కూర్చుని వున్నాం. పిల్లలు యిసకలో నదిని గీసుకున్నారు, చిన్న గులకరాళ్లని చూశారు. పొడుపు కథ బహుశా ప్రతి వాళ్లూ విప్పలేకపోవచ్చును, కాని పిల్లలంతా గట్టిగా ఆలోచించారు. మానసిక బలాన్ని అభివృద్ధిచెయ్యడానికి యిది అద్భుతమైన సాధనం.

చదరంగం దగ్గర కూడా అలాంటి చిక్కుల్ని పరిష్కరించడానికి అదే ప్రయత్నం అవసరం అవుతుంది: కొన్ని యెత్తులు ముందే వూహించుకోవాలి. మొదటి తరగతి ఆరంభించిన కొద్ది కాలానికే నేనీ సమస్యని యేడేళ్ల పిల్లలకి యిచ్చాను. ముగ్గురు పిల్లలు షూర, సెర్యోజ, యూర దాన్ని పది నిముషాల్లో తేల్చేశారు. యీ పిల్లల పటువైన నిశితమైన ధారణతోటి, వేగవంతమైన ఆలోచనా ప్రవాహం ముందుకి తోసుకుని వచ్చింది. పదిహేను నిముషాల్లో దాదాపు అందరు పిల్లలూ ఆ పొడుపు కథని విప్పేశారు. కాని వాల్యా, నీనా, పేత్రిక్, స్లావలు మరోసారి వెనకబడ్డారు. వాళ్ల ఆలోచనా ప్రవాహం హఠాత్తుగా ఆగిపోయినట్టు నేను గమనించాను. ఆ చిన్న పిల్లలు సమస్యలోని భావాన్ని అర్థం చేసుకున్నారు, మేం మాట్లాడుకుంటూ వున్న విషయాలూ, స్పష్టంగా వుండిన ఉదాహరణలూ అర్థంచేసుకున్నారు, కాని మొదటి ప్రతిపాదన చెయ్యగానే ఆ భావం వాళ్లకి అస్పష్టమైపోయింది. యింకోలా చెప్పాలంటే, ఒక క్షణంక్రితం యేం వుందో దాన్ని ఆ పిల్లవాడు మర్చిపోయాడు.

దండిగా వున్న జానపద వివేక భాండారంనుంచి నేను యింకా యింకా యెక్కువ పొడుపు కథల్ని తీశాను, మెల్లిగా నేర్చుకునే మా పిల్లల్లో పొడుపు కథల విషయంపట్లా, వాటి కూర్పుపట్లా ఆసక్తి కలిగించవచ్చని ఆశిస్తూ. నేను వాళ్లకి యీ సమస్యని యిచ్చాను: "ఒక చిన్న సైనిక దళం తాము దాటవలసిన నదిదగ్గరకి వచ్చింది. వంతెనల్లేవు, నది లోతుగా వుంది. వాళ్లేం చెయ్యగలరు? హఠాత్తుగా వాళ్ల ఆఫీసరు చిన్న పడవతో ఒడ్డున ఆడుకుంటున్న యిద్దరు అబ్బాయిల్ని చూశాడు. ఆ పడవ యెంత చిన్నదంటే ఒక్క సైనికుడు గాని ఆ యిద్దరు పిల్లలు గాని మాత్రమే

ఒకసారి నదిని దాటగలరు. యింక యెక్కువ మంది లాభంలేదు, కాని ఆ పడవలో సైనికులంతా నదిని దాటారు. ఎలా ఆ పని చేశారు?"

పిల్లలు యెలా ఆలోచించేదీ మరోసారి పరిశీలించాను. వాళ్లు మళ్లీ యిసకలో గీశారు, తమ మనస్సుల్లో కొన్ని "యెత్తులు" ఒకేసారి పట్ట ప్రయత్నిస్తూ, నీనా, స్లావ, పేత్రిక్‌లు యెలా నీళ్లుగారిపోయారో మళ్లీ గమనించాను. వాల్యా కళ్లు సంతోషంతో మెరిశాయి: ఆమె సమస్యని పరిష్కరించింది.

మా మందబుద్ధులతో విడిగా పనిచెయ్యడం మొదలెట్టాను. మామూలు అంకెలని గాఢంగా అర్థం చేసుకోవడానికీ, అంకెల పరస్పరాధీనత నిశ్చయించడానికీ ఉద్దేశించిన తేలికైన జానపదపు పొడుపు కథలు వాళ్లకి యిచ్చాను. అలాంటి పొడుపు కథల్లో అయిదు యివి:

1. "దేగలూ ఓక్ చెట్లూ": కొన్ని దేగలు యెత్తుగా యెగిరి కొన్ని ఓక్ చెట్లమీద వాలాయి. చెట్టుకొక దేగ వుంటే ఒక దేగ మిగిలిపోతోంది. చెట్టుకి రెండు దేగలుంటే ఒక చెట్టు మిగిలిపోతోంది. మొత్తంమీద యెన్ని దేగలున్నాయి, యెన్ని ఓక్ చెట్లున్నాయి?
2. "పశువుల మేత పచ్చిక బీడు": యిద్దరు గొర్రెలకాపరి కుర్రాళ్లు వున్నారు. మొదటివాడు రెండోవాడికి ఒక గొర్రె యిస్తే వాళ్లిద్దరికీ సరిసమంగా వుంటాయి. రెండోవాడు గనక మొదటి వాడికి ఒకగొర్రె యిస్తే మొదటివాడికి రెండోవాడి కంటే రెండు గొర్రెలు యెక్కువ వుంటాయి. వాళ్లల్లో చెరి వొకళ్లకీ యెన్నేసీ గొర్రెలు వున్నాయి?
3. "యెన్ని బాతులు?": ఒక బాతుల గుంపు యెగిరింది. ఒక మొగబాతు కలిసింది. "హల్లో, వందబాతులూ!" అందది. "వుహుం, మేం వందలేం. మేం యెంత మందిమి వున్నామో తెలుసుకోవాలంటే మా సంఖ్యని రెట్టించి దానికి అందులో సగం చేర్చి అప్పుడు నాలుగోవంతు చేర్చి, అప్పుడు నిన్ను కూడా కలుపుకుంటే, మొగబాతూ, అప్పుడు మేం వందమంది అవుతాం." గుంపులో యెన్ని బాతులున్నాయి?
4. "తలలూ కాళ్లూ": పెరట్లో కోడిపెట్టలు ముక్కుతో మేత పొడుచుకు తింటున్నాయి, కుందేళ్లు గెంతుతున్నాయి. మొత్తంమీద పది తలలూ, యిరవైనాలుగు కాళ్లూ వున్నాయి. కోడిపెట్ట లెన్ని వున్నాయి, కుందేళ్లు యెన్ని వున్నాయి?
5. "యెన్ని బంతులు?": ఒక సంచిలో పది పసుప్పచ్చ బంతులూ, పది యెర్ర బంతులూ, అయిదు ఆకుపచ్చ బంతులూ, అయిదు నల్లబంతులూ వున్నాయి. కళ్లు మూసుకుని నువ్వు తీసుకోగల అతితక్కువ సంఖ్య బంతులు తీసుకో. కాని ఒకే రంగువి యేడు బంతులుండాలి నీ దగ్గర, జాగ్రత్త.

మనసుకి శిక్షణ యివ్వడానికి పొడుపు కథలు సాటిలేని మార్గం. పిల్లలు ప్రతి పొడుపు కథనీ విప్పడానికి రెండునుంచి నాలుగు "యెత్తుల" దాకా గుర్తుంచుకోవాలి. ఆరునెలల్లో వాల్యా, స్లావ అలాంటి సమస్యల్ని పరిష్కరించగలిగారు కాని, పేత్రిక్, నీనాలకి యింకా అదృష్టం దక్కలేదు. వాళ్లు యేదీ గుర్తుంచుకోలేకపోయారు, మరి జ్ఞాపకం లేకుండా "యెత్తుల" వరసవెయ్యడం అసాధ్యం.

యీ పరిస్థితికి వివరణ యేమిటి? బహుశా కొంతమంది పిల్లలకి ఒక వస్తువునుంచి యింకోవస్తువుకి ఆలోచనని తక్షణం మార్చుకునే సామర్థ్యం వుండదేమో. సమస్యలోని అన్ని అంశాలనీ ఒకేసారి అర్థంచేసుకుని, గుర్తుపెట్టుకోలేరు వాళ్లు. మెదడు కణాల్లో ఆ సామర్థ్యం యెందుకు యేర్పడలేదో అనేదే వేరే ప్రశ్న. జన్మతః సామర్థ్యం లేకపోయిందనడమే వివరణ అవదు, కాని దాన్ని కూడా పూర్తిగా తోసిపుచ్చలేం. తక్షణ ఆలోచనా శ్రేణి భగ్నం అయితే, అదే క్షణంలో, పిల్లవాడు ప్రస్తుతం వున్న దాని మీదా కొద్ది క్షణాల క్రితం వున్న దానిమీదా దృష్టి పెట్టలేకపోతే, ఆలోచించలేడు అనీ, అనేక విభిన్న వస్తువులమధ్యా విషయాలమధ్యా సంబంధాలని నిర్ణయించడం పిల్లవాడికి కష్టం అవుతుందనీ పరిశీలన తెలియజేస్తోంది.

నేను పిల్లల ఆలోచనని గురించీ, ముఖ్యంగా మంద బుద్ధులైన వాల్యా, పేత్రిక్, నీనాల ఆలోచన గురించీ - యేదో సిద్ధాంతపరమైన లక్ష్యాల దృష్టితో కాదు గాని, వాళ్ల మేధా శ్రమని సులభతరం చేద్దామని, వాళ్లకి చదవడం నేర్పుదామని - అధ్యయనం చేశాను. మొట్టమొదటగా పిల్లవాళ్లు వస్తుశ్రేణి విషయాలు సంఘటనలు ఆకళింపు చేసుకుని, వాటి మధ్య సంబంధాలని గ్రహించడం వాళ్లకి నేర్పాలని పరిశీలన తెలియజేస్తోంది. ఒక వస్తువుకి సంబంధించిన సారమూ, అంతర్గతక్రమమూ పరీక్షించడంలో పిల్లవాడు యింకా లోతుగా పోవాలి. క్రమేపీ యీ పరీక్షని దానినుంచి దూరంగా వున్న వస్తువుల వరసకి పెంచాలి. మందబుద్ధుల ఆలోచన గురించి అధ్యయనం చేస్తూ వుంటే, ఉదాహరణకి, ఒక సమస్యను గ్రహించగలిగే సమర్థత లేకపోవడం, భావార్థకంగా ఆలోచించలేని అసమర్థపు ఫలితం, నిర్దిష్టమైందాన్నుంచి మళ్లలేకపోవడపు ఫలితం అని నాకు మరింత నమ్మకం యేర్పడింది. భావార్థకంగా ఆలోచించడం పిల్లలకి నేర్పాలి, తన వూహలో వాల్యా ఒక తోడేలు సరూపచిత్రం గీసుకోకూడదు. మేక గడ్డిమోపు అందుకుంటుందా లేదా అనే దాని దగ్గర ఆమె ఆలోచన ఆగకూడదు. పిల్లవాడికి యీ చిత్రాలన్నీ భావార్థకంగా వుండాలి. కాని యీ భావార్థకమైన దాన్ని చేరుకోవడం మాత్రం నిర్దిష్టమైన దాన్ని గురించిన లోతైన అవగాహన ద్వారానే వుండాలి. పిల్లవాడు ఆలోచిస్తూ వుంటే అతని బుర్రలో యేం జరుగుతోందా అని మనం వూహించాలి. ఆలోచించేటట్లు చెయ్యాలి, లేనట్లయితే పిల్లలు తమ ధారణని యిలుకు బెట్టుకుంటారు, తమ ఆలోచనలని యింకా బండబారుస్తూ కంఠస్థం చేస్తారు. మా విద్యార్థుల బుర్రల్లో యేం జరుగుతోందా అని నేను వూహించ ప్రయత్నించాను. అది

బహుశా ఒక రేఖలున్న చిత్రం, కాని కొంతమేరకి, అది ఆలోచనా ప్రతిమని ప్రతిబింబిస్తుంది. పిల్లవాని ఆలోచనలు ఒకదానినుంచి యింకో భావానికి మారేటప్పుడు మెదడు కణాలలో కొత్త గుంపు చురుకుగా తయారవుతుంది. బొమ్మలకీ గ్రహణకీ మధ్యన వుండే ఆలోచనాశ్రేణి భగ్నం కానప్పుడే, సమాచారమూ, సూచనలూ యిటూ అటూ వెళ్లినప్పుడే పిల్లవాడి ఆలోచనలు ముందుకు దూకుతాయి: నూతన భావం అంతకుముందు గ్రహించిన దాన్ని తెలుసుకుంటుంది, అంతకుముందే గ్రహించబడింది నూతన సమాచారాన్ని జ్ఞాపకం చేసుకుంటుంది. ఒక్కక్షణంలో యీ వేగవంతమైన అంతర్గతమైన మార్పు చాలాసార్లు జరుగుతుంది. దీని అర్థమే పిల్లవాడు ఆలోచిస్తున్నాడు, గ్రహిస్తున్నాడు. రెండు భావాల మధ్య ప్రేరణ, కేంద్రాల మధ్య సంబంధాలు యెంత దృఢమైనవైతే ఆలోచన అంత గంభీరంగా వుంటుంది, పిల్లవాళ్లు తమ హేతుబద్ధతలో యిముడ్చుకోగల వస్తువుల విషయాలు పరిధి అంత విశాలంగా వుంటుంది.

యీ ఆలోచనాశ్రేణుల దృఢత్వపు ఆధారాలు మెదడుకిగల సజీవ పదార్థంలో, ఒక వ్యక్తి మెదడులో జరిగే సున్నిత జీవరసాయన ప్రక్రియలలో దాగివుండాలి. పాఠశాలాత్పూర్వపు పిల్లలకి సంబంధించిన పరిశీలన చూపించినట్టు, పరిసరాల స్వభావంలో దాగివుంటాయి. నాడీమండల శైశవ కాలంలో మేధా సామర్థ్యాలు రూపుతీసుకోవడం ఒక గణనీయమైన మేరకి దీనిమీదే ఆధారపడి వుంటుంది. నిస్సందేహంగా, వాల్యా, నీనా, పేత్రిక్‌ల మెదడు కణాలు, ఆ నరాల సత్తువ తగినంతగా అభివృద్ధి చెందకపోవడానికి గురయ్యాయి. ఆ నరాల సత్తువే భిన్న సజీవ ఆలోచనా ద్వీపాల మధ్య సంబంధాలకి, ఆలోచనాశ్రేణి దృఢత్వానికి మూలం. ప్రేరణ కేంద్రాలని సంధించే లింకులు దుర్బలంగా వుండి, త్వరగా అంతరించిపోతాయి. పిల్లవాడు యేకకాలమందు యెన్నో చిత్రాల ఆలోచనని అందుకోలేడు. కొన్ని క్షణాల క్రితం తనకి స్పష్టంగా అనిపించిందాన్ని గుర్తుచేసుకునే ప్రయత్నం పేత్రిక్ చేసినప్పుడు, అతను తన ఆలోచనాశ్రేణిని స్పష్టంగా జారవిడుచుకున్నాడని నేను గమనించాను.

ఆలోచనకి గల యీ ప్రత్యేకతకి కారణాలు వేరువేరు పిల్లల్లో వేరువేరుగా వుంటాయి. ప్రధానమైన కారణం యేమిటంటే, పసితనంలో ముఖ్యంగా గ్రహణల ప్రవాహం చిత్ర విచిత్రాలుగానూ, భిన్నమైందిగానూ వున్నప్పుడు, పిల్లవాడు తన చుట్టూతా వున్న ప్రపంచంలోని వస్తువుల విషయాలు, మధ్య సంబంధాలని గురించి యెక్కువ ఆలోచించలేదు. అతని మెదడులోని ఆలోచనా సజీవ ద్వీపాలలో సమాచార ప్రవాహానికి సంబంధించి యిటు అటు సంబంధాలు లేవు. యిదంతా కూడా పిల్లవాడి ఆలోచనాభివృద్ధిపట్ల పెద్దవాళ్ల అశ్రద్ధా, నిర్లక్ష్యమూల ఫలితం. ఓ పెద్దవాణ్ణి పిల్లవాడు "యెందుకు?" అని ఒకసారి అడిగాడు, జవాబు రాలేదు, రెండోసారి అంతే. పెద్దవాళ్ల యీ నిర్లక్ష్యం (ఒకోఅప్పుడు ముక్తసరిగా "నన్ను విసిగించకు, అవతలికి ఫో" లాంటి కసుర్లు) మెదడులోని సున్నిత సంబంధాలని నీరస

పరుస్తాయి. ఆ సంబంధాలని తడవ తడవకీ మళ్లీ కచ్చితంగా ఆ వయసులోనే దృఢ పరచాలి.

ఆలోచనలోని యీ వ్యతిరేక లక్షణానికి కారణాల్లో ఒకటి, చుట్టూతా వున్న ప్రపంచంలోని విషయాలపట్ల పిల్లల ఉద్రేక ప్రతిచర్యల దారిద్ర్యం. తత్ఫలితంగా మెదడులోని ఉపపేటికా ప్రాంతపు అనుభూతి కారకాలు నీరసించిపోతాయి.

ప్రతినెలా పాఠాలు గడిచే కొద్దీ పాఠశాలలో చేరబోయే పిల్లల తల్లిదండ్రులకి బోధనాజ్ఞానం యివ్వాల్సిన ప్రాముఖ్యాన్ని గురించి నాకు యెక్కువ నమ్మకం యేర్పడిపోయింది. పిల్లవాడు స్కూలులోకి ప్రవేశించకముందే, తల్లిదండ్రులతోటి యింటివద్ద యింకా వున్నప్పుడే బోధన గురించి తల్లిదండ్రులకి చాలా యెక్కువ చెప్పాలి. భవిష్యత్ పాఠశాలా విద్యార్థుల తరం జాగ్రత్తకోసమని రెండునుంచి ఆరేళ్లదాకా వయసు పిల్లలున్న తల్లిదండ్రులకి మేం ఒక పాఠశాల కల్పించాం. పిల్లవాడి శారీరక, మానసిక, మేధాత్మక, నైతిక, సౌందర్యాభివృద్ధికి సంబంధించిన సమస్యలతోసహా, భవిష్యత్ విద్యార్థులకి ఆలోచించడం అనేది తల్లిదండ్రులు యెలా నేర్పగలిగేదీ మేం ఒక అధ్యయన కార్యక్రమం తయారుచేశాం. యిప్పుడీ పాఠశాల శాశ్వత పద్ధతిమీద పనిచేస్తోంది.

తల్లీ, దండ్రీ పిల్లవాడి పూర్తి బోధకులుగా వున్నప్పుడు, అంటే పాఠశాలాత్పూర్వపు సంవత్సరాల్లో, బోధనా జ్ఞానం మరీ ముఖ్యం. చాలా మేరకి, రెండునుంచి ఆరుదాకా వయసున్న పిల్లల ఆధ్యాత్మిక జీవితం. తల్లితండ్రుల వంతుగా, యీ ప్రాథమిక జ్ఞానంమీదే ఆధారపడుతుంది. యిది వ్యక్తి వుండే బహు సంక్లిష్ట ఆధ్యాత్మిక అభివృద్ధిలో యుక్తిగల అవబోధగా వ్యక్తమవుతుంది. తల్లిదండ్రులని కొంత జ్ఞానంతోటీ, అలవాట్లతోటీ సిద్ధం చెయ్యాలని మేం ప్రయత్నించాం. పిల్లవాడికి ఆలోచించడం నేర్పడం యెలా, అతని మేధాసామర్థ్యం యెలా అభివృద్ధి పరచాలి అన్నదానిమీద తల్లిదండ్రుల పాఠశాలలో చాలా సమయం వ్యయం చేశాం. చాలా సంతవ్సరాల అనుభవపు పునాది మూలంగా, పరివేష్టిత ప్రపంచం గురించి సవాలక్ష ప్రశ్నలు వేసుకున్నాం - పిల్లలు తల్లిదండ్రుల్ని తరుచుగా అడిగేది యీ ప్రశ్నలనే. ఒక పసివాడు వాళ్లని అడిగితే, అతని జిజ్ఞాసనీ, ఆతృతనీ అభివృద్ధి చేసేటట్టుగా యెలా జవాబుచెప్పాలో మేం వివరించాం. తల్లిదండ్రులతో బాటుగా, పాఠశాలాత్పూర్వపు పిల్లలకి మేం ప్రకృతి వ్యాహ్యాళికి సంబంధించి ఒక కార్యక్రమం తయారు చేశాం. అందులో యే వస్తువుల్ని పరిశీలించాలో సూచించాం. పాఠశాలాత్పూర్వపు పిల్లలున్న ప్రతి కుటుంబంలోనూ పుస్తకాల పట్ల గౌరవ వాతావరణం ప్రబలంగా వుండేటట్టు మేం ప్రత్యేక శ్రద్ధ వహించాం.

మేధా బోధనలో కష్టాలు ఉత్పన్నం అవడానికి కారణభూతమయే వారసత్వ లక్షణాలు కూడా వున్నాయన్నది యెన్నో సంవత్సరాల పరిశీలన నాకు విశ్వాసం కలిగించింది. తల్లిదండ్రుల్లో మద్యపాన వ్యసనం పిల్లవాడి మొత్తం అవయవ

నిర్మాణానికి భయంకరమైన శత్రువు, కాని మరీ ముఖ్యంగా మెదడుకి హానికరమైంది.

మెదడుకి అభ్యాసాలుగా సమస్యా పరిష్కారానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించినప్పుడల్లా నేను, మెల్లిగా ఆలోచించి, గుర్తుపెట్టుకునే పిల్లల్ని నాదగ్గరగా పెట్టుకునేవాణ్ణి. నేను నానా విధాలైన చిక్కు ప్రశ్నల్నీ పొడుపు కథల్నీ గురించి ఆలోచించాల్సి వచ్చేది. ఆఖరికి నీనా బుర్రలో చుట్టూతా వున్న ప్రపంచపు ముద్రలూ బొమ్మలూ సంధించిన సజీవ ఆలోచనా ద్వీపాల మధ్య మొదటి సంబంధాలని సాధించగలిగాను.

మేం అక్వేరియమ్ పక్కన కూర్చున్న శీతాకాలపు రోజు గుర్తుకు వస్తోంది. పిల్లలు చేపలు లెక్కెడుతున్నారు. కొందరికి యెక్కువ వస్తే కొందరికి తక్కువ వచ్చాయి. నేను వాళ్లకి చిక్కు ప్రశ్న ఒకటి యిచ్చాను: "అన్న రెండు పెద్ద చేపల్నీ, నాలుగు చిన్న చేపల్నీ ఆక్వేరియమ్‌లో చూశాడు, చెల్లెలు రెండు పెద్ద వాటినీ, మూడు చిన్న వాటినీ చూసింది. అమ్మ మూడు పెద్దా, అయిదు చిన్నా చేపల్ని చూసింది. అమ్మ ఆక్వేరియమ్‌లో వున్న అన్ని చేపల్నీ చూసింది. అక్కడ యెన్ని చేపలు వున్నాయి?" యీ సమస్య చాలామంది పిల్లలకి యే కష్టమూ కలిగించలేదు. కాని నీనా చాలాసేపు ఆలోచించింది. ఆఖరికి సంతోషంతో చప్పట్లుచరిచింది. "అవును, అన్నా, చెల్లెలూ అన్ని చేపల్నీ చూడలేదు. కాని అమ్మ అన్నిటినీ చూసింది. అంచేత ఆక్వేరియమ్‌లో మూడు పెద్దవీ, అయిదు చిన్నవీ చేపలున్నాయి. అవి లోపల గడ్డిలో కనిపించకుండా దాంకున్నాయి... కాని అమ్మ వాటిని చూసేసింది." వాల్యా, పేత్రిక్‌లు అలాంటి సమస్యలని పరిష్కరించడం నేర్చారు, యింకా కొందరు యింకొంచెం కష్టమైనవీనీ.

వాళ్లు సాధించిన విజయాలని దృఢపరచడానికి యీ పిల్లలకి యింకొంచెం కష్టమైన సమస్యల్ని క్రమేపీ యివ్వడం మొదలెట్టాను. చదువు మూడో తరగతిలో వున్నప్పుడు, సమష్టి వ్యవసాయ క్షేత్రంలో మేం యాపిల్ పళ్లు పోగుచేస్తూ వుండగా, నీనా అలాంటి చిక్కుని విడగొట్టింది... ముగ్గురు సోదరులు పచ్చిక మైదానంలో గడ్డి కోస్తున్నారు. మధ్యాహ్నం వాళ్లు విశ్రాంతి కోసమని ఒక ఓక్‌చెట్టుకింద పడుకుని నిద్రపోయారు. వాళ్ల చెల్లెలు వాళ్లకి మధ్యాహ్నం భోజనం తెచ్చింది: పులుసు, రొట్టె, తలా కొన్ని యాపిల్‌పళ్లూ తెచ్చింది. ఆమె వాళ్లని నిద్రలేపలేదు. కాని ఆ భోజనాల తట్ట అక్కడుంచేసి యింటికి వెళ్ళిపోయింది. అందర్లోకీ పెద్దతను లేచి యాపిల్‌పళ్లు చూశాడు. వాటిని మూడు భాగాలుగా చేసాడు, కాని తన వాటా అంతా తినలేదు: అతను తన ప్రియమైన కడసారి తమ్ముడి కోసమని ఒకటి పెట్టేశాడు. అప్పుడతను మళ్లీ పడుకుని నిద్రపోయాడు. మధ్యవాడు లేచాడు, కాని పెద్దన్నగారు అప్పటికే కొన్ని యాపిల్‌పళ్లు తిన్నాడని అతనికి తెలీదు. ఆ వున్న పళ్లని మూడు భాగాలుగా చేశాడు. కాని తనూ తన వాటా పూర్తిగా తినలేదు. అతను కడసారి వాడికి ఒకటి మిగిల్చేశాడు, యెందుకంటే వాడికి అవంటే మనసు... అప్పుడు మధ్యవాడు కూడా పడుకుని నిద్రపోయాడు. ఆఖరికి కనిష్ఠుడు లేచాడు. అతను బుట్టలో యేడు

యాపిల్‌పళ్లు చూశాడు, వాటిని మూడు వంతులుగా యెలా చెయ్యాలో అతనికి తెలీదు. అతను చాలాసేపు ఆలోచించాడు గాని, యేం చెయ్యాలో తోచలేదు. అప్పుడు మిగిలిన వాళ్లిద్దరూ లేచి అంతా వివరించారు. చెల్లెలు తన అన్నల కోసం యెన్ని పళ్లు తెచ్చింది?

మా లెక్కల సమస్యలు చాలామట్టుకి పనికి సంబంధించినవే. పిల్లలకి ఆ విషయంతో బాగా పరిచయం వుంది. యీ సమస్యలని పరిష్కరించేటప్పుడు తమ పెద్దలు యెలా నేల దున్నారో, విత్తనాలు చల్లారో, మొక్కలు పాతారో, వాటికి యెరువులు వేశారో, పంట యెలా కోసి ధాన్యం యెలా నిల్వచేసుకున్నారో, యెలా యిళ్లు కట్టి, రోడ్లు మరమ్మత్తులు చేసుకున్నారో పిల్లలు మళ్లీ మళ్లీ పరిశీలించారు. యీ ముద్రల మధ్య సంబంధాలు వాళ్లు జీవితంలో చూసి స్థాపించిన సంబంధాలతోటి బలపడేవి. ఆలోచనా, ధారణా విభజించలేని ఐక్యంలో అభివృద్ధి చెందేవి. యీ సమస్యల్లో చాలా భాగం పరిష్కరించడానికి పిల్లలు చిత్రలేఖనం ఆలంబన చేసుకునే వాళ్లు, లేదా చర్చిస్తూ వున్న ఆ ఉదాహరణలకి యుక్తిగా నమూనా సృష్టించేవాళ్లు. పిల్లలు గోడ పత్రికలో చిక్కు ప్రశ్నలు, పొడుపు కథలు, మెదడుకు మేత రాశారు. యీ గోడ పత్రికని వాళ్లు మూడో తరగతి ఉత్తరభాగంలో తయారుచేశారు. సమస్యా పరిష్కారం పట్టుదల, ఓపిక, శ్రమలకి సంబంధించిన నూతన పోటీ రూపం సంపాదించుకుంది. మూడో తరగతిలో మేం మా మొదటి లెక్కల ఒలింపిక్ జరిపాం. పిల్లలకి అనేక రకాల చిక్కులున్న సమస్యలు వచ్చాయి, దాంతోటి ప్రతివాడూ దాంట్లో కొన్నింటినైనా సాధించగలడు. క్రమేపీ యీ లెక్కల ఒలింపిక్ మిగతా ప్రాథమిక తరగతుల దృష్టినీ ఆకర్షించి, స్కూలంతా జరిగేది.

"జీవిత గణిత పుస్తకం"నుంచి సమస్యలు పరిష్కరించడంలో పిల్లల ఆలోచనలు జాగృతం అయి, వాళ్లు ఆలోచించడం నేర్చుకున్నారు. పిల్లలకి ఆలోచించడం నేర్పకుండా, ఆలోచనాక్రమం వాళ్ల మెదడులని బలపరచకుండా లెక్కలకి సంబంధించి గాని, మరే అంశం గురించి గాని వాళ్లకి మంచి పరిజ్ఞానం వుందని చెప్పలేం. "అన్ని గణితశాస్త్ర నిర్వచనాలనీ, నియమాలనీ వదిలెయ్యండి, కాని యెన్ని లెక్కల అభ్యాసాలు వీలైతే అన్నిటినీ చేయించండి. చేసిందేదో నియమాలకి అనుగుణంగా లేదని సరిదిద్దకండి, అది అర్థరహితంగా ఉంటేనే సరిదిద్దండి."* అని లియో టాల్‌స్టాయ్ సలహా యిచ్చాడు. యీ సలహా పైకి కనిపించినట్టుగా సిద్ధాంతపరమైన సామాన్యీకరణల్నీ, నిర్వచనాల్నీ, నియమాలనీ కాదనడం లేదు. సరిగ్గా దానికి భిన్నం. విద్యార్థి నిర్వచనాలు, నియమాల అంతస్సారంగుండా ఆలోచించాలనీ, వస్తువులలోని నియమపు స్వభావంనుంచి ఉత్పన్నమయ్యే సామాన్యీకరణని, యేదో అర్థం కాని సత్యం కంటే కూడా, చూడాలనీ టాల్‌స్టాయ్

* లియో టాల్‌స్టాయ్, "బోధనాత్మక వ్యాసాలు," మాస్కో ఉచ్‌పెడ్ గీజ్ పబ్లిషర్సు, 1953, పే. 339 (రష్యన్‌లో).

అభిప్రాయం. ఉపాధ్యాయుడు కనక సత్యంపట్ల అలాంటి పంథా అవలంభిస్తే పిల్లవాడు తనంతట తనే ఆ నిర్వచనాలని "అవిష్కరించుకుంటాడు". యీ ఆవిష్కరణానందం పెద్ద భావప్రేరకం. అది ఆలోచనాభివృద్ధిలో పెద్ద పాత్ర వహిస్తుంది. టాల్‌స్టాయ్ సలహా చిన్న పిల్లలకే వర్తిస్తుందన్న విషయం మరిచిపోకూడదు.

"జీవిత గణిత పుస్తకం" నుంచి సమస్యలు పరిష్కరించడం మాత్రం వల్లనే లెక్కల్లో నెగ్గుకొచ్చినట్టు భావించకూడదు. ఆలోచనని అభివృద్ధి చేసేందుకు తోడ్పడుతూ యిది సహాయక పాత్రనే నిర్వహిస్తుంది, పాఠ్య బోధనాక్రమపు అవసరాల్లో ఉపభాగమే. యీ సాధనం సామాన్య సంక్లిష్ట పద్ధతుల్లో భాగంగానూ, బౌద్ధిక నైతిక, సౌందర్యాత్మక, వృత్తిపర బోధనలో ఉపకరణంగానూ మాత్రమే ఫలవంతమైంది. ఆలంకారికంగా చెప్పాలంటే, నేను దీన్ని ప్రాథమిక పాఠశాల ప్రధాన లక్ష్యంగా, అంటే పిల్లలకి సామాన్యజ్ఞానపు స్థూలరేఖలూ, ఆచరణాత్మక నిపుణతలూ యివ్వడానికి, వంతెనగా మాత్రమే పరిగణిస్తాను. గణితశాస్త్ర అధ్యయనంలో సూటిదనం, కచ్చితమైన అవసరాలూ, లక్ష్యాలూ మరీ ముఖ్యమైన పాత్ర వహిస్తాయి. ప్రతి విద్యా సంవత్సరంలోనూ విద్యార్థులు యేది క్షుణ్ణంగా తెలుసుకోవాలో, తమ ధారణలో వుంచుకోవాలో నేను నిర్ణయించేవాణ్ణి. భవిష్యత్ గణిత బోధన బలంగా వుండడానికి అవసరమైన మౌలిక గణిత బోధనలో సామాన్య సంఖ్యల సూత్రాల గురించిన జ్ఞానం వుండాలి. మొదటి తరగతిలోనే, ప్రతి విద్యార్థీ 100 వరకూ వున్న అంకెల్లో కూడికలూ తీసివేతలూ వుండే ప్రశ్నలకి చటుక్కున జవాబిచ్చే స్థాయికి చేరాలని నేను ప్రయత్నించాను. యీ లక్ష్యం అందుకోడానికి సంఖ్యల యేర్పాటుమీద వివరణ గల అభ్యాసభాగాల మొత్తం ఒకటి తయారైంది. ప్రాథమిక తరగతుల్లో గాని, ఆ తర్వాతగాని సృజనాత్మక శ్రమని యెక్కాల పరిజ్ఞానం దృఢంగా లేకుండా నేను వూహించలేను. అవసరమైన జ్ఞాన రంగాలని గుర్తుంచుకోవడం సృజనాత్మక ఆలోచనలో ముఖ్యమైన సాధనం.

బలహీనమైన ధారణవున్న పిల్లవాడికి ఆలోచించదంగాని వూహించడంగాని కష్టం. వాళ్ల ఆలోచనకి పటుత్వం కలగజెయ్యడానికి, అస్తమానూ ఉపయోగించగల సామాన్యీకరణల గురించి, సత్యాలని గురించి వాళ్ల అవగాహనని పెంచడానికీ, వాళ్ల ధారణని అభివృద్ధి చెయ్యడానికి దృఢతరం చెయ్యడానికి మార్గం యెలాగా అన్నదాన్ని గురించే నాకు చాలాకాలంగా చింతగా వుండేది. ధారణని అభివృద్ధి చెయ్యడానికి ఒక సాధనం "లెక్కల పెట్టె". పిల్లలు తమ లెక్కల పరిజ్ఞానాన్ని సరిచూసుకునే దృశ్య సాధనం యిది. సంఖ్యాత్మక విలువను కనుక్కోవడం అనేది లెక్కల గళ్ల రూపం తీసుకుంది. వాటిని వాళ్లే తయారు చేశారు: కొయ్య ఘనాకారాలు చతురస్రపు బాహులు, ప్రతి ఘనాకారంమీదా రాసిన అంకెలు అన్ని భుజాల మీదా సమాన సంఖ్యలో మొత్తాన్ని యిచ్చేవి. యెక్కాల పునరావృత్తికి సంబంధించి తయారుచేసిన ప్రత్యేక సమస్యలు "లెక్కల పెట్టె"లో వుండేవి.

గణిత "యెలక్ట్రినా" ధారణని పెంపొందించడానికీ, దృఢపరచడానికీ అద్భుతమైన సాధనం. అది ఒక పరికరం. దాని కదలిక యెలక్ట్రిక్ సర్క్యూట్ వాద్దంపై వుంటుంది. ప్రతి విద్యార్థీ యీ పరికరం మీదా యెక్కాలని వల్లెవేసేవాడు, సహజ సంఖ్యలని చెప్పేవాడు. మా మూడో తరగతిలో మా లెక్కల "ఎలక్ట్రినా"ల్ని మేమే తయారు చేసుకోవడం మొదలెట్టాం, నాలుగో తరగతి పూర్తయే నాటికి అలాంటివి నాలుగింటిని చేశాం. యీ పనిక్రమంలో విద్యార్థుల మేధాభివృద్ధికి ఆలోచనా, చేత్తోచేసే పనీ కలవడం యెంతో ముఖ్యం. దృశ్యపరికరాల పుణ్యమా అని అస్థిరమైన ధారణగల పిల్లలు కూడా తమ జ్ఞాపక శక్తిని బలపరుచుకున్నారు. (ఆలోచనా క్రమాన్ని ప్రభావితం చేసే మిగతా సాధనాలతోటి కలిసి యిది అద్భుతమైన ఫలితాల నిచ్చిందనుకోండి.)

పిల్లలకి ఆలోచించడం నేర్పడంలో చదరంగం పెద్ద స్థానాన్నే వహించింది. షూర, గాల్యా, సెర్యోజ, యూర, వాన్య, మీష యింకా కొంతమంది పిల్లలూ 'సంతోష చంద్రశాల"లోనే చదరంగం ఆడటం మొదలెట్టారు. ఆ చిన్న అబ్బాయిలూ, అమ్మాయిలూ తరచుగా చదరంగం బల్లదగ్గరే చాలాసేపు వుండేవాళ్లు. చదరంగం ఆడ్డం ఆలోచనని క్రమబద్ధంచేసి, యేకాగ్రతని నేర్పింది. కాని యిక్కడ ప్రధానమైంది జ్ఞాపక శక్తిని పెంచడం. పిల్లలు చదరంగం ఆడేటప్పుడు యేం జరిగిందీ, యేం జరగబోయేదీ వూహించుకున్నారని చూశాను. వాల్యా, నీనా, పేత్రిక్‌లు చదరంగం ఆడ్డం నేర్చుకోవాలని నాకు చాలా కోరిక ఉండేది. నేనా పిల్లలకి ఆ ఆట నేర్పాను, ఆ పిల్లలు తర్వాత యెత్తు గురించి ఆలోచించేవాళ్లు. ల్యూబా, పావెల్‌లు లెక్కల పరంగా ఆలోచించగలరని చదరంగంవల్ల నాకు తెలిసింది. మూడో తరగతిలో వాళ్లు చదరంగం ఆడటం నేర్చుకునే దాకా వాళ్ల ఆలోచనల్లో నాకేం చురుకుదనంగాని, పట్టుగాని కనిపించలేదు.

చదరంగం లేకుండా మేధాసామర్థ్యాలుగాని, ధారణగాని పూర్తి పరిణతి చెందుతాయని వూహించడం అసాధ్యం. మేధాభివృద్ధిలోని అంశాల్లో ఒకటిగా చదరంగం ఆడ్డం అనేది ప్రాథమిక పాఠశాలలో ప్రవేశించాలి. బౌద్ధిక బోధన ప్రత్యేక స్థానం వహించేటటువంటి, ప్రత్యేక రూపాలూ, పని పద్ధతులూ అవసరపడేటటువంటి ప్రాథమిక పాఠశాల గురించి ముఖ్యంగా యిక్కడ మనం మాట్లాడుతున్నాం.

## ప్రపంచమంతటా మా "యాత్రలు"

తన పొలాలనుంచీ, అడవులనుంచీ పిల్లవాడి దృక్పథాన్ని క్రమేపీ మన మాతృదేశంలోనూ, ప్రపంచమంతటా వున్న ప్రకృతి చిత్రానికీ, జీవితానికీ ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు విస్తృతం చెయ్యాలి.

భూమి సూర్యుడి చుట్టూ తిరిగే బ్రహ్మాండమైన గోళం అనీ, ఒకే సమయంలో భూమిమీద కొన్ని ప్రాంతాల్లో వేడిగా వుండే వేసవి అయితే యింకొన్ని ప్రాంతాల్లో మాంచి శీతాకాలమనీ, కొన్ని చోట్ల రాత్రి అయితే కొన్ని చోట్ల పగలు అనీ మొదటి తరగతిలోనే పసిపిల్లలకు బాగా తెలుసు. రెండో తరగతినుంచి మేము ప్రపంచం చుట్టూతా మా "యాత్రలు" చెయ్యడం ప్రారంభించాం. పిల్లలు "ఆకుపచ్చ తరగతి గది"లో కూర్చుంటారు. వాళ్లముందు ఒక పెద్ద గ్లోబు, కృత్రిమంగా ప్రకాశించే "సూర్యుడు". "భూమి" "సూర్యుడి" చుట్టూతా తిరుగుతుంది, "చంద్రుడు" "భూమి" చుట్టూతా. "చూడండి పిల్లలూ, యిదిగో యిక్కడా మనం వుంటున్నాం. మనం పడమటి హద్దుకి దగ్గర్లో వుంటున్నాం. మనం తూర్పుకి దూరప్రయాణం చేద్దాం. పట్టణాలూ నగరాలూ దర్శిస్తూ, ప్రజలు ఎలా జీవిస్తున్నారో చూద్దాం" అన్నాను నేను. అప్పుడు పొలాలూ, నదులూ గురించీ, మా యాత్రల్లో జనావాసం వున్న ప్రాంతాలని గురించీ వాళ్లకి చెప్పాను. నే చెప్పేదాంతో బాటుగానే బొమ్మలూ ఫిల్ము భాగాలూ చూపించడమూ జరిగింది.

సాయంత్రమవుతోంది, మేం గమనించకుండానే మా యాత్రలో రెండు గంటలు గడిచిపోయాయి. కాని, మేము యింకా వంద కిలోమీటర్లు కూడా ప్రయాణం చెయ్యనేలేదు. పిల్లలు మా "యాత్ర" కొనసాగించడం కోసం ఆత్రంగా వున్నారు.

...మళ్లీ మేము పట్టణాలనీ, నగరాలనీ, అడవుల్నీ, నదులనీ, నిర్మాణ స్థలాలనీ, పురాతన స్మృతి చిహ్నాల్నీ చూశాం, కాని మా యాత్ర విసుగ్గా కనిపించలేదు. కొన్ని రోజుల "ప్రయాణం" గడిచింది, మేం అప్పుడే వోల్గనది సమీపిస్తున్నాం. మేం జలవిద్యుత్ కేంద్రాలని చూశాం, వోల్గ తీర విశాల పచ్చికమైదానాల్లో పశువుల కాపర్లని కలిశాం. మానవ భవిష్యత్తుని నిర్ణయించిన మహత్తర స్టాలిన్‌గ్రాడ్ యుద్ధపు* గాథని పిల్లలు వూపిరి బిగపట్టి విన్నారు. వేలాది లక్షలాది వీరులు మృత్యువు నెదిరించి అక్కడ నిలబడకపోయి వున్నట్లైతే, బలవంతుడైన కర్కశ శత్రువు దాడిని ప్రతిఘటించకపోయి వున్నట్లైతే, అతని నడ్డి విరగ్గొట్టకపోయి వున్నట్లైతే, మేం ఈవేళ హాయిగా వుండే క్లాస్‌రూమ్‌లో కూర్చుని వుండి వుండేవాళ్లంకాదు. పసితనంనుంచీ పిల్లలని మానవ జీవితానికి సంబంధించిన చింతావ్యథల బృహత్ ప్రపంచంలోకి తీసికెళ్లాలి. యిప్పుడు కూడా భూమిమీద కొత్త, క్రూర యుద్ధాన్ని ప్రారంభించాలని సిద్ధమవుతూ వున్న శక్తులు వున్నాయని పిల్లల్ని తెలుసుకోనివ్వండి. తమ తాతల, ముత్తాతల సాహసకృత్యాలు ఒక వ్యక్తి విధికృతమైన సుడిగుండంలో ధూళిరేణువు కాదు, మహత్తర శక్తి అనే విశ్వాసాన్ని పిల్లల్లో బలపరచండి.

---

* స్టాలిన్‌గ్రాడ్ (ప్రస్తుతం వోల్గోగ్రాడ్) దగ్గర సైనిక చర్యలు (1942-1943) నాజీ దురాక్రమణదారులతో జరిగిన సోవియట్ యూనియన్ మహా దేశభక్తియుత యుద్ధంలో (1941-1945) స్టాలిన్‌గ్రాడ్ దగ్గర సోవియట్ సేనల విజయం సమూలంగా యుద్ధంలోనూ, మొత్తం ద్వితీయ ప్రపంచ సంగ్రామ క్రమంలోనూ వచ్చిన మార్పుకి నాంది అయింది.

పిల్లలు యింకా దూరంగా, లోతుగా మాతృదేశంలోకి ప్రవేశించారు, నూతన చిత్రాలు వాళ్లకి కనబడతాయి. తరగని గనులతో సంపద్వంతమైన ఉరల్స్, అంతుతెలియని సైబీరియన్ పైన్ వృక్ష అరణ్యం, మహా సైబీరియన్ నదులూ.... మేం ఉరల్స్‌లోని అందమైన విలువైన రాళ్ల ప్రాంతంలో, భూగర్భ శాస్త్రజ్ఞులతోటి ఖనిజ సంపద అన్వేషిస్తూ "ప్రయాణించడానికి" కొన్ని రోజులు అంకితంచేశాం. బైకాల్ సరస్సు పొడుగునా మరబోటులో ప్రయాణం చేశాం. అక్కడ పర్వతాలనీ, అరణ్యాలనీ మెచ్చుకున్నాం, రాత్రికి విడిది నెగళ్ల దగ్గర ఆగాం. యింకా ముందుకి పోతే, దూర ప్రాచ్య సంపదలు పిల్లలకి వెల్లడి అయ్యాయి, అప్పుడు సముద్రం, సముద్రపు ఓడమీద సహలీన్ ద్వీపానికి ప్రయాణం చేశాం. అప్పుడు మేం మా దేశంలో పగలు ఆరంభమయ్యే కురీల్ ద్వీపాలకి వెళ్లాం. మా "యాత్ర" దాదాపు మూణ్ణెల్లు జరిగింది. ప్రతిరోజూ మేం వంద కిలోమీటర్లు ప్రయాణం చేశాం. నలభై జాతీయతల ప్రతినిధులని కలుసుకున్నాం. మహత్తరమైన మనుషులతో - ధాన్యం పండించేవాళ్లతో, యిళ్లు కట్టేవాళ్లతో, గనిపనివాళ్లతో, మత్స్యకారులతో, భూగర్భశాస్త్రవేత్తలతో - పరిచయం కలగజేసుకున్నాం. మేం క్షేమంగా బతకగలగడం కోసం వాళ్లంతా బాగా పనిచేశారు. గర్వానుభూతి పిల్లల్లో పెరిగింది. మన దేశం ఎంత పెద్దదో, సంపద్వంతమైందో, సౌహార్దపూరితమైందో చూడండి.

ఒకదాని తర్వాత ఒకటిగా మేం మా మాతృదేశం చుట్టూతా ఎక్కువ చిన్న "ప్రయాణాలు" చేశాం. కఠినమైన అందమైన తంద్రా, ఆర్కిటిక్ మహాసముద్రమూ వున్న ఉత్తరాదికి వెళ్లాం; ధృవపరిశోధకులనీ, ధృవపు జింకల పెంపకం వాళ్లనీ, చెట్లు నరికేవాళ్లనీ చూశాం. పడమటన మా సోదర ప్రజలైన గుచూల్ జీవితం గురించి తెలుసుకోవాల్సి వచ్చింది. పర్వత పచ్చికబీళ్లని మెచ్చుకున్నాం. దక్షిణాన కాకసస్ పర్వతాల గుండా "ప్రయాణం చేశాం," యింకా మధ్య ఆసియా మైదానాలగుండానూ "ప్రయాణం చేశాం."

మేం దారిలో ఒక సంవత్సరమంతా గడిపాం. "మాతృదేశం" అనే మాట పిల్లల మనసుల్లో ఉజ్వలమైన చిత్రాలని నింపింది, సోవియట్ ప్రజల వీరోచిత శ్రమపట్ల సగర్వభావం వాళ్లలో జాగృతం అయింది. మా ఉదాహరణని వాడుకుని మాతృదేశం చుట్టూతా మా "యాత్రల్ని" మిగతా ప్రాథమిక తరగతుల ఉపాధ్యాయులూ జరిపారు. "మాతృదేశం" అనే మాట అర్థంలో పొదిగిన సోవియట్ ప్రజల మహత్తర విజయాలని మా పిల్లలు అర్థంచేసుకునేటట్టు చెయ్యాలనే ప్రయత్నం చేశాం.

బోధనా దృక్పథంనుంచి సోవియట్ యూనియన్ సోదర రిపబ్లిక్కులకి మా "యాత్రలు" చాలా ఆసక్తిదాయకంగా వున్నాయి. రష్యన్, ఉక్రేయిన్, బెలోరష్యన్ - మూడు సోదర ప్రజల రిపబ్లిక్కులవార - ప్రవహించే ద్నీపర్ నదివెంట మా యాత్ర మొదలెట్టాం. ఆ నదిమీద తేలుతూ మేం ఆయా నగరాలనీ, గ్రామాలనీ గురించి

తెలుసుకున్నాం, వీరోచితమైన గతాన్ని గురించీ, ప్రజల నిజమైన సోదరత్వాన్ని గురించీ తెలుసుకున్నాం. స్మోలేన్స్క్, లోయెవ్, కీయెవ్, కానెవ్, చెర్కాస్సీ, క్రెమెన్‌చూగ్, జాపరోజ్యె, కఖోవ్క - యీ పట్టణాల్లో ప్రతి ఒకటీ దురాక్రమణదారుమీద జరిపిన పోరాటంలో, పీడకులనుండి విముక్తికై జరిగిన పోరాటంలో, అంతర్యుద్ధ,* మహా దేశభక్తియుత యుద్ధాల్లో స్వేచ్ఛకీ, స్వాతంత్ర్యానికీ జరిగిన పోరాటంలో రక్తంతో అతికిన ప్రజల మహత్తర సోదరత్వాన్ని పిల్లలకి గుర్తుచేశాయి. ద్నీపర్ నదివెంట మా "యాత్రలో" ఆ నది మహత్వాన్నీ, సౌందర్యాన్నీ, ప్రజల సోదరత్వాన్నీ, స్నేహాన్నీ గానంచేసే ఉక్రేనియన్, రష్యన్, బెలోరష్యన్ పాటల్ని పిల్లలు విన్నారు. సోవియట్ అధికార సంవత్సరాల్లో మన రిపబ్లిక్‌లో నిర్మించుకున్నదాన్ని గురించి వినడంవల్ల పిల్లల్లో తమ సోషలిస్టు మాతృదేశంపట్ల గంభీరమైన సగర్వభావం జాగృతమైంది.

సౌహార్ద స్మృతి చిహ్నాలతో వున్న స్థలాల్లో మేం కొన్ని రోజులు గడిపాం. ఉక్రేనియన్ ప్రజలు రష్యన్ ప్రజలతోటి తమ శాశ్వత సంఘటితేచ్ఛని వ్యక్తం చేసినచోటు పెరెయస్లావ్ - హ్మెల్నీత్స్కినుంచి మేం ఆరంభించాం. మేము వూహాల్లో కొన్ని వందల నగరాలగుండా వెళ్లాం. తమ స్వస్థలాల స్వేచ్ఛ కోసమూ, స్వాతంత్ర్యం కోసమూ, అంతర్యుద్ధ కాలంలోనూ, ఫాసిస్టు ఆక్రమణ కాలంలోనూ నాశనమైపోయిన పరిశ్రమల పునర్నిర్మాణం కోసమూ ఉక్రేనియన్లూ, రష్యన్లూ జరిపిన ఉమ్మడి పోరాటంతో ఆ పట్టణాల అదృష్టం ముడిపడిపోయి వుంది.

రష్యన్ ఫెడరేషన్ గుండా ఎన్నో రోజుల "ప్రయాణం" పిల్లలమీద మరిచిపోలేని ముద్రవేసింది. ఒక వందకిపైగా భిన్న జాతులు రష్యన్ ఫెడరేషన్‌లో జీవిస్తున్నాయి. మన ప్రజల మధ్య వున్న మహత్తర స్నేహం వాళ్లకి విశదమయింది. పిల్లలు వోల్గనది ప్రాంతం, ఉత్తర కాకసస్, ఉరల్స్, సైబీరియా, దూర ప్రాచ్యం, దూర ఉత్తర ప్రాంత ప్రజల కృషితోటీ, జీవితాలతోటీ పరిచయం పొందారు.

మా స్వదేశ పటంమీద లెనిన్ జీవితానికి సంబంధించివున్న స్థలాలకి కొన్ని "యాత్రలు" చేశాం. ఉల్యానొవ్‌స్క్, కూయ్‌బిషెవ్, కజాన్, లెనిన్ గ్రాడ్, మాస్కో, షూషెన్‌స్కొయె - పటంమీద యీ ప్రతి ఒక్క కేంద్రమూ పిల్లల హృదయాల్లో స్పష్టమైన చిత్రాలని మేల్కొల్పింది: సోవియట్ రాజ్య స్థాపకుడూ, కమ్యూనిస్టు పార్టీ నిర్మాతా అయిన వ్లదీమిర్ ఇల్యీచ్ లెనిన్ బాల్య, కౌమార, యౌవన జీవిత కాలాన్ని గురించి నేను పిల్లలకి చెప్పాను.

బెలోరష్యా, మాల్దేవియాల గుండా, మధ్య ఆసియా రిపబ్లిక్కుల గుండా, బాల్టిక్ సముద్రపు రిపబ్లిక్కులగుండా, కాకసస్‌కవతలగా మా "యాత్రలు" మన

* యు.ఎస్.ఎస్.ఆర్.లో అంతర్యుద్ధం (1918-1920): 1917 మహత్తర అక్టోబరు సోషలిష్టు విప్లవ విజయాలని పరిరక్షించుకోవడానికి సోవియట్ రష్యాలో శ్రామికులూ, శ్రమించే రైతులూ బాహ్య, విప్లవ ప్రతీఘాత శక్తులతో చేసిన యుద్ధం.

ప్రజల మహత్తర స్నేహపు చిత్రాల్ని పిల్లలముందు యింకా విశదంచేశాయి. మా వూహాత్మక "యాత్రలు" యింకా స్పష్టంగా, ఆసక్తికరంగా అయాయి, ఎందుకంటే, మా తరగతికి రష్యన్, బెలోరష్యన్ పాఠశాల విద్యార్థులు కలం స్నేహితులున్నారు.

మా దేశ సరిహద్దులావతల మేం "యాత్ర" ఆరంభించాం. ప్రపంచపు భిన్న దిశల్లో వుండే ప్రకృతి వైవిధ్యాన్నీ, సౌందర్యాన్నీ చూపించాలనీ, ప్రపంచ ప్రజల జీవితంలో, కృషిలో వున్న ప్రతి మంచిదాన్ని గురించీ చెప్పాలనీ, విభిన్న భాషలు మాట్లాడే గతకాలపూ, యీ కాలపూ ప్రజల కళాసంస్కృతులపట్ల ఆసక్తి ఉద్దీపన చెయ్యాలనీ నేను వాంఛించాను. మంచికీ చెడుకీ మధ్యన భూగోళమంతటా జరిగే పోరాటాన్ని చూపించ వాంఛించాను. మా స్వదేశంగుండా జరిపిన "యాత్రల్లో" కంటే యీ "యాత్రల్లో" దృశ్య ఉపకరణాలు ఎక్కువ పాత్ర వహించాయి: యిక్కడ యింటివద్ద చూడని సుదూర భూభాగాలు, పిల్లలమీద హత్తుకునే ముద్రని సృష్టించడం అవసరం.

మొదటగా మేం ఎప్పుడూ వేసవికాలమే వుండే దేశాలని దర్శించాం. రోజు రోజుకీ పిల్లలకి ఈజిప్ట్, భారతదేశం, శ్రీలంక, ఇండొనేషియా ప్రజల జీవితంతోటీ, కృషితోటీ, సంస్కృతితోటీ పరిచయం అయింది. వాళ్లు యీ దేశానికి సంబంధించిన కథలు విన్నారు, ఫిల్ములు చూశారు. అదంతా వాళ్లు యేదో పొడుగాటి తాటిచెట్ల దగ్గరికి యెగిరిపోయినట్లూ, ఉష్ణదేశాల ఆర్పుకుపోయే వేడి అనుభవించినట్లూ, ఆవిరిగక్కే జల్లులు అనుభవించినట్లూ, పనివాళ్ల కృషి చూసినట్లూ వుండింది. పిరమిడ్ల దేశం అయిన ఈజిప్టుకి "యాత్ర" ఉల్లాసకరంగా వుంది.

అప్పుడు మేము పొరుగు రాష్ట్రాల "యాత్ర"కి బయల్దేరాం. బాల్టిక్ దేశాలని, స్కాండినేవియన్ దేశాలని, తర్వాత మధ్యయూరపు దేశాలని, టర్కీని, ఇరాన్‌ని, అఫ్ఘనిస్తాన్‌ని, జపాన్‌ని దర్శించాం. ఆరకంగా మేం ఆఫ్రికాకీ, దక్షిణ అమెరికాకీ, కెనడాకీ, అమెరికా సంయుక్త రాష్ట్రాలకీ, ఆస్ట్రేలియాకీ, అంటార్కిటికాకీ "యాత్రలు" జరిపాం.

భూగోళంమీద భిన్న ప్రాంతాల్లో ప్రజలు పనిజేసే పద్ధతులు పిల్లలకి చాలా ఆసక్తికరంగా కనిపించాయి. ప్రజలు యెక్కడ జీవించినాసరే, వాళ్ల శరీరపు రంగు యేదైనాసరే, వాళ్లు యే భాష మాట్లాడినాసరే, వాళ్లు శ్రమిస్తారు, పిల్లల్ని పోషిస్తారు, ఆనందాన్ని గురించి కలలు కంటారు. మన సోదరులైన సోషలిస్టు దేశాల ప్రజల జీవిత కృషుల గురించి యెంత స్పష్టంగా వీలైతే అంత స్పష్టంగా చూపించడానికీ, శ్రామికులపట్ల పిల్లల్లో స్నేహానుభూతిని జాగృతం చెయ్యడానికీ నేను ప్రయత్నించాను.

జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్కుని గురించి నేను పిల్లలకి చెప్పాను. ఫాసిజమూ జర్మన్ ప్రజలూ ఒకటే కాదనీ, జర్మన్ శ్రామికవర్గపు ఉత్తమ పుత్రులూ, పుత్రికలూ హిట్లర్‌నాటి కారుమేఘాలు కమ్మిన రోజుల్లో ఫాసిజాన్ని వ్యతిరేకించడానికి - సోవియట్ ప్రజలు పోరాడిన అదే శత్రువుకి వ్యతిరేకంగా, తమ జీవితాలు అర్పించారనే స్పష్టమైన భావం వాళ్లకి కలిగింది.

భూమిమీద "యాత్రలు" చేస్తూ ప్రజలంతా ఆనందంతో బతకడంలేదని పిల్లలు చూశారు: ప్రపంచంలో ఒక మనిషిని యింకో మనిషి పీడించే దేశాలు, ఆకలీ దారిద్ర్యమూ ప్రబలంగా వున్న దేశాలు వున్నాయి. ఈ అన్యాయానికి కారణమైన అధర్మమైన సాంఘిక వ్యవస్థని గురించిన అభిప్రాయం పిల్లలకి అర్థమైంది. క్రమేపీ పిల్లలకి ఒక తీవ్రమైన రాజీలేని పోరాటం పీడకులకీ పీడితులకీ మధ్య జరుగుతోందని నమ్మకం కలిగింది. పీడకులచేత యింకా బానిసలుగా చెయ్యబడుతూవున్న శ్రామికుల కోసమూ, యింకా దాస్యంలో వున్న ప్రజల కోసమూ అనుతాపం చెందడం నేను పిల్లలకి నేర్పాను.

ప్రపంచంలో ఒక వ్యక్తిని యింకో వ్యక్తి గురిచేసే దోపిడీ వుండబట్టి సకల మానవాళిపట్ల ప్రేమని బోధించడం కుదరదు, యెందుకంటే అనిర్దిష్ట మానవత్వం అనేది లేదు, వర్గంచేత సోదరులైనవాళ్లూ - పీడితులు - వాళ్ల బలవద్విరోధులు - పీడకులూ వున్నారు. ప్రతి పిల్లవాడూ చాలా పసితనంనుంచీ విప్లవాత్మక కమ్యూనిస్టు భావాలు యేవిటైందీ అర్థంచేసుకుని, తమ హృదయాలలో అనుభూతి చెందడం చాలా ముఖ్యం. మా స్వదేశపు సమీప గతంలోకి చిన్న విహారయాత్ర చేయిస్తూ, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం యీ ప్రజల పోరాటాల గురించి చెబుతూ, మన కాలంలో వలస, పెట్టుబడిదారీ దేశాల్లోని శ్రామికులు యెలా తమ హక్కుల్ని రక్షించుకుంటున్నదీ స్పష్టమైన ఉదాహరణలతో చెబుతూ కచ్చితంగా యీ భావాల కోసమే ప్రజలు మరణిస్తారు అనే అభిప్రాయాన్ని వాళ్లల్లో కలిగించాను. వర్గ వైరుధ్య సమాజంలో యెంతో స్పష్టంగా వెల్లడి అయిన భావాల కోసం తమ జీవితాలు ధారపోసిన ప్రజలు మన పిల్లలకి ఆదర్శంగా వుండేటట్టు చెయ్యడం చాలా ముఖ్యం. మరోపక్క నోరు మెదపకుండా కూడా పీడనకి దాసోహమనే వాళ్లపట్ల ద్వేషం కలగాలి. అందుకనే పిల్లలకి మొట్టమొదటగా భవిష్యత్తులో ఆనందమయ జీవితం కోసమని ప్రజల జీవితమూ, కృషీ, పోరాటమూ వున్నట్టుగా ప్రపంచాన్ని గురించి తెలియడం అవసరం.

కమ్యూనిస్టు భావాలు అర్థంచేసుకోవడంనుంచి నేను పిల్లల్ని క్రమేపీ కమ్యూనిస్టు పార్టీ అనే అవగాహనకి నడిపించాను. మన స్వదేశపు గతాన్ని గురించి పిల్లలకి చెబుతూ, శ్రామికవర్గ ప్రతినిధులైన మణిపూసల్లాంటి వాళ్ల నిస్వార్థ పోరాటాల గురించీ, దోపిడీ విధానం లేకుండా చెయ్యడానికీ, శ్రామికులు సౌఖ్యంగా బతకడానికీ, సంపదని సృష్టించిన వాళ్లకే అది చెందేటట్టు చెయ్యడానికీ చేసిన కృషి గురించీ నేను స్పష్టమైన ఉదాహరణలతో చెప్పాను. నేను ఆకట్టుకునే పద్ధతిలో వర్ణిస్తూ యెలా లెనిన్, కమ్యూనిస్టు పార్టీ కలిసి నిరంకుశత్వాన్ని కూలదోసి, సోవియట్ అధికారాన్ని స్థాపించడానికి శ్రామికుల్నీ, రైతుల్నీ సిద్ధంచేయడం జరిగిందో చిత్రించాను. లెనిన్ అనుచరులైన కమ్యూనిస్టుల నిస్వార్థ పోరాటంవల్ల మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవం, మన స్వదేశ ప్రజలకి స్వేచ్ఛానందాల ఉజ్వలమార్గం వేస్తూ, పెట్టుబడిదారీ దేశాల్లో లక్షలాది దాస్య బంధిత ప్రజలకి

స్వాతంత్ర్య మార్గం చూపెడుతూ కష్టతరమైన పరిస్థితుల్లో యెలా సఫలీకృతం అయిందో చూపించాను.

మన స్వదేశంగుండా "యాత్ర" చేస్తూ, సోవియట్ పరిపాలన సంవత్సరాల్లో మన దేశం యెలా గుర్తుపట్టలేనంతగా మారిపోయిందో, విశాలమైన ప్రదేశాల్లో యెలాంటి బ్రహ్మాండమైన ఫాక్టరీలు లేచాయో, యెలాంటి విశాల సమష్టి వ్యవసాయ క్షేత్రాలు యీ దేశాన్ని సుందరం చేశాయో, యెలా సోవియట్ ప్రజల సంస్కృతీ, జీవిత విధానమూ అభివృద్ధి చెందాయో నేను పిల్లలకి చెప్పాను. యీ సంభాషణల్లో నేను పిల్లల జీవితాలకి సంబంధించి, మొత్తం మన ప్రజలంతా పరిరక్షించే ఆనందమయ బాల్యం గురించి యెక్కువగా చెప్పాను.

సోవియట్ యూనియన్‌లో వికసిస్తూ వున్న జీవితానికి భిన్నంగా వుంది పెట్టుబడిదారీ దేశాల్లోని కష్టభూయిష్ఠమైన జీవితం.

జపాన్‌గుండా "ప్రయాణం" చేస్తూ 1945లో హిరోషిమాలో ఆటంబాంబు పేల్చడంవల్ల యెలా వేలాది ప్రజలు రేడియో అణుధార్మిక ధూళికి రోగగ్రస్తులైందీ, ఒక చిన్న పిల్ల, సదాకో ససాకీ, తీవ్రమైన వ్యాధితోటి మంచం పట్టిందీ పిల్లలు తెలుసుకున్నారు. తమ సుదూర సోదరి కోసం పిల్లలు అనుతాపం చెందారు. జబ్బుగా వున్న ఆ చిన్ని పిల్లకి వాళ్లు సహాయం చేద్దామనుకున్నారు కాని యెలా? జపాన్‌కి యీ "యాత్ర" తర్వాత కొన్ని వారాల తరువాత సదాకో ససాకీ ఒక వెయ్యి కాగితం కొంగలు చెయ్య సంకల్పించిందీ తెలియచేసే వార్తాపత్రికల్లోని వ్యాసం ఒకదాన్ని నేను పిల్లలకి చదివి వినిపించాను. (జపాన్ జానపద సంప్రదాయం ప్రకారం తమ స్వహస్తాలతో ఒక వెయ్యి కొంగల్ని తయారుచేసినవాళ్లు ఆనందంగా వుంటారట.) ఉక్రేనియన్ ప్రజలకి కూడా యిలాంటి నమ్మకమే ఒకటుంది: తన రోగిష్టి పిల్లకి ఆరోగ్యం కోసమని కన్నతల్లి కాగితపు వెండి భరద్వాజ పిట్టల్ని తయారుచేస్తుంది. దాంతోటి మా చిన్న అబ్బాయిలూ, అమ్మాయిలూ కొంగపిట్టల్ని తయారుచేసి ఆ సుదూర దేశానికి పంపించారు.... సంవత్సరాలు గడిచాయి. మా విద్యార్థులు యువతీ యువకులయ్యారు. కాని సదాకో ససాకీ ఆరోగ్యం గురించిన వార్త కోసం చూశారు. తమ సుదూర నేస్తపు విచారకరమైన మరణవార్త వాళ్ల హృదయాల్లో వ్యక్తిగత దుఃఖంగా మారింది.

దేని దిఙ్మండలం అయితే నిరంతరం పిల్లవాళ్లముందు కదులుతూ వుంటుందో ఆ ప్రపంచం సముద్రాలూ, ఉదధులూ, ఖండాలూ, ద్వీపాలూ చూడని జంతువులూ, మొక్కలూ, ఆర్కిటిక్ ఉత్తర కాంతులూ, ఉష్ణ ప్రాంతపు అనంత వేసవులూ మాత్రమే కాదు: మొట్టమొదటగా ప్రజలు ఆనందమయ భవిష్యత్తు కోసం వాళ్ల పోరాట ఆరాటాలూ ఆనందం కోసం, న్యాయం కోసం మానవాళి యుగయుగాల స్వప్నం. ఇది ఒక వ్యక్తిని ఇంకో వ్యక్తి పీడించడం నిర్మూలించిన మీదట సఫలీకృతమైంది. పిల్లలు ఆ ప్రపంచంలోకి ఉదాసీన పరిశీలకుల్లా, యేది యెక్కడ జరుగుతుందో

తెలుసుకుని ఇదీ అదీ చర్చించుకునేవాళ్లల్లా కాకుండా, మానవాళి భవిష్యత్తు కోసం ఆవేదన చెందేటట్టుగా ప్రవేశించాలి.

మన స్వదేశంలోనూ, దాని హద్దుల్లోనూ చేసే "యాత్రల్లో" ఒక ప్రమాదాన్ని గురించి జాగ్రత్తపడాలి – అది పిల్లల్ని యెక్కువ పరిజ్ఞానంతోటీ, అనుభూతులతోటీ "నింపెయ్యడం." విజ్ఞానశాస్త్రం అందుకున్న అసాధారణ విజయాలు, ఉదాహరణకి భూమీ, సూర్యుడూ యెంత బరువు తూగచ్చు, సూర్యుడిలో యేం వుంది, మనుషులూ చెట్లూ యెలాంటి కణాలతో వుంటారు, ప్రజలు యెలాంటి అసాధారణ యంత్రాల్ని వూహించారు యిలాంటివాటికి సంబంధించిన యే నివేదికనైనాసరే వర్జించండని అని లియో టాల్‌స్టాయ్ చిన్నపిల్లల ఉపాధ్యాయులకి సలహా యిచ్చాడు. విద్యార్థికి పొడి ఫలితాలు చెడ్డవి, ఆ యిచ్చిన అంకెలు నమ్మేటట్టు అవి చేస్తాయి, ఆ మహా రచయితా, బోధకుడూ చెప్పినట్టు. యీ మాటలు రాసిం తర్వాత దశాబ్దాలు గడిచిపోయాయి, విజ్ఞాన శాస్త్ర విజయాలవల్ల ప్రపంచం గుర్తుపట్టలేనంతగా మారిపోయింది, చిన్నపిల్లలకి కూడా భిన్నమైన దృక్పథం వుంది. అయినా యీ రోజుకీ టాల్‌స్టాయ్ సలహాకి విలువ పోలేదు. పిల్లల కధల్ని వాళ్లని నిశ్చేష్టితుల్ని చేసే సమాచారంతోటి గుప్పించెయ్యకూడదు.

## పిల్లవాడికి బౌద్ధిక శ్రమ సంతోషమూ, చదువులోని విజయంపట్ల సంతోషమూ కలిగించండి

విద్యార్థి భౌతిక శ్రమ, చదువులో నెగ్గడమూ ఓడిపోవడమూ, అతనికిగాని, ఆమెకిగాని సంబంధించిన ఆధ్యాత్మిక జీవితం, ఆంతరంగిక ప్రపంచం. దీన్ని అలక్ష్యం చేస్తే దురదృష్టకర పరిణామాలు సంభవిస్తాయి. పిల్లవాడు వూరికే యేదో కనిపెట్టేసి, పాఠ్య విషయాన్ని సాధించేసి వుండటమే కాదు. విజయ పరాజయాల్లో గంభీరమైన వ్యక్తిగత సంబంధాన్ని వ్యక్తంచేస్తూ తన పనిని దర్శిస్తాడు.

పసిపిల్లవాడికి ఉపాధ్యాయుడు సజీవ ధర్మావతారం. ఫెయిల్ మార్కు వచ్చిన మొదటి తరగతి పిల్లవాడి కళ్లల్లోకి చూడండి... ఆ పిల్లవాడు బాధపడడమే కాకుండా ఒక విద్వేషభావం, తరచుగా శత్రుత్వభావం ఉపాధ్యాయునిపట్ల కలుగుతుంది. విద్యార్థి యేదో అర్థంచేసుకోలేకపోయాడని తక్కువ మార్కులిచ్చే ఉపాధ్యాయుడు పిల్లవాడికి అధర్మమైన మనిషిగా కనిపిస్తాడు.

యిది ఒక స్కూల్లో జరిగింది: ఒక విద్యార్థి మొక్క యెలా ఆహారం పొందుతుందో, శ్వాస పీలుస్తుందో, కొమ్మలనుంచి ఆకులు యెలా పెరుగుతాయో, పువ్వులనుంచి పళ్లు యెలా వస్తాయో మొదలైనవి అర్థం చేసుకోలేకపోయాడు. ఉపాధ్యాయుడు ఆ చిన్న పిల్లాడితో ప్రతిసారీ చెప్పేవాడు: "నువ్వీ చిన్న విషయాలుకూడా అర్థంచేసుకోలేకపోతే నువ్వేం అర్థం చేసుకోగలవు?" అని. ఒక

పాఠంలో అతను అన్నాడు, "ఒక రెండు రోజుల్లో చెస్ట్‌నట్ చెట్లు చిగురిస్తాయి. మన క్లాసంతా చెస్ట్‌నట్ చెట్ల పార్కులోకి వెడదాం. ప్రతివాళ్లకీ అర్థం అయ్యేదాన్ని అల్యోష అప్పుడు చెప్పలేకపోతే వాడు వూరికే యెందుకూ పనికిరాదన్నమాట." ఆ ఉపాధ్యాయుడికి ఆ చెట్లంటే యిష్టం. తను విత్తనాలు వేసి పెంచిన చెస్ట్‌నట్ చెట్లంటే యిష్టం. ఆ పాఠం సమయంలో కొంతమంది విద్యార్థుల్ని ప్రతి చిన్న చెట్టునీ శోభాయమానంగా చేస్తూ చిగురించిన చెట్లని మెచ్చుకునేందుకు యింకోసారి తీసుకెళ్లాడు. ఆ మర్నాడు చెస్టనట్ చెట్ల పార్కులోకి క్లాసు పాఠంకోసం వెళ్లేటప్పటికి ఆ ఉపాధ్యాయుడికి మతిపోయింది: చెట్లనుంచి అన్ని చిగుళ్లూ కోసేసివున్నాయి. పిల్లలంతా బిక్కమొహం వేశారు. అల్యోష కళ్లల్లో కార్పణ్యంతో కూడిన సంతోషం ఉపాధ్యాయుడికి కనిపించింది....

యీ చర్య వెనకాల పిల్లవాడి అంతరంగిక శక్తి పిచ్చిగా పగిలి భళ్లున పేలడం, హృదయాంతరాళంలో కలిచివేసిన బాధ వున్నాయి. తన సామర్థ్యంమీద విశ్వాసం లేకపోవడానికి వ్యతిరేకతని పిల్లవాడు వ్యక్తంచేస్తున్నాడు. బోధనాత్మక కృషి ఆచరణలో పెట్టేటప్పుడు అలాంటివి తరుచూ జరుగుతూ వుంటాయి – పిల్లవాళ్లకి తక్కువ మార్కు తర్వాత తక్కువ మార్కు వస్తూనే వుంటుంది, అదంతా ఒకటే అయినట్టు. ఒకో అప్పుడు పిల్లవాడి తక్కువ మార్కులు అతని మిత్రుల నవ్వులాటకి గురవుతాయి, క్రమేపీ పిల్లలంతా వాన్య, పేత్యలకి ఫెయిల్ మార్కులు తప్ప యింకేమీ రావనే అనేసుకుంటారు. యింకా రూపుతీసుకునే ఆధ్యాత్మిక వ్యక్తిత్వానికి యిది వూహించలేనంత దారుణమైన విషయం. బాల్యంనుంచీ ఆత్మగౌరవభావం మొద్దుబారిపోయిన మనిషినుంచి యేం ఆశించగలం?

జ్ఞానసాధనా క్రమంలో ప్రతి పిల్లవాడూ మానవ గౌరవాన్నీ, అహాన్నీ పొందేటట్టు చూడ్డమే ముఖ్యమైన బోధనాకర్తవ్యాలలో ఒకటి. ఉపాధ్యాయుడు వూరికే విద్యార్థి ముందు ప్రపంచాన్ని విశదపరచడమే కాదు, తను సాధించిందానిపట్ల గర్వం పొందుతూ, క్రియాత్మకమైన ప్రపంచ నిర్మాతగా పిల్లవాడు వుండేటట్టు చూడాలి. అధ్యయనం అనేది సమష్టిలో జరగచ్చు కాని జ్ఞానం పొందే మార్గంలో పిల్లలు ప్రతి అడుగూ స్వతంత్రంగానే వేస్తారు. బౌద్ధిక శ్రమ గంభీరమైన వ్యక్తిగత క్రమం, శక్తి సామర్థ్యాలమీదనే కాకుండా, పిల్లవాని వ్యక్తిత్వంమీదా, చాలాసార్లు గమనించకుండాపోయే మిగతా పరిస్థితులమీదా ఆధారపడి వుంటాయి.

పిల్లవాళ్లు తేటగావుండే మనసుల్తో, బాగా చదవాలనే మనఃపూర్వకమైన కోరికతో బడికి వస్తారు. తమని సోమరులనీ, మొద్దులనీ అనుకుంటారేమోననే ఆలోచనే వాళ్లని బెదరగొట్టేస్తుంది. బాగా చదవాలనే కోరిక మంచిదే, పిల్లవాడి జీవితపు ఆలోచన మొత్తాన్ని పిల్లల సంతోష ప్రపంచాన్ని వెలిగించే కాంతివంతమైన జ్యోతి. యీ జ్యోతి ఉపాధ్యాయుని దగ్గరకు అపరిమితమైన విశ్వాసంతో దుర్బలంగా, రక్షణలేకుండా వస్తుంది. ఆ ఉపాధ్యయుడు పిల్లవాడి కోరికని గుర్తించకపోతే దానర్థం అతడుగాని ఆమెగాని తమ విద్యార్థుల ప్రస్తుత, భవిష్యత్ కాలాలపట్ల తగినంత

పట్టింపుతో లేరనే. పిల్లవాడి హృదయాన్ని అజాగ్రత్త స్పర్శతో - బాధపెట్టుకోవడానికీ, నిర్లక్ష్యానికీ దారితీసే ఒక దూకుడు మాటతో, ఆ జ్యోతిని తేలిగ్గా ఆర్పేయ్యొచ్చు. ఆ జ్యోతికి ప్రాణదాయకమైంది జ్ఞానకాంక్ష. అది పిల్లవాడు తన చదువుతో నెగ్గుకొస్తూవుంటేనే, తను జ్ఞానపు నిట్రమార్గంగుండా అభివృద్ధి సాధిస్తున్నాననే గుర్తింపుపట్ల అహంతో వుంటేనే కనిపిస్తుంది.

వృథాగా, నిష్ఫలితంగా పనిచెయ్యడం పెద్దవాళ్లకే అసహ్యంగా, శోషించేటట్టుగా, నిరర్థకంగా కనిస్తుంది మరి యిక్కడ మనం, పాపం పిల్లవాళ్లతోకదా వ్యవహరిస్తున్నాం. పిల్లవాడు తన కృషి ఫలితాలని చూడకపోతే, జ్ఞానదాహం మణిగిపోతుంది. పిల్లవాడి హృదయం స్తబ్ధుగా నిరాసక్తంగా మారిపోతుంది. ఆ జ్యోతి మళ్లీ వెలిగించేదాకా యే ప్రేరణకీ గురికాకుండా వుండిపోతుంది. మరి, అబ్బా, ఆ జ్యోతిని రెండోసారి వెలిగించాలంటే యెంత కష్టం! పిల్లవాడికి తన శక్తిమీదతనకే నమ్మకంపోతుంది. కడుపులో వున్న మాట పైకి చెప్పడు, బెదురుగా తయారవుతాడు, ఉపాధ్యాయుడి సలహాలకీ, హెచ్చరికలకీ పెళుసుగా, తలబిరుసుగా సమాధానం చెబుతాడు. లేదా యింకా దరిద్రం: ఆత్మగౌరవభావం సన్నగిల్లి నేనేం చెయ్యలేన్లే అనే అభిప్రాయానికి అలవాటుపడిపోతాడు. ఉపాధ్యాయుడి హితబోధలన్నీ గంటసేపు ఓపిగ్గా వింటూ, “నువ్వు వెనకబడిపోతున్నావు, మళ్లీయేడు కూడా యీ తరగతే చదవాల్సి వస్తుంది....” అనే మిత్రుల మాటలు కదలకుండా వింటూ, నిర్లక్ష్యంగా యేం జరిగితే అది జరగనిమ్మని పట్టించుకోకుండా వుండేవాణ్ణి చూస్తే యెవడికేనాగాని ఒళ్లు మండిపోతుంది. ఒక వ్యక్తికి ఆత్మగౌరవాన్ని గురించి బాధపడ్డంకంటె అవినీతి యేముంటుంది?

విద్యార్థి తన బాల్యంలోనూ, యుక్తకాలంలోనూ తన గురించి తను యెలా అనుకుంటాడో, తను శ్రమ ప్రపంచంలో యెలా పరిగణించుకుంటాడో ఆ పద్ధతి చాలాభాగం అతని నైతిక దృక్పథాన్ని నిర్ణయిస్తుంది. పిల్లవాడు స్వతహాగా మానసిక సోమరితనంతో వుండడని ఉషీన్‌స్కీ రాశాడు; పిల్లవాడు స్వతంత్రంగా కార్యకలాపాలు నిర్వహించాలనుకుంటాడు, ప్రతీదీ తనే చెయ్యాలనుకుంటాడు. పనిచెయ్యడం, ఆలోచించడం, పరిశీలించడం, బౌద్ధిక శ్రమ అంటే యేమిటో అర్థంచేసుకోవడం, బాగా పనిచెయ్యడమంటే యేమిటో తెలుసుకోవడం పిల్లవాళ్లకి నేర్పాలి - అప్పుడు మాత్రమే నెగ్గినందుకు యెవళ్లేనా మార్కులివ్వగలిగేది. అధ్యయనంలో వుండే శ్రమకి గల సంతోషాన్ని యెన్నడూ యెరగని పిల్లవాడు, కష్టాలు జయించిన ఆనందం యెన్నడూ పొందని పిల్లవాడు దుర్భష్టవంతుడు. మన సమాజానికి దురదృష్టవంతుడైన వ్యక్తే దౌర్భాగ్యం, యిక పిల్లవాడి సంగతి చెప్పాలా? బాల్యాన్ని వూహాత్మక మాధుర్యంలో నింపేవాణ్ణి కాను నేను. కాని బాల్యంలోనే మనుషులు తరుచుగా సోమరులవుతారనీ, పనంటే అసహ్యించుకుంటారనీ, ఆ మాటకొస్తే తమ సామర్థ్యానికి పూరా తగ్గట్టు పనిచేసే భావన అంటేనే యేవగించుకుంటారనీ అనే ఆలోచన నన్ను కలతపెడుతుంది. యెందుకు పిల్లవాడు అలా సోమరి అవుతాడు?

ఎందుకంటే, నా ప్రియమైన ఉపాధ్యాయులారా, పిల్లవాడికి శ్రమకిగల సంతోషం అంటే యేమిటో తెలీదు. పిల్లవాడికి ఆ ఆనందం యివ్వండి, ఆ సంతోషాన్ని విలువైందిగా పరిగణించడం నేర్పండి, అప్పుడు తన గౌరవాన్ని విలువైందిగా పరిగణిస్తాడు, పనిచెయ్యడాన్ని ప్రేమిస్తాడు.

పిల్లలకి శ్రమ సంతోషాన్ని చదువులో విజయాన్ని కలిగించడం, గర్వానుభూతినీ, వ్యక్తిగత గౌరవాన్నీ వాళ్ల హృదయాల్లో మేల్కొల్పడం విద్యలో మొదటి విధి. మన బడిలో దురదృష్టవంతులైన పిల్లలు వుండకూడదు - తమకి సామర్థ్యంలేదనే ఆలోచనతో పిప్పి అయిన మనసులున్న పిల్లలు వుండకూడదు. అధ్యయనంలో విజయం ఒక్కటే పిల్లవాడి ఆంతరంగిక శక్తికి ఆధారం, కష్టాలని అధిగమించడానికీ అధ్యయనం చెయ్యాలన్న కోరిక కలిగించడానికీ ఆధారం.

పిల్లవాడికి అధ్యయనం చెయ్యాలన్న కోరిక లేనట్లయితే మన ప్రణాళికలు, శోధనలు, నిర్మాణాలు అన్నీ బూడిదపాలయిపోతాయి, జీవంలేని పీనుగ అయిపోతాయి. యీ కోరిక అధ్యయనంలో విజయంతోటే వస్తుంది. యిది విరోధాభాసంగా కనిపించవచ్చు: పిల్లవాడు విజయం సాధించాలంటే, అతడు వెనకబడిపోకూడదు. యిది విరోధాభాస కాదు, కాని బౌద్ధిక శ్రమ క్రమంలో గతితార్కిక ఏకత, జ్ఞానసాధన విజయంలో పుట్టిన ప్రేరణ వున్నప్పుడే అధ్యయనంలో ఆసక్తి గోచరిస్తుంది. ప్రేరణ లేకుండా పిల్లలకి అధ్యయనమనేది భారంగా తయారవుతుంది. ప్రేరణ అని నేను పిలిచే శ్రద్ధ పిల్లవాడు తను నెగ్గుతాను అని భావించేటప్పుడు పెరుగుతుంది.

అంత చిన్న విషయంగా పైకి కనిపించేది, పిల్లవాడు తన జ్ఞానానికి పొందే మార్కుల్లాంటి విషయం, ప్రతి పిల్లవాడినీ అర్థంచేసుకోడానికీ, అతని మనసులోని జ్ఞాన తృష్ణ జ్యోతిని కాపాడడానికీ ఉపాధ్యాయునికి గల సామర్థ్యానికి చిహ్నం. ప్రాథమిక తరగతుల్లో పిల్లలు చదివిన నాలుగేళ్లల్లోనూ నేనెప్పుడూ కూడా రాత పనికిగాని, మౌలిక సమాధానాలకిగాని ఫెయిలు మార్కులు యివ్వలేదు. పిల్లలు చదువనూ రాయనూ లెక్కలు చెయ్యనూ నేర్చుకున్నారు. ఒక పిల్లాడు బౌద్ధిక శ్రమలో అనుకూల ఫలితాలు అప్పటికే సాధించాడు, యింకొకడు యింకా లేదు. ఒకడు నేను బోధించదలచింది అప్పటికే అర్థం చేసుకున్నాడు, యింకొకడు యింకా అర్థం చేసుకోలేదు, కాని అంతమాత్రం చేత అతనికి నేర్చుకోవాలనే కోరిక లేనట్టుగాదు. పిల్లవాడికి అనుకూలమైన ఫలితాలు వచ్చింతర్వాతనే నేను బౌద్ధిక శ్రమకి మార్కులు యిచ్చాను. తను సాధించ ప్రయత్నంచేస్తూ వున్న ఫలితాల్ని పిల్లవాడు యింకా సాధించకపోయినట్లయితే నేను యెలాంటి మార్కూ యివ్వనేలేదు. పిల్లవాడు ఆలోచించాల్సివుంది, తన ఆలోచనలని పోగుచేసుకోవాల్సి వుంది. తన పనిని తిరిగి చెయ్యాల్సి వుంది.

మొదటి తరగతిలో విద్యాసంవత్సరం ప్రారంభమయిన నాలుగు నెలలకి నేను మొదటిసారి మార్కులు యిచ్చాను. యిక్కడ అన్నిటికంటె ముందుగా, పిల్లవాడు శ్రద్ధ,

కష్టించి పనిచెయ్యడం అంటే యేమిటో అర్థంచేసుకోవడమే ముఖ్యం. పిల్లవాడు తన పనిని కావాలని చెడుగా చెయ్యడు, కాని యెందుకంటే మంచి పనికీ చెడ్డ పనికీ తేడా చూడ్డం తెలియదు గనుక - దీనికిగాను అతనికి మార్కులెందుకు? అదే పనిని పిల్లవాడిచేత నేను కొన్నిసార్లు చేయించేవాణ్ణి. అప్పుడు పిల్లవాడు తన వ్యక్తిగత అనుభవం ద్వారా మొదటిసారికంటే ఆ పనిని యెక్కువ బాగా చెయ్యగలనని నమ్ముతాడు. దీనికి గొప్ప బోధనాత్మక ప్రాముఖ్యం వుంది. యీ రకంగా విద్యార్థి తన సృజనాత్మక శక్తిని వెల్లడి చేసుకుంటాడు. తన వ్యక్తిగత విజయాన్ని చూసి సంబరపడి యింకా బాగా పనిచేసే ప్రయత్నం చేస్తాడు. గతంలో తను తప్పులు చేసినదాంతోటి పోల్చుకుని పిల్లవాడు ఉత్సాహం పొందుతాడు.

మొదటి తరగతిలో పనిని పరిశీలించగా పిల్లవాళ్లు సమానంగా ఆలోచించలేదనీ, తమ పనిని భిన్నంగా అంచనావేశారనీ నాకనిపించింది. ఉదాహరణకి, వాళ్లు "కందిరిగ" అనే మాట రాశారు. లీదా, సెర్యోజ, కాత్యా, పావెల్, సాన్యల అక్షరాలు పొందిగ్గా ముత్యాలకోవలా వున్నాయి. యూర అక్షరాలు బద్దీలు దాటిపోయి వంకరగా వున్నాయి. కోల్య, తోల్యలు రాయలేదు - వాళ్లు ప్రకృతిని గురించిన కాంపొజిషను కూర్చిన బొమ్మల పుస్తకంలోలాగా అక్షరాల్ని చెక్కారు. పేత్రిక్ నోటు పుస్తకంలో ఒక రకమైన వంకీలున్నాయి. నేను తర్వాతి అభ్యాసానికి సాగలేదు. పిల్లలు అదే మాట కొన్నిసార్లు రాశారు. అదే దాన్ని ప్రతిసారీ తిరగ రాయడం పిల్లవాడు యెక్కే కొత్త మెట్టు అయింది, బాగా రాసినవాళ్లకీ బాగా రాయనివాళ్లకీ ఉభయులకీనీ. తను మొదటిసారి చేసిందానికంటే యింకా బాగా చేస్తున్నందుకు పిల్లవాడు సంతోషంగా, ఆనందంగా వున్నాడు.

ఆ సంతోషంనుంచి స్వీయ యోగ్యత, గర్వం అనే భావం వస్తుంది. యీ భావం యెక్కువసార్లు కలిగిన పిల్లవాడు అడ్డదారి కోసం చూడడు, యింకోడి పుస్తకంనుంచి కాపీలు కొట్టడు. పిల్లవాళ్లు తమ పనిని తిరిగి చెయ్యడమూ, తత్సంబంధమైన సంతోషాన్ని అనుభవించడమూ జరిగాకనే నేను వాళ్లకి మార్కులు వెయ్యడం మొదలెట్టాను - సరే, అనుకూలమైన ఫలితాలకే ననుకోండి. బడిలో పాఠాలు మొదలైం తర్వాత కొంతమంది పిల్లలు నాలుగు నెలల తర్వాతా, కొందరు ఆరు నెల్ల తర్వాతా మార్కులు పొందారు. పేత్రిక్, మాషాలు రెండో తరగతి మొదలయ్యాకనే మొదటిసారిగా మార్కులు అందుకున్నారు. వాళ్లు కొంచెం మెరుగుదల చూపించేటంతవరకూ వాళ్లతోపాటు నేను అదనంగా పనిచేశాను. వాళ్లు స్వశక్తిమీద నమ్మకం పోగొట్టుకోకుండా చూశాను.

అధ్యయనం అనేది ఉపాధ్యాయుడినుంచి పిల్లవాడికి యాంత్రికంగా జ్ఞానం బదలాయింపు కావడం కాదు, అన్నిటికంటే యెక్కువగా మానవ సంబంధం. ఒక పిల్లవాడికి జ్ఞానంపట్లా అధ్యయనంపట్లా వున్న దృష్టి అతను ఉపాధ్యాయునితో యెలా సంబంధం పెట్టుకున్నాడూ అన్న దాని మీద చాలా యెక్కువగా ఆధారపడి వుంటుంది. విద్యార్థికి అన్యాయం అని అనిపిస్తే కంపించి పోతాడు. మరి చిన్న

పిల్లలు ఫెయిలు మార్కులు అన్యాయమనే అస్తమానూ అనుకుంటారు, వాటికి బాధపడతారు, యెందుకంటే పిల్లవాడు నేర్చుకోకూడదు అని-అనుకోవడం జరగదు కాబట్టి. నేర్చుకోవాలనే అనుకుంటాడు, కాని నేర్చుకోలేడు; తనకి యింకా దృష్టి లగ్నం చేసే సామర్థ్యం లేదు, యింకా తనచేత పని చేయించగలిగింది తగల్లేదు.

రోజుల తరబడి పిల్లలకి సంవత్సరమంతా అన్యాయం యెదురైతే వాళ్ల నాడీ మండలానికి మొదట్లో ప్రేరణ కలిగినా, బెరుకు ఆవహిస్తుంది - కుంగిపోవడం, దౌర్బల్యం, ఉదాసీనత వస్తాయి. ప్రేరణకీ బెరుకుకీ మధ్యన హఠాత్తైన దూకుళ్లు పిల్లవాడు జబ్బుపడే స్థాయికి పోతాయి. యీ వింత జబ్బులు బడికి సంబంధించిన నరాల బలహీనత. ఈ నరాల బలహీనతకు సంబంధించిన విచిత్రమైనది యేమిటంటే, అది బడిలో మాత్రమే సంభవిస్తుంది. ఉపాధ్యాయుడికీ విద్యార్థికీ మధ్యన వున్న అంతస్సంబంధాలల్లో మానవత్వం ప్రముఖ లక్షణం కావాల్సిన ఆ పవిత్ర స్థలంలో అది జరుగుతుంది. బోధనకి యీ రకం స్పందన అన్యాయం జరిగిందనే భావంనుంచి వస్తుంది. తల్లిదండ్రుల లేదా ఉపాధ్యాయుల అన్యాయమైన ప్రవర్తనకి చాలా సున్నితమైన భేదాలు వుంటాయి, దాంట్లో మొదటిది ఉదాసీనత. తన చదువులో విజయాలపట్ల ఉపాధ్యాయుడి ఉదాసీనత్వంకంటె పిల్లవాడి నైతిక, సంకల్ప బలాలు యేర్పడ్డంలో ప్రమాదకరమైందిలేదు. అప్పుడు కేకలూ, బెదిరింపులూ, చిరాకు మొదలు, సిసలైన బోధకులు కాని వాళ్లల్లో పిల్లవాడికి యేదో తెలీదు అన్నదానిపట్ల పగబట్టిన సంతోషం, పిల్లవాడికి ఫెయిల్ మార్కు యివ్వడంలో తల్లిదండ్రులు "తమకు యెలాంటి పిల్లవాడున్నాడో తెలుసుకుంటారు" అన్న సంతోషం.

కొన్ని సంవత్సరాలకి పైగా నేను స్కూల్‌కి సంబంధించిన నరాల జబ్బుల్ని గురించి అధ్యయనం చేశాను. ఉపాధ్యాయుడి పక్షంగా జరిగే అన్యాయానికి పిల్లల నాడీ మండలం అనేక రకాల ప్రతిచర్యలతో వుంటుంది: వాళ్లు అమిత కార్యాచరణ, హింసా వికారాలు, పగ, కృత్రిమమైన లేదా అస్వాభావికమైన అజాగ్రత్త, నిశ్చింతభావం లేదా లోతైన వ్యాకులత, ఉపాధ్యాయులూ యింట్లో వాళ్లూ శిక్షిస్తారేమో నన్న భయం చుట్టూతా యెగతాళీ, నిరసనా లేదా రోగలక్షణంగా బయటపడే క్రూరత్వం (యిది చాలా అరుదు, కాని ఉపేక్షించడానికి లేదు) లాంటి ప్రతిచర్యలకి గురవుతారు. జ్ఞానదాయకతని నిరోధించడం, తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల విద్యా నైపుణ్యంమీద ఆధారపడి వుంటుంది. బోధనా నైపుణ్యంలో అతిముఖ్యమైంది ప్రతి పిల్లవాడి మానసిక ప్రపంచాన్ని **అనుభూతి చెందడంగా** వుండాలి. తనని మరచిపోలేదు, తన దుఃఖం, తప్పులు బాధలు నలుగురితోటీ పంచుకోవచ్చును అన్న భావానికి అవసరమైనంత శ్రద్ధా, ఆధ్యాత్మిక శక్తీ ప్రతివాడికీ యిచ్చే సామర్థ్యం వుండాలి.

పిల్లవాడి దృష్టినుంచి, ఉపాధ్యాయుడు చెయ్యగల పెద్ద అన్యాయం యేమిటంటే, అకారణంగా తనకి ఫెయిలు మార్కు యిచ్చి, తల్లిదండ్రులచేత దానికి

దండన పొందేటట్టు చెయ్యడం. ఉపాధ్యాయుడు యీ తక్కువ మార్కుల్ని తల్లిదండ్రుల దృష్టికి తీసుకెళ్లాలని ఒత్తిడి చేస్తున్నాడని పిల్లవాడు చూస్తే, ఉపాధ్యాయుడన్నా, స్కూలన్నా పగతో నిండిపోతాడు. బౌద్ధిక శ్రమ అతనికి అసహ్యించుకునే పని అవుతుంది. అనుభూతులు కటువుగా తయారవడం, మిగతావాళ్లతో సంబంధాలలోకి, ముందుగా, తల్లిదండ్రులతోటి సంబంధాలలోకి బదలాయింపు అవుతుంది.

అన్యాయంవల్ల పుట్టే యీ రస జడత్వంకంటె పిల్లవాడి మనసుని కలుషితం చేసే దాన్ని దేన్నేనా వూహించడం కష్టం. తనపట్ల ఉదాసీనతతో పిల్లవాడు మంచికీ చెడుకీ తన భావుకతని పోగొట్టుకుంటాడు. తన చుట్టూతా ఎవరు మంచివాళ్లో ఎవరు చెడ్డవాళ్లో అర్థంచేసుకోలేడు. మనుషులంటే అనుమానం, అపనమ్మకం హృదయంలో స్థిరపడి పోతాయి. అదే పగకి ముఖ్యమైన ఆధారం అవుతుంది.

యీ మధ్యన బోధకుల్లో ప్రోత్సాహకాల గురించీ, దండనల గురించీ తరుచుగా చర్చలు వినబడుతూ వున్నాయి. యీ ఆకర్షకమైన సిద్ధాంతాలు మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయేవి... వాటిలో బోధనాత్మక కృషిలో అతి ముఖ్యమైన ప్రోత్సాహకం, అతి శక్తివంతమైన (కాని అస్తమానూ ఫలదాయకమైంది గాదు) దండన యేమిటంటే మార్కులు యివ్వడం. యిది చాలా పదునైన సాధనం. దీన్ని ఉపయోగించడం బ్రహ్మాండమైన నేర్పునీ, సామర్థ్యాన్నీ అపేక్షిస్తుంది.

యీ సాధనాన్ని సక్రమంగా వాడాలంటే అన్నిటికంటే ముందుగా పిల్లవాడిని ప్రేమించాలి. మీరు తనంటే యిష్ట పడుతున్నారని పిల్లవాడికి చెప్పకండి, మీ ప్రేమనీ, అతనంటే ఆసక్తినీ కనపర్చండి. "తన పనిని ఉపాధ్యాయుడు అభిమానిస్తే, అతను మంచి ఉపాధ్యాయుడు. తన విద్యార్థులంటే తల్లిదండ్రుల్లాగా ప్రేమతో మాత్రమే వున్న ఉపాధ్యాయుడు, పుస్తకాలన్నీ చదివేసినా కూడా తన పనన్నా, తన విద్యార్థులన్నా అభిమానం లేని ఉపాధ్యాయుడి కంటె మెరుగు. అతను సంపూర్ణమైన ఉపాధ్యాయుడు" అని రాశాడు టాల్‌స్టాయ్.

భావుకత అనేది అధ్యయనం వల్లనే సాధింప సాధ్యంకాని లక్షణం. బోధకునిలో మానవత్వపు భావుకత పునాది సామాన్య బౌద్ధిక, నైతిక, సౌందర్యాత్మక, రసాత్మక అభివృద్ధుల సుసంగత ఐక్యంతో వుంటుంది. యీ ఐక్యం ఉన్నత విద్యా స్థాయీ, సమష్టిలో వున్న నైతిక సంబంధాల సామాజిక అనుభవాల రెండింటి ఫలితమూనూ. ప్రతి పిల్లవాడి భవిష్యత్తూ తన అంతరాత్మమీదా, తను బడిలో బోధించే పిల్లవాడి యింగితమూ, ఆరోగ్యమూ, ఆనందమూ తన ఆధ్యాత్మిక, బౌద్ధిక సంపదమీదా ఆధారపడి వున్నాయని ఉపాధ్యాయుడు గ్రహించాలి.

...రెండో తరగతిలో ఒక వ్యాకరణ పాఠం. అభ్యాసాల వివరణా, నియమాల అధ్యయనమూ అయింతర్వాత పిల్లలు స్వతంత్రంగా పనిచేశారు. దాని లక్ష్యం, తమ జ్ఞానాన్ని గంభీరం చేసుకునేటట్టూ, సవరించుకునేటట్టూ చెయ్యడం. ఆ పనికి మార్కులు వస్తాయి. ఆ పనిని సవరిస్తూ వుండగా మీష, పేత్రిక్‌లు తమ అభ్యాసాన్ని బాగా చెయ్యలేదని నేను గమనించాను. వాళ్లకి గనక నేను ఫెయిల్ మార్కు యిస్తే,

తాము మనస్ఫూర్తిగా నేర్చుకుందామని అభిలషించే పిల్లలు దాన్ని తీర్పుగా పరిగణిస్తారు: "మీ మిత్రులు ఒక అడుగు ముందుకు వేశారు, కాని మీరు మాత్రం అలాగే వున్నారు." నేను వాళ్ల తప్పులు సవరించాను, బాగా రాయడం గురించి ఉదాహరణలు యిచ్చాను. కాని మీష, పేత్రిక్‌లకి యెలాంటి మార్కులూ యివ్వలేదు. రాత పుస్తకాలు తిరిగి యిచ్చేస్తూ నేను చెప్పాను: "మీష, పేత్రిక్‌లకి మార్కులు రాలేదు. పిల్లలూ, మీరు బాగా కృషి చెయ్యాలి. మీ అంతట మీరే యింకో అభ్యాసం చెయ్యండి. మార్కు తెచ్చుకొనే ప్రయత్నం చెయ్యండి."

పని అసంతృప్తిగా వుంటే తమకి మార్కులు రావడం లేదన్న దానికి పిల్లలు అప్పటికే అలవాటు పడిపోయారు. ఒక అభ్యాసం పూర్తిచెయ్యడం అంటే తప్పకుండా ముందుకి వెళ్లడం కాదనీ, దానిమీద ఉపాధ్యాయుడి "తీర్పు" ఖండితంగా వచ్చేసినట్టు కాదనే భావం పిల్లల మనసుల్లో క్రమేపీ యేర్పడింది. పిల్లవాడికి విజయద్వారం మూసుకుపోలేదు: తను అప్పటికింకా చెయ్యలేనివన్నీ తను భవిష్యత్తులో చెయ్యగలడు, బహుశా యివాళే. లేదా రేపు. ఫెయిల్ మార్కులు వచ్చిన పిల్లవాడు పడే బాధ తను తన మిత్రులకంటె ఒక అడుగు వెనక వుండిపోయాననే బాధ మీష, పేత్రిక్‌లకి కలగలేదు. "దయచేసి మాకో అభ్యాసం యివ్వండి" అని పాఠాలప్పుడు ఆ పిల్లలు అడుగుతారు, అంచేత నేను వాళ్లకి ఒకటి యిస్తాను. బడి అయేలోగా అది చేసే వ్యవధి చూసుకుంటారు వాళ్లు (మా బడి సమయం ప్రతి పిల్లవాడూ ప్రతిరోజూ తనకి చాలా అవసరమైన పని చేసే అరగంట వ్యవధి వుండేటట్టుగా క్రమబద్ధమైంది). ఆ చిన్నపిల్లలు మార్కు తెచ్చుకోవాలని తమ శాయశక్తులా ప్రయత్నించారు, మిగతావాళ్లకేమీ తాము తీసిపోలేదని చూపించ ప్రయత్నించారు. నేను వాళ్ల పనిని సరిచూసేవాణ్ణి. అలాంటి సందర్భాల్లో అస్తమానూ అది మంచి మార్కుకి అర్హమయే వుంటుంది.

సృజనాత్మక బౌద్ధిక శక్తీ, హేతుబద్ధతా, శోధనా అపేక్షించే అభ్యాసాల్లాంటి సందర్భాల్లో ప్రోత్సాహకంగా మార్కులని జాగ్రత్తగా ఉపయోగించడమనేది పని చెయ్యాలనే కోరికని జాగృతం చెయ్యడానికి మరీ ముఖ్యం. ఒక విద్యార్థిలో ఆలోచనా క్రమం వేగంగా, దూకుడుగా వుంటుంది, యింకొకడిలో మందంగా వుంటుంది; కాని దానర్థం ఓ పిల్లాడు యింకోడికంటే చురుకైనవాడనీ, యెక్కువ పని చేస్తాడనీ కాదు. ప్రాథమిక పాఠశాలలో లెక్కల పాఠాలు, సమస్యలు పరిష్కరించడం, బోధనా సూత్రాల మొదటి గీటురాళ్లు: బౌద్ధిక శ్రమ విజయంపట్ల పిల్లలకి సంతోషం కలిగించడానికీ, వాళ్లల్లో గర్వభావమూ, ఆత్మగౌరవ భావమూ మేల్కొల్పడానికీ. మొదట్లో యెదురయ్యే కష్టాలు పిల్లవాడికి అవరోధం కాకుండా వుండేటట్టు జాగ్రత్త పడాలి. పిల్లలు స్వతంత్రంగా ఆలోచించడం నేర్చుకునేదాకా, ఒక సమస్యలోని పరిస్థితుల్ని వివేచించుకునేదాకా, ఆ సమస్య పరిష్కారం కనుక్కునేదాకా – యింకోలా చెప్పాలంటే తన పనిలో విజయం సాధిస్తున్నాను అనే సంతోషం అనుభవమయ్యేదాకా సమస్యా పరిష్కారానికి నేను మార్కులు యివ్వలేదు. యిక్కడ సామాన్య పద్ధతి

అనుసరించకూడదు: ఒక పిల్లవాడు నెలలో లెక్కలకి పాసయే మార్కులు తెచ్చుకోవచ్చును, యింకోడు ఒక్క మార్కూ తెచ్చుకోలేకపోవచ్చును. అంతమాత్రం చేత యివతలివాడు. యేమీ చెయ్యలేదనీ, మెరుగుదల చూపించలేదనీ అర్థం కాదు. సమస్యని అర్థం చేసుకోవడం నేర్చుకున్నాడు. విద్యార్థి స్వతంత్రంగా పరిష్కరించిన ఒక మాదిరి క్లిష్టమైన మొదటి లెక్కల సమస్య పిల్లవాడి అభివృద్ధిలో ముఖ్యమైన అడుగు.

లెక్కల్లో నెగ్గుకు రాలేని విద్యార్థులని చాలా సంవత్సరాలు నేను శ్రద్ధగా పరిశీలించాను. ప్రాథమిక, సెకండరీ తరగతుల్లో వెనకబడ్డవాళ్లు ఒక్క సమస్యనీ స్వతంత్రంగా యెన్నటికీ పరిష్కరించలేరని నాకు నమ్మకం యేర్పడిపోయింది. వాళ్లు ప్రవాహంతో కొట్టుకుపోతారు, తమ మిత్రులు అప్పుడే నిలబడ్డ చోట కాళ్లు కిందకి ఆనిస్తూ: బోర్డుమీద చేసిన వాటినిగాని, లేదా పక్కవాళ్లనుంచి గాని కాపీ కొట్టేస్తారు. కాని సమస్యని యెలా పరిష్కరించాలా అనే అవగాహన బొత్తిగా వుండదు.

బోధనాత్మక నైపుణ్యాన్ని పెంపొందించే పద్ధతి యేదో వెతకడం ద్వారా యీ కష్టాన్ని తొలగించడం అసాధ్యం. లెక్కల పాఠాల్లో బౌద్ధిక శ్రమ ఆలోచనకి గీటురాయి: సమస్యలోని చిక్కు పిల్లవాడు ఆలోచించడం నేర్చుకోలేకపోవడంలో వుంది; చుట్టూతా వుండే ప్రపంచం తన వస్తువుతోటీ, విషయాలతోటీ, ఆధారితమైన వాటితోటీ, పరస్పర సంబంధాలతోటీ పిల్లవాడికి ఆలోచనా ఆధారం కాలేదన్నమాట. బాల్యంనుంచీ, ప్రకృతిలోకి "యాత్రలు" బౌద్ధిక శ్రమలో సిసలైన పద్ధతి అయితే లెక్కల్లో తప్పే పిల్లవాడు ఒక్కడు కూడా వుండడని అనుభవంవల్ల తెలుస్తోంది. వస్తువులే, విషయాలే పిల్లవాడికి ఆలోచించడం నేర్పాలి: మామూలు పిల్లలంతా తెలివిగా, చురుగ్గా, జిజ్ఞాసగా, ఉత్సుకతతో వుండటమనేది చెప్పలేనంత ముఖ్యమైన నియమం. విద్యార్థి దేన్నైనా అర్థంచేసుకోలేకపోతే, గట్టున పడ్డ చేపలాగా నిస్సహాయంగా అతని ఆలోచనలు గిజగిజ కొట్టుకుంటూ వుంటే, ఉపాధ్యాయులు తమ పనిని ఒకసారి సరిచూసుకోవాల్సి వుంటుందని నేను వాళ్లకి చెప్పాను. ఆ మహా ప్రాణదాయక ఆలోచనా ఆధారంనుంచి - వస్తుప్రపంచం, ప్రకృతినుంచి అవతలికి పోయి తమ విద్యార్థుల మనసులు యెండిపోయే సరస్సులాగా తయారయాయా? యీ సరస్సుని చుట్టూ వున్న ప్రపంచం, వస్తువులా, ప్రకృతీ మహాసముద్రంతోటి కలపండి, అప్పుడు చూడండి సజీవ ఆలోచనల జల యెలా యెగజిమ్ముతుందో.

చుట్టూ వున్న ప్రపంచమే పిల్లవాడికి ఆలోచించడం నేర్పేస్తుందనుకోవడమూ తప్పే. సైద్ధాంతిక ఆలోచన లేకుండా పిల్లవాడి దృష్టినుంచి వస్తువులు అభేద్యమైన గోడలాగా దాగివుంటాయి. తనని చుట్టి వున్న పరిసరాలనుంచి పిల్లవాడు సాధారణీకరించ గలిగినప్పుడు మాత్రమే ప్రకృతి బౌద్ధిక శ్రమకి పాఠశాల అవుతుంది. చుట్టూతా వున్న ప్రపంచంలోని పరస్పర ప్రతిచర్యల్ని ఒక ప్రధానమైన లక్షణంగా గ్రహించడానికి వాస్తవానికి సంబంధించిన స్పష్టమైన చిత్రాలు చూడడం

పిల్లవాడికి ముఖ్యం. అస్తిత్వం అంతటికీ అంతిమ కారణం (causa finalis) పరస్పర ప్రతిచర్యలే అన్న హేగెల్ ఆలోచన సరియైనదని నొక్కిచెపుతూ ఎంగెల్స్ యిలా రాశాడు: "యీ పరస్పర ప్రతిచర్య జ్ఞానంనుంచి యింక వెనక్కి వెళ్లలేం, యేమంటే అటువెనక తెలుసుకోడానికేమీ లేదు."* సాధారణీకృత ఆలోచనకు సిద్ధంచేసేదిగా పరస్పర చర్యని గుర్తించడం అనేది గణితపర ఆలోచనాభివృద్ధికి ముఖ్యమైన షరతు. యేదేనా సమస్యని సక్రమంగా పరిష్కరించడం అనేది వస్తువులకీ, విషయాలకీ మధ్యన వుండే పరస్పర ప్రతిచర్యని పిల్లలు గుర్తించారా లేదా అన్న దానిమీద ఆధారపడుతుంది.

ఆ సాధారణీకరణలు (యెక్కాలు, మామూలు అంకెలక్రమం) శాశ్వతంగా, దృఢంగా పిల్లల ధారణలో పదిలమైనప్పుడు సమస్యల పరిష్కారంలో స్వతంత్ర బౌద్ధిక శ్రమ ఫలవంతం అవుతుంది. ఆ సాధరణీకరణలు లేకుండా ఆలోచన అర్థరహితం అవుతుంది.

ఒక లెక్కల సమస్య నిబంధనలని పేత్రిక్ చాలా కాలం అర్థంచేసుకోలేకపోయేవాడు. నేను వివరించడాన్ని దూకుడు చెయ్యలేదు. పిల్లవాడు స్వయంకృషితో వస్తువులా, విషయాలా పరస్పరాధీన సారాన్ని తనే తెలుసుకోవడం ముఖ్యం. పిల్లవాడు సిద్ధాంతపరంగా ఆలోచించడానికి సిద్ధం కాకపోతే, సరిపోల్చీ, వివరణయిచ్చీ చెయ్యలేకపోతే, సజీవ ఆలోచన ఉబికిరాదు. నేను పిల్లల్ని ప్రకృతిలోకి తీసుకెళ్లాను, మళ్లీ మళ్లీ పరిశీలించడం నేర్పాను, వస్తువుల్నీ ప్రకృతిలోని వాటినీ, గుణాల్నీ పోల్చడం నేర్పాను - పరస్పర చర్యల్ని చూడడం నేర్పాను. పిల్లవాడి చైతన్యంలో పరిమాణం అనే భావం రూపొందించే పరివేష్టిత ప్రపంచపు విషయాల కేసీ, సామాన్యంగా వస్తువుల గుణాల్లో యెంతో ముఖ్యమైంది అయినట్టుగా అంకెకేసీ పేత్రిక్ దృష్టిని మళ్లించాను. పిల్లవాడు సంఖ్యాత్మక పరస్పర సంబంధాన్ని అర్థంచేసుకునే స్థాయికి చేరుకున్నాడు. అక్కడ పిల్లవాడికి అవి యెవడో కల్పించినవి కావనీ, వాస్తవంగా వున్నవేననీ నమ్మకం కలిగింది. విద్యార్థి తక్షణమే గుణకారాలు చెయ్యడం నేర్చుకున్నాడా, అంకెలతో వ్యవహరించడం నేర్చుకున్నాడా అన్నది అంత ముఖ్యంకాదు, పరస్పరాధీనత అంతస్సారం అర్థంచేసుకోవడమన్నదే ముఖ్యం.

మేము పుచ్చకాయల తోటలో కూర్చుని, కోత యంత్రం యెలా గోధుమని కోస్తోందో చూస్తున్నాం. తడవతడవకీ ధాన్యం నింపుకున్న లారీ కోతయంత్రంనుంచి వెళ్లిపోతోంది. కోతయంత్రపు బంకర్ నిండటానికి ఎన్ని నిముషాలు పడుతోంది? పిల్లలు గడియారం చూసి పదిహేడు నిముషాలు పడుతోందని గుర్తించారు. కోత యంత్రం ఆగక్కర్లేకుండా తమ పనిని వాళ్లు యెలా లెక్కవేశారు? బంకరు నిండటానికి అయిదు, నాలుగు, యింకా మూడు నిముషాలున్నాయి - పిల్లలకి

* Frederick Engels, Dialectics of Nature, Progress Publishers, Moscow, 1974, PP. 231-32.

కలవరంగా వుంది: యేమైనా కోత యంత్రం ఆగాలి కదా. యిక రెండు నిముషాలే వున్నాయనగా, అడివికి వెనకనుంచి ట్రక్కు వచ్చింది. కాని గిడ్డంగి దగ్గరకి ధాన్యాన్ని తీసుకెళ్లడానికి కచ్చితంగా గంట పట్టుతోంది. అంటే దూరానికీ కాలానికీ మధ్యన వుండే సంబంధాన్ని గుణించారన్నమాట. కోత యంత్రం ఆగకుండా పనిచేస్తూనే వుండేటట్టుగా ధాన్యం చేరవెయ్యడానికి యెన్ని ట్రక్కులు అవసరమో అన్ని వుంచారన్నమాట. కాని గిడ్డంగికి ధాన్యం చేరవెయ్యడానికి గంట కాకుండా రెండు గంటలు పట్టిందనుకోండి. వాళ్లకి యెక్కువ ట్రక్కులు అవసరమవుతాయా, తక్కువా?

"యెక్కువే! యిప్పుడు అంతసేపూ పని చేస్తూవుండే మూడు ట్రక్కులున్నాయి. ఒకటి ధాన్యం నింపుకుంటోంది. యింకొటి దింపుకుంటోంది. రోడ్డు గనక యింకా పొడుగ్గా వుంటే, వాళ్లకి దారిలో ఇంకా అవసరం అవుతాయి" అన్నాడు పేట్రిక్. అతని కళ్లు సంతోషంతో మెరిశాయి.

పిల్లవాడు మానసిక శక్తిని ఉపయోగపెడుతున్నాడు. రోడ్డు ఇంతకు రెండింతలు పొడుగైతే యెన్ని ట్రక్కులు అవసరమవుతాయీ అన్న దాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. కాని ఆ సమయంలో అదే ముఖ్యం కాదు. ముఖ్యమైంది యేమిటంటే సమస్యలు యెవళ్ల బుర్రల్లోనో కల్పించినట్టివి కాదని అతనికి అర్థం అయింది. సమస్యలు మన చుట్టూతా వున్న ప్రపంచంలో వున్నాయి. యెందుకంటే చలనం, జీవితం, మానవ శ్రమ వున్నాయి కాబట్టి.

పేట్రిక్ అప్పటికే మూడో తరగతిలో వున్నాడు, కాని సమస్యల పరిష్కారంలో నెగ్గటం లేదు. అతను తన మిత్రుల సాయంగాని, ఉపాధ్యాయుడి సహాయంగాని లేకుండా స్వతంత్రంగా ఒక్క సమస్యనీ తుదముట్టించలేదు. అది నాకు చింతగా వుండింది. యేమైనా పిల్లవాడు ఆలోచించడం మొదలెట్టాడని నాకు రూఢి అయింది. లెక్కల సమస్యలకి ఆధారభూతంగా వున్న విషయాల యోచనాత్మక వివరణగుండా మాత్రమే కాకుండా సాధారణీకరించడానికి అతన్ని సిద్ధం చేస్తున్నాను. ఆలోచించేవాడు లెక్కించలేకపోతే, అతను జ్ఞానాన్ని ఆపోశన పట్టలేడు. పేట్రిక్ క్రమేపీ ఆలోచించడానికి అత్యవసరమైన ప్రాథమిక విషయాల ధారణని గట్టిపరచుకోవడం ముఖ్యం. ఆ కుర్రాడు "లెక్కల పెట్టె" దగ్గర కూర్చుని, తనని సవరించుకుంటూ అభ్యాసం చేశాడు. 12-8, 19+13 లేకపోతే 41-19 యెంత అని అతన్ని విసిగించేకంటే సమస్య స్వభావాన్ని అతను అర్థం చేసుకొనేటట్టు నేను ప్రయత్నించాను. (ఒక మూడో తరగతి వాడు వీటిని గురించి ఆలోచిస్తే, సమస్యని పరిష్కరించలేడు.)

విద్యార్థులు తరుచుగా బీజగణితంలో లొక్కుగా వుండేవాళ్లు. యెందుకంటే వాళ్లు సహజ అంకెల్ని దాటి జీర్ణంచేసుకోలేదు. ప్రాథమిక విషయాల గురించి ఆలోచించడం ఆ దశలో అవసరంలేదు, వాళ్ల శక్తి అంతా సాధారణీకృత ఆలోచనకి మళ్లగలగాలి. మాటల్లో వుండే ధ్వనులని వెయ్యిసార్లైనా చదివి వుండకపోతే ధారాళంగా చదవడం రానట్టే, గణిత జ్ఞానం కూడా రాదు. నిత్య జీవితంలో

మనుషులు ఆలోచించ నవసరం లేకుండా జవాబులు గుర్తుంచుకునే వందలాది ఉదాహరణల్ని పిల్లవాడు గుర్తుంచుకోలేకపోతే సాధారణీకృత గణితచింతన బ్రహ్మ భేద్యంగానే వుండిపోతుంది. మందకొడిగా నేర్చుకునే వాళ్లు, ముందుగా పేత్రిక్, గణిత ఆలోచనా సులభ సాధనాల్లో పెద్ద సంఖ్యల్ని – కూడికలు, తీసివేతలు, హెచ్చవేతలు, భాగారాలు, సాధించేటట్టు చేశాను.

మేం ప్రకృతిలోకి వెళ్లాం. పిల్లల దృష్టిని పని చేసేటప్పుడు మనుషులు పరిష్కరించే అనేక సమస్యలవైపు మళ్లించాను. ఆఖరికి పేత్రిక్ తనంతట తానే ఒక సమస్యని పరిష్కరించాడన్న నమ్మకం నాకు కలిగింది. ఆ పిల్లవాడి కళ్లు మెరిశాయి. ఆ సమస్య దేన్ని గురించో వివరించడం మొదలెట్టాడు, అతని వివరణ గజిబిజిగా వుంది. అయితేనేం అంతకు ముందు పొగమంచు కప్పేసినదేదో పిల్లవాడిలో విచ్చుకుంటోంది. పేత్రిక్ సంతోషంగా వున్నాడు. నేను కూడా తృప్తిపడ్డాను. ఆ కుర్రాడు బడి అయిపోయేదాకా వుండలేకపోయాడు, వాళ్ల అమ్మకి చెబుదామని యింటికి పరిగెత్తిపోయాడు. వాళ్ల అమ్మ యింటిదగ్గర లేదు, కాని వాళ్ల తాతతోటి సంబరంగా చెప్పాడు: "నా అంతట నేనే ఒక్క లెక్క చేశాను." తన విజయం పట్ల పేత్రిక్ గర్వంగా వున్నాడు, పరిశుద్ధ నైతిక గర్వం మానవ విజయంలో నుంచి చిగురిస్తుంది. తమ పనిలో గర్వంలేకుండా యెవళ్లూ నిజమైన మనుషులు కాలేరు.

మా ఉపాధ్యాయులకి యీ దృష్టాంతం ఆలోచనకి మేత అయింది. చదవడం కష్టమనిపించే పిల్లలని యింకో పార్శ్వంలో చూశాం. పిల్లవాడు యేమీ అర్థంచేసుకోలేడు అనీ, అతను అలాగే వుండాల్సిందే అనీ తొందరపడి నిర్ణయానికి రాకండి. ఒక రెండు సంవత్సరాలు అతనేమీ అర్థం చేసుకోలేక పోవచ్చు, కాని కాలం గడిచే కొద్దీ, నేర్చుకోవడం మొదలెడతాడు. ఆలోచన అనేది క్రమేపీ జీవ సారాన్ని పోగుచేసుకునే పువ్వులాంటిది. మనం వేళ్లకి యీ సారాల్ని యిచ్చి, పువ్వుని యెండలో వుంచితే అది వికసిస్తుంది. ఆలోచనా ఆధారానికి ముందున్న పరివేష్టిత ప్రపంచాన్ని తెరుస్తూ మనం పిల్లవాడికి ఆలోచించడం నేర్పాలి. మనం పిల్లవాడికి గొప్ప మానవ సంతోషాన్ని – జ్ఞేయపు సంతోషాన్ని యిస్తాం.

ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులు చాలా సాయంత్రాలు సమావేశమయ్యేవాళ్లు. ముఖ్యంగా యీ కష్టమైన గంభీరమైన బోధనాత్మక సమస్యల్ని గురించి ఆలోచించడానికి: వస్తువులా, విషయాలా సాకార గణన నుండి, స్పష్టమైన, స్పర్శనీయమైన దృగ్గోచర విషయాల మధ్యవుండే పరస్పరాధీనతలనుండి బోధనాత్మక సాధారణీకరణల వైపు – నియమాలవైపూ, సూత్రాలవైపూ, పిల్లవాణ్ణి యెలా నడిపించాలి? అందరు పిల్లలూ యీ మార్పుకి సునాయాసంగా బాధలేకుండా రాలేరనే ఉదాహరణలను చర్చించాం. కొందరు గుణించే మెలుకువలు బాగా గ్రహించినవాళ్లూ వుంటారు – వాళ్లు వేగంగా గుణించేస్తారు కాని సమస్యలోని పరిస్థితిని కష్టంమీద మాత్రమే వాళ్లు బోధపరుచుకుంటారు. స్పష్టమైన స్పర్శనీయమైన, సాకార అభివర్గాల్లో ఆలోచించే మరికొంతమంది పిల్లలకి ఒక

సమస్యలోని నిర్దిష్టమైన అంకెలనుంచి మళ్లడం అనేది కష్టంగా వుంటుంది ఉదాహరణకి కొంతమంది పిల్లలు సమస్యని క్షుణ్ణంగా పట్టేసి వెంటనే జవాబుకోసం వెతుక్కుంటారు: గుణించడానికి కారణం యేమిటో అర్థంచేసుకోకుండానే వాళ్లు గుణించడం మొదలెడతారు.

మాకందరికీ అలాంటి పిల్లలు తగిలారు. వాళ్లని నిర్దిష్ట ఆలోచననుంచి సాధారణీకృత ఆలోచనకి యెలా మార్చాలా అని ఒకళ్లనొకళ్లం సంప్రదించుకున్నాం. వాళ్లు ఒక మొత్తం సమస్యని పరిష్కరించాలనీ, యే అంకెలూ, గణక పద్ధతులూ లేకుండా సమస్యని అర్థం చేసుకోవాలనీ నిర్ణయానికి మేము వచ్చాం. సమస్యని వివరించుకుని, అంకెలు లేకుండా పరిష్కరించడం యెలాగో చూపించడానికి ఒక ప్రత్యేక లక్ష్యంతో లెక్కల్లో వివరణాత్మక పాఠాలు నడిపాం. ఒకళ్ల పాఠాలకు యింకొకళ్లు హాజరవుతూ కొంచెం యిబ్బందులు వున్న కొంతమంది పిల్లల మేధాభివృద్ధికి దారులు వెతికాం.

పిల్లవాడి ఆలోచనని బంధించే సంకెళ్ల లాగా మార్కులు తయారుకావడానికి అంగీకరించకూడదు. ఆ సమయానికి పరమ మందకొడిగా వున్న వెనకబడిన పిల్లలకి, ఆ సమయంలో వాళ్లు అర్థంచేసుకోలేనిదాన్ని గురించి ఆలోచించే అవకాశం అస్తమానూ యిచ్చేవాణ్ణి. పిల్లలు అధ్యయనంలో ఆసక్తి యెన్నడూ పోగొట్టుకోలేదు. గర్వం, గౌరవం, స్వీయ యోగ్యతాభావం జాగృతం చెయ్యడంలో, పిల్లలు స్వతంత్రంగా పని చెయ్యాలనుకుంటున్నారని నేను చూశాను.

**పిల్లవాణ్ణి ఆలోచించనియ్యండి...** యిది పైకి కనిపించినంత తేలికకాదు మొదటి నాలుగు తరగతుల గుండా విద్యార్థుల బౌద్ధిక శ్రమని జాగ్రత్తగా చూడండి. చాలా యెక్కువ సందర్భాల్లో (యిది దాదాపు అస్తమానూ జరుగుతుంది) పిల్లవాడూ మీ ప్రశ్నకు జవాబివ్వడు (లేదా అభ్యాసం పూర్తి చెయ్యడు), వూరికే యెందుకంటే ఆలోచించి మనసు లగ్నం చేసే వ్యవధి లేదతనికి (ఒకోఅప్పుడు ప్రశ్న అనుకోకుండా యెదురైనట్టు పిల్లవాణ్ణి నిశ్చేష్టితం చేస్తుంది). మా ప్రాథమిక ఉపాధ్యాయులు పిల్లవాడికి ఆలోచించే వ్యవధి యెలా యివ్వాలా అని చర్చించేందుకు ప్రత్యేకం సమావేశమయ్యారు. పిల్లవాడికి జవాబు తెలుసా, తెలియదా అనే నిర్ణయానికి దూకుడుగా పోకూడదనే అభిప్రాయానికి వచ్చాం. సరిగ్గా జవాబు పిల్లవాడికి తట్టే సమయానికే ఉపాధ్యాయుడు పిల్లవాడితో "కూర్చో నీకు జవాబు తెలీదు!" అని చెప్పడమనేది తరుచుగా జరుగుతూవుంటుంది. పిల్లవాడికి జవాబు తెలియదన్నట్టుగా కనిపిస్తుంది, దాంతోటి పిల్లవాడు ఉపాధ్యాయుడు చేసిందానికి కష్టపెట్టుకుంటాడు. యిది యెందుకు జరుగుతుంది? వెంటనే యీ ప్రశ్నకి మనం జవాబు కనుక్కోలేం. మనం యెన్నోసార్లు పరిశీలించి యెన్నో వాస్తవాలని అధ్యయనం చెయ్యాలి.

యిచ్చా, ఆలోచనల యేకాగ్రత అనే లక్ష్యం సాధించిన పిల్లవాడు అందిపుచ్చుకోడాన్ని వంచననీ అసహ్యించుకుంటాడు. నాకూ మా పిల్లలకీ మధ్య

పరస్పర విశ్వాసభావం, సహృదయభావం యెప్పుడూ వుండింది. తాము యేమేరకి గట్టిగా ప్రయత్నించినా కానీ యేదేనా తమకి అర్థం కాలేదనీ, నాతో చెప్పడానికి మా విద్యార్థులు యెప్పుడూ భయపడేవాళ్లు కాదు. విద్యార్థులు తమ కష్టసుఖాలన్నీ నాతో చెప్పేవాళ్లు. నేనెప్పుడూ పిల్లలకి బాధ కలిగించేవాణ్ణి కాదు, మరి వాళ్లకి ఫెయిల్ మార్కు బాధేకదా. ఉపాధ్యాయుడు దాదాపు ప్రతిరోజూ, "చూడు నీకు మళ్లీ తక్కువ మార్కు వచ్చింది" అంటూవుంటే పిల్లవాడు ఖేద మనస్కుడవుతాడు. పిల్లవాడు ఖేదపడ్డానికి యెక్కువ దుఃఖం అక్కర్లేదు. పిల్లవాడు తన బాధకి అలవాటు పడిపోయి, చుట్టూతా వుండే దానిపట్ల ఉదాసీనంగా తయారయినప్పుడు విషాదం రెట్టింపు అవుతుంది; అతని హృదయం కరడు గట్టేస్తుంది. కరడు కట్టిన హృదయం క్రూరత్వానికి సారవంతమైన నేల. క్లాసులో ఖేదపడే పిల్లలుంటే, వాళ్ల మిత్రులు వాళ్లని బాగుచేద్దామని ప్రయత్నించకపోతే, సమష్టి యెన్నటికీ మంచి స్నేహపూర్వకమైందీ, సహృదయమైందీ కాలేదు.

బడిలో మామూలుగా జరిగేటట్లు మంచి మార్కులతో పిల్లవాడు పాడైపోయేటట్టు చెయ్యకూడదు. పిల్లవాడు ఒక మాట అంటేనే అతి యెక్కువ మార్కులిచ్చెయ్యడం. ఒకటే ప్రశ్న కొంతమందికి వెయ్యడం, ప్రతివాడికీ ఒక్కొక్క మార్కు రావడం. తత్ఫలితంగా పిల్లలు అధ్యయనం చెయ్యడాన్ని గంభీరంగా పట్టించుకోరు. బౌద్ధిక శ్రమ ఫలితంగానే పిల్లవాడు మార్కులు పొందాలి.

బౌద్ధిక కార్యకలాపం యెంతో శక్తినీ యిచ్ఛా యేకాగ్రతనీ, యెన్నో సుఖాల్ని వదులుకోగల సామర్థ్యాన్నీ అపేక్షించే పని అని పిల్లవాడికి నమ్మకం కలగాలి. పని వాతావరణంలోనే కచ్చితంగా సంకల్పం, పట్టుదల రూపుతీసుకుంటాయి. సాధించిన విజయాలని సవిమర్శకంగా తెలుసుకుని, పనిలో ఓటమిని అనుభవించిన పిల్లవాడు కష్టపడి యింకా బాగా పనిచెయ్యడం కోసం ప్రయత్నిస్తాడు, యెన్నటికీ సోమరిగా వుండడు.

స్వంత అనుభవాన్నుంచి బౌద్ధిక శ్రమలో యెలా నెగ్గాలో తెలుసుకుని పిల్లలు ఆత్మనిగ్రహంతో వుండటం గ్రహిస్తారు. కష్టించి పనిచేసే అలవాటూ, ఉత్తమ ఫలితాలని సాధించడం అనే అలవాటూ పిల్లలకి నిర్లక్ష్యంగా చేసే అభ్యాసాలన్నా, సోమరితనమన్నా, ఉపేక్ష అన్నా ద్వేషం కలిగించేటట్టు చేస్తాయి.

పని సంతోషమూ, చదువులో నెగ్గుకు రావడమూ అధ్యయనంలో ముఖ్యమైన ప్రేరణ అయితే క్లాసులో సోమరి పిల్లలే వుండరు. పిల్లల్లో విడివిడి సోమరితనపు సందర్భాలతోటి బోధనాకళలో సిసలైన సిద్ధహస్తులైనవాళ్లు యెప్పుడోగాని తలపడక్కర్లేదు, కాని సోమరితనాన్ని మానసిక నిద్రాణత్వపు ఫలితంగా పరిగణిస్తారు.

బౌద్ధిక శ్రమ అనుకూల ఫలితాలే వున్న పునాది గల వ్యవస్థ క్రమేపీ స్కూలు మొత్తం వేళ్లు సారించింది, నడిమి, పై తరగతి ఉపాధ్యాయుల్లో కూడా. ఒక పావుభాగం, ఒక సంవత్సరం అయింతర్వాత కూడా ఒకదాంట్లోనో యింకోదాంట్లోనో విద్యార్థికి మార్కు లేదనుకోండి, అయితే యేమవుతుంది అని పాఠకుడు అడగవచ్చు.

విషయం యేమిటంటే పిల్లవాడికి మార్కులు లేకపోవడాన్ని ఫెయిలు మార్కులందుకున్న గొప్ప దురదృష్టంతో పోల్చకూడదు. తమకింకా మార్కు రాకపోతే, చెయ్యాల్సినట్టుగా తాము పనిచెయ్యలేదని పిల్లవాళ్లు నమ్మారంతే. అంచేత విద్యాసంవత్సరం అయిపోయే నాటికి విద్యార్థికి మార్కుల్లేక పోవడమనేది వుండేది కాదు. నాలుగేళ్లల్లోనూ, నేను త్రైమాసిక మార్కులు యివ్వని సందర్భాలు అరుమాత్రమే వున్నాయి. తమ కొడుకుకి గాని కూతురికి గాని మార్కు రాకపోతే అర్థం పరిస్థితి సవ్యంగా లేదన్న విషయం తల్లిదండ్రులకు తెలుసు. మార్కుల్లేక పోవడం పిల్లవాని తప్పుకాదనీ, అతని దురదృష్టమనీ వాళ్లకు తెలుసు. అలాంటి సందర్భాల్లో చేయూత యివ్వాలి, మేమంతా కలిసి ఆ విద్యార్థికి సాయంచేసేవాళ్లం. తమ పిల్లలనుంచి యెన్నడూ అత్యున్నత మార్కులు అపేక్షించవద్దనీ, లేదా తప్పుడాన్ని సోమరితనం లక్షణంగానో, ఉపేక్ష లక్షణంగానో, శ్రమ కొరతగానో పరిగణించవద్దనీ తల్లితండ్రుల్ని ఒప్పించాను.

కొంతమంది ఉపాధ్యాయులు అతి సున్నితమైన సాధనం అయిన మార్కుల్ని అనాలోచితంగా వాడతారు. చాలా బళ్లల్లో ఒక సగటు మార్కు తిరస్కారంగా చూడబడుతుంది. “యే సగటు మార్కులూ లేకుండా మనం చదువుదాం” యిలాంటి విజ్ఞప్తులు యువ పయనీర్ సభల్లో మాత్రమే కాదు వినిపించేది, పిల్లల వార్తాపత్రికల్లో కూడా అవి కనిపిస్తాయి. విద్యార్థుల్లో సంతృప్తికరమైన పనిపట్ల అలాంటి దృక్పథాన్ని ప్రోత్సహించడంలో ఉపాధ్యాయుడు తన ముఖం అసహ్యకరంగా తయారయేటట్టు ముక్కు కోసేసుకుంటున్నాడు: పిల్లలకి పైకి విసుగ్గా వుండటమూ, చులకనగా వుండటమూ నేర్పుతున్నాడు.

రెండో తరగతి ప్రారంభమైన కొన్ని వారాలకి, పిల్లలు తమంత తామే చిన్న పుస్తకాలు తయారు చేశారు. పాఠాల్లో వాళ్లకి వచ్చిన మార్కులు వాటిల్లో రాయాల్సి వుంది. తమ తల్లిదండ్రులనుంచి మార్కులు పిల్లవాడు దాచిపెట్టిన సందర్భం ఒక్కటీలేదు. విజయంపట్ల సంతోషాన్ని మార్కు ప్రతిబింబిస్తే మరోలా జరగదు కదా. అభ్యాస పుస్తకాల్లో సంతకాలు కోరే అవసరం ఉపాధ్యాయులకి లేదు – విద్యార్థులకీ ఉపాధ్యాయులకీ మధ్యన పరస్పర అనుమానం, అవిశ్వాసం వుండే స్కూలు వాతావరణం నాటి అవశేషం అది. క్లాసులో పరస్పర విశ్వాసం లేకపోతే, పిల్లవాడు ఉపాధ్యాయుడికి అబద్ధం చెప్పే ప్రయత్నం చేస్తే, పిల్లవాణ్ణి యేకెయ్యడానికి మార్కులు కొరడాకింద తయారైతే, సరియైన బోధన పునాదే నాశనమైపోతుంది.

అన్యాయంగా ఫెయిల్ మార్కులివ్వడంతో ప్రారంభమవుతుంది, స్కూల్లో వుండే పరమ దుర్మార్గాల్లో ఒకటి – పిల్లవాడిలో అధర్మమూ, ఉపాధ్యాయులకీ, తల్లిదండ్రులకీ అబద్ధం చెప్పడమూ. స్కూల్లో తమ వైఫల్యాలని గురించి తల్లిదండ్రులకీ, తమ అలక్ష్యం గురించి ఉపాధ్యాయులకీ తెలియకుండా దాచిపెట్టుకోవాలని మాత్రమే పిల్లలు అలాంటి కుయుక్తులు అవలంబిస్తారు. విద్యార్థిని నమ్మడం తగ్గేకొద్దీ, అతను అబద్ధాలకి దిగుతాడు, సోమరితనానికీ,

అలక్ష్యానికి అంతగా నేల పదును అవుతుంది. అపనమ్మకపు బిడ్డే సోమరితనం. మా శిష్యులు మొట్టమొదటగా సజీవ వ్యక్తులు, పిల్లలు, అప్పుడు విద్యార్థులు. నేను వాళ్లకి యిచ్చే మార్కులు వాళ్ల పరిజ్ఞానపు కొలబద్దలే కాదు, కాని మొట్టమొదటగా, మనుషులుగా వాళ్లతోటి నా సంబంధాలు.

పిల్లవాడి జిజ్ఞాసా, ఉత్సుకతల జ్వాలనీ, జ్ఞాన తృష్ణనీ విలువైందిగా కాపాడమని నేను ఉపాధ్యాయులకి సలహా యిచ్చాను. యీ జ్వాలని మండించే ఒక్క ఆధారమూ యేమిటంటే, శ్రమలో విజయానందమూ, శ్రమించేవాడిలో సగర్వభావమూ. ప్రతి విజయానికీ, కష్టాన్ని అధిగమించే ప్రతి జయానికీ అందుక తగ్గ మార్కుతో బహుమానం యివ్వమనీ, అంతేకాని మార్కుల్ని దుర్వినియోగం చెయ్యద్దనీ నేను వాళ్లకి సలహా యిచ్చాను. మన బోధనాత్మక నైపుణ్యం నిర్మించే నేల పిల్లవాడు తనేననీ, పరిజ్ఞానం పట్లా ఉపాధ్యాయుల పట్లా అతని దృక్పథమూననే విషయాన్ని మరిచిపోవద్దని నేను సలహా యిచ్చాను. అది నేర్చుకోవాలన్న కోరిక, ప్రేరణ, కష్టాలని అధిగమించాలన్న సంసిద్ధత. యీ క్షేత్రాన్ని జాగ్రత్తగా పోషకం చెయ్యాలి, యెందుకంటే అది లేకుండా, బడేలేదు.

## “అద్భుత కథా మందిరం”

పిల్లల ఆలోచనకీ, దయాస్ఫూర్తి అనుభూతులకీ, ఉద్దేశాలకీ అద్భుత కథలూ, ఆటలూ, కల్పనలూ సజీవ ఆధారాలు. సౌందర్యాత్మక, నైతిక, బౌద్ధిక అనుభూతులు పిల్లవాడి మనసులో అద్భుత కథా చిత్రాలనుంచి పుడతాయని చాలా సంవత్సరాల అనుభవం తెలియచేస్తోంది. యీ చిత్రాలు సజీవ ఆలోచనా ద్వీపాల మధ్య చింతనా శ్రేణిని అనుసంధిస్తూ, ఆలోచనాధార నిరాటంకంగా వుండేట్టు చేస్తాయి, మెదడుని జాగృతం చేస్తాయి. అద్భుత కథల చిత్రాలు పిల్లల మనస్సుల్లో మాటల సున్నిత భావఛాయని తీసుకు వస్తాయి. అవి పిల్లవాడి ఆధ్యాత్మిక జీవితరంగం అవుతాయి, అనుభూతులూ ఆలోచనలూ వ్యక్తంచేసే సాధనాలవుతాయి, ఆలోచన తాలూకు వాస్తవం అవుతాయి. అద్భుత కథా చిత్రాలు మేల్కొల్పిన అనుభూతుల ప్రభావంలో పిల్లవాడు మాటలతో ఆలోచించడం నేర్చుకుంటాడు.

తమ ఆలోచనలు అద్భుత కథా చిత్రాల ప్రపంచంలో సజీవం అవుతాయని పిల్లలు మహదానందం పొందుతారు. పిల్లవాడు అదే కథని కొన్ని డజన్లసార్లు వినగలడు, ప్రతిసారీ అందులో నవ్యత్వం చూడగలడు. తేటైన, సజీవమైన, నిర్దిష్టమైన దానినుంచి భావనాత్మకమైన దానికి మొదటి మెట్టు అద్భుత కథల చిత్రాల్లోవుంది. తమ ఆధ్యాత్మిక జీవితాల్లో అద్భుత కథల మొత్తం దశే లేకపోయినట్లయితే మా విద్యార్థులు సాధారణీకృతంగా ఆలోచించగలిగి వుండేవాళ్లుకాదు. ప్రపంచంలో బాబా యాగా మంత్రకత్తె, భేక రాకుమారి, చిరంజీవి మహాకాళం లేవని పిల్లవాడికి బాగా తెలుసు. కాని అతడు మంచి చెడుల గురించిన

తన అభిప్రాయాలు యీ చిత్రాల్లో కుదుర్చుకుంటారు. అదే కథను చెబుతూ ప్రతిసారీ మంచి చెడులపట్ల అతని దృక్పథాలు వ్యక్తమవుతాయి.

అద్భుత కథలని సౌందర్యంనుంచి విడదీయ్యలేం, అవి సౌందర్యానుభూతుల అభివృద్ధికి సహకరిస్తాయి. యిది లేకుండా ఆత్మ ఔన్నత్యమూ, మానవ దుఃఖంపట్లా, బాధపట్లా భావుకత అనూహ్యం. అద్భుత కథల పుణ్యమా అని, పిల్లవాడు ప్రపంచాన్ని గురించి తన మనసుతోటే కాకుండా తన హృదయంతో కూడా తెలుసుకుంటాడు. తెలుసుకోవడమే కాదు, తన చుట్టూ వున్న సంఘటనలపట్ల, మంచిచెడ్డల గురించి తన దృక్పథాన్ని వ్యక్తంచేస్తూ స్పందిస్తాడు. అద్భుత కథల్లో న్యాయాన్యాయ సంబంధమైన మొదటి భావాలు వస్తాయి. సైద్ధాంతిక బోధనలోని మొదటి అడుగు కూడా అద్భుత, కథల సాయంతోటే జరుగుతుంది. స్పష్టమైన చిత్రాల్లో అవతరించినప్పుడే ఒక భావాన్ని పిల్లలు అర్థంచేసుకుంటారు.

స్వదేశంపట్ల ప్రేమని బోధించడానికి అద్భుత కథ సార్థకమైన, నిరుపమానమైన ఆధారం. అద్భుత కథల్లో దేశభక్తియుత భావాలు ఆ కథల్లోనే నిబిడీకృతమై వుంటాయి. కొన్నివేల సంవత్సరాలుగా ప్రజలు సృష్టించిన అద్భుత కథా చిత్రాలు శ్రామిక ప్రజల బ్రహ్మాండమైన సృజనాత్మకశక్తినీ, జీవితంపట్లా, ఆదర్శాలపట్లా, ఆకాంక్షలపట్ల వాళ్ల దృక్పథాల్నీ పిల్లల మనసులకీ, హృదయాలకీ అందిస్తాయి. జానపద సంస్కృతి ఆధ్యాత్మిక సంపదల్లో అద్భుత కథలు ఒకటి. వాటిని అర్థంచేసుకోలేకపోతే పిల్లవాడు తన దేశపు ప్రజలని అర్థంచేసుకోలేడు.

"సంతోష చంద్రశాల" ప్రారంభమైన మూడు నెల్లకి మేము ఒక "అద్భుత కథా మందిరం" తయారుచేశాం. మా పిల్లలు అద్భుత కథా చిత్ర ప్రపంచంలో వున్నట్టు వాతావరణాన్ని సృష్టించడానికి పెద్ద పిల్లలు మాకు సాయపడ్డారు. తమకి తమ పసితనంలో తల్లులు చెప్పిన అద్భుత కథల కనికట్టులోకి మా చుట్టూతా వున్న ప్రతీదీ పిల్లలని ఆకర్షించేటట్టు మేం చేయ ప్రయత్నించాం. అది సాయంకాలపు మసకసంధ్య, పొయ్యిలో వెలిగే సంతోషభరిత జ్వాల వుండే మానసిక పరిస్థితి. ఒక మూల దుష్ట బాబా యాగా మంత్రగత్తె కోడికాళ్ల గుడిసె వుంది. దాని చుట్టూతా పొడుగాటి చెట్లూ, కాండాలూ. ఆ గుడిసె పక్కనే అద్భుత కథా చిత్రాల పోలికలున్న బొమ్మలున్నాయి. జిత్తులమారి నక్క, బూడిదరంగు తోడేలు, యుక్తిగల గుడ్లగూబ. మరో మూల తాతా, అవ్వల గుడిసె; అడవి బాతులు చిన్న పిల్లవాణ్ణి రెక్కలమీద యెత్తుకుని ఎగిరిపోతూ వున్నాయి. ఆ కుర్రవాడు ఉక్రేనియన్ జానపద గాథల నాయకుడు. మూడో మూల నీలి మహాసముద్రం. దాని ఒడ్డున మంచి ముసలాయనా దుష్టముసలమ్మా కాపరం వుండే జవజవలాడి పోయే పూరిగుడిసె. తలుపు పక్కనే పాత నీళ్ల తొట్టె. ఆ ముసలాయనా, ముసలమ్మా యింటిదగ్గర కూర్చున్నారు. సముద్రంలో బంగారుచేప యీదుతోంది. నాలుగో మూల మంచు కుప్పలతో వున్న శీతాకాలపు అడవి. దాని మధ్యలో దొచ్చుకుపోతూ, చిన్న

అమ్మాయి – విపరీతమైన చలిలో అడివిలోకి బె[్రీ పళ్లు తెమ్మని ఆమె సవతితల్లి ఆమెని పంపింది.

మేమిదంతా స్వయంగా చేశాం. నేను కోసీ, గీసీ, అతికించీ చేస్తే పిల్లలు నాకు సాయంచేశారు. పిల్లలు అద్భుత కథలు వినే పరిసరాలకి సౌందర్య లక్షణం ముఖ్యమని నేను భావించాను. ప్రతి బొమ్మా, ప్రతి దృశ్యచిత్రం కళాత్మక పద గ్రహణని పదునుచేసింది, అద్భుత కథా భావాన్ని యింకా లోతుగా వెల్లడి చేసింది. ఆఖరికి గదిలో వెలుతురు కూడా పెద్ద పాత్ర వహించింది. నేను భేక రాకుమారి కథ చెప్పినప్పుడు ఆ కథ జరిగిన సన్నివేశాన్ని స్పష్టంగా తిరిగి సృష్టిస్తూ అడివి పొదల్లో దీపాలు వెలిగాయి, గదిలో ఆకుపచ్చ సాయంసంధ్య కమ్మింది.

నేను పిల్లల్ని "అద్భుత కథా మందిరానికి" తరచూ తీసికెళ్లేవాణ్ణిగాను – వారానికి ఒకసారి, అప్పుడప్పుడు రెండు వారాలకొకసారి. సౌందర్యాత్మక అపేక్షల్ని యెప్పటికీ అతిగా తీర్చకూడదు. సంతృప్తి వున్నట్లయితే అధికులమనే మదం, పెటీబూర్జువా నిరుత్సాహం ప్రవేశిస్తాయి, విసుగు "కాలక్షేపం" కోసం వెదకులాట వస్తుంది... మేం అక్కడికి ఆకురాలు కాలంలోనూ, శీతాకాలపు మసక సంధ్యలోనూ వెళ్లేవాళ్లం – యీ సమయాల్లో అద్భుత కథలు చక్కగా యెండగా వుండే నాటికంటే భిన్నంగా ధ్వనిస్తాయి, పిల్లలకి అద్వితీయంగా స్ఫురిస్తాయి. బయట చీకటి అయింది. మేం దీపాలు వెయ్యలేదు, అసురసంధ్యలో కూర్చున్నాం. హఠాత్తుగా అద్భుత కథా గుడిసెలోని దీపాలు మిణుకుమన్నాయి. ఆకాశంలో నక్షత్రాలు వచ్చాయి. అడివి వెనకనుంచి చంద్రుడు ఉదయించాడు. గదిలో మసక దీపం వెలుగు వుంది, మూలల్లో యింకా చీకటిగా వుంది, బొమికెకాలు బాబా యాగామంత్రకత్తె గురించి నేను పిల్లలకి ఒక జానపద కథ చెప్పాను. పిల్లలకి నా మాటల్లో కొత్తేమీ లేనట్టు కనిపించవచ్చు కాని వాళ్ల కళ్లు సంతోష పూర్వకంగా మెరిశాయి. వీరుల దురదృష్టానికి పిల్లలు బాధపడ్డారు, చెడుని అసహ్యించుకుంటూ, మంచికోసం గాఢంగా పరితపిస్తూ. చిన్న పిల్లలకి అద్భుత కథలు వూరికే పిచ్చి సంఘటనల కథలు కావు; అవి ప్రపంచమే. దానిలో పిల్లవాడు తన మంచితనంతోటి చెడుని యెదిరించి, పోరాడి జీవిస్తాడు. పిల్లవాడి ఆధ్యాత్మిక శక్తిని వెల్లడించే నిజమైన రూపం అద్భుత కథల్లోని మాటలు, ఆటలు చలనాన్నీ, సంగీతం మాధుర్యాన్నీ వెల్లడించినట్టు. పిల్లవాడు అద్భుత కథలు వినడానికి యిష్టపడ్డమే కాకుండా, తనే వాటిని చెప్పాలనుకుంటాడు, పాటలని వినడానికీ పాడడానికీ యిష్టపడ్డట్టూ, ఆటలని చూడ్డానికీ, తనే ఆడడానికీ యిష్టపడ్డట్టు.

కొన్ని రోజులు గడిచిపోయాయి. పిల్లవాళ్లు అడిగారు "మనం 'అద్భుత కథా మందిరానికి' యెప్పుడు వెడుతున్నాం?" అని. సంతోష క్షణాలకోసం నిరీక్షణ పిల్లల్ని ఆవేశపరచింది. మళ్లీ సాయంసంధ్యలో సమావేశమయ్యాం. యింకోసారి నేను ఓ కథ చెప్పాను, పిల్లలు దాన్ని తిరిగి చెప్పారు. ఆ క్షణాల్లో యెంతో పిరికిగా వుండే పిల్లలు కూడా ధైర్యంగా, బింకంగా తయారయారు. మిగతా సందర్భాల్లో గజిబిజిగా,

పొంతన లేకుండా వుండే మాట తడబాటు లేకుండా, మధురంగా, వ్యక్తీకరణంగా తయారైంది. మాటతోనూ, ఆలోచనాభివృద్ధితోనూ యిబ్బంది పడే నీనా, పేత్రిక్, ల్యూదా, స్లావ, వాల్యా లాంటి వాళ్లంతా కూడా కథలు చెప్పారు.

మేము "అద్భుత కథా మందిరానికి" వచ్చినప్పుడల్లా పిల్లలు ఆడుకుందామనుకునేవాళ్లు. ప్రతివాళ్లకీ, అబ్బాయిలకీ అమ్మాయిలకీ కూడా యిష్టమైన ఆటవస్తువులో, బొమ్మలో వుండేవి. ఆటలు సృజనాత్మక రూపం తీసుకునేవి: పిల్లవాడు అద్భుత కథలోని నాయకుడైపోయేవాడు, చేతిలో వున్న బొమ్మ తన ఆలోచనలనీ, అనుభూతులనీ యింకా స్పష్టంగా వ్యక్తంచేసేది. ఒక పిల్లవాడు గడ్డి ఆంబోతుని తీసుకునేవాడు (అది ప్రఖ్యాత ఉక్రేనియన్ పిల్లల కథలో నాయకపాత్ర). యింకొకడు ముసలి అవ్వబొమ్మ, మరొకడు తాతాబొమ్మ తీసుకున్నాడు. ఆ రకంగా పిల్లలు కల్పనా ప్రపంచంలో వుండిపోయేవాళ్లు. వాళ్లు వూరికే ఆ పాత్రల మాటలే వల్లెవేసేవాళ్లు కాదు, అద్భుత కథలోకి తమ వూహాల్లోని కథని ప్రవేశపెడుతూ కొత్తవి సృష్టించేవాళ్లు. ఒక పిల్ల తన చిన్న బొమ్మని సోఫామీద పెట్టి ఆప్యాయంగా ముద్దుచేసే మాటలు మధురస్వరంలో దానితో మాట్లాడుతూ వుండేది. ఇంకో బొమ్మకి జబ్బుచేసింది, అమ్మాయి దాన్ని బాగు చెయ్యాలని శ్రద్ధ పట్టింది.

పిల్లలు కొన్ని యేళ్లుగా బొమ్మలతో ఆడుకుంటున్నారని నాకు యిబ్బంది కలగలేదు. కొంతమంది ఉపాధ్యాయులనుకునేటట్టు యిది "కుర్రతరహా" కాదు. అదే కథలు, మనసున్న సజీవ ప్రాణులతో అదే నింపెయ్యడం, అద్భుత కథల్ని కల్పించడానికీ, వినడానికీ సృజనాత్మక క్రమంలో జరిగేది అదే. ఫ్రెంచి రచయిత అన్‌టువాన్ సెయింట్ ఎక్జ్యూపెరీ (1900-1944) చెప్పినట్టు పిల్లలు "మచ్చిక చేసే" ప్రయత్నం కావించేదాని అద్భుత చిత్రం ఆట బొమ్మల్లో వుంటుంది. ప్రతి పిల్లవాడూ ప్రతిపిల్లా తమకి చాలా ప్రియమైందాన్ని, తమ స్వంతమైనదేదో దాన్ని కోరుకుంటారు. పిల్లవాళ్లకీ, వాళ్ల ప్రియమైన బొమ్మలకీ మధ్యన ఏర్పడిన సంబంధాలని నేను జాగ్రత్తగా గమనించాను. పిల్లలు చాలాకాలంగా తమ బొమ్మలతో స్నేహం కలుపుకున్నారని నాకు సంతోషం కలిగింది. కోస్త్య బొమ్మలో పెద్ద చెప్పుకోదగ్గది యేం లేదు - ఒక గడతోటి చేపలు పట్టే ముసలివాడు. ఆ బొమ్మ కాలు కొన్నిసార్లు విరిగిపోయింది. ఆఖరికి కోస్త్య దానికి చిన్న కొయ్య కాలు తయారుచేశాడు, అలాగే ముళ్ల చేతికర్ర. దాంతోటి ముసలాడు నదిమీదకి వెళ్లేవాడు. ఆ చిన్న కుర్రాడు తన పాత మిత్రుడితోటి మాట్లడ్డం అంటే యిష్టపడేవాడు: అతనితో చెప్పేవాడు యెక్కడ పొలసలూ, బేడిసలూ దొరుకుతాయో..... లరీసా కిష్టమైన బొమ్మలు మామ్మా, మనవరాలూనూ. ఆ చిన్న అమ్మాయి మామ్మకి కళ్లజోడు తయారుచేసింది, ఆ మామ్మ కాళ్లకింద వెచ్చటి కంబళీ పెట్టింది, భుజంమీద శాలువా కప్పింది. వాల్యాకి కూడా రెండు బొమ్మలున్నాయి - పిల్లికూన, చుంచు. ఆ పిల్ల

ప్రతి వారమూ పిల్లికూన మెడమీద కుచ్చులు మార్చేసేది, మరెందుకనో చుంచుకి ఆకుపచ్చ కంబళీ తెచ్చింది....

"అద్భుత కథా మందిరం"లో పిల్లల కల్పనలు తరగనివి. పిల్లవాడు ఒక కొత్త వస్తువుని చూసి వెంటనే దాన్ని తన బుర్రలో మిగతా వాటితో కలిపేసేవాడు. మరో కొత్త కల్పన తయారయేది. పిల్లవాడి కల్పనాశక్తి విహరించేది. అతని ఆలోచనలు యెగిరేవి, అతని కళ్లు మెరిసేవి, అతని మాట మెల్లిగా పారే సెలయేరులా జారేది. దీన్ని దృష్టిలో వుంచుకుని నేను గదిలోని భిన్న మూలలు వాస్తవమైనా, అభూత కల్పనాత్మకమైనా సంబంధాలు గల విభిన్నమైన వస్తువుతో నిండి వుండేటట్టూ చూశాను. పిల్లలు అద్భుతమైనవి కల్పించాలనీ, సృష్టించాలనీ, కొత్త కథలు తయారు చెయ్యాలనీ ఆతృతగా వున్నాను నేను. ఒంటి కాలిమీద నుంచున్న కొంగ పక్కనే వుంది పిరికి పిల్లిపిల్ల. దాన్నుంచి పిల్లల వూహ కొన్ని ఆసక్తికరమైన కథలు సృష్టించింది. దాంట్లో నాయక పాత్రలు కొంగా, పిల్లిపిల్లానూ. మరి ఒక చిన్న పడవా, తెడ్డూ, పక్కనే కప్పా వున్నాయి. అవన్నీ కూడా ఒక కథలో యిమిడి పోవాలనే. ఒక ఎలుగ్గొడ్డు పిల్ల బయటికి తొంగిచూస్తూ వుండే గుహ, బ్రహ్మాండమైన యీగలతోటీ, దోమలతోటీ (అద్భుత కథలో దీనికి అభ్యంతరంలేదు), ఒక చిన్న పంది పిల్ల, పక్కనే సబ్బూ, నీళ్లు తొట్టీ – యిదంతా కూడా వూరికే పిల్లల్ని నవ్వించదు, వాళ్ల వూహని రేకెత్తిస్తుంది.

ఆలోచనాభివృద్ధిలో చిక్కులు యెదురవుతాయి. పిల్లవాణ్ణి గనక చుట్టూతా వున్న ప్రపంచంలోని కొన్ని వస్తువులతో ముడిపడ్డ కథని ఆలోచింపగలిగేటట్టు నేనుచేస్తే అప్పుడు నేను ఖాయంగా చెప్పగలను పిల్లవాడు ఆలోచించడం నేర్చుకున్నాడని. యెంత కష్టంతో వాల్యా ఆలోచనలు జాగృతం అయిందీ, ఆమె ధారణ బలపడిందీ యిదివరకే చెప్పాను: ఆమె ఆలోచనలని జాగృతం చేసిన ఒక సాధనం వూహించని లింకులపట్ల ఆశ్చర్యానుభూతి కలగడం. చుట్టూతా వుండే ప్రపంచంలోని వస్తువుల మధ్యా, ప్రకృతి విషయాల మధ్యా విశదమయ్యేవి ఆ లింకులు. అంతే ముఖ్యమైన మరోసాధనం కథలు. చాలాకాలం వాల్యా యే కథలూ కల్పించలేకపోయేది. అది నన్ను కలవర పెట్టింది. మూడో తరగతిలో వున్నప్పుడే ఆఖరికి తను కప్ప, పడవ, చేప కథ కల్పించగలిగింది. యిదీ ఆ పిల్ల కల్పించింది: "ఒక కప్ప నది ఒడ్డున ఒక పడవని చూసింది. చేపలుపట్టే తాత పడవని వదిలేసి వూళ్లోకి భోజనానికి పోయాడు. కప్ప పడవలో వెడదామనుకుంది. నీటి కుంటలోనుంచి అది బయటికి వచ్చి పడవలోకి గెంతింది. తెడ్డు అందుకుంది, అప్పుడు ఒక చేప దాని దగ్గరకు యీదుకుంటూ వచ్చి అంది: 'యేమిటి నీ ఉద్దేశం? నువ్వూరికే కుంటల్లో యీత్తావూ, కాని పడవకి లోతు నీళ్లు కావాలి.' కప్ప చేప సలహా పాటించలేదు. తన చిన్న కుంటకేసి ప్రయాణమైంది. కప్ప యీదింది, పడవ అంది: 'కప్పా, కప్పా, నన్ను యెక్కడికి లాక్కు పోతున్నావు?' కప్ప జవాబు చెప్పింది: 'నా చిన్నికుంట దగ్గరికి. మా బంధువులందరూ నేనెలా పడవ

నడుపుతున్నానో చూడ్డానికి.' పడవ చిరునవ్వు నవ్వి అనుకొంది: 'తాత వెనక్కి వచ్చాక యెలా నడపాలో నీకు నేర్పుతాడులే' అని. కప్ప పడవని కుంటదగ్గరికి తీసికెళ్లలేక పోయింది. అది బురదలో కూరుకుపోయి, కదల్లేదు. అప్పుడు మిగతా కప్పలన్నీ కుంటలోనుంచి వచ్చి దానికేసి చూశాయి. మొత్తం కుంటకి వినబడేటట్టు ఆ కప్ప అరిచింది: 'చూడండి, నేనెలా పడవని నడుపుతానో!' కప్ప తత్తరపడిపోయింది. కుంటలోకి దూకింది. బురద అంతటా ముద్దలుగా చిమ్మింది. మొత్తం కప్పల గుంపంతా పకపకా నవ్వడం మొదలెట్టాయి. అప్పుడు చేపలుపట్టే తాత వచ్చాడు. కుంటలోనుంచి పడవని లాగాడు. కప్ప బెదిరిపోయింది. నాచు కప్పిన బురదలో దాంకుంది. సాయంత్రానికి ధైర్యం చిక్కి గెంతుకుంటూ యివతలికి యీదింది - అవి యెలా నవ్వాయి! అది మొదలు ప్రతిరోజూ అవి రాత్రి నవ్వుతాయి, సాయంత్రంనుంచి ఉదయం దాకా అవి బెకబెక మనడం వినిపిస్తూనే వుంటుంది. అవి బడాయికోరు కప్పని చూసి నవ్వుతున్నాయి."

కథలు అల్లడం పిల్లలకి యెంతో ఆసక్తిదాయకమైన కవితాత్మక సృజన. దీనితోబాటుగా మానసికాభివృద్ధికి అది ముఖ్యమైన సాధనం. పిల్లలు సృష్టించాలని మీరు అనుకుంటే, కళాత్మక చిత్రాలు కల్పించాలనుకుంటే, మీరు మీ సృజనాత్మక జ్వాలనుంచి ఒక చిన్న నెరుసు నేనా గాని పిల్లవాడి మనసుకి బదిలీచెయ్యాలి. మీరు మీ అంతట సృష్టించ లేకపోయినట్లైతే, లేదా పిల్లల ఆసక్తుల ప్రపంచంపట్ల అనుగ్రహ పూర్వకంగా వుంటే, అదేదో నిస్సారమైన కాలక్షేపంగా కనిపిస్తే మీరు యేమీ సాధించలేరు.

"అద్భుత కథా మందిరం"లో తీనాకి యిష్టమైన బొమ్మవుంది - లోహపు పనివాడి బొమ్మ, అతని ముఖం లోహం కరిగించే కాంతిలో మెరుస్తోంది. ఫౌండ్రీలో లోహపు పనివాణ్ణి కలుసుకోవడం ఆ పిల్లకి గుర్తుకొచ్చింది, యిప్పుడు మూడేళ్ల తర్వాత "అగ్నిమయమైన నది"ని గురించి ఒక ఆసక్తికరమైన కథ అల్లింది:

"ఒక భీముడు పెద్ద పొయ్యి దగ్గర నుంచున్నాడు. అతను ఇనుము కరిగిస్తున్నాడు. ఆ యినుము బుడగలు చిమ్ముతోంది, మరుగుతోంది. ఆ భీముడు పొయ్యి దగ్గరి తలుపు తెరిచాడు - అగ్నిమయమైన నది యివతలికి ప్రవహించింది. అది ప్రవహిస్తూ అంది: 'అగ్నిమయమైన ఇనుము, త్వరపడండి మీకేం కావాలో దాన్ని దీనితో తయారు చేసుకోండి.' తెలివైన నిపుణులు అగ్నిమయమైన నది దగ్గరకి వచ్చి కరిగిన ఇనుముని పెద్ద గరిటెతో తోడేసి, దాన్ని ఇసకలో దిమ్మరించారు. దాన్నుంచి ప్రజలకవసరమైన అన్నీ తయారుచేశారు."

పిల్లల మనసుల్లో సమకాలీన భీముల చిత్రాలు - సోవియట్ మాతృభూమి పరిరక్షకుల మూర్తులు - ప్రత్యక్షమవుతాయి. 1941-1945 నాటి నాజీలతోటి యుద్ధమూ, సోవియట్ ప్రజల సాహసోపేత విజయమూ మన ప్రజల మనసులమీదా, మొత్తం ఆధ్యాత్మిక జీవితంమీదా చెరగని ముద్ర వేశాయి. మాతృదేశాన్ని పరిరక్షించే వీరులు పిల్లల వూహల్లోని అద్భుత కథా వీరులయ్యారు.

పిల్లలు వాళ్లని గురించి తేట అయిన, ఆవేశపూరితమైన కథలు అల్లారు. మన ప్రజల్లోని యోధుల గురించి పిల్లలు అల్లిన కథల్లోని ముఖ్యమైన భావం యేమిటంటే సోవియట్ పౌరుని సాహసం, అజేయత, ఔన్నత్యం. దంకో చెప్పిన కథ యిది:

"ఒక తల్లి కొడుకుని యుద్ధానికి పంపిస్తోంది. ఆమె అంది, 'నీతోటి నీ జన్మస్థలపు మట్టిని ఓ గుప్పెడు తీసుకెళ్లు. గుర్తుంచుకో నువ్వు దాని రక్షకుడివి.' ఆ కొడుకు ఓ గుప్పెడు మట్టిని తీసికెళ్లాడు. దాన్ని ఎర్ర సిల్కుసంచీలో పోశాడు. దాన్ని బహు జాగ్రత్తగా కాపాడుతూ వుండేవాడు. శత్రువులు మన దేశంమీద యుద్ధం ప్రారంభించారు. సరిహద్దు దగ్గర ఆ కొడుకు శత్రువులతో తలపడ్డాడు. మెషీన్ గన్‌తో వాళ్లని కాల్చాడు. వాళ్లు నదిలో పడిపోయారు. కొడుకు ఒక్క అడుగు కూడా వెనక్కి తగ్గలేదు. శత్రువు తుపాకీ గుండు అతని తలలో తగిలింది, అతని కళ్లమీదనుంచి రక్తం కారింది. అతని చేతులు బలహీనపడిపోయాయి. శత్రువులు దగ్గరగా వచ్చి అనుకున్నారు: యితన్ని బందీగా తీసికెళ్లవచ్చు మేము. ఆ కొడుక్కి తన జన్మస్థలపు మట్టి ముద్ద గుర్తుకొచ్చింది. అతను తన ఎర్ర సంచీని తడిమాడు. తక్షణం బ్రహ్మాండమైన శక్తి అతని చేతుల్లోకి ప్రవహించింది. ఆ యువ యోధుడు మళ్లీ కాల్చడం ప్రారంభించాడు, శత్రువులు నదిలో మునిగిపోయారు. ఆ క్షణంలో సహాయం వచ్చింది - వేగవంతమైన రెక్కలుగల విమానాలూ, బ్రహ్మాండమైన టాంకులు."

సాయంసంధ్యలో పిల్లలు చెప్పిన కథల్ని నేను రాశాను. పిల్లలలో నేను వెలిగించిన ఆలోచన స్పష్టమైన జ్వాలల్లాగా నాకీ కథలు ప్రియం అయినవి. సృజనాత్మకత లేకుండా, కథలు అల్లకుండా చాలామంది పిల్లల ఆలోచన గందరగోళంగానూ, కలగాపులగంగానూ వుంటుంది. వాళ్ల ఆలోచన పరమ గందరగోళంగా వుంటుంది. సౌందర్య అనుభూతులకీ, పిల్లల పసందైన భాషకీ మధ్యన సంబంధం వున్నదని నాకు నమ్మకం కలిగింది. సౌందర్యానుభూతి మాటలకి రసాత్మక వర్ణాన్ని యిస్తుంది. పిల్లలు యెంత అసాధారణ పరిస్థితిలో వుంటే, కథ యెంత ఆసక్తికరంగా వుంటే అంత దృఢంగా వాళ్ల వూహ వుంటుంది, అంత అనూహ్యంగా వాళ్లు సృష్టించే చిత్రాలు వుంటాయి. సాయంసంధ్యలో మా పిల్లలు డజన్ల కొద్దీ కథలల్లారు. వాటిని మేము "సాయంసంధ్య కథలు" అన్న లిఖిత పుస్తకంలో రాసి వుంచాం.

"సాయంసంధ్య కథల్లో" జంతువుల్ని గురించీ, పక్షుల గురించీ, చెట్ల గురించీ, పువ్వుల గురించీ ఆసక్తికరమైన కథలున్నాయి. పువ్వుల గురించిన కథలల్లడం ముఖ్యంగా నాకూ పిల్లలకీ ఉభయులకీ సంతోషం కలిగించింది. నేను పిల్లలకి మానవ రసాత్మక జీవితాన్ని గురించీ, పాటల్లో అనుభూతుల అవతారం గురించీ, పువ్వులకి సంబంధించిన కథల గురించీ చెప్పాను. నేను పిల్లలకి కథ ఆరంభం చెప్పేను. పిల్లల కల్పనాసక్తి ఆసక్తికరమైన చిత్రాలని సృష్టించింది.

కొత్త కథని చెప్పడం పిల్లల జీవితాల్లో పెద్ద సంఘటన. హాన్స్ క్రిస్టియన్ ఆండర్‌సన్ "హిమ రాణి"కి మేం రంగం సిద్ధం చేసిన ఉత్సాహం నేను యెన్నటికీ మర్చిపోలేను. అది ఐది రెండవ సంవత్సరం. తొలి శీత సంధ్య. పిల్లలు "అద్భుత కథా మందిరానికి" వచ్చారు. కథ జరిగే స్థలం వాలుగా వుండే కప్పులు వున్న చిన్న యిళ్లు, పర్వతాల మధ్య అద్భుతమైన కోట, చురుగ్గా పరిగెత్తే లేడి, మంచు కుప్పలు. పిల్లలు దీన్నంతా తామే చేశారు. కాని అందరూ ఆ కథని వినలేదు. ఆ చిన్ని యిళ్ల కిటికీల్లో దీపాలు వెలుగుతూ వున్నాయి, ఆకాశంనుంచి మంచు తునకలు రాలుతున్నాయి. సాయంత్రపు అసుర చీకటి కమ్మేసింది. నేను చెప్పేది వింటూ పిల్లలు వూపిరి బిగపట్టి కూర్చున్నారు... కథ అయిపోయింది. కాని పిల్లలు నన్ను మళ్లీ ఆ కథ చెప్పమన్నారు. మాటలలోని సమ్మోహక శక్తి అంటే నాకు చాలా యిష్టం: పిల్లలు అడిగినన్నిసార్లూ నేను కథని మళ్లీ చెప్పాను. వాళ్లు "హిమ రాణి" కథని మళ్లీ మళ్లీ చెప్పమని నన్ను అడిగారు. వాళ్లా మాటలు గుర్తుంచుకోవాలని కాదు, ఆ మాటలు వాళ్ల వీనులకి సంగీతంలా వున్నాయి కనక.

వాళ్ల స్వభాషలోని మాటలు వాళ్ల ఆధ్యాత్మిక జీవితంలోకి ప్రవేశించి, శిల్పి పదునైన ఉలిలాగా, చిత్రకారుడి శోభాయమానమైన రంగుల పలకలాగా తయారై సత్యాన్ని అర్థం చేసుకోడానికి కచ్చితమైన సాధనం అవాలి. యిలా అయేటట్టు చెయ్యడమూ వాళ్ల భాషలోని ఆ పదాల లోతైన పరిజ్ఞానం వాళ్లకి యివ్వడమూ యెలాగా అని ఉపాధ్యాయుడు అస్తమానూ ఆలోచిస్తూనే వుంటాడు. భాష ఆలోచనకి భౌతిక వ్యక్తీకరణ. ఆలోచనతోబాటుగా, దాని రసాత్మక వర్ణాన్ని – మాతృభాషలో సజీవ స్పందనని గ్రహించినప్పుడే పిల్లవాడు దాన్ని తెలుసుకుంటాడు. మాటల అందపు అనుభూతిని అందుకోలేకపోతే వాటి అర్థాల పార్శ్వాలని పిల్లవాడు అర్థం చేసుకోలేడు. కల్పన లేకుండా, అద్భుత కథల సృజనాత్మకతలో వ్యక్తిగత భాగస్వామ్యం లేకుండా ఆనందపు అనుభూతి అనూహ్యం. కథలు, పిల్లవాడి ఆధ్యాత్మిక జీవిత సర్వరంగాల్నీ – మనసుని, అనుభూతుల్ని, వూహని, యిచ్ఛని – ప్రేరేపించే చురుకైన సౌందర్య సృజన. అది కథలు చెప్పడంతోటి అప్పుడే ఆరంభమైంది, కాని యింకా హెచ్చు దశ కథని నటించడం.

ఒక బొమ్మలశాల, నాటక క్లబ్బు "అద్భుత కథా మందిరం"లో పుట్టాయి: పిల్లలు అక్కడ రష్యన్, ఉక్రేనియన్, జపనీస్ జానపద గాథలు ప్రదర్శించారు.

"అద్భుత కథా మందిరం"లో పిల్లలకి నేను మొదటగా "రాబిన్‌సన్ క్రూసో", "బారన్ మున్‌హౌసెన్ సాహస కృత్యాలు," "గల్లివర్స్ ట్రావెల్స్," "జార్ సుల్తాన్ కథ," "సంగీతకారుడు యాంకో" కథలు చదివి వినిపించాను. మంచు తుఫాను అవతల కిటికీని తాడిస్తూ వుంటే, వాళ్లు రాబిన్ సన్ క్రూసోతోటి నిర్జనమైన దీవిలో ఓడ పగిలిపోయాక ప్రవేశించి అతను ప్రకృతితో జరిపిన కఠోర పోరాటాన్ని అతనితో పంచుకున్న ఆ శీతాకాలపు సాయంత్రాలని పిల్లలు యెన్నడూ మర్చిపోరు. "అద్భుత

కథా మందిరం"లో మేము హాన్స్ క్రిస్టియన్ ఆండర్‌సన్, లియో టాల్‌స్టాయ్, ఉషీన్‌స్కీ గ్రిమ్ సోదరులు , సోవియట్ బాల సాహిత్య రచయితలు చుకోవ్‌స్కీ, మర్షాక్ కథలూ చదివాం. పుస్తకాలల్లో మంచికీ చెడుకీ, సత్యానికీ అసత్యానికీ, గౌరవానికీ అగౌరవానికీ సంబంధించి వున్న నైతిక భావాలు వ్యక్తిలో యిమిడిపోతాయి, ఆ పుస్తకాలని చిన్నతనంలోనే చదివితే, అద్భుత కథలు ఉద్దేశించబడిందే బాల్యం కోసం.

మేం చదివిన దాంట్లో మా ప్రత్యేకత వుండింది: పైన నేను పేర్కొన్న అద్భుత కథలన్నీ నాకు కంఠతా వచ్చు. పిల్లలకి బొమ్మల్ని చూపించడానికి మాత్రమే నేను పుస్తకం తీసేవాణ్ణి. ఆరకంగా కథలు చెప్పడమనేది యింగిత జ్ఞానాన్నీ, దయాపూరిత మానవ అనుభూతులని బోధించడానికి బ్రహ్మాండమైన సాధనం అయింది.

బాల్యంలో చదవడం అనేది మొట్టమొదటగా హృదయానికి నేర్పడం, పిల్లవాడి హృదయాంతరాళంలో మానవ ఔన్నత్యాన్ని స్పందింపచెయ్యడం అని యే అతిశయోక్తి లేకుండా చెప్పవచ్చు. ఉన్నత భావాలని వెల్లడి చేసే మాట పిల్లవాడి హృదయంలో మానవత్వపు బీజంగా యెప్పటికీ నిలిచి పోతుంది.

## అద్భుత కథల కొనసాగింపు - మా "మాయా ద్వీపం"

పిల్లలు అసాధారణమైందానికీ, అద్భుతమైన యాత్రలకీ, సాహసకృత్యాలకీ, ప్రకృతిలోని ఆదిమ శక్తులమీద పోరాటాలకీ ఆకర్షితు లవుతారు. నేను పిల్లలకి మొదట రాబిన్‌సన్ క్రూసో సాహస కృత్యాలు చెప్పినప్పుడు వాళ్లు ప్రయాణీకుల్లా నటించాలనీ, సముద్ర తరంగఘోషలనీ, జలపాతాల ఫెళఫెళార్భటులనీ వినాలనీ వాంఛించారు. వాళ్లు ఒక "మాయా ద్వీపం" తయారు చెయ్యాలనుకున్నారు - ఆటల ప్రపంచంలో వాళ్లు బతకగలిగే రహస్య స్థావరం. మేం ఆ ద్వీపాన్ని నల్ల తుమ్మ, కసింద చెట్ల గుబురులో తయారు చేశాం. రాబిన్‌సన్ క్రూసో నివాసాన్ని అతనికి వుండేలాంటి పొయ్యితోటే, కంచె గుంజలతో అడివి జంతువులనుంచి రక్షణగా వుండేటట్టు కట్టాం. మేం ఒక చిన్న కిటికీ తయారు చేశాం, దానిగుండా అవధి లేని "సముద్రాన్ని" మేం చూడగలం. మేం ఒక చిన్న మడిని తవ్వి డజన్ల కొద్దీ గోధుమ, బార్లీ విత్తనాలు చల్లాం. కోల్య ఒక మేక పిల్లని కూడా యింటి దగ్గర్నుంచి తెచ్చి ఉంచాడు. యెందుకంటే రాబిన్‌సన్ క్రూసోకి చిన్న మేకపిల్ల వుండేది. మేం పాత పీపా, తాళ్లు, యిటుకలూ తెచ్చాం. పీపా యినపకట్లతోటి చాకులు తయారు చేశాం. చేపల వలలు అల్లాం. ఆదిమ వేటగాళ్లల్లాగా రెండు యెండు పుల్లల్ని రాపిడి చేసి నిప్పు చేశాం, యెందుకంటే క్రూసోకి నిప్పు రాజెయ్యడానికి అంతకంటే దారి వుండి వుండేదికాదు.

మేం యీ కొంప కట్టడానికి మట్టి తవ్విన పల్లం వానలప్పుడు నీళ్లతో నిండిపోయి చిన్నగుంట యేర్పడింది. పిల్లలు ఆ నీళ్లలో ఈత కొట్టేవాళ్లు, వాళ్ల వూహల్లో అంతులేని మహాసముద్రంలో ఉండేవాళ్లు. మరి మహాసముద్రం అంటూ వుంటే ఓడలు వుండాలి; పిల్లలు ఒక వూసీ విల్లో ముక్కని చూసి దాంతోటి పడవ తయారుచెయ్య నారంభించారు. అది కష్టమైన పని, కాని అందులో నెగ్గుకొచ్చారు. ఆ పడవకి ఒక తెరచాప తగిలించారు, దాన్ని సముద్రంమీదకి వదిలారు.

ఒక చిన్న గుట్టవెనక్కాల, ఆ గుట్ట పిల్లల వూహల్లో మహా పర్వత మన్నమాట, మేం లిల్లీపుటియా దేశాన్ని సృష్టించాం. పేముతోటీ, చెక్కతోటీ దాని రాజధానిని తయారు చేశాం. మట్టితోటి గుర్రం బొమ్మలూ, ఆవు బొమ్మలూ, గొర్రె బొమ్మలూ తయారుచేశాం. పురాణ వీరుడు ఇల్యా మూరొమెత్స్, అతని శత్రువు గజదొంగ సొలొవేయ్ బొమ్మలు తయారుచేశాం. ఆ బొమ్మల్ని పొదల్లో వుంచాం. అది ప్రాచీన రష్యాలో వుండే కారడవి. ప్రశాంత వేసవి సాయంత్రాల్లో అక్కడికి వెళ్లేవాళ్లం, యిక్కడ సాహసవంతులైన, ధైర్యవంతులైన యోధుల్ని గురించి ప్రతివాళ్లూ కథలు చెప్పాలనుకున్నారు.

దుర్భేద్యమైన పొదలలోపల కనుమ యేటవాలులో ఒక చిన్న గొయ్యి చూశాం – యిది మృత్యువు లేని దుష్ట మహాకాళం వుండే గుహ. అక్కడ యెక్కణ్ణో రహస్యపాతాళంలో సుందరి రాకుమారి దీనంగా విలపిస్తోంది.

వెచ్చగా వున్నప్పుడు, దూరంగా పోలేనప్పుడల్లా మేము మా సెలవు రోజుల్ని "మాయా ద్వీపం" మీద గడిపేవాళ్లం. రాబిన్సన్ క్రూసో మకాం దగ్గర ఒక గుడిసె కట్టాం. మమ్మల్ని వూహల రెక్కలమీద అద్భుత కథా ప్రపంచంలోకి యెగురుతూ తీసుకుపోయేందుకు అనువైన చోటు యిది. మా అద్భుతకథల వీరులు మా పక్కనే వున్నారు. ముఖ్యంగా యిక్కడ పిల్లల కల్పనా జ్వాల మండేది. యీ వాతావరణంలో యూర, గాల్యా, నీనా, వీత్యలు అద్భుతమైన కథలు సృష్టించారు. ఆలోచనలు సునాయాసంగా, నిరాటంకంగా జారేవి. పిల్లలు వాళ్ల అనుభూతులని తేట అయిన మాటల్లో వ్యక్తీకరించగలిగేవాళ్లు. సెర్యోజ కల్పించిన బంగారు హరివిల్లు కథ యిదీ:

"ఒక రోజు సాయంత్రం మహా కాయులైన కమ్మరివాళ్లు సూర్యుని దగ్గరకు వెళ్ళి అన్నారు: 'సూర్యుడుగారూ, మా యినప సమ్మెట్లు విరిగిపోయాయి. వెండి పోగులు తయారుచెయ్యడానికి యింకేమీ వుండవు. దాయలు కూడా పాతవి. యింకొంచెం యినుము కోసం మమ్మల్ని భూమిమీదకి పంపించండి.' సూర్యుడు కమ్మరివాళ్లని వాళ్లదారిన పంపించాడు. కమ్మరివాళ్లు ప్రజల దగ్గరకు వెళ్లారు కాని, వాళ్ల దారి కారు మబ్బులవల్ల అడ్డుపడి పోయింది. కమ్మరివాళ్లు మేఘాల గుండా భూమి కేసి చూశారు – వాళ్లు చాలాచాలా యెత్తులో వున్నారు, ఎక్కడ దిగాల్సిందీ అనుకోలేదు యింకా. వాళ్లు మళ్లీ సూర్యుడి దగ్గరకెళ్లి అన్నారు: 'సూర్యుడుగారూ, మేం భూమిమీదకి యెలా దిగం? మాకో వంతెన కట్టించిపెట్టండి.' సూర్యుడు కారు మబ్బుల గుండా తన కిరణాలని పంపించాడు, సూర్య కాంతిగల వంతెన ఆకాశంలో

మెరుస్తోంది. భూమి మీద ప్రజలు బంగారు హరివిల్లుని చూశారు. కమ్మరవాళ్లు భూమిమీదకు వెళ్లి ప్రజలనుంచి యినుము తీసుకున్నారు. సూర్యకాంతి వంతెన మీదుగా మళ్లీ సూర్యుని దగ్గరకు తిరిగివచ్చారు. సూర్యుడు వాళ్ల తెల్లటి గడ్డాల్ని చూడగానే తన కిరణాలని వెనక్కి తీసేసుకున్నాడు, హరివిల్లు మాయమైపోయింది. తడవ తడవకీ ఆకాశంలో కారు మబ్బులు కనిపించగానే సూర్యుడు తన కమ్మరివాళ్లని యినుము కోసం భూమిమీదకి పంపిస్తాడు. కాని, శీతాకాలంలో హరివిల్లులు వుండవు యెందుకంటే పగటి పొద్దు చాలా తక్కువగా వుంటుంది, కమ్మరివాళ్లు తమ సమ్మెట్లని యెక్కువ వాడరు."

ప్రతి పిల్లవాడూ అక్కడ ఒక కథ కల్పించినందుకు నాకు చాలా సంతోషం కలిగింది. ఆ ప్రశాంత వేసవి సాయంత్రాలని నేను యెప్పుడూ మర్చిపోలేదు. సూర్యుడు అస్తమించాక ఆకాశం బూడిద రంగుగా తయారయ్యేది. నడి వేసవి కాలం వుండే రోజులు సంవత్సరంలో కొన్ని వున్నాయి. ఆకాశం నీరసంగా ప్రకాశిస్తున్నట్టుంది. సాయంసంధ్యలు మామూలుగా వుండవు, నక్షత్రాలు యెంతోసేపటికి గాని రావు... పిల్లలు ప్రకృతి అందాన్ని అభినందిస్తూ నిశ్శబ్దంగా వుండి పోయారు. యీ క్షణాల్లో కల్పనా జ్వాల ముఖ్యంగా తేజోవంతంగా వెలుగుతుంది. నీనా కల్పించిన కథని మేం విన్నాం:

"సూర్యుడు నిద్రపోవడానికని తన మాయా వనంలోకి వెళ్లాడు. ఆయన పడుకున్నాడు గాని, కళ్లు మూయడం మర్చిపోయాడు. కమ్మరివాళ్లు యింకా పగలే నని అనుకున్నారు. వాళ్లు వెండి పోగుల్ని చేసీ చేసీ చేస్తూనే వున్నారు. ఆ పోగులు ఒలికి పోయి ధూళిగా మారిపోయాయి. వెండి ధూళి ఆకాశంమీద పరుచుకుంది. అది మండుతూ ప్రకాశిస్తోంది..."

యీ అద్భుత కథ వింటూ వుంటే నా హృదయం ఉద్రేకంతో నిండిపోయింది. పిల్లల చైతన్యంలో సమ్మోహకం చేసే ప్రకృతీ, విపరీతకల్పనా కథలూ ఆలోచనా ధారల్ని వెల్లడిచేస్తూ వుంటే నేను సంబరపడకుండా యెలా వుండగలను? అది అలా యెందుకు జరుగుతుందో నాకు తెలీదు కాని, పొద్దు యెక్కువ వుండే జూలై సాయంత్రాలలో, బూడిదరంగు ఆకాశం ఒక వింత ముసుగుతోటి కప్పుకున్నప్పుడు – ఆ సమయంలో పిల్లల వూహలు రెక్కలు విప్పుకుని విహరిస్తాయి.

మూడవ తరగతి పూర్తి చేశాక పిల్లలు "మాయా ద్వీపం" మీద గెరిల్లాదళ కేంద్ర స్థావరం పెట్టాలనుకున్నారు. గెరిల్లాలు చేసినట్టుగా ఆ కేంద్రాన్ని ఒక నేలమాళిగలో స్థాపించారు. దానిని తవ్వడానికీ, సమకూర్చుడానికీ పెద్ద పిల్లలు సాయంచేశారు. కొన్ని నెలలు సాగిన ఆసక్తిదాయకమైన ఆట మొదలైంది. పిల్లలు రాత్రిళ్లు ఆడుకుందామనేవాళ్లు. వాళ్లని ఆపడం కష్టమయ్యేది. వాళ్లు సైనిక వేగుల్లాగా ఆచూకీ తీస్తూ వుండేవాళ్లు. వాళ్లు దిక్సూచి వాడడం నేర్చుకున్నారు. వాళ్లు కొయ్య మెషీన్ గన్‌లు తయారుచేశారు. సైనిక చర్యలలో పోయే ముందుగా వాళ్లు ఆజ్ఞలు జారీ చేసేవాళ్లు.

నాల్గవ తరగతిలో వాళ్లు రష్యన్ రచయితా, కథకుడూ పి. బజోవ్ పుస్తకం "ఆకుపచ్చరాతి పెట్టె"తోటి ముగ్ధులై పోయారు. ఉరల్స్‌కి చెందిన అమూల్యమైన నవరత్నాల గురించీ, దయాన్విత రాగి పర్వత యజమానురాలి లెక్కలేనంత సంపద దాచిన గుహల అద్భుత సౌందర్యం గురించీ, అతి సుందరమైన ఆకుపచ్చరాళ్ల గురించీ చదివి వినిపించినప్పుడు పిల్లల కళ్లు సంతోషంతో మెరిశాయి. ఆ రోజుల్లో పిల్లలు మంచి, రహస్యమైన, సాహసోపేతమైనదేదో చేద్దామనుకునేవాళ్లు. భూగర్భ మరకత రాజ్యాన్ని నిర్మించాలనే అభిప్రాయం యెవళ్లకో తట్టింది. మేం ఆకుపచ్చటి, ముదురు నీలపు, ఆకాశ నీలపూ, నారింజపండు రంగూ, ఎరుపూ, వూదారంగూ గాజు ముక్కల్ని పోగుచేసి మా గుహ గోడల్లో పెట్టాం. ఒక చిన్న విద్యుద్దీపం గుహలో వెలిగించినప్పుడు, యింద్ర ధనస్సు రంగులు చిమ్మాయి. అప్పుడు పిల్లలకి కలిగిన ఆశ్చర్యమూ, ఆనందంపట్లా ప్రేరణా మాటల్లో చెప్పలేం. మళ్లీ కొత్త కథలు పుట్టాయి, బౌద్ధిక సామర్థ్యాన్ని పెంచడంలో సౌందర్యం ఎంత మహత్తర శక్తివంతమైనదో నాకు యిది మళ్లీ రుజువుచేసింది. వాల్యా, పేత్రిక్, నీనాల ఆలోచన వేగంగా పెరగడాన్ని నేను గమనించాను: వ్యక్తీకరణ పుష్టివున్న కథలు కల్పించి నన్ను వాళ్లు ఆశ్చర్యచకితుణ్ణి చేశారు. యిక్కడ ల్యూదా ఓ కథ కల్పించింది. ఆ పిల్ల నిశ్శబ్దంగా వుండటానికి కారణం మందమైన మానసికాభివృద్ధి కాదనీ కలకనడమూ, చింతాగ్రస్తంగా వుండడమూ నని నాకు నమ్మకం కలిగింది.

## పాటలు పిల్లవాడికి ప్రపంచపు అందాన్ని వెల్లడిస్తాయి

"సంతోష చంద్రశాల"లో మాదిరిగానే ప్రాథమిక తరగతుల్లో కూడా మేం ప్రకృతి సంగీతం విన్నాం. మాటలని రసప్లావితంచేసే ముఖ్యమైన ఆధారమూ, స్వర మాధుర్యాన్ని ఆస్వాదించడానికీ, అవగాహన చేసుకోడానికి మూలమూనూ అది. ప్రకృతి సంగీతాన్ని వింటూ పిల్లలు బృందగానానికి హృదయగతంగా సిద్ధమయ్యారు. మేం పాడబోయే పాటలోని ధ్వనులని ప్రకృతిలో పరకాయించి చూడమన్నాను.

స్కూలుకు దగ్గరలోనే ఒక అందమైన యేకాంత స్థలం వుంది. సాయంకాలపు ఆకాశం తళ తళ మెరిసె చెరువు ఉపరి తలంమీద ప్రతిబింబించింది, మైదానంమీదనుంచి పక్షుల కుహుకుహు రావాలు తేలుతూ వచ్చాయి. సాయంకాలపు చల్లదనంలో గొల్లభామల పాటలు వినవచ్చాయి. ఉక్రేనియన్ స్వరమేళన కర్త వై. స్తైపవోయ్ కృతి "నా సాయంకాలపు సూర్యాస్తమయం" అనే దాన్ని నేర్చుకునే ముందర ప్రకృతి సంగీతాన్ని యిక్కడ కొన్నిసార్లు విన్నాం. సూర్యాస్తమయపు సౌందర్యం యీ పాటలో అద్భుతంగా వర్ణించబడింది. వేసవికాలపు ప్రశాంత సాయంత్రాల్లో ఆ స్వర మాధుర్యం మోహనంగా వుంది. మేమా యేకాంత స్థలంలో

ఆ పాట నేర్చుకున్నాం. పిల్లలు యిష్టంగా పాడారు. కొన్ని వారాల తర్వాత సంగీతం వినే గదిలో దాన్ని పాడారు. ఆ పాట వాళ్లకి సూర్యాస్తమయ సౌందర్యాన్ని గుర్తుకు తెచ్చింది. వాళ్ల వదనాలు సంతోషంతో మెరిశాయి.

అడవిలో మేము యెండగా వున్న మధ్యాహ్నపు సంగీతం విన్నాం. పొదుగాటి చెట్లమీద ఆకులు గలగల మంటున్నాయి, వడ్రంగి పిట్ట చెట్టుని పొడుస్తోంది. యెక్కడనో వన్యపికం కుహూకుహూ మంటోంది. యీ సంగీతం పిల్లలని సమ్మోహకం చేసింది. దానివల్ల వాళ్లకి రష్యన్ స్వరమేళనకర్త అరేన్స్కీ కూర్చిన "కోయిల" పాట అందం అర్థమైంది.

పిల్లలు అభిమానంగా రష్యన్, విదేశ స్వరమేళనకర్తల పాటలు పాడారు. సామాన్యంగా మా బృందం వాయిద్యాలు లేకుండా పాడేది. ప్రతి వాళ్లూ పాడటం అంటే యిష్టపడ్డందుకు నాకు సంతోషమైంది.

పాటలు పాడడానికి కలుసుకోవాలంటే పిల్లలు యిష్టపడ్డారు. వాళ్ల మాతృదేశంపట్ల ప్రేమని జాగృతం చేస్తూ, చుట్టూతా వున్న ప్రపంచపు అందంపట్ల ప్రేమని జాగృతం చేస్తూ పాట వాళ్ల జీవితాల్లో ప్రవేశించి వాళ్ల ఆలోచనలని రసాత్మకం చేసింది.

భావుకత, రసాత్మకత అనే మానవ గుణాలు వున్నాయి. సున్నితమైన వ్యక్తిలో యీ గుణాలని చుట్టూతా వుండే ప్రపంచం నిశితం చేస్తుంది. సున్నిత, రసాత్మక హృదయం కలిగిన వ్యక్తి అవతలి వ్యక్తి దుఃఖాన్నీ బాధనీ, విచారాన్నీ మరిచిపోలేడు. అతని అంతరాత్మ సహాయం చెయ్యమని అతన్ని ఉద్బోధిస్తుంది. సంగీతమూ పాటా మనుషుల్లోని యీ లక్షణాలని బయటికి తీసుకువస్తాయి.

నైతికంగా, సౌందర్యాత్మకంగా సంస్కారుడైన వ్యక్తిగల రసాత్మకతత్వం హృదయం దయాపూరితమైన మాటలూ, సూక్తులూ, సలహాలూ, సెలవు తీసుకునేటప్పుడు చెప్పే మాటలూ అందుకోడానికి తయారవుతుంది. ఎలా జీవించాలీ అన్నది మీరు పిల్లలకి చెప్పదలచుకుంటే, మంచికోసం వాళ్లు పాటుపడాలని మీరు అనుకుంటే, వాళ్లకి సౌకుమార్యమూ, రసాత్మక భావుకత నేర్పండి. పసి హృదయాలమీద వుండే ప్రభావాలలో సంగీతం చాలా ముఖ్యమైన స్థానం ఆక్రమిస్తుంది. సంగీతమూ – నీతి అనే సమస్య గంభీరంగా అధ్యయనంచేసి పరిశోధించ తగినది.

ఉక్రేనియన్ పాటలు ప్రజల అమూల్యమైన ఆధ్యాత్మిక సంపదగా తమ మాతృభాషని పిల్లలకి వెల్లడి చేశాయి. పాటల ధర్మమా అని పిల్లలు మాటలు ధ్వనించే సౌకుమార్యాన్ని గ్రహించారు.

మొదట్లో వాద్య సంగీతపు కొద్ది రికార్డింగులే మాదగ్గర వున్నాయి. వాటిని నేను రష్యన్ రచయితలు టాల్‌స్టాయ్, చేహొవ్, గోర్కీ, కొరొలేంకొ, గైదార్, చుకోవ్‌స్కీ, పోలిష్ రచయిత సెంకేవిచ్, అమెరికా రచయిత జాక్ లండన్ కథలు,

పుష్కిన్, షెవ్‌చేంకొల కవిత్వం, హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్, గ్రిమ్ సోదరుల అద్భుత కథలు చదవడమంత ముఖ్యంగా భావించాను. సంగీతం వినకుండా విద్యని నేను వూహించలేను, బాల్యంనుంచీ ఒక వ్యక్తికి అభిమాన పాత్రమైన సంగీతం లేకుండా విద్యని నేను వూహించలేను. "సంతోష చంద్రశాల" ప్రారంభం కావడానికి ముందే మా ఉపాధ్యాయులు కొన్ని రికార్డింగులూ, టేపులూ, రికార్డులూ సంపాదించారు. మేం దీన్ని నగలపెట్టె లాగా భావించాం. యీ నగలపెట్టి మానవళి కళాత్మక సంపదని గురించిన పూర్తి అభిప్రాయాన్ని పిల్లలకి కలగచెయ్యలేదన్నది మాకు విచారం కలిగించింది. మా విద్యార్థులు మొదటి సంవత్సరం పూర్తి చేసేనాటికి మాదగ్గర యిరవైయేడు కృతులున్నాయి, ఏడు గాత్రమైనవి, యిరవై వాయిద్యమైనవీ. వారానికి రెండుసార్లు సంగీతం వినడానికని మేము సంగీత మందిరానికి వెళ్లేవాళ్లం. కొన్ని స్వరాలూ, పాటలూ పిల్లలకి పరిచయమయ్యాయి, "సంతోష చంద్రశాల"లోనే వాళ్ల జీవితపు అంతర్భాగమయ్యాయి. వాళ్లు కొన్ని కొత్త వాటిని విన్నారు.

పిల్లలతోటి నాలుగేళ్ల పని కాలంలోనూ మా రికార్డుల లైబ్రరీ దాదాపు రెండింతలైంది. మానవాళి సంగీత సంపద భాండారంనుంచి అత్యున్నతమైనవి (మొట్టమొదటగా ఉక్రేనియన్, రష్యన్ కృతులు) పిల్లవాళ్ల జీవితాల్లోకి ప్రవేశించాలని చూశాను. ఒకే కృతిని వినడం వాళ్లకి సౌందర్య తృప్తిని కలిగించి వాళ్ల బౌద్ధిక రసాత్మక జీవితాలమీద అది తన ముద్రని వేయాలని చూశాను.

పిల్లలని నెలకి ఒక కొత్త స్వరాన్నే విననివ్వండి, కాని ఆ స్వరం వాళ్ల జీవితాంతం ఆధ్యాత్మిక తృప్తికి ఆధారం అవుతుంది. వాళ్ల హృదయాల మీద యే ముద్రా పడవెయ్యకుండా వాళ్లని వూరికే సరదా చేసే కొత్త కృతులతో వాళ్లని ముంచేస్తానని నేను భయపడ్డాను.

సంగీతం వినే ముందుగా సంగీతంలో ప్రతిబింబించిన వాస్తవ ఘటనల గురించీ, అద్భుత కల్పనల గురించీ నేను పిల్లలకి చెప్పాను. యీ కథలని చెప్పడం చాలా ముఖ్యం: అవి పిల్లలు సంగీతం వినేటట్టు వాళ్లని ఉద్యుక్తుల్ని చేసేవి. ఆ రకంగా మేము "దేవత డ్రజే నృత్యం" వినడానికి ముందు నేను పిల్లలకి హాఫ్‌మన్ పాత అద్భుత కథ చెప్పాను, అది బాలేకి ఆధారంగా పనికి వచ్చింది. దయాన్వితమైన దేవతని – ఆమె లాఘవం, ఉల్లాసం, లావణ్యాలని – స్పష్టమైన భావవ్యక్తీకరమైన మాటల్లో పిల్లలకి చిత్రించడానికి ప్రయత్నించాను. నేను పిల్లలకి చెప్పాను: "చిన్న గాజు గంటలు మోగడం మీరు వింటారు. ఆ సౌందర్య దేవత పరిసరాల్ని యీ స్వరం ప్రతిబింబిస్తుంది. తేజోవంతంగా వెలిగే దీపాల ధగ ధగల్లో ఆ మాయా మందిరపు లాఘవమైన మృదువైన స్తంభాలని నేను వూహిస్తున్నాను." పిల్లలు సంగీతం విని, వాళ్లు యెలా ఆ దేవతా మందిరాన్ని వూహించుకున్నారో దాన్ని గురించి చెబుతున్నారు. వాళ్లు తమ వూహల్లో కొలనులా, వూట చెలమలా, నీడ తోపులా, నిగూఢ గుహలా చిత్రాలు గీసుకున్నారు. ఆ అద్భుత వూహలు మళ్లీ ఆ సంగీతాన్ని వినాలనిపించేటట్టు చేశాయి.

సంగీత కృతులని వ్యాఖ్యానించడం, ముఖ్యంగా పిల్లలకి తెలియని వాటిని వ్యాఖ్యానించడం, ఉపాధ్యాయుడి బ్రహ్మాండమైన మెలుకువనీ, నేర్పునీ అపేక్షిస్తుంది. సంగీత భాష అంటే అనుభూతుల భాష అనే విషయం యెన్నటికీ మర్చిపోకూడదు. తేలికైన, ఒకోఅప్పుడు సామాన్యమైన మాటలతో వుండే జానపద గీతాల మాటలు కూడా కళాత్మక కృతులుగా గ్రహించబడటం మాధుర్యం ధర్మమా అనే. సంగీత కృతిలో కళాత్మక సారాన్ని వివరించడానికి, కృతికర్త ప్రత్యేక వ్యక్తీకరణ సాధనాలని ఉపాధ్యాయుడు అర్థంచేసుకోవాలి. ఆ వివరణ స్పష్టమైన, నగిషీ అయిన కళాత్మక కథ కావాలి. ఆ కథ అనుభూతుల్ని జాగృతంచేసి, వూహల్లో స్పష్టమైన చిత్రాల్ని సృష్టించాలి.

సంగీత సౌందర్యం ఆలోచనకు బ్రహ్మాండమైన ఆధారం అని నేను భావిస్తున్నాను. సంగీత ప్రభావంలో పిల్లల కల్పనలో ఉద్భవించిన వూహలు ఆలోచనని సజీవం చేస్తాయి. పిల్లలు మాటల బొమ్మల్ని గీయ ప్రయత్నిస్తారు, వాళ్ల వూహలు సృష్టించిన వాటినీ, వాళ్లు అనుభూతి చెందినవాటినీ. మందబుద్ధిగా వుండే పిల్లల మానసికాభివృద్ధికి సంగీతం వినడం బ్రహ్మాండమైన ఆధారం. సంగీతం విన్నాక యిబ్బంది లేకుండా పిల్లలు తమ భావాలని చెప్పేటట్టు చెయ్య ప్రయత్నించాను.

మేం మా సంగీత మందిరంలో బూరాలు వాయించాం. మా కిష్టమైన స్వరాలని నేర్చుకున్నాం. మా విద్యార్థుల్లో రెండవ తరగతి వాళ్లు తొమ్మండుగురూ, మిగతా తరగతుల వాళ్లు నలుగురూ బూరాలు వాయించేవాళ్లు. పిల్లలు తమ వాయిద్యాలని తామే తయారుచేసుకున్నారు. సెర్యోజ, యూర, తీనా, లీదా బూరాలు చెయ్యడంలో సిసలైన నిపుణులే. వాళ్లు తోపులోకి వెళ్లి, సరిపోయే సరుకు యేరుకుని, కోసిన కొమ్మల్ని నీడలో పదును చేసి, వాయిద్యపు ధ్వనిని పరిశీలించి, స్వచ్ఛమైన, మాధుర్యమైన స్వరాల కోసం చూసేవాళ్లు. మూడో తరగతిలో మేము రెండు అకార్డియన్లూ, మూడు ఫిడేళ్లూ సంపాదించాం. యూర, సెర్యోజ, ఫేద్య, కోల్య, తీనా, లరీసా, సాన్య, షూరలు అకార్డియానూ, ఫిడేలూ వాయించడం నేర్చుకున్నారు. ప్రాథమిక పాఠశాల అయే నాటికి పంథొమ్మిది మంది పిల్లలకి యిళ్ల దగ్గర సంగీత వాయిద్యాలు యేర్పడ్డాయి - అకార్డియాన్లూ, ఫిడేళ్లూ. కాని పిల్లలు తమ బూరాలు మరిచిపోలేదు. కొంతమంది పిల్లలకి సంగీత ప్రతిభ వుండింది; యేమైనా నేను వాళ్ల వ్యక్తిగత ప్రతిభలని అభివృద్ధి చెయ్యడం లక్ష్యంగా పెట్టుకోలేదు. అందరు పిల్లలూ సంగీతమంటే అభిమానించి, దానికోసం ఒక అంతర్గత అవసరం కలిగించుకోవాలని రూఢి పరచదలచుకున్నాను.

బాల్యంలో నిర్లక్ష్యం చేసింది యౌవనంలో యెన్నటికీ భర్తీ కాదు, పెద్దయ్యాక సరేసరి. యీ సూత్రం పిల్లవాడి ఆంతరంగిక జీవిత రంగానికి, ముఖ్యంగా సౌందర్య బోధనకి అనువర్తిస్తుంది. అందంపట్ల భావుకత, గ్రహణశక్తి బాల్యసంవత్సరాల్లో వ్యక్తిత్వపు అభివృద్ధి తర్వాతి సంవత్సరాల్లోకంటే పోల్చలేనంత ఎక్కువ గాఢంగా

వుంటాయి. పిల్లల్లో సౌందర్యపు అవసరం కలిగించడం ప్రాథమిక ఉపాధ్యాయుని ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి. అది చాలా విధాలుగా పిల్లవాడి ఆంతరంగిక జీవితపు మొత్తం విధానాన్నీ, సమష్టితో పిల్లవాడి సంబంధాన్నీ నిర్ణయిస్తుంది. సౌందర్యం కోసం అవసరం అనేది నైతిక సౌందర్యాన్నీ, చవకబారువన్నా, వికారమైనవన్నా అసహ్యాన్ని పెంపొందిస్తుంది.

ఉక్రేనియన్ మేధావి జి. స్కొవొరొదా (1722-1794) "ఒక వ్యక్తి చేతుల్లో ఫిడేలు వుంటే అతను చెడ్డది యేదీ చెయ్యలేడు" అని అన్నాడట. చెడ్డూ, నిజమైన అందమూ పొసగనివి. ఉపాధ్యాయుని ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి, అలంకారికంగా చెప్పాలంటే, ప్రతి పిల్లవాడి చేతిలోనూ ఒక ఫిడేలు వుంచడం, అలా అయితే సంగీతం యెలా పుట్టిందో వాళ్లందరూ అనుభూతం చెందుతారు. యీనాడు సంగీతాన్ని రికార్డుచేసి విస్తృతంగా పంపిణీ చెయ్యగల సాంకేతిక సాధనం దానికి ఒక విశ్వజనీన లక్షణాన్ని యిచ్చినప్పుడు యీ విద్యా కర్తవ్యం ప్రత్యేక అర్థాన్ని సంతరించుకుంటుంది. యువతరం వూరికే అందపు వినిమయదారులు అవకుండా చూసుకోండి; యిది సౌందర్య బోధన, నైతిక సమస్య కూడా.

# పిల్లవాడి ఆంతరంగిక ప్రపంచంలో పుస్తకం పాత్ర

పుస్తకాలు పిల్లవాడి ఆంతరంగిక జీవితంలో పెద్దపాత్ర వహిస్తాయి. కాని బాగా చదవడం యెలాగా అని అతనికి తెలిసివుండాలి. "బాగా చదవడం" అంటే అర్థం యేమిటి? మొట్టమొదటగా చదవడంలోని ప్రాథమిక నైపుణ్యాలని వంటబట్టించుకోవాలి. తమకిగా తమకి చదవడం అనేది ఒక ఆంతరంగిక అవసరంగా పిల్లవాడు భావించేటట్టు చెయ్యాలని నేను ప్రయత్నించాను. ఒకటవ, రెండవ తరగతుల్లో ప్రతి వారం లేదా రెండు వారాల కొకసారి విద్యార్థులు లైబ్రరీనుంచి ఒక పుస్తకం తీసుకుని పైకి చదివేవాళ్లు. యిది లేకుండా ధారాళంగా చదివే పటువైన దృఢమైన సామర్థ్యం యేర్పాటు చేసుకోవడమూ, చదివిందాన్ని అర్థం చేసుకోవడమూ అసాధ్యం.

రెండవ తరగతిలో ప్రతి విద్యార్థీ "మాటల గాదె" అని ఒక నోటు పుస్తకం వుంచుకున్నాడు. దానిలో తమకి అర్థంకాని మాటగాని, తమకి ఆసక్తి కలిగించిన మాటగాని రాసుకునేవాళ్లు. నేను ఆ పదాలకి అర్థం చెప్పడంగాని లేదా అనుభూతి ఛాయలు వివరించడంగాని చేసేవాణ్ణి. మూడవ, నాలుగవ తరగతుల కల్లా యీ నోటుపుస్తకాలు నుడికారాలతో, పదబంధాలతో, పిల్లవాడు యిష్టపడ్డ మాటలతో నిండిపోయాయి.

చదవడం సుసంపన్నం చేస్తుంది అనేదాన్ని చదవగలిగే సామర్థ్యం అనేదానికి కుదించలేం. యీ సామర్థ్యమనేది చదవడానికి ఒక ఆరంభం మాత్రమే. పిల్లవాడు ధారాళంగా తప్పుల్లేకుండా చదవగలిగినప్పటికీ చాలా తరుచుగా జరుగుతున్నట్టు, పుస్తకం బౌద్ధిక, నైతిక, సౌందర్యాత్మక అభివృద్ధి శిఖరాలకి నడిపించే దారి అవలేదు. చదవగలిగి వుండటం అంటే మాటల అర్థాన్నీ, అందాన్నీ గ్రహించే భావుకత వుండటం, మాటల సూక్ష్మ ఛాయల్ని గ్రహించే భావుకత వుండటం. పదం అనేది చుట్టూతా వున్న ప్రపంచపు మాధుర్యాలతోటీ, వర్ణాలతోటీ క్రీడించేటట్టుగా మనసులో వున్న ఆ విద్యార్థి మాత్రమే "చదువుతాడు." చదవడం అనేది పిల్లవాళ్లు తమకి తాముగా ప్రపంచాన్ని దర్శించి అర్థంచేసుకోగల గవాక్షం. చదవడంతో బాటుగా, ఏక కాలమందే, లేదా యింకా ముందే పదజాలాన్ని వంటబట్టించుకోవడానికి కష్టమైన ప్రయత్నం చెయ్యడం, యిదంతా కూడా పిల్లవాడి అంతరంగిక జీవితాన్నీ అన్ని కార్యకలాప రంగాలనీ - అంటే ఆట, పని, ప్రకృతితో ప్రతిచర్య, సంగీతం, సృజనాత్మకత అన్నిటినీ యిముడ్చుకునేదిగా వుంటేనే ఆ గవాక్షం తెరుచుకుంటుంది. అందాన్ని సృష్టించే సృజనాత్మకత లేకుండా, కథలూ కల్పనలూ లేకుండా, ఆటలూ పాటలూ లేకుండా చదవడాన్ని పిల్లవాడి బౌద్ధిక జీవిత రంగంగా వూహించడం అసంభవం. భాషకీ ఆలోచనకీ అభివృద్ధి చెందే ఆధారం సజీవ ఆలోచనా ఆధారానికి "యాత్ర", పదాల ఉద్వేగ రసాత్మక వర్ణానికి "యాత్ర." పుస్తకాల్లో పొదిగిన పద సౌందర్యమూ, కళాత్మక విలువలూ అనుభూతం చేసుకునే సామర్థ్యం పుణ్యమా అని అది అర్థమవుతుంది.

పిల్లవాడు మొదటి మాటని చదవడానికి ముందు గురువు, తన తల్లి తండ్రుల చదవడం వినాలి. అప్పుడు కళాత్మక చిత్రాల అందం అనుభూతం చేసుకోగలడు. ప్రకృతి ప్రపంచంలోకి "యాత్రలు" పుస్తకంకంటే భిన్నమైనవైనట్టుగా వూహించుకోవడం అసాధ్యం. ఒక పుస్తకంలో చదివిన మాటల అందం అనుభవించలేని పిల్లవాడు చుట్టూతా వున్న ప్రపంచపు అందాన్ని దర్శించలేడు. పిల్లవాడి హృదయానికీ చైతన్యానికీ నడిపించే దారికి రెండు పార్శ్వాలున్నాయి. పైకి వైరుధ్యపూరితంగా కనిపిస్తాయవి: పుస్తకాల నుంచి, పైకి చదివిన మాటనుంచి ఉచ్చరించే మాటకి, పిల్లవాడి అంతరంగిక జీవితంలో అప్పటికే భాగమైన సజీవ పదంనుంచి పుస్తకాలకి, చదవడానికి, రాయడానికి. మార్కుల కోసం కాకుండా చదవడం అంతరంగిక జీవితానికి అవసరం కాబట్టి - చదవలేకపోవడంవల్ల యెన్నో సంతోషాలు పోగొట్టుకుంటాడు కాబట్టి - పిల్లవాడు చదవడమూ రాయడమూ నేర్చుకోగలందులకు గాను రసాత్మక సౌందర్యాత్మక సంసిద్ధత ఒక ముఖ్య నిబంధన అవుతుంది.

"సంతోష చంద్రశాల"లో కూడా, చుట్టూతా వున్న ప్రపంచాన్ని గురించి మా విద్యార్థులు తమ అనుభూతులకీ ఆలోచనలకీ చిత్రలేఖన రూపం యివ్వగలగడమూ వాటికి కవితాత్మకమైన పేర్లు పెట్టగలగడమూ - చదవడానికీ రాయడానికీ

సౌందర్యాత్మక, రసాత్మక సంసిద్ధత ఫలితం. మా బోధనలో ప్రకృతిలోకి "యాత్రలు" వాటికి అవే గమ్యం కావు. మాటలగుండా పిల్లవాడి బౌద్ధికాభివృద్ధికి అవి ఒక మార్గం. ఆలోచించడం, వస్తువులనీ, విషయాలనీ, వాటి పరస్పర చర్యనీ గమనించడం, సాధారణీకరించడం, ప్రకృతినుంచీ, దృశ్యాత్మక వస్తువులనుంచీ, అనుభూతులనుంచీ నైరూప్యం చేసుకోవడం పిల్లవాడికి నేర్పడమే బోధన ప్రధాన ఉద్దేశం. అలాంటి ప్రయత్నం లేక పోయినట్లయితే, మాటలు లేనట్లయితే, బౌద్ధిక బోధన లేనట్లయితే, పిల్లలు ప్రకృతి సౌందర్యం అన్నా, మాటల వర్ణాల క్రీడలన్నా, జీవితంలోని అనంత వైవిధ్యాలన్నా ఉదాసీనంగా తయారవుతారు.

మొదటి తరగతిలోనే పిల్లవాడికి చదవడం ఆంతరంగిక అవసరంగా ఉండాలని చూశాను. దాంతోటి పిల్లవాడికి ధారళంగా చదివి గ్రహించడమనే నేర్పుని సాధించడం అభ్యాసం మాత్రమే కాకపోయింది. పిల్లవాడి బౌద్ధిక, రసాత్మక, సౌందర్యాత్మక అభివృద్ధి స్థాయికి అనుగుణంగా వుండేదే, అతని భవిష్యత్ అభివృద్ధికి సానుకూలంగా వుండేదే పిల్లవాడి ఆధ్యాత్మిక ప్రపంచంలోకి ప్రవేశిస్తుంది. చదివే అంశాలని సక్రమంగా యెంచుకోవడం ఉపాధ్యాయుడికి ప్రత్యేకం ముఖ్యం. దురదృష్టవశాత్తూ పాఠ్య పుస్తకాల్లో పిల్లవాడు అర్థంచేసుకోగల యెన్నో కళాత్మక విలువలు కొరవడ్డాయి. విద్యా సంవత్సరం ఆరంభమైన మూణ్ణెల్ల తర్వాత పాఠ్య పుస్తకాల్లో లేని ఆసక్తికరమైన కథలూ, అద్భుత కథలూ చదవడం ప్రారంభించాం.

నేను పిల్లలకి "ఉక్రేనియన్, రష్యన్ కథలు" అన్న పుస్తకం పంచిపెట్టాను. ఉక్రేనియన్ జానపద గాథ "చిన్న గడ్డి యెద్దు." అనే కథ చదవడానికి వాళ్లని సిద్ధంచేశాను – ఆ కథ దేన్ని గురించో, బొమ్మలతో వర్ణిస్తూ వాళ్లకి చెప్పాను. పిల్లలు పుస్తకం తెరిచారు. మొదటి విద్యార్థి చదివాడు, తర్వాత రెండవవాడు, ఆ తర్వాత మూడోవాడు. వాళ్లు ఆ కథని మళ్లీ మళ్లీ చదివారు, అయినా వాళ్లకి విసుగు రాలేదు, యెందుకంటే వాళ్లకి చదవడం వల్లెవేసే అభ్యాసం కాదు, స్పష్టమైన చిత్రాలతో గాఢమైన వైయక్తిక అనుభవం. ప్రతి పిల్లవాడూ మాటలకి తన స్వంత గ్రహణని జోడించాడు. వాళ్లంతా కూడా ఆ మాటలూ మాధుర్యమూ చాలా ఆసక్తికరంగా వుండే పాట పాడుతూ వున్నట్టుగా ఆ చదవడాన్ని శ్రద్ధగా విన్నారు. ప్రతివాడూ తన సొంత పద్ధతిలో చదివాడు, ప్రతివాడికీ ఆ మాటలు అనుభవంలోనీ, గ్రహణలోనీ, అనుభూతుల్లోనీ సూక్ష్మతలని అందిస్తూ వాటి ప్రత్యేకమైన శోభని సంతరించుకున్నాయి. అలాంటి చదవడం సంగీతంలాగా వుంటుంది; ఆ మాటలు శ్రావ్యంగా వుంటాయి.

స్కూలు పని మొదలైన నాటినుంచీ కూడా నా లక్ష్యం యేమిటంటే, ఒక్క నీరసమైన పుస్తకం కూడా పిల్లల చేతుల్లోకి పడకుండా వుండేటట్టు చూడ్డం. అప్పుడు పిల్లలు జాతీయ, సర్వ మానవ సంస్కృతిలో భాగమైన పుస్తకాలతోటే, ఆసక్తికరమైన రచనల ప్రపంచంలోనే వుంటారు. యిది చాలా ముఖ్యమైన కర్తవ్యం: ఒక వ్యక్తి తన జీవిత కాలంలో 2,000 పుస్తకాలకంటే యెక్కువ చదవలేడు – అంచేత

బాల్యంలోనూ, తొలి యౌవనంలోనూ పఠించే సరుకుని జాగ్రత్తగా యెంచుకోవాలి. కుర్రవాడు కొంచెం చదవడమే మంచిది, కాని ప్రతి పుస్తకమూ రసాత్మకంగా బౌద్ధికంగా అలరింప చెయ్యాలి. అప్పుడు పిల్లవాడు దాన్ని మళ్లీమళ్లీ చదువుతాడు, చదివినప్పుడల్లా నూతన విలువలని అక్కడ దర్శిస్తాడు. పిల్లవాడు మాటకి వుండే రసాత్మకతని అభినందించడం చాలా ముఖ్యం, శ్రవణ గ్రహణ, అంటే భావ వ్యక్తీకరంగా చదవడంలోని, సామర్థ్యం ముఖ్యం.

మొదటి తరగతిలో మాకు నాలుగు విభాగాలుగా వున్న పిల్లల లైబ్రరీ వుండింది: నా అభిప్రాయంలో పిల్లల నైతిక, బౌద్ధిక, సౌందర్యాత్మక బోధనకి అత్యంత విలువైన కథలు మొదటి విభాగంలో ఉన్నాయి. (ప్రతి పుస్తకానికీ 15 కాపీలు చొప్పున కొన్నాం, చదివేటప్పుడు ప్రతి యిద్దరు పిల్లలకీ ఒకటి చొప్పున వుంటుందని.) యీ విభాగం ప్రాథమిక పాఠశాలలోని నాలుగు సంవత్సరాల అధ్యయనానికి ఉద్దేశించబడింది. పిల్లలు అర్థంచేసుకోగల గంభీరమైన భావాలున్న కథలని, కళాత్మక చిత్రాలతో పొదిగినవాటిని, దీని కోసం యెంచుకున్నాం. అవి ఎల్. టాల్‌స్టాయ్, వి. ఝుకోవ్‌స్కీ, డి. మమీన్-సిబిర్యాక్, హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్, వి. హ్యూగో, గ్రిమ్ సోదరులు, ఎ. పుష్కిన్, వి. కొరొలేంకో, ఎన్. నెక్రాసొవ్, ఐ. తుర్గేనెవ్, ఎ. చేహొవ్, జి. సెంకేవిచ్, జె. లండన్, ఎమ్. ట్వైన్, ఎమ్. గోర్కీ ఎ. గైదార్, ఐ. ఫ్రాంకో, వి. కతాయెవ్ యింకా యితరులూ రాసిన కథలూ గాథలూ, కావ్యాలూనూ.

పిల్లలకి యీ రచనలు చదవడం ప్రపంచాన్ని తెలుసుకోవడంలో భాగం మాత్రమే కాదు, మామూలు అలవాట్లూ, సామర్థ్యాలూ పెంపొందించే అభ్యాసాలు మాత్రమే కాదు, రసాత్మక నైతిక బోధలో భాగం. ప్రతి పుస్తకమూ పిల్లలమీద గాఢంగా ముద్ర వేసింది. మమీన్-సిబిర్యాక్ అద్భుతమైన కథ "స్తుద్యోనయా నది దగ్గర శీతాకాలపు గుడిసె" పిల్లల్ని బ్రహ్మాండంగా అలరించింది. ఆ కథ ఒంటరిగా జీవించే ముసలి వాణ్ణి గురించి. అతన్ని అందరూ మరిచిపోయారు. అతను తన కాలాన్ని మారుమూల తైగాలో ఒక గుడిసెలో గడిపేస్తూ వుంటాడు. యీ పుస్తకం చదివిం తర్వాత చుట్టూతా వున్న పరిసరాలకి సంబంధించి పిల్లల భావుకత యెంత పదునెక్కిందో నేను గమనించాను.

మేం కథల్ని పాఠాలప్పుడూ, క్లాసు తరువాత కూడా చదివేవాళ్లం. ఉమ్మడిగా సంగీతం వినడం కోసం ఉద్దేశించబడిన సంగీత కృతుల రికార్డింగులతో మా లైబ్రరీ విభాగాన్ని పోల్చవచ్చు.

మా లైబ్రరీ రెండవ విభాగం ప్రస్తుత కాలాన్ని గురించీ, సోవియట్ ప్రజల కృషి గురించీ, శాంతి కోసం పోరాటం గురించీ, మహా దేశభక్తియుత యుద్ధంలోని వీరుల సాహసోపేత కృత్యాల గురించీ, వీరులైన బాలుర గురించీ సమకాలీన రష్యన్ ఉక్రేనియన్ రచయితల కథలతో నిండి వుంది. మా విద్యార్థులు సోవియట్ రచయితలు ఎస్. మిహల్కోవ్, ఎస్. మర్షాక్ కవిత్వాన్ని, ఎ. గైదార్, ఎల్. కస్సిల్,

ఎన్. నోసొవ్, ఎమ్. ప్రిలెజాయెవా, బి. జిత్కోవ్, జి. అలెక్సాంద్రొవా కథలతోబాటుగా మహా ఆసక్తిగా చదివారు.

మూడో విభాగంలో అద్భుత కథలూ, కవిత్వమూ, నీతి కథలూ వున్నాయి. యీ పుస్తకాలు బడి తరువాత చదవడానికే ఉద్దేశించబడ్డవి. ప్రతి పిల్లవాడూ తనకి ఆసక్తి కలిగించిన వాటినే యెంచుకునేవాడు. యీ ఆసక్తి మంచి బొమ్మలతోన్నూ, ఉపాధ్యాయుడు చదివిందాని గురించో, తోటివిద్యార్థులు చదివిందాని గురించో చెప్పుకోవడంతోనూ హెచ్చేది.

స్కూలు లైబ్రరీ నాలుగో విభాగం గ్రీకు పురాణాలు. యీ పుస్తకాలని అతి కష్టంమీద సంపాదించాం. అవి పిల్లలకి అర్థమయేటటువంటి రూపంలో వున్న గ్రీకు పురాణ గాథలు. పిల్లల సౌందర్యాత్మక బౌద్ధిక పెంపకంలో ప్రాచీన పురాణ గాథలు ముఖ్యమైన పాత్ర వహిస్తాయి. పురాణాలు మానవ సంస్కృతిలో ఒక అద్భుతమైన పుటని పిల్లలకి వెల్లడిచెయ్యడమే కాదు, అవి కల్పనని జాగృతం చేస్తాయి, మనసుని అభివృద్ధిచేస్తాయి, సుదూర గతంలో ఆసక్తిని పెంచుతాయి.

మొదటి సంవత్సరం చదువులో మధ్య కాలంనుంచీ మేము సమష్టిగా చదవడంలో సభలు నిర్వహించేవాళ్లం. నేను ఒక పుస్తకం అన్ని కాపీలూ పిల్లలకి, వాళ్లు యింటి దగ్గర చదువుకునేందుకు వీలుగా, పంచిపెట్టేవాణ్ణి. యిది సమష్టి పఠనానికి తయారవడం కోసమని. మాకిదివరకే తెలిసిన కథని చదవడానికని "అద్భుత కథా మందిరానికి" మేం యెందుకు వెళ్లాలి? యీ కోరిక దేన్నుంచి పుట్టింది? వాళ్లు యెందుకు అలా చెయ్యాలి? యింకో కొత్తది యేదేనా చదవడం బాగోదూ?

అవును, కొత్తది, అపరిచితమైన వాటిని కూడా బాగా చదవాలి, మేము మాకు కొత్తవైన పుస్తకాలు చదువుతాం. కాని పిల్లవాడు తనని ఆవేశపరిచిందాన్ని తన మిత్రులకి చదివి వినిపించాలనుకున్నప్పుడూ, మాటలలో తన ఆలోచనలూ అనుభూతులూ వ్యక్తం చెయ్యాలనుకున్నప్పుడూ మాత్రమే పుస్తకాలు అతని ఆంతరంగిక జీవితంలో భాగం అవుతాయి. మొదటి విభాగంలోని ప్రతి పుస్తకాన్నీ పదిసార్లకి తక్కువ చదివి వుండంమేము. మరి యీ పౌనః పున్యంవల్ల ఆసక్తి యేం సడలలేదు. రెండు మూడు వారాల క్రితం చదివిన పుస్తకాన్ని పిల్లలు మరిచిపోలేదు. మళ్లీ దాన్ని చదవాలని ప్రయత్నించారు. ఒకో అప్పుడు స్కూలుకి కేవలం దానికోసమే వచ్చారు. మూడు నాలుగు నెలలు గడిచిపోతాయి, అప్పుడు పిల్లలు మళ్లీ తమ కిష్టమైన పుస్తకాన్ని చదవాలనుకొంటారు, అంచేత మళ్లీ సమష్టి పఠనం ఏర్పాటు చేసేవాళ్లం.

పిల్లవాడు చదవడం నేర్చుకోడానికి ముందే మాట సూక్ష్మ ఛాయల విభేదం గ్రహించగలిగినట్లైతేనే ఒక కృషి తాలూకు అందమూ శక్తీ హృదయాన్నీ మనసునీ తాకుతాయి. ఆలోచనా ఆధారాలకి "యాత్రల్లో" మాటల సమ్మోహక సౌందర్యాన్ని

అనుభూతి చెందలేని వాళ్లు, వాళ్లకప్పటికే తెలిసిందాన్ని ఒకసారి, రెండోసారి, పదోసారి వినాలని యెన్నటికీ అనుకోరు.

మేము మా పాఠాలని కొన్ని యిష్టమైన కథలకి అంకితం చేశాం. పిల్లలు ఆవేశంగా చదవడానికి తయారయారు. ప్రతివాళ్లూ తమకి బాగా నచ్చింది, తమకి ఆసక్తికరంగా వున్నది చదివారు.

కవిత్వ పఠనం మాకు ప్రత్యేకమైందిగా వుండేది. కవిత్వంలో శ్రేష్ఠమైన వాటిని నేను వల్లించాను: పుష్కిన్, లేర్మొంటొవ్, ఝుకోవ్‌స్కీ, నెక్రాసొవ్, ఫేత్, షెవ్‌చేంకొ, లేస్యా ఉక్రయిన్కా, మిచ్‌కేవిచ్, హైనె, బెరంజే, తదితర కవుల పద్యాలు. పిల్లలు తమ కిష్టమైన పద్యాలని కంఠతా పట్టాలని అనుకున్నారు. నాలుగు సంవత్సరాల్లో వాళ్లు చాలా పద్యాలు కంఠతా పట్టారు.

మంచి కవిత్వం మాటల అందాన్నీ, చిత్రాలనీ మాధుర్యంతో మేళవించుకుని వుంటుంది. యీ శ్రావ్యతని పిల్లలు చిన్నతనంనుంచీ అనుభూతం చేసుకునేటట్టుండాలని నేను ప్రయత్నించాను: నేను రష్యన్, ఉక్రేనియన్ కవుల పద్యాలను వల్లించాను. పుష్కిన్ గీతం "వివేకవంతులైన ఒలేగ్‌ని గురించిన గేయం," షెవ్‌చేంకొ రాసిన "పనిమనిషి" చాలాసార్లు విన్నాం. దాదాపు పిల్లలందరూ సునాయాసంగా వీటిని నేర్చేసుకున్నారు. అదేరకంగా ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించే చాలా లాలిత్యభరితమైన పద్యాలని పిల్లలు కంఠతా పట్టారు. అప్పుడు చదువుతూ వుండే దానిలో ఒక భాగాన్ని మర్నాటికి నెట్టేయ్యడం వాళ్లు యిష్టపడేవాళ్లు. "స్వప్నాల దిక్కు"లో మేము కొన్ని వారాలపాటు "టామ్ సాయర్ సాహస కృత్యాలు" చదివాం. పిల్లల చుట్టూతా వున్న పరిసరం వల్ల ఆ పుస్తకం వాళ్లమీద వేసిన ముద్రలు గాఢం అయాయి. అదే రకంగా మేము గోర్కీ "బాల్యం," కతాయెవ్ రాసిన "ఒంటరి తెరచాప తళుకుమంటోంది," బజోవ్ రాసిన "ఆకుపచ్చరాళ్ల పెట్టె" చదివాం.

సమయం గడిచే కొద్దీ మేము కవిత్వ పఠన ఉత్సవాలు జరిపాం. పాల్గోదలచుకున్న ప్రతివాళ్లూ చదవడానికో, లేదా తమతమ యిష్టమైన కథనో పద్యాన్నో వల్లించడానికో తయారయి వుండేవాళ్లు. మిగతా తరగతులనుంచి చాలామంది పిల్లలు యీ ఉత్సవాలకి వచ్చేవాళ్లు. క్రమేపీ అలాంటి పఠనం స్కూలంతా సాగింది.

రెండుసార్లు – మొదటి సెమెస్టర్ ఆఖరునా, విద్యా సంవత్సరం ఆఖర్న మేము మాతృభాష ఉత్సవాన్ని జరిపాం. యీ ఉత్సవంలో కొన్నీ వేడుకలు సంప్రదాయమైపోయాయి. తమలో యెవరు తమ కథనో పద్యాన్నో బాగా చదివారో నిర్ణయించమని పిల్లలు వూళ్లో పెద్దల్ని ఆహ్వానించేవాళ్లు. అది ఒక రకమైన పోటీ. అందులో నెగ్గినవాళ్లు బహుమతులు పొందారు. తమ మాతృభాషలో సిద్ధహస్తులూ, అభిమానులూ అయిన సమష్టి వ్యవసాయ క్షేత్రపు పెద్దరైతులు యీ బహుమతులిచ్చేవాళ్లు. వాళ్లు కూడా కథలు చెప్పి కవిత్వం చదివేవాళ్లు. ఒకోసారి విద్యార్థీ ఆ పెద్దాయనా ఒకేదాన్ని చదవడం తటస్థించేది. చదువు నాలుగో

సంవత్సరంలో వుండగా యీ వసంతోత్సవం రెండు రోజులు జరిగింది, యెందుకంటే కథలు చదవాలనీ, పద్యాలు వల్లించాలనీ, నీతి కథలు చెప్పాలనీ అనుకున్నవాళ్లు అంతమంది వుండిపోయారు.

వాళ్ల పెద్దలతోటి - తల్లులు, తండ్రులు, మామ్మలు, తాతలతోటి - నిరంతరమైన సంబంధం వల్ల ఇంకొక ఆసక్తికరమైన సంప్రదాయం యేర్పడింది. మా ఉత్తమ పాఠకులు యింటిదగ్గర తల్లిదండ్రులకి చదివి వినిపించడం మొదలెట్టారు, ఆ పెద్దలు పిల్లలు యెలా చదువుతున్నారోనని వినడానికి స్కూలుకి రావడం మొదలెట్టారు. కొన్ని పఠన క్లబ్బులు యేర్పడ్డాయి. గౌరవనీయులైన పెద్దలు చేరారు. యీ క్లబ్బుల నిర్మాణ కార్యకలాపం పుస్తకాల్లోనూ చదవడంలోనూ పిల్లల ఆసక్తిని పెంచింది.

మొత్తం స్కూలంతా పాల్గొనే సంప్రదాయక పుస్తకాల ఉత్సవం ప్రారంభమైంది. విద్యా సంవత్సరం ఆరంభమయ్యేక ఆగస్టు 31న పిల్లలూ తల్లిదండ్రులూ స్కూలుకి వచ్చేవాళ్లు. ఆ రోజున ప్రతివాళ్లూ, పిల్లలు ఒకళ్ల కొకళ్లకి, తల్లిదండ్రులు పిల్లలకి పుస్తకాలు బహూకరించుకునేవాళ్లు. పఠన క్లబ్బులో ఉత్తమంగా చదివేవాళ్లకి సమష్టి వ్యవసాయ క్షేత్ర బోర్డు ఆ రోజున పుస్తకాలు యివ్వడమనేది ఒక నియమం అయిపోయింది.

ప్రతి పిల్లవాడూ ఒక స్వంత లైబ్రరీ యేర్పాటు చేసుకునేటట్టు ప్రయత్నించాను, చదవడం అనేది ముఖ్యమైన ఆంతరిక అవసరం అవుతుందని చూశాను. చదువు మొదటి రెండు సంవత్సరాల్లోనూ ప్రతి కుటుంబంలోనూ ఒక లైబ్రరీ వుండేటట్టు చూశాను. కొన్ని కుటుంబాల్లో అయిదు వందలకిపైగా పుస్తకాలుండేవి, కొన్ని కుటుంబాల్లో తక్కువ, కాని ప్రతి కుటుంబం ప్రతినెలా యింకా సేకరించుకుంటూనే వుండేది. ఒక నెలలో కుటుంబంలో కొత్త పుస్తకాలు కనబడకపోతే నాకేదో మునిగిపోయినట్టుగా వుండేది.

స్వయం బోధన, వ్యష్టి బౌద్ధిక జీవితమూ పుస్తకాలతోటే మొదలవుతాయి. బోధనా క్రమంలో ఒక క్షణం, పిల్లవాణ్ణి చెయ్యిపట్టుకుని నడిపిస్తూ వుండే ఉపాధ్యాయుడు చెయ్యి వదిలేసి, "నీ అంతట నువ్వు వెళ్లు, బతకడం నేర్చుకో" అని చెప్పే క్షణం వస్తుంది. అలాంటి అడుగు వెయ్యగలగడానికి బ్రహ్మాండమైన బోధనా వివేకం కావాలి. బౌద్ధికంగా నైతికంగా స్వతంత్ర జీవితానికి ఆ వ్యక్తిని సిద్ధంచెయ్యడానికి, అతన్ని గాని, ఆమెని గాని పుస్తక ప్రపంచంలోకి నడిపించాలి. ప్రతి పిల్లవాడికీ పుస్తకాలు ఒక స్నేహితుడిగా, బోధకుడుగా, వివేకమైన ఉపాధ్యాయుడిగా తయారై తీరాలి. ప్రతి బాలుడూ, బాలికా చదవడానికీ, ధ్యానానికీ పర్యాలోకించుకోడానికీ యేకాంతంగా ఉండడం ఒక ముఖ్యమైన బోధనా కర్తవ్యంగా నేను పరిగణించాను. యేకాంతం అంటే ఒంటరితనం కాదు. అది ఆలోచనల స్వయం బోధనకి, అనుభూతులకి, విశ్వాసాలకి, దృక్పథాలకి ఆరంభం. పుస్తకాలు పసివాని జీవితంలోకి ఒక ఆధ్యాత్మిక అవసరంగా చొచ్చుకుపోయినప్పుడే అది

సాధ్యం. విడివిడిగా మాట్లాడేటప్పుడు ప్రతి బాలుడికీ బాలికకీ యెలాంటి పుస్తకాలు ఆసక్తి కలిగిస్తాయి, యెలాంటి ప్రశ్నలకి పుస్తకాలనుంచి వాళ్లు సమాధానాలు కోరుతున్నారు అని నేను చూశాను. తెలివైన సలహా యివ్వడానికీ, పిల్లలు వాళ్ల కవసరమైంది కనుక్కొనే సాయం చెయ్యడానికీ నాకు అది అవసరం అయింది.

బడి నిజమైన సంస్కృతీ కేంద్రంగా తయారవడానికి నాలుగు విషయాలు ప్రబలంగా వుండాలి. అవేమంటే, మాతృదేశంపట్ల ప్రేమ, మానవునిపట్ల గౌరవం, పుస్తకాలంటే ప్రేమ, మాతృభాష అంటే ప్రేమ.

మా విద్యార్థులతో పని మొదలుపెట్టే ముందే నేను యుక్త వయస్కులయే పిల్లలతో పని చెయ్యడంలో వున్న కష్టాల గురించి చాలా విన్నాను. "చిన్న పిల్లలతో పని చెయ్యడం చాలా సులభం. కాని పిల్లవాడు యుక్తవయసు వచ్చే వాడవడంతోటి గుర్తు పట్ట లేనంతగా మారిపోతాడు. దయ, భావుకత, వినయం మాయమైపోతాయి. పొగరుమోత్తనం, నిర్లక్ష్యం ప్రత్యక్ష మవుతాయి" అని నాకు చెప్పారు. యీ మాటలు నిజంకావని నాకు నమ్మకం కలిగింది. ఉపాధ్యాయుడు సృష్టించకపోతేనే మంచి మాయమైపోతుంది – పిల్లవాడు స్వతహాగా మంచివాడని ఉపాధ్యాయుడు అనుకుంటే, బాల్యంనుంచీ పుస్తకాలంటే యిష్ట పడటం పిల్లవాడికి నేర్పకపోతే, తన జీవిత కాలమంతా అవసరమైన దానిగా చదువు అతనికి తయారుకాకపోతే, కౌమార సంవత్సరాలు నిరర్ధకమైనవైపోతాయి, చెడ్డతనం బయటపడుతుంది.

## మాతృభాష

ఉక్రేనియన్ల మాతృభాష ఉక్రేనియన్. యివాళ మూడు కోట్ల అరవై లక్షల మంది ఉక్రేనియన్ మాట్లాడేవాళ్లున్నారు. కాని మా ప్రజల చరిత్ర రష్యన్ భాషతోటి సన్నిహితంగా వుండేటట్టు అభివృద్ధి చెందింది. యీ రెండు భాషలూ సన్నిహితంగా వుంటాయి. దీనివల్ల ఉక్రేనియన్, రష్యన్ భాషలని ఆపోశన పట్టడాన్ని సులభతరం అవదు. తద్విరుద్ధంగా కష్టతరం అవుతుంది. రెండు భాషల్లోనూ ఒక్కలాగే ధ్వనించే వందలాది పదాలు వున్నాయి. కాని అవి భిన్నార్థ ద్యోతకాలు. చాలా సందర్భాల్లో అదే మాట భిన్న రస వర్ణాలతో రష్యన్‌లోనూ, ఉక్రేనియన్‌లోనూ వుంటుంది. ఒక భాషలో గంభీరార్థ సూచితమైన పదం యింకో భాషలో హాస్య ద్యోతకం. అర్థఛాయల భేదం, రసాత్మక సౌందర్యాత్మక వర్ణం యీ రెండు భాషల్లోనూ ఒక నిధి. ఉక్రేనియన్ స్కూళ్లల్లో ఉపాధ్యాయులమైన మాకు యువతరానికి ఆ నిధిని అందివ్వవలసిన బాధ్యత వుంది.

భాష ప్రజల సంపదలో భాగం. "నాకు ఎన్ని భాషలు తెలిస్తే అంతమంది ప్రజల్ని నేను" అని నానుడి. తన మాతృభాషలో ప్రావీణ్యం సంపాదించని వాడికి, దాని అందాన్ని ఆస్వాదించలేని వాడికి పర ప్రజల భాషలలోని ఐశ్వర్యం అందుకోలేనిదే అవుతుంది. తన మాతృభాషలోని సూక్ష్మతలని యెంత లోతుగా ఒక

వ్యక్తి తెలుసుకుంటే, మాతృభాషలోని అర్థఛాయల గ్రహణ యెంత సున్నితంగా వుంటే, అంతగా ఆ వ్యక్తి మనసు పర భాష ప్రావీణ్యానికి తయారయి వుంటుంది, పర భాష సౌందర్యాన్ని అతను అంత క్రియాత్మకంగా గ్రహిస్తాడు.

వాక్శుద్ధి ఒక వ్యక్తి బౌద్ధికాభివృద్ధికి దర్పణం. పిల్లవాడి ఆలోచనలూ అనుభూతులూ అభివృద్ధి చేస్తూ, సౌందర్యమూ, .మహత్వమూ, శక్తీ, వ్యక్తీకరణ మాతృభాషలో వుండటమనేది అతన్ని ప్రభావితం చేసే ముఖ్యమైన సాధనాలు. ప్రాథమిక పాఠశాలలో చుట్టూతా వుండే ప్రపంచం పిల్లవాణ్ణి చకితం చేస్తుంది. అక్కడ యీ సాధనాల పాత్రని సరిగానే అంచనా వెయ్యగలం.

మేము ప్రకృతి దగ్గరగా వెళ్లాం - అడవిలోకి, తోటలోకి, పొలాల్లోకి, మైదానాల్లోకి, నది ఒడ్డుకి - చుట్టూతా వున్న ప్రపంచపు సంపదకి పిల్లల కళ్లు తెరిపించేటందుకు నాకు మాటలు సహకరించాయి. ప్రకృతి దగ్గరకి "యాత్ర" చెయ్యడం సృజనాత్మకతకి మొదటి ప్రేరణ. పిల్లలు తమ అనుభూతుల్నీ అనుభవాలనీ మాటలలో పెట్టాలని కోరారు. అందాన్ని గురించి మాట్లాడాలని అనుకున్నారు. ప్రకృతిని గురించి చిన్నచిన్న వాక్యాలని కూర్చారు. వాళ్ల భాషా, ఆలోచనా అభివృద్ధి చేసుకునేందుకు యీ కాంపోజిషన్లు ముఖ్యమైన సాధనం. ప్రతి పిల్లవాడూ తన కాంపోజిషన్ తయారుచేసి, క్లాసులో దాన్ని రాసేసేవాడు. పిల్లలు మొదటి సంవత్సరపు చదువులో మౌలికంగా తయారుచేసి తర్వాత "మా మాతృభాష" పుస్తకంలోనో లేదా తమ సొంత నోటు పుస్తకాల్లోనో రాసిన చిన్న కాంపోజిషన్లని కొన్నిటిని చెప్తాను.

**భరద్వాజ పిట్ట పాట (లరీసా):** వినీలాకాశంలో ఒక బూడిద రంగు ముద్ద వణుకుతోంది. అది భరద్వాజ పిట్ట. అది తన మధురమైన పాట పాడటం నేను వింటున్నాను - నాకు యెన్నటికీ విసుగనిపించలేదు. భరద్వాజ పిట్ట యేదో మృదువైన, వెండి తీగలమీద వాయిస్తూన్నట్టుంది. ఆ తీగలు బంగారు గోధుమనుంచి సూర్యునిదాకా సాగి వున్నాయి. దాని పాటని గోధుమ కంకులు ఒళ్లంతా చెవులు చేసుకుని వింటున్నాయి.

**సూర్యుడు అస్తమించాడు (సెర్యోజ):** సూర్యుడు అస్తమించాడు. పొలంమీద చీకటి కమ్ముకుంది. సాయంసంధ్య కనుమలోనుంచి యివతలికి పాకింది. పొలాలమీదుగా, మైదానాలమీదుగా, నదిలాగా అది వ్యాపించింది. పాప్లర్ చెట్ల శిఖరాల్లో బంగారు రవ్వలు దూసుకుపోయాయి. సూర్యుడు కడసారి వీడ్కోలు చెప్తున్నాడు. అవి దూసుకుని పోయాయి. సెలవ్, ఎండగారూ!

**తేనెటీగలు నీళ్లు తాగుతున్నాయి (గాల్యా):** తేనెటీగలు నీళ్లు యెలా తాగుతాయో నేను చూశాను. నీటిచుక్కలు సన్నటి గడ్డిపోచమీదుగా మెత్తటి విల్లో మోదుమీదకి జారతాయి. మోదు తడిసింది. తేనెటీగలకి విల్లో వాసన అంటే యిష్టం. అవి మోదు దగ్గరకి వెళ్లి నీళ్లు తాగుతాయి. అవి తమ బంగారు రెక్కల్ని

అల్లల్లాడిస్తాయి. కొంచెం విశ్రాంతి తీసుకోండి, చిన్ని యీగలూ, మీరింకా చాలా దూరం యెగరాలి.

**బక్‌వీట్ పూస్తోంది (వార్యా):** బక్‌వీట్ పూత కొచ్చింది. పొలమంతా తెల్లని తివాచి పరిచినట్లైంది. అది సజీవంగా వుంది, యెంత మంచి వాసన వస్తోంది! ప్రతి పువ్వుమీదా ఒక తేనెటీగ వుంది. తివాచీ ఝుంకారం చేస్తోంది - అంటే అది ఝుంకారం చేసే తేనెటీగలనుంచి వస్తోంది అన్నమాట. పెద్ద గండు కందిరీగ ఒక చిన్న పువ్వుమీద వాలింది. కాడ కదిలి వంగింది, కందిరీగ పట్టు తప్పిపోయింది. అది కింద పడి కోపంగా ఝుమ్మనడం మొదలెట్టింది.

**కోతయంత్రపు డ్రైవరు (యూర):** మా మామయ్య పెద్ద కోతయంత్రాన్ని నడుపుతాడు. ముందు గోధుమ పొలం వుంటుంది. పదునైన అలుగులు కాండాలని కోసి నూర్చే యంత్రాని కిస్తాయి. నూర్చే యంత్రం గోధుమని నూరుస్తుంది. ధాన్యం ధారగా బంకర్‌లోకి జారుతుంది. ఒక ట్రక్కు బంకర్‌కిందికి వెడుతుంది, ధాన్యాన్ని నూర్చే కళ్లంలోకి తీసుకెడుతుంది. బోలెడు తెల్ల రొట్టి తయారవుతుంది.

**మా నూర్పిడి యంత్రం (వాన్యా):** మా బడి దగ్గర బుల్లి నూర్పిడి యంత్రం వుంది. అది యిలా వుంటుంది... విద్యార్థులు స్కూలు జాగాలో గోధుమని కోశారు. దాన్ని అయిదు మోపులకింద కట్టారు. బుల్లి నూర్పిడి యంత్రం గొణగడం మొదలెట్టింది. అది గోధుమని నూర్చింది. వాళ్లు గోధుమని ఒక సంచీలో పోశారు. మేం ఆ విత్తనాలని చల్లుతాం.

**ఆపిల్ చెట్లు పూస్తున్నాయి (పవ్లో):** ఓహో! ఆపిల్ చెట్లు పూసినప్పుడు పళ్లతోట యెంత అందంగా వుంది. తెల్లటి పువ్వులు యెండకి రేకులు విచ్చుకుంటాయి. పిల్లగాలి పూతని లాలిస్తుంది. అవి చిన్న వెండి మొగ్గల్లాగా వూగుతాయి. మొత్తం తోటంతా మోగుతుంది చిరునవ్వు నవ్వుతుంది యెండకి. గాలి మణగగానే తేనెటీగల ఝుంకారం వినిపిస్తుంది. అవి చెట్లమీద యెగురుతాయి. అవి బాగా గట్టిగా వూగే మొగ్గల కోసం చూస్తాయి. అప్పుడు తోటంతా వెయ్యి తీగల్లాగా పాడుతుంది. తేనెటీగ సున్నితమైన మొగ్గమీద వాలుతుంది, చిన్ని కాళ్లు కదుపుతుంది, చిన్న రెక్కలు అల్లల్లాడిస్తుంది. మొగ్గమీద నుంచి బంగారు పుప్పొడి యెగురుతుంది.

**దాషా అత్తతోటి క్షేత్రంలో (కోల్యా):** దాషా అత్త పని చేసే క్షేత్రం దగ్గరకి వెళ్లాం. ఆమె ముప్పై ఆవుల పాలు పితుకుతుంది. పాలకోసం పెద్ద పెద్ద కేన్లు వున్నాయి. ఆ పాలని వెన్న కేంద్రం దగ్గరికి తీసికెళతారు. అక్కడ దాన్నుంచి వెన్న తీస్తారు.

**సాయంత్రంవేళ కొంగలు పాడుతున్నాయి (తీనా):** సూర్యుడు కొండ వెనకాల అస్తమించాడు. వినీలాకాశంలో కొంగలు యెగురుతున్నాయి. అవి పాడుతున్నాయి: "ఏమండోయ్ పచ్చిక మైదానంగారూ, మేము వెచ్చని

సముద్రంనుంచి వచ్చాం." చెట్లమీద కొమ్మలు కదలడం మొదలెడతాయి. పచ్చగడ్డి గలగల లాడుతుంది. కొలను అరుస్తుంది: "యేమండోయ్, కొంగలూ, మీరు వెచ్చటి సముద్రం దగ్గర యేం చూశారో చెప్పండి."

**దయాపురిత తాత సందె చీకటి (సొన్య):** ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మంటున్నాయి. దయగల తాత సందె చీకటి కొండ కనుమనుంచి యివతలకి వస్తాడు. అతను ముసలాడు, కేశికుడు. ఒక కర్ర వూతంతో నడుస్తాడు. అతను వూళ్లోకి నడుస్తాడు. ఒక గుడిసెలోకి ప్రవేశిస్తాడు. తన వెచ్చటి మృదువైన అరిచేతులతో పిల్లల్ని నిమురుతాడు, వాళ్లు నిద్ర పోవాలనుకుంటారు. వాళ్లకి తియ్యటి కలలు వస్తాయి ("సంతోష చంద్రశాల"లో సాయంసంధ్య గురించిన కథ అల్లింది సొన్యయే. యిప్పుడా కథ మళ్లీ ఆ పిల్ల మనసులో మెదిలింది.)

**కుజ్మా మామ (ఫేద్య):** మేము కుజ్మా మామ దగ్గర కెళ్లాం. ఆయన తాపీపనివాడు. ఆయన యిటికలతోటి యిళ్లకి గోడలు కడతాడు. ప్రస్తుతం ఆయన కొట్టు కడుతున్నాడు. కుజ్మా మామ అప్పుడే యాభై యిళ్లు కట్టాడు. వాటిల్లో బోలెడు మంది వుంటారు. ఆయన అంటాడు: "నేను కట్టిన యిళ్లు రెండువందల యేళ్లు వుంటాయి. కుజ్మా మామ యెలాంటి తాపీపనివాడో బోలెడు మంది గుర్తుంచుకుంటారు."

**కుంకుమ పువ్వు (కాత్యా):** యెండ అడివిని నిద్రలేపింది. పైన్ చెట్ల శిఖరాల్లోని మంచుని కరిగించింది. వేడి బిందువులు మంచుమీద పడ్డాయి. కొట్టు కొచ్చే మంచులో యెండిన ఆకులమీద అది కన్నాలు చేసింది. అది పడిన చోట ఆకుపచ్చ బాణాకారపు గుర్తు యేర్పడింది. నీలి మొగ్గ పూసింది. అది మంచుకేసి ఆశ్చర్యంతో చూసి అడిగింది: "నేను మరీ పెందరాళే లేచానా?" "లేదు, నువ్వు మరీ పెందరాళే లేవలేదు. నువ్వు సరి అయిన వ్యవధిలోనే లేచావు" అని పాడాయి పక్షులు. వసంతం ఆరంభమైంది.

**సూర్యుడూ నల్ల మేఘమూ (తోల్య):** బంగారు పొలం ఒకటుండేది. ప్రతి కంకుతోటీ సూర్యుడు ఆడుకునేవాడు. పొలమూ, పొలమూ, నువ్వు యెంత అందంగా వున్నావు. కాని చూడు–నల్ల మేఘం ఒకటి నీమీదకి వచ్చింది. అది సూర్యుణ్ణి దాచేస్తోంది. కంకులమీద బంగారు మెరుపులు పోయాయి. పొలం బూడిద రంగుగా మారిపోయింది, ఎవళ్లో బూడిద రంగు దుప్పటి నేలమీద కప్పినట్టు. నల్ల మేఘం వెనక నుంచి యెంత త్వరగా వీలైతే అంత త్వరగా యివతలికి రండి యెండగారూ! మీ కోసం మేం నిరీక్షిస్తున్నాం, సూర్యుడుగారూ!

**చిన్న నక్షత్రాలు ఆకాశంమీదనుంచి జారతాయి (ల్యూబా):** ఆగస్టు నెలలో చిన్న నక్షత్రాలు ఆకాశంమీదనుంచి జారతాయి. దట్టమైన అడవిలో పెద్ద బయలు వుంది, ఒక నక్షత్రం దానిమీద జారింది. యెర్రటి పువ్వు వచ్చింది.

**మా క్లాసు గదిలో వెచ్చగా వుంది (సాష):** మా క్లాసు గదిలో వెచ్చగా హాయిగా వుంది. వెచ్చటి రేడియేటర్లు వున్నాయి. వాటిలో నీళ్లు ప్రవహిస్తూ వుంటాయి. కింద ఒక పెద్ద బాయిలర్ వుంది. పెద్ద పొయ్యిలో బొగ్గు మండుతూ వుంటుంది. ఆ బొగ్గుని భూగర్భంలోనుంచి తవ్వి తీసి రైలు మీద మా దగ్గరికి చేరవేశారు. అక్కడ దిగుమతీ అయింది. అక్కణ్ణుంచి ఒక ట్రక్కు దాన్ని మా స్కూలుకి చేరవేసింది. మాకు వెచ్చగా వుంది, యెందుకంటే గనిపనివాళ్లూ, రైలు దారి పనివాళ్లు శ్రమించారు కనక.

**శీతాకాలపు మైనాలు (మీష):** కిందటేడు మైనాలు దక్షిణాదికి యెగిరి పోలేదు. మనకి పిచ్చి చలిగా వుండదని వాటి కెలా తెలుసు? సాయంత్రం అవి యెలా గుంపులు కట్టి ఒక చెట్టునుంచి యింకో చెట్టుమీదకి యెగిరాయో నేను చూశాను. అవి వెచ్చటి స్థానంకోసం చూస్తున్నాయి. అవి ఆందోళనతో అరుస్తున్నాయి. మంచు తుఫానులప్పుడు అవి మా గాదె దగ్గరికి యెగిరి వచ్చాయి. అవి అన్ని చోట్లా వాలాయి, ఆవుమీద కూడా వాలాయి. కాని యెండగా వుండే, చలి రోజుల్లో అవి మంచులో స్నానం చేశాయి. ఒక పెడిసె పిట్ట మేటవేసిన మెత్తటి మంచులోకి ఒక చిన్న కర్రలాగా పడేది, మంచులోకి కలుగుచేసుకునేది. అప్పుడది మేట వేసిన మంచులో నుంచి యివతలకి వచ్చి, ఉల్లాసంగా కూస్తుంది.

**క్రిస్టమస్ చెట్టు (దంకో):** అమ్మా నేనూ కలిసి క్రిస్టమస్ చెట్టుని బల్లమీద పెట్టాం. దాన్ని మేం అలంకరించాం. కింద మంచు తాతని పెట్టాం. రాత్రి వచ్చింది. బయట పిండి ఆరబోసినట్టుగా వెన్నెల. మంచు తాత యే చేస్తున్నాడో చూద్దామనుకున్నాను. ఆయన తన కర్ర యెత్తాడు, చెట్టుకిందనుంచి యివతలికి వచ్చి, బల్లమీద నడిచాడు. ఆయన అలా నడిచి గుర్రుగుర్రు మన్నాడు. కొమ్మలమీద తెల్లని మంచు తరకలు గుసగుస లాడుతున్నాయి. ఒక బూడిద రంగు కుందేలు ఒక కొమ్మమీద కూర్చుంది. అది చెట్టుమీద నుంచి మంచు తాత సంచీలోకి దూకింది. అది నూతన సంవత్సర కానుక అవుతుంది.

**యుహీమ్ తాత (ల్యూదా):** మా యుహీమ్ తాత అడవిలో పర్యవేక్షకుడు. ఆయన సమష్టి క్షేత్రంలో యిరవై యేళ్లుగా పని చేస్తున్నాడు. వూరికి వెనక తట్టున ఓక్‌చెట్ల తోపు వుంది. అవి ఆయన ఓకు చెట్లే, ఆయనే వాటిని నాటాడు. తన ఓక్ చెట్లు మూడు వందల యేళ్లుంటాయని తాత అంటాడు. నేను కూడా నా ఓక్ చెట్టుని పాత్తాను.

**దుష్ట సాలీడు (కోస్త్య):** ఒక సాలీడు మా వంటగదిలో ఒక చీకటి మూల గూడు కట్టుకుంది. అదేం చేస్తుందా అని నేను పరిశీలనగా చూశాను. ఆ సాలీడు గోడమీద తచ్చాడింది, తన కాళ్లు రాసింది. అది తన గూటి దారాల్ని కదిలిస్తూ వున్నట్టుంది. జుమ్మంటూ ఒక యీగ యెగిరింది. సాలీడు విందానికని తిరిగింది. యీగ సాలెగూట్లోకి యెగిరి చిక్కుకు పోయింది. దాని జుమ్మనడం యెక్కువైంది,

ఆందోళనగా కూడా వుంది. సాలీడు అప్పటికే యీగ దగ్గరికి గబగబా నడుస్తోంది. వుహు, నువ్వు యీగని చంపలేవు, దుష్ట సాలీడూ. నేను నీ గూడు చించేసి, యీగని వదిలిస్తా. యీగా, ఎగిరిపో, మళ్లీ సాలీడు గూట్లో చిక్కుకోకు.

**టొమాటోలు (స్లావ):** ఎర్రటి టొమాటోలూ, ఆకుపచ్చని గుబుర్లూ వున్నాయి. ఉదయం టొమాటోలు మంచు బిందువులతో కప్పబడి వుంటాయి. ప్రతి బిందువుతోనూ బంగారు యెండ క్రీడిస్తుంది. ఒక తెల్ల సీతాకోకచిలక ఒక ఎర్ర టొమాటోపండుమీద వాలింది. ఒక తేనెటీగ ఝుంకారం చేసింది. అది టొమాటో అంటే పెద్ద పువ్వు అనుకుంది. అది టొమాటో చుట్టూతా సుళ్లు తిరిగి, యెగిరిపోయింది.

పిల్లల కాంపోజిషన్లు యెంతో శ్రమ ఫలితం. పరివేష్టిత ప్రపంచపు విషయాల్ని వాళ్లకి చూపించి, అవి వాళ్ల మనసులని భాష ద్వారానే కాకుండా, హృదయాలనీ ఆత్మలనీ కూడా ఆకట్టుకునేటట్టు చెయ్యాలి. భాషలోని రసాత్మక, సౌందర్యాత్మక వర్ణం, దాని సూక్ష్మ ఛాయలు పిల్లల సృజనాత్మకతకి జీవనదాయక ఆధారం. మాటలు పిల్లల మనసుల్లో స్పష్టమైన చిత్రాల్లాగా వుండిపోతాయి, అంచేత వాళ్లు క్లాసులో కాంపోజిషన్లు రాసేటప్పుడు, తమ రాతకి బొమ్మలు కూడా జోడించారు.

చుట్టూతా వున్న ప్రపంచపు అందానికి ముగ్ధులై వెంటనే పిల్లలు కాంపోజిషన్లు రాసేస్తారని అనుకోకూడదు. సృజనాత్మకత అనేది పిల్లల్లో సహజ బోధితంగా వుండదు. దాన్ని నేర్పాలి. తన ఉపాధ్యాయుడినుంచి ప్రకృతి వర్ణనలు వింటేనే పిల్లవాడు కాంపోజిషన్లు కూర్చగలడు. సాయంత్రపు ప్రశాంతతలో చెరువు గట్టున కూర్చుంది నేను పిల్లలకి వినిపించిన మొదటి కాంపోజిషన్. ఒక దృశ్యాత్మక చిత్రం మాటలలో యెలా వర్ణితమవగలదో పిల్లలు అర్థం చేసుకుని అనుభూతం చేసుకోవాలని నేను ప్రయత్నించాను. మొదట్లో నేను కూర్చిన వాటిని వాళ్లు వల్లించారు. క్రమేపీ తమని ఉత్తేజపరచిన ప్రకృతి చిత్రాలని వాళ్లు వర్ణించడం మొదలుపెట్టారు. పిల్లల్లో సృజనాత్మక కార్యకలాపం మొదలయింది. యీ క్రమంలో మాటల ఛాయలు గ్రహించడం చాలా ముఖ్యం. ప్రతి మాటా తన ప్రత్యేకమైన స్థానం కలిగిన తయారుగా వున్న యిటిక అని పిల్లవాడు గమనిస్తేనే కాంపోజిషను తయారుచెయ్యగలడు. అప్పుడు పిల్లలు ఆ సందర్భానికి తగిన యిటికని యేరుకుంటారు. తమ బుర్రలో దూరిన మొదటి మాటనే వాళ్లు వూరికే పట్టేసుకోరు. వాళ్ల భావుకత వాళ్లని అలా చెయ్యనియ్యదు.

కాంపోజిషన్లు తయారుచెయ్యడమనేది మా విద్యార్థుల అభిమాన కృషి అయింది. వాళ్లు చూసిన ప్రతీదీ, వాళ్లు అనుభవించిన ప్రతీదీ వాళ్లు చెప్పాలని ప్రయత్నించారు. పిల్లలకి మాటలు చుట్టూతా వున్న ప్రపంచంలోని అందంతోటి తమ బాంధవ్యాన్ని వ్యక్తం చేసే సాధనమయ్యాయి. రెండు, మూడు, నాలుగవ తరగతుల్లోని పిల్లలు తమ పెద్ద మిత్రుల గురించి – సమష్టి క్షేత్ర రైతులు, పనివాళ్లు – సోవియట్

ప్రజల కృషి గురించీ, ఆపిల్ చెట్లు మొగ్గ తొడగడం గురించీ, సమష్టి క్షేత్రపు పళ్లతోటలో ఆపిల్ పళ్లు పోగుచెయ్యడం గురించీ కాంపోజిషన్లు కూర్చారు. నాలుగేళ్ల కాలంలో ప్రతి పిల్లవాడూ నలభై, యాభై చిన్న కాంపోజిషన్లు కూర్చాడు. రెండు, మూడు, నాలుగవ తరగతుల్లోని పిల్లలు కూర్చిన కాంపోజిషన్లలో కొన్ని యివి.

అందాన్ని సృష్టించాలనే ప్రయత్నం కంటే మనుషులకి కష్టపడి పనిచేసే ప్రేరణ యింకొకటి వుండటం కష్టం. ఆ ప్రయత్నం సమష్టి మొత్తాన్ని ప్రేరేపించింది. పువ్వులని పెంచడంలో పాల్గోకుండా ఒక్క పిల్లవాడు కూడా లేడు. మొదటి వేసవిలో మా ప్రయత్నాలకి ప్రకృతి అనుకూలించలేదు, కాని పిల్లలు విజయం సాధిస్తామనే ఆశతో వున్నారు. రెండవ వసంతంలో మైదానం సమతలంగా, పువ్వులు వికసిస్తూ వుండే పచ్చిక తివాసీతో కప్పుకుపోయింది. మూడో సంవత్సరంలో మా యీ భాగం పచ్చదనంతోటీ, పుష్పాలతోటీ నిండిన సామ్రాజ్యంగా మారిపోయింది. పిల్లలు కథలు చెప్పుకోడానికీ, చదవడానికీ అక్కడ సమావేశమయేవాళ్లు.

**కిటికీ అద్దంపలకలమీద మంచు పువ్వులు యెక్కణ్ణుంచి వస్తున్నాయి? (తాన్యా, నాలుగో తరగతి):** "కిటికీ అద్దంపలకలమీద మంచు పువ్వులు యెక్కణ్ణుంచి వస్తున్నాయి?" అని నేను అమ్మని అడిగాను. అమ్మ చెప్పింది: "మంచు తాత చిన్న మనవడు వాటిని గీస్తాడు. అతను రాత్రిళ్లు తన తాతతో తిరుగుతూ ఉండి కిటికీ అద్దపు పలకలని బొమ్మలతో గీస్తాడు..." అతను దాన్ని యెలా చేస్తాడో చూద్దామని నేను అనుకున్నాను. నేను నిద్రపోదామని పడుకున్నాను కాని కళ్లు మూసుకోలేదు. అందరూ నిద్రపోయారు. కిటికీ అవతల చెట్టు కిర్రుకిర్రుమంటోంది. ఆ చిన్న కుర్రాడు కిటికీ దగ్గరకి వెండి పెన్సిల్‌తో వచ్చాడు. అతను అద్దంమీద ఒక అద్భుతమైన పువ్వు గీశాడు. గీస్తూ మెల్లిగా పాడాడు. పువ్వుకి పెద్ద ఆకులున్నాయి, చిన్న రెక్కలు ఉన్నాయి. పొద్దున్న, యెండ మెరుస్తూ వుంటే ఆ పువ్వు సజీవంగా వున్నట్టు కనిపించింది. నేను కలగన్నానో లేక నిజంగా చూశానో నాకు తెలియలేదు.

**శీతాకాలం మధ్యలో పుష్ప ప్రపంచం (గాల్యా, మూడవ తరగతి):** ఆకురాలు కాలంలో గ్రీన్‌హౌస్ దగ్గర చామంతి పువ్వులు పూశాయి. వాటికి చలి ఆవిర్లంటే భయం లేదు. కాని అప్పుడు ఉత్తరాన్నుంచి మంచు వచ్చింది. బాల్చీలో నీళ్లు గడ్డ కట్టాయి. చలినుంచి చామంతులని మేము కాపాడాలి. మేము వాటిని కుండీల్లో తిరిగి నాటి గ్రీన్‌హౌస్‌లో వుంచాం. మేం కాండాలని కత్తిరించాం. మరోసారి చామంతులు ఆకుపచ్చగా అయి, వికసించాయి. పొద్దున్న లేచినప్పుడు నేలమీద మంచు చూశాను. మంచూ, యెండా. నేను గబగబా గ్రీన్‌హౌస్ దగ్గరకి పరిగెత్తాను. చామంతులు వికసిస్తున్నాయి: తెలుపూ, ఆకాశనీలం, ముదురునీలం. అద్దం అవతల మంచు వుంది. చక్కని యెండలో చామంతులు చిరునవ్వు నవ్వాయి.

**మేము పొలంనుంచి యెలా వెళ్లాం (పవ్లో, రెండో తరగతి):** వేసవిలో అమ్మా, నేనూ యెండు గడ్డి కోసం వెళ్లాం. అమ్మ గడ్డిని బండిమీద పెట్టింది. ఆవిడ

గడ్డిని తాటితో కట్టింది. గుర్రాలు నెమ్మదిగా నడుస్తున్నాయి. మేము యెంతో యెత్తుగా గడ్డిమీద కూర్చున్నాం. సూర్యుడు అస్తమించాడు. ఆకాశంలో నక్షత్రాలు కనిపించాయి. నేను పడుకుని ఆకాశం కేసి చూశాను. మా బండి పెద్ద పడవకింద మారిపోయింది. మేం సముద్రాని కడ్డంగా పోతున్నాం. పైన నక్షత్రాలు వున్నాయి. అవి దగ్గరగా వున్నాయి. చెయ్యి యెత్తి ఒక చిన్న నక్షత్రాన్ని అందుకోవచ్చు. ఆకుపచ్చ తీరం యెక్కణ్ణో దూరంగా వుంది. కౌజుపిట్ట అక్కడ పాడుతోంది, గొల్లభామలు తమ ఫిడేళ్లు వాయిస్తున్నాయి. మా పడవ ఆగింది, చిన్న నక్షత్రాలు కదలుతున్నాయి. పడవ తీరం చేరింది. అమ్మ నుంచుంది, కాని నేను యింకొంచెం సేపు పడుకుందామనుకున్నాను.

**ఆకురాలు కాలంలో ఒక మబ్బుగా వున్న రోజు (షూర, మూడవ తరగతి):** పొద్దు తగ్గింది, రాత్రిళ్లు దీర్ఘమయ్యాయి. నదిమీద ఉదయ సమయాల్లో పొగమంచు లేచింది. ఎండెక్కడ? మబ్బు తునకల్ని చెదరగొట్టదేం? ఆకాశంనుంచి ఆకురాలు కాలపు సన్నటి జల్లులుపడ్డాయి. కొమ్మలు వంగిపోతూ వుంటే చెట్లు నిటారుగా వున్నాయి. ఆకులు రాలిపోయాయి. కొమ్మలమీదనుంచి పెద్ద పళ్లు అందుతున్నాయి. పొగమంచులో ఎక్కణ్ణుంచో, ఒక సముద్రపు కాకి అరిచింది. బహుశా అది దక్షణాదికి యెగరలేక మనుషులకి గోడు చెప్పుకుంటోందేమో. అడివిలో యెంత బావుందో. అడివిలోనుంచి వడ్రంగి పిట్ట టక్కుటక్కు మని కొట్టడం కొన్నిసార్లు వినిపించింది, ఆగిపోయింది. బంగారు ఓక్ చెట్టు కాయలు ఆకులమీద పడ్డాయి. ప్రపంచమంతా తెల్లటి పొగమంచుతో కమ్ముకుపోయింది.

**ఆకురాలు కాలం యెప్పుడు మొదలవుతుంది? (సెర్యోజ, నాలుగో తరగతి):** స్వాలో పిట్టలు పొద్దున వూరిమీదనుంచి హడావుడిగా యెగిరాయి. అవి ఒక పెద్ద గుంపుగా పోగయాయి. టెలెఫోన్ తీగల మీద వరసగా వాలాయి, దేన్ని గురించో కిలకిల మన్నాయి. శీతాకాలానికి దక్షిణాదికి యెప్పుడు యెగిరి పోవాలా అని నిర్ణయించుకుంటున్నాయి. మర్నాటి కప్పుడే అవి వెళ్లిపోయాయి. అవి యెక్కడున్నాయి? ఆకురాలు కాలం వస్తోందని వాటికి యెలా తెలుసు, రోజులు యింకా వెచ్చగానే వున్నాయికదా. సూర్యుడు లాలిస్తూ ప్రకాశిస్తున్నాడు. ఆకురాలు కాలపు ప్రకాశవంతమైన సాయంత్రాలంటే నాకు యిష్టం. సాయంసంధ్య అరుణ వర్ణాలు చాలాసేపుంటాయి. పోప్లార్ చెట్ల మీద ఆకులు అరుణంగా కనిపిస్తాయి. అవి సూర్యాస్తమయపు ప్రతిబింబాలు. చెరువు దగ్గరే సాయంత్రమప్పుడు గొడవగా వుంటుంది: దక్షిణాదికి పోయే పక్షులు అక్కడ రాత్రికి చేరుతాయి. ఉదయానికల్లా చెరువు దట్టమైన పొగమంచుతో కమ్ముకు పోతుంది, గడ్డిమీద మంచు వుంటుంది. మంచు నెరసిన జుట్టులా వుంటుంది, వేసవిలో లాగా కాదు. ఆకురాలు కాలం మొదలవుతోంది.

**జీవితంలో ముఖ్యమైన దేమిటి? (వార్యా, నాలుగో తరగతి):** జీవితంలో

ముఖ్యమైన దేమిటి? గనిపనివాళ్ల దృష్టిలో బొగ్గు. బొగ్గు లేకపోతే యంత్రాలు ఆగిపోతాయి, లోహాలు వుండవు, ప్రజలు గడ్డకట్టుకుపోతారు...

లోహపు పనివాళ్ల దృష్టిలో ముఖ్యమైనది లోహం. లోహం లేకుండా యంత్రాలు లేవు, బొగ్గు లేదు, రొట్టె లేదు, బట్ట ల్లేవు.

రైతుల దృష్టిలో ఆహారం ముఖ్యమైనది. ఆహారం లేకుండా ఎవడూ పనిచెయ్యలేడు – గనిపనివాళ్లు కాదు, లోహపు పనివాళ్లు కాదు, విమానాలు నడిపేవాళ్లు కాదు, సరిహద్దు రక్షకులు కాదు, యెవళ్లూ పనిచెయ్యలేరు.

మరి వాళ్లల్లో యెవరు ఒప్పు? జీవితంలో ముఖ్యమైనదేమిటి? ముఖ్యమైంది శ్రమ. శ్రమ లేకుండా బొగ్గు లేదు, లోహం లేదు, ఆహారం లేదు.

**నిప్పుగుర్రం (సాన్య, నాలుగో తరగతి):** నాకు యిది అమ్మ చెప్పింది. వూళ్లో మొట్టమొదటి సమష్టి వ్యవసాయ క్షేత్రం స్థాపించబడ్డప్పుడు రైతులు ఒక గుర్రాన్ని కొన్నారు. ఆ గుర్రం పేరు నిప్పు. ఎవరూ దాన్ని మచ్చిక చెయ్యలేకపోయారు. మహా ధైర్యవంతులూ, సాహసవంతులూ కూడా దాని దగ్గరకి వెళ్ళాలంటే ఒణికేవాళ్లు. అది నేలని గిట్టలతో చిమ్మేది, పళ్లు కొరికేది, బుస కొట్టేది.

యూర్కో అనే యువకుడొకడు మొత్తానికి ఆ పొగరమోతు గుర్రానికి జీను వేశాడు. అది ముందరి కాళ్లమీద లేచి వెనక కాళ్లమీదా నిలబడి, సకిలించింది. రోడ్డుమీదకి గెంతింది. యూర్కోని కింద పడేసింది. కొన్ని కిలోమీటర్లు పరిగెత్తి వూరిచివర ఆగింది. యిద్దరు చిన్న పిల్లలు రోడ్డుమీద ఆడుకుంటున్నారు. వాళ్లు ఆ గుర్రం దగ్గరికి పరిగెత్తి వెళ్లి దాని ముందరి కాళ్లు రెండూ కౌగిలించుకున్నారు. భయంతోటి వాళ్ల అమ్మ గడ్డకట్టుకు పోయింది. ఆ గుర్రం వాళ్లని చంపెయ్యనేనా చంపేస్తుంది, కాళ్లతో తొక్కెయ్యనేనా తొక్కేస్తుందని ఆవిడ అనుకుంది. కాని గుర్రం కదలకుండా నుంచుంది. తన కాళ్లు కదిపి మళ్లీ నుంచుంది. వాళ్లని ముట్టుకోవాలంటే తనకి భయం అన్నట్టుగా పిల్లల కేసి ఓరగా చూసింది. కాని పిల్లలు ఆడుకుంటూనే వున్నారు. అప్పుడు నిప్పు గుర్రం పిల్లల పక్కనుంచి జాగ్రత్తగా వెళ్లి వూళ్లో గుండా పరిగెత్తింది. వాళ్లు దాన్ని పట్టుకుని శాలలో పెట్టేశారు.

**ముళ్లపందులు (ఫేద్య, నాలుగో తరగతి):** మా గడప ముందరి వసారాలో కొన్ని ముళ్లపందులు వుంటున్నాయి. సాయంత్రమప్పుడు మొత్తం కుటుంబం అంతా యివతలకి వచ్చి చెరువుకు బయల్దేరేవి. ముసలి ముళ్లపంది ముందు పోతుంది, అయిదు చిన్న ముళ్లపందులు దాని వెనకాల వెడతాయి. తల్లి ముళ్లపంది వెనకాల ఆఖర్న వస్తుంది. అవి అక్కడ యేం చేస్తాయి? నేను చూసి కనిపెట్టాను: అవి నీళ్లు తాగి స్నానం చేస్తాయి. అప్పుడవి నేలని పంజాలతో తవ్వి కొన్ని దుంపలు లాగి తింటాయి. తల్లీ తండ్రీ ముళ్లపందులు అలా చేస్తాయి. కాని పిల్ల ముళ్లపందులు ఆడుకుని గంతులేస్తాయి. ఎవళ్లూ మసలని ఒక మూలని పట్టేసాయవి.

ఒక రోజున హఠాత్తుగా ఒక కుక్క ప్రత్యక్షమైంది. అది ముసలి ముళ్లపంది దగ్గరికి పరిగెత్తింది. ఆ ముళ్లపంది బంతిలా ఉండ చుట్టుకు పోయింది. అన్ని ముళ్లపందులూ బంతుల్లా ఉండ చుట్టుకు పోయాయి. కుక్క ముసలి ముళ్లపందిని పళ్లతో కరుచుకుని చెరువు దగ్గరకి తీసుకు వెళ్లింది. కుక్క దాన్ని నీళ్లల్లో పెట్టింది. కాని ముళ్లపంది కుక్క చూస్తూ వుండగా ఒడ్డుకి యీదుకు పోయింది. అప్పుడు కుక్క దానితో ఆడుకోవడం మొదలెట్టింది. కాని నేను కుక్కని తరిమేశాను.

మళ్లీ వసంతం నాటికి ముసలి ముళ్లపంది ఒకత్తే గడపముందరి వసారాలో వుంది. మిగతావి యెక్కడికి పోయాయి? బహుశా అవి యింకో చోటికి పోయి వుంటాయి. కాని ఆ ముసలి ముళ్లపంది కదల దలచుకోలేదేమో. నేను వసారాలో ఒక పాలపళ్లేన్ని పెట్టాను. ముళ్లపంది పాలు తాగింది. నేనంటే దానికి భయం పోయింది. నేను దాన్ని లోపలికి వచ్చేటట్టు చేశాను. దీపం వెలిగించాను. ముళ్లపంది దీపం ముందు నుంచుని చూసింది. నేను ఓ పాత న్యూస్ పేపరు నేలమీద పెట్టాను. ముళ్లపంది దానితో ఆడుకోవడం మొదలుపెట్టింది. రాత్రి వసారాలోని తన యింటికి పోయింది.

**అర్తేమ్ మిహైలొవిచ్ - యుద్ధ వీరుడు (దంకో, నాలుగో తరగతి):** అర్తేమ్ మిహైలొవిచ్ మా యువ పయనీర్ సభల్లో ఒక దానికి వచ్చారు. సమష్టి వ్యవసాయ క్షేత్రపు కాయగూరల తోటలో ఆయన పనిచేస్తూ వుంటాడు. ఆయనేదో తాతే నని మేము అనుకున్నాం కాని ఆయన 1918-1922 అంతర్యుద్ధపు వీరుడు. తను దాడిలో పాల్గొన్న విధమూ, శత్రువులని యెదిరించి పోరాడిన విధమూ ఆయన మాకు చెప్పాడు. ఒక రోజున ఆయన గాయపడ్డాడు, ఆయన్ని బందీగా పట్టుకున్నారు. ఆయన్ని కాల్చేద్దామని శత్రువులు తీసుకుపోయారు. వాళ్లు ఆయన్ని చంపలేదు, కాని మళ్లీ తీవ్రంగా గాయపరిచారు. ఆరాత్రి ఆయన పాక్కుంటూ వెళ్లిపోయి ఒక రైతు గుడిసె దగ్గర ఆగి సహాయం అడిగాడు. వాళ్లు ఆయన్ని అటకమీద దాచి, నయం చేశారు. ఆయన మళ్లీ శత్రువులతో పోరాడ్డానికి వెళ్లాడు. మా తాత అర్తేమ్ అలాంటి మనిషి. నేను కూడా ఆయనలాగే వుండాలనుకుంటున్నాను.

**విజయోత్సవ దినం (వొలోద్య, మూడవ తరగతి):** విజయోత్సవ దినం వచ్చింది. యుద్ధం ముగిసిన రోజది. మన సోవియట్ సైన్యం ఫాసిస్టులమీద విజయం సాధించిన రోజు. తూటాలు పేలడం, బాంబులు బద్దలవడం ఆగింది. ప్రతియేడూ యీ రోజున ప్రజలు విజయోత్సవం జరుపుకుని మృతులని స్మరిస్తారు. లెనిన్ కమ్యూనిస్టు పార్టీని స్థాపించి ప్రజలందరికీ చెప్పాడు: "ఉక్రేనియన్లూ, రష్యన్లూ, బైలోరష్యన్లూ, జార్జియన్లూ, మాల్దేవియన్లూ, స్నేహంగా జీవించండి - అప్పుడు మిమ్మల్నెవరూ జయించలేరు."

మేము సమష్టి కాంపోజిషన్లు కూడా కూర్చాం. మబ్బుగా వున్న ఒక రోజున

పిల్లలు "స్వప్నాల దిక్కు"లో మండే నెగడు చుట్టూతా కూర్చున్నారు. సుదూర ఉష్ణ ద్వీపాలని గురించి వాళ్లకి చెప్పాను. నదీ, పుచ్చకాయల తోటలో మా సెలవు రోజులూ వుండటంవల్ల పిల్లలు వేడిగా వున్న వేసవిని, గుర్తుపెట్టుకున్నారు – యీ జ్ఞాపకాలనుంచి ఒక కాంపోజిషన్ తయారైంది, తర్వాత పిల్లలు దాన్ని వాళ్ల నోటు పుస్తకం "మన మాతృభాష"లో రాశారు.

**మేం పుచ్చకాయల తోటలో యెలా గడిపాం:** వేడి నేలమీద పెద్ద పుచ్చకాయలున్నాయి. నీలంవీ, ఆకుపచ్చవీ, బూడిదరంగు నీలంవీ. పొద్దున్న అవి మంచుబిందువులతో కప్పడిపోతాయి. గడ్డిమీద, మా గుడిసెమీద మంచు వుంది. ఒక రోజున దంకో పెందరాళే లేచి ఒక పెద్ద పుచ్చకాయని తెచ్చాడు. దాన్ని ముక్కలు కింద కోశాడు. యెవళ్లేనా లేచీ లేవగానే వాళ్లకి చల్లని పుచ్చకాయ ముక్క యిచ్చాడు. "ఆఖర్న లేచేవాడికి మాంచి రుచిగా వుండే – "మామ్మ." – పుచ్చకాయముక్క మధ్యది యిస్తా," అన్నాడతను. సాష తప్ప అందరూ లేచారు. మేము కూర్చుని నిరీక్షిస్తున్నాం – వాడు యెప్పుడు లేస్తాడా అని. చూసి చూసి విసుగొచ్చింది మాకు. మేము "మామ్మ" ముక్కని తినేశాం. యింకో పుచ్చకాయ తెచ్చాం. ఆ పుచ్చకాయలోని "మామ్మ" ముక్కని అతనికిచ్చాం.

ప్రశాంతంగా పొగమంచు కమ్మిన ఉదయం. పొగమంచు కొండ కనుమనుంచి వ్యాపించి పుచ్చకాయల తోట అంతా కమ్మింది. మేఘాల మాటునుంచి సూర్యుడు తొంగిచూశాడు, పుచ్చకాయలమీద యెండ ప్రకాశించింది. అవి పుచ్చకాయల్లా కాదు, ముదురు నీలంగా, ఆకుపచ్చగా, బూడిద రంగుగా వున్న గాజు బంతులు తెల్లగా వున్న నదిమీద తేలుతున్నట్టుగా వున్నాయి.

పగలు పుచ్చకాయల తోటమీద వేడిగాలి వీచింది. వినీలాకాశంలో భరద్వాజ పిట్టలు పాడుతున్నాయి. అవి పుచ్చకాయల తోటమీద యెందుకు వాలలేదు? భరద్వాజ పిట్టలు గోధుమ, బార్లీ, ధాన్యం, ముఖ్యంగా బక్‌వీట్ పొలాల్లోనే యెందుకు తమ గూళ్లు కట్టుకుని పిల్లల్ని సాకుతాయి?

పుచ్చకాయల తోట పక్కన కొండ కనుమదగ్గర మాకు ఓ చీమలపుట్ట కనిపించింది. చీమలు యెలా యెక్కడికో హడావుడిగా వెళ్లిపోతున్నాయో తాత చూశాడు. దగ్గరనే యెక్కణ్ణో ఓ పెద్ద చీమలపుట్ట వుందనీ, చీమలే అది యెక్కడ వున్నదీ మనకి చెబుతాయనీ తాత అన్నాడు. చీమల దారిలో ఆయన కొన్ని పుచ్చకాయల ముక్కలు పెట్టాడు. తియ్యటి పుచ్చకాయ ముక్కని చీమలు పట్టేశాయి. చిన్న పంచదార రేణువుల్ని అవి యెలా పట్టుకుని మోసుకుని పోతున్నాయో చూశాం. వాటి వెనకాలే చీమల పుట్టదాకా వెళ్లాం. ఒక గుబురుకింద చిన్న బూడిద రంగు దిబ్బ సజీవంగా వున్నట్టుంది. చీమలు చిన్న పంచదార రేణువులని పుట్టలోకి తీసుకుపోయాయి. అవి తిరిగి మళ్లీ పుచ్చకాయల తోటలోకి వచ్చాయి. చీమలు అడివికీ మనుషులకీ యెంత ఉపయోగమో తాత మాకు చెప్పాడు. ప్రతి చీమలపుట్టా

కొన్ని ఎకరాల అడివిని క్రిమి కీటకాలనుంచి రక్షిస్తుంది. చీమలపుట్టని కాపాడ మొదలెట్టాం, తర్వాత తాత మాకు యెలా కొత్త చీమల పుట్టలు పెట్టించవచ్చో నేర్పాడు.

మేం యింటికి పోయేటప్పుడు తాత మాకు తలా ఒక పెద్ద పుచ్చకాయా యిచ్చాడు. ఆ పుచ్చకాయలు మా కిటికీల్లో చాలాకాలం వున్నాయి. అవి మాకు వేడిగాలినీ, విశాలమైన పచ్చిక బీళ్లనీ, భరద్వాజ పిట్టల్నీ, తాతనీ, మాకు దగ్గర్లోనే వుండే కీచురాయి స్పష్టమైన పాటనీ గుర్తుకు తెచ్చేవి. ఆ కీచురాయి యిప్పుడెక్కడ వుంది?

భాషా సౌందర్యం అన్నిటి కంటె కవిత్వంలో యెక్కువగా మూర్తీభవించి వుంది. కవిత్వాన్ని గాని, పాటలని గాని మెచ్చుకుంటూ పిల్లలు మాటల సంగీతం వింటున్నట్టుంటారు. ఉత్తమమైన కవిత్వంలో మాటలు స్వభాషలోని సున్నితమైన అనుభూతి ఛాయలని వెల్లడి చేస్తాయి. అందువల్ల పిల్లలు కవిత్వం కంఠతా పడతారు. తన హృదయంలోకి లోతుగా చొచ్చుకుపోయిన మాటలని వల్లించడంలో పిల్లవాడు అసలైన తృప్తిపొందుతాడు.

పిల్లలు కవిత్వపు భాషలోని సంగీతాన్ని ఆస్వాదించి అనుభవించేటట్టు వుండాలని నేను ప్రయత్నించాను. చుట్టూతా వుండే ప్రపంచంతోటి సమ్మోహితులై పోయి పిల్లలు ప్రకృతి ఒడిలో గడిపిన ఆ క్షణాల్లో వాళ్లకి నేను కవిత్వం చదివి వినిపించాను. ఒక రోజున అనుకోకుండా పొలంలో అద్భుతమైన దృశ్యం కనిపించింది: మాముందు తేటగావున్న చెరువు నీటిమీద విల్లో చెట్లు ప్రతిఫలిస్తూ వున్న అందమైన దృశ్యం గోచరించింది. పిల్లలకి ప్రకృతిని గురించిన షెవ్‌చేంకో పద్యపాదాలు కొన్ని వినిపించాను. వాళ్లు ఆ పాదాలని వల్లించారు. మాటల కలయిక ఒక సజీవ చిత్రాన్ని సృష్టించిందనీ, ఒక కొత్త రసాత్మకతని మాత్రమే కాక చుట్టూతా వున్న ప్రపంచానికి కూడా కొత్త అందాన్ని తెచ్చిపెట్టే సంగీత గమకం పుట్టించిందనీ వాళ్లు అనుకున్నారు. ప్రపంచ కవిత్వపు ఉత్తమమైనదాని ప్రభావంలో పిల్లలు సంగీతంతో మోగే నూతన భాషని సృష్టించాలని ఉత్సాహపడ్డారు. వాళ్ల హృదయాలు కవిత్వపు ప్రేరణతో నిండిపోయాయి: పసి బాల బాలికలు పద్యాలు అల్లారు. మొదట లరీసా పొలం పైనుంచి దూరంగా చూసింది. ఆమె కళ్లు వెలిగాయి, నెమ్మదిగా ఆమె కొన్ని మాటలు ఉచ్చరించింది. అవి విండానికి యిలా ధ్వనించాయి.

"పసుప్పచ్చ గోధుమ పొలాలు అలల్లా ఆడుతాయి."

"ముదురు నీల పర్వతాలు పొగమంచులోన వణకుతాయి" అన్నాడు సెర్యోజ ఆమె భావాన్ని అందుకుంటూ.

ప్రతివాళ్లూ సంతోషంతో హుషారుగా వున్నారు; వాళ్లంతా తమ సంగీత పదాలు కూర్చుకోవాలనుకున్నారు. కవితావేశంతోటి పిల్లవాడి హృదయం నిండిపోయినప్పుడు యింద్రధనస్సు వర్ణాలతో క్రీడీస్తూ, పొలాలా మైదానాలా సువాసనతో నిండిపోయి మాట సజీవంగా, సౌష్ఠవంగా వుంటుంది, పిల్లవాడి

హృదయంలోకీ, జీవితంలోకీ చొచ్చుకుపోతుంది. పిల్లలు వాటిల్లో తమ అనుభూతుల్నీ ఆలోచనలనీ అనుభవాలనీ వ్యక్తం చేసే దారులు వెతుకుతారు. పిల్లవాడి హృదయంలో కవితావేశాన్ని మేల్కొల్పడం అంటే అతనికి ఆలోచనకిగల మరో జీవనదాయక ఆధారాన్ని తెరవడమే.

భాషలోని వస్తువునీ, దృగ్గోచర విషయాన్నీ తెలియజేసే దాన్ని మాత్రమే కాక మాట, గాఢమైన వ్యక్తిగత గ్రహణనీ, అనుభవాన్ని కూడా అందిస్తుంది.

విద్యార్థుల్ని యువ కవులుగా తయారుచెయ్యడానికే కాదు, ప్రతి యువ హృదయాన్నీ ఉన్నతం చెయ్యడానికి కవితాత్మక సృజనని నేర్పాలి. పిల్లల హృదయాల్లో కవితావేశాన్ని జాగృతం చెయ్యడానికి, ప్రతివాళ్ల హృదయంలోనూ భాష వైయక్తిక కవితావసరాన్ని సంతరించుకునేటట్టు చూశాను.

శీతాకాలపు ప్రశాంత ఉదయం అది. చెట్లు తెల్లటి గడ్డ కట్టిన మంచుతో కప్పడిపోయాయి. సున్నితమైన మంచు ఆకులతో కమ్ముకుపోయి కొమ్మలు వెండితో చేసినట్టుగా వున్నాయి. మేం బడి తోటలోకి వెళ్లాం. ముద్దొచ్చే అపూర్వమైన ఆ అందం చెడిపోతుందేమోననే భయంవల్ల మేం కొమ్మల్ని తాకలేదు. మేము ఆగాం, నేను శీతాకాలం గురించి పుష్కిన్, హైనె పద్యాలు చదివాను. ఆ అందంతోటీ, కవిత్వంతోటీ ముగ్ధులైపోయిన పిల్లలకి మంచు కప్పిన చెట్లని మాటలతో వర్ణించడానికీ, కవిత్వం కల్పించడానికీ మాటలు దొరికాయి. వాళ్లు దీన్ని సమష్టిగా చేశారు, ఒక విభాగం ఒకసారిగా. మేమా మంచు కమ్మిన తోటకి కొన్నిసార్లు వచ్చాం. యిదివరకే కల్పించిన కథల్లోని అద్భుత చిత్రాలు కవిత్వంలో సజీవంగా వచ్చాయి:

మాయా కమ్మరి వచ్చాడు
బంగారు కొలిమిని తెస్తూ
తోటలో చెట్లని కప్పేదానికి
వెండిని దాంట్లో కరిగించాడు.
రాత్రంతా నిర్మించాడు
బంగారు సమ్మెటతో మోదుతూ....
మాతోటంతా వెండిమయం.
ఒక ఆకొక ఆకుని తాకింది
తోటంతా మోగింది,
ఏడీ, మాయా కమ్మరి ఎక్కడ?
మళ్లీ సూర్యుడిలోకే ఎగిరాడు
తన బంగరు రెక్కల తోటే.
యింకా వెండిని తీసి

తన సంచీలో నది పెట్టి
మళ్లీ వచ్చును మన దగ్గరికి.
తోటప్పుడు మరి గానం చేయు....
సూర్యుడు వేచు కమ్మరి కోసం
ఎక్కడికెడితివి మిత్రమా?
మరిచావా ఓ కమ్మరీ
నా దండను తయారుచెయ్యాలీ?
సూర్యుని ఎర్రని కిరణము
తొంగిచూచు మా వెండి తోటలోకి
సూర్యుడు అచ్చెరువందాడు
దాని అందం...

ప్రతి పిల్లవాడూ ఒక కవే. ఏదో మంత్రమహిమవల్ల పిల్లవాడికి కవితావేశం వస్తుందని అనుకోవడం అమాయకత్వం. సహజ ప్రతిభ గురించి నాకు మమకారం లేదు, ప్రతి పిల్లవాడూ సహజంగానే కవి అని నేను అనుకోను. సౌందర్యంపట్ల మానవానుభూతి హృదయంలోని కవిని తట్టి లేపుతుంది. అనుభూతిని దోహదంచేసి పెంచకపోతే ప్రకృతి అందంపట్లా, భాష అందంపట్ల విద్యార్థి ఉదాసీనంగా వుండిపోతాడు, కోనేటిలోకి రాయి విసరడమూ, కోకిల గానమూ ఒకటిగానే కనిపించే జీవిగా మిగిలి పోతాడు. పిల్లవాడికి చదవడమూ లెక్కలు నేర్పడం యెంత ముఖ్యమో కవితావేశపు ఆనందాన్నీ, కవితాత్మక సృజన సజీవధారనీ అతని హృదయంలో మేల్కొల్పడం కూడా అంతే ముఖ్యం. కొంతమంది పిల్లల్లో యీ ధార మిగతా వాళ్లల్లో కంటే యెక్కువ బలంగా వుంటుంది. కొంతమంది పిల్లల్లో కవితావేశం పిచ్చిగా తాత్కాలికంగా యెగిరేదో లేదా మెరుపులాగా దూసుకుపోయేదో కాదు, ఒక స్థిరమైన ఆధ్యాత్మిక అవసరం.

కవితాత్మక సృజన భాషా సంస్కృతికి గల అత్యున్నత స్థాయి. అది వ్యక్తి సంస్కృతీ సారాన్నే వ్యక్తం చేస్తుంది. ప్రతి ఒక్కళ్లూ కవితాత్మక సృజనని అనుభూతం చేసుకోగలరు. దానికేమీ ప్రత్యేకమైన ప్రతిభ అక్కర్లేదు, అది వ్యక్తిని ఉన్నతుణ్ణి చేస్తుంది. ఎంతో సున్నితమైన యీ సృజనాత్మక రంగం గాఢంగా వ్యక్తిగతంగా వుండాలి, ప్రతి పిల్లవాడి హృదయానికి సంబంధించిందిగా వుండాలి.

మూడో తరగతిలో లరీసా, సాన్య, సెర్యోజ, కాత్యా, వార్యా, కోల్య, తాన్యా లీదాలు తాము రహస్యంగా కూర్చిన పద్యాలు నాకు మట్టుకు చదివి వినిపించడం మొదలెట్టారు. యింకా కొంతమంది పిల్లలు కూడా పద్యాలు కూర్చారని నాకు తెలుసు, కాని వాళ్లు తమ ఆసక్తిని గురించి చెప్పడానికి చాలా సిగ్గుపడ్డారు. అది చాలా బాగుంది.

పిల్లలు పద్యాలల్లడంలో వింతేమీ లేదు. యిది మామూలుగా వుండే మానసిక చర్య, సామాన్యమైన సృజనాత్మక జ్వాల, అది లేకుండా సంపూర్ణమై బాల్యాన్ని వూహించడం అసాధ్యం. కాని పిల్లల ఆధ్యాత్మిక జీవితాలు అంత సంపన్నమైనాయన్నదే నాకు చాలా సంతోషం కలిగించింది.

కవితావేశంతోటి కోల్యా ఉన్నతుడయ్యాడన్నది నాకు ముఖ్యంగా ఆనందం కలిగించింది. మా స్నేహం గాఢతర మవుతోంది. బడితోటలో నేను యేకాంతంగా వుండటానికి యిష్టపడే ఒక మూల వుంది. నేను వాతావరణం బాగా వున్నప్పుడు అక్కడ నా ఫిడేలు వాయిస్తూ కులాసాగా వుండేవాణ్ణి. యాదృచ్ఛికంగా కోల్యా ఆ స్థలాన్ని "కనిపెట్టేశాడు." బహుశా అతను కూడా యేకాంతంగా వుండటానికి చోటుకోసం వెదుకుతున్నాడేమో. నన్ను చూడగానే కంగారు పడిపోయి వెళ్లిపోదామనుకున్నాడు, కాని నేనే అతన్ని వుండమన్నాను. వేసవి సాయంత్రపు అందాన్ని గురించి నా యిష్టతనీ సంగీతంలో వ్యక్తం చెయ్యాలని ఆశిస్తూ నేను ఫిడేలు వాయించాను. ఆ ఉత్సాహంలో నేను యెంత కొట్టుకుపోయానంటే అక్కడా చిన్నపిల్లాడు కూర్చున్నాడన్న దృష్టే నాకు లేకపోయింది. నేను అతనికి ఫిడేలు యిచ్చాను. నేను వాయించిందే వాయిద్దామనుకున్నాడు కోల్యా, కాని చేతకాకపోయింది. వాయించడం ఆపుచేశాడు. సూర్యాస్తమయాన్నిచూసి ఆనందిస్తూ, ప్రశాంత సాయంత్రపు సవ్వడులు వింటూ, మేము నిశ్శబ్దంగా కూర్చున్నాం. పరివేష్టిత ప్రపంచపు అందం మా యిద్దర్నీ దగ్గరికి చేర్చిందేమో కోల్యా ప్రకృతిని గురించిన తన పద్యాన్ని నాకు వినిపించాడు. యిదీ అది:

పచ్చ పచ్చని ఆకుల్లో
శ్యామల వర్ణపు పువ్వులు
తోటలోకి రాత్రి వేళ
యెగిరిందొక బుల్ బుల్
పాడిందది నీలాంబర
గుబురుల్లోనుంచి
తోటలోన పొద్దున్నే
ఉరుమొక్కటి ఉరిమింది.
జడి వాన కురిసి పువ్వుల్ని
జలకాలాడించింది.
తోటమీద వెండి మబ్బు
తేలితేలి ఆడింది
పువ్వూ ఆకాశమూ
ఒకటే నీలాంబరమూ.

ఆ సాయంత్రం కోల్యా, నేనూ తోటలో చాలాసేపు కూర్చున్నాం. ఆ పిల్లవాడు అక్కడికి రావడం ఆరంభించాడు, ప్రతిసారీ ఒక చిన్న పద్యం చదివేవాడు. అలాంటిదే యింకో పద్యం యిక్కడ ప్రస్తావిస్తున్నాను. నా హృదయంలో యెంతగా అది హత్తుకుపోయిందంటే అతను దీన్ని చదివిన యేడాది తర్వాత నేను రాసుకున్నాను:

*కొండ వెనక మణిగాడు ఎర్రని సూర్యుడు*
*ఆకాశం అరుణిమతో భగభగ మండింది.*
*రేపు పగలు గాలి వుండు రోజు*
*అల్లరిగా బొంతకాకి గుంపొక్కటి ఎగిరింది*
*పడమటి దిక్కుకు ముందు నల్లని అడివికి పిదప.*
*నిటారైన బూరుగుపై ఆకులు గలగలలాడె.*
*అంత సద్దు మణిగింది. దూరంగా యెక్కడనో*
*కిరుకిర్రు మనే బండిధ్వని.*
*చీకటిపడె, ఆకాశం అరుణిమ కోల్పోయె.*
*వేడంతా బూడిదలో కప్పడి పోయింది.*
*మిణుకుమనే నక్షత్రం మెరిసిందాకాశంలో*
*రాత్రి ప్రవేశించింది.*

కోల్యా తన పద్యాలు రాసుకోవడం లేదని నాకు తెలిసింది. అతను వాటిని వూరికే జ్ఞాపకం పెట్టుకునేవాడు. ఆ పద్యాలు అతని ధారణలోనూ, అతని హృదయంలోనూ నిలిచివుండేవి. మా విద్యార్థులు చాలామంది తెల్లటి కాగితం ముందు కూర్చుని పద్యాలు అల్లినవాళ్లు కారు. ఆ పద్యాలు రాయడానికి పుట్టినవి కాదు. బొమ్మలు గీయకుండా వుండలేనట్టే పిల్లలు పద్యాలు అల్లకుండా వుండలేరు.

షూర కూడా నాతో బాగా చనువయ్యాకా తన రహస్యాన్ని నాకు చెప్పాడు. ఒక శీతాకాలం రోజున మంచుమీద స్కీ జారడానికని మేము అడివిలోకి వెళ్లాం. సాయంత్రపు ఎండలో పైన్ చెట్ల కాండాలు యినుముతో పోతపోసినట్టుగా వున్నాయి. ప్రకృతి అందాన్ని మెచ్చుకొంటూ మేం ఒక బయలు ప్రదేశంలో నుంచున్నాం. ఆ క్షణాల్లో షూర వడ్రంగి పిట్టని గురించి పద్యాన్ని వినిపించాడు:

*పైన్ చెట్టు బోదె కింద వెయ్యి తంత్రులున్నాయి.*
*వడ్రంగి పిట్ట కూర్చుండును చెట్టు ఎత్తు కొసన.*
*ముక్కు తోడ పొడుచును పై తంత్రిని,*
*మోగును అది యెవ్వరికీ వినిపించనంత మెల్లిగా*
*సూర్యుని సమీపంలో తీగ మరీ సన్నం*
*నేలమీద సరేసరి తీగ తీగకాదు.*

నేలమీద మంద్రంగా మోగును ఒకగంట
ఎర్రటికాండం కిందన వున్న కంచుగంట
వడ్రంగి పిట్ట గెంతుతుంది తీగను శ్రుతిచేస్తూ
ముక్కు తోటి తడుతూ, అంత తీగమోగు
అడవి పాడుతుంది. కానీ వడ్రంగి పిట్ట
వెదుకు వేరే తీగకై.

వార్యా తన చిన్నతనంలో డజన్ల కొద్దీ పద్యాలు అల్లింది. ఆమె మనసు సున్నితమైందీ సుకుమారమైందీనీ. వేసవి సాయంత్రపు అందానికి ముగ్ధురాలైపోయి, ఆకాశం అద్దంలాంటి నీళ్లల్లో ప్రతిఫలించే కొలను గట్టున, విల్లో చెట్లు నీళ్లమీదకి వంగి వుంటే వాటిని చూస్తూ నుంచున్న వార్యాని నేను గమనించాను. తర్వాత కొన్ని రోజులకి ఆమె ఆ వేసవి సాయంత్రాన్ని గురించిన పద్యం చదివి వినిపించింది:

నీలాకాశం పచ్చనిచెట్టూ తెల్లనిగుడిసెలు–
ప్రతిఫలించు నీళ్లల్లో అన్నీ.
నీలాకాశపు అద్దం ముందు నుంచున్నాను
ముందున్నది లోకం అంతులేనిది.
అరుణవర్ణ సూర్యాస్తమయాలూ, వెండిమబ్బులూ
మిణుకుమనే నక్షత్రాలూ అవిగో,
సూర్యుని దగ్గర సెలవు తీసుకుని
దూరంగా మరి వున్న బాటపై
ఎగురుతోంది ఒకపక్షి
ఆహా యేమీ అద్భుత లోకం
మురిపించే సంగీతం వున్నది
వినండి అదుగో మీటిరి ఎవరో
మందమైన ఒక తీగను
పాడసాగింది నీలాకాశం
చెట్లు పాడాయి, గట్లు పాడాయి.
సంద్రం వెనకన సూర్యుడు
జ్వాలతో మండుతూ వుంటే,
తెల్లటి పావురాళ్లు గూళ్లకి
ఎగురుతూ వుంటే,
డొల్లమీద ఒక గుడ్లగూబ
తన కాళ్లని తుడుస్తూవుంటే

చీకటి చరియలో అలిసిపోయి
గాలి మణిగి వుంటే
కొలను గట్టున సాయంత్రం
యీ సంగీతం నే వింటాను.

ప్రతి యేడూ ఆకురాలు కాలం సమీపిస్తూ వుంటే పిల్లలు వేసవికి వీడ్కోలు చెప్పేవాళ్లు. మేము మా ఓక్ చెట్టు దగ్గరికి వెళ్లి, గడిచిన వేసవిని గురించీ, కొంగల గురించీ, వెచ్చటి ఆకురాలుకాలపు రోజుల గురించీ పద్యాలు అల్లేవాళ్లం. మేము నాలుగోయేడు వేసవికి వీడ్కోలు చెప్పినప్పుడు పిల్లలు మాకు అత్యంత ప్రియమైన దాన్ని గురించి, మన మాతృదేశం గురించి, ఉమ్మడిగా పద్యం అల్లారు.

అన్నిటికంటే ముఖ్యమైంది, ప్రశంసనీయమైంది యేమిటంటే, పిల్లలు వూహల్లో సృష్టించిన స్పష్టమైన చిత్రాలు. తమ ఆధ్యాత్మిక జీవితాల్లో కవితావేశం ఒక అవసరమైన పిల్లలు అత్యుత్తమమైన కవిత్వం చదివేటట్టు చెయ్యాలని నేను ప్రయత్నించాను. మేము ఒక చిన్న కవిత్వ గ్రంథాలయం సేకరించాం. యింకా కవిత్వ సృజన ఒక ఆధ్యాత్మిక అవసరంగా పరిణమించని వాళ్లకీ, కవిత్వ భాషకి భావుకత్వాన్ని అభివృద్ధి చెయ్యాల్సి వున్న అవసరం వున్నవాళ్లకీ యిది ముఖ్యంగా అవసరం. పిల్లల కవిత్వ సృజన వరప్రసాద లబ్ధంగా చూడకూడదని నేను మళ్లీ అంటున్నాను. చిత్ర లేఖనంలాగానే అదీ ఒక స్వాభావిక రూపం: ప్రతివాడూ చిత్రలేఖనం చేస్తాడు, పిల్లలంతా యీ దశ గడుస్తారు. కాని ఉపాధ్యయుడు పిల్లలకి చుట్టూతా వున్న ప్రపంచపు అందాన్నీ, భాష అందాన్నీ వాళ్లకి యెరుకచేసినప్పుడే కవిత్వ సృజన సామాన్యమైన విషయంగా పిల్లల ఆధ్యాత్మిక జీవితంలో తటస్థపడుతుంది. సంగీతం లేకుండా సంగీతంపట్ల అభిమానాన్ని బోధించలేనట్లే, సృజనాత్మకత లేకుండా కవిత్వ సృజనపట్ల అభిమానాన్నీ నేర్పలేం.

పుష్కిన్, హైనె, షెవ్‌చేంకో, లేస్యా ఉక్రయిన్‌కాలని ప్రేమించేవాడు, తన చుట్టూతా వున్న ప్రపంచపు అందాన్ని గురించి అందమైన విషయాలని చెప్పాలనుకునేవాడు, సరియైన మాట కోసం వెదకడంలో అందమైన దాన్ని సృష్టించాలన్నంత అవసరమూ వున్నవాడు, మానవుడు సాధించినవాటిపట్ల గౌరవంలో ప్రజల మధ్య అత్యంత న్యాయపూరితమైన సంబంధాలని సుదృఢపరచడంలో, అంటే కమ్యూనిస్టు సంబంధాలని సుదృఢపరచడంలో, మానవాళి సౌందర్యాన్ని అర్థంచేసుకొనేవాడు వికటంగా, క్రూరంగా తయారు కాలేదు.

## మా సౌందర్య యేకాంతస్థలం

మొదటి తరగతి అయిపోతూందనగా వసంతరుతువులో మేము మా సౌందర్య యేకాంతస్థలాన్ని నిర్మించడం మొదలెట్టాం. దీన్ని గురించి పిల్లలు యెంతో కాలం

కలలు కన్నారు. చుట్టూతా వున్న ప్రపంచపు సహజ సౌందర్యానికి మానవ నిర్మితమైనవి జతకలిసిన ప్రశాంత యేకాంత స్థలంగా మేము దాన్ని గురించి వూహించుకున్నాం. మా కల భవిష్యత్తులోకి విస్తరించుకుంది. మా యేకాంతస్థలంలో అలా యింకా యింకా యెక్కువ చెట్లు నాటాలని అనుకున్నాం. అక్కడ మేము విశ్రాంతి తీసుకుంటాం, పనిచేస్తాం, వసంతరుతువుకి స్వాగతం చెపుతాం, వేసవికి వీడ్కోలు చెపుతాం.

బడి మడికీ దట్టమైన గుబుర్లకీ మధ్యన, కనుమ యేటవాలులో, దట్టమైన గడ్డి పెరిగి వున్న ఖాళీ జాగాని పిల్లలు చూశారు. జల్లులు పడ్డప్పుడు అక్కడ చాలా తేమ వుంటుంది. మేం ఆ జాగాలో కలుపుతీసేసి దాన్ని పచ్చిక మైదానంగా మార్చాలని తలపెట్టాం.

"మన యేకాంతస్థలం పచ్చగా మొక్కలతో కన్నుల పండగ చేస్తుంది. కనుమ ఏటవాలు అంతా హాప్ చెట్ల పచ్చటి దడితో కప్పడిపోతుంది. నైటింగేల్, ఒరియెలెస్ పక్షులు గుబుర్లలో కాపరం వుంటాయి" అని నేను పిల్లలకి చెప్పాను.

యీ కల పిల్లల్ని ఉత్తేజపరిచింది. ఖాళీ జాగాని పచ్చిక మైదానం కింద మార్చడానికి మేము చాలా కృషిచేశాం. గడ్డితో వున్న పెళ్లలని తెచ్చి అక్కడ పాతి నీళ్లు పొయ్యాల్సి వచ్చింది. వాన కురిసి గడ్డికి నీళ్లు వస్తాయని పిల్లలు ఆత్రుతగా చూశారు. అడివిలో మాకు కొన్ని హాప్ మొక్కలు కనిపించాయి. వాటిని తీసికెళ్లి కనుమ యేటవాలులో పాతాం. మా అదృష్టం కొద్దీ ఆ వేసవి చెమ్మగా వుండింది, దాంతోటి అన్ని మొక్కలూ బతికాయి. మేము అడవిలో కొన్ని లిలీ ఆఫ్ ది వాలీ మొక్కలు చూశాం. వాటిని తవ్వి తెచ్చి మైదానంలో ఒక మూల పాతాం. మూడు అడివి గులాబీ పొదల్ని తెచ్చి వాటికి గులాబీ అంటు కట్టాం - అది పుష్ప రాజ్యం కావాలన్నమాట. మైదానం చుట్టూతా హేజెల్ చెట్లు నాటాం. అక్కడ అడవి పువ్వులు పెరగాలని పిల్లలు అనుకున్నారు. పిల్లలు డైసీ, యింకా అలాంటి మొక్కలూ తెచ్చి నాటారు. ఆకురాలు కాలందాకా పూస్తూ వుండడానికని మేము గ్రీన్‌హౌస్‌నుంచి చామంతి పువ్వుల గుబుర్లని తెచ్చి నాటాం.

వార్యా పొద్దుతిరుగుడు పువ్వు మొక్కని నాటింది. మైదానం మారుమూల ఒకచోట పిల్లలు బక్‌వీట్ చల్లారు. నీనా, సాషల తండ్రులు మాకు రెండు పొట్టి ఆపిల్ మొక్కలు యిచ్చారు. వాళ్ల మామ్మ గంటపువ్వుల మొక్కలు పెంచుతోందని వీత్య నాతో చెప్పాడు. మేము కొన్ని గంట పువ్వుల మొక్కల్ని నాటాం. ఒక వేసవిరోజున పిల్లలు అడవిలో ఒక పెద్ద లైమ్ చెట్టుని చూశారు. ఆ చెట్టు కొమ్మల్లో కొన్నివేల తేనెటీగలు ఝుంకారం చేస్తున్నాయి. అడివి అడివంతా ఒక వీణ మోగుతున్నట్లుగా వుంది. పిల్లలు ఆ అందంతో ముగ్ధులైపోయి నిశ్శబ్దంగా నుంచుండిపోయారు. తమ సౌందర్య యేకాంత స్థలానికి పక్కన కొన్ని లైమ్ చెట్లు పాతాలని వాళ్లు అనుకున్నారు. ఆకురాలు కాలంలో మేము కొన్ని మొక్కల్ని తవ్వి దారికటూ యిటూ పాత్తాం. "లైమ్

చెట్లు పెరిగాక, అవి గుబురు తీగలతో కమ్ముకుపోయి, నీడవున్న వసారాలా వుంటుంది" అని కలగన్నారు పిల్లలు.

ప్రతి తరగతి పిల్లలూ సొంతంగా యేకాంత సౌందర్యస్థలాన్ని తయారుచేసుకోవడం మొదలెట్టారు. అది మిగతా వాటికంటే భిన్నమైనట్టుగా వుండేటట్టు చేయాలని ప్రయత్నించారు. 1955 ఆకురాలు కాలంలో స్కూలు మొత్తంగా సౌందర్యపు దిక్కుని నిర్మించడం మొదలెట్టింది. స్కూల్ భవనం పక్కనే మేము గులాబీతోట వేశాం. భిన్నరకాల గులాబీలతో అంటుకట్టిన అడివి గులాబీలనుంచి పెరిగిన కొన్ని దజన్ల మొక్కల్ని మేము నాటాం. ప్రతి యేడూ తోట అందం ఇనుమడించింది. వసంతకాలంలోనూ వేసవిలోనూ అది పువ్వుల సముద్రమే. ప్రతివాళ్లూ ప్రకృతిని అభినందించి పనిచెయ్యడానికి, అందం సృష్టించడానికి వచ్చేవాళ్లు.

గులాబీతోట ప్రస్తుతం మొత్తం స్కూలు అంతటి సృష్టినీ. సాంఘికంగా ఉపయోగపడే శ్రమలో యెంతో యెక్కువ విజయం సాధించిన తరగతికి తోటలోని పువ్వుల్ని కోసి పంచిపెట్టే హక్కు వుంది. చాలా తరచుగా ప్రాథమిక తరగతులూ, మధ్యతరగతులూ నెగ్గేవి. ప్రతిరోజూ కొన్ని దజన్ల గులాబీలు కోసే అనుమతి వాళ్లకి వుండేది. వాళ్లా గులాబీలని తెచ్చి తరగతికి ఉపాధ్యాయులకీ, ఇళ్లదగ్గర తల్లులకీ, వూళ్లో వున్న శ్రేష్ఠులైన పనివాళ్లకీ యిచ్చేవాళ్లు. మొదటి మోపుగట్టే పండగ రోజున పిల్లలు గులాబీల గుత్తులు పోగుచేసి సమష్టి క్షేత్రంలోని శ్రేష్ఠులైన పనివాళ్లకి బహూకరిస్తారు.

సౌందర్యం సృష్టించడం కోసం పనిచెయ్యడమనేది పసిహృదయాన్ని ఉన్నతంచేసి, ఉదాసీనతని నిరోధిస్తుంది. యిలమీద సౌందర్యాన్ని సృష్టించడంలో పిల్లలు యింకా మెరుగ్గా, స్వచ్ఛంగా, సౌందర్యవంతంగా తయారయారు.

## జీవితంలో ఆదర్శాల ఆధారాలు

మా విద్యార్థుల్లో ప్రతి ఒకరినీ పెద్దవాళ్లల్లాగా వూహించుకున్నాను. బాబూ, నువ్వు యెలాంటి పౌరుడు, యెలాంటి వ్యక్తి అవుతావు అన్న ఆలోచనలతోటి నేను కలవర పడేవాణ్ణి. నీకు ఆనందదాయకమైన దాన్ని దేన్నీ సమాజానికి అందిస్తావు? నువ్వు దేన్ని అభినందిస్తావు? యేది నీకు ఆగ్రహం తెప్పిస్తుంది? నువ్వు దేంట్లో నీ ఆనందాన్ని దర్శిస్తావు? యెలాంటి వారసత్వాన్ని వదిలిపెడతావు?

యుగాలుగా మానవాళి పోరాడి, సృష్టించిన ఆ విలువలని - మాతృదేశంపట్లా, స్వాతంత్ర్యంపట్లా అభిమానాన్నీ, దోపిడీపట్ల అసహ్యాన్నీ, ఒక వ్యక్తి యింకో వ్యక్తిని అణగదొక్కడంపట్ల అసహ్యాన్నీ, ప్రజల ఆనందంకోసం స్వాతంత్ర్యంకోసం తమ జీవితాన్నీ శక్తినీ ధారపోసే సంసిద్ధతనీ - పసిపిల్లల

హృదయాల్లో పాదుకొల్పాలని నేను ఒక ఉపాధ్యాయునిగా, బోధకునిగా ప్రయత్నించాను. మాతృదేశాన్ని గురించిన పెద్ద మాటలూ, ఉన్నత ఆదర్శాలూ పిల్లల మనసుల్లో గంభీరంగా అయినా ఒట్టి నిస్సార పదజాలంలా మారకుండా, తరచుగా వాడడంవల్ల అరిగిపోయి బలహీనంగా, మసకగా తయారవకుండా వుండేటట్టు చూడటం అవసరం. ఉన్నత భావాలని గురించి అరుదుగానే పిల్లల్ని మాట్లాడనివ్వండి. కాని ఆ ఆదర్శాలని ఆచరణకోసం తపనలో, ప్రేమలో, పగలో, అంకితంకావడంలో, స్థిరత్వంలో మననివ్వండి.

వాళ్లకి అర్థంకాని మాటలు పిల్లల్లో దట్టించకూడదు. ప్రజలు పవిత్రమైందిగా యెంచేవి దీనివల్ల బోలుగా మారిపోతాయి.

భూమిలోనుంచి యింకా వచ్చీరాని మొక్కని జాగ్రత్త అయిన తోటమాలి శ్రద్ధపట్టి బలంగా అయేటట్టు చేసి, అది కొన్ని దశాబ్దాలు బతికేటట్టు చేసినట్టుగా ఉపాధ్యాయుడు కూడా తన పిల్లల్ని జాగ్రత్తగా పెంచేటట్టు చూడాలి. వాళ్లకి మాతృదేశంపట్ల అనంతమైన ప్రేమనీ, శ్రామికులకి అంకితమైపోయే భావాన్నీ, కమ్యూనిజపు ఉన్నత ఆదర్శాలలో విశ్వాసాన్నీ బోధించాలి. పిల్లవాడు తన చుట్టూ వున్న ప్రపంచాన్ని చూసి, అర్థంచేసుకుని, వివేచన చేసుకోగలగినప్పుడు యీ గుణాల బోధన మొదలవుతుంది.

పూర్వతరంవాళ్లు సృష్టించిన ప్రతిదాన్నీ, మాతృదేశపు స్వేచ్ఛ కోసమూ స్వాతంత్ర్యంకోసమూ జరిపిన కష్టభూయిష్ఠమైన పోరాటంలో సాధించి గెలిచిన ప్రతిదాన్నీ, శ్రామికజన సంతోషంకోసం జరిపిన కష్టభూయిష్ఠమైన పోరాటంలో సాధించిన ప్రతిదాన్నీ పిల్లలు విలువైందిగా పరిగణించడం చాలా ముఖ్యం. ఒక చిన్న రొట్టెముక్క యిచ్చే గోధుమ పొలంతోటీ, అడివిలోని కొంచెం పాటి బయలుతోటీ, చిన్న చెరువు మీద పైన వుండే వినీలాకాశంతోటీ, పడుకునే ముందు తల్లి చెప్పే కథలతోటీ, పాడేపాటలతోటీ మాతృదేశం అనేది పిల్లవాడికి ఆరంభమవుతుంది. బాల్యం అనే బంగారు కాలంలోనే, ముఖ్యంగా భాషపట్లా, చిత్రాలపట్లా అవతలి వ్యక్తి ఆధ్యాత్మిక ప్రపంచంపట్లా పసివాళ్లు భావుకతతో వున్నప్పుడే, వాళ్ల హృదయాలకి పూర్వతరంవాళ్లు గర్వించే ప్రతిదాన్నీ అందివ్వాలి, స్వేచ్ఛాయుత శ్రమ తాలూకు ఆనందంకోసం పోరాడ్డంలోని విలువను గురించి చెప్పాలి. ప్రాథమిక అవసరాలని గురించి బాధ్యత లేకుండా అనుభవించే హక్కుని నేను యివ్వదలచుకోలేదు. పిల్లవాడి ప్రపంచ అవగాహనా, స్వీయావగాహనా యేక ముఖంగా వుండకూడదు. ప్రపంచాన్ని గురించీ, తమని గురించీ తెలుసుకుంటూ పిల్లలు పూర్వతరంవాళ్లు సృష్టించిన పదార్థిక ఆధ్యాత్మిక విలువలపట్ల తమ బాధ్యతని గురించి తెలుసుకోవాలి.

పొలంలోకీ, అడివిలోకీ, నది ఒడ్డుకీ, పరిసరగ్రామాలకీ మా విలాసయాత్రలని మేం మా స్వస్థానపు గతంలోకి "యాత్ర"లని పిలిచాం. ఆ "యాత్ర"ల్లో నేను మన ప్రజల భూత వర్తమాన ఆధ్యాత్మిక జీవితాన్ని సంధించి చూపించాను. నేను వాళ్లకి చెప్పాను:

"పక్వాని కొచ్చిన గోధుమకంకులు వున్న ఫలవంతమైన పొలం అదిగో. అడివి అంచున ఆ క్షేత్రంమీద శత్రువులు అంతర్యుద్ధకాలంలో సోవియట్ రిపబ్లిక్ సైనికుని కాల్చి చంపేశారు. మహత్తర దేశభక్తియుత యుద్ధపు కష్టభూయిష్ఠమైన మొదటి వేసవిలో కొద్దిమంది సైనికులకీ పెద్ద నాజీ దళానికీ యుద్ధం జరిగింది. మన వీరులు యిక్కడ హతులైనారు. యీ విశాలక్షేత్రం కేసి చూడండి, పిల్లలూ. యీ చిన్ని గుట్టలు అజ్ఞాతవీరుల సమాధులు; వాళ్లు చేసిన దాని స్మృతిని భూమి పదిలపరుస్తోంది. యీ వేలాది చిన్ని దిబ్బలు వేలాది అజ్ఞాత సమాధులు. వీరుల మహోన్నత రక్తాన్ని భూమి ధరిస్తోంది, వాళ్ల సాహసకృత్యాలు ప్రజల స్మృతిలో చిరస్థాయిగా వుంటాయి. వాళ్లు తమ రక్తాన్ని మాతృదేశం కోసం అర్పించకపోయివుండినట్లయితే మీ మాతృదేశపు సౌందర్యాన్ని మీరు అనుభవించలేక పోయివుండేవాళ్లు, నాజీలు మిమ్మల్ని బానిసత్వం పాలు చేసివుండేవాళ్లు."

తన మాతృదేశపు అదృష్టం గురించి పిల్లవాణ్ణి ఆలోచించనివ్వండి. దాని భవిష్యత్తుని గురించి పట్టించుకుని ఆందోళన పడే అనుభూతినీ, అనుభవాన్నీ పిల్లవాడికి వుండనివ్వండి. గతకాలపు సంఘటనలని ప్రకృతానికి ఆధారాలుగా వుండనివ్వండి.

కులాసాగా సంతోషమూ, ఆటలూ అద్భుత కథలూ వుండే వయస్సని మనం పరిగణించే బాల్యసంవత్సరాలు జీవిత ఆదర్శాలకి ఆధారం. సరిగ్గా యీ వయస్సులోనే పౌరసత్వపు వేళ్లు అనుకుంటాయి. చుట్టూతా వుండే ప్రపంచంనుంచి పిల్లవాడి ముందు బాల్యసంవత్సరాల్లో విశదమయేది, పిల్లవాణ్ణి సంభ్రమాశ్చర్యాలతో నింపేది, అతన్ని కదిలించివేసి ఖేదపడేటట్టు చేసేది – అంటే వ్యక్తిగతమైన నొప్పినుంచి కాదు, పరుల అదృష్టం గురించిన ఆవేదనతోటి, అది మా విద్యార్థి యెలాంటి పౌరుడయేదీ దానికి ఆధారం. తన వైరుధ్యాలతోటీ, సంక్లిష్టతలతోటీ యీ బహుముఖ ప్రపంచం పిల్లవాడి ముందు తెరుచుకుంటుంది, పిల్లవాడు దాంట్లో అందాన్నీ, వికారాన్నీ, ఆనందాన్నీ, విచారాన్నీ దర్శిస్తాడు. చుట్టూతా వుండే ప్రపంచంలో జరిగే ప్రతీదాన్నీ, ప్రజలు గతంలోనూ ప్రస్తుతంలోనూ కోరుకున్న ప్రతీదాన్నీ, పిల్లవాడు మంచీ చెడులుగా విభజించుకుంటాడు. బాల్యసంవత్సరాల్లో మానవత్వానికీ పౌరసత్వానికీ పునాదులు వేసేటందుకుగాను పిల్లవాడికి **మంచీ చెడుల గురించిన సరి అయిన అవగాహన యివ్వాలి.**

అలా అనడంలో నా ఉద్దేశం యిదీ: చుట్టూ వున్న ప్రపంచాన్ని గురించీ సామాజిక సంఘటనల గురించీ గతంలోనూ వర్తమానంలోనూ ప్రజలు చేసినదాన్ని గురించి పిల్లలు తెలుసుకునేదంతా వాళ్లల్లో గాఢమైన నైతిక అనుభూతులని జాగృతం చెయ్యాలి. మంచి చెడ్డలని గురించిన సరిఅయిన అవగాహన అంటే, ప్రపంచంలో గ్రహించింది పిల్లవాడి హృదయాన్ని హత్తుకోవడం అన్నమాట. మంచి అనేది పిల్లవాడిలో సంతోషకరమైన ఉద్రేకాల్ని, ఉత్తేజాన్ని ప్రేరేపిస్తుంది, నైతిక సౌందర్యాన్ని అనుసరించేటట్టు చేస్తుంది. చెడు ఆగ్రహాన్నీ అసహనాన్నీ, సత్యం కోసం, న్యాయం

సంతోషరహితమైన బాల్యం గురించీ, పేదరైతుల పిల్లల పసితనం గురించీ, ప్రఖ్యాత ఉక్రేనియన్ రచయిత ఎ. తెస్‌లేంకొ కథలు పిల్లవాళ్ల మీద చెరగని ముద్ర వేశాయి. ప్రతిభావంతురాలైన ఒక రైతుబాలికని జార్ చక్రవర్తుల అధికారులూ, ధనవంతులూ పీడిస్తే ఆమె దారిద్ర్యంతోటీ అవమానంతోటీ ఆత్మహత్య చేసుకున్న దురదృష్టకరమైన కథ చదివినప్పుడు పిల్లల కళ్లు కోపంతో మండిపోయాయి.

మూడవ, నాల్గవ తరగతుల్లో మేము హారీట్ బీచెర్ స్టో రాసిన "అంకుల్ టామ్స్ కేబిన్" రెండుసార్లు చదివాం. ఆ కథానాయకుల గురించి పిల్లలు చాలా బాధపడ్డారు. అసలు మనుషుల్ని జంతువుల్లా కొనడమూ అమ్మడమూ అనేది వుంటుందా అనేది వూహించుకోవడమే కష్టంగా వుండింది. పిల్లల మనసుల్లో యీనాడు మంచికీ చెడుకీ మధ్య జరుగుతున్న పోరాటాన్ని గురించిన స్పష్టమైన భావం క్రమేపీ రూపుతీసుకుంది: పెట్టుబడిదారీ దేశాల్లో లక్షలాది ప్రజలు తమ కోసం కాకుండా భూస్వాముల కోసమూ, పెట్టుబడిదార్ల కోసమూ కష్టించి పనిచేస్తున్నారు. అక్కడ పిల్లలు బాల్యం అంటే యేమిటో తెలియకుండా ఎదుగుతారు. దేశపు మణిపూసల్లాంటి వాళ్లు, తమ మాతృదేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాడేవాళ్లు కాల్చబడనైనా కాల్చబడతారు, ఉరితీయబడతారు, లేదా కఠిన శారీరక శిక్షకి గురిచెయ్యబడతారు.

గ్రీకు ప్రజల వీరుడు నికొస్ బెలొయానిస్ దురదృష్టకర గాథని పిల్లలు యెన్నటికీ మర్చిపోలేదు. నాజీలు గ్రీస్‌ని ఆక్రమించుకున్నప్పుడు బెలొయానిస్ ఆక్రమణదారులకి వ్యతిరేకంగా పోరాడాడు. నాజీలనుంచి దేశం విముక్తమయ్యాక, బూర్జువా న్యాయస్థానం అతనికి దేశద్రోహ నేరానికిగాను మరణశిక్ష విధించింది. చేతిలో ఎర్రని పువ్వు పుచ్చుకుని నికొస్ బెలొయానిస్ మృత్యువుని ఎదుర్కొన్నాడు. అదే రోజున అతని భార్య – ఆమెకి కూడా మరణశిక్ష విధించబడింది – ఒక మగపిల్లవాణ్ణి ప్రసవించింది. జైల్లో వున్న ఆ కుర్రాడి విషాదగాథ విని పిల్లలు నికొస్ బెలొయానిస్ జూనియర్‌కి యెలా సాయపడాలా అని అడిగారు. నికొస్ బెలొయానిస్ జూనియర్ తల్లికి ఉత్తరం రాసి అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థ ద్వారా పంపించారు. వాళ్లు ఒక బహుమతి కూడా తయారుచేశారు – తెల్లని సిల్కుమీద అల్లిన ఎర్రని పువ్వు. అది మొదలు. ప్రతియేడూ విద్యార్థులూ ఆ వీరుని భార్యకి ఒక ఉత్తరమూ, ఆ చిన్నపిల్లవాడి పుట్టిన రోజుకి ఒక బహుమతీ పంపించారు: తెల్లని సిల్కుమీద అల్లిన గులాబీ, పాపీ, లైలాక్ పువ్వుల బహుమతీ. పైకి చిన్నగా కనిపించే యీ చర్య పిల్లలమీద గాఢమైన ముద్ర వేసింది, యెందుకంటే అది చెడుని ఖండించడం, అన్యాయాన్ని నిరసించడం.

నేను పిల్లల్ని సామాజిక జీవితంలోకి ప్రవేశపెడుతూ మానవజాతి చరిత్రలో అతి దారుణమైన దశల్లో కూడా, దుష్టశక్తులు లక్షలాది ప్రజల్ని అణచివేసినప్పుడు కూడా, అన్యాయానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన వాళ్లున్నారని వాళ్లని

ఒప్పించాలని ప్రయత్నించాను. యీ మనుషులు, వాళ్ల కృషీ జీవితమూ యువతరానికి తేజోవంతంగా, మార్గదర్శకంగా వుండే నక్షత్రాలు. తమ మాతృదేశపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, దోపిడీనుంచి విముక్తి కోసం, మానవ ఆత్మగౌరవాన్ని దృఢపరచడం కోసం పోరాడి జీవితాలర్పించిన మానవజాతి అత్యుత్తమ సంతానపు ధైర్యంతోటీ, సాహసంతోటీ, వీరత్వంతోటీ, ఆదర్శాలపట్ల విధేయతా విశ్వాసాలతోటీ మా విద్యార్థులు ఉత్తేజితులు కావాలని నేను ప్రయత్నించాను.

మానవాళి గతంలో ఆశించి సాధించి, మన కాలంలోని సోషలిస్టు సమాజంలో వికాసానికొస్తున్న నైతిక విలువలు ప్రతి పిల్లవాడి ఆధ్యాత్మిక సంపదగా, సత్యం ప్రపంచమంతటా విజయం సాధించడానికి తోడ్పడే కార్యాచరణకి పిల్లవాణ్ణి జాగృతం చేసి, ఉత్తేజపరిచేటట్టు చెయ్యాలని నేను ప్రయత్నించాను. సత్యం యెప్పుడూ విప్లవాత్మకమైనదేననీ ఇటలీ కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుడైన ఆన్‌టోనియో గ్రామ్‌షి (1891-1937) అన్నాడు. గొప్ప కబుర్లు లేకుండా నైతిక సత్యాల్ని వాటి పూర్తి సౌందర్యంతో వెల్లడించాలని నేను ప్రయత్నించాను. నైతిక విలువలయొక్కా లేదా మానవత్వంయొక్కా అందం స్పష్టమైన, ఉత్తేజకరమైన చిత్రాల్లో వాటి విప్లవాత్మక అర్థం వెల్లడి చేసినప్పుడే పిల్లవాడి హృదయంలో సంపదగా అవుతాయి. "మాటలు బోధిస్తాయి, కాని ఆచరణ ఆకట్టుకుంటుంది" అని ఒక లాటిన్ సూక్తి. మహోన్నత జీవితాల ఆదర్శం, మానవాళి ఆనందం కోసం సాధించిన విజయాలు - పిల్లవాడి జీవితాన్ని వెలుగుతో నింపే దీపం యిదీ. ఒరవడులు మానవత్వపు, ప్రగతిశీల, విప్లవాత్మక భావాల సజీవరూపం అయినప్పుడే యెలా జీవించాల్సిందీ మనుషులకు బోధిస్తాయి.

ఎన్నో తరాలకి మార్గదర్శక తారకలైన మహనీయులైన వాళ్లని గురించి నేను పిల్లలకి చెప్పాను. చిన్నపిల్లలకి మీరు ప్రతీదీ చెప్పలేరనుకోండి. పిల్లవాడి నెత్తిమీదకి చిత్రాల, దృశ్యాల మంచు ముద్దల్ని కుప్పలుగా మీరు పడెయ్యకూడదు. అతని హృదయాన్ని సదా తాడించకూడదు, అతని మనసుని అనంతంగా ఉద్రేకపరచకూడదు. పిల్లవాణ్ణి ప్రస్తుతానికి కొంచెమే తెలుసుకోనివ్వండి, కాని ఆకాస్తా కూడా నైతిక విలువల్ని అతనికి వెల్లడిచెయ్యాలి. తనని యేది ఉత్తేజపరుస్తోందో దాన్ని గురించి పిల్లవాణ్ణి ఆలోచించనివ్వండి. ఆలంకారికంగా చెప్పాలంటే అతని ఆలోచనలూ అనుభూతులూ పెనవేసుకుపోనివ్వండి, వాటిని ప్రతి పిల్లవాని హృదయంలో వుండిపోనివ్వండి. నాలుగేళ్లలో నేను మానవాళి ఆదర్శాలకోసం పోరాడిన వాళ్లని గురించి పిల్లలకి చెప్పాను - స్పార్టకస్, తొమాసో కాంపనేల్లా, ఇవాన్ సుసానిన్, స్తెపాన్ హల్తూరిన్, సోఫ్యా పెరోవ్‌స్కయా, నికొలాయ్ కిబాల్‌చిచ్, తరాస్ షెవ్‌చేంకొ, థోమస్ ముంజెర్, క్రీస్తో బోతెవ్, యానుష్ కోర్చక్. లెనిన్ జీవితం, పోరాటాల గురించీ, కమ్యూనిస్టు వీరులు బాబుష్కిన్, లజో, కమో, స్వేర్ద్‌లోవ్, ద్జెర్జీన్‌స్కీ, జూలియస్ ఫూచిక్, తేల్‌మాన్, మహత్తర దేశభక్తియుత

యుద్ధపు వీరుల గురించీ, గస్తేల్లొ, మత్రోసావ్‌లను గురించి, శాస్త్రీయ సత్యం కోసం జోర్దానో బ్రూనో చేసిన ధైర్యవంతమైన పోరాటం గురించీ, మహాపండితుడూ, మానవతావాదీ అయిన మిక్‌లూహొ మక్లాయ్ గురించీ చెప్పాను.

సజీవ మానవ కాంక్షలతోటీ, చర్యలతోటీ రూపు కట్టిన భావం వున్న స్పష్టమైన ఆదర్శం పిల్లవాడి ఆంతరంగిక ప్రపంచంమీద గొప్ప ప్రభావాన్ని కలిగిస్తుంది. ఒకానొక చర్య సారం యెలా అర్థంచేసుకోవాలో మీరు పిల్లలకి చెప్పక్కర్లేదు. భావాన్నీ చిత్రాన్నీ జతచేసినప్పుడు పిల్లవాడు భావాన్ని హాయిగా అర్థంచేసుకుంటాడు. నేను పిల్లలకి చెప్పిన వీరులందరిలోనూ ప్రత్యేకమైన లక్షణం యేమిటంటే, ప్రజల ఆనందంకోసం తమ జీవితాన్నీ శక్తినీ ధారపోయగల వాళ్ల సంసిద్ధత. యీ లక్షణం ఉత్తేజకరమవుతుంది, మిగతా ప్రజల జీవితాలని గురించి పిల్లవాడు ఆలోచించేటట్టు చేస్తుంది. మానవాళి సేవలో తమ ఆనందాన్ని దర్శించేవాళ్లు పిల్లవాడికి నైతిక ఆదర్శాలవుతారు.

ఉత్తేజంతో హృదయం పులకించి పోయేటట్టు అర్ధరాత్రిదాకా నైతిక ఔన్నత్యాన్ని గురించి చదవడంలో పిల్లవాడు నిమగ్నుడు కాలేకపోతే పెంపకం అసమగ్రంగా వుందన్నమాట. నైతిక సౌందర్యానికీ, విశ్వాసపు దృఢత్వానికీ, సాహసానికీ, స్థిరత్వానికీ, కష్టాలు చుట్టుముట్టి వున్నప్పుడు కూడా అచంచలత్వానికీ తనకి ఆదర్శప్రాయులైన వాళ్లతో ఒక వ్యక్తి తనని పోల్చుకుని, నిశిత పరిశీలన చేసుకున్నప్పుడే నైతిక ఆదర్శాలు ఉద్భవిస్తాయి.

నైతిక ఆదర్శాల మూలాలకి పిల్లల్ని తీసుకెళ్లే దానికిగాను ఉపాధ్యాయుడు కథల్ని జాగ్రత్తగా యెంచుకోవాలి. సిద్ధాంతపరమైన దాన్ని సంతరించే వాస్తవాలూ, సంఘటనలూ యిక్కడ ముఖ్యం. యువతరానికి ఆదర్శవంతంగా వుండేవాళ్ల జీవితాల్లో వాళ్ల వ్యక్తిగత ఆశయానికీ, మానవాళి ఆశయానికీ గల ఏకతని చూపించడం ముఖ్యం.

పిల్లలకి లెనిన్ జీవితాన్ని గురించీ, పోరాటాన్ని గురించీ చెప్పేటప్పుడు శ్రామిక ప్రజల దుర్భర జీవితాలని చూసి ఆయన యెలా బాధపడ్డాడో వర్ణించే వాస్తవాలని కొంచెం విస్తరించాను. ఆ మహా నాయకుడు చేసిన ప్రతీదీ ప్రజల ఆనందం ధ్యేయంగా గలదే. అంతర్యుద్ధ కష్టకాలంలోనూ, ఆర్థిక వినాశనం కాలంలోనూ లెనిన్ అనాథల కోసం చూపించిన ఆందోళన పిల్లల్ని సంతోషసహిత ఉత్తేజంతో ముంచేసింది. లెనినిస్టు మానవత్వం ఒక గొప్ప నైతిక విలువగా పిల్లల జీవితాల్లో ప్రవేశించాలని నేను కోరుకున్నాను. అప్పుడు పిల్లలు తమ చుట్టూ వున్న మొత్తం ప్రపంచాన్ని నైతిక సౌందర్యంగుండా, సత్యంగుండా దర్శిస్తారు.

పోలిష్ జాతీయ వీరుడు యానుష్ కోర్చక్‌ని గురించిన కథలు పిల్లలమీద గాఢమైన ముద్రవేశాయి. తను ప్రేమించిన పిల్లలతోబాటుగా యీ వీరుడు మృత్యు గహ్వరంలోకి పోవడం పిల్లలకి ఆశ్చర్యం కలిగించింది. ఆయన తను బతకగలిగి వుండేవాడు, కాని వేలాది అమాయక బాలలు నాజీ ముష్కరుల చేతుల్లో

హతమయేటప్పుడు తను బతకడం నీచంగా కనిపించింది... పిల్లలకి యానుష్ కోర్చక్ మానవాళి నిజమైన ప్రతీక అయ్యాడు.

"ప్రజా స్వేచ్ఛ" అనే 19వ శతాబ్దపు విప్లవ సంస్థలోని సభ్యులు స్తైపాన్ హల్తూరిన్, సోఫ్యా పెరోవ్స్కయా, నికొలాయ్ కిబాల్‌చిచ్‌ల గురించిన కథలు వినడంతోటి పిల్లల హృదయాలు ఉత్తేజితమయ్యాయి. కమ్యూనిస్టులు జూలియస్ ఫూచిక్, కమో (తెర్-పెత్రోస్యాన్)ల ధైర్యమూ, సాహసమూ, విధేయతల గురించిన కథలు నేను చదివి వినిపించినప్పుడు పిల్లలు మానవుడు అంటే సగర్వ భావంతో నిండిపోయారు. "అలా వుండటం గొప్ప. అతను నిజమైన వీరుడు" అన్నారు వాళ్లు.

తమ సోవియట్ మాతృదేశపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటంలో ప్రాణాలర్పించిన యువ పయనీర్ వీరులు అయిన వాల్య కోతిక్, వీత్య కొరొబ్‌కోవ్, ల్యోన్య గోలికొవ్, వొలోద్య దుబీనిన్, వాస్య షిన్‌కోవ్ స్కీల సాహసకృత్యాల గురించి, పిల్లలకి యెంతో చెప్పాను. సిద్ధాంత స్థిరత్వం, సాహసం, సోషలిజానికీ, శాంతికీ, స్వేచ్ఛకీ, ప్రజాస్వామ్యానికీ శత్రువులైన వాళ్లతో రాజీపడకపోవడంలాంటి కమ్యూనిస్టు నీతిలోని ముఖ్యమైన లక్షణాలని క్రమేపీ పిల్లలకి వెల్లడిచెయ్య ప్రయత్నించాను. తన ఆత్మగౌరవాన్ని యెలా సమర్థించుకోవాలో అలాగే తను నమ్మిందాన్ని బలపరచడం నేర్చుకోవాలి. అది విద్యకిగల ముఖ్యమైన విధుల్లో ఒకటి. దాన్ని గుర్తించడం, మరీ బాల్యంనుంచీ వ్యక్తి స్పష్టమైన చిత్రాల్లో రూపుకట్టిన మంచీ చెడుల భావాన్ని యేర్పరచుకున్నప్పుడే సాధ్యం అవుతుంది. కాని యీ భావాలే సరిపోవు. వ్యక్తిగతమైన అనుభూతి వివేచన కూడా అవసరం. పిల్లవాడు తనకి ప్రియమైన దానికీ, తను అంగీకరించలేని దానికీ మధ్య తేడా చూడాలి. వాళ్లని నైతిక సౌందర్యంతో ఉత్తేజం చేసేదాంట్లోనే, ప్రజలకోసం ఆనందాన్ని సృష్టించాలనే కోరిక జాగృతం కావడంలోనే, మానవ గౌరవాన్ని కాపాడాలనే కోరిక జాగృతం కావడంలోనే, కమ్యూనిజపు నైతిక సూత్రాలని విలువైనవిగా పరిగణించడంలోనే పిల్లల నైతిక విద్య వుంటుంది.

నైతిక ఆదర్శాలు మూలాల దగ్గర పాఠశాల పసిపిల్లలు వున్నారు. ఉపాధ్యాయులమైన మనం ప్రతి పిల్లవాణ్ణీ నైతిక సాహసపు సౌందర్యాన్ని గురించి చైతన్యవంతం చెయ్యాలి, కమ్యూనిస్టు విశ్వాసాలపట్ల అతని నమ్మకాన్ని దృఢపర్చాలి, అప్పుడు ప్రాథమిక పాఠశాల విద్యార్థులు శ్రామికజనంలో సజీవ సృజనాత్మక భాగంగా అనుభూతి చెందుతారు.

# కమ్యూనిస్టు పార్టీని గురించిన ఆలోచనతో

పాఠశాల అతిముఖ్య కర్తవ్యాలలో ఒకటేమిటంటే మన దేశపు కమ్యూనిస్టు పార్టీపట్ల ప్రేమనీ, దాని సూత్రాలలో విశ్వాసాన్నీ, దాని లక్ష్యాలకోసం పోరాడే సంసిద్ధతనీ నేర్పడం. "కమ్యూనిస్టు" అనే పదాన్ని పిల్లలు తరచూ వింటారు. యీ మాట వాళ్ల మనస్సుల్లో పీడకులనుండి మన ప్రజల విముక్తి కోసమూ, సోషలిజపు

నిర్మాణం కోసమూ, ఫాసిజంమీద విజయం కోసమూ, సమాజపు కమ్యూనిస్టు పునర్నిర్మాణం కోసమూ పోరాడిన యోధుల తేజోవంతమైన, ఔన్నత్యపూరితమైన చిత్రాలతో మిళితమై పోవాలని నేను ప్రయత్నించాను. తమ తాతతండ్రుల కమ్యూనిస్టు ఆదర్శాలకి వారసులుగా పిల్లలు వాటిపట్ల సగర్వంగానూ, తమ దేశపు నిజమైన నాయకులుగానూ, కమ్యూనిజాన్ని దృఢతరంచేసి, నిర్మించే యోధులుగానూ వుండేటట్లు చెయ్యడమనేది బోధనాకృషి లక్ష్యాలలో ఒకటిగా నేను పరిగణించాను.

కమ్యూనిస్టులని గురించిన సంభాషణల్లో యీ బోధనా కర్తవ్యాన్ని ప్రధానంగా సాధించాలని అనుకున్నాను. యీ సంభాషణలను "జ్వాలా హృదయాలు" అన్నాం. మన దేశపు ప్రముఖ కమ్యూనిస్టుల గురించి చెప్పాను. జార్ పాలనకి వ్యతిరేకంగానూ, సోషలిస్టు విప్లవం కోసమూ పోరాడిన యోధులు అయిన కమ్యూనిస్టుల మహత్తర జీవితాలూ, వీరోచిత పోరాటాలూ ప్రజలకి అంకితం కావడంలోనూ, ప్రజల ఆనందం కోసం పోరాడ్డంలోనూ కమ్యూనిస్టుల అత్యున్నత ఆనందం వుందని పిల్లలకి నమ్మకం కలిగించాయి.

"సంతోష చంద్రశాల" ఆరంభంనుంచీ, పెద్దవాళ్లయి తమ సర్టిఫికెట్లు పొంది ఉద్యోగాల్లో ప్రవేశించేదాకా లేకపోతే పైచదువుల కోసం వెళ్లేదాకా పిల్లలకి నేను లెనిన్ గురించి చదివి వినిపిస్తూనే వున్నాను. మొదట్లో నేను లెనిన్ బాల్యం గురించీ, యౌవనం గురించీ చదివి వినిపించాను. ప్రతి నెలా కథలు చరిత్రకి సంబంధించీ, కమ్యూనిస్టు సిద్ధాంతానికి సంబంధించీ, ప్రజల మంచి భవిష్యత్తు కోసం మన పార్టీ కృషికి సంబంధించీ వుండేవి. కమ్యూనిస్టు పార్టీ అనేది మనుషుల్లోని మహనీయులు, మణిపూసలాంటి వాళ్లు వున్నదని పిల్లలకి నమ్మకం కలిగింది.

పిల్లలు కమ్యూనిస్టులని కలుసుకోవడం మొదలెట్టారు. వాళ్ల జీవిత పోరాటానికి సంబంధించిన కథలు పిల్లలకి కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో భాగమైపోయాయి. పార్టీ చిరకాల సభ్యులు వి. ఎమ్. బెస్కొరొవైనీ. ఎ.ఎమ్. రడ్జివీల్, ఎన్.కె. గైచూక్‌లతోటి తమ సమావేశాలని పిల్లలు యెన్నటికీ మరచిపోలేరు. మా గ్రామవాసులు సోవియట్ అధికారం పొత్తిళ్లలో వున్నప్పుడున్నారనీ, కార్మికులా రైతులా విజయం కోసం తమ రక్తాన్ని చిందించారనీ విని పిల్లలు ముగ్ధులైపోయారు. కమ్యూనిస్టులంటే దృఢమైన విశ్వాసాలున్న వాళ్లని పిల్లలు గుర్తించారు. అదే సమయంలో కమ్యూనిస్టులు వినయవంతులు, గౌరవించదగిన పెద్ద వయస్సైనా కూడా వాళ్లు తమ శక్తి యుక్తుల్ని కమ్యూనిజం నిర్మించడానికి అర్పించారు. రడ్జివీల్‌ని ఉత్తమ కాయగూరల పెంపకందారునిగా, బెస్కొరొవైనీని బంగారు చేతులున్న మనిషిగా, అంటే యెంతో అనుభవజ్ఞుడైన యంత్ర నిర్వాహకుడుగానూ పిల్లలు యెరుగుదురు. గ్రామంలో మొదటి సమష్టి వ్యవసాయ క్షేత్రం యెలా సృష్టించబడిందో, ట్రాక్టర్లు నడపడం కమ్యూనిస్టులు యెలా నేర్చుకున్నారో, స్టీరింగ్ చక్రం యెలా పట్టుకున్నారో, సమష్టిక్షేత్రపు పొలాల్లో మొదటి చాలుని యెలా దున్నారో ఆయన పిల్లలకి చెప్పాడు.

సోవియట్ ప్రజల అత్యుత్తమ భవిష్యత్ కోసం పార్టీ చేసిన కృషికి అంకితమైన కొన్ని మాటలు బెస్కొరొవైనీ పిల్లలతో ముచ్చటించాడు. సమష్టి వ్యవసాయ క్షేత్రపు, పార్టీ శాఖ పని గురించి చెప్పాడు. సమష్టి వ్యవసాయ క్షేత్రంలో కమ్యూనిస్టులు పంటదిగుబడి పెంచడానికి కృషిచేస్తున్నారనీ, పశు క్షేత్రం యెక్కువ మాంసమూ, పాలూ, వెన్నా ఉత్పత్తి చేసేటట్టు చూస్తున్నారనీ పిల్లలకు తెలియజేశారు.

మహాదేశభక్తియుత యుద్ధం గురించిన కథలు ముఖ్యంగా ఆసక్తిదాయకంగా వున్నాయి. ఎస్. ఎ. కొవ్‌పాక్ గెరిల్లా దళంలో పాల్గొన్నవాడూ సోవియట్ యూనియన్ వీరుడు బిరుదు గ్రహీతా ఎ. కె. త్రిమ్‌బాల్‌నీ, రుమేనియా హంగరీలని ఫాసిజంనుండి విముక్తి చేసేందుకు జరిగిన యుద్ధాల్లో పాల్గొన్న సోవియట్ యూనియన్ వీరుడు ఎన్. ఎస్. ఒనోపనీ, యింకా చాలామంది మా గ్రామస్థుల్ని – ఫాసిజం బారినుండి మన దేశాన్ని విముక్తిచేసే యుద్ధంలో పాల్గొన్న వీరుల్ని – పిల్లలు కలుసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ కృషిలోనూ, ప్రజల శ్రమలోనూ లెనినిస్టు ఆశయాలూ, లెనినిస్టు సత్యమూ సజీవంగా వుంటాయనే విశ్వాసం మా పిల్లల్లో దృఢపడింది.

## పరుల గురించి ఆలోచన లేకుండా ఒక్క రోజు కూడా యెవరూ బతక్కూడదు

సంతోషం కోసం కృషిచెయ్యకుండా ఆధ్యాత్మిక యత్నం చెయ్యకుండానే పిల్లవాడు వూరికే దాన్ని "అనుభవిస్తూనే" వుంటే, అతని హృదయం నీరసంగా, నిర్దాక్షిణ్యంగా, ఉదాసీనంగా తయారవుతుందని జీవితం రుజువుచేస్తోంది.

పరులకి మంచిని సృష్టించడమనేది పిల్లల్ని ఉన్నతం చేసే బ్రహ్మాండమైన నైతిక శక్తి. సహాయాన్నీ, చింతనీ, మృదుత్వాన్నీ, ఆర్ద్రతనీ, జాలినీ ఆశించే మిగతా జనం చుట్టూతా వున్నారని పిల్లలు అనుభూతి చెందేటట్లు చెయ్యడం సోవియట్ పాఠశాల కర్తవ్యాల్లో ఒకటి. ప్రధానమైందేమిటంటే యీ జనాన్ని నిర్లక్ష్యం చెయ్యడానికి పిల్లల అంతరాత్మలు అంగీకరించకుండా వుండేటట్టూ, యేదో గుర్తింపు పొందాలనే కాంక్షతో కాక, నిష్కామమైన లక్ష్యాలతోనే పిల్లవాడు పరులకి మంచి చెయ్యడమనేది వుండేటట్టూ చెయ్యాలి.

పిల్లవాడి అంతరాత్మకి ఆధారమూ, పరులకి మంచి చెయ్యాలనే కోరికా, దుఃఖపూరితులైన వాళ్లని గురించి అతనికి కలిగే బాధనుంచి వస్తాయి. వ్యక్తి ఆంతరంగిక ప్రపంచంపట్ల భావుకత, యితరుల బాధపట్ల చలించడం – దాంతో మొదలవుతుంది అత్యున్నత మానవ ఆనందం. అది లేకుండా నైతిక సౌందర్యం అసాధ్యం. "సంతోష చంద్రశాల"లోనే మా విద్యార్థులు తాము దైనందిన జీవితంలో కలుసుకునే వాళ్ల నయనాల్లో దుఃఖమూ, బాధా, విచారమూ, ఆత్రుతా చూడడం

నేర్చుకున్నారు, మానవ నైతిక సౌందర్యపు బాటలో మొదటి అడుగులు వేశారు. బాల్యసంవత్సరాల్లో పరుల కోసం అనునిత్యమూ తపించినప్పుడే యీ సామర్థ్యం పెద్దవాడి నైతిక విశ్వాసాల్లో ప్రవేశించి, ఆధ్యాత్మిక జీవితంతో విడదీయలేని భాగమవుతుంది.

పరులపట్ల అనుభూతి చెందడాన్ని మా విద్యార్థులకి నేను అస్తమానూ నేర్పాను. యితరుల కష్టాలపట్ల జాలిపడడం, సహాయానికీ, అనురాగానికీ నిమిత్తమయే అవసరాన్ని అందుకోగలిగి వుండటం నేను పిల్లలకి నేర్పాను. అవతలి వ్యక్తి బాధ పిల్లవాడికి వ్యక్తిగతమైన వేదన కావాలి, అవసరంలో వున్నవాణ్ణి యెలా ఆదుకోవాలా అని అది పిల్లవాణ్ణి ఆలోచింప చేసేటట్టు చెయ్యాలి. మానవత్వాన్ని రూపుదిద్దడంలో వ్యక్తిగత సంబంధాలు, యిద్దరు వ్యక్తుల మధ్య పరస్పరమైన కలయికలు ప్రముఖ పాత్ర వహిస్తాయి. పొరుగు వాడికి సాయం చెయ్యడంకంటే కూడా మానవాళిని ప్రేమించడం సులభం. మానవస్వభావాన్ని గురించిన స్థిరమైన అవగాహన లేకుండా ప్రజల్ని గురించి తెలుసుకోవడం అసాధ్యం. తన మిత్రుని విచారకరమైన, అర్థించే, బాధాతప్తనయనాలలోని గాఢమైన దుఃఖాన్ని పసిగట్టలేని పిల్లవాడి హృదయానికి మానవదుఃఖం చేరదు. మానవ జీవితపు సకల పార్శ్వాలూ, సుఖదుఃఖాలు రెండూ, తెలియని పిల్లవాడు యెన్నటికీ భావుకుడుగా దయాపూరితుడుగా కాలేడు.

మా క్లాసులోనే బోలెడు దుఃఖం వుంది. కేరింతలు చెలరేగుతున్నాయి, ఉల్లాసం తాండవిస్తోంది, కాని కొందరి పిల్లల కళ్లు విచారగ్రస్తమై వున్నాయి. వాల్యా బళ్లోకి వచ్చిన మూడేళ్లకి ఆమె తండ్రి ఆరోగ్యం బాగా క్షీణించింది. ఆ చిన్నపిల్ల ముఖభావంగా విచారంగా తయారైంది. నీనా, సాషాల తల్లికి తీవ్రమైన జబ్బుగా వుంది, వాళ్లు తరుచుగా తండ్రికి యింటి పనిలో సాయంచెయ్యడం కోసం బడిమానేసేవాళ్లు. షూర మామ్మ తీవ్రంగా జబ్బుపడి మొదట్లో ఒక వారమూ, తర్వాత కొన్ని నెలలూ వరసగా ఆస్పత్రిలో వుంది. అది ఆ చిన్నపిల్లాడికి చాలా బాధాకరమైంది. వాళ్ల మామ్మకి జబ్బుగా వున్నప్పుడు ఆ పిల్లాడు తన మేనత్త దగ్గర వుండేవాడు. ఆమె చాలా మంచిది, షూరని బాగా చూసేది, కాని మామ్మ ఎడబాటు ఆ పిల్లవాడి బాధకి కారణమైంది. చలిగా వుండే ఒక ఆకురాలు కాలపు రోజు షూర వాళ్ల మామ్మని చూడాలని నిశ్చయించుకున్నాడు. మేనత్తకి ఒక్కమాట కూడా చెప్పకుండా అతను ఆస్పత్రికి వెళ్లాడు. దారిలో ముంచుకొచ్చిన వానలో తడిసిపోయి, జలుబుచేసి తీవ్రంగా జబ్బుపడ్డాడు. కొన్ని రోజుల తర్వాత వాళ్ల మామ్మ వున్న ఆస్పత్రిలోనే అతనూ చేరాడు.

వొలోద్య కుటుంబంలో ఒక దుర్ఘటన సంభవించింది. అతని తల్లి గోడలకి వెల్లవేసేది. ఆమె ప్రతిరోజూ బస్‌మీద పనిలోకి వెళ్లేది. వసంతకాలంలో నేల యింకా మంచుతో జారుడుగా వున్నప్పుడు ఆ బస్సు జనం కిక్కిరిసి వున్న కారుని ఢీకొంది. వొలోద్య తల్లికి తీవ్రంగా గాయాలు తగిలాయి. ఆమె జీవితాంతం అంగవైకల్యంతోనే

వుండిపోతుందని డాక్టరు అన్నాడు. అదే సమయంలోనే, వౌలోద్య జీవితంలో సరియైన దారి తొక్కాలని యెంతో శ్రద్ధ చూపించిన అతని తాత చనిపోయాడు.

దుఃఖమే కాని యింకోరకం దుఃఖం కోల్యా కుటుంబంలో సంభవించింది. దొంగిలించిన సామాన్లు దగ్గరున్నందుకుగాను అతని తండ్రిని అరెస్టుచేసి రెండేళ్ల జైలుశిక్ష విధించారు. యింట్లో నైతిక వాతావరణం బాగా చక్కబడిందన్న మాట నిజమే. కాని జరిగిన సంఘటన పిల్లవాడికి పిడుగు పాటు కాక తప్పలేదు.

ప్రతిరోజూ నేను పిల్లల్ని కలుసుకోగానే వాళ్ల కళ్లల్లోకి చూసేవాణ్ణి. బోధన సంక్లిష్టమైన క్రమంలో పిల్లవాడి విచారగ్రస్త నయనాలకంటే కష్టతరమైంది యేమిటి వుంటుంది? పిల్లవాడు విచారంగా వుంటే క్లాసులో జరిగే దానిమీద దృష్టి వుంచలేడు. బిగిసిన తీగలాగ వుంటాడన్న మాట: అజాగ్రత్తగా స్పృశించడం కూడా గాయపరచవచ్చు. ఒకో పిల్లవాడి దుఃఖం ఒకోలా వుంటుంది. వోదారిస్తే ఒకళ్లకి ఉపశాంతిగా వుంటుంది, కాని జాలి మాటలు కొందరికి ఎక్కువ బాధని తెచ్చిపెడతాయి. అలాంటి సందర్భాల్లో బోధనాత్మక నైపుణ్యం మానవ వివేకంలోనే వుంటుంది: గాయపడిన హృదయాన్ని అలానే వుండనివ్వడం, పిల్లవాడికి కొత్తగా బాధని తేకుండా వుండటం, అతని హృదయంలో గాయపడిన భాగాలని స్పృశించకుండా వుండటం. దుఃఖంతోటి దిమ్మెత్తిపోయి గందరగోళ పడిన విద్యార్థి తను ముందు చదివినట్టుగా చదవలేడు. దుఃఖం ఆలోచన క్రమాన్ని ప్రభావితం చేస్తుంది. ఉపాధ్యాయుడి ముఖ్యమైన పని యేమిటంటే, పిల్లవాడి దుఃఖాన్నీ విచారాన్నీ బాధనీ చూడడం: పిల్లవాడి హృదయాన్ని దర్శించి అనుభూతం చేసుకోవడం. పిల్లవాడి దుఃఖాన్ని గ్రహించి పిల్లవాడి హృదయాన్ని అర్థంచేసుకుని తను అనుభూతి చెందగలిగే స్థితి, ఉపాధ్యాయుడి బోధనా సామర్థ్యానికి పునాది అవుతుంది.

దుఃఖంలో వున్న పిల్లవాణ్ణి పాఠాల విషయంలో కదిలించకూడదు, అతన్నుంచి దీక్షనీ, శ్రద్ధగా పనిచెయ్యడాన్నీ ఆశించకూడదు. యేం జరిగిందో అడక్కూడదు: దాన్ని గురించి మాట్లాడ్డం పిల్లవాడికి కష్టం అవుతుంది. ఉపాధ్యాయుడిలో పిల్లవాడికి నమ్మకం వుంటే ఉపాధ్యాయుడు తనకి మిత్రుడైతే అప్పుడు పిల్లవాడు తను చెప్పగలిగింది చెబుతాడు. పిల్లవాడు మాట్లాడకుండా వుంటే అతని వ్యథాకులిత హృదయాన్ని కదిలించకండి... బోధనలో వున్న అత్యంత కష్టభూయిష్ఠమైన విషయం అనుభూతి చెందడాన్ని నేర్పడమే.

పిల్లవాడికి అనుభూతి చెందడం నేర్పాలన్నా, తనకి సన్నిహితంగా వున్నవాడి కళ్లల్లో ఆ వ్యక్తి ఆంతరిక ప్రపంచాన్ని దర్శించడం నేర్పాలన్నా ఉపాధ్యాయుడు పిల్లల అనుభూతుల్ని, ముఖ్యంగా, దుఃఖాన్ని మన్నించగలిగి వుండాలి. 'పెద్దవాళ్లం మాకు తెలుసు లెండిరా కుర్రకుంకలు వూరికే యేడుపుతో అదరగొట్టేస్తున్నారు' అని పెద్దవాళ్లు తేలిక మాటలతో దుఃఖాన్ని పటాపంచలు చేసే దానికంటే పెద్దవాళ్లకీ పిల్లలకీ మధ్యన వుండే నైతిక సంబంధాల్లో దరిద్రమైంది యింకోటి వుండదు.

ముఖ్యమైనది యేమిటంటే, పిల్లవాడి ఉద్రేకాలని గురించి గుర్తుంచుకోవాలి. కొన్ని ప్రత్యేక పద్ధతులద్వారా దీన్ని గురించి బోధించడం అసాధ్యం. ఉపాధ్యాయునిలో హెచ్చుస్థాయి రసాత్మక – నైతిక అభివృద్ధి వున్నప్పుడే అది సాధ్యం. పిల్లవాడి దుఃఖానికి కారణం యేదేనా అస్తమానూ ఒకటి ఉమ్మడిగా వుంటుంది: పిల్లవాడికి మామూలుగా వుండని విచారంలో కొట్టుమిట్టాడే దుఃఖభరిత విచారగ్రస్త నయనాలూ, ఉదాసీనతా, కుంగిపోవడం, ఒంటరితనం. బాధలో వున్న కుర్రాడు తన తోటివాళ్ల ఆటలు గాని సరదాలు గాని గమనించడు. అతని విచారగ్రస్త ఆలోచనలనుంచి అతన్ని యేదీ తప్పించదు. చేయతగ్గ అతి సున్నితమైన సహృదయమైన సాయం యేమిటంటే అతని హృదంతరాళాన్ని కదిలించకుండా వూరికే అతని దుఃఖంలో పాలుపంచుకోవడం. మోటుగా జోక్యం చేసుకోవడం వైషమ్యాన్ని రెచ్చగొట్టొచ్చు, బెంబేలుపడకు, ధైర్యం చిక్కపట్టుకో అనే సలహా కూడా, అందులో మానవ అనుభూతి లేనట్లైతే, పిల్లవాడికి అసందర్భమైన వదరుగా కనిపిస్తుంది.

పిల్లవాళ్లకి అనుభూతి చెందడం నేర్పడం అంటే మొట్టమొదటగా వాళ్లకి మన రసాత్మక – నైతిక సంస్కృతిని అందించడం. ఒక వ్యక్తి ఆధ్యాత్మిక స్థితిని గురించిన అవగాహన లేకుండా రసాత్మక సంస్కృతి అసంభవం. దుఃఖాన్నీ ఆందోళననీ అనుభవించే వ్యక్తిస్థానంలో తననే నిలుపుకున్నప్పుడు పిల్లవాడికి అలాంటి అవగాహన వస్తుంది.

షూర మామ్మ జబ్బుపడినప్పుడు, ఆ చిన్నపిల్లాడు విచారంగా, చింతాక్రాంతంగా వున్నాడు, అదే సమయంలో అనుమానంగా కూడా వున్నాడు. మీరు అతనికి యేదేనా చెప్పారనుకోండి, అతను పుండు పడిన భాగాన్ని రేపినట్టు ఉలిక్కిపడేవాడు. అతని పెద్ద కళ్లలో నీళ్లు గిర్రున తిరగడం ఒక రోజున చూశాను. "షూర యేడుస్తున్నాడని" పిల్లలు నాతో చెప్పారు. వూరికే పిల్లవాడు తన మిత్రులపట్ల లేదా పెద్దవాళ్లపట్లా జాలితో నిండి పోయివుంటాడు అని ఆశించడం అమాయకత్వం. పిల్లలకి తప్పటడుగులువెయ్యడం యెలా నేర్పుతామో అంతే జాగ్రత్తగా, శ్రద్ధగా సానుభూతి చూపించడం కూడా నేర్పాలి. జ్ఞేయంలోని అతి సున్నితరంగాల్లో సానుభూతి ఒకటి, అంటే హృదయంతోటీ, మనసుతోటీ తెలుసుకోవడం. అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుడి ఆయుధాగారంలో సానుభూతి చూపించడం నేర్పేశక్తివంతమైన సాధనంగా పదం వుండాలి.

షూర క్లాసులో లేని క్షణం యెంచుకుని నేను పిల్లలకి చెప్పాను: "ఎవళ్లకేనా దుఃఖం వుంటే మీరు ఆశ్చర్యపోకూడదు. యిప్పుడు షూరకి యెంతో దుఃఖంగా వుంది. అతనికున్న దగ్గరి చుట్టమల్లా అతని మామ్మే. అతను తన తల్లిని యెరగడు. యిప్పుడతని మామ్మ జబ్బుపడింది. బహుశా ఆమెని ఆస్పత్రికి తీసికెళ్లిపోతారు, అప్పుడతను యెవరితో వుంటాడు? మీరు అతని స్థానంలో వున్నట్టు అనుకోండి. బాధ అంటే యేమిటో గ్రహిస్తారు. రోద్దువార మనం కలుసుకున్న ముసలాయన మీకు గుర్తున్నాడా? అతని కళ్లు యెంత విచారంగా వున్నాయో మీకు గుర్తుందా?

ఆ ముసలాయనకి దుఃఖంగా వుందని అప్పుడు మీరు అనుకున్నారు. మీ మిత్రుడి కళ్లల్లో బాధని మీరు యెందుకు గుర్తించరు? యిప్పటికి కొన్ని రోజులుగా షూర ముభావంగా, చింతతో వున్నాడని మీరు చూశారు. అతను క్లాసులో వున్నాడు, కాని అతని ఆలోచనలు వాళ్ల మామ్మ మంచం దగ్గర వున్నాయి. అతను కొన్ని రోజులు యింటిదగ్గర వుండిపోతే యెందుకు బడికి రాలేదు అని తొందరపడి అడక్కండి. తన దుఃఖాన్ని గురించి మాట్లాడ్డం యెవళ్లకేనా కష్టంగా వుంటుంది. మామూలుగా యెవళ్లేవా విచారంగా బాధగా వున్నట్టు కనిపిస్తే ఆత్రమైన ప్రశ్నలడక్కండి. సాయం చెయ్యడానికేదేనా వుంటే చెయ్యండి. పుండుమీద కారం చల్లకండి. మీ క్లాసువాళ్ల కెవళ్లకేనా యేదేనా దురదృష్టం సంభవిస్తే మీరు మాట్లాడే ఒక్కమాట గాని చేసే ఒక్క చర్యగాని ఆ దుఃఖాన్ని పెంచకుండా వుండేటట్టు చూడండి. మరో విషయం – మీరు షూరకీ, అతని మామ్మకీ యెలా సాయం చెయ్యగలరో ఆలోచించండి. కాని మీరు చేసే సాయం గప్పాలుకొట్టుకునేటట్టు వుండకూడదు: "చూశారా మేం యెంత మంచివాళ్లమో, మా మిత్రుడికి సాయం చేస్తున్నాం" అని అనకూడదు. మంచితనాన్ని వూరేగించుకోవడం సమంజసం కాదు. మీ మిత్రుడికి సాయపడు అని మీ హృదయ ప్రబోధం లేకపోతే మంచితనాన్ని యెంతగా ప్రదర్శించుకున్నా మీరు మంచివాళ్లు కాలేరు."

షూర క్లాసులోకి వచ్చాడు. అతన్ని గురించి నేను యింకొక్క మాట కూడా చెప్పలేదు. వెంటనే నేను ప్రసంగ విషయం యెందుకు మార్చానా అని పిల్లలు గ్రహించారు. ఆ చిన్న పిల్లాడికీ అతని మామ్మకీ యెలా సాయపడాలా అని వాళ్లు విరామంలో చర్చించుకోవడం మొదలెట్టారు. పిల్లలు అతనికి యాపిల్‌పళ్లూ, చేపలూ తెచ్చి యిచ్చారు – యిదంతా కూడా నిర్మలిన ఉద్దేశ్యంతోటే చేశారు. వాళ్ల మామ్మని ఆస్పత్రికి తీసికెళ్లిపోయాక, షూర తన మేనత్తతో వున్నప్పుడు పిల్లలు తరుచూ వాళ్లని చూడ్డానికి వెళ్లేవాళ్లు. అతను వానలో తడిసి పడిశంపట్టి జబ్బుపడి వాళ్ల మామ్మతోబాటుగా ఆస్పత్రిలో వున్నాడని తెలిసినప్పుడు పిల్లలు చాలా బాధపడ్డారు. మాకు బడి సెలవు అయిన రోజున మేమంతా ఆస్పత్రికి వెళ్లాం. తమ మిత్రుడి కోసం పిల్లలు యాపిల్‌పళ్లూ, బిస్కట్లూ తెచ్చారు. షూర వాళ్ల నాన్న తనకోసం తెచ్చిన చాక్‌లెట్ బార్ తెచ్చాడు. పిల్లలంతా షూరని చూడ్డానికి అతని వార్డుకి వెళ్లి అక్కడ సగంరోజంతా గడిపారు.

యిది నాకు సంతోషమూ కలిగించింది, కలవరమూ కలిగించింది. యిదంతా సమష్టి ప్రేరణ ఫలితంగా జరిగింది. కొంతమంది పిల్లలు తమ మిత్రుడికి సాయంచేద్దామనుకున్నారు. యేమంటే, తమ మంచిపనులు మిగతా వాళ్లు చూస్తారు కదా. తనకి వాళ్ల నాన్న తెచ్చిన కొత్త స్కేట్స్‌ని తెచ్చి షూరకి ఆస్పత్రిలో యిద్దామని వుందని వొలోద్య అన్నాడు.

"నువ్వు యివ్వచ్చని మీ నాన్న అన్నాడా?" అని నేను అడిగాను.

"ఆఁ, యివ్వచ్చన్నాడు."

"ఆస్పత్రికి తీసుకురావడం యెందుకు? షూర ఆస్పత్రిలో యెలాగూ స్కేట్ చెయ్యలేదు. అతనికి నయమయాక యింటికి వచ్చినప్పుడు యియ్యి."

వొలోద్య స్కేట్స్‌ని షూరకి యివ్వలేదు. ఆంతరంగిక ప్రేరణ బలంగా లేదు... ఆ సంఘటన దయనీ, ఆర్ద్రతనీ, జాలినీ బోధించడం గురించి నన్ను ఆలోచింపజేసింది. యివి చాలా సున్నితమైన సంక్లిష్టమైన విషయాలు. యేదో లబ్ధి వస్తుందన్న భావంతో కాకుండా మంచి చెయ్యాలి అన్న ప్రేరణతోటి యేదో మంచిపని చేసేటట్టుగా పిల్లవాణ్ణి నేను యెలా మలచగలను? మంచిపని చెయ్యాలి అన్నదానికి అవసరమైన నిగ్గు యేమిటి. అది యెక్కడ ఆరంభమవుతుంది? జాలిని బోధించడంలో సామూహిక ఆధ్యాత్మిక ప్రేరణ చాలా ప్రముఖమైనదే ననుకోండి. యేమైనప్పటికీ ప్రతి పిల్లవాడి ఆధ్యాత్మిక జీవితపు వ్యక్తిగత రంగంలోనూ పరులపట్ల సానుభూతి చూపించడమనేది గాఢంగా ప్రవేశించాలి.

ఒక ఆంతరంగిక అవసరంవల్లా గాఢమైన సంతుష్టిని అనుభవించడం కోసమూ మా విద్యార్థులు మంచిపనులు చేసేటట్లూ, తమ మిత్రులకీ, యితరులకీ సాయంచేసేటట్లూ వుండాలని నేను ప్రయత్నించాను. నైతిక బోధనలో బహుశా యిది చాలా కష్టమైన వాటిల్లో ఒకటి: మంచిపని చెయ్యి అని బోధించడమూ, అదే సమయంలో యిలా చెయ్యి అనే సూటి సలహా లేకుండా వుండడమూ. దీన్ని ఆచరణలో యెలా పెట్టాలి? స్పష్టంగా కావల్సిందేమిటంటే పిల్లవాడి ఆంతరంగిక శక్తిని పెంపొందించడం. దేని పుణ్యమా అని పిల్లవాడు మంచి చెయ్యకుండా వుండలేడో అది అంటే అనుభూతి చెందడాన్ని నేర్పడం. కాని దీన్ని యెలా చెయ్యాలి? అవతలి వ్యక్తి దుఃఖాన్ని చూసినప్పుడు పిల్లలు ఆ వ్యక్తి స్థానంలో తాము ఉన్నట్టు అనుకుని స్పష్టమైన ఆలోచనలు స్పష్టమైన అనుభూతులకు చోటిచ్చేటట్టు, పిల్లవాడి జీవితం దుఃఖితుడి జీవితంతో పెనవేసుకు పోయేటట్టు, పిల్లవాడు బాధ ననుభవించే మనిషిలో తననే దర్శించుకునేటట్టు చెయ్యడం యెలాగ?

పిల్లల మధ్య సంబంధాలకీ, అత్యంత కష్టభూయిష్ఠమైన సంక్లిష్ట ఆధ్యాత్మిక జీవితరంగాలకీ సంబంధించిన మా ఉపాధ్యాయుల సమావేశాలు క్రమేపీ మానసిక శాస్త్ర సెమినార్లుగా మారాయి. ప్రాథమిక ఉపాధ్యాయులే కాదు, నడిమి, పై తరగతుల ఉపాధ్యాయులు కూడా వాటిలో పాల్గొనేవాళ్లు. పిల్లవాణ్ణి గురించి, యుక్తవయసొచ్చేవాడి గురించి, యువకుడి గురించి మా చింత అంతా. మేం మానసిక శాస్త్ర సెమినార్లలో నివేదికలు చదివేవాళ్లం. ప్రత్యేకమైన పిల్లవాణ్ణి గురించిన నివేదిక యిచ్చేవాళ్లం. అతని బౌద్ధిక, నైతిక. ఉద్రేకాత్మక, శారీరక, సౌందర్యాభివృద్ధి ఆధారాల గురించిన నివేదిక యిచ్చేవాళ్లం. అతను పాఠశాలాత్పూర్వపు సంతవ్సరాలు గడిపిన విధంమీదా, అది అతని హేతువునీ, ఆలోచననీ, అనుభూతినీ, యిచ్ఛనీ, నడవడికనీ, వ్యక్తిగత విశ్వాసాలనీ యెలా ప్రభావితం చేసిందీ దాన్ని గురించి నివేదిక యిచ్చేవాళ్లం. ప్రాథమిక ఉపాధ్యాయుల నివేదికలు నడిమి, పైతరగతి ఉపాధ్యాయులవి వయసు వచ్చే పిల్లలమీద తమ

ప్రభావాన్ని ప్రసరింప చెయ్యగలిగేటట్టు సిద్ధపరచాయి. మనం బోధించే విద్యార్థి అందరు ఉపాధ్యాయుల ప్రభావంలోనూ వుండడానికి ప్రతి ఉపాధ్యాయుడు ప్రతి ఒక్క విద్యార్థిని గురించి లోతుగా, పూర్తిగా అర్థంచేసుకుని వుండాలనే సమష్టి బోధనాత్మక విశ్వాసం దృఢమైంది.

కొంతమంది పిల్లల అంతరంగిక ప్రపంచాల సంక్లిష్ట రంగాలని సంపూర్తిగా అర్థంచేసుకోవడానికి ఒక్కొక్కప్పుడు రెండు మూడు గంటలు చాలవు. ఆరకంగా, కోల్యని గురించి నేను నివేదిక యిచ్చింతర్వాత కొంతమంది ఉపాధ్యాయులు నా పరిశీలనకి చాలా ముఖ్యమైన వివరణలు జోడించారు: తను బళ్లో చూసిన ప్రతీదీ తన అనుభూతి ప్రపంచంలో యెలా దర్శించిందీ, వేరే మాటల్లో చెప్పాలంటే, అతను ఇతరుల మధ్య సంబంధాలని యెలా అర్థంచేసుకున్నదీ, యితరులతోటి తన సంబంధాలనే యెలా అర్థం చేసుకున్నదీనీ. మంచి చెయ్యాలన్న అంతరిక ప్రేరణకి సంబంధించి, యితరులకి మంచి చేసేటట్టు పిల్లవాడు తనని తయారుచేసుకోవడానికి సంబంధించి మేము కొన్ని ఆసక్తికరమైన నూతన నిర్ధారణలకి వచ్చాం.

దుఃఖం అనుభవించే వాళ్ల మిత్రులపట్ల పిల్లలు యెంత సానుభూతి ప్రదర్శిస్తే అంతగా వాళ్ల హృదయాలు సున్నితమయ్యాయి. పిల్లలు మూడో తరగతిలో వున్నప్పుడు ఫిబ్రవరి నెలలో చలిగావున్న ఒక రోజున మీష, కోల్య, లరీసాలు మా యింటికి పరిగెత్తుకొచ్చారు. వాళ్లు దేన్ని గురించో కలవర పడుతున్నారు.

“వాన్య సోదరుడు ల్యోన్య చచ్చిపోయాడు. వాళ్ల నాన్నకి టెలెగ్రామ్ అందింది. అతను రేపు కజఖ్‌స్తాన్* వెళ్లిపోతున్నాడు. మనమేం చెయ్యాలి?” అంది కాత్యా.

పిల్లల కళ్లు ప్రాధేయపడుతున్నాయి: మా స్నేహితుడికి యెలా సాయం చెయ్యాలో నేర్పండి మాకు అని.

ఆ దుర్ఘటన యెలా సంభవించిందో ఆరోజే మాకు తెలిసింది. 18 యేళ్ల ట్రాక్టరు డ్రైవరు అయిన ల్యోన్య పశువుల క్షేత్రానికి గడ్డి తీసుకెడుతున్నాడు. దారిలో మంచు తుఫాను వచ్చేసింది. అతను ట్రాక్టరు వదిలేసి రోడ్డుకి దగ్గరగానే వున్న వూళ్లోకి వెళ్లిపోవచ్చును. కాని అతను తుఫాను తగ్గిపోతుందనీ, తను గడ్డిని సకాలంలో క్షేత్రానికి తీసికెళ్లి పోగలననీ అనుకుని అలా చెయ్యలేదు. కాని తుఫాను యింకా యెక్కువైంది, చలి విపరీతంగా వుంది. ల్యోన్య ట్రాక్టర్ సీట్లోనే గడ్డకట్టి చచ్చిపోయాడు... వాన్య కొద్ది రోజులు బడికి రాలేదు. పిల్లలంతా విచారంగా వున్నారు. వాళ్ల కిచకిచలు ఆగిపోయాయి. తమ మిత్రునికి యెలా సాయం చెయ్యగలమని ప్రతివాళ్లూ అడిగారు. అతని యింటికి వెడదామన్నారు కొందరు. నేను వద్దన్నాను, “ఆ కుర్రాడూ, అతని తల్లీతండ్రీ అంతా కడివెడు దుఃఖంలో

* కజఖ్‌స్తాన్ – కజఖ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్, సోవియట్ దేశపు నైరుతి మూల వున్న ఒక యూనియన్ రిపబ్లిక్.

వున్నారు. మనం వాళ్లింటికి వెడితే ల్యోన్య బళ్లోకి యెలా వెళ్లేవాడో వాళ్లమ్మకి గుర్తుకు వస్తుంది, అదింకా ఆవిడకి కష్టం కలిగిస్తుంది. వాళ్లమ్మ కొంచెం కుదుటబడ్డాక వాన్యని చూడ్డానికి వెడదాం. అతను మళ్లీ బళ్లోకి వచ్చినప్పుడు వాళ్లన్న యెలా చచ్చిపోయాడని అడక్కండి. దాన్ని గురించి అనుకోవడమూ మాట్లాడ్డమూ కూడా అతనికి కష్టం కలిగిస్తాయి. వాన్యపట్ల శ్రద్ధగా అనుకూలంగా వుండండి. అతన్ని యింకెంత మాత్రమూ కష్ట పెట్టకండి."

వాన్య తండ్రి కజహ్‌స్తాన్‌నుంచి వచ్చాక వ్యవసాయ క్షేత్రంలో ఒక వీధికి తన పెద్ద కొడుకు పేరు పెట్టాలని నాతో అన్నాడు. దాన్ని గురించి పిల్లలతో చెప్పాను. ఆ సమయంలో మా క్లాసు యువ పయనీర్లలో చేరడానికి తయారవుతోంది. తమ దళానికీ, తర్వాతి మూడు శాఖల్లో ప్రతిదానికీ ఎవళ్ల పేరు పెట్టాలా అని పిల్లలు ఆలోచిస్తున్నారు. నేననుకున్నది వాళ్లంతట వాళ్లే అన్నారు: వాన్య వున్న దళానికి విధినిర్వహణ చేస్తూ చచ్చిపోయిన వాళ్ల అన్న లియొనీద్ పేరు పెట్టాలి. ఆ కుర్రాడు ఆ వార్తని తల్లికి చెప్పాడు. స్కూల్‌ని గురించి యేదో ఒక బొమ్మ గీసే ఆల్బం ఒకటి తయారుచెయ్యమని నేను పిల్లలకు చెప్పాను. ప్రతివాళ్లూ లియొనీద్‌కి సంబంధించీ, అతని స్కూలు రోజుల గురించీ గియ్యాలనుకున్నారనుకోండి. అతను మూడో తరగతిలో వుండగా అతను నాటిన యాపిల్‌చెట్టుని పెద్ద పిల్లలు మాకు చూపించారు. లియొనీద్ అతని మిత్రులూ తయారుచేసిన క్రేన్ నమూనాని మేము ఫిజిక్సు క్లాస్‌రూమ్‌లో చూశాం. లియొనీద్‌కి పక్షులంటే యిష్టం. అతను చిన్న పావురాయి గూడు తయారుచేసిన ఆ స్మృతి స్కూలులో మిగిలిపోయింది. పిల్లలు వీటన్నిటి గురించి ఆల్బంలో బొమ్మలు గీశారు. నేను లియొనీద్ బొమ్మ గీశాను. ఆ ఆల్బంని అతని తల్లిదగ్గరికి తీసికెళ్లాం. ఆ బహుమతి ఆవిడకి అమూల్యమైంది: తన కొడుకు స్మృతిని స్కూలు పదిలపరుస్తున్నదని ఆవిడకి సంతోషమైంది. లియొనీద్ పేరున్న యువ పయనీర్ దళానికి అదేరకం ఆల్బం తయారుచేశాం మేము.

దయానుభూతులూ, మంచిపనులూ వూరికే ప్రదర్శనగా మారిపోకుండా వుండటం చాలాముఖ్యం. చేసిందాన్ని గురించి యెంత తక్కువ వీలైతే అంత తక్కువ చెప్పాలి. మంచి పనులకి పొగడ్త వుండకూడదు – యివీ బోధనాకృషిలో వుండాల్సినవి. పిల్లవాడు తన వూహలో తన మంచి పనులు సాహసోపేతమైనవనీ, పొగడ్తకి అర్హమైనవనీ భావించడం మహా ప్రమాదకరమైన విషయం. తరచుగా బడిదే యిక్కడ దోషం. విద్యార్థికి యెవరో పోగొట్టుకున్న పది కోపెక్కుల నాణెం దొరికింది, దాన్ని క్లాసుకి పట్టుకొచ్చాడు, ప్రతివాళ్లకీ తెలుసు అది అతనికి దొరికిందని. యిది నాకు పొరుగున వున్న స్కూళ్లల్లో ఒకదాంట్లో జరిగిందాన్ని గుర్తుకుతెస్తోంది. ఒక అమ్మాయి తనకి దొరికిన అయిదు కోపెక్కుల నాణెం క్లాసుకు తెచ్చింది, ఉపాధ్యాయురాలు ఆ పిల్లని పొగడ్తలతో ముంచెత్తేది... అప్పుడు ఇంటర్వెల్‌లో ముగ్గురమ్మాయిలూ, ఒక అబ్బాయీ ఉపాధ్యాయురాలి దగ్గరికి పరిగెత్తుతూ వచ్చి

అందరూ తమ మిత్రులు పోగొట్టుకున్న డబ్బు తమకి దొరికిందని చెప్పారు - ఒకళ్ల దగ్గర ఒక కోపెక్కు మిగిలిన వాళ్ల దగ్గర తలా రెండు కోపెక్కులనూ. వాళ్లు పొగడ్త కోసం చూస్తూ వున్నారు, కాని యేదో తప్పుజరిగిందని ఉపాధ్యాయురాలు అనుకుని మండిపడింది... యిదీ పిల్లలు "మంచిపనుల కల్తీలు" చేయడానికి అలవాటుపడే పద్ధతి, వాళ్లని గనక యీ మంచిపనులకి పొగడకపోతే, బాధేస్తుంది.

ఆలోచించడంలాగానే దయాగుణం కుడా మామూలు వ్యవహారం అయిపోవాలి. అది ఒక అలవాటు కావాలి. పిల్లవాళ్ల హృదయాలమీద దయాన్విత, నిజాయితీపూరిత కృత్యాలు గాఢమైన సంతృప్తి అనుభూతిని ప్రసాదించేటట్టు ఉపాధ్యాయుడు ప్రయత్నించాలి. ఉపాధ్యాయుడి మాటల ప్రభావంవల్లా, గ్రూపు మనస్థితి ప్రభావంవల్లా పిల్లవాడిలో అవతలి వ్యక్తిపట్ల ఆర్ద్రమైన అనుభూతి ఉద్భవిస్తుంది. అందరు పిల్లల్లోనూ కూడా మంచిపనులు చెయ్యడానికి సంసిద్ధతనీ, ఆర్ద్రమైన జాలిప్రేరణనీ జాగృతం చెయ్యడం చాలాముఖ్యం. అది వ్యక్తిగత కార్యకలాప రూపం తీసుకున్నప్పుడే యీ ప్రేరణ పిల్లవాణ్ణి ఉన్నతుణ్ణి చేస్తుంది.

మా విద్యార్థులు తమ పాత నేస్తం అంద్రేయ్ తాతని మర్చిపోలేదు. శీతాకాలంలో ఆ ముసలాయన తేనెటీగల పెంపక క్షేత్రానికి దగ్గర్లోనే వుండే గుడిసెలో వుండేవాడు. పిల్లలు ఆయనకి యాపిల్‌పళ్లూ, డ్రాయింగులూ తెచ్చారు. ప్రతి దయాపూరితమైన మాటకీ తాత చాలా పొంగిపోతూ వుండేవాడు. ఒంటరితనం అనేది చాలా దురదృష్టమని పిల్లలు భావించి అతనికి మంచి చెయ్య సంకల్పించారు.

మార్చి నెలలో వేడిగా వున్న రోజున పిల్లలు అంద్రేయ్ తాత దగ్గరికి పరిగెత్తుకుని వెళ్లారు: తేనెటీగలను పెట్టిలలో పెట్టడానికి అతనికి సాయపడాలని. ఆవేళ అందరికీ పండుగ రోజు: బంగారు రెక్కల వసంత వైతాళికులు యెగిరి పోతూన్నప్పుడు చూసి పిల్లలు మురిసి పోయారు. తేనెటీగల పెంపక క్షేత్రానికి దారిలో ఒక ముసలావిడ గుడిసెకి కాసిని నీళ్లు తాగుదామని మేము వెళ్లాం. ఆమె మాకు యింట్లో చేసుకున్న బిస్కట్లు పెట్టి అస్తమానూ వస్తూండమని చెప్పింది.

యుద్ధకాలంలో ఓల్గా ఫ్యోదొరొవ్నా భరించరాని దుఃఖంతో గడిపింది: ఆమె యిద్దరు కొడుకులు, భర్త, సోదరుడు యుద్ధంలో హతులైనారు, ఫాసిస్టు జర్మనీలోని బొగ్గుగనుల్లో ఆమె కూతురు నడుం విరిగే శ్రమకి గురై మరణించింది. ఆమె కష్టభూయిష్ఠ గాథని నేను పిల్లలకి చెప్పాను. పిల్లలు ఓల్గా మామ్మతో స్నేహం చెయ్యాలనుకున్నారు. వాళ్లామెను చూడ్డానికి తరుచుగా వెళ్లేవాళ్లు. ఆమె మాకు తన కొడుకులకీ, భర్తకీ వచ్చిన పతకాలూ గౌరవపురస్సర వస్తువులూ చూపించింది. ఓల్గా మామ్మకి ఆనందం కలిగించాలనే కోరిక పిల్లలకి కలిగింది. పళ్లమొక్కల్ని నాటే తరుణం కాగానే మేము అయిదు యాపిల్ చెట్లూ, అయిదు చెర్రీ, ద్రాక్ష మొక్కలు పాతాం: ఆమె కొడుకు కూతుళ్లా సోదరునీ, భర్తా జ్ఞాపకార్థం. అప్పుడు మేము మామ్మ కోసమే చెట్లు పాతాం. ఓల్గా ఫ్యోదొరొవ్నాకి కలిగిన కృతజ్ఞతాభావం

యింతింత కాదు. వేసవికాలంలో వేడిగా వుండే రోజుల్లో మేము మొక్కలకి నీళ్లు పోద్దామని వెళ్లేవాళ్లం, ఆ పని ఆవిడే చేసుకోగల్గినా. వేసవికాలంలో పిల్లలు రోజులకిరోజులు ఆవిడతో గడిపేవాళ్లు.

ఓల్గా మామ్మ పిల్లలకి నేస్తం అయిపోయింది. ఆవిడ లేకుండా పిల్లలు ఒక్క పండగ కూడా జరుపుకోలేదు. చెర్రీలు, యాపిల్స్, భేరీలు, ద్రాక్షలు పక్వానికి వచ్చే క్షణం జారిపోకుండా చూసుకున్నాం. మేము మామ్మతోటకి వెళ్ళి మొదట పండినపళ్ళు యేరి ఆవిడకిచ్చాం. పిల్లలు యేడవ తరగతిలో వుండగా ఓల్గా మామ్మకి తీవ్రమైన జబ్బు చేసింది. విద్యాసంవత్సరం అయిన ఒక వారానికి ఆవిడ చనిపోయింది. పిల్లల కది చాలా విచారకరమైంది. ఆతర్వాత మాకు తెలిసింది - ఓల్గా ఫ్యోదొరొవ్నా తన వీలునామాలో తన యింటినీ పళ్లతోటనీ పిల్లలకి వదిలి పెట్టిందని. ఆ వీలునామా సమష్టి వ్యవసాయ క్షేత్ర అధికారులని గందరగోళ పరిచింది: ఆ యింటికీ, పళ్లతోటకీ పిల్లలు యెలా యజమానులుగా వుంటారు? యే న్యాయసూత్రంకిందకీ రాని యీ సమస్యని పరిష్కరించడానికి సమష్టి క్షేత్ర రైతులు సాయపడ్డారు. ఆ చిన్న మడి ఆధారంగా పిల్లలు తమ మంచిపనులు చెయ్యాలని వాళ్లు అన్నారు. అంద్రేయ్ తాతని ఆ యింట్లో వుండమని మేము పిలిచాం. ఆయన సంతోషంగా అందులోకి మారాడు. అది తేనెటీగల పెంపక క్షేత్రానికి దూరంగాదు. తాము నాలుగో తరగతిలో వుండగా వార్యా, జీనాలు అక్టోబరిస్టు పిల్లలతో స్నేహం చేశారు. వాళ్లని యువ పయనీర్లలో చేర్చడానికి సిద్ధంచేశారు. పిల్లలు రోజులకి రోజులు తమ పళ్లతోటలో గడిపారు.

తన మాతృదేశపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం చేసే పోరాటంలో కొడుకు హతుడుగావడం తల్లికి మహాదుఃఖభాజకమైన విషయం. మా పిల్లల్ని కూడా ఆ దుః ఖంలో పాలుపంచుకోనివ్వండి. వోల్గా నదినుంచి ఎల్బాదాకా, ఆర్కిటిక్ మహాసముద్రంనుంచి మధ్యధరా సముద్రపు వేడి నీళ్లదాకా అజ్ఞాతసమాధుల్లో వున్న పుత్రుల వందలాది వేలాది తల్లుల్ని బడి పిల్లలతో సాంగత్యం చెయ్యనివ్వండి. రెండు కోట్ల యిరవై లక్షల జీవితాలు కోల్పోయిన దుఃఖం, దారుణమైన హింసలూ, దహనాలూ వినాశమూ సృష్టించిన దుఃఖం, యిందులో యే వొక్కటీ మన ప్రజలు మర్చిపోలేరు, లేదా దాన్ని సంభవింప చేసిన ఫాసిస్టు ముష్కరుల్ని క్షమించనూలేరు. మా స్వదేశపూ యీ మహాదుఃఖాన్ని అనుభవించ లేని పిల్లవాడి హృదయాన్ని ఉన్నతం కావించడం అనేది అసాధ్యం.

యెంత గాఢంగా పిల్లవాడు తల్లి దుఃఖాన్ని అనుభూతి చెందితే అంతగా సున్నిత హృదయుడవుతాడు, అంతగా పౌరసత్వపు విశ్వాసాలు దృఢమవుతాయి, అంత గాఢంగా ఆ చిన్నపిల్లవాడు తన మాతృదేశపు భవితవ్యంపట్ల బాధ్యత చెందుతాడు. అందుచేత మహాదేశభక్తియుత యుద్ధంలో వీరమరణం చెందిన కొడుకుయొక్క తల్లిని యువ పయనీర్ సభకి గాని మామూలుగా బడికి గాని పిలవడం అనేదాన్ని బహు నేర్పుగా చెయ్యాలి. పిల్లలకిదేదో సాదా బోధనాత్మక

పరిమాణంలో మెరిసి మాయమైపోకూడదు. మొత్తం ప్రజల దుఃఖాన్ని వ్యక్తం చేసే వ్యక్తిగత దుఃఖం వున్న వ్యక్తితోటి సమావేశం పిల్లలమీద గాఢమైన ముద్ర వెయ్యాలి.

సిద్ధాంతపరంగానే కాదు, బోధనాత్మక ఆచరణలో కూడా ఒక పౌరుణ్ణి తయారుచెయ్యడం చాలా సంక్లిష్టమైన సమస్య. యీ రంగంలో విజ్ఞానం పిల్లవాడిలో జీర్ణమై అతని వ్యక్తిగత జీవితంలో ప్రవేశించడమనేదానికి యెంతో ప్రాముఖ్యం వుంది. స్వదేశాన్ని గురించీ సోవియట్ ప్రజలకి పవిత్రమైందీ ప్రియమైందీ అయిందాన్ని గురించీ వున్న విజ్ఞానం జీర్ణంచేసుకుని నిత్యజీవితంలో ఉపయోగ పెట్టుకునే సమాచారం మాత్రమే కాదు. విద్యార్థి వ్యక్తిగత జీవితాన్ని ప్రభావితం చేసే సత్యాలు యివి. వ్యక్తి గొప్పదనం ద్వారా మాతృదేశపు గొప్పదనాన్ని అర్థంచేసుకోగలిగినప్పుడే అవి పిల్లవాడికి పవిత్రమైనవి అవుతాయి.

"ప్రతీదీ లిఖించబద్ధ బ్రహ్మాండమైన పుస్తకం ప్రజల స్మృతి" అని ప్రసిద్ధ సోవియట్ రచయిత ఎల్. లియోనొవ్ రాశాడు. యీ పుస్తకాన్ని చదవకుండా, ప్రతి మాటనీ, అక్షరాన్నీ గాఢంగా అర్థంచేసుకోకుండా మంచి పౌరుడి విద్య అర్థ రహితమైంది. మాతృదేశంపట్ల ప్రేమనీ, మాతృదేశపు బాధలకీ దురదృష్టానికీ కారణభూతులైన దాని శత్రువులా దోపిడీదార్లపట్ల ద్వేషాన్నీ ప్రజల హృదయాల్లోనుంచి పిల్లల మనసుల్లోకి మొదటగా ప్రసరింపచెయ్యడంలోనే మనం మామూలుగా పిలిచేట్టుగా బడికీ జీవితానికీ మధ్య సంబంధాన్ని నేను పరిగణిస్తాను. ప్రజల స్మృతి అనే మహత్తర పుస్తకంతోటి ప్రతి పరిచయమూ మానవ వ్యక్తిత్వాన్ని రూపొందించడంలో చాలా సంక్లిష్టమైన బాధ్యతాయుతమైన చర్య.

## ఉన్నత భావాలతో నిండిన శ్రమ

మన విద్యార్థుల జీవితాల్లోకి ప్రవేశించి స్నేహ సౌభ్రాతృత్వాల ఆనందం యిచ్చినప్పుడూ, జిజ్ఞాసనీ భుభుత్సనీ పెంచినప్పుడూ, కష్టాన్ని అధిగమించడంలో కలిగే ఆనందాతిరేకాన్ని యిచ్చినప్పుడూ, పరివేష్టిత ప్రపంచంలోని నిత్యనూతన సౌందర్యాలకి మార్గం తెరిచినప్పుడూ, పౌరసత్వపు తొలి అనుభూతిని, యేది లేకుండా మానవ జీవితం అసాధ్యమవుతుందో ఆ పాదార్థిక విలువలకి సృష్టికర్త అనే అనుభూతిని, జాగృతం చేసినప్పుడూ మాత్రమే శ్రమ మహా బోధకురాలు కాగలదు.

శ్రమ సంతోషమే బ్రహ్మాండమైన బోధనాత్మక శక్తి. బాల్యంలో ప్రతి పసివాడూ యీ ఉన్నత భావాన్ని అనుభవించాలి.

మా స్కూలు జీవితపు తొలి ఆకురాలు కాలంలో పెద్ద విద్యార్థులు స్కూలు మడిలో కొన్ని డజన్ల చదరపు మీటర్ల స్థలం మాకు కేటాయించారు. మేమా స్థలాన్ని పారతో తవ్వాం. పల్లెటూరి పిల్లలకు ఈ పని ఏమీ కొత్తది కాదు. అప్పుడు నేను పిల్లలతో అన్నాను: "మనం శీతాకాలపు గోధుమని యిక్కడ చల్లుదాం. ఆ గింజల్ని పోగుచేసి పిండి చేసుకుందాం. దానితో మన మొదటి రొట్టెముక్క తయారుచేద్దాం."

రొట్టె అంటే యేమిటో పిల్లలకి తెలుసు. వాళ్లు తమ తల్లిదండ్రుల్లాగా పనిచెయ్యడానికి ప్రయత్నించారు. అదే సమయంలో మేం చేసే పనిలో యేదో ఆకర్షకరమైన అంశం, క్రీడాత్మకమైన అంశం వుండింది.

మొదటి రొట్టెముక్కని తాము చేయాలనే కల పిల్లలని ఉత్తేజపరిచింది, కష్టాల నధిగమించడంలో వాళ్లకు తోడ్పడింది. కష్టాలూ తక్కువేం లేవు: పిల్లలు తట్టలతో పచ్చి యెరువు మోశారు, దాన్ని మట్టిలో కలిపారు, గోధుమ చాళ్లూ, వరసలూ తవ్వారు, ఒక్కొక్క విత్తనాన్ని యేరారు. విత్తనాలు చల్లడం అనేది ఒక పండగలాగా తయారైంది. శ్రమ తాలూకు ప్రేరణ పిల్లలందర్నీ ఆవహించింది. మడిలో విత్తనాలు చల్లారు. గాని యెవళ్లూ యిళ్లకి పోలేదు. కలలు కందామనుకున్నాం మేము. మేము ఒక చెట్టుకింద కూర్చున్నాం. బంగారు గోధుమ గింజ గురించి నేను ఒక కథ చెప్పాను. ఆ కథని గురించీ, మా యీ పిల్లలు చిన్నతనంలో చేసిన శ్రమ లేకుండా పిల్లతరహాగా వుండకపోవడమే కాకుండా, పౌరసత్వపు తొలి సంతోషరేకలు కలిగివుండటం గురించీ ఆలోచించాను. ఒక విశాలమైన దారిలో వెడుతున్నట్టుగా తనని గురించీ ప్రజల గురించీ తెలుసుకుంటూ, పౌరుడుగా తొలి గర్వానుభూతిని పొందుతూ శ్రమద్వారా సామాజిక జీవితంలోకి పిల్లవాడు ప్రవేశించాలని నేను ఆశించాను. పని సులభంగా వుండనవసరం లేదనే విషయాన్ని నేనెన్నడూ మర్చిపోలేదు. పరిణతి చెందడం అనేది పిల్లలు వినియోగపరచే శారీరక, బౌద్ధిక శ్రమ స్థాయి మేరకు నిర్ణయమవుతుంది. శ్రమ ఫలితంగా పిల్లవాడు పరిణతి చెందుతాడు. పిల్లలకి శ్రమ యెప్పుడు తగినట్టుగా వుందీ, అదే సమయంలో వాళ్ల పెరుగుదలకి సహకరిస్తుందీ అనే దాంట్లోని కష్టాని చూడాలి. పెద్దవాళ్ల ఉత్పాదక క్రియలోని అంశాన్ని పిల్లవాడి శ్రమ కలిగివుంటేనే, అంటే, సమష్టిలోని సభ్యుల సంబంధాల్లో పాదార్థిక ఫలితం వుంటేనే, ఆ లక్ష్యం సాధించవచ్చని సంవత్సరాల అనుభవం నాకు నమ్మకం కలిగించింది.

గోధుమ మొలకలు రావడంకోసం పిల్లలు ఆతృతగా నిరీక్షించారు: యెంత త్వరగా తమ మడి ఆకుపచ్చగా అవుతుందా అని తహతహలాడారు. మొలకలు రాగానే అబ్బాయిలూ అమ్మాయిలూ ప్రతిరోజూ ఉదయం వాటిని చూడ్డానికి పరిగెత్తి పోయేవాళ్లు: అవి త్వరగా పెరుగుతాయా పెరగవా? గోధుమని వెచ్చపరచడానికి శీతాకాలంలో పొలాన్ని మంచుతో కప్పేశాం. వసంత కాలంలో ఆ మొలకలు తివాసీలాగా నేలని కమ్మేసి గోధుమ మొక్కలు వచ్చినప్పుడు పిల్లలు ఉల్లాసపడిపోయారు. ఆ పసివాళ్లు ప్రతి మొక్కని గురించీ ఆత్రపడిపోయారు.

విత్తులు చల్లడం నాటిలాగానే కోతసమయం కూడా పండగలాగా వుండింది. పిల్లలు మంచిబట్టలు వేసుకుని వచ్చారు. ప్రతివాళ్లూ జాగ్రత్తగా గోధుమని కోసి మోపులు కట్టారు. తూర్పార బట్టడం యింకో పండగ. ఒక్క గింజ కూడా వదలకుండా అన్నింటినీ పోగుజేసి సంచీలో పోశారు. అంద్రేయ్ తాత గోధుమని ఆడించి పిండి తెచ్చాడు. తీనా వాళ్లమ్మని మాకు రొట్టె కాల్చిపెట్టమన్నాం. పిల్లలు

ఆవిడకి సాయం చేశారు: అబ్బాయిలు నీళ్లు మోశారు, అమ్మాయిలు వంటచెరకు తెచ్చారు. అప్పటికవి తయారయాయి: నాలుగు పెద్ద గుండ్రటి తెల్లటి రొట్టె ముక్కలు - మా శ్రమ, మా శ్రద్ధ, మా ఉత్సాహం. పిల్లల హృదయాలు గర్వంతో పొంగిపోయాయి.

యెంతగానో నిరీక్షించిన మొదటి రొట్టెల పండగ వచ్చింది. పిల్లలు అంద్రేయ్ తాతనీ, తమ తల్లిదండ్రులందర్నీ పిలిచారు. బుటాలు వేసిన టేబిల్‌క్లాత్ వున్న బల్లమీద ఆడపిల్లలు కమ్మని వాసన వచ్చే రొట్టెముక్కల్ని పెట్టారు. అంద్రేయ్ తాత తేనె నింపిన ప్లేట్లు పెట్టాడు. తల్లితండ్రులు రొట్టె తిని పిల్లల్ని వాళ్ల శ్రమకి అభినందించారు.

పిల్లలు ఆ రోజుని యెన్నటికీ మర్చిపోలేదు. పండగనాడు శ్రమని గురించి గాని, మానవ ఆత్మగౌరవాన్ని గురించి గాని పెద్ద కబుర్లేం చెప్పలేదు. పిల్లలకి ఆ ఉత్సవంలో కలిగిన సంబరం యేమిటంటే గర్వానుభూతి: తాము తమ రొట్టెని పండించుకున్నారు, తల్లితండ్రులకి ఆనందం కలిగించారు. తమ కాయకష్టంపట్ల కలిగిన గర్వం నైతిక నిర్మలత్వానికీ, ఔన్నత్యానికీ ముఖ్యమైన ఆధారాల్లో ఒకటి.

మా మొదటి రొట్టెముక్కల పండగ మిగతా తరగతుల్ని ఆకర్షించింది. తమ రొట్టెని తామే పండించుకోవాలని వాళ్లంతా అనుకున్నారు. మిగతావాళ్లకి రొట్టె పండగ యెందుకు వుందీ తమకెందుకు లేదు తేల్చుకునేదాకా పిల్లలు ఉపాధ్యాయులకి మనశ్శాంతి లేకుండా చేశారు.

యీ సంఘటన ఉపాధ్యాయుల మెదడుకి మేత పెట్టింది. అతి చిన్న విషయం, పొలం దున్నడం, యెరువులు చల్లడం అనేవి అడివిలో షికారు చేయడం లేక ఆసక్తికరమైన పుస్తకం చదవడం అంతగా ఇష్టమైన పనిగా తయారవగలవని తెలిసింది. యెందులోనూ ఆసక్తి లేని సోమరిపోతులు కూడా పనిదగ్గర కొచ్చేసరికి అనూహ్యంగా మారిపోయారని ఉపాధ్యాయులు గమనించారు. పనిచెయ్యాలని అనుకున్నారు వాళ్లు. "కారణమేమిటి?" అనుకున్నాం మేము. ఈ పనిలో పిల్లలకి ఉత్తేజకరమైన లక్ష్యం ఉండడమే ఆకారణమని మేము ఏకగ్రీవంగా అనుకున్నాం. కష్టించడం అనేది మొట్టమొదటగా పిల్లవాడి రసాత్మక జీవితంలో భాగం. పిల్లవాడికి పని ఆనందం కలిగిస్తే అతను పనిచేస్తాడు. పనివల్ల వచ్చే సంతోషం యెంత గాఢమైందైతే, అంతగా పిల్లవాడు ఆత్మగౌరవాన్ని పొందుతాడు, అంత స్పష్టంగా సామూహిక కార్యాచరణలో తన శ్రమా, తన పేరూతోటి భాగస్వామి అవుతాడు - పనిలోని ఆనందం బోధనాత్మక కృషిలో శక్తివంతమైన సాధనం. దాని పుణ్యమా అని తనూ సమష్టిలో సభ్యుడైనట్టు గుర్తిస్తాడు. అలా అని పని యేదో సరదాగా తయారవుతుందని కాదు. అది శ్రమనీ పట్టుదలనీ అపేక్షిస్తుంది. కాని తమముందు ప్రపంచం యింకా విచ్చుకుంటూనే వున్న పిల్లలతో మనం వ్యవహరిస్తున్నామని మనం మరిచిపోకూడదు.

మొదటి రొట్టెల పండగని పిల్లలు వార్షికంగా జరిపారు. తర్వాతి యేడూ పిల్లలు శీతాకాలపు గోధుమ నాటడానికి కొత్తస్థలం యెన్నుకున్నారు, పంట పోగుచేసి మరోసారి తమ తమ తల్లితండ్రుల్నీ కొద్దిమంది బళ్లో చేరని తమ మిత్రుల్నీ ఆహ్వానించారు. మా విద్యార్థులు పెద్ద వాళ్లైనా కూడా తమ బడి మడిలో యెంతో ఉత్సాహంగా గోధుమని పెంచడం, నూర్చడం కొనసాగించారు. గోధుమని ఆడించి రొట్టె కాల్చారు, యిదంతా కూడా క్రీడాపరమైన, ఆకర్షకరమైన అంశాల్ని నిలుపుకుంది. శ్రమలోని ఆనందంతో మరిదేన్నీ పోల్చలేం. సౌందర్యానుభూతి లేకుండా యిది అర్థరహితమైందే కాని యిక్కడ అందం పిల్లవాడు అందుకునేదే కాదు, అన్నిటికంటే ముందుగా తను సృష్టించేది. శ్రమలోని ఆనందమే జీవిత సౌందర్యం: యీ సౌందర్యాన్ని గ్రహించడంలో పిల్లవాడు కష్టాన్ని అధిగమించే గర్వం అనుభవిస్తాడు.

శ్రమించి, స్వేదమన్నా అలసట అన్నా గ్రహించగలిగిన వాళ్లే ఆనందానుభూతిని పొందుతారు. బాల్యం అంటే అవధిలేని ఆటవిడుపు కానక్కర్లేదు - వ్యయించగల శ్రమ లేకపోయినట్లైతే, కాని పిల్లవాళ్ల శక్తికి మించిందీ కాకుండా వుండాలి, శ్రమలోని ఆనందం పిల్లవాడికి అందదు. పిల్లవాడికి శ్రమ విలువని గురించి బోధించడంలోనే ఉన్నత బోధనాయుక్తి వుంది. ప్రజలకి పని అనేది జీనితావసరమే కాదు, పని లేకపోతే మనుగడే అర్థరహితమైంది. అంతేకాక పని ఆంతరంగిక జీవితపు బహుముఖ వ్యక్తీకరణ అయే రంగం, వ్యక్తిత్వపు సంపద వెల్లడి అయే రంగం. మానవ సంబంధాల సంపన్నత్వం పనిలో వెల్లడి అవుతుంది. యీ సంబంధాల సౌందర్యాన్ని పిల్లవాడు గుర్తించలేనట్లయితే పనిపట్ల ప్రేమని బోధించడం అసాధ్యం. శ్రమ కార్యకలాపంలో స్వయంవ్యక్తీకరణకీ, స్వయం నిర్ధారణకీ మనుషులు ముఖ్యమైన సాధనాలని చూస్తారు. శాస్త్రం చెప్పినట్టుగా శ్రమలేని మానవుడు ఒట్టి డొల్ల. విజయవంతమయ్యే శ్రమలో ప్రతి విద్యార్థీ తన స్వయంప్రతిభనీ గర్వాన్నీ దర్శించేటట్టు చెయ్యడం బోధనాకృషిలో ముఖ్యమైంది.

తమ బడిజీవితపు తొలి వసంతంలో పిల్లలు "తల్లుల తోట" నాటారు - ముప్పై ఒక్క యాపిల్ చెట్లూ, అంతే సంఖ్య వున్న ద్రాక్ష మొక్కలూ. నేను పిల్లలకి చెప్పాను: "యీ పళ్లతోట మన అమ్మల కోసం. మనలో ప్రతి ఒక్కళ్లకీ అమ్మ చాలాచాలా యిష్టమైంది, సన్నిహితమైంది. మూడేళ్లలో యీ యాపిల్ చెట్లూ ద్రాక్షమొక్కలూ కాపు కొస్తాయి. మొదటి పంట ఆపిల్సూ ద్రాక్షగుత్తులూ మన అమ్మలకి బహుమానం యిద్దాం. వాళ్లకి సంతోషం కలిగిద్దాం. మీ అమ్మలకి యెన్నో చింతలున్నాయనే విషయం మర్చిపోకండేం. ఆ చింతలకి గాను వాళ్లకి సంతోషం కలిగిద్దాం."

తమ పెద్దలకి, తమ తల్లితండ్రులకి సంతోషం కలిగించే ప్రేరణతో "తల్లుల తోట"లో పని మొదలైంది. కొంతమంది పిల్లలకి తల్లిపట్ల ప్రేమ అనేది, ఆ మానవానుభూతి లోతు అనేది, యింకా తెలీదు. ఆ అనుభూతిని ప్రతి

పిల్లవాడిలోనూ జాగృతం చెయ్యాలని నేను ప్రయత్నించాను. గాల్యా తన సవతితల్లికోసం ఒక మొక్క నాటింది. షూర తన మామ్మ కోసం, వీత్య తన పినతల్లి కోసం ఒకో మొక్క నాటారు. ఆ శ్రమ అంటే ఎవళ్లూ ఉదాసీనంగా ఉండలేదు. వసంతరుతువులోనూ, వేసవిలోనూ పిల్లలు మొక్కలకి నీళ్లు పోశారు, పురుగు పట్టకుండా చూశారు. యాపిల్ చెట్లూ, ద్రాక్షతీగలూ ఆకులు తొడిగాయి. మూడో సంవత్సరంలో మొదటి పూత కనిపించింది, అప్పుడు తొలి పళ్లు వచ్చాయి. ప్రతి ఒక్కళ్లూ నా చెట్టు ముందు కాయాలంటే నా చెట్టు ముందు కాయాలనుకున్నారు.

వాళ్ల చెట్లమీద రసంవున్న ఆపిల్సూ, బంగారు ద్రాక్షగుత్తులూ పండినందుకూ తోల్య, తీనా, కోల్యలు యీ పనంటే సంతోష పడ్డందుకూ నాకు కూడా సంతోషమైంది. పండిన పళ్లని యేరుకుని పిల్లలు తల్లుల దగ్గరకి తీసుకెళ్లారు. అది పిల్లల జీవితాల్లో మరుపురాని రోజు. తన తల్లి కోసం ఆపిల్‌పళ్లు యేరినప్పుడు కోల్య కళ్లల్లో మెరిసిన కరుణ నాకు గుర్తువుంది.

బడి రెండో సంవత్సరంలో పిల్లల శ్రమ ఉన్నత భావాలతో ప్రేరణపొందింది. ప్రతివాడూ తమ యిళ్లదగ్గర తోటల్లో పళ్ల మొక్కలు పాతారు - తమ తల్లి కోసం, తండ్రి కోసం, మామ్మ కోసం, తాత కోసం. "యిది మా అమ్మ చెట్టు, యిది నాన్న చెట్టు" అనేవాళ్లు పిల్లలు గర్వంగా. సాషా తన తల్లీ తండ్రి జ్ఞాపకార్థం యాపిల్ చెట్లు పాతాడు. గాల్యా కోస్త్యలు తమ తల్లుల కోసం యాపిల్ చెట్లు పాతారు. వాళ్లు తమ సవతితల్లులని మరిచిపోలేదు. వాళ్లకీ యాపిల్ చెట్లు నాటారు.

మరే యితర పనికంటే కూడా పిల్లలు యీ పళ్లచెట్లపట్ల యెక్కువ శ్రద్ధ చూపెట్టారు. యాపిల్ చెట్లు పూత పట్టడం కోసం ప్రతివాళ్లూ ఆతృతగా నిరీక్షించారు - మొదటి కాపు కోసం ఎదురుచూసి, యేరుకుని తమ తల్లుల కివ్వాలని. యిది యేదో ఒకదాని తర్వాత ఒకటి పిల్లలు సాధించిన కర్తవ్యధార మాత్రమే కాదు. తాము చేసిన పనిలోని అందం పిల్లలు అనుభవించే నైతికాభివృద్ధిలో యివి సోపానాలు. ఒక వ్యక్తి జీవితంలో అత్యంత పవిత్రమైనది, సౌందర్యవంతమైనది తల్లి. తమ తల్లులకి సంతోషం కలిగించే శ్రమలోని నైతికానందాన్ని పిల్లలు అనుభూతిచెందడం చాలా ముఖ్యం. క్రమేపీ మా సమష్టిలో ఒక చక్కని సంప్రదాయం తలెత్తింది: మానవశ్రమా, భూమాతా కలిసి తమ కానుకలని పుష్కరంగా వర్షించే ఆకురాలు కాలంలో మేం ఆకురాలు కాలపు తల్లుల ఉత్సవం జరిపాం. వేసవి కాలమంతా, ఆ మాటకొస్తే సంవత్సరాల తరబడిగా తను కలగని, తన సొంత శ్రమతో సృష్టించినదాన్ని ప్రతి పిల్లవాడూ ఆ రోజున తన తల్లి కోసం తెచ్చేవాడు: ఆపిల్స్, పువ్వులు, తన బడి చిన్నమడిలో పండిన గోధుమ పరకలు (ప్రతి పిల్లవాడికీ తమ తల్లితండ్రుల తోటలో తమ కిష్టమైన జాగా వుండేది పని చెయ్యడానికి). "మీ తల్లుల్ని గురించి శ్రద్ధ పట్టండి" - పిల్లల్ని ఆకురాలు కాలపు తల్లుల ఉత్సవానికి సిద్ధపరచేటప్పుడు యీ ఆలోచననే మేము పిల్లల్లో గట్టిపరిచాం.

తల్లి సంతోషం పేరుతో యెంత శ్రమ పిల్లవాడు చేస్తే అంతగా మానవత్వం అతనిలో ఉద్దీప్తమవుతుంది.

మేం వసంతరుతువు తల్లుల ఉత్సవం కూడా జరప మొదలెట్టాం. వేసవికాలంలో చాలా బెర్రీపళ్లున్న బయలు అడివిలో చూశాం. దాన్ని పిల్లలు అడివి స్ట్రాబెర్రీ దిక్కు అని పిలిచారు. యీ అద్భుతమైన స్థలాన్ని చూసినప్పుడల్లా పిల్లలు మహా సంబరపడిపోయేవాళ్లు. తమ సంతోషాన్ని తల్లులతో పంచుకోవాలనుకునేవాళ్లు. భూమిని సౌందర్యవంతం చేసే మొదటి పువ్వులని తమ తల్లులకివ్వాలనే భావం పిల్లలకి కలిగింది. ఆరకంగా వసంతరుతువు తల్లుల ఉత్సవం వచ్చింది. ఆ రోజున పిల్లలు తమ తల్లులకి మృదువైన తెల్లని అడివి పువ్వుల్నే కాక, తాము గ్రీన్‌హౌస్‌లో పండించిన పువ్వుల్ని కూడా తీసికెళ్లేవాళ్లు. తల్లులకోసం అంకితమైన ఉత్సవాలు నిర్వహించేటప్పుడు గొడవా, "వ్యవస్థాత్మక పద్ధతులూ" ఉండకూడదు. తల్లుల ఉత్సవాలు సన్నిహితమైన కుటుంబ విషయాలుగా, వ్యవహారాలుగా వుండేటట్టు చూశాం. యిక్కడ ప్రధానమైంది గొప్ప కబుర్లు కాదు, గాఢమైన అనుభూతులు.

తల్లికి మేలు చెయ్యడంకంటే మానవాళిని ప్రేమించడం సులువని పద్దెనిమిదవ శతాబ్దపు జానపద తాత్వికుడు గ్రిగోరీ స్కొవొరొదా అన్నాడని ఒక పాత ఉక్రేనియన్ సూక్తి. బోధకునికి యిందులో యెంతో యుక్తివుంది. మనకి అతి సన్నిహితంగా వున్నవాళ్లపట్ల ప్రేమ దృఢతరం కాకపోయినట్లైతే మానవత్వాన్ని బోధించడం అసాధ్యం. తన తోటివాళ్లపట్ల ప్రేమని ఒలకబోసే మాటలూ ప్రేమా ఒక్కటే కాదు. దయనీ, సానుభూతినీ నేర్పే నిజమైన బడి – కుటుంబం; తల్లిదండ్రులతోటి, తాతా మామ్మలతోటి, రక్తసంబంధీకులతోటి మనకి వుండే సంబంధాలే మానవత్వానికి ఆధారాలు.

పిల్లల శ్రమ సౌందర్యాన్ని సృష్టించేదిగా వుండాలి, ఎందుకంటే సౌందర్యాత్మక, నైతిక బోధన ఏకత దాన్ని ఆపేక్షిస్తుంది. తొలి ఆకురాలు కాలంలో మేము అడవి గులాబి మొక్కల విత్తనాలు పోగుచేసి బడి మడిలో ఒక మూల జాగాలో చల్లాం. యీ మొక్కలకి తెలుపూ, ఎరుపూ, నారింజ పండురంగూ, పసుపూ గులాబీలని అంటుకట్టాం. మా సొంత "గులాబీతోటని" మేం నిర్మించాం. మొదటి పువ్వులు పూయగానే పిల్లలకి కలిగిన సంతోషం యింతా అంతా కాదు. అవి యెక్కడ నలిగిపోతాయోనని పిల్లలు వాటిని తాకడానికి కూడా భయపడేవాళ్లు. పువ్వుల్ని గనక సరిగా కోస్తే గులాబీలు వేసవి అంతా పూస్తాయని నేను చెప్పినప్పుడు పిల్లలు సంతోషంతో వెర్రెత్తి పోయారు. వాళ్లంతా కూడా గులాబీలని తమ తల్లులకి యివ్వాలని అనుకున్నారు. "ఆకురాలుకాలపు తల్లుల" పండగలోని ఆపిల్స్‌తో బాటుగా చిన్న గులాబీగుత్తులని తమ తల్లుల కిచ్చేందుకు పిల్లలకి చాలా సంతోషం కలిగింది.

మా బడి మొదటి సంవత్సరపు వసంతంలో మేము చాలా పువ్వుల మొక్కల్ని పాతాం. అస్తమానూ వాటిని గురించి శ్రద్ధ పట్టాల్సి వచ్చేది, వాటికి నీళ్లు పొయ్యడం

మరీ ముఖ్యంగా కష్టంగా వుండేది. ఆ సమయంలో పెద్ద పిల్లలు పంపు అమర్చిన నీటి తొట్టిని కట్టారు. నీరు పువ్వుల మడిదగ్గరికి వచ్చేది. దాంతోటి పిల్లలందరికీ పనితగ్గింది, అందరూ, ఆఖరికి చిన్న దంకో కూడా, మొక్కలకి ఒక అరగంటలో నీళ్లు పోసేవాళ్లు.

పిల్లల్లో ప్రతివాళ్లకీ పువ్వుల పెంపకం ఒక సొంత సరదా కావాలని నేను అనుకున్నాను. సౌందర్యమూ, సృజనా, మానవత్వమూ - వీటి కలయిక గులాబీలని పెంచడంలో వున్నంతగా హృదయాన్ని ఔన్నత్యం చేసే శ్రమ మరేదీ లేదు. ప్రతి పిల్లవాడూ యింటిదగ్గర సొంత పూల మడి యేర్పాటు చేయడానికి ఇష్టపడేటట్టు చూశాను. మూడో, నాలుగో తరగతుల్లో తాము యింటిదగ్గర పెంచిన గులాబీలని పిల్లలు మెచ్చుకోనారంభించారు.

పిల్లవాడు ఆనందం కోసం గులాబీలు పెంచితే, శ్రమకి తగ్గ ప్రతి ఫలమల్లా సౌందర్యాన్ని ఆస్వాదించడమూ, ఆ సౌందర్యాన్ని యితరుల ఆనందంకోసం సృష్టించినట్టైతే ఆ పిల్లవాడు పెద్దయాక చెడుకీ, నీచమైన పనికీ, సినిసిజానికీ, కఠినత్వానికీ లోనుగాడని జీవితం రుజువుచేస్తోంది. నైతిక బోధనలోని సంక్లిష్టమైన సమస్యల్లో యిది ఒకటి. వ్యక్తికి ఆత్మఔన్నత్యాన్ని బోధించే మంత్రశక్తులేం సౌందర్యంలో లేవు. సౌందర్యాన్ని సృష్టించిన శ్రమ ఉన్నత నైతిక విశ్వాసాలతో మొట్టమొదటగా, మనుషులపట్ల గౌరవంతో, మానవనీయమైనప్పుడే సౌందర్యం నైతికనైర్మల్యాన్నీ మానవత్వాన్నీ బోధిస్తుంది. సౌందర్యాన్ని సృష్టించే శ్రమ యెంత లోతుగా మానవనీయమైనదైతే, అంతగా వ్యక్తి ఆత్మగౌరవం కలవాడుగా తయారవుతాడు, అంతగా నైతిక సూత్రాలనుంచి పక్కకి మళ్లడానికి అసహ్యించుకుంటాడు.

నీతిని బోధించడంలో సౌందర్యపు పాత్ర అనేది ఉపాధ్యాయుల మధ్య చర్చనీయాంశమైంది. ప్రతి పిల్లవాడి ఆంతరంగిక జీవితాన్నీ, ముఖ్యంగా ఉద్రేకాలనీ, ప్రభావితం చెయ్యడంలో ఒక సాధనంగా సౌందర్యానికి చాలా ప్రాముఖ్యం వుంది. కాని అదే సమయంలో యీ ప్రభావపు పాత్రని అధికంగా అంచనా వేస్తామేమోనన్న భయమూ కలిగింది. సౌందర్యం బోధనా ప్రభావంగా యే పరిస్థితుల్లో తయారవుతుంది? ఒక మనస్తత్వ శాస్త్ర సెమినార్‌లో యీ సమస్యని పరిశీలించాం. బోధనాక్రమపు సూత్రాల సామాన్య వివరణ ఫలితమని సమాధానం తేలింది. ప్రాథమిక, మాధ్యమిక, హెచ్చు తరగతుల విద్యార్థుల ఆంతరిక జీవితంమీద ఉపాధ్యాయుని ప్రభావపు మార్గాలూ పద్ధతులూ వివరించుకుని మా అనుభవాన్ని పరిశీలించుకున్నాం. బోధనలో విజయానికి హామీయిచ్చి, అదే సమయంలో బోధనాత్మక క్రమంలోని యితర రంగాల్లోని లోటుపాట్లనీ, బలహీన అంశాలనీ సరిదిద్దే సర్వసమగ్రమైన పద్ధతి యేదీలేదని నిర్ధారణకి వచ్చాం.

ఉత్తమాభిరుచుల బోధనలో అద్భుతమైన పని మీరు చేసి వుండచ్చు, కాని కమ్యూనిస్టు బోధనలోని మిగతా అంశాలు సరిగా నిర్వర్తింపబడకపోయినట్టైతే

అప్పుడు సౌందర్యపు బోధనా ప్రభావం నీరసపడుతుంది, ఆ మాటకొస్తే లుప్తమవుతుంది కూడాను. సమాన ప్రముఖ్యం కల క్రమాలని సహగామిగా నిర్వహిస్తేనే పిల్లవాడి ఆంతరిక జీవితంమీద ప్రతి ప్రభావమూ బోధనాత్మక శక్తిని సమకూర్చుకుంటుంది. కొన్ని పరిస్థితుల్లో ఒక వ్యక్తి పువ్వుల కోసం శ్రద్ధపట్టవచ్చు, వాటి అందాన్ని ఆస్వాదించవచ్చు, కాని అదే సమయంలో సినిక్‌గా, ఉదాసీనంగా, కఠినంగా వుండవచ్చు. వ్యక్తిత్వపు ఆంతరంగిక ప్రపంచంమీద ప్రభావం నెరిపే సాధనాలమీద, బోధకులమైన మనం ఆశలుపెట్టుకున్న ప్రభావంతో సహగామిగా వున్న దానిమీద, ప్రతీదీ ఆధారపడి వుంటుంది.

యీ సత్యాలంటే ఉపాధ్యాయులకి నమ్మకం కుదిరింది. స్థిరమైన, వాస్తవజీవిత పరిస్థితుల చర్య బోధనాత్మక ప్రభావాల సామరస్యం అనే సమస్యకి దారితీసింది. నా అభిప్రాయంలో యిది బోధనలోని మౌలిక సూత్రాలలో ఒకటి. యీ సమస్యని మన స్కూళ్లలో పరిష్కరించారని నేను చెప్పలేను గాని యేమైనా దీని పరిష్కారానికి చాలా కృషి జరిగింది. బోధనలోని ముఖ్యమైన సూత్రాల్లో ఒకదాంట్లో యీ సమస్య సారం వెల్లడైంది. అందులో వున్నది యిదీ: వ్యక్తిత్వంమీద ప్రభావం కలిగించే ప్రతి మార్గంలోని బోధనత్మాక ఫలితము మిగతా ప్రభావాలు యెంత బాగా ఆలోచించబడి, ప్రయోజనాత్మకంగా, ఫలవంతంగా వుంటాయో దానిమీద ఆధారపడి వుంటుంది. బోధనా పద్ధతిగా శ్రమ శక్తి యెంత బాగా వెల్లడవుతోందో యెంత బాగా హేతువూ ఉద్రేకాల బోధన ఆలోచించబడిందో దానిమీద బోధనాత్మక సాధనంగా సౌందర్యపు శక్తి ఆధారపడి వుంటుంది. పెద్దల వ్యక్తిగత ఆదర్శపు శక్తి బాగా ప్రభావం కలిగిస్తేనే, మిగతా అన్ని బోధనాత్మక పద్ధతులూ నైతిక నిర్మలినత్వంతోనూ, ఔన్నత్యంతోనూ నిండి వుంటేనే, ఉపాధ్యాయుని మాటలు బోధనాత్మక శక్తిని సంతరించుకుంటాయి.

బోధనాత్మక ప్రభావాల మధ్య కొన్నివేల ఆధారితాలూ షరతులూ వుంటాయి. కడకి వీటిని పరిగణలోకి తీసుకునే మార్గమే బోధన తాలూకు ఫలితాన్ని నిర్ణయిస్తుంది. వందలాది యితర ప్రభావాలు లేనట్లయితే వ్యక్తిత్వంమీద ప్రభావాన్ని పోగొట్టుకోవడం జరుగుతుందనీ, వందలాది యితర సూత్రాలని సాధించకపోయినట్లయితే యే సూత్రమైనా బోలుగా తయారవుతుందనీ, వాస్తవాన్ని అలక్ష్యం చెయ్యడంనుంచే బోధనాశాస్త్రం జీవితంలో సరితూగలేకపోతోందనే యెడతెగని విమర్శలు వస్తున్నాయనుకుంటున్నాను. వ్యక్తిత్వంమీద వందలాది వేలాది ఆధారితాల, పరస్పరాధారితాల చర్యలని పరిగణనలోకి తీసుకోలేక పోయినంత మేరకి బోధనా శాస్త్రం వెనకబడి వుంటుంది. బోధనా స్వరూపపు ఆధారితాలని, నియమాలని పరిశోధించి, వివరణ యివ్వగలిగినప్పుడే బోధన కచ్చితమైన, నిజమైన శాస్త్రంగా తయారవుతుంది.

....కొన్ని పుష్పోత్సవాలు బయల్దేరాయి. వసంత పుష్పోత్సవం – లిలీ ఆఫ్ ది వాలీ పుష్పపూ, త్యులిప్, లైలాక్ పుష్పాలా ఉత్సవాలు. మా స్కూలు మొదటి

ఆకురాలు కాలంలో మేం వేసిన లైలాక్ తోటలోకీ, అడివిలోకీ వెళ్లాం. అద్వితీయమైన రంగుల సమ్మేళనాన్ని చూడ ప్రయత్నిస్తూ, ప్రతి విద్యార్థీ ఒక పూలగుచ్ఛాన్ని పోగుచేశాడు. మేం పచ్చిక మైదానం మీదకి వెళ్లి పుష్పగుచ్ఛాల్ని చూసి ఆనందించాం. మేము వాటిని మా తల్లులకీ, మా మిత్రులు అంద్రేయ్ తాతకీ, ఓల్గా మామ్మకీ యిచ్చాం. బళ్లో చేరని చిన్న పిల్లల్ని పిలిచి వాళ్లకీ చిన్న పుష్పగుచ్ఛాలు యిచ్చాం.

రెండవ ఉత్సవం గులాబీల ఉత్సవం. స్కూలు గులాబీ తోటలోనూ, ఇంటి దగ్గర తోట మళ్లల్లోనూ గుచ్ఛాలు పోగుచేశాం.

మూడవ ఉత్సవం అడివిపువ్వుల ఉత్సవం. యిది అన్నిటినీ మించిన ఆనందాన్ని పిల్లలకి కలిగించింది. పువ్వులు ముఖ్యంగా అందంగా వుండే పొద్దుటివేళ మేము పొలంలోకి వెళ్లాం. అడివిపువ్వుల గుచ్ఛాన్ని పోగుచెయ్యడమనేది నిజమైన సృజనాత్మకత. ఆ గుచ్ఛాలని స్కూల్‌కి తీసుకొచ్చాం. విశ్రాంతి తీసుకుంటూ అడివిపువ్వులు మా స్కూలు తోటలో వికసిస్తాయని వూహించుకున్నాం. యెక్కడ మంచి అందమైన పువ్వులు పెరిగాయో గుర్తుంచుకుని అక్కడ ఆకురాలు కాలంలో విత్తనాలని పోగుచేశాం. పాదుల్ని తవ్వాం. అప్పుడు మేం వాటిని మా స్కూలు తోటలో పాతాం. మా స్కూలు దగ్గర అడవిపువ్వులు పూశాయి.

ఆకురాలుకాలపు పుష్పోత్సవం లేదా చామంతుల ఉత్సవం వేసవికి విచారకరమైన వీడ్కోలు. ఆ ఉత్సవాన్ని యెంత ఆలస్యంగా జరపవీలైతే అంత ఆలస్యంగా జరిపేందుకు మేము చాలా కష్టపడి పనిచేశాం... మేము చామంతి పొదల్ని చలిగాలులనుంచీ, మంచునుంచీ కాపాడాం. ఆకురాలు కాలపు వసంతోత్సవం తర్వాత మేము ఆ పొదలని గ్రీన్‌హౌస్‌లో నాటాం.

మూడవ తరగతిలో పిల్లలు మొదటిసారి స్నోడ్రాప్స్ అనే అడివి పువ్వుల ఉత్సవం జరిపారు. అడివిలో నేలమీద యింకా మంచు వుంది, కాని నేల శీతసుషుప్తినుంచి మేల్కొంది. ఖాళీ జాగాల్లో వూదానీలం, తెలుపు పువ్వులు ఉదయించాయి. ఆ రోజు పిల్లలు తల్లులకి చిన్న పుష్పగుచ్ఛాలు తెచ్చారు.

శ్రమలోని సంతోషపు ఆధారాన్ని పిల్లలు దర్శించేటట్టు చెయ్యాలని నేను ప్రయత్నించాను. తిండి బట్టలు సంపాదించడానికి, యేదో నెత్తిమీద ఆచ్ఛాదన వేసుకోవడానికి కాదు ఒక వ్యక్తి శ్రమించేది, తనకీ యితరులకీ ఆనందం యిచ్చే పువ్వులు తన యింటిపక్క పెంచడానికి కూడా అతను శ్రమించాలి. బాల్యంనుంచీ కూడా సంతోషాన్ని సృష్టించడానికే అతను శ్రమించాలి.

పిల్లలు బడిచదువు ఆరంభించిన యేడాది తర్వాత వాళ్ల యిళ్లదగ్గర మళ్లలో సౌందర్య దిశలు ప్రత్యక్షమయ్యాయి. దాదాపు అందరు పిల్లలూ గులాబీలు పెంచారు. అంతేకాక ప్రతిపిల్లవానికీ తనకిష్టమైన పువ్వులుండేవి. వార్యా, లీదా, పవ్లో, సెర్యోజ, కాత్యా, లరీసా, కోస్త్యలకి చామంతులంటే యిష్టం. సాన్య, జీనా, ల్యూబా, ల్యూదా, సాషలు కార్నేషన్స్‌నీ, త్యులిప్‌లనీ పెంచారు. వాన్యా, వీత్య, పేత్రిక్‌లు కొన్ని లైలాక్

పొదల్ని పెంచారు. పువ్వుల్ని యెలా పెంచాలో, మొక్కల్ని యెలా కాపాడాలో, మొక్కలకి మంచి చోటు కోసం యెలా వెదకాలో నేను పిల్లలకి చెప్పాను.

కోల్యకీ అతని తల్లికీ మధ్యన పువ్వులపట్ల ప్రేమ వాదానికి కారణమైంది. ఆ పిల్లవాడికి గ్రీన్‌హౌస్‌లో పనిచెయ్యడం అంటే యిష్టం. నేను అతనికి మూడు చామంతి మొక్కలిచ్చి వాటిని యెలా నాటాలో చెప్పాను. అదే సమయంలో మేము పిల్లలకి మంచి టొమాటో మొక్కలనారు పంచాం. కోల్య చామంతి మొక్కలతో బాటుగా డజను టొమాటో మొక్కలు యింటికి తీసికెళ్లాడు. అతని తల్లి టొమాటోలని పాతింది. కోల్య చామంతుల్ని పాతాడు. రెండు వారాలతర్వాత వేళ్లుతన్నుకున్న చామంతి మొక్కల్ని వాళ్ల అమ్మ చూసి పీకేసింది. పారేసిన మొక్కల్ని చూసి ఆ కుర్రాడు యేడుపు మొదలెట్టి తల్లిదగ్గరకి పరిగెత్తాడు. ఆవిడ నవ్వడం మొదలెట్టింది: "ఓర్నీ, అప్పుడే మొక్కల కోసం పలవరించేటంత వాడినయ్యానంటావూ? అవెందుకురా మనకి? యింతకాలం అవి లేకుండా బతకలా? యీపైనా అలాగే బతగ్గలం." ఒక్క మాట బదులు చెప్పకుండా కోల్య వాటిని తీసుకుని గాదె వెనకాల పాతాడు.

కొంతకాలం తర్వాత ఆ కుర్రాడు కొన్ని నీలాంబరం పువ్వులు తల్లికిచ్చి అన్నాడు: "అమ్మా, చూడు, యెంత బాగున్నాయో యివి" అని. యీ మాటల్లో పిల్లవాడు సంక్లిష్టమైన అనుభూతులు నింపాడు. బహుశా అతను చెప్పదలచుకున్నది "అమ్మ, మనింట్లో బతుకు కూడా యీ పువ్వులంత బాగానూ వుండాలి" అని కావచ్చును.

పిల్లలు "పక్షి ఆస్పత్రి"లో చాలా ఉత్సాహంగా పనిచేశారు. తుఫాన్ల తర్వాత మేం అడివికి వెళ్లి చెట్లమీదనుంచి పడిన రెక్కలురాని చిన్న పిట్టల్ని పోగుచేసేవాళ్లం. "పక్షి ఆస్పత్రి"లో దాదాపు అన్ని వేళల్లోనూ కంఠాలు వినబడేవి... తీవ్రమైన శీతాకాలపు చలిసమయాల్లో పిల్లలు గుమ్మడి గింజలతోటి పక్షి మేత నింపిన పళ్లేన్ని ఆస్పత్రి కిటికీ బయట పెట్టారు. చాలా పక్షులు మేతకి అక్కడికి వచ్చేవి. అక్కడ తగినంత మేత లేకపోతే అవి ఒకటే గొడవచేసేవి. పిల్లలు గింజల్ని బల్లమీద విసేరేవాళ్లు. పక్షులు గదిలో లోపలికి వచ్చి మేతని తినేవి. క్రమేపీ ఆ పక్షులు పిల్లలకి అలవాటుపడ్డాయి. ఎక్కువసేపు వుండేవి. బాగా చలి వణకించే రాత్రిళ్లలో అవి బయటికి పోయేవి కాదు. అవి పిల్లల భుజాలమీదా, చేతులమీదా, తలలమీదా వాలి కిచకిచలాడేవి. ఎండగా వున్నప్పుడు అవి మేతమేసి మళ్లీ యెగిరి పోయేవి. పిల్లలకి తమ పక్షిమిత్రుల ఎడబాటు అంటే యిష్టం వుండేది కాదు. పక్షులు కూడా యిది గమనించినట్టు వుంది: పిల్లలు వాటి కీచుకీచుధ్వనుల్లో క్షమార్పణ గ్రహించినట్లుండేది – క్షమించండి, మేం ఎక్కువసేపు వుండలేము.

కోల్య, యూర, సాష, పవ్లోలు గంటలకొద్దీ "పక్షి ఆస్పత్రి"లో వుండిపోయేవాళ్లు. వాళ్ల యిళ్లదగ్గర చిన్నపక్షుల మేత స్థలాలు తయారు చేసుకొమ్మని

పిల్లలకి చెప్పాను. గుమ్మడిగింజలు వున్న చిన్న అరలు కిటికీలలో ప్రత్యక్షమయ్యాయి. పవ్లో చిన్న పక్షిగూడు తయారుచేశాడు.

పైకి యిదంతా కూడా బోధనకి సంబంధం లేనట్టు కనిపించవచ్చును. కాని వాస్తవంగా, సజీవమైన వాటికోసం శ్రద్ధవహించడం సౌకుమార్యాన్నీ, ఆర్ద్రతనీ నేర్పుతుంది.

నేను ముందే చెప్పినట్టు, భరద్వాజ పిట్ట పండగ మూడో తరగతిలో మొదలై శ్రమకీ, కళాత్మక సృజనకీ పండగ అయింది. ఆడపిల్లలు గోధుమ పిండితోటి చిన్న భరద్వాజ పిట్టల్ని తయారుచేసి కాల్చేవాళ్ళు. తమ సృజనలో పక్షి ఎగురుని ప్రతి వాళ్లూ వ్యక్తంచెయ్య ప్రయత్నించారు. ఆడపిల్లలు ఒకళ్ల కొకళ్లకి తమ పిట్టల్ని చూపించుకున్నారు. వాటిలో వూరికే చలనమే కాదు, పాటని గ్రహించారు. "నీ పిట్టేం పాడదు. నా పిట్ట పాడుతుంది" అని అనడం ఆ వేళ వినిపించింది.

పిల్లలు పెద్దవాళ్లయ్యాక వాళ్లు పొలాల్లోనూ, పశువుల క్షేత్రాల్లోనూ పని చేస్తారు, వాళ్లు సేద్యగాళ్లుగానూ, పాలుపితికేవాళ్లుగానూ తయారవుతారు, వ్యవసాయకులుగానూ తోటమాలీలుగానూ తయారవుతారు. పొలంలో పని చెయ్యడం తాలూకు సౌందర్యాన్ని చిన్నతనంలో అనుభవించడం వాళ్లు నేర్చుకోవాలి. మామూలు వ్యవసాయిక శ్రమ వాళ్లకి సంతోషం యివ్వడం ముఖ్యం. ఆటలూ, శ్రమ శీతలత్వపు సమష్టి ప్రేరణా, సమష్టిలోని పరస్పర సంబంధాల సౌందర్యమూ, స్నేహమూ, పరస్పర సహకారమూ లేకుండా అది అసాధ్యం. మా విద్యార్థులు ఎప్పుడూ ఉమ్మడి ఆశయాన్ని తమ సొంత విషయంగా పరిగణించారు. దాని ఫలితాల గురించి ఆలోచించారు. కలిసి పనిచెయ్యడానికి మా తరగతి అలవాటు పడింది.

వసంతకాలపు తొలి రోజుల్లో మేము పశువుల క్షేత్రంలో పనిచేసే తాన్యా తండ్రి దగ్గరకి వెళ్లాం. గాదె దగ్గర ఒక వెచ్చటి చోటుని యెంచుకుని అక్కడ చిన్న కొట్టంలో నాలుగు గొర్రెపిల్లల్ని వుంచాడు. అవి మా కోసమన్నమాట. ఆయన అతి నీరసంగా వుండేవాటిని యెంచుకొన్నాడు. మనం వాటిని శ్రద్ధపట్టి, రోజూ పాలూ గడ్డీ పెట్టి సాకి వాటికి బలం వచ్చేటట్టు చెయ్యాలని నేను పిల్లలతో చెప్పాను.

ఏదీ ఆసక్తి కలిగించలేని పరమ సోమరిపోతు పిల్లలూ, యేదీ కదిలించలేని కఠినాత్ములూ వుంటారని తరచూ అంటారు. కాని అది సరికాదు. పశువుల క్షేత్రంలో చిన్న గొర్రెపిల్లలకి సంరక్షణ చేయడంలాంటి పనితో పసిపిల్లల్ని ఉత్తేజరపచండి (ఎదిగే పిల్లలకి కాదు, పదకొండు పన్నెండేళ్లు బాగా ఆలస్యమైపోయినట్టే లెక్క) పిల్లలతోటి ఒకటి, రెండు నెలలు పని చెయ్యండి, యెంత కఠిన మనస్కుడూ యెలా చలించి పోతున్నాడో తెలుస్తుంది. కలిసి పనిచెయ్యడం గనక పిల్లలు ఆనందించగలిగితే, వాళ్లు పెద్దవాళ్లయ్యాక కష్టించి పనిచేసే వాళ్లవుతారు. మా క్లాసులో ఒక్క సోమరిపోతు, నిర్లక్ష్యపూరిత విద్యార్థీ లేడు. దానికి కారణం పిల్లలు మామూలు శ్రమతోటి ఉత్తేజితులయారు.

మేము మంచి గడ్డిని తీసుకుని పిండి చేసాం, దానితో గొర్రెపిల్లలకి అంబలి వండించాం. వాటికి పాలుపట్టేవాళ్లం. గొర్రెపిల్లలు పచ్చిగడ్డిని మెయ్యడం మొదలెట్టగానే పిల్లలు వాటికోసం గ్రీన్‌హౌస్‌నుంచి బార్లీ, ఓట్‌కాడలు తెచ్చేవాళ్లు. గడ్డి పచ్చి తిరగగానే పిల్లలు మెయ్యగలిగినంత తాజా మేతని తెచ్చేవాళ్లు. గాదె దగ్గర గొర్రెపిల్లల కోసం తాన్యా తండ్రి కంచెకట్టాడు. మేం గొర్రెపిల్లల్ని అక్కడికి రోజంతా ఆడుకోడానికి తోలేవాళ్లం. అది మా "గొర్రెల క్షేత్రం."

స్కూలు చదువు మూడో యేట యింకో కొత్త శ్రద్ధ వచ్చింది - అబ్బాయిలూ, అమ్మాయిలూ ఆవుదూడని సాకాలనుకున్నారు. పాలక్షేత్రంలో మళ్లీ మా కోసం ఇంకో జాగా కేటాయించారు. తమ దూళ్ల కోసం పిల్లలు శీతాకాలమంతా గ్రీన్‌హౌస్‌లో పచ్చిక పెంచారు. వేసవిలో మేము దూళ్ల కోసం గడ్డిని యెండబెట్టేవాళ్లం. దాదాపు ప్రతిరోజూ చాలామంది పిల్లలు క్షేత్రానికి వెళ్లేవాళ్లు.

వసంతరుతువు వచ్చాక గొర్రెల్నీ, దూళ్లనీ పచ్చికబయల్లో కట్టెయ్యడానికి తోలుకుపోయినప్పుడు పిల్లలు ఒంటరితనం అవహించినట్లు బాధపడ్డారు. ప్రకృతి మధ్యలో పచ్చిక బయలులో ఒక రోజుకేనా వుండాలని వాళ్లు అనుకున్నారు. ఆదివారంనాడు మేము అక్కడికి వెళ్లాం. కోసిన గడ్డిని మెయ్యడం కోసమని మేము గొర్రెల్ని గొర్రెపిల్లల్ని వదిలాం. గొర్రెపిల్లలకి తొలివసంతపు గడ్డి మంచి మేత. వేసవికాలంలో స్కూలు తరువాత పిల్లలు పచ్చిక బయలుకి దాదాపు రోజూ వెళ్లేవాళ్లు. బాల్యంలో రోజువారీ కృత్యాల అందంతో ఉత్తేజితుడు కాని యెవడూ మామూలు వ్యావసాయికపు పనిని ప్రేమించలేడు.

బడి మళ్లలో పిల్లల పనిని కూడా ఆ భావనాత్మక జ్వాల దీప్తం చేసింది. మొదటి తరగతిలో మాకు 0.1 హెక్టారు నేలని కేటాయించారు. పెద్ద విద్యార్థుల సాయంతోటి పిల్లలు యిక్కడ యిటుకల గోడలతోటీ, పెంకు కప్పుతోటీ, చెక్కనేలతోటీ, చిన్నిపొయ్యీ, నీటిగొట్టం, విద్యుచ్ఛక్తి అమర్చిన చిన్న యిల్లు కట్టారు - అంతా అసలైన యింటి లాగానే, అంత పెద్దది కాదంతే. వాళ్లు దాన్ని "ఆకుపచ్చ మందిరం" అని పిలిచారు. వాళ్లు ప్రకృతిని గురించిన కథలు చదవడానికీ, వినడానికీ అది యింకో సౌఖ్యప్రదమైన స్థలం అయింది. తర్వాత పిల్లలు మూడో తరగతిలో వున్నప్పుడు యీ చిన్ని యింట్లో మేము విత్తనాలతో ప్రయోగాలు చేశాం.

ఆ చిన్న యింటిని కట్టడం పనీ, ఆటా కూడాను. ఆ పని పూర్తయాక, పిల్లలకి తమ చేతుల్తో చేసిన పనిపట్ల శ్రద్ధ పెరిగింది. ఆ చిన్న యిల్లు తమ శ్రమ ఫలితమని వాళ్లకి తెలుసు. జీవితానుభవ స్థానాన్ని మరే వివరణా కూడా పొందలేదు.

ఉమ్మడి ఆస్తిని మన్నించ గలందులకు గాను, యితరులతో కలిసి పనిచేసే అనుభవాన్ని పిల్లవాడు పొందాలి. యెవళ్లకేనాగాని ఉమ్మడిదైంది ప్రియమైనప్పుడే పాదార్థిక విలువల సారం అవగతమవుతుంది. యీ గుణం బాల్యంలోనే అలవడాలి. వయసొచ్చే పిల్లలు సామాజిక ఆస్తి దగ్గర కొచ్చేసరికి దుబారాగా తయారవుతున్నారని

తొలి యవ్వనంలో, యెదిగేటప్పుడూ యెవళ్లేనాగానీ పొదుపుగా అంతర్గత క్రమశిక్షణతో వుండాలని మీరు కోరుకుంటే, వాళ్ల సామాజిక ఆసక్తులు నిరాడంబరంగా వుండాలని మీరు కోరుకుంటే, తన సొంత ఆస్తి కాని వాటిపట్ల మనస్ఫూర్తిగా బాధపడాలని మీరు కోరుకుంటే, సామాజికమైందాన్ని విలువైందిగా గుర్తించడాన్ని మీరు బాల్యంలోనే వాళ్లకి నేర్పాలి. అది వాళ్ల వ్యక్తిగత ఆనందంలో భాగం అయిపోవాలి.

"ఆకుపచ్చ మందిరం" పక్కనే ఒక మడి వుంది. మేము గోధుమ, బార్లీ, బక్‌వీట్, మొక్కజొన్న, పొద్దుతిరుగుడు పువ్వులు పెంచాం. మేము విత్తనాలని ఆ యింట్లోనే యెంచుకునేవాళ్లం, అక్కడనే పంటని నిల్వచేసే వాళ్లం, ఎరువులు కూడా మిశ్రమం చేసేవాళ్లం. ఏదో తెలుసుకుంటున్నామన్న దాని భావోద్రేకంతో పిల్లలు ఉత్తేజితులయ్యారు. పిల్లలు శ్రద్ధగా అవగాహన చేసుకొంటూ పనిచేసేవాళ్లు. ప్రకృతి ధర్మాల రహస్యాలు వాళ్ల ముందు విశదమయ్యేవి ప్రకృతి శక్తుల్ని ఉపయోగించుకునే జ్ఞానం శ్రమ ద్వారానే లభిస్తుందని వ్యక్తిగత అనుభవంద్వారా మా విద్యార్థులు గ్రహించేటట్టు నేను జాగ్రత్త పడ్డాను. ఒక గోధుమ గింజని గురించీ, శ్రమవల్ల అది సార్థకం అవడం గురించీ నేను పిల్లలకి చెప్పాను. మట్టిలో వున్న అద్భుత జీవప్రపంచాన్ని పిల్లలు తెలుసుకున్నారు. మట్టిలోకి మేం జీవవస్తువుని వేస్తున్నాం, మట్టి సారవంత మవుతోంది. పిల్లలు తలా ఒక వంద గోధుమ గింజలూ నాటి, మొక్కలు యెలా పెరిగేదీ ఆసక్తిగా గమనించారు. గోధుమ కంకులు నిండుగా, గోధుమ పొల్లులేకుండా వుండేందుకుగాను, మట్టిని సారవంతం చేసే ప్రయత్నంతో పిల్లలు ఉత్సాహభరితులయ్యారు. ప్రతివాళ్లూ తమ మొక్కలకి యెరువులు వెయ్యాలనుకున్నారు. అతి చిన్న పనులని సాధించే ప్రేరణతో ఉత్తేజితులైన పిల్లలకి యిది నిజమైన సృజన. వాళ్లు గోధుమ కాడల్ని జాగ్రత్తగా కోసి తూచడానికిగాను వెయ్యింటిని పేర్చేవాళ్లు. ఎక్కువ పంట పోగుచేసినవాడు మహదానంద భరితుడై పోయేవాడు, మిగతా పిల్లలు యింకా బాగా పనిచెయ్యాలని అనుకునేవాళ్లు.

పిల్లలు మొక్కల్ని ప్రేమించగలుగుతున్నారనీ, మట్టిలోని జీవాన్ని అనుభూతం చేసుకోగలుగుతున్నారనీ నాకు నమ్మకం కలిగింది. మూడు నాలుగు తరగతుల్లోవాళ్లు పొలంలో మామూలుగా పండించే గోధుమకంటే రెండింతలు వున్న గోధుమని పండించారు. మేము గ్రీన్‌హౌస్‌లోనూ, "ఆకుపచ్చ మందిరం"లోనూ, పోషక పదార్థాలలో టొమాటోలూ, దోసకాయలూ పండించాం. శీతాకాలంలో పిల్లలు కుళ్లిన ఎరువూ నల్లమట్టీ కలిపిన పోషక పదార్థాన్ని తయారుచేసి వసంతరుతువులో దాన్ని మడిలోకి తీసికెళ్లేవాళ్లు. ఆకురాలు కాలంలో పుష్కలంగా వుండే బంగాళదుంప, టొమాటో పంటల్ని పోగుచేసేవాళ్లు.

కొంతమంది పిల్లలు "ఆకుపచ్చ ప్రయోగశాలలో" కూడా పనిచేశారు. మధ్య తరగతుల పిల్లలకోసం నిర్మించిన ఇల్లు అది. పెద్ద పిల్లల పర్యవేక్షణలో యిక్కడ మా విద్యార్థులు తోటపనిలోనూ, మొక్కల పెంపకంలోనూ ఆసక్తికరమైన ప్రయోగాలు

చేశారు. అడవి పళ్ల చెట్లకి తోటపళ్లమొక్కల అంటుకట్టడం యెలాగో నేను పిల్లలకి నేర్పాను. రెండవ తరగతికి వచ్చేటప్పటికల్లా పిల్లలంతా యీ సున్నితమైన పద్ధతిని మెలుకువతో నేర్చేసుకున్నారు. ప్రకృతిమీద జ్ఞానపు అధికారాన్నీ, సిద్ధాంతమూ ఆచరణల ఏకతనీ వాళ్లు గ్రహించారు.

తాము అంటుకట్టిన వాటి ఫలితాలు చూడ్డానికని వసంత కాలం కోసం ఆతృతగా కాచుకుని వున్నారు పిల్లలు. అంటుకట్టిన కొమ్మలు చిగురు తొడగ్గానే పిల్లల సంతోషానికి మేరలేకపోయింది. ఒక సమష్టి నారుమొక్కల క్షేత్రాన్ని మేము స్థాపించి ప్రతి యేడూ నారు మొక్కల్ని పెంచాం. పని చేసేందుకు నారు మొక్కల క్షేత్రం మరో అభిమానపాత్రమైన స్థలం అయింది. మూడవ తరగతి పూర్తి చేశాక వేసవికాలంలో మాకు ఒక అడవి పొదలో ఒక ప్లమ్ చెట్టు కనిపించింది. మాలో ప్రతి ఒక్కళ్లూ కూడా యేదో వొక అంటుకట్టారు – కొందరు ఆప్రికాట్, కొందరు ప్లమ్, కొందరు పీచ్. అన్ని అంట్లూ బతికాయి. ఒకే చెట్టు మీద అన్నిరకాల పళ్లచెట్లూ పెరగడం పిల్లలకి ఆశ్చర్యం కలిగించింది. రెండేళ్ల తర్వాత పళ్లు కాశాయి.

ప్రకృతే ఆలోచనకీ, సృజనకీ, జిజ్ఞాసాత్మకమైన హేతువుకీ పుష్కలమైన ఆధారమని నేనిదివరకే అన్నాను. ప్రకృతి ధర్మాలు తెలుసుకోవడంలో, పిల్లవాడు వ్యక్తిగా తయారవుతాడు. కాబట్టి ప్రకృతి అభివృద్ధి దీర్ఘపథంలో తనే అత్యున్నతమైన దశ అని క్రమేపీ తెలుసుకుంటాడు. ప్రకృతి తనంతట తనుగా అద్భుతాల్ని సృష్టించలేదు, పిల్లవాడి సహజశక్తిని అభివృద్ధి చెయ్యలేదు, బుద్ధికి పదును యివ్వలేదు, ఆలోచనని సంపద్వంతం చెయ్యలేదు. చురుకైన ప్రయత్నం లేకుండా, శ్రమలేకుండా, దాని రహస్యాలని విశదం చేసుకోవడమూ, గ్రహించడమూ సాధ్యంకాదు. ప్రకృతి శక్తుల్ని ఉపయోగించుకోవడంలో మానవుడు తన చైతన్యయుతమైన అడుగు వేసినప్పుడే, ప్రకృతి అతనికి ప్రతిఫలం యిస్తుంది. కాని ఆ ప్రతిఫలం మొదట్లో మితంగా, తరువాత అతను కొత్త ప్రయత్నాలు చేసేకొద్దీ, ప్రకృతిని లోతుగా తెలుసుకొనే మేరకు, అదే సమయంలో తను కూడా సృష్టించే ప్రయత్నం చేసే మేరకు, ధారాళంగా వుంటుంది. పిల్లలు శ్రమించేకొద్దీ, వాళ్ల బుద్ధికి ప్రకృతి రహస్యాలు వెల్లడి అవుతాయి, యింకా కొత్త విషయాలు, తాము అవగతం చేసుకోనివి వాళ్లకి తటస్థ పడతాయి. వాళ్లు యెంత తక్కువగా అర్థంచేసుకుంటే అంత చురుగ్గా ఆలోచిస్తూనే వుంటారు; సందేహమే ఆలోచనకి దారి తీస్తుంది. దున్నిన నేలలో గోధుమ విత్తనం చల్లిననాటినుంచి పంట కోతకి వచ్చేదాకా పిల్లల్లో "యెలాగ?" "యెందుకు?" అని రెండు వందలపైగా ప్రశ్నలు తలెత్తాయి. చెట్లని పెంచడం, ధాన్యం పండించడం, వ్యాపార పంటల్ని పండించడం లాంటి పనులు కలిగించినంతగా ఆలోచనకి ప్రేరణని ప్రకృతి ప్రభావంలో మరేది కలిగించదు.

వాళ్ల ప్రతిభా విశేషాలూ, అభిరుచులూ కనిపెట్టేందుకు వీలుగా పిల్లల పనిని మార్చప్రయత్నించాను. స్కూల్ వర్క్‌షాప్‌కి పక్కనే చిన్నపిల్లలకి ఒక గదికట్టాం. సందంశకాలున్న బల్లల్ని అక్కడ పెట్టాం. అప్పుడు నేను నా చిరకాల వాంఛితం

సాధించాను – పెద్దపిల్లలు రెండు చిన్న పరిమాణపు లేత్‌యంత్రాలూ, ఒక బరమా చేశారు. చిన్న చిత్రికలూ, రంపాలూ, అరల్లోనూ సొరుగుల్లోనూ పనిముట్లు వున్న యినప సామాన్ల పెట్టెలూ వున్నాయి. మెటల్ ప్లేట్లూ, తీగా కూడా వున్నాయి. ఆరకంగా నిర్మాణానికీ, నమూనాలు తయారుచేయడానికి అవసరమైన ప్రతీదీ వుంది. యీ వర్క్‌షాప్ చిన్న పిల్లలు చాలామందిని ఆకర్షించింది, క్రమేపీ పసి చేతివృత్తి కళాకారుల క్లబ్బు ఒకటి యేర్పడింది. పిల్లలు నమూనాలు చెయ్యడంలోనూ, నిర్మాణంలోనూ, అందమైన డిజైన్లు వున్న చెక్కపనిలోనూ ముఖ్యంగా ఆసక్తి చూపించారు.

మధ్యాహ్నం భోజనాల తర్వాత మేం వర్క్‌షాపులో చేరి ఏక కాలంలో కొన్ని ఆసక్తిదాయకమైన నమూనాలు తయారుచేసేవాళ్లం: గాలితో పనిచేసే విద్యుత్‌స్టేషనూ, విత్తనశుద్ధి యంత్రాలూ, తూర్పార బట్టే యంత్రాలూ, నిజమైన భవనాల్లా కనిపించే చిన్న ఇళ్లూ, చిన్న మెటల్ పనిముట్లకి అవసరమైన ఒక డెస్కూ సొరుగూ చేశాం. కొయ్యతోటీ, మెటల్‌తోటీ నమూనా భాగాలు చేస్తూ పిల్లలు సమష్టిగా పనిచేశారు. నమూనా చిన్నదైె, కచ్చితంగా వుండాల్సి వచ్చే కొద్దీ దాన్ని పిల్లలన్నట్టు "నిజమైనది"గా కనిపించేటట్టు చెయ్యడం కష్టమైంది, అంతగానూ పిల్లలు తమ పనిలో ఆసక్తి చూపించారు.

పిల్లల్ని యీ పనిలోకి తీసుకురావడంలో నా ప్రధాన లక్ష్యం యేమిటంటే, వాళ్ల ప్రతిభనీ, అభిరుచులనీ జాగృతం చెయ్యడం, సృజనాత్మకతలోని సంతోషాన్ని వాళ్లకి యివ్వడం, భవిష్యత్తులో అవసరమయే సామర్థ్యాలనీ, నేర్పులనీ వాళ్లకి యివ్వడం. నేను చూపించినదాంట్లో పిల్లలకి ఆసక్తి కలిగించ ప్రయత్నించాను: కొయ్య పనిలోనూ, మెటల్ పనిలోనూ, పనిముట్లని యెలా వాడాలో చూపించాను. వర్క్‌షాప్‌లో మా పాఠం పిల్లలు చూస్తూ వుండగానే నేను ఒక చిన్న బొమ్మమంచం చెయ్యడంతో మొదలైంది. బొమ్మమంచం యెంత నిజమైందిగా కనిపిస్తే అంతగా పిల్లల కళ్లు మెరిశాయి. పసివాళ్లు కూడా ఆ పనిలో పాలుపంచుకోవాలనుకున్నారు. చాలామంది నాకు సాయం చేశారు. బొమ్మమంచపు చిన్నచిన్న భాగాలను వాళ్లు చిత్రికపట్టారు, సాపుచేశారు. యిక విద్యుత్‌స్టేషన్ మొదలెట్టేటప్పటికి నాకు సాయపడ్డమే కాదు, నిజమైన తోటి పనివాళ్లే అయారు పిల్లలు. యూర, వీత్య, మీషలు పనిముట్లని వాడటం తొందరగా నేర్చుకున్నారు. అందరూ పనిచెయ్యాలనుకున్నవాళ్లే, దాంతోటి యేకకాలంలో మేము కొన్ని నమూనాలు చెయ్యడం మొదలెట్టాం.

యిక్కడ సందర్భవశాత్తూ ఓ విషయం చెపుతాను. పిల్లల ప్రతిభా సామర్థ్యాలు వాళ్ల అరిచేతిలో వుంటాయి. ఆలంకారికంగా చెప్పాలంటే, వాళ్ల వేళ్లల్లోనుంచే సృజనాత్మక చింతనాధార మూలానికి చిన్న పాయలు ప్రవహిస్తాయి. పిల్లల వేళ్లు యెంత కచ్చితంగా, యుక్తిగా కదులుతాయో, వాళ్లచేతులకీ శ్రమకి అనుకూలించే పనిముట్లకీ మధ్య పరస్పర చర్య యెంత కచ్చితంగా వుంటుందో, ఆ పరస్పర చర్యకి

అవసరమైన కదలికలు యెంత సంక్లిష్టంగా వుంటాయో, అంత స్పష్టంగా పిల్లల వివేచన తాలూకు సృజనాత్మక అంశాలు వుంటాయి, యీ పరస్పర చర్యలకి అవసరమైన కదలికలు అంత కచ్చితంగా, సున్నితంగా, సంక్లిష్టంగా వుంటాయి. పిల్లవాడి ఆంతరంగిక జీవితంలో చేతులకీ, ప్రకృతికీ, సాంఘిక శ్రమకీ మధ్య వుండే పరస్పరచర్య యెంత గాఢంగా ఉందో అంత సూక్ష్మబుద్ధిగా, శ్రద్ధాళువుగా, అంత నిశిత పరిశోధన కలవాడుగా పిల్లవాడు వుంటాడు.

వేరేమాటల్లో చెప్పాలంటే, పిల్లవాడి చేతులు యెంత నేర్పుగా వుంటే పిల్లవాడు అంత చురుగ్గా వుంటాడు. కాని నేర్పు అనేది యేదో సహజ బోధన వల్లరాదు. అది పిల్లవాడి బౌద్ధిక, శారీరక పటుత్వంమీద ఆధారపడి వుంటుంది. నైపుణ్యం పరిపూర్ణమయ్యే కొద్దీ మానసిక శక్తి బలపడుతుంది. కాని నైపుణ్యానికి ఆధారం వివేచన. చుట్టూతా వున్న ప్రపంచాన్ని గురించి పిల్లవాడు గ్రహించడం అనేది పిల్లవాడి చేతులకి, చుట్టూతా వున్న సాధనాలతో వున్న పరస్పరచర్యలో వుంటుంది. పిల్లవాడు కళ్లతో చూడ్డమే కాదు. చేతులతో కూడా, ప్రశ్నలు అడగడంలో జిజ్ఞాసను వ్యక్తపరచడమే కాదు, శ్రమలో కూడా చుట్టూతావున్న ప్రపంచాన్ని గురించి గ్రహించడమనేది వుంటుంది.

“సంతోష చంద్రశాల” నాటినుంచీ కూడా మా పిల్లలు ఒక హెర్బేరియమ్ తయారుచేశారు. అనేక రకాల కలప మొక్కలూ, విత్తనాలూ పోగుచేశారు. వాళ్లు పదార్థపు మూలకాలని అధ్యయనం చేశారు. ఆ చెయ్యడమనేది పరిశీలనా క్రమంలోనే కాదు తమ చేతుల్తో చేసే పని ద్వారా, అతిసాదా పనిముట్లు, చిన్న సుత్తులూ, చాకులూ, కత్తెర్లూ, ఉలీ ఉపయోగించి, వాటిని వాళ్లు అనేకమైన వాటిమీద వాడారు. ఒకటి రెండు తరగతుల్లో పిల్లలు చిన్న చాకుల్తో పని చెయ్యడం నేర్చుకున్నారు. విల్లో, యాష్, పోప్లార్, ఓక్, పైన్, భేరీ, చెర్రీ లాంటి అనేక చెట్లనుంచి సున్నితమైన ముక్కలు కోసి వాటిని సాపుచేసి, కాగితం షీట్లమీద వాటిని అతికించీ, కుట్టీ, చేసీ గట్టిగా వున్నాయా యింకా యేం లక్షణాలున్నాయీ అని పోల్చారు. యాష్ చెట్ల కాండాలమీద యేర్పడే జిగురుతోటి జంతువుల బొమ్మలూ, పక్షి బొమ్మలూ చేశారు, ఆ జిగురుకి సాగేలక్షణం వుంది కాబట్టి. యాష్ కొయ్యనుంచి అక్షరాలు తయారుచేసి, దానికి “కొయ్య వర్ణమాల” అని పేరుపెట్టారు. మా వూరికి దగ్గర్లోనే ఒక నల్లశాణపు రాయి గుహ వుంది. మచ్చురాళ్లు పోగుచేసుకోవడం కోసం తరచుగా మేం అక్కడికి వెళ్లేవాళ్లం. పిల్లలు చిన్న సుత్తులతోటి అభ్రకం ముక్కలు కోసి, రకరకాల రంగు రాళ్లని పోగుచేశారు. మట్టితోటి చిన్న ఆట యిటికలు తయారుచేశారు, వాటిని యెండబెట్టారు, చిన్న నమూనా భవనాలు కట్టారు. వేసవికాలంలో కోత సమయమప్పుడు మేము రై, గోధుమ గడ్డిని “బాణాలు”గా సమానమైన పొడుగుతో కత్తిరించి టోపీల్లో కుట్టేసేదానికి కాడలుచేశాం.

యిది పూరికే వృత్తి సృజనాత్మకతకి సంసిద్ధం చెయ్యడం కాదు. పిల్లవాళ్ల హస్తకౌశలాన్ని అభివృద్ధి చెయ్యడంలో నేను వాళ్ల వివేచనాయుక్తుల్ని అభివృద్ధిచేశాను. మేం విద్యుత్‌స్టేషన్ నమూనా చేసినప్పుడు మెటల్ ముక్కల్ని తీసేసి కొయ్యరేకల్ని పెడదామన్నారు పిల్లలు. "గట్టిగానూ తేలిగ్గానూ వుండే కొయ్య అయితే మనం రేకులు చెయ్యవచ్చు, అప్పుడవి చిన్న గాలివేసినప్పుడు తిరుగుతాయి" అన్నాడు సెర్యోజ.

ప్రాథమిక పాఠశాల నాలుగేళ్లల్లోనూ పిల్లలు ముప్పైకి పైగా నమూనాలు తయారుచేశారు. ప్రతీదీ విద్యుత్‌స్టేషన్ అంత కష్టమైందీనీ. విద్యుత్‌స్టేషన్‌లో చిన్న జనరేటర్ కూడా వుంది. యేటేటా పిల్లల వ్యక్తిగత అభిరుచులు బాగా వెల్లడి అయ్యాయి. షూర, వీత్య, మీష, సెర్యోజ, యూరలకి లోహాలన్నా, యంత్రాలన్నా యిష్టం కలిగింది. వాళ్లు సందంశకంతోటి గంటలకొద్దీ పనిచేసేవాళ్లు, తెలియకుండానే కాలం గడిచిపోయేది. ఒకోఅప్పుడు వాళ్లని బలవంతంగా యిళ్లకి పంపించాల్సివచ్చేది. వాళ్లు సందంశకంతోటీ, నమూనా లేత్‌లతోటీ పనిచెయ్యడం చూస్తే నాకు "సంతోష చంద్రశాల"లో వాళ్లు కొయ్య అక్షరాలు చెయ్యడం గుర్తుకొచ్చింది. చిన్ననాటి ఆసక్తులనిబట్టి వాళ్ల భవిష్యత్ వృత్తులనీ, ప్రత్యేకతలనీ వూహించడం అమాయకత్వం అవుతుందనుకోండి. నైపుణ్యం సంక్లిష్టమైన మార్పులకి గురవుతుందని జీవితానుభవం తెలియచేస్తోంది. బాల్యంలో వూహించుకున్నట్టుగా పెద్దయాక యెక్కడోగాని వుండరు.

శారీరక శ్రమ బౌద్ధిక బోధనతోటి సన్నిహితంగా ముడిపడి వుంటుంది. కౌశలం అనేది జిజ్ఞాసకీ కుశాగ్ర బుద్ధికీ, సృజనాత్మక ఉపాయానికీ సాకారరూపం. తను వూహించిందాన్ని ప్రతి పిల్లవాడూ తన చేతులతో తయారుచెయ్యడం చాలా ముఖ్యం.

నాలుగో తరగతిలో వున్నప్పుడు పిల్లలు తమ పనిముట్లు, చిన్న చిత్రికలూ, బందచిత్రికలూ తామే తయారుచేశారు. అతి సాదా పనిముట్లని కూడా వాళ్లు మరిచిపోలేదు: తోలుబొమ్మలాటలకీ, ఛాయా ప్రదర్శనశాలలకీ పనికివస్తాయని సరదాగా వుండే జంతువుల బొమ్మలూ, అద్భుత కథల మంత్రకత్తె బాబా యాగా, మృత్యురహిత మహాకాళం, తయారుచెయ్యడానికి వాళ్లు చిన్న చాకులని ఉపయోగించారు. సెర్యోజ, మీషలు రెండు ఆక్వేరియమ్‌లు తయారుచేశారు, ఒకటి క్లాస్‌రూమ్‌కీ, యింకోటి "అద్భుత కథా మందిరానికీ."

పిల్లలకి యింకో ఆసక్తికరమైన పని సంతోషం కలిగించింది: ఒక చిన్న ఇంటర్నల్‌కంబశ్చన్ యంత్రంతో నడిచే విద్యుత్‌స్టేషన్‌ని చేశాం. ఆ స్టేషన్ తక్కువ వోల్టేజ్‌తో నడిచింది, అంచేత పిల్లలకి ప్రమాదమేమీ లేదు.

మూడు నాలుగు తరగతుల్లో పిల్లలు తమ కిష్టమైన తావుల్లో వారంలో రెండు గంటలు గడిపేవాళ్లు. వాళ్లు "ఆకుపచ్చ మందిరానికి," వర్క్‌షాప్‌కీ, గ్రీన్‌హౌస్‌కీ, లేకపోతే పని - ప్రాయోగికమైన మడికీ వెళ్లేవాళ్లు. క్షేత్రంలో పనిచెయ్యాలని

యిష్టపడేవాళ్లు అక్కడికి వెళ్లి గొర్రెపిల్లల్ని, ఆవుదూడల్నీ చూసేవాళ్లు. యీ సమయాల్లో విద్యార్థులు తమ కిష్టమైన పనిని చేసేవాళ్లు. నేను ఓ వారం ఒక చోటికీ, యింకో వారం యింకో చోటికీ వెళ్లేవాణ్ణి. ప్రతి గ్రూపులోనూ ఒక ప్రత్యేకతరహా పనిపట్ల ఆసక్తి చూపించే పిల్లలు వుండేవాళ్లు. వాళ్లు చిన్న శ్రామిక సమష్టులను సంఘటితం చేసేవాళ్లు, తమ ఆదర్శంతోటి తోటివాళ్లని ఉత్తేజితుల్ని చేసేవాళ్లు. వర్క్‌షాప్‌లో జరిగే పనికి యూర నాయకత్వం వహించేవాడు. వాన్య తోటపనివాళ్లకి నాయకత్వం వహించేవాడు, వార్యా తోటమాలీలకీ. సాష జంతువుల్ని పెంచేవాళ్లకి బాధ్యుడుగా వున్నాడు. యీ పిల్లలు చాలా పనులు చెయ్యడమూ, తమ తోటివాళ్లకంటే యెక్కువ తెలుసుకుని వుండటమూ నాకు సంతోషం అయింది. మిగతా పిల్లలు వీళ్లకి మల్లే చేద్దామనుకునేవాళ్లు. వాళ్ల పని సృజనాత్మక శక్తుల పోటీ స్వభావం సంతరించుకుంది.

మా విద్యార్థుల బాల్యం గుర్తుచేసుకున్నప్పుడు, బాగా పనిచేసామన్న గర్వంతో మెరిసే కళ్లు జ్ఞాప్తికి వస్తాయి నాకు. చేతిలో చిన్న రేడియో పట్టుకున్నాడు సెర్యోజ. అతను దాన్ని నాలుగో తరగతిలో వుండగా చేశాడు: మూడు నెలల పరిశ్రమ ఫలితం మహదానందాన్ని యిచ్చింది. ఫేద్య వికసించే పీచ్‌చెట్టు పక్క నుంచున్నాడు: ఒక అడివి ప్లమ్ చెట్టుకి పీచ్ అంటుకట్టి, యెదురుచూడగా చూడగా అది పువ్వులు పూసింది, పళ్లుకాసింది. పశువుల కొట్టంనుంచి గొర్రెపిల్లని పట్టుకొచ్చింది వాల్యా. ఆ సంతోషభరిత క్షణం నా మనసులోమెదిలింది. నీరసంగా, జబ్బుగా వుండే గొర్రెపిల్లని ఆమె బాగుచేసి బలంగా అయేటట్టు చేసింది. తన ఎర్ర గులాబికేసి చూసి తీనా సూర్యుడికేసీ, వినీలాకాశంకేసీ నవ్వుతోంది. మూడు గులాబీ కొమ్మల్ని ఆ పిల్ల అడవి గులాబీ పొదతో అంటుకట్టింది, అద్భుతమైన పొద పెరిగింది. సాష అని అనుకోగానే నా మనసులో చిన్న గోధుమమోపు పట్టుకున్న నల్లరంగుకళ్ల కుర్రాడే మెదులుతాడు. అతను మూడు చదరపు మీటర్ల జాగాలో పండించిన గోధుమని లెక్కేస్తే హెక్టార్‌కి ఎనభై సెంట్‌నర్లు తేలింది... స్కూల్‌కి దగ్గర్లోనే యెన్నో కొమ్మలున్న యాపిల్‌చెట్టొకటి బాగా పెరిగింది. ప్రతియేడూ ఆ చెట్టు పూతకి రాగానే, ఆ గులాబీరంగు అద్వితీయమైన వర్ణఛాయలు ముచ్చటేసేవి, రాగి జుట్టుజడలున్న ఒక చిన్న పిల్ల "యిది నా యాపిల్‌చెట్టు" అని నాతో చెప్పడానికి పరిగెత్తుకొస్తూ వున్నట్టు అనిపించేది. యాపిల్‌చెట్టు తొలిసారి పూతపట్టినప్పుడు కాత్యా చెప్పిన మాటలు అవి. కాని కోస్త్య విచారంగా కనిపిస్తాడు. అతను చిన్న దూడని చేరదీశాడు. అది అతని అనునయానికి స్పందించలేదు, జబ్బుగా వుంది కాబట్టి.

ఆరకంగా నాకు అందరు పిల్లలూ గుర్తుకొచ్చారు. పిల్లలు తమ పనిలో నిమగ్నులైనట్టు నాకు కనిపించారు. యీ ఆసక్తులే వాళ్ల తరవాతి జీవిత పథాలని యేమేరకేనా గానీ నిర్ణయిస్తాయని నేను అనుకోలేదు. ఒక పిల్లవాడు సజీవ వస్తు ప్రపంచాన్ని అభిమానించినంత మాత్రాన, పళ్ల తోటలోనో, పొలంలోనో పని అతనికి సంతోషాన్ని యిస్తే దానర్థం అతను తోటమాలిగానో, రైతుగానో అవుతాడని కాదు.

ప్రతిభలూ, సామర్థ్యాలూ, అభిరుచులూ వికసించే గులాబీ పొదల్లాంటివి: ఒక పువ్వు పూస్తుంది, యింకోటి రేకులు విచ్చుకుంటుంది. ప్రతిపిల్లవాడికీ కొన్ని ఆసక్తులు వుంటాయి. అవి లేకుండా పిల్లవాడి ఆంతరంగిక జీవితం సంపద్వంతంగా వుంటుందని వూహించడమే అసాధ్యం. కాని ఒక విషయం యెప్పుడూ ఎంతో తేటతెల్లంగా వుండేది. యేదో ఒకతరహా శ్రమలో చెప్పుకోదగ్గ ప్రావీణ్యం సంపాదించేదాకా పిల్లవాడు ఒక వ్యక్తి కాలేడు. పని అనేది గాఢమైన వ్యక్తిగత సంతోషం కాగానే మానవ వ్యక్తిత్వం కనిపిస్తుంది.

వ్యక్తి ప్రావీణ్యం సంపాదించే పని ఒక బ్రహ్మాండమైన బోధనాత్మక శక్తి అవుతుంది. తనకి తాను ఒకదాన్ని సృష్టించేవాడు అవుతున్నానన్న భావం వ్యక్తిని తను వున్న దానికంటే మెరుగు చేస్తుంది. బాల్యంలోనూ, యెదిగేటప్పుడూ, వ్యక్తి తన సృజనాత్మక శక్తులనీ సామర్థ్యాలనీ గ్రహించడం అనేదానికి యెంతో ప్రాముఖ్యం వుంది. అందులో వ్యక్తిత్వం రూపు తీసుకోవడం తాలూకు సారం వుంది.

మనం యిదివరకే ప్రస్తావించుకున్న బోధనాత్మక ప్రభావాల సారూప్యతకి సంబంధించి ఒక నిబంధనని యిక్కడ చెప్పాలి. శ్రమ అనేది వ్యక్తిత్వం రూపుతీసుకోవడంమీద ప్రయోజనాత్మక ప్రభావం కలిగించేదిగా అనేక పరస్పరాధీనాలతోటీ, షరతులతోటీ మిగతా బోధనాత్మక ప్రభావాలతోటీ సన్నిహితంగా ముడిపడి వుంది. యీ పరస్పరాధీనతలనీ, షరతులనీ గుర్తించలేకపోతే శ్రమ అనేది అసహ్యాకరమైనా తప్పనిదిగా తయారవుతుంది. యిలాంటి శ్రమ హృదయానికి గానీ, బుద్ధికి గానీ యేమీ ప్రసాదించదు. వ్యక్తిత్వ బోధన గురించి చర్చించిన మా మనస్తత్వశాస్త్ర సెమినారు, మిగతా ప్రభావాలతో బాటుగా శ్రమ సారూప్య ఉపయోగానికి చాలా శ్రద్ధ చూపించింది. బౌద్ధిక బోధనలో చేతుల పాత్రకి సంబంధించిన నివేదికమీద చర్చ చాలా ఆసక్తిని రేకెత్తించింది. శ్రమకీ యితర బోధనాత్మక ప్రభావానికీ సంబంధించిన పరస్పరాధీనతా, అంతరిక షరతులూ అనే సమస్యని మా ఉపాధ్యాయులు యింకా పరిశీలిస్తున్నారు.

# యువ లెనిస్టులూ, మీరే దేశపు భాగ్య విధాతలు

పిల్లలు మొదటి తరగతిలో వుండగా నాకు మొదటి చేదోడు వచ్చింది. ఆరో తరగతిలో వున్న ఓల్యా అనే పన్నెండేళ్ల యువ పయనీర్. అక్టోబ్రిస్టులని యువ పయనీర్లలో చేర్చుకునేటందుకు సిద్ధపరచే బాధ్యత తనకి యిమ్మని ఆమె అడిగింది. ఆమెకి పిల్లలంటే యిష్టం – అది ముఖ్యం. యువ పయనీర్ నాయకుల్ని మా బళ్లో నియమించారు. పిల్లలంటే యిష్టపడి వాళ్లతో పనిచెయ్యాలనుకునే వాళ్లకి యీ బాధ్యతలు అప్పగిస్తారు. ఓల్యా నాకు యెన్నింట్లోనో సాయపడింది: ఆమె పిల్లలతో

ఆడుకుంది, వాళ్లతో అడవిలోకీ, పొలాల్లోకీ వెళ్లింది, వాళ్లకి యువ పయనీర్ వీరుల గురించీ, మహత్తర దేశభక్తియుత యుద్ధ కాలంలో సోవియట్ ప్రజల వీరకృత్యాల గురించీ చెప్పింది.

ఓల్యా మొదలుపెట్టిన కర్తవ్యం తర్వాత పదిహేనేళ్లు సాగింది. యువ లెనినిస్టుల సిద్ధాంత బోధనలో పెద్దపాత్ర వహించింది. నా సలహామేరకి ఆమె మహత్తర దేశభక్తియుత యుద్ధపు వీరులతోటి పిల్లలకి మొదటి సమావేశాలను నిర్వహించింది. ఆ వీరుల కథలు యెంత ఆసక్తికరంగా వున్నాయంటే, ఓల్యా అన్నిటినీ రాసేసింది. ఆమె నోట్సుమీద ఆధారపడి ఒక లిఖిత పత్రిక తయారైంది. "మహత్తర దేశభక్తియుత యుద్ధంలో మా గ్రామవాసులు" అని దానికి పేరు. పిల్లలతో పనిచేసే కాలంలో మొదట ఓల్యా, తర్వాత యువ పయనీర్లు ఒక వంద కథలకి పైగా రాసి, ఆ వీరుల ఫొటోల్ని ఆ పత్రికలో అతికించారు. యిప్పుడందులో ఆరువందల కథలు వున్నాయి. మాతృదేశభక్తిని నేర్పడానికిది అమూల్యమైంది.

ఓల్యాకి పిల్లలతో అస్తమానూ వుండటమనేది యేదో కర్తవ్యమే కాదు, అభిమానం కూడా. యిది ఒక అద్భుతమైన సహజశక్తి - మానవత్వపు సహజశక్తి. యీ శక్తి వున్నవాళ్లు చక్కటి బోధకులు అవుతారు, తమ పనిలో యెంతో ఆనందం పొందుతారు. బళ్లో వుండే చిన్నపిల్లల్ని చూడండి, తమ స్నేహితుల కోసం ఏదో ఒకటి చెయ్యకుండా వుండలేని పిల్లలుంటారు. మగపిల్లల్లో అయితే యిది కొంటెచేష్టల్లోనూ, యెగతాళి చెయ్యడంలోనూ, వేళాకోళాలాడ్డంలోనూ కనిపిస్తుంది. ఓ చిన్న పిల్లాడు తను అందరికీ నాయకుడవాలనీ తన మిత్రులంతా తన వెనక వుండాలని ప్రయత్నిస్తాడు. కాని శక్తి సామర్థ్యాలని యెలా ఉపయోగించుకోవాలో అతనికి తెలీదు. యీ ఉడుకు శక్తుల్ని అణగదొక్కవద్దని నేను ఉపాధ్యాయులకి సలహాయిచ్చాను. అల్లరిగా, కొంటెగా వుండే పిల్లలే మీకు చేదోడు అవుతారు. అవసరమైన మార్గంలో యీ శక్తి సామర్థ్యాలని మీరు నడిపించుకోగలిగి వుండాలి.

యువ లెనినిస్టు సంఘంలో చేరేందుకు చేసే సంసిద్ధత, యువ పయనీర్ దళ కార్యకలాపాలు అన్నీ పిల్లలకి తమ పవిత్ర దేశంపట్ల గాఢమైన అభిమానాన్ని నేర్పాలి. తమ మాతృదేశం స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాడిన యెంతో మంది రక్తంతో తడిసిపోయింది. మాతృదేశం పట్ల ప్రేమ దాని అందాన్ని అభినందించడంతో మొదలవుతుంది. పిల్లవాడు చూసేది అతని జీవితంలో భాగమైపోతుంది. తమ మాతృదేశపు సౌందర్యాన్నీ, సోవియట్ ప్రజలు సృష్టించిందాన్నీ ఓల్యా, నేనూ పిల్లలకి చూపించాం.

మేము పచ్చికబీటిలోకి వెళ్లి ఓ గుట్టపైన కూర్చున్నాం. గోధుమ పైరు పొలాలని చూశాం, పూతకొచ్చిన పళ్లతోటని, బారుగా వున్న పొప్లర్ చెట్లనీ, వినీలాకాశాన్నీ, భరద్వాజ పిట్టల పాటనీ మెచ్చుకున్నాం. మన తాత తండ్రులు నివసించినచోటు, మనమే నివసించి, పిల్లల్ని కని, పెద్దవాళ్లయి యీ భూమిమీదనుంచి నిష్క్రమించే చోటు, అలాంటి చోటుకి వున్న సౌందర్యాన్ని

మెచ్చుకోవడం మాతృదేశ ప్రేమకి ముఖ్య ఆధారాల్లో ఒకటి. మన పొలాలకంటే, పచ్చికమైదానాలకంటే సమృద్ధమైన ప్రకృతి వున్న దేశాలు ప్రపంచంలో వున్నాయి, కాని జన్మభూమి సౌందర్యం పిల్లలకి ప్రాణప్రదమైందిగా వుండాలి. వసంతరుతువులో చెట్లు తెల్లగా కనిపించడాన్నీ, హాప్‌మొక్కల పువ్వులమీద తేనెటీగలు యెగరడాన్నీ, యాపిల్‌పళ్లు పండటాన్నీ, టొమాటోలు ముగ్గడాన్నీ పిల్లలు వూరికే చూడటమే కాదు – దీన్నంతటినీ కూడా తమ జీవితాల పూర్ణత్వంగా సంతోషంగా పిల్లలు భావించాలి. ధగధగమెరిసిపోయే, ప్రకాశమానమైన దృశ్యాలతో వాళ్ల బాల్యాలు నిండిపోనివ్వండి: తెల్లగా కనిపించే పళ్లతోట, బక్‌వీట్ పొలాలమీద ఝుంకారం చేసే తేనెటీగలు, దిఙ్మండలం మీద కొంగలబారు యెగిరే గంభీర వినీల శారదాంబరం, అస్తమయ సూర్యుని అరుణ కాంతిలో చలించే పొగమంచులో నీలపు కొండలూ, అద్దంలాంటి చెరువు నీళ్లమీద వంగే విల్లో చెట్లూ, రోడ్డువార పెరిగే పొడుగాటి పొప్లర్ చెట్లూ – వీటన్నిటినీ కూడా పిల్లల హృదయాలమీద చెరపలేని ముద్ర వెయ్యనివ్వండి, తమ బాల్య సంవత్సరాల సౌందర్యంగా, యెంతో ప్రియమైన జ్ఞాపకంగా హృదయంలో నిండిపోనివ్వండి.

ఒక శీతరాత్రి పంథొమ్మిదేళ్ల అలెక్సాండర్ మత్రోసొవ్ తన తోటి యోధులకి తగలకుండా గుళ్లని తప్పించడానికి శత్రువు మెషీన్ గన్‌మీద పడకపోయి వున్నట్లయితే, నికొలాయ్ గస్తేల్లో మంటలు చిమ్మే తన విమానాన్ని శత్రువు టాంకులమీదకి తిప్పకపోయి వున్నట్లయితే, వోల్గానుంచి ఎల్బాదాకా వందలాది వేలాది వీరులు తమ రక్తాన్ని చిందించకపోయి వున్నట్లయితే యివేవీ వుండేవి కాదని పిల్లవాడికి తెలియ నివ్వండి. యీ పూతకొచ్చే పళ్లతోటగానీ, తేనెటీగలుగానీ, మాధుర్యమైన జోలపాటలుగానీ, సూర్యోదయం వేళ అమ్మ దుప్పటీతో జాగ్రత్తగా కాళ్లని కప్పేటప్పుడు వచ్చే కమ్మని కలలుగానీ, యేమీ వుండేవి కాదని పిల్లవాడికి తెలియనివ్వండి. పిల్లవాడు జీవిత ఆనందాన్ని అనుభవించే ఆ క్షణంలోనే యీ భావాన్ని పిల్లవాడికి కలిగించాలి. మన వూళ్లోనే, యీ పొలాలమీదే, యీ చెట్లకిందే యెలా సోవియట్ సైనికులు మన మాతృదేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాడిందీ నేను పిల్లలకి చెప్పాను.

మనుగడలోని ఆనందం అంటే, వ్యక్తిత్వానికి సంబంధించిన స్వీయజ్ఞానపు తేటపడే వ్యక్తీకరణే కాదు, చుట్టూతా వున్న ప్రపంచం గురించి మొత్తం గ్రహించడం, తన చుట్టూతా వున్న దానితో పిల్లవాడికి గల క్రియాత్మక దృక్పథం. సోషలిస్టు సమాజంలోని జీవిత తర్కం యేమిటంటే మా విద్యార్థులకి చుట్టూతా వున్న ప్రపంచంలోని అందం బాల్యంలో సంతోషానికి ఆధారాలైన వాటిలో ఒకటి – మనుగడలోని సంతోషం. అందుచేత పిల్లవాడికి ప్రతి పువ్వూ, ప్రతి గడ్డి పరక సంతోషం కలిగించేటట్టుగా బోధకుడు చూడాలి. అందంగా వున్నంత మాత్రాన చుట్టూతా వున్న ప్రపంచం పిల్లలకి ప్రియమైంది అవుతుందా? యెందుకంటే మనుగడలోని సంతోషం అనేది పిల్లవాడు పూర్వతరం వాళ్లనుంచి అందుకునే

సంక్లిష్ట సంతోషాలకంటే యేమీ కాదు. తమ మాతృదేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం తమ తాత, ముత్తాతలు చిందించిన రక్తం, స్వేదం, కన్నీళ్లుచూసి, బాధపడినప్పుడే ప్రజలకి చుట్టూతా వున్న ప్రపంచం ప్రియమైంది అవుతుంది.

అస్తిత్వంలోని ఆనందం యీ ఆనందాన్ని పరిరక్షించినవాళ్ల సమక్షంలో బాధ్యతతో మిళితమైనప్పుడు యెవళ్లకేనా మాతృదేశం అవధిలేనంత ప్రియమైంది అవుతుంది. యీ మిళితంకావడంలోనే యువతరం వాళ్ల నైతిక సౌందర్యాత్మక ఏకత వ్యక్తమవుతుంది. అస్తిత్వంలోని ఆనందం నిశ్చితంగా వుండాలనేం కాదు. బాల్యంనాటి ఆనందం దుఃఖమూ, బాధలూ, సోషలిస్టు సమాజపు స్వేచ్ఛాయుత పౌరుడి ఆనందం పేరుమీద త్యాగాలు చెయ్యడమూ లాంటి వాటితో ముసురుకు పోకూడదని భావించే ఉపాధ్యాయులు తప్పుచేస్తున్నారు.

తొలి ఆకురాలు కాలపు యెండగా వుండేరోజుల్లో ఫలభారంచేత యాపిల్‌చెట్ల కొమ్మలు వంగుతాయి, ద్రాక్షగుత్తులు పక్వాని కొస్తాయి, నూర్పుడు కళ్లంమీద గోధుమ మోపులు బంగారు చాయ తిరుగుతాయి. ఓల్యా, నేనూ పిల్లలని గ్రామపు శివారు దగ్గరకు తీసికెళ్లాం. అక్కడ యెత్తైన దిబ్బ వుంది. దాని మీదనుంచి దూరపు అందమైన దృశ్యం గోచరిస్తుంది. ఆకుపచ్చగా వుండే పుచ్చకాయలూ, యింకా అవతల వున్న పళ్లతోట కనిపిస్తాయి. పొడుగాటి పాప్లర్ చెట్లూ, పచ్చికమైదానమూ, శీతాకాలపు గోధుమ వున్న పచ్చటి పొలాలూ వున్నాయి. దిఙ్మండలంమీద పొగమంచు కమ్మిన ముదురునీలపు దిబ్బలు వున్నాయి. పిల్లలకి అది తిరిగిరాని అనుభవ క్షణం. తమముందు విస్తరించుకున్న సౌందర్య నేపథ్యంలో తమ ఆనందదాయకమైన పసితనపు అంశని వాళ్లు అనుభవించారు: వాళ్ల తల్లులూ తండ్రులూ మెరిసే కళ్లతోటి ఆ సుదూర క్షేత్రాలనుండి యిళ్లకి తిరిగి వచ్చేవాళ్లు. నేను మంచీ చెడుల గురించి ఒక కథ చెప్పాను. మంచి జయం పొందడం పిల్లలకి సంతోషం కలిగించింది.

చుట్టూతా వున్న ప్రపంచపు సౌందర్యం స్పర్శనీయం కాకుండా మాతృదేశ భావనని మీరు జాగృతం చెయ్యలేరు. తమ ఆనందదాయకమైన బాల్యం కోసం పూర్వతరంవాళ్లు యెంతటి మూల్యం చెల్లించారో దాన్ని గురించి చెప్పేటప్పుడు, వాళ్ల మాతృదేశపు సహజసౌందర్యం పిల్లలకి దర్శనీయం చెయ్యాలి. బాల్యంనాటి యీ మారుమూల స్థలాన్ని పిల్లల స్మృతిలో చిరస్థాయిగా వుండేటట్టు చెయ్యండి. మహోన్నత మాతృదేశ చిత్రాన్ని యీ స్థలంతో ముడిపడ నివ్వండి.

ఆకురాలు కాలంలో ఒకనాడు, ఆ దిబ్బమీద కనిపించీ కనిపించకుండా వున్న ఒక పల్లాన్ని పిల్లలకి చూపించాను.

"యీ పల్లంకేసి చూడండి. కాలగతిలో యిది పూడి పోయి, దీని మీద గడ్డి మొలిచింది.... కాని యివాళలాగే యెండ వున్న ఒక ఆకురాలు కాలపు రోజున మన సైన్యం యీ రోడ్డమ్మటే ద్నీపర్ నది కావల వెనక్కి తగ్గుతోంది. ఒక యువయోధుడు మెషీన్‌గన్ను చేత్తో పట్టుకుని యీ గుట్ట పైకి వచ్చాడు. శత్రువుని నిరోధించడానికీ,

వాళ్లు ద్నీపర్ నదిని చేరకుండా వుండేందుకు అతను యీ గుట్టమీద నిలిచిపోయాడు. మోటార్‌సైకిల్‌మీద వచ్చే శత్రువులు అతనికి కనిపించారు. మెషీన్‌గన్ సైనికుడు వాళ్లని హతం చేశాడు. ఫాసిస్టులు యీ గుట్టమీద ఫిరంగి గుళ్లూ, తుపాకీగుళ్లూ వర్షించారు. చూడండి యిది దక్షిణంవేపు యెలా తవ్వుకుపోయిందో. యీ నేలమీద యింకా ప్రాణాంతకమైన యినప ముక్కలు వున్నాయి. ఆ పేలుళ్లు ఆగాయి. మోటార్‌సైకిల్ వాళ్లు మళ్లీ బయల్దేరారు. మళ్లీ గుట్ట స్పందించింది. సోవియట్ సైనికుడి గుళ్లచేత శత్రువులు హతులయ్యారు. ఫాసిస్టులు గుట్టమీదకి టాంక్ పంపించారు. యీ చెట్లదాకా వచ్చి అది కాల్చడం ప్రారంభించింది. కాల్చడం ఆగింది. మళ్లీ మోటార్‌సైకిల్ వాళ్లు ప్రత్యక్షమయారు. మళ్లీ గుట్ట స్పందించింది. మన యువయోధుడికి చేతిమీదా, తలమీదా, ఛాతీమీదా తీవ్రమైన గాయాలు తగిలాయి. అయినా అతను పోరాడుతూనే వున్నాడు. అతని కళ్లమీద రక్తం కారుతోంది. తన మాతృదేశపు వినీలాకాశాన్ని కడసారి చూస్తున్నాడని అతనికి తెలుసు. కాని ఒక ఫిరంగి గుండు తన మెషీన్ గన్ను పక్కన పేల్చినప్పుడు మాత్రమే అతని గుండె కొట్టుకోవడం మానింది. సాయంత్రం రైతులు యిక్కడికి వచ్చి, ఒక గుంట తవ్వి, రక్తసిక్తమైన కాయాన్ని ఖననం చేశారు. సోవియట్ సైన్యం శత్రువునుంచి యీ గ్రామాన్ని విముక్తం చేసేనాటిదాకా ఆ సైనికుడి అవశేషాలు యిక్కడ వున్నాయి. ఆ సైనికుని మిత్రులు వచ్చి యీ గుంటలోనుంచి అతని అవశేషాలు తీసి సైనిక మర్యాదలతో ఉమ్మడి శ్మశానంలో ఖననం చేశారు. ఆ వీరుడి పేరు మనకి తెలీదు, అతను యెక్కడ ఖననం అయిందీ అతని తల్లికీ తెలీదు."

పిల్లల హృదయాలు దుఃఖంతో నిండిపోయాయి. జీవిత సౌందర్యమూ, యీ స్థలపు సౌందర్యమూ వాళ్లకి యింకా ప్రియమయ్యాయి. ఆ వీరుడి నేత్రాలగుండా వాళ్లు ప్రపంచాన్ని చూశారు. తాము సుఖశాంతులతో బతికేటందుకుగాను, ఆకాశంలో మిణుకుమనే నక్షత్రాలుండేందుకుగాను, పచ్చికా, యాపిల్ చెట్లూ సువాసనలు వెదజల్లేందుకుగాను, పచ్చికమైదానం మీద గొల్లభామ పాట వినిపించేటందుకుగాను, ఉగాదినాడు మంచుతాత యిచ్చిన కానుకలు తమ తలగడలకింద అమ్మ పెట్టేందుకుగాను ఆ వీరుడు ఆత్మార్పణ చేశాడు. పిల్లలు నిశ్శబ్దంగా అయిపోయి రక్తంతో తడిసిన నేలకేసి చూశారు. ప్రతి మట్టిముద్దనీ, గడ్డిపరకనీ, వసనాభినీ వాళ్లు లాలనగా స్పృశించారని అనిపించింది వాళ్లకి.

మా విద్యార్థులకి చాలామందికి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. వాళ్ల కళ్లముందు తమ స్వదేశపు పచ్చిక బీడు వుంది, అది ముందు యెండలో వెలిగిపోతోంది. తర్వాత పొగ కమ్మి చీకటైపోయింది. వాళ్ల గుండెలు బాధతో నలిగిపోయాయి: తాము ఆవేళ చూసిన అందాన్ని, మళ్లీ యేడూ, ఆ పైయేడూ చూడబోయే అందాన్ని, ఆ సైనికుడు యిక చూడలేడు. ఆ ఆలోచన రాగానే వాళ్ల కళ్లల్లో నీళ్లు తిరిగాయి, నిద్రలో తల్లుల లాలనపూరితమైన వెచ్చటి చేతులు తగిలాయి.

ఆ మర్నాడు స్కూలు మొదలవకముందే వార్యా నాదగ్గరకి వచ్చింది. ముందురోజు సాయంత్రం తను కూర్చిన గీతాన్ని చదివింది:

బీడు పక్క రోడ్డువార
వున్నది యెత్తైన గుట్ట
యెన్నో యేళ్లుగ దానిని
గాలిహోరు ముంచెత్తెను
ఆకురాలు కాలపు
ఆవిర్లన్నియు తాకిపోయె
ముష్కర శత్రువు ఒక్కడు
దండెత్తి వచ్చె దేశంపై,
గుట్టపైన నిలుచుండెను,
యువ యోధుడు ఒక్కడు
శత్రుబారినుండి అతడు
ఆ బాటను కాపాడెను.
గుండెలోన గుండుదూరి
యువ యోధుడు మరణించెను
పాతగుట్ట పైన ఒరిగి.
కంపించెను నేలమీద
అతని రక్తసిక్త హృదయం.
నల్లబడెను ఆకాశం
కారుమబ్బు కమ్మివేసె
సూర్యుణ్ణే ఆ క్షణంలో.
మా బతుకుల సౌఖ్యంకై
ప్రాణార్పణ చేసితివా
యువయోధా మరువలేము
నీ త్యాగం మరువలేము.
యెన్నటికీ, యెన్నటికీ
నీ హృదయం ఛిన్నమైన
ఆ చోటే పాతినాము
నీ స్మృతి చిహ్నంగా
ఓకు చెట్టునొకటి మేము.

ఒక వారం తర్వాత మేము మళ్లీ ఆ గుట్ట దగ్గరికి వెళ్లాం. ఆ వీరుడెవరో, యెక్కడ పుట్టాడో, యెక్కడ చదివాడో, అతని తల్లి యెవరో పిల్లలు తెలుసుకోవాలనుకున్నారు. ఇప్పుడు పిల్లలు విన్నదీ కన్నదీ అంతా తమ మాతృదేశం కోసం ప్రాణత్యాగం చేసిన ఆ వీరుడి కళ్లతోటే చూశారు. తమ అనుభూతుల్ని వ్యక్తం చేసే యేదేనా చేద్దామని పిల్లలు అనుకున్నారు. చెట్లనుంచి ఆకులు రాలిపోయాక, ఆ యెత్తైన గుట్ట మీదకి ఒక చిన్న ఓక్ చెట్టుని తీసికెళ్లాం. పిల్లల హృదయాల్లో మృదువైన దయాపూరిత భావాలు స్పందించేటప్పుడు మాటలకి ఔచిత్యం లేదు. పిల్లలు గాఢమైన అనుభూతితో ఆ పని చేశారు. ఆ గుట్టని హరితం చెయ్యడానికే మేము ఆ చెట్టుని పాతటం లేదు – ఒక వీరుడికి సజీవ స్మృతి చిహ్నాన్ని స్థాపిస్తున్నాం.

ఆ గుట్టమీద ఓక్ చెట్టు పెరగడం కష్టమని పిల్లలకి తెలుసు. కాని ఆ కష్టాలేమీ వాళ్లని భయపెట్టలేదు. శీతాకాలంలో మంచుకప్పి ఆ చెట్టుని మేం సంరక్షించాం. వసంత కాలంలో గుట్ట అంతా పచ్చికతో కమ్ముకు పోయినప్పుడు, చెట్టు మొగ్గ తొడిగిందా అని చూడ్డానికి పిల్లలు వెళ్లేవాళ్లు. అది యేదో వూరికే చెట్టుని గురించిన చింత మాత్రమే కాదు, ఒక యోధుణ్ణి దర్శించడం. ఆ చిన్న ఓకు చెట్టు పత్ర భరితమైంది. ప్రతి చిన్ని ఆకులోనూ ఆ భయంకర దినపు ప్రతిధ్వని వినిపించింది. ఆ వీరుణ్ణి ఖననం చేసిన వృద్ధులు ఆ సాహసకృత్యం జరిగిన రోజుని జ్ఞాపకం చేశారు. ప్రతి సంవత్సరమూ మేము ఆ రోజుని తేజోవంతమైన కీర్తి వున్న రోజుగా, స్మృతి దినంగా, విచారకర దినంగా జరిపేవాళ్లం. పిల్లలు ఉదయమే బడికి వచ్చేవాళ్లు. ప్రతివాళ్లూ పువ్వులు తెచ్చేవాళ్లు. వాళ్లు కళకళలాడే పూలగుచ్ఛం తయారుచేసి ఆ వీరుడు నేల కూలిన చోట వుంచారు.

తమ మాతృదేశపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని పరిరక్షించిన పాతతరం వాళ్ల వీరత్వానికి ప్రతీకగా పిల్లల అంతరంగంలో ఆ గుట్టమీది చిన్న జాగా నిలిచిపోయింది. “పాతతరంవాళ్లు దేనికోసమైతే రక్త తర్పణం చేశారో ఆ దేశపు భాగ్యవిధాతలు మీరు. మన మాతృదేశం సంపద్వంతంగా శక్తివంతంగా తయారయేటట్టు చూడవలసింది మీరు” అని నేను పిల్లలకి చెప్పాను.

వెచ్చగా వున్న ఒకరోజున నేనూ, ఓల్యా పిల్లల్ని “వీరుల పార్కు”కి తీసికెళ్లాం. ఫాసిస్టు దురాక్రమణ కాలంలో, 1941 ఆకురాలు కాలపు ఉత్తరార్ధంలో విషాదకరమైన వీరోచిత సంఘటన జరిగింది. ఆ స్థలంలో విద్యార్థులు నిర్మించిన కీర్తి స్మృతి చిహ్నం యిది. ఫాసిస్టులు సమష్టి వ్యవసాయ క్షేత్రపు పళ్లతోటని నరికేసి కాన్‌సెన్‌ట్రేషన్ కేంపు పెట్టారు. ముళ్ల తీగలవెనక, బయలులో ఆకలితో నకనకలాడుతూ అర్ధనగ్నంగా ఆరువేల మంది సోవియట్ సైన్యపు ఆఫీసర్లూ, సైనికులూ మృత్యు ముఖంలో వున్న చోటది. వాళ్లకి తాగడానికి మంచినీళ్లు లేవు. చలిగా వుండే ఆకురాలు కాలపు రాత్రుళ్లలో వాళ్లు గడ్డకట్టిన నేలనుంచి మంచుని పోగుచేసుకున్నారు, ఆకుల్ని తిన్నారు. ప్రతిరోజూ దజన్లకొద్దీ సైనికులు

చనిపోయేవాళ్లు. పాశవికమైన క్రూరత్వంతో వాళ్లందరు చనిపోవడంకోసం ఫాసిస్టులు యెదురుచూస్తూ వున్నారు. అప్పుడు శిబిరానికి పక్కనే వున్న మందుగుండు గిడ్డంగిని పేల్చేసి, తమ విమానాల్లోనుంచి బాంబులు విసిరి తమ జనాన్ని తామే హతంచేసుకున్నారని సోవియట్ సైన్యంమీద ఆరోపణ చెయ్యొచ్చు.

సోవియట్ దేశభక్తులు కాన్‌సెన్‌ట్రేషన్ కేంపులో ఒక రహస్య సంస్థని స్థాపించి సామూహికంగా పారిపోడానికి సిద్ధమయారు. రాత్రి చలిలో, వానలో గాలిలో వేలాదిమంది వజవజ వణికిపోతూవుంటే, ముళ్ల తీగ కంచె వార యిరవైతావులకి ఆఫీసర్లూ, సైనికులూ పాకి వెళ్లారు. అది వాళ్లకి అవసానమే. వాళ్లు ముళ్లతీగమీద సజీవ వంతెనలయ్యారు. వాళ్లమీదనుంచి నడుచుకుంటూ చాలామంది పారిపోయారు. ఆ రాత్రి రైతులు నాలుగువేలమందికి పైగా మనుషుల్ని దాచేశారు. గెస్టపోగాని, వాళ్ల తొత్తులుగాని వీళ్లెక్కడ వున్నదీ కనిపెట్టలేకపోయారు. మృత్యుముఖంలో వున్న నాలుగు వేలమంది సైనికులు తిరిగి తమ మాతృదేశ స్వాతంత్ర్యం కోసం పోరాడే శ్రేణుల్లో చేరేందుకుగాను నాలుగువందల మంది ప్రాణత్యాగం చేశారు.

ఫాసిస్టుల బారినుంచి గ్రామం విముక్తం అయాక బడిపిల్లలు నవనవలాడే పార్కులో ఆ వీరులకి సజీవ స్మృతి చిహ్నంగా ఆ స్థలం వుండిపోవాలని అనుకున్నారు. వాళ్లు జాగాని శుభ్రంచేసి, కయ్యలు పూడ్చేసి నాలుగు వందల ఓక్ చెట్లని పాతారు - తమ మిత్రులకోసం ప్రాణార్పణ చేసిన వాళ్ల కోసం నాలుగువందల సజీవ స్మృతులు. ఆ ఓక్ చెట్లు యింకా యింకా నిటారుగా పెరుగుతాయి. తర తరానికీ ఆ వీరుల సాహస గాథ అందుతూనే వుంటుంది. ఓక్ వృక్షాలని పాతిన కొన్ని యేళ్లకి యువ పయనీర్లలో చేరిన నూతనతరం విద్యార్థులు దానికి పక్కనే తమ ఓక్ చెట్లు పాతారు. వీరులరక్తంతో తడిసిన ముళ్లతీగ దగ్గర, వాళ్ల ప్రాణాలు భూమిలో కలిసిన ఆ చోట, అన్నిటి కంటే పొడుగైన ఓక్ చెట్టు పెరగాలి.

నేనూ, ఓల్యా పిల్లలని అక్కడికి తీసికెళ్లాం. ఆమె పిల్లలకి ఆ వీరుల సాహస కృత్యం గురించి చెప్పి తన ఓక్ చెట్టుని చూపించింది. తాము యెప్పుడు యువ పయనీర్లవుతామా అని పిల్లలు కనిపెట్టుకు కూర్చున్నారు.

వసంతకాలం వచ్చింది. లెనిన్ జన్మదినం* కొద్దిరోజుల్లో వస్తుంది. ఆ పండగరోజున నూతన యువ లెనినిస్టులని చేర్చుకోవడం సందర్భంగా యువ పయనీర్ల సభ జరిగింది. మేము మళ్లీ "వీరుల పార్కు" దగ్గరకి వెళ్లాం. ప్రతి పిల్లవాడూ ఒక చిన్న ఓక్‌మొక్కా, పారా, తట్ట యెరువూ తీసుకువచ్చాడు. ఆ మొక్కల్ని పాతి వాటికి నీళ్లు పోశారు. ఏప్రిల్ 22న సాహస కృత్యంతో నిండిన

---

* 1870 ఏప్రిల్ 22న లెనిన్ జన్మించాడు. ప్రతి యేడూ ఆ రోజు ఆయన స్మృతి దినంగా జరుపుకుంటారు.

స్థలంలో పిల్లలకి యువ పయనీర్ టైలని వాళ్ల పెద్ద మిత్రులు కట్టేశారు. యువ లెనినిస్టులు తమ సోషలిస్టు మాతృదేశపు నిజమైన దేశభక్తులుగా వుండే ప్రమాణం తీసుకున్నారు.

సంవత్సరంలో యెన్నోసార్లు మేము "వీరుల పార్కు"కి వెళ్లేవాళ్లం. వసంతకాలం తొలిరోజుల్లో చెట్లనుంచి యెండిపోయిన ఆకులనీ కొమ్మలనీ పీకేసి, చలికి దెబ్బతిన్న మొక్కల స్థానే కొత్తమొక్కల్ని పాతేవాళ్లం. ఆకురాలు కాలంలో ఆ వీరులు తమ సాహస కృత్యం సాధించిన రోజున మేము అక్కడ యువ పయనీర్ సభ పెట్టేవాళ్లం. ముళ్లతీగల కంచెబదులు అక్కడ ఓక్ చెట్లు పెరిగాయి. పిల్లలు నిశ్శబ్దంగా వచ్చి తమ తమ చెట్లకింద పువ్వులు పెట్టేవాళ్లు. ఆ మరుపురాని రాత్రి నేల రక్తంతో తడిసిన చోట ఆస్టర్ పువ్వులు, చామంతులూ కళకళ లాడేయి.

యెంతో సంతోషంగా వుండేరోజున, అంటే దీర్ఘ విహారయాత్రకి ముందుగాని, వేసవి తొలిరోజునగాని మేము "వీరుల పార్కు"కి వెళ్లేవాళ్లం. ఆ స్థలంలో యెప్పుడూ కూడా పవిత్రమైన నిశ్శబ్దం వుండేది. అక్కడ యెవళ్లూ పరుగులెత్తేవాళ్లు కాదు, ఆటలాడేవాళ్లుకాదు, అరుపులూ, కేకలూ వుండేవికాదు. ఆ స్థలం ప్రకృతి సౌందర్యానికి, విశ్రాంతికి, అధ్యయనానికి అనుకూలం. మహత్తర దేశభక్తియుత యుద్ధంలో మరణించిన వీరుల పిల్లలూ అక్కడికి వస్తారు. ఎక్కణ్ణో ఆర్కిటిక్ మహాసముద్ర తీరంలోనో, కార్పేతియన్ పర్వతాల్లోనో అసువులు బాసిన తండ్రికి పుత్రుడిక్కడ నివాళు లర్పిస్తాడు. తమ ప్రాణత్యాగంతో సోవియట్ ప్రజల సౌఖ్యప్రదమైన జీవితం పరిరక్షించిన ఆ వీరుల గాథ, యీ యెండనీ, పువ్వులనీ, నిర్నిబంధశ్రమనీ సోవియట్ ప్రజలకి పరిరక్షించిన ఆ వీరుల సాహసకృత్యం తరతరానికీ సంక్రమిస్తుంది.

ఆ గుట్టమీద ఓక్ చెట్టు యింకా యింకా పొడుగు పెరుగుతుంది. సగర్వంగా కొమ్మలు చాచుకుని ఆకాశపుటంచుల్ని స్పృశించే ఆ చెట్టుని పెద్దవాడైనవాడు చూస్తే అతని గుండె వేగంగా కొట్టుకుంటుంది. అతని మాతృదేశం అతనికింకా ప్రియమైంది అవుతుంది.

దశాబ్దాలు గడిచిపోతాయి. యుద్ధంలో పోరాడినవాళ్లు వుండరు. ఆ యుద్ధంలో పోరాడి, ఫాసిస్టు బానిసత్వభయంనుంచి మానవాళిని కాపాడిన వీరుల సాహసకృత్యాన్ని అభినందనతోనూ, కృతజ్ఞతతోనూ నూతన తరం గుర్తుంచుకుంటుంది.

ఆ యుద్ధపు దారుణాలు, అది తెచ్చిపెట్టిన విపత్తులు, భగభగమండే మంటలు, బాంబులు పేలినప్పుడు చచ్చిపోతున్న వాళ్ల ఆర్తరావాలు, ఫాసిస్టు జర్మనీలోని బానిసలుగా మగ్గేవాళ్ల వేడి నిట్టూర్పులు, యుద్ధరంగంలోకి వెళ్లే తండ్రుల గాఢాలింగనాలు, తమ తండ్రులో, భర్తలో యుద్ధంలో గతులైనారన్న వార్తలు అందుకున్న ఆడవాళ్ల రోదనలు యేవీ కూడా మరిచిపోకూడదు... హతులైన వీరుల శాశ్వత స్మృతి చిహ్నానికి నూతన తరం పునాది వెయ్యాలి. ఆ దురాక్రమణ కాలంలో

బానిసత్వానికి గురిచెయ్యబడ్డ సోవియట్ మహిళలకీ, మగవాళ్లకీ యిప్పుడు మేం చదువుకునే బడి తాత్కాలిక జైలుగా వుండేది. మీరా విషయాన్ని యెన్నటికీ మరిచిపోకూడదు, పిల్లలూ. మీరు పెద్దవాళ్లవుతారు, మీకూ పిల్లలు పుడతారు. శత్రువుపట్ల విద్వేషాన్ని మీరు వాళ్లకి జ్యోతిని అందించినట్టు అందివ్వాలి.

యుద్ధానికి ముందు మా గ్రామంలో 5,100 జనాభా వుండేది. మా సహగ్రామస్థులు 837 మంది, 785 మంది పురుషులూ, 52 మంది స్త్రీలు - మహత్తర దేశభక్తియుత యుద్ధంలో హతులయ్యారు. అంతేకాక ఫాసిస్టు మృత్యు శిబిరాల్లో 69 మంది చనిపోయారు - క్షుద్బాధవల్లా పరమ కిరాతక చిత్రహింసల వల్లా వాళ్లు చనిపోయారు. వాళ్లని చంపి, కాల్చేశారు. ఫాసిస్టులు వాళ్ల అస్థికలతో కిరాతంగా ప్రవర్తించారు. ఖైదీల శిబిరం అయిన బూహెన్‌వాల్డ్‌కి దగ్గర్లో వైమర్ నగర పరిసరాల్లో మీ సోదరుల, తండ్రుల, తల్లుల అస్థికలు రైతుల పొలాలకి యెరువులయ్యాయి. పిల్లలూ, మీ హృదయాలమీద మీ సోదరుల, తండ్రుల, తాతల అస్థికలని తాడించనివ్వండి. మీ పిల్లల మనవల హృదయాలమీద కూడా తాడించనివ్వండి. 276 మంది యువతీయువకులని మీ గ్రామంనుంచి జర్మనీ ఫాసిస్టు శిబిరాలకి బందీలుగా తీసుకునిపోయిన విషయం మర్చిపోకండి. అతి శ్రమకీ, ఆకలికీ గురై 194 మంది మృత్యు శిబిరాల్లో చనిపోయారు, కొంత మందిని సజీవంగా కాల్చేశారు. పావెల్ సోదరుణ్ణి బోహుమ్ నగరానికి తీసుకుపోయి నిరసన ప్రకటించినందుకు యెర్రగా కాలే సలాకలతో అతని కళ్లు పెరికేశారు. బతికుండగానే ఒక కొయ్య మోదుమీద అతన్ని మేకులతో కొట్టేశారు. కమ్యూనిస్టు ప్రచారం చేసిందని తాన్యా సోదరిని సజీవంగానే పూడ్చేశారు. కోస్త్య మామని యినప బోనులోకి గెంటేశారు. అక్కడ కొన్ని రోజులు దిగంబరంగా బాధపడి, ఆ బాధతోటే అతను చనిపోయాడు. పారిపో ప్రయత్నించిన యూర బంధువుని ప్రాణంతో వుండగానే వేటకుక్కల పాల్చేసి, వాటిచేత చీల్పించేశారు. వాల్యా బంధువు బిడ్డని ఆమెనుంచి లాగేసి ఆమె కళ్ల ముందే ఒక ఫాసిస్టు ఆఫీసరు ఆ బిడ్డతలని రాతికేసి కొట్టాడు. 26 సంవత్సరాల వయసున్న ల్యూస్యా అత్తని ఆమె నాలుగేళ్ల కూతురితోటీ, మూడేళ్ల కొడుకుతోటీ ఆష్విట్జ్ ఖైదీల శిబిరానికి పంపారు. ఆ శిబిరంలో తల్లినుంచి పిల్లల్ని వేరుచేశారు. "వాళ్లకి జబ్బుగా వుంది. దయచేసి వాళ్లని నాతో వుండనియ్యండి" అని ఆమె ఫాసిస్టు ఆఫీసరుతోటి చెప్పింది. "వాళ్లకి జబ్బుగా వుంటే మేము నయం చేస్తాంలే" అని ఆఫీసరు అరిచాట్ట. ఆ వ్యాకులహృదయురాలైన తల్లి కళ్లముందే ఆ పిల్లల్ని నగ్నంగా, రాళ్లకేసికొట్టి, వాళ్ల శరీరాలమీద బూటుకాళ్లతో చితకతన్నాట్ట....

"యీ విషయాలన్నీ మనం గుర్తుంచుకోవడమేకాదు, మానవ అంతరాత్మ స్మృతిని అన్ని భావితరాల వాళ్లకీ మనం అందివ్వాలి" అని నేను పిల్లలకి చెప్పాను. మేము ఒక గ్రామ స్మృతి చిహ్నం ఏర్పాటు చేయాలని నిర్ణయించుకున్నాం. సోవియట్ మాతృదేశ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసం అసువులర్పించిన వీరుల

బొమ్మలతో ఒక గాలరీ ఏర్పాటు చేయాలని అనుకున్నాం. మూడో తరగతి ఆఖరులో, నాలుగో తరగతి ఆరంభంలోనూ పిల్లలు వూళ్లోని అన్ని కుటుంబాలనీ దర్శించారు.

ఫాసిస్టు మృత్యుశిబిరాల్లో బాధలు అనుభవించిన వాళ్లవీ, యుద్ధంలో హతులైన వాళ్లవీ ఫోటోలు వాళ్ల తల్లులు యిచ్చారు. ఆ ఫోటోల ఆధారంగా చిత్రించిన బొమ్మలని మేము "కీర్తి విచారాల మందిరం"లో పెట్టాం. అది స్మృతి చిహ్నానికి నాందీ. దాన్ని నూతన తరం పిల్లలు క్రమేపీ పూర్తిచేస్తారు. మేము పెట్టుకున్న లక్ష్యం అదీ. మరొకసారి యుద్ధం లేకుండా వుండేటందుకు, ప్రజలంతా సోదరులుగా బతికేటందుకు, పిల్లలు యుద్ధం కోసం, మృత్యువు కోసం కాకుండా శాంతి సౌఖ్యాలతో జీవించేటందుకు యీ కర్తవ్యాన్ని నిర్వర్తించడం మా విధి. యిది సర్వప్రపంచ ప్రజలపట్లా మాకున్న విధి. ఫాసిజం తాలూకు దారుణాలు పునరావృతం కాకుండా వుండేందుకు మేము దేన్నీ మర్చిపోకూడదు, క్షమించకూడదు.

ఒక విహారయాత్ర మకాం అప్పుడు మేము ద్నీపర్‌నది తీరంలో ఒక రాత్రి గడిపాం. కనుమలో వున్న బుగ్గనుంచి నీళ్లు తేవడానికి పిల్లలు కొన్నిసార్లు వెళ్లారు. ప్రతిసారీ వాళ్లు చుట్టు తిరిగి వెళ్లాల్సి వచ్చింది. దారిలో అడ్డంగా వున్న పెద్ద బండరాతిని చుట్టి వెళ్లాల్సి వచ్చేది.

"ఆ రాయి అక్కడెందుకు పడివుంది? పొదల్లోకి పోవాలంటే అందరూ చుట్టు తిరిగి యెందుకు వెళ్లాలి? దాన్ని దారిలోంచి తీసేద్దామా?" అని పిల్లలు అడిగారు. పిల్లలు ఆ బండరాతిని దారిలోనుంచి దొర్లించేశారు, అందులో దురుద్దేశమూ యేమీ లేదు. ఆ మర్నాడు ఉదయం ఒక ముసలి బెస్తవాడు మా దగ్గరికి వచ్చాడు. ఆ రాయి యేమైందని మమ్మల్ని అడిగాడు. అతను తమని పొగుడుతాడని పిల్లలు అనుకున్నారు, కాని అతను తల పంకించి, "ఆ రాయి యిక్కడ చాలా కాలంగా వుంది. యిదే దాని చోటు..." అన్నాడు. అప్పుడు ముగ్గురు సోవియట్ వేగులవాళ్ల సాహసకృత్యం గురించి చెప్పాడు. ద్నీపర్‌నది కోసం జరిగిన మహా పోరులో నదిని దాటివచ్చి వాళ్లు ఈ రాయి వెనక్కాల తమ మెషీన్ గన్లతో కాపు వున్నారు. ఒకపగలూ, ఒకరాత్రీ అక్కడ వున్నారు. శత్రువు సంఖ్య ఎక్కువగా వుంది. ఫాసిస్టులు ఫిరంగులూ, తూటాలూ వాళ్ల మీద వర్షించారు. కొన్నిగంటలసేపు పేలుడు పదార్థాలూ, తూటాలూ వాళ్ల పక్కన పేలుతూనే వున్నాయి. కాని ఈ రాయి అభేద్యమైన దుర్గంగా వుంది. ఆ రాత్రి సోవియట్ సైన్యం నదిని దాటివచ్చి వేగులవాళ్లని కాపాడింది. రక్తసిక్తమై, తూటాముక్కలూ, గుళ్లూ గాయపరచినా లొంగకుండా వేగులవాళ్లు రాతి వెనక్కాల వుండిపోయారు. ద్నీపరు అవతల సైనిక ఆస్పత్రికి వాళ్లని పంపారు. వాళ్ల పేర్లు యెవళ్లకీ తెలీవు. ఆ వీరుల సాహసకృత్యానికి చిహ్నంగా నల్లని బండరాయి మాత్రం నిలిచిపోయింది. పిల్లలు ఆ రాతి దగ్గరకి వెళ్లి, దాని ముందు చాలాసేపు నుంచున్నారు. దాన్ని మళ్లీ పొదలనుంచి దొర్లించుకు వచ్చి యథాస్థానంలో పెట్టేశారు. అప్పుడు మాత్రమే ఆ రాయి తూటాతునకలతోటీ,

గుళ్లతోటీ పెళ్లలు వూడిపోయిందని గమనించారు. ప్రతి పిల్లవాడూ జ్ఞాపకార్థంగా ఒకో ముక్కని యేరుకున్నాడు.

అప్పటినుంచీ మా పిల్లల దారి ఆ పవిత్రమైన రాయి పక్కనుంచే. గుట్టమీది "వీరుల పార్కు"లాగా యీ నల్లని బండరాయి కూడా పిల్లల పసి హృదయాల్లో దేశభక్తి భావాలని జాగృతం చేస్తూ సాహసకృత్యాల సౌందర్యానికి ప్రతీకగా నిలిచిపోయింది.

తమ ముందుతరంవాళ్ల సాహసకృత్యాలపట్ల బాల్యంలోనే వాళ్లకి యెలాంటి వైఖరి వుంటుందో దానిమీద ఒక వ్యక్తి నైతిక దృక్పథమూ, సామాజిక ఆసక్తుల దృష్టీ, తమ మాతృదేశం కోసం చేసే శ్రమా ఆధారపడి వుంటాయి. మేము ఆ రోజు పని చేస్తున్న ఆ గుట్టమీద వీరుల రక్తం చిందిందనే భావనతోటి పిల్లల హృదయాలు ఉద్వేగం కావాలి. తమ మాతృదేశపు మంచి కోసం యిలమీద చేసే పని చాలా ఆనందదాయికమైందనీ, ఆ ఆనందం కోసం ప్రజలు మృత్యు గహ్వారం చొచ్చే పోరాటం చేసారనీ విశ్వాసాన్ని అనుభూతులే దృఢతరం చేస్తాయి. తమ కోసం కాంతినీ జీవితాన్నీ పదిలం చెయ్యడానికి పాప్లర్ చెట్లకిందా, బర్చ్ చెట్లకిందా, యాపిల్ చెట్లకిందా, ఓక్ చెట్లకిందా శాశ్వత నిద్రలోకి పోయేందుకు జీవితాలని అర్పించినవాళ్ల వల్లే తాము తేజోవంతమైన సూర్యకాంతిలో నడుస్తున్నారు, వినీలాకాశాన్ని దర్శిస్తున్నారు అని పిల్లవాడి అంతరంగపు మారుమూలల్లో అంతరాత్మ కంఠం జాగృతం అవుతుంది.

యువ లెనినిస్టులకి యీ కంఠమే తాము తమ దేశపు భాగ్య విధాతలని గుర్తుచేస్తుంది. పూర్వతరంవాళ్లు సృష్టించిన పాదార్థిక ఆధ్యాత్మిక విలువలపట్ల భాగ్యవిధాతల దృష్టే పెద్దవాడైన పౌరుడికి మూలాధారం అయేది. తమ జీవితాలని సురక్షితం చేసినవాళ్లపట్ల విధేయతతోటి పిల్లల కృషిని ఉత్తేజితం చేసే మార్గాన్ని గురించి నేనూ ఓల్యా ఆలోచించాం. ఒక రోజున పిల్లలు పొలానికి వచ్చారు. వట్టి బీడుగా వున్న నేలలో గోధుమ పంట కోసమని ఆ బీడుకి వాళ్లు ముప్పై, నలభై తట్టల పచ్చి యెరువు తేవాల్సివచ్చింది. ఆ పని కష్టమైందీ, విసుగు కలిగించేదీనీ. పని మొదలయ్యే ముందే, 1943లో వోల్గా నది దగ్గర జరిగిన మహత్తర యుద్ధంలో ఉక్రేనియన్ యువజన లెనినిస్టు సంఘ సభ్యుడు మిహయిల్ పనికాకొ చేసిన సాహసకృత్యాన్ని గురించి ఓల్యా పిల్లలకి చెప్పింది.

ఆ పంథొమ్మిదేళ్ల యువకుడు ఫాసిస్టు టాంక్ మార్గాన్ని అడ్డగించే ఒక కందకంలో నుంచున్నాడు. శత్రు టాంక్ కందకం సమీపించింది. ఆ టాంక్ని పేల్చెయ్యడానికి పేలుడు మందుగుండు మిశ్రమం వున్న ఒక సీసాని ఝళిపిస్తూ అతను తిప్పాడు. ఆ క్షణంలో, ఒక గుండు చేతిలో యెత్తిపట్టిన సీసాని బద్దలు చేసింది. ఆ ద్రవం భగ్గున మండింది. అతని బట్టలు అంటుకున్నాయి, మొఖందాకా మంటపాకింది. పొగ, మంట తన వెనక జాడవిడుస్తూ వుంటే సజీవ జ్వాలగా వున్న అతను లేచి టాంక్ వైపు పరిగెత్తాడు. అతను తన చేత్తో పేలుడు మందుగుండు

నింపిన ఆఖరి సీసా పట్టుకున్నాడు. శత్రు టాంక్ కవచంమీదకి యెక్కాడు. సీసాతోటి టాంక్ గోపురాన్ని కొట్టాడు. టాంక్ అంటుకుని గిరగిర తిరిగింది. టాంక్ పేలిపోతుందనగా ఆఖరి క్షణంలో ఆ సైనికుడు నిటారుగా నుంచుని మంటలేస్తూ వున్న తన చేతిని పైకెత్తి అరిచాడు. అతని యుద్ధారావాన్ని సైనికులు విని కందకాలనుంచి దూకివచ్చి శత్రువుని తరిమేసి వీధిని స్వాధీనం చేసుకున్నారు.

పిల్లలకి ఆ కథ హత్తుకుంది. ఆ క్షణంలో అమరంగా, జీవంతో ఆ వీరుడు వాళ్ల పక్కనే నుంచుని "మన మాతృభూమి పవిత్రమైన నేల కోసం నా ప్రాణాలు అర్పించాను. దానిమీద గోధుమ పండుతోందో, ఉమ్మెత్త దుబ్బులు పెరుగుతున్నాయో పట్టించుకోకుండా యెవళ్లుండగలరు?" అని అంటున్నట్టు కనిపించింది. ఆ క్షణంలో అంతర్మాత ప్రబోధం ప్రతివాళ్లకీ వినిపించింది: నేను ఉదాసీనంగా వుండకూడదు అని.

పిల్లలు పని ప్రారంభించినప్పుడల్లా వాళ్లకి వీరోచిత కృత్యాల కథ ఒకటి చెప్పాలని అనుకోను. తను పని చెయ్యకుండా సోమరిగా వుంటే మాతృదేశంపట్ల తన కర్తవ్యాన్ని నిర్వర్తించడం లేదని పిల్లవాడికి చెప్పనివ్వక్కర్లేదు. కర్తవ్యతావిధి పవిత్రమైంది, దాన్ని పిల్లవాడు గుండెలో దాచుకోవాలి. అదే సమయంలో సాహసకృత్యాలు పిల్లవాడి మనసులో పౌరసత్వ భావాలని జాగృతం చేస్తూ పిల్లవాడికి యెలా జీవించాలో బోధించడం అనేది ముఖ్యం. చెయ్యబోయే పనికీ, దానికీ యే సంబంధమూ లేనట్టుగానే, యే ప్రబోధమూ లేకుండానే మిహాయిల్ పనికాకొ సాహసకృత్యాన్ని గురించి చెప్పమని ఓల్యాకి సలహా యిచ్చాను. అలా అయితే పిల్లవాడు తన మాతృభూమిలోని ఆ స్థలాన్ని ఒక పౌరునిగా చూస్తాడు.

# యువ లెనినిస్టుల సంస్థలో పిల్లలు చేరడం

మూడవ తరగతి ముగిసేదానికి కొంచెం ముందు 1955 వసంత రుతువులో పిల్లలు వి. ఐ. లెనిన్ యువ పయనీర్ సంస్థలో చేరారు. యువజన సంస్థ కమిటీ ఓల్యాని వాళ్లకి నాయకత్వం వహించేందుకు నియమించింది. అప్పుడామె యెనిమిదో తరగతిలో వుంది.

జోయా కొస్మొడెమ్యాన్స్కయా అనే యువ పయనీర్ దళపు తొలి సమావేశం లెనిన్ జయంతి దినం ఏప్రిల్ 22న సాంప్రదాయికంగా జరిగింది. అంతకు ముందునుంచీ ఓల్యా, ఆమె మిత్రులు పిల్లల్ని యువ పయనీర్ శ్రేణుల్లో చేరేటందుకు సిద్ధం చేస్తున్నారు. యెనిమిదవ తరగతి వాళ్లు లెనినిస్టు పార్టీ గురించీ, యువజన సంస్థ గురించీ, యువ పయనీర్ సంస్థ గురించీ పిల్లలకి చెప్పారు.

"మిమ్మల్ని బాగా ఉత్తేజితం చేసిన సాహసకృత్యాలు సాధించిన వ్యక్తిపేరు మీ దళానికి పెట్టుకోండి" అని ఓల్యా వాళ్లకి చెప్పింది. పిల్లలందరూ యేకగ్రీవంగా తమ దళానికి స్టాలిన్‌గ్రాడ్ యుద్ధ వీరుడు మిహాయిల్ పనికాకొ పేరు పెట్టాలనుకున్నారు.

మా దళపు సూక్తి వాక్యం యేమిటంటే "లెనిన్ లాగా పోరాడి జయించాలి" అని. ఓక్ చెట్టు ఆకులూ, దాని కాయలూ మా పోరాటానికి, మా సహజ పరిసరాలని పరిపుష్టం చేసే చిహ్నం.

యువ పయనీర్ సభకి విద్యార్థులే కాక, వాళ్ల తల్లిదండ్రులు, మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవంలో పాల్గొన్నవాళ్లు, గెరిల్లా ఉద్యమంలో పాల్గొన్నవాళ్లు, అంతర్యుద్ధంలో పాల్గొన్న సిద్ధహస్తులు, 1919లో మా వూళ్లో మొట్టమొదట యువజన సంస్థని స్థాపించిన వాళ్లు వచ్చారు.

పెద్ద పచ్చికమైదానంలో సభ జరిగింది. ఎనిమిదవ తరగతి యువ పయనీర్ దళం భావి యువ లెనినిస్టులైన మూడో తరగతి వాళ్లకి అభిముఖంగా నుంచున్నారు. ఎనిమిదవ తరగతి దళపు కౌన్సిల్ నాయకుడు తమ దళం ఆ నాటితో తన కార్యకలాపాలని నిలిపివేస్తుందనీ, మూడవ తరగతిలోని యువ లెనినిస్టులకి జ్యోతిని అందిస్తుందనీ చెప్పాడు.

పిల్లలకి పయనీర్ టైలు యిచ్చే క్షణం వచ్చింది. మా స్కూల్ సంప్రదాయం ప్రకారం తన కార్యకలాపాలు మానుకునే పయనీర్ దళం తన టైలని యువ పయనీర్లలో చేరే అక్టోబ్రిస్టులకి యిచ్చింది. అబ్బాయిలూ, అమ్మాయిలూ తమ యువ పయనీర్ టైలని తీసి తమ చిన్న మిత్రులకి కట్టేశారు. తను స్నేహం చేసిన పిల్లవాడికి ప్రతి విద్యార్థీ తన టై అందజేశాడు. మూడవ తరగతిలోని వాళ్ల అక్కలూ, అన్నలూ యెనిమిదవ తరగతిలో వున్నారు. ఆ పెద్ద పిల్లలు తమ యెర్రని టైలని కుటుంబ వారసత్వంకింద చిన్న పిల్లలకి యిచ్చారు. ఎర్ర టైలు తీసుకుని పిల్లలు యువ లెనినిస్టుల ప్రమాణం చేశారు. మిహయిల్ పనికాకొ లాగా దృఢమైన, సాహసోపేతమైన దేశభక్తుల్లాగా వుంటామనీ, "లెనిన్ లాగా పోరాడి జయించాలి" అనే తమ సూక్తికి అనుగుణంగా జీవిస్తామనీ ప్రమాణం చేశారు. వాళ్లు యువ పయనీర్లలో చేరిందానికి గుర్తుగా ప్రతి పిల్లవాడికీ ఒక బహుమతీ వచ్చింది. ఒక ప్రసిద్ధ వ్యక్తి జీవిత కృషులను వర్ణించే పుస్తకం అది.

ఆ సభ మా పిల్లల మనస్సుల్లో నాటుకు పోయింది. ఆ ఎర్ర టై ఒకతరంనుంచి యింకోతరపు యువ లెనినిస్టులకి అందడమే యీ ఉత్సవంలోని ప్రధానమైన విషయం. ఎర్ర టై విప్లవ పోరాటపు ప్రతీక. పిల్లలు దాన్ని బహుజాగ్రత్తగా కాపాడతారు.

## లెనిన్‌లా పోరాడి జయించాలి

కమ్యూనిజంకోసం పోరాటం నిత్యజీవిత కృత్యమని లెనిన్ బోధించాడు. తమ చుట్టూతా జరిగే విషయాలని పిల్లల హృదయానికి హత్తుకునేటట్టు యెలా చెయ్యాల్సిందీ, ప్రజలకి చెందిన పాదార్థిక విలువలని పట్టించుకునేటట్టు యెలా చెయ్యాల్సిందీ ఓల్యా, నేనూ ఆలోచించాం. యువ పయనీర్ల దళంలోనే యువ ప్రకృతి

సంరక్షకుల గ్రూపును ఓల్యా యేర్పాటు చేసింది. స్కూలుకి దగ్గర్లోనే యెంచుకున్న అడివిలోని ఒక చోటుని పిల్లలు కాపలాగా వుంచుకున్నారు. వాళ్లు చెట్ల వారనే వెడుతూ కొన్ని చెట్ల బెరళ్లని ఎవళ్లో కొట్టెయ్యడం చూశారు. ఆ చెట్లు చచ్చిపోతే వాటిని కొట్టెయ్యాల్సిన అవసరం వుండదని యెవరో అనుకుని వుంటారు. చెట్లు చచ్చిపోతే అవి నుంచుని వుంటాయా? పిల్లలకి ఆగ్రహం వచ్చింది: యిది యెలా జరిగింది? మనం చెట్లని నాటి పెంచుతాం, ఎవళ్లో వాటిని కొట్టేస్తారు. ఆ పని యెవళ్లు చేశారో కనిపెట్టాల్సిందే.

ఆ రోజునుంచి ప్రకృతి యువ సంరక్షకుల పహరాలు మొదలయ్యాయి. సాయంత్రం వాళ్లు అడివిలోని ఆ చోటుకి వెళ్లి నేరస్తుల కోసం కాపలాకాశారు. కొన్నిరోజుల తర్వాత దొంగలు దొరికిపోయారు. చెట్లని కొట్టేద్దామని యిద్దరు రైతులు రంపాలతో వచ్చారు. చెట్లని ధ్వంసం చేసే వాళ్లని గురించి పిల్లలు సమష్టి క్షేత్రపు అధికారులకి చెప్పారు. తాము నాశనం చేసి ప్రతి చెట్టుకీ పదేసి చెట్లు చొప్పున నాటాలని ఆ దోషులని ఆదేశించారు. పిల్లలకి సంతోషం కలిగింది. సత్యం జయించింది. నైతిక బోధనకి యిది తప్పనిసరి షరతు. న్యాయం జరగడం చూస్తేనే యువ లెనినిస్టులకి కమ్యూనిస్టు ఆదర్శాల కోసం పోరాటం ఉన్నత భావాలకి ఆధారం అవుతుంది. విజయం వాళ్లని ఉత్తేజితం చేసి, కష్టాలని అధిగమించే శక్తిని యిస్తుంది.

ప్రకృతి యువ సంరక్షకులని ఒక ఆట ఆకట్టుకుంది. సౌందర్యం కోసం, శ్రమ కోసం యాత్ర దానికి ఆధారం. ఒకసారి అలా వెళ్లేటప్పుడు కొంతమంది రైతుల పొలాల్లో కలుపు పెరుగుతోందని యువ పయనీర్లు చూశారు. పిల్లలు యాపిల్ మొక్కలు తీసికెళ్లి రైతులకిచ్చి కలుపు తీసేసి ఆ పళ్ల మొక్కలని పాతమని చెప్పారు. ముగ్గురు రైతులు మహాబద్ధకస్తులు, వాళ్లు ఆ పని చెయ్యలేదు. ప్రకృతి యువ సంరక్షకులు ఈ ముగ్గురు రైతులకీ విజ్ఞప్తి చేసే నోట్సు రాశారు: "మీ పెరటిలో కలుపు పెరగడం ప్రకృతి యువ సంరక్షకులమైన మాకు బాధ కలిగిస్తోంది. మీ ఉమ్మెత్త పొదల్లో త్వరలోనే తోడేళ్లు వాసం చెయ్యొచ్చు. మీరీ "అడివి"లో యెలా వుంటారు? కలుపు పీకేసి యాపిల్‌మొక్కల్నీ, ద్రాక్ష తీగలనీ పాతమనీ, ఆ జాగాలో పువ్వులని పెంచమనీ మీకు విజ్ఞప్తి చేస్తున్నాం. మీ యిళ్ల దగ్గర అయిదు యాపిల్ మొక్కల్నీ, మూడు ద్రాక్ష తీగలనీ వుంచాం. ఆ మొక్కల్ని మీరు రేపు పాతి తీరాలి. వాటిని పాతి, నీళ్లుపొయ్యండి. మీరు మరీ బద్ధకిస్తే మేమే వచ్చి గుంతలు తవ్వి కలుపు తీసేసి ఆ మొక్కల్ని పాత్తాం. ఒక పళ్లతోట తయారవుతుంది. కాని అది మీది కాదు. అది యువ పయనీర్లకి చెందుతుంది."

ఆ నోట్సుని అందచెయ్యడం కూడా కొత్త పద్ధతిలో జరిగింది. తెరిచి వున్న కిటికీల్లోనుంచి వాటిని బల్లమీదకి గిరవాటెట్టారు. యెవళ్లూ చూడకుండా వుంటారని మొక్కల్ని సాయంత్రం తెచ్చారు. యిదంతా పిల్లల కిష్టమైన ఆటలా వుంది. ఆ మర్నాటి కోసం పిల్లలు ఆతృతగా యెదురు చూశారు. ఆ బద్ధకస్తులు యేం చేస్తారు? బడి అయిపోయింతర్వాత వాళ్లు వెళ్లి చూస్తే నమ్మలేకపోయారు. పొలాల్లో కలుపు

మొక్కల బదులు పళ్లమొక్కలున్నాయి. ఆ వార్త బడంతా పాకిపోయింది. యువ పయనీర్లలోనే మా దళం నూతన ప్రకృతి సంరక్షక బృందాలని యేర్పాటుచేసింది. సమష్టి క్షేత్ర అధికారులు పెద్ద పయనీర్ల దగ్గరికి వచ్చి మల్బరీతోట రక్షణ బాధ్యత వహించమని అడిగారు. కొంతమంది సమష్టి క్షేత్రరైతులు నిర్దాక్షిణ్యంగా చెట్ల కొమ్మల్ని కొట్టేస్తున్నారట. పయనీర్లు కొన్ని ఆకస్మిక తనిఖీలు చేశారు. కొమ్మల్ని కొట్టేయ్యడం ఆగింది.

హైబ్రిడ్ ప్రయోగశాలలో ప్రయోగాల నిమిత్తం శుద్ధిచేసిన ఓ యిరవై కిలోగ్రాముల గోధుమ విత్తనాలని తయారు చేసుకునే బాధ్యతని వేసవికాలంలో మా దళం తీసుకుంది. పిల్లలు మంచి కంకుల్ని యేరారు. శీతాకాలంలో వాటిని నిలవచెయ్యడానికి బళ్లో పొడి జాగాని యెంచుకున్నారు. వసంతకాలంలో ఆ కుంకుల్ని నూర్చి గింజల్ని అగ్రానమిస్టుకి యిచ్చారు. అప్పట్లో నాలుగో తరగతిలో వున్న పిల్లలకి ఆ పని యెంత ఉత్సాహజనకంగా, ఆతృతగా వుందంటే వాళ్లు ఆ విత్తనాలని నాటే పద్ధతిని స్వయంగా చూడ్డానికి పొలానికి వెళ్లారు. మొక్కలు రాగానే మళ్లీ పొలానికి వెళ్లారు. కోతకాలంలో పైతరగతి పిల్లలకి సాయంచెయ్యడానికి పయనీర్లు వెళ్లారు. వాళ్లు తమ శక్తిసామర్థ్యాలని మిగతా వాళ్లతోటి బాటుగా పనిలో పెడుతున్నందుకూ, చుట్టూతా జరిగే దానిపట్ల గ్రహింపుతో వున్నందుకూ నాకు సంతోషం కలిగింది. మేము చల్లిన విత్తనాలు బాగా పండాయి. ఆ తృప్తితోటి మేం వెనక్కి వచ్చాం. సమష్టి క్షేత్రం పళ్లతోట పక్కనుంచే వస్తూ చిన్న యాపిల్ చెట్లమీద గొంగళీపురుగుల్ని చూశాం. పిల్లలకి భయం కలిగింది. వాళ్లు ఆ క్షణంలో సమాజంపట్ల తమ బాధ్యతని గురించి యేమీ ఆలోచించలేదు. ఒక సజీవమైంది విపత్తుకు గురికాబోదన్న సంగతి వాళ్లని ఉదాసీనంగా వుండనివ్వలేదు. వాళ్లు తోటలోకి వెళ్లి గొంగళీపురుగులని నాశనం చేశారు. యాపిల్ చెట్టుని కాపాడారు. పక్క చెట్లకి కూడా పురుగు పట్టిందేమోనని చూశారు.

తమ మాతృదేశపు భావి యజమానులు తామే ననేది చిన్నప్పటినుంచీ పిల్లల్లో దృఢతరం చెయ్యాల్సిన ముఖ్యమైన దేశభక్తి భావాల్లో ఒకటి. తమ తల్లో తండ్రో యిచ్చిన ఆటవస్తువో, యిష్టమైన బొమ్మల పుస్తకమో యెంత వ్యక్తిగత ఆనందం యిస్తాయో అంత విలువైనవిగానూ సమష్టి క్షేత్రంలోని ప్రతి గోధుమ కంకునీ, ఉమ్మడి తోటలోని ప్రతి చెట్టునీ, సమష్టి క్షేత్రపు నూర్పుడు కళ్లంమీది ప్రతి గోధుమగింజనీ పరిగణించిన పిల్లవాడే పెద్దయ్యాక నిజమైన దేశభక్తుడవుతాడు. యితరుల కోసం యేదేనా సృష్టించే శ్రమలో త్రికరణ శుద్ధిగా తను నిమగ్నుడైనప్పుడు, తన స్వహస్తాలతో సృష్టించిన భౌతిక విలువలు గాఢమైన వ్యక్తిగత ఆనందం యిచ్చినప్పుడు, ఆ ఆనందమార్గం ఆతృతతోటీ, ఆదుర్దాతోటీ, మధ్య మధ్యన పరాజయాలతో నిండినప్పుడు సమాజపరమైంది కూడా పిల్లవాడికి వ్యక్తిగతమైంది అవుతుంది. పిల్లల దుఃఖాలూ, విచారాలూ పట్టించు కోకుండా నేను యెప్పుడూ లేను. తన సొంత ఆనందానికి కారణమైందాన్నేనా పిల్లవాడు

ప్రియమైందిగా యెంచుకునేది? లేకపోతే పరులని గురించి పట్టించుకుంటాడా? దీనికి వచ్చే జవాబు పిల్లవాడి నైతిక గుణాలకి యెప్పటికీ గీటురాయిగానే వుంటుంది. పెనువానకి మడిలోని గోధుమ మొక్కలు వంగిపోయినప్పుడు కోల్యా లేక వాల్యా బాధపడితే నాకు ఓరకంగా సంతోషం కలిగింది. పిల్లవాడికి అలాంటి దుర్ఘటనపట్ల బాధా, విచారం కలగనంత కాలం ఉపాధ్యాయుడికి విశ్రాంతి వుండదు. యెందుకంటే అవి లేకపోతే పిల్లవాడు నిర్లక్ష్యపూరితమైన మనిషిగా తయారవుతాడు.

పరుల కోసం పట్టింపుల్లేకుండా, ఆనందాన్ని అనుభవించేవాళ్లే పెద్దయాక అహంభావులూ, స్వార్థపరులూ అవుతారు. మా విద్యార్థులు వాలోద్య, స్లావలు యీ ప్రమాదానికి గురవుతారని నాకు కలవరం కలిగింది. వాళ్లు కోరిందల్లా చెయ్యడానికి వాళ్ల యింట్లోవాళ్లు యెప్పుడూ హాజరుగా వుండేవాళ్లు. తల్లీదండ్రీ తాము కోరింది యెప్పుడేనా యివ్వకపోతే వాళ్లకి దుఃఖం ముంచుకొచ్చేది. యీ స్వార్థ లక్షణాలనుంచి పుట్టే బాధని వేరేబాధగా అయేటట్టుచెయ్యాలి. పరులకి భౌతికంగా, ఆధ్యాత్మికంగా విలువైందాన్ని గురించి పిల్లలు పట్టించుకునేటట్టు చెయ్యాలి.

మేము "సంతోష చంద్రశాల" నాటి రోజుల్లో పాతిక లైమ్ చెట్టు వేసవి కాలపు యెండకి బాగా యెండిపోయింది. "మన నేస్తానికి మనం సాయంచెయ్యాలి" అని నేను వాలోద్యకీ, స్లావకీ చెప్పాను. యేదో ఆసక్తికరమైందాన్ని చూపిద్దామన్నట్టుగా నేను వాళ్లని తోటలోకి తీసికెళ్లి వాళ్లకి ఆ యెండిపోతున్న చెట్టుని చూపించాను. "యీ లైమ్ చెట్టుకి మన సాయం కావాలి. మనం అనుకుంటే ఆ పని చెయ్యొచ్చు. యిలాంటి చెట్టుకి మరీ ముఖ్యంగా అది మొక్కగా వున్నప్పుడు తడిగాలీ, చెమ్మా, చల్లని నీడా కావాలి. అక్కడున్న పంపునుంచి నీటిగొట్టం తెద్దాం. అది మరీ దూరం లేదుగా. ఆ నీటి గొట్టంలోనుంచి చిన్న జడిని లైమ్ చెట్టు మీద కురిపిద్దాం. లైమ్ చెట్టుకి చల్లగా వుంటుంది" అని చెప్పాను నేను. వాళ్లకి మొదట్లో నా మాటలు పట్టలేదు. కృత్రిమంగా జడి కురిపిద్దామన్న మాట అనగానే వాళ్లకి ఆతృత పుట్టింది. పిల్లల కది ఆసక్తికరమైన ఆటలాగా మొదలైంది. ఆటలంటే యిష్టపడని పిల్లవాడు యెక్కడా వుండడు. ఆట మొదలైంది. నీటిగొట్టాన్ని చెట్టు దగ్గరకి తీసికెళ్లాం. పిచికారీ గొట్టంలాంటిదాన్ని దానికి తగిలించాం. కనిపించీ కనిపించని నీటిబిందువుల మేఘాలు చెట్టుపైన కమ్మాయి. మధ్యాహ్నం యెండప్పుడు పిల్లలు జడిని వదిలేవాళ్లు. సాయంత్రం ఆపుచేసేవాళ్లు. క్రమేపీ ఆ చెట్టంటే పిల్లలకి ఆసక్తి పుట్టింది. నీటి జడి తర్వాత చెట్టు యెలా వుంది? చెట్టు కొమ్మలు చిగురు తొడగ్గానే పిల్లలకి సంతోషం కలిగింది. ఆ రకంగా స్వార్థంలేని ఆసక్తి పిల్లల్లో పెరిగింది.

కాని అది ఆరంభం మాత్రమే. వజ్రాలని సానబట్టేవాడు ముడివజ్రపు ప్రతీ కోణాన్నీ చూసి, మేలుజాతి వజ్రంగా యెలా రాపాడించడమా అని చూసినట్టుగానే ఉపాధ్యాయుడు కూడా పిల్లవాడి అంతరంగంలోకి యెలా చొచ్చుకుపోవాలా అని చూడాలి. నేనూ వాలోద్య మంచి అడవి గులాబీ పళ్లు యేరుకోవడం కోసమని కొన్నిసార్లు అడివిలోకి వెళ్లాం. తర్వాత ఆ విత్తనాలని పాతి, చిగురించే మొక్కలకి

నీళ్లు పోశాం. అంటుకట్టే కాలం రాగానే, గులాబీ కొమ్మల్ని తీసుకుని వాటిని అడవి గులాబీకి అంటుకట్టాం. అలా చెయ్యడం వూరికే పనే కాదు. పిల్లవాడి హృదయాన్ని స్పందింపచెయ్యడం. క్రమేపీ అతను తన స్వార్థంలో కాక తన చుట్టూతా వున్న ప్రపంచంలో వుండే సుఖదుఃఖాల మూలం అందుకునే దశకి వచ్చాడు.

స్లావ గురించి నేను చాలా శ్రద్ధ పట్టాల్సి వచ్చింది. అతనూ, ఓల్యా కలిసి పశుక్షేత్రంలో ఒక జబ్బుగా వున్న గొర్రెపిల్లకి నయంచేశారు. మొదట్లో సజీవమైందానిపట్ల శ్రద్ధపట్టడం అనేది ఆటగా మొదలైంది. కాని తర్వాత అది పనిలో ఆసక్తిగా పరిణమించింది. స్లావ క్రమేపీ కష్టపడే జంతు ప్రియుడుగా మారేడు. శీతాకాలంలో అతను గుడ్డలో నీళ్లు కుక్కుకుంటూ నాదగ్గరకి వచ్చిన ఒక రోజుని నేను యెన్నటికీ మర్చిపోలేను. తన ప్రియమైన లేగదూడని పచ్చి ఓట్‌గడ్డి యిష్టమనీ, కాని గ్రీన్‌హౌస్‌లో బార్లీ మాత్రమే వుందనీ అతను ఫిర్యాదు చేశాడు. ఓట్‌గడ్డి లేకుండా తమ క్షేత్రానికి యెలా వెళ్లగలడు? అంచేత మేము ఓట్ కూడా పండించడం మొదలెట్టాం.

పిల్లలకి స్వార్థగుణం లేకుండా చెయ్యడానికి తమ వ్యక్తిగతమైన దానితో సంబంధంలేని వాటిపట్ల శ్రద్ధ వహించడం నేర్పడం కంటే అద్భుతమైంది యింకోటి వుండదు. సామాజిక సంక్షేమం కోసం పిల్లవాడు ఆదుర్దా కనబరిస్తే, అతని హృదయంలో స్వార్థం అనే దుర్గుణం యెన్నటికీ ప్రవేశించదు. "నేను," "నాది" అనే భావంతో వాళ్ల జీవితాలు ముడిపడ్డాయో అహంకారం అనేది వాళ్లని గుప్పిట పట్టేస్తుంది.

## "ధైర్యవంతుల, నిర్భయుల" దళం

శక్త్యుత్సాహాలతోటి తొణికిసలాడిపోయే దశ మా విద్యార్థుల శారీరక నైతిక పరిణతిలో గోచరమైంది. యీ శక్తి పైకి చూడ్డానికి వింతైన, వర్ణించలేని చర్యల రూపం తీసుకుంది. నా కళ్లముందే తీవ్రమైన మార్పులు వచ్చాయి. బెరుగ్గా వుండేవాళ్లు తెగింపుగల వాళ్లయిపోయారు, పిరికివాళ్లు ధైర్యవంతులుగానూ, దృఢచిత్తులుగానూ అయారు.

పెద్ద విద్యార్థులూ, సమష్టి క్షేత్ర రైతులూ గడ్డిమేట్లు యెలా వేస్తున్నారో చూడ్డానికి ఓరోజు మేము పొలానికి వెళ్లాం. ట్రాక్టర్ డ్రైవరు ట్రాక్టర్‌కి ఒక దళసరి తీగ కట్టాడు. అది మొత్తం ఒక గడ్డిమోపుని యెంతో యెత్తుకు తీసుకుపోతుంది. అది పిల్లలకి ఆసక్తికరంగా వుంది. ఆ తీగ పైకి పదిహేను మీటర్లు లేస్తుంది. గడ్డిమేట్ల దగ్గర్నుంచి మేము కోతయంత్రం దగ్గరకి వెళ్లాం. ఒక కుర్రాడు తీగని పట్టుకున్నట్టూ, అది వాణ్ణి గాలిలోకి యెత్తుతున్నట్టూ అప్పుడు చూశాను. యేడి, షూర? కనిపించడు! అడుగో గాలిలో పదిహేను మీటర్లు యెత్తులో వూగుతున్నాడు. పిల్లలు షూర దగ్గరికి పరిగెత్తి సంబరంతో కేరింతాలు కొట్టడం మొదలెట్టారు. షూర

గడ్డిమేటుమీదకి సంతోషంతో అరుస్తూ పోయాడు. కళ్లుతిరిగిపోయే ఆ యెత్తుకి తామందరూ యెగరాలని పిల్లలు అనుకున్నారేమో. నాకు ఆందోళనగా వుంది. షూర గడ్డిమేటు మీదనుంచి జర్రున జారేడు. నాకేం చెయ్యాల్సిందీ తోచలేదు - యీ ఘటన సుఖాంతమైందని సంతోషించనా లేదా పిల్లల్ని అక్కణ్నుంచి యెంత త్వరగా వీలైతే అంత త్వరగా తీసుకుపోనా.

యేదోరకంగా పిల్లల్ని సర్దుబాటు చేసి వాళ్లు అలాంటి పని చెయ్యకుండా ఆపాను. నేను అంత జాగ్రత్తగా వుండటం పిల్లలకి యిష్టంలేదు. పిల్లల కిష్టమైన పనిని ఆపడంకంటే దానిని క్షేమంగా చేయించడమే మంచిదనిపించింది. ఆ తీగకింద ఒక గడ్డిమేటుని పెట్టాం. ముందు అబ్బాయిలూ, తర్వాత అమ్మాయిలూ ఒకళ్ల తర్వాత ఒకళ్లు అలా చేశారు.

ఆరోజుల్లో మాకు విద్యుత్‌సరఫరాకి నిలకడ అయిన కేంద్రం వుండేది కాదు. పెద్ద విద్యార్థులు ఒక విద్యుత్ కేంద్రం కట్టి, బాటరీలు పనిచెయ్యడానికి గాలితో నడిపేవాళ్లు. ఆ గాలి యంత్రం పన్నెండు మీటర్ల యెత్తున్న గోపురంమీద వుండేది. గోపురంమీద ఒక చెక్క వేదిక లాంటిది వుండేది. దానికి ఓ తలుపున్న దారి వుండేది. అందులోనుంచి ఎలక్ట్రీషియన్ మోటార్‌ను మరమత్తు చేయడానికి వెళ్లచ్చు. గాలి హోరుగా వున్న ఒకరోజున పిల్లలు గాలిపటాలు యెగరేస్తున్నారు. పక్కవాడి గాలిపటంకంటే తన గాలిపటం యింకా యెత్తుకు యెగరాలి అని పోటీలు పడి ప్రతివాళ్లూ యెగరేస్తున్నారు. "నా గాలిపటం అందరి గాలిపటాల కంటే యెత్తుగా యెగురుతుంది" అన్నాడు వాన్య. ఆ కుర్రాడు గోపురం యెక్కి, ఆ చెక్క వేదికకి వున్న కమ్మీలమీద ఆనుకుని తాడు వదిలాడు. వాన్య వంగిన వేపున తలుపుమూత అంచునుంచి జారి కిందకి పడిపోయింది. నాకు కాళ్లూచేతులూ ఆడలేదు. పిల్లాడు తెరుచుకున్న తలుపు చుట్టూతా పరిగెత్తి వెళ్లాడు గాని అతని కాలికింద యేం వుందో గమనించలేదు. అతని దృష్టి గాలిపటంమీదే వుంది. అదృష్టవశాత్తూ మాత్రమే ప్రమాదం తప్పింది.

యెత్తైన స్థలానికి పోవడం అంటే పిల్లలు ఆపినా ఆగరు. యెత్తుగా పోవడం అనే అనుభూతి వాళ్లకి సంతోషం యిస్తుంది. ఉపాధ్యాయులమైన మనకేమో పిల్లల కోరికలు ఆందోళన కలిగిస్తాయి. నాకు ఆందోళన కలిగించిన పిల్లల పనులన్నీ దాదాపుగా యెత్తైన చోట్లకి పోవాలి అనే యీ ఆకర్షణకి సంబంధించినవే....

స్కూలుకి దగ్గర్లోనే ఒక చర్చి వుంది. దాని యిరవై మీటర్ల యెత్తున్న ఘంటాశిఖరానికి గుండ్రటి యేటవాలు గుమ్మటం వుంది. వసంతరుతువులో యెండగా వున్న ఒక రోజున ఆ గుమ్మటం కేసి యథాలాపంగా చూశాను. అక్కడ ముగ్గురు పిల్లలు నుంచుని వుండటం కనిపించింది. ఆ ముగ్గురూ సెర్యోజ, కోల్య, షూరలని గుర్తుపట్టాను. నా నవనాడులూ కుంగిపోయాయి. ఆ పిల్లలు నన్ను చూసి గుమ్మటం ఒక పక్కనుంచి యింకోపక్కకి పరిగెట్టిపోతూ దాంకోవాలని ప్రయత్నించారు. వాళ్లని వారించడం బుద్ధి తక్కువ. దానివల్ల చెరుపే కాని లాభం

వుండదు. మిగతా పిల్లలు వీళ్లని చర్చి గుమ్మటంమీద చూశారంటే కేకలెట్టి గోలచేస్తారు. అందుకని బళ్లోకి వెళ్లి పిల్లలందర్నీ అడివిలోకో, పొలంలోకో, షికారుకో తీసుకు పొమ్మనీ, పెద్దపిల్లల్ని యిళ్లకి పంపెయ్యమనీ ఉపాధ్యాయులకి చెప్పాను. మొత్తానికి యీ ముగ్గురు పిల్లలూ మిగతా పిల్లల కంటపడకూడదు. నేను వర్క్‌షాప్‌కి వెళ్లాను. అక్కడనుంచి గుమ్మటం బాగా కనిపిస్తుంది. నేను తల చేతుల్లో పెట్టుకొని కిటికీ పక్కన కూర్చున్నాను. ఆ గడ్డిమేటు దగ్గర ఆటకి ఒప్పుకుని వాళ్లల్లో యెత్తుగా వుండేవి యెక్కే కోరిక రేపెట్టానేమో. ఆ పిల్లలు తుప్పుపట్టిపోయిన గొట్టం పట్టుకుని జారడం కనిపించింది. ఆ గొట్టం మధ్యమధ్యన ఓటుగా కూడా వుంది....

వేసవికాలంలో కుంభవృష్టి కురిశాక, చెరువు వంతెనకింద ఒక జలపాతం తయారైంది. ఓ ముసలమ్మ బళ్లోకి వచ్చి మీ పిల్లలు యేం చేస్తున్నారో పోయి చూడమంది. నేను చెరువుదగ్గరికి వెళ్లాను. ఆనకట్ట దగ్గర్నుంచి యెవళ్లూ కనిపించలేదు. కాని వంతెన కిందనుంచి పిల్లల కేకలు వినిపించాయి. వంతెన కమ్మీలకి పొడుగాటి తాళ్లుకట్టి, తోల్య, వీత్యలు ఒక వుయ్యాలా తయారుచేశారు. ఉధృతంగా వుండే జలపాతం పైగా పోతూ వాళ్లు మళ్లీ మళ్లీ వూగుతున్నారు, ఉత్సాహంతో తుళ్లిపోతూ కేరింతాలు కొట్టేస్తున్నారు...

పేత్రిక్, వీత్య, కోల్యలు యెక్కణ్ణుంచో మట్టు సగం వూడిపోయిన కొయ్యపీపాని సంపాదించి దాన్ని చెరువు యెత్తైన గట్టుమీదకి తెచ్చారు. తన వంతు యెక్కడ పోతుందో అని ఆ అబ్బాయిలు కచ్చితంగా వరసపాటిస్తూ ఒకళ్ల తరవాత ఒకళ్లు పీపాలోకి పాకుతున్నారు, మిగిలిన యిద్దరూ దాన్ని మెల్లిగా తోస్తున్నారు. అది యేటవాలు గట్టుమీద జారడం మొదలెట్టింది. ఆ పీపా చెరువుదాకా దొర్లి నీటికి కొన్ని మీటర్ల దూరంలో ఆగింది. యే ప్రమాదమూ జరక్కుండా వాళ్లా పని యెలా చేశారా అనేది నాకీనాటికీ అంతుపట్టలేదు. అలాంటి సంఘటనల్లో అంతా సవ్యంగా సంతోషంగా జరగడం పిల్లల విషయంలోనే వుంటుందేమో.

ఒకసారి అడివిలో వెడుతూ వుంటే దుంగలు కోసేవాళ్లు కనిపించారు. సమష్టి క్షేత్రానికి కట్టడం సామాను తయారు చేస్తున్నారువాళ్లు. నరికేసిన చెట్లు నేలమీద పడుతూ వుంటే పిల్లలు వూపిరి బిగపట్టి చూశారు. మేం యిళ్లకి పోదామని బయల్దేరాం. షూర, దంకోలు మాయమైనట్టు చూడనేలేదు. ఒక కాళీజాగాలో విశ్రాంతిగా కూర్చున్నాం. అంతట్లోకీ చెట్టుకొట్టే అతను ఒకడు వచ్చి యిద్దరు పిల్లలు చెట్టు యెక్కడానికి ప్రయత్నించారనీ, దాన్ని కొట్టేస్తున్నప్పుడు అది కింద పడిపోతూ వుంటే దాని కొమ్మలమీద నుంచి స్వారి చేసినట్టు కిందికి జారదామని అలా చేశారనీ చెప్పాడు.

యీ సంఘటనలన్నీ మూడు, నాలుగు తరగతుల్లో వున్నప్పుడు అయిదారు మాసాల కాలంలో జరిగాయి. అలా చెయ్యకుండా పిల్లలని ఆపడమూ, యేమీ జరగనట్టు మెదలకుండా వుండడమూ పద్ధతి కాదనిపించింది నాకు. ఉరవళ్లు తొక్కే వాళ్ల శక్తి అపేక్షించేది వూరికే కార్యకలాపాన్నే కాదు; ప్రమాదం ముంచుకొస్తూ

వుంటే తమ నిర్భీకతని పిల్లలు పరీక్షించాలనుకుంటున్నారు. సాహసకృత్యాల కోసం తపన పిల్లల జీవితాల్లో సాహసోపేతమైన పనులు చేసే దాన్ని ప్రేరేపిస్తోంది. పిల్లల శక్తిని సరైన దారిలో పెట్టి మళ్లించాలి.

పైకి వెర్రి సాహసంగా కనిపించే పనులన్నింటిని అబ్బాయిలే చేశారని మీరీపాటికి గ్రహించే వుంటారు. నాకు ఆందోళన కలిగించని కుర్రాడు ఒక్కడు కూడా లేదు. పిరికిగా, వూగిసలాడుతూ వుంటాడనుకునే దంకో కూడా 1955 ఆకురాలు కాలం నాటికి నాకు ఆశ్చర్యం కలిగించాడు. బాగా పల్చగా వున్న మంచుమీద చెరువుని దాటాడు. కిందపడకుండా తప్పించుకునేందుకు తన పుస్తకాలని ముందుగా తోస్తూపోయాడు. మంచు బీటదీసి ఒరిగింది, అదీ నీరు బాగా లోతుగా వుండే చోట. అదృష్టవశాత్తూ యెదం అవలేదు, పిల్లాడు క్షేమంగా బడికి వచ్చాడు. అతని తర్వాత యింకో ఇద్దరు పిల్లలు అలా వచ్చారు, వాళ్లకింద మంచు బీటతీసి యెదం అయింది. కాని అదృష్టవశాత్తూ ఇది ఒడ్డు దగ్గర జరిగింది.

అలాంటి సంఘటనలు జరక్కుండా జాగ్రత్తపడాలనుకోండి. కాని అంతేకాదు. ప్రమాదాన్ని యెదిరించనూ యెదిరించాలి, అక్కణ్నుంచి నెగ్గుకునీ రావాలి.

ఆరకంగా మా ధైర్యవంతులా నిర్భయుల దళం యేర్పడింది. మగ పిల్లలంతా అందులో చేరారు. తర్వాత కొంతమంది ఆడపిల్లలు కూడా చేరారు. దృఢనిశ్చయం, ధైర్యం, నిర్భీతి అవసరమయే ఆటలూ, సరదాలూ కనిపెట్టారు. చెరువు చివరన ఒక యెత్తైన నిట్రపాటి మిట్ట ఒకటుంది. అక్కడ చెరువులోతుగా వుండదు, కాబట్టి ప్రమాదం లేదు. జూలైనెల్లో బాగా యెండగా వున్న రోజున పిల్లలు అక్కడ యీతకొట్టడానికి వెళ్లారు. మిట్టమీదనుంచి యెలా యెగిరి దూకవచ్చో నేను వాళ్లకి చూపించాను. నేను దూకాక నావెనకాల షూర, సెర్యోజ, కోల్య వీత్య, ఫేద్య దూకారు. ఆ మర్నాడు యూర, కోస్త్య, పేత్రిక్‌లు ధైర్యం చేశారు. మూడో రోజున తోల్య, మీష, సాష, వాన్యలు. యిక నలుగురు పిల్లలే మిగిలిపోయారు - పవ్లో, వొలోద్య, దంకో, స్లావలు. తోటిపిల్లలు వాళ్లని ఆటపట్టించారు. ఆడపిల్లలు కొంచెం దిగువలో ఈదుతున్నారు. వాళ్లు కూడా యీ మొగపిల్లలని ఉడికించాలని ప్రయత్నించారు. తీనా మిట్టమీదకి వచ్చి గెంతుదామనుకుంది. ఆమె నీటిలోకి దూకింది. అది అద్భుతంగా వుంది. ఆమె తర్వాత లరీసా, వార్యాలూ అలా చేశారు. మొగపిల్లలకి సిగ్గేసేసింది. ఆఖరికి పవ్లో, దంకో, స్లావలు దూకారు.

వొలోద్య అలా చెయ్యలేకపోయాడు. ఆ కుర్రాడు బెదిరిపోయి భయపడుతున్నాడు. ఆ భయం అధిగమించలేకపోతున్నాడు. అతనికోసం యింకొంచెం యెత్తు తక్కువ వున్న మిట్ట చూడాల్సివచ్చింది. ఆడపిల్లలతోబాటుగా అతను అక్కడనుంచి గెంతాడు, కాని అంతకంటే యెత్తైన చోటు నుంచి గెంతలేకపోయాడు. ఆ కుర్రాడు ధైర్యంగా వుండే పనులు చేసేటందుకుగాను నేను యెంతో ప్రయత్నించాల్సి వచ్చింది. వసంతకాలంలో పిల్లలు స్టార్లింగ్‌ల కోసం చెట్లమీద గూళ్లు వేలాడదీశారు. అప్పుడు యీ కుర్రాడు యెత్తుగా వుండే చెట్టు

యెక్కేటట్టు చేశాను. భయం వదిలించుకోడానికి యిది నాందీ అయింది. వొలోద్య యెవళ్లకీ చెప్పకుండా తను ఒక్కడూ ఎత్తుమిట్టదగ్గరకి వెళ్లేవాడనీ, బట్టలు తీసేసి, దూకడానికి పరుగు కూడా తీసేవాడనీ, కాని దూకకుండా భయపడుతూ అలా కుర్చునే వుండేవాడనీ నాకు పిల్లలు రహస్యంగా చెప్పారు. మొదటి ముగ్గురు ఆడపిల్లలూ సాహసం చేశాక వాల్యా మిట్టమీదనుంచి దూకింది. ఆ పిల్ల అలా చెయ్యగలదని యెవరూ అనుకొని వుండరు. వాల్యా కూడా అలా చేసేసరికి వొలోద్యకి తల తిరిగిపోయింది. ఆ కుర్రాడు గట్టిగా కళ్లు మూసేసుకుని నీటిలోకి గెంతేశాడు. వాల్యా తర్వాత నీనా, గాల్యా, ల్యూస్యా, జీనా, కాత్యా, సాషాలు దూకారు. వీళ్లందరి తర్వాతా మిగతా ఆడపిల్లలంతా గెంతారు. ఆడపిల్లలకి మొగపిల్లల కంటే కూడా యెక్కువ సంకల్పబలం వుందనిపించింది నాకు. వాళ్లు భయాన్నీ, వూగిసలాటనీ మొగపిల్లల కంటే ధైర్యంగా నెగ్గుకు రాగలరు. యేదేనా ధైర్యవంతమైన పనిని చేసినా మగపిల్లలంత అల్లరి లేకుండానే తమ సంతోషాన్ని వెల్లడి చేసారు.

మూడో తరగతి పూర్తయాక మేము ప్రకృతిమాత ఒడిలో కులాసాగా గడిపేటప్పుడు పిల్లలు ధృవ పరిశీలకుల ఆట మొదలెట్టారు. యెక్కణ్ణో బాగా దుబ్బులతో కప్పడిపోయిన మారుమూల ద్వీపం వుంటుంది. అది చుట్టూతా నీళ్లున్న మంచు బండ అన్నమాట. ఆ దుబ్బుల్లో ఓడ ప్రమాదంలో చిక్కుకున్న ధృవ పరిశీలకులు వుండిపోతారు. మా వైపునేమో భూఖండం వుంటుంది. అదీ ఆట నియమం. మేము ఆ ధృవ పరిశీలకులకి ఆహారపదార్థాలు (అంటే రొట్టే, బంగాళదుంపలు) సరఫరా చెయ్యాలి. మంచుబండకీ భూఖండానికీ మధ్యన చిన్న సరస్సు వుంటుంది. ఆటలో నియమం యేమిటంటే కఠిన ధృవమండల నిశీధిలో ఆహారపదార్థాలని తీసికెళ్లాలి.

"ధైర్యవంతులా, నిర్భయులా" దళంనుంచి కొందరు స్వచ్ఛంద సేవకులు ముందుకు వచ్చారు. పిల్లలకి కొంచెం భయం వేసింది. ఆ ద్వీపంలో యెవళ్లో తోడేలుని చూశారట. కాని సెర్యోజ, షూరలు రాత్రి బయల్దేరారు. ఒక దళసరి అట్టమీద రొట్టె, బంగాళదుంపలు, అగ్గిపుల్లలు, కొవ్వుపెట్టిన సంచీ కట్టాం. రెండు టైరు ట్యూబులని నీళ్లల్లోకి వదిలాం – అది ఆటలో లాంచీ అన్నమాట. సూర్యుడు అస్తమించాడు. సరస్సూ, ద్వీపం పొగమంచుతో కప్పడి పోయాయి. ఆకాశంలో నక్షత్రాలు ప్రత్యక్షమయ్యాయి. ఆ అబ్బాయిలు బట్టలు తీసేసి అట్టకి కట్టేసి బయల్దేరారు. ఓక్షణం తర్వాత వాళ్లు మసక అయిపోయారు. కొన్ని క్షణాల తర్వాత దభేలుమన్న చప్పుడు వినిపించింది. ఆతర్వాత అదీ వినిపించలేదు. మొత్తం మా "ధైర్యవంతులా, నిర్భయులా" దళం అంతా గట్టున కూర్చుని వుంది. త్రావ్కా అనే మా కుక్క కూడా మాతో వుంది... ఓగంట గడిచింది. కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటి. ద్వీపంగాని, సరస్సుగాని కనిపించటం లేదు. హఠాత్తుగా ఆ చీకట్లో నీరసంగా మండే జ్వాల కనిపించింది. యువ ధృవ పరిశీలకులు ఓడ

చిక్కుకున్న చోటికి చేరారన్నమాట. రెండో జంట బయల్దేరి రావచ్చని వాళ్లు సంకేతం యిచ్చారన్న మాట.

మళ్లీ రొట్టె, బంగాళాదుంపలూ, కొవ్వు, ఉల్లిపాయలు అట్టకి కట్టి, గాలినింపిన టైరుట్యూబులని చెరువులో దింపాం. వీత్య, యూరలు తయారయారు. ఆ సరస్సులో పూర్వం పైక్ అనే పెద్ద చేపలుండేవిట, బహుశా యిప్పుడు కూడా వుండచ్చునని ఓ అమ్మాయి చెప్పింది... వీత్య, యూరలని భయపెట్టడానికే అలా ఆ పిల్ల అల్లిందని తెలుస్తూనే వుంది. నల్లటి నీళ్లల్లో వెళ్లడానికి తయరైన ఆ పిల్లలకి అది భయం కలిగించినట్టుగా వుండటం సహజమే, కాని ఆ క్షణంలో యింక వాళ్లు మనసు మార్చుకోరు కదా. యూర, వీత్యలు వెచ్చగా వుండే ఆ నీటిలో కాళ్లు పెట్టగానే దూరంగా దభేలు మన్నశబ్దం వినిపించింది. యే చేపో గెంతిపడుతూ వుండచ్చు. కాని పిల్లలు పైక్‌చేపల కథ అప్పుడే విన్నారు కదా. యింకో గంట గడిచింది. చీకట్లో రెండో మంట వెలిగింది. ఆతర్వాత రెండు మంటలూ ఆరిపోయాయి. దానర్థం ధృవపరిశీలకుల రెండు జంటలూ కలిసాయన్నమాట. మేం పడుకున్నాం. యెవళ్లూ నిద్రపోలేదు.

ఆ ద్వీపంమీద విడిది మంట వెలిగింది. ఆ పిల్లలు సూర్యోదయం దాకా అలా నిద్రపోకుండా కాలక్షేపం చేస్తారు. అందరూ దగ్గరగా ముడుచుకుపోయి కూర్చుని యెప్పుడు తెల్లవారుతుందా అని తూర్పుదిక్కుకి చూస్తూనే వుంటారు. తెల్లవారి తూర్పున తొలిరేకలు విచ్చుకుంటూనే వాళ్లు వెనక్కి యీదుకుంటూ వచ్చేస్తారు. యింకా భయం పోగొట్టుకోకుండా వున్నవాళ్లు ఆ అబ్బాయిలంటే అసూయ పడతారు. అప్పటికే భయం పోగొట్టుకున్న వాళ్లు పెద్దవాళ్లల్లాగా నిగ్రహించు కుంటున్నట్టు "అందులో భయపడాల్సింది యేముంది" అంటారు.

రాత్రి చీకట్లో మేము మగపిల్లలందర్నీ పంపాం, వొలోద్యని కూడా. ఆట మంచి రసకందాయంలో వుండగా ఆడపిల్లలకి తాము యెందుకు వెళ్లలేమా మగపిల్లలే వెళ్లగలరా అని ఆలోచన వచ్చింది. నేనలా జరుగుతుందని అనుకున్నాను. తీనా కోల్యతోటీ, వార్యా తోల్యతోటీ ద్వీపంమీదకి వెళ్లారు. అక్కడ మగపిల్లలు ఎండుగడ్డిని సంపాదించి ఆడపిల్లలకి పక్కలు వేశారు.

రాత్రి, నిశ్శబ్దం, యేకాంతం - యిదంతా పిల్లలకి ఆసక్తిగానే వుంటుంది. యెందుకంటే యేదో కష్టమైందాన్ని సాధిస్తున్నామనే సాహసభావం అందులో వుంది. పిల్లలు యింకో ఆసక్తికరమైన ఆట మొదలెట్టారు. అది భూగర్భ శాస్త్రజ్ఞుల ఆట. దట్టంగా వుండే పొదలలో, అడివిలో యెక్కణ్ణో దూరంగా, అడివి శివారునుంచి అయిదు కిలోమీటర్ల లోపల ఆడపిల్లలు కుటీరం ఒకటి కట్టి అక్కడ పగలు మకాం చేశారు. భూగర్భ పరిశోధకుల కది ప్రధాన స్థావరం. రాత్రి చీకట్లో సూదుల్లాంటి ఆకులుండే చెట్ల అడివి గుండా కొంతమంది అబ్బాయిలు మకాం దగ్గరికి రావాలి. అదీ ఆట నియమం. యీ భూగర్భ శాస్త్రజ్ఞులు మచ్చుకి యేరిన ఖనిజాలున్న వీపుకి తగిలించుకునే సంచీలు మోసుకొస్తారు. బయట చీకటిపడ్డాక పిల్లలు బడినుంచి

బయల్దేరి ఓ గంటలో అడవి శివారు చేరుకున్నారు. వాళ్లు చీకట్లో దారి కనుక్కోవాలి. దీనికితోడు సూది ఆకులున్న చెట్ల అడివి, పర్వతశ్రేణి అడ్డం దాటి పోవాలి. ఆడపిల్లలు యెలాంటి సంకేతాలూ చెయ్యడానికి వీల్లేదు. అడవి దాటి పోడానికి దగ్గరదగ్గర రెండు గంటలు పట్టింది. అర్ధరాత్రి దాటాక మగపిల్లలు స్థావరం దగ్గరకి చేరగలిగారు. బాగా అలిసిపోయారు కాని హుషారుగా, సంతోషంగా వున్నారు.

ఆగస్టు నెలలో ఒకసారి కుంభవృష్టి కురిసింది. సమష్టి క్షేత్రపు మందలోని లేగదూడలు పద్నాలుగు వెనకబడిపోయాయి. ఆవులు నీటిమయం అయిపోయిన మైదానంమీదనుంచి వెళ్లిపోయాయి. అవి దూళ్ల కోసం చాలాసేపు చూశాయి గాని యివి వాటి దృష్టికి అందలేదు. "మనం వాటి కోసం వెతుకుదామండీ" అని షూర, వీత్యలు నాతో అన్నారు. అంచేత "ధైర్యవంతులా, నిర్భయులా" దళంనుంచి తొమ్మండుగురు నాతోబాటు బయల్దేరారు. అందులో ఆరుగురు మగపిల్లలూ ముగ్గురు ఆడపిల్లలూ వున్నారు. మాతోబాటు భోజనమూ, ఒక దిక్సూచీ, చెరువు దాటడానికి రెండు గాలినింపిన టైరు ట్యూబ్‌లు తీసుకెళ్లాం. పిల్లలు మంచి హుషారుగా వున్నారు. మైదానాన్ని అంగుళం అంగుళమూ పరీక్షగా చూశాం. ఒకోచోట మేం యిద్దరూ, ముగ్గురుగా విడిపోయాం. నాలుగు రోజుల కల్లా అడవి బయలులో పదకొండు దూళ్లని పట్టగలిగాం. ఆ కుంభవృష్టి వరదలకి మిగిలినవి చనిపోయి వుండచ్చు. లేగదూళ్లకోసం వెతుకులాడిన యీ రోజులు పిల్లలు మర్చిపోలేకపోయారు. చీకటన్నా, కప్పలన్నా, పసిరిక పాములన్నా భయపడే ఆడపిల్లలు గాల్యా, ల్యూస్యా, సొన్యాలు ముగ్గురూ యీ రోజుల్ని అసలు మర్చిపోలేకపోయారు. యెందుకంటే అప్పుడు వాళ్లకి నక్కలూ, గుడ్లగూబలూ తటస్థపడ్డాయి.

నాలుగో తరగతి అయిపోయిన యేడాది వేసవిలో మేము పర్వతారోహకుల ఆట ఆడాం. అంచునుంచి కనుమమీదుగా వచ్చేటట్టు ముందుగానే ఒక తాటి నిచ్చెనని కట్టాం. మా పర్వతారోహక బృందపు విడిది కింద వుందన్నమాట. పర్వతారోహకులుగా మేం బయల్దేరాం. నిట్రపాటి గోడమీద పాకుతూ పైకి వెళ్లడం, అక్కణ్ణుంచి మళ్లీ కనుమమీదుగా కిందికి రావడం. చాలామంది పిల్లలకి యెత్తు అంటే భయం పోయింది. అలాంటి వాళ్ల క్కూడా భయం వేసింది. మొదటగా పైకి వెళ్లి వచ్చినవాడు వీత్య, తర్వాత షూర, సెర్యోజలు. సగందారినుంచి యూర తిరిగివచ్చేశాడు. మిగతా వాళ్లకి మరీ అంత నిట్రపాటు కాకుండా వుండే అంచు చూశాం. అక్కడ కొన్నిరోజులు ఆడాం. ఆడపిల్లలు మగపిల్లలతో పోటీపడ్డారు. యెంతో ధైర్యంగా, యేమీ భయపడకుండా వున్నవాళ్లు తీనా, లరీసా, కోస్త్యలు. మూడు మీటర్ల యెత్తంటేనే కళ్లు తిరిగి పోయే వొలోద్య, స్లావలని వాళ్లు ఉడికించారు. ఆఖరికి అందరు అబ్బాయిలూ, అమ్మాయిలూ కొండ అంచు యెక్కేశారు.

తమ ధైర్యం, సాహసం ప్రదర్శించడంలో పిల్లలు మహదానందం పొందారు. ధైర్యమూ, సాహసమూ అనేవి ప్రతి మనిషికీ అవసరమైన లక్షణాలు. యేదో అసాధారణ పరిస్థితుల్లోనే కాదు, నిత్యజీవిత వ్యవహారంలోనూ, శ్రమలోనూ కూడా.

ప్రాథమిక పాఠశాల ముగియడానికి వ్యవధి తక్కువ అయే కొద్దీ నాకు ఆదుర్దా యెక్కువ అయింది: పిల్లలు త్వరలోనే యెదిగే వయసు కొస్తున్నారని. వాళ్లు తమని గురించిన ప్రశ్నలు అడగడం మొదలెట్టారు; "నేను యెలాంటి వాణ్ణి? నాలో మంచి యేం వుంది? చెడ్డ యేమిటి? నన్ను గురించి నా స్నేహితులు యేమనుకుంటున్నారు?" అని అబ్బాయిలూ అమ్మాయిలూ తమకి తాము అనుకోవడం మొదలెట్టారు.

యుక్తవయస్సు వస్తోందీ అంటే స్వయంగా తీర్చిదిద్దుకోడానికి కూడా సమయం వస్తోందన్నమాట. భవిష్యత్తులో పిల్లల సంకల్పం, పట్టుదల చాలా ముఖ్యమైన బోధనా శక్తి అవుతాయి. అందుకని బాల్యంలోనే స్వయం బోధనలోని ఆసక్తిని జాగృతం చెయ్యడానికి ప్రయత్నించాలి. ప్రతి పిల్లవాడికీ ఆటపాటలకీ, నిత్యం చెయ్యవలసిన పనికీ సంబంధించి ఒక కార్యక్రమం వుంటుంది. పిల్లలు ప్రతిరోజూ ఉదయమే లేచి శారీరక వ్యాయామం చేసి, చన్నీళ్లతో స్నానాదులు ముగించి, నాస్తా తిని, హోమ్‌వర్క్ చేసేవాళ్లు. బళ్లోకి వచ్చే ముందు ప్రతి పిల్లవాడూ గంటకి తక్కువ కాకుండా పుస్తకాలు చదవడం, నోట్సులు రాయడం పనులు చేసేవాడు. అనుదిన కార్యక్రమాన్ని క్రమం తప్పకుండా పాటించడం స్వయంబోధనకి సాధనమయేటట్టుండాలని నేను ప్రయత్నించాను. వొలోద్య, స్లావలకి పొద్దున్నే లేవడం కుదిరిందికాదు, వాళ్లు పెందరాళే పడుకోక పోవడంవల్ల. వాళ్ల తల్లిదండ్రులతోటి కూడా మాట్లాడాను. స్వయంగా తీర్చిదిద్దుకోవడం అంటే స్లావకి ఆసక్తి పుట్టి క్రమశిక్షణ అలవాటు చేసుకున్నాడు. వొలోద్యకి యింకా అదీ రాలేదు. కుర్రవాడికి గారం కుడవడం అతని కుటుంబం అలవాటు చేసింది.

## వేసవికి వీడ్కోలు చెబుతున్నాం

నాలుగో తరగతి అయాక మొత్తం మా పిల్లలందరూ, పదహారుమంది అబ్బాయిలూ, పదిహేనుమంది అమ్మాయిలూ, అయిదో తరగతిలోకి వచ్చారు. పన్నెండుమందికి మాత్రమే అన్ని సబ్జక్టుల్లోనూ అత్యుత్తమ మార్కులు వచ్చాయి. పదమూడుమందికి మంచి మార్కులు, ఉత్తమశ్రేణి మార్కులు వచ్చాయి. ఆరుగురికి మాత్రం పాస్ మార్కులూ, మంచిమార్కులు వచ్చాయి.

పిల్లలు మానవత్వపు పాఠశాలలో శిక్షణ పొందడం, పరుల సుఖదుఃఖాలు తమవిగా భావించుకోవడం, తమ మాతృదేశాన్ని ప్రేమించడం, శత్రువులని ద్వేషించడం నా బోధనాత్మక కృషి విజయానికి కారణమని నేను అనుకున్నాను. శ్రమ అందించే పరిణామాత్మక మార్పు వాళ్లు అర్థం చేసుకున్నారు. తమ మాతృభాషని బాగా నేర్చుకున్నారు. పరిశీలించడం, ఆలోచించడం, చదవడం, రాయడం, తమ భావాలని మాటల్లో వ్యక్తంచెయ్యడం అనే అయిదు విషయాలు వాళ్లు నేర్చుకున్నారు. పిల్లలకి యేడో యేడు రాకముందే, అంటే ఒకటవ తరగతిలో చేరకముందే వాళ్లకి చదవడం, రాయడం నేర్పవచ్చునని నాకు అనిపించింది.

ఒకసారి ఆ లక్ష్యం అంటూ సాధిస్తే పిల్లవాడి బౌద్ధిక శక్తులు ఆలోచించడానికీ, సృజనాత్మకతకీ స్వేచ్ఛగా తయారవుతాయి.

పిల్లలు యుక్త వయసు సమీపించడానికి నైతికంగా సన్నద్ధం అయి వుండటం తక్కువ విషయమేమీ కాదు. అది కష్టంగా కనిపించే వయసు. బాల్యానికీ యుక్తవయసుకీ మధ్య కనిపించీ కనిపించని సన్నటి రేఖని పిల్లలు సమీపించే కాలాన్ని గురించి ప్రాథమిక పాఠశాలలోనే నేను అనుకున్నాను. కొంతమంది ఆ హద్దుని అప్పటికే దాటారు. యుక్తవయసునాటి కష్టాలు నాలుగో తరగతిలోనే మొదలయ్యాయి.

....ఆగస్టు నెలలో ఒక ప్రశాంత సాయంవేళ మేమూ వేసవికి వీడ్కోలు చెప్పడానికి మా "సౌందర్య యేకాంత స్థలానికి" వెళ్లాం.

సూర్యుని అస్తమయ కిరణాలు చెట్ల శిఖరాల్లో దోబూచులాడుతున్నాయి. నాలుగేళ్ల క్రితం మేము పాతిన చెట్లమీద ఆపిల్‌పళ్లు పక్వాని కొస్తున్నాయి. ద్రాక్షతీగలమీదా, ద్రాక్షగుత్తులమీదా తుమ్మెద ఝుంకారం చేస్తోంది. పొలంమీదనుంచి ట్రాక్టరు రొద వినిపిస్తోంది. ఆడపిల్లలు గోధుమ మోపులు తీసుకొచ్చి వాటిని ఎర్ర బెర్రీ మొక్కతో అల్లారు. ప్రశాంత వేసవి సాయంత్రపు పాట ఒకటి మేము పాడాం. పాట అయిపోయింది. పిల్లలు సాయంకాలపు ఆకాశం కేసి చూశారు. మేం యింక వదిలిపెట్టబోయే ప్రకృతి సంగీతం, వేసవిస్మృతి అంతా కూడా పిల్లల హృదయాల్లో మార్మోగుతున్నాయి. ఆ సాయంకాలపు ఆకాశం, అరుణవర్ణ సూర్యాస్తమయం, పసుపువన్నె బెర్రీలూ, ద్రాక్షగుత్తులూ, ఆకుపచ్చకాయల దట్టమైన వరస, తెల్లటి చామంతులూ, తుమ్మెద ఝుంకారం వున్న యీ పరివేష్టిత ప్రపంచమంతా కూడా మాముందు దివ్యమైన వీణలాగా పరుచుకుని వుంది. పిల్లలు ఆ తీగల్ని తాకగానే, ముగ్ధమోహన రాగం వినిపిస్తోంది, భాషాసంగీతం అది. సుఖసంతోషాల గానం అది. నాకు ఆనందంగానూ వుంది, విచారంగానూ వుంది. అప్పుడే పెద్దవాళ్లయ్యారు, పిల్లలూ, భవిష్యత్తు మీకేం ప్రసాదిస్తుందో? నేను నిత్యం మీతోనే వుంటాను. మిమ్మల్ని ప్రాజ్ఞులుగా చేస్తాను. అయిదేళ్లుగా మీకు సహాయం చేస్తూ వున్నాను. నా హృదయం మీకు అంకితం చేశాను. నా హృదయం అలిసిపోయిన క్షణాలు లేకపోలేదు. ఆ క్షణాల్లో నేను మీదగ్గరికే వచ్చాను, పిల్లలూ. మీ ఉత్సాహభరిత కిలకిలారావాలు నా హృదయానికి నూతన శక్తిని యిచ్చాయి. మీ హాసవదనాలు నాకు నూతన జవం యిచ్చాయి. మీ జిజ్ఞాసపూరిత దృక్కులు ఆలోచనలని ప్రేరేపించాయి... మీరు పెద్దవాళ్లైనట్టుగానే నా వూహల్లో భావించుకుంటాను. మీలో ప్రతి ఒక్కళ్లూ, సాహసవంతుడైన సోవియట్ దేశభక్తుడుగా, నిజాయితీపూర్వకమైన వ్యక్తిగా, ఆవేశపూరితమైన హృదయంతో స్వచ్ఛమైన మనసుతో, బంగారుహస్తాలతో వున్న వ్యక్తిగా వున్నట్టు నేను మిమ్మల్ని దర్శిస్తాను.

